అంతర భారతీయ పుస్తకమాల

# ప్రాచీన లక్నో

ఉర్దూ మూలం:
అబ్దుల్ హలీమ్ 'షరర్'

అనువాదం:
దాశరథి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
న్యూఢిల్లీ.

మార్చి 1973 (ఫాల్గుణ 1894)
*March 1973 (Phalguna 1894)*



రూ. 7-00

*GUZESHTA LUCKNOW (Telugu)*
*Telugu title:* PRACHEENA LUCKNOW

డిస్ట్రిబ్యూటర్సు :
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు.

PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA, NEW DELHI-16
AND PRINTED AT FREEDOM PRESS, 138-A, THIRUVOTHIYUR HIGH ROAD, MADRAS-21

# ప్రస్తావన

భారతదేశం విశాలమైన దేశం. సాంస్కృతికంగా దేశమంతా ఒక్కటే అయి నప్పటికీ మన జాతీయశక్తిని బలపరిచి దేశానికి కావలసిన అభ్యుదయాన్ని సాధిం చేందుకు ఈ సమైక్య సూత్రాన్ని మరింత పటిష్ఠం చేయవలసిన అవసరం ఇంకా వుంది.

మనదేశంలో చాలా భాషలున్నాయి. ప్రపంచంలో మరి ఏ దేశంలోకూడా ఇన్ని భాషలు ఉన్నట్టు కనిపించదు. కానీ మన ఇరుగుపొరుగు భాషలనుగురించి తెలుసు కోవాలనే ఆసక్తి మనకు చాలా తక్కువ. ఇతరభాషలయందలి పరిజ్ఞానంకూడా మనకు తక్కువే. ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ మొదలయిన యూరపీయ భాషా సారస్వతాలను గురించికానీ, ఆ భాషలు మాట్లాడేవారి సాంఘికజీవితాన్ని గురించి కానీ తెలిసినంతగా మనకు మన దేశభాషల సారస్వతాన్నిగురించి తెలియదు.

భావాత్మకంగానూ, సాంస్కృతికంగానూ, దేశంలో సమైక్యం సమకూర్చు కునేందుకు నాగరికదేశ మనిపించుకుంటున్న మనదేశంలోని వివిధభాషల్లో వెలు వడుతున్న సారస్వత రచనలనుగురించి సమగ్రంగా తెలిసికొని, ఆయా భాషలు మాట్లాడే ప్రజల జీవితవిధానం, వారి ఆశయాలు, ఆచారాలు, వారి సాంస్కృతిక దృక్పథం పూర్తిగా అవగాహన చేసికోవటం చాలా అవసరం.

పాశ్చాత్యదేశాల్లో ఏ దేశానికి అది వేరుగాఉన్న దేశాలెన్నో ఉన్నాయి. ప్రతి దేశానికీ ప్రత్యేకమైన ఒక భాషకూడా వుంది. అయినప్పటికీ ఆ దేశవాసులు తమ పరిసరభాషల్లో ఎప్పటికప్పుడు వెలువడే సారస్వతాన్నిగురించి అవ్యవహితంగా సూక్ష్మపరిజ్ఞానాన్ని సమకూర్చుకుంటారు. కాని మనకు మన దేశభాషలనుగురించి అంతటి పరిచయం లేకపోవటం విరోధభావంగా తోస్తుంది. యూరప్‌లో ఏ భాషలో నైనా ఒక ఉత్కృష్టరచన జరిగితే అది వెంటనే అనువాదరూపంలో మిగిలిన భాష ల్లోకి వచ్చితీరుతుంది. కానీ జాతీయత సమకూర్చుకున్న మన భారతదేశంలో మనకు మన ఇరుగుపొరుగుభాషల స్థితిగతులనుగురించి తెలుసుకోవాలన్న ఆసక్తి ఎక్కు

వగా కనిపించదు. ఈ పరిస్థితి కొంతవరకు మారుతున్నది. కాని మారవలసినంత త్వరగా మారటంలేదు.

ఈ విషయాన్ని గమనించి భారతప్రభుత్వం ప్రతి భారతీయభాషనుండీ ఉత్తమ సమకాలిక రచనలను సేకరించి వాటిని మిగిలిన భారతీయభాషల్లోకి అనువదింప చేయాలని ఒక ప్రణాళిక తయారుచేసింది.

ఈ ప్రణాళికననుసరించి సామాన్య పాఠకునికి రుచించే రచనలు—అంటే కథలు, నవలలు, మనోహరయాత్రావర్ణనలు, స్వీయచరిత్రలూ - అనువాదానికి ఎన్నుకొనటం జరుగుతుంది.

ఈ గ్రంథమాలక్రింద ప్రచురింపవలచిన రచనలు, విస్తృత జనాదరణపొందిన ఉత్తమరచనలు అవడమేకాక, ఆయా భాషలకు సంబంధించిన సంఘజీవితాన్ని, భావసంపదనూ, ఆశయాలనూ, ఆదర్శాలనూ ప్రతిబింబింపగలిగేవిగా ఉండేలా చూడటం జరుగుతుంది.

భాషాబహుళమైన మన సమాజంలోని వివిధభాషలమధ్య పరస్పరపరిచయం, అవగాహనం, భావసమన్వయం సమకూర్చేందుకు ఈ ప్రణాళిక చాలవరకు తోడ్పడ గలదని ఆశిస్తున్నాము.

వివిధ భారతీయభాషలనుంచి ఉత్తమరచనలను ఎన్నుకొని వాటిని అనువదింప చేయటం అంత సులువైన పనికాదు. ఈవిషయంలో మాకు సరియైనదారిచూపి మాతో సహకరించిన సలహాదారులకూ, అనువాదకులకూ మేము కృతజ్ఞులము. వారి సహకారమే లేకుంటే ఈపని ఇంత జయప్రదంగా సాగేదికాదు.

—బాలకృష్ణ కేస్కర్.

# పీ ఠి క

## వ్యక్తిత్వం :

అబ్దుల్ హలీమ్ 'షరర్' 1860 లో జన్మించారు. ఈయనతండ్రి తఫజ్జుల్ హుసేన్, అరబ్బీ, పారసీభాషా విద్వాంసులు, ప్రసిద్ధవైద్యులు. రాజు వాజిద్ అలీషా పదచ్యుతుడైనతరువాత కలకత్తాలోని మటియాబుర్జ్‌లో నిర్బంధించబడ్డాడు. తొమ్మిదేండ్లవయసులో 'షరర్' అక్కడికి వెళ్లారు. రాజవంశంతో సంబంధం వుండడం వల్ల షరర్ కుటుంబంవారుకూడా అక్కడే వుండేవారు. అరబ్బీ, పారసీ, తర్కశాస్త్రమేగాక కొంచెం ఇంగ్లీషుకూడా నేర్చుకున్నారు షరర్. లక్నోలోని 'అవధ్ అఖ్బార్' అనే ప్రముఖపత్రికకు విలేఖరిగా వార్తలు పంపుతుండేవారు. తన 19 వ యేట 'షరర్' లక్నో తిరిగివచ్చారు. 'అవధ్ కే పంచ్' పత్రికలో ప్రసిద్ధరచయిత అయిన అహమద్ అలీ కసమండవీ తో ఏర్పడిన పరిచయంవల్ల షరర్‌కు వచన రచనలో ప్రోత్సాహం లభించింది. 1880 లో మున్షీ నవల్‌కిశోర్ తమ 'అవధ్ అఖ్‌బార్' అనేపత్రిక సంపాదవర్గంలో 'షరర్'ను చేర్చుకున్నారు. కొన్నాళ్ల తర్వాత షరర్ తనమిత్రులు అబ్దుల్ బాసిత్ పేరిట 'మహషర్' అనే వారపత్రిక ప్రారంభించారు. ఆ పత్రికలోని రచనాశైలి పాఠకులమన్నన పొందింది.

'అవధ్ అఖ్‌బార్' అనేపత్రికకు ప్రత్యేకవిలేఖరిగా కొన్నినెలలు హైదరాబాదులో వున్నారు. కాని ఆ తరువాత ఉద్యోగంవదిలేసి పత్రికనుండి విడిపోయారు. అదేరోజుల్లో ఆయన తమ తొలినవల 'దిల్‌చస్ప్' రచించారు. అది రెండుభాగాలుగా ప్రచురించబడింది. ఆ తరువాత రెండేళ్ళకు మొదటిసారిగా బంకించంద్రఛటర్జీ నవల 'దుర్గేశ్ నందిని' అనువదించి ఉర్దూవారికి పరిచయం చేశారు. 1887 లో 'దిల్‌గుదాజ్' అనే సొంతపత్రిక ప్రారంభించారు. ఈయన రచించిన ప్రసిద్ధ చారిత్రకనవలలు 'మలికుల్ అజీజ్ వర్జినా'. 'హసన్-ఏంజిలినా', 'మంసూర్ మోహనా' మొదలయినవి ఈ పత్రికలోనే అచ్చైనాయి.

1890 లో 'ముహజ్జబ్' అనే పత్రిక వెలువరించారు. అందులో ఇస్లాం మత ప్రవక్తల జీవితచరిత్రలు అచ్చవుతుండేవి. 1891 లో 'షరర్' రెండోసారి

హైదరాబాదువెళ్ళి ఉద్యోగంలో చేరారు. అక్కడినుంచి ఒక రాజకుమారునికి ట్యూటర్‌గా లండన్ చేరుకున్నారు. లండన్‌లో పద్నాలుగు పదిహేనునెలలున్నారు. ఆ రోజుల్లోనే ఫ్రెంచివిద్వాంసుడు మోసో్య కోర్వేవద్ద ఫ్రెంచి నేర్చుకున్నారు. తిరిగి వచ్చినతరువాత మళ్ళీ 'దిల్గుదాజ్' పత్రికను హైదరాబాదునుంచి 1898 లో వెలువరించారు. కాని అది త్వరలోనే ఆగిపోయింది. 1900 సంవత్సరంలో లక్నో తిరిగివచ్చి ఈ పత్రికను మూడోసారి వెలువరించారు.

'షరర్' పత్రికా రచయిత, నవలారచయిత, సంఘసంస్కర్త. యథార్థం వ్రాయడానికి వెనుకాడనివాడు. దేశంలో ప్రచారంలోవున్న పక్షపాతంతో కూడుకున్న విశ్వాసాలను లెక్కచేయకుండా చారిత్రకసత్యాలను యథాతథంగా అందించడానికి ప్రయత్నించారు. ఈ కారణంచేతనే 'సకీనా బిన్స్ ఇమామ్ హుసేన్' జీవిత చరిత్ర ప్రకటించినప్పుడు షరర్‌కు విరుద్ధంగా పెద్దదుమారం లేచింది. ముస్లిం స్త్రీలలో పరదాపద్ధతిని తొలగించడానికి 'ఇస్మత్' అనే పత్రిక వెలువరించి తద్వారా సంఘసేవ చేశారు. ఇందుకుగాను చాలా ప్రతిఘటనను ఎదుర్కోవలసి వచ్చింది. అయినాసరే తన పోరాటాన్ని సాగిస్తూనే వచ్చారు. 1904 లో హిందూ ముస్లిం ఐక్యతను సాధించేఉద్దేశ్యంతో 'ఇత్తెహాద్' అనే పక్షపత్రిక ప్రారంభించారు. వచన రచయితగా, పాత్రికేయుడుగా, నవలా రచయితగా 'షరర్'ది విప్లవాత్మకమైన వ్యక్తిత్వం.

(పాత్రికేయుడుగా ఈయనకు ఎంత పేరుండేదంటే - 1912 లో ఖిలాఫత్ ఉద్యమనాయకుడు మౌలానా ముహమ్మదలీ, తన ఉర్దూ దినపత్రిక 'హందర్ద్' కు సంపాదకుడుగా మొదట షరర్‌నే ఎన్నిక చేశారు.

షరర్ 1926 లో చనిపోయారు. ఈయన రచనలు 102 కు పైగా వున్నాయి. వీటిలో చాలారచనలు ఈయన జీవితకాలంలోనే బాగా ప్రజాదరణ పొందాయి. ఎన్నో పునర్ముద్రణ పొందాయి.)

షరర్, నవలలుగాక ఈయన మరొక అమూల్యరచన 'ప్రాచీనసంస్కృతికి ఆఖరు నమూనా' లేక 'ప్రాచీన లక్నో' అనే పుస్తకం. దీనిఅనువాదమే మీరు తరువాతిపుటల్లో చదువుతారు. అమూల్యమైన సమాచారసేకరణతోపాటు దీని మూల

రచన 'గుజిష్తా లక్నో' అనే ఉర్దూ గ్రంథం షరర్ యొక్క సరళమైన ఆకర్షణీయ మైన వచన రచనా రీతికి ఉదాహరణగా చెప్పవచ్చు. చెప్పదలచుకున్నది సూటిగా చెప్పడం, పాఠకుల్ని తనవెంట తీసుకుపోగల ధార, వచన రచనకు కావలసిన ఉత్తమగుణాలన్నీ ఈ పుస్తకంలో కనిపిస్తాయి.

## షరర్ కాలంనాటి లక్నో

(అబ్దుల్ హలీమ్ 'షరర్' చూసినకాలం విలాసాలకు, వైభోగాలకు ఆఖరి రోజులు అని చెప్పాలి. దేశంమీద తెల్లవాళ్ళ అధికారం ఏర్పడింది. తమ రాజకీయ అధికారాన్ని స్థిరపరచుకోడానికి వారు దేశంలోను, దేశం బయటను ఒక ప్రచారం లేవదీశారు. అదేమంటే - ఇంగ్లీషువారు రాకముందు భారతీయులు చాలా అనాగరికులుగాను, ఆటవికులుగానూ ఉండేవారనీ, కనుక తామే వారికి సభ్యత, సంస్కారం నేర్పడానికి ప్రయత్నిస్తున్నామనీ చాటించుకోవడం మొదలుపెట్టారు.

భారతీయ ప్రాచీన సాహిత్య, కళా సంపదంతా, పాశ్చాత్య విజ్ఞానశాస్త్రగ్రంథాల ఒక అలమారీతోకూడా సరితూగదన్నాడు లార్డ్ మెకాలే. లార్డ్ డల్హౌజీ కాలంలో అవధ్ మీద తమ అధికారం ఏర్పరచుకోడానికి వెతికినకారణాలలో అవధ్ సంస్థానాన్ని భోగవిలాసాలకు కేంద్రంగాచూపడం ఒకటి. లక్నో నాగరికతను చాలా వికారంగా చిత్రించడంకూడా అప్పుడు జరిగింది.)

భారతీయ నాగరికతనుగూర్చి గర్వపడేవారిలో 'షరర్' ఒకరు. తమ దేశీయులలో నిదురించిన ఆత్మగౌరవాన్ని మేల్కొల్పాలనుకునేవా రాయన. తద్వారా వారిలో ఆత్మవిశ్వాసం కలగాలనీ, తమ నిజస్వరూపం చూడగలగాలనీ ఆయన అభిలాష. అందుకే ఒకవైపు ఆయన చారిత్రకనవలలు రచించి ప్రాచీన గాథలద్వారా పాఠకులలో ఆత్మవిశ్వాసాన్ని కలిగించడానికి ప్రయత్నించారు. మరోవైపు ఈ పుస్తకం 'ప్రాచీన లక్నో' రచించారు. దీనిపేరు 'ప్రాచీన లక్నో' లేదా ప్రాచీన సంస్కృతికి ఆఖరు నమూనా'. భారతదేశంలోనేగాక ఆసియా ఖండం అంతటా లక్నోకు గౌరవప్రతిష్ఠలు కలిగించిన నాగరికతా సంస్కృతుల విభిన్నరీతులను 'షరర్' ఈ పుస్తకంలో వర్ణించారు.

## సంస్కృతి

మానవ నాగరికతలోని విశేషం ఏమిటంటే-అది దేశకాలపరిధులలో బంధింపబడి ఉండిపోలేదు. దీపంతో దీపం వెలుగుతూవచ్చింది. అదేవిధంగా ఒకదేశ నాగరికత ఆ దేశపు ప్రత్యేకతగా చెప్పుకోబడుతున్నా మరోదేశపు నాగరికతనుండి చాలా ప్రభావితమవుతుంది. క్రమంగా ప్రపంచనాగరికతగా రూపు దిద్దుకుంటుంది. అదే విధంగా ఒకకాలపు నాగరికత ఆ కాలంవరకే పరిమితమని అనుకున్నా. దానికి ప్రాచీనకాలంతోనూ సంబంధం వుంటుంది. అది ఆ కాలానిదే అవుతూకూడా తనలో సార్వకాలికతను కలిగివుంటుంది.

లక్నోలో పెరిగి పెద్దదయిన నాగరికతలోకూడా ఈ రెండుగుణాలున్నాయి. ఈ నాగరికత మనదేశంలో చాలాకాలంగా వేళ్ళు తన్నుకునివుంది. లక్నో నాగరికతను 'ముందు మీరు', 'మీకు శ్రమ ఇచ్చాను' వంటి చిన్నచిన్న గౌరవవాక్యాలవరకే సీమితమనుకునేవారు ఆ నాగరికతలోని లాలిత్యాన్నీ, సౌందర్యాన్నీ చూడలేరు. నాగరికతను అవహేళనచేయడం, వెక్కిరించడం చాలా సులభం. కాని నాగరికత యొక్క భిన్నభిన్నరీతులను గుర్తించడం దాని ఆత్మను అవగాహనచేసుకోవడం సులభం కాదు. నాగరికత, పండుగలు పర్వాలు, ఆచారవ్యవహారాలుమాత్రమే కాదు. వేషభాషలు, భోజనభాజనాలు, వినోదవిలాసాలు, సంతలు సమ్మేళనాలే నాగరికత కాదు. ఇవన్నీ నాగరికతయొక్క బాహ్యలక్షణాలు. వీటిద్వారా ఒకానొకకాలపు నాగరికతయొక్క ఆత్మను చేరుకోవానికి ప్రయత్నం చేయాలి.

లక్నోవరకు చేరిన నాగరికత శతాబ్దాల భారతీయకృషి ఫలితం. దానిలో ఆర్యుల సౌందర్యం వుంది. స్థానికవిశిష్టత వుంది. ఆతరువాత అరబ్బులు, ఇరానీలు, టర్కీ వారు, ఇక్కడికి వచ్చారు. వస్తూ తమ సాంస్కృతికవారసత్వం వెంట తెచ్చారు. ఇరానీ నాగరికత లయలో వేగం ఎక్కువ. అందుకే దక్కన్, ఢిల్లీలోని భారతీయ నాగరికత ఈ ఇరానీ, టర్కీ నాగరికతలనుండి చాలా నేర్చుకుంది. వాటికి చాలా నేర్పింది. ఇదేకాలంలో అరబ్బీ లయకూడా భారతీయ నాగరికతా స్వరమేళలో కలిసిపోయింది. ఈ కారణంచేతనే నాగరికత లేదా సంస్కృతియొక్క ఏ అంగంలో కానివ్వండి, లలితకళల ఏ శాఖలో కానివ్వండి, ప్రతిచోట ఈ సాంస్కృతిక సమ్మే

శనం విలక్షణమైనసౌందర్యంతో సాక్షాత్కరిస్తుంది. అన్నిటిలోకీ అందమైన ఈ కలయిక తాజ్‌మహల్ నిర్మాణంలో ఏర్పడింది. భారత, అరబ్బుదేశాల కళల కూడలికి నిరుపమానమైన ఉదాహరణ తాజ్‌మహల్.

ఈ నాగరికత లక్నో చేరుకునేసమయంలో ఇంగ్లీషువారు భారతదేశంలో అడుగు పెడుతున్నారు. కలిసి మెలిసిన చక్కని నాగరికత అంతమౌతోంది. రాజకీయ దురవస్థ వ్యాపించింది. ఆర్థికదుస్థితి ఆవరిస్తోంది. ఇలాటి అస్థిరపరిస్థితుల్లో ఈ కలిసి మెలసిన నాగరికత అనే లేత మొక్క ఢిల్లీనుంచి లక్నో వచ్చింది. అవధ్‌లో అంతంతమాత్రంగా శాంతివుంది. అది సంపన్నమైన ప్రాంతం. అన్ని నాగరికతల లాగే ఇదీ యవ్వనదశకు చేరుకుంది. అందుకే భారతీయ-ఇరానీ సౌందర్యాలను వనలో ఇముడ్చుకున్న ఈ నాగరికత లక్నోలో కొత్త జీవితాన్ని, కొత్త సోయగాన్నీ పుణికి పుచ్చుకుంది. ఈ నాగరికతను ఏ కోణంనుంచిచూసినా ఇందులో ప్రాచీనపద్ధతులు, ఢిల్లీలోని అందచందాలు ముఖ్యంగా ముహమ్మద్‌షా పరిపాలననాటి ప్రత్యేకతలు తప్పక కనిపిస్తాయి. ఉదాహరణకు దుస్తులవిషయంలో ఈ పుస్తకంలో 'సీమా', 'అంగరఖా' వర్ణన వుంది. వినోదాలప్రసక్తి వచ్చినప్పుడు 'ఇంద్రసభా' ప్రసక్తి వుంది.

ఈ నాగరికత ఏదో ప్రత్యేక నాగరికతకాదు. ఇందులో మతసంబంధమైన నీడ పడకుండాచూడడం జరిగింది. ఎలాగంటే - సలాం చేసేసందర్భంలో వాడే 'సలాం అలైక్' లేదా 'సలాం అలైకుమ్' వంటి మాటలు లక్నో నాగరికతలో ఆదాబ్ 'తస్లీం' 'కోర్నిష్' వంటి మతంతో సంబంధంలేని మాటలుగా మారిపోయాయి. ఇంతేకాదు మతాచారాలు, పండగలు పబ్బాలను మతంతో సంబంధంలేని సాంఘిక ఆచారాలుగా మార్చడానికి ప్రయత్నం జరిగింది. ఉదాహరణకు - ముహర్రమ్ ముస్లింల పండుగ. బసంత్ హిందువుల పండుగ. కాని ఈ రెండుపండుగల స్వరూపం ఎంతగా మారిపోయిందంటే అవి సాధారణ సాంఘిక ఉత్సవాలయ్యాయి. ఎంతో అందంగాను వివరంగాను షరర్ చిత్రించిన లక్నో నాగరికత మరువరానిది. మనం ఆ నాగరికతనుండి చాలా నేర్చుకోవచ్చు.

ఆ నాగరికత ఎలాటిది? ఎక్కడినుంచి వచ్చింది? ఈ చర్చ చేసేముందు జ్ఞాపకం వుంచుకోవలసింది ఏమంటే - మానవులలాగే నాగరికతలూ పుడతాయి.

పెరుగుతాయి, అంతమొందుతాయి. ఎంతగొప్ప నాగరికతఅయినా అన్నికులాల అవసరాలను తీర్చలేదు. అందుకే - మారిన పరిస్థితుల్లో ఏ నాగరికతనుకూడా - అది నేటికాలానికి పనికివస్తుందా లేదా అనేదృష్టితో చూడరాదు. ప్రతి నాగరికత తన కాలంలో అభివృద్ధిచెందుతుంది. దానికొక ఆవరణ, ఆయువు వుంటుంది. దాని ననుసరించే ఆ నాగరికతను పరిశీలించాలి.

లక్నో నాగరికతనుకూడా ఈ పూర్వరంగంలో చూడవలసిన అవసరంవుంది. తొలి పుటలనుండి ఆఖరుదాకా ఈ పుస్తకంలో ఆ నాగరికతలోని ప్రత్యేకత మీకు అడుగడుగునా తగులుతుంది. ఆ నాగరికతలో దేశీయ, విదేశీయతత్వాల సంగమం జరిగింది. నాగరికతలు ఎప్పుడూ పరిశుద్ధంగా వుండవు. ఎల్లప్పుడూ ఒక దీపం నుంచి ఇంకోదీపం వెలుగుతూవచ్చింది. లక్నో నాగరికతాదీపంలో విభిన్నకాంతులు కలిసిపోయాయి. ఇక్కడిదుస్తులు, ఇక్కడి భోజన పానీయాలు, ఆచారవ్యవహారాలు, దేశీయ విదేశీయతత్వాలు సమ్మిళితమైపోయాయి. మతం మానవుణ్ణి విడగొడుతుందంటారు. కాని ఇక్కడ మతానికిసంబంధించిన చిహ్నాలు సభ్యతలు, సంపూర్ణనాగరికతలో భాగంగా మారిపోయి మతబంధాలనుండి విముక్తిపొందాయి. ఉదాహరణకు మహమ్మదీయ మతసంబంధమైన శోకదివసాలవిషయంలో లక్నో అంతా ఒకేరీతిగా కనపడుతుంది. అలాగే వసంతోత్సవం జరుపుకునేటప్పుడు, హిందూ పౌరాణికగాథలలోనికి ఇంద్రునికి సంబంధించిన ఉత్సవాలను లక్నోలోని అన్నిమతాలవారూ ఏ భేదభావంలేకుండా తమవిగా భావిస్తారు. 'ఇంద్రసభ' ఉర్దూలోని ప్రప్రథమనాటకాలలో ఒకటిగా భావించబడుతుంది. దానికి ఎన్నో రూపాలున్నాయి. కాని ప్రతి ఇంద్రసభలోనూ ఇంద్రునిచిత్రం మన సమైక్య భారతీయ నాగరికతకు ప్రతినిధిగా కనిపిస్తుంది. అతనిపేరు ఇంద్రుడు. అతనిది ప్రాచీనపద్ధతి సింహాసనం. కాని దుస్తులు అయోధ్యనవాబుల నాటివి. ఇంద్రుని దర్బారులోని అప్సరసలు వ్రజభాషలోని తుమ్రీలుగానం చేస్తారు. చక్కని ఉర్దూలో సంభాషణలు నెరపుతారు. వారు మన సమైక్యనాగరికతకు వాస్తవస్వరూపాలు.

ఈ కలయిక నిజానికి ఎందుకు సంతోషజనకమైందంటే - కలిసిపోయే నాగరికతలు ఒకదానికి ఒకటి మూలతః బహుసన్నితాలు. ఈరానీ సంస్కృతి ఒకనాడు ఆర్యసంస్కృతే. అందుకే ఈరానీ నాగరికతాప్రభావం భారతదేశంమీద పడినప్పుడూ

ఇక్కడి ఆర్యసభ్యతతో దానికి పరిచయం ఏర్పడినప్పుడూ ఆ కలయిక ఇద్దరు అపరిచితుల కలయికకాదు. ఇద్దరు విడిపోయిన బంధువులకలయిక అది. జాతిదృష్ట్యా వారిద్దరూ ఒక్కటి. తమ చారిత్రకయాత్రలో ఎన్నో అమూల్యవస్తువులను వారు పేకరించారు. వారిద్దరు కలుసుకున్నప్పుడు ఒకేరూపంగా మారిపోయారు. భారతీయ ప్రాచీనసంస్కృతిలో మధ్య ఆసియా సంస్కృతుల సుందరసమ్మేళనం జరిగింది.

ప్రొఫెసర్ స్పియర్ తన 'ట్విలైట్ అఫ్ ది మొగల్స్' అనే గ్రంథంలో— 'ఆఖరు మొగల్‌చక్రవర్తులు యూరోపులోని చిన్నరాజ్యాల రాజ్యాంగబద్ధమైన పరిపాలకులు కావడానికి ఎంతో తగినవ్యక్తులు' అని వ్రాశారు. 'రెండవ అక్బర్ స్త్రీల సలహాలను విశ్వసించే యోగ్యుడయిన వ్యక్తి కాగలిగేవాడు. రెండవ బహాదుర్‌షా రాజ్యాంగానికి లోబడిన మంచి రాజు కాగలిగేవాడు. ఢిల్లీలో భారతదేశపు వీమర్ అనతగ్గ జఫర్ రాజు, గోథేవంటి గాలిబ్ కవితయెడ అనురాగంతో వేదాంతంయెడ ఆసక్తితో, యమునానదీ విహారాలతో, వర్షాకాలంలో మెహ్రీలీ యాత్రలో నలోనా, పంఖా ఉత్సవాలను ప్రోత్సహించడంతో, పావురాళ్ళపై మార్మికవాదంపై, ప్రేమతో ఒక చిన్న జర్మన్‌రాజ్యానికి గౌరవనీయుడైన రాజు కా గలిగేవాడు' అనీ వ్రాశాడు.

అయోధ్యవిషయంలో ఇది అక్షరాలా నిజం. చరిత్ర అయోధ్యకు స్వతంత్ర రాజ్యప్రతిపత్తిని చేకూర్చింది. పంధొమ్మిదవ శతాబ్దపు పరిస్థితుల్లో - కిలంపట్టిన కత్తులతో, బలహీనమైన ఆర్థికస్థితిలో ఈస్టిండియా కంపెనీవారి దాడిని తట్టుకోవడం అసంభవం. కాని రాజకీయదౌర్బల్యాలను వదిలేస్తే - అయోధ్యలోని సాంస్కృతిక సంపదకు ఏదేశ నాగరికతైనా గర్వపడవచ్చు. మార్దవమూ, శిష్టత ఈ నాగరికతకు ఆత్మవంటివి. ఈ నాగరికతలో ఇతరులభావాలను గౌరవించడం జరుగుతుంది. జీవితానందానికీ, శిష్టతకు ప్రోత్సాహం లభించేరీతిని నడవడికి రూపు దిద్దబడుతుంది. ఈ నాగరికతలో గంభీరత, శక్తి కనిపించవు. నేడు చాలామంది ఈ నాగరికతను వట్టి డొల్లగా భావించవచ్చు. కాని ఈ నాగరికత తన పరిధిలోవుంటూ ఏరకమైన వికాసం కలిగించిందో తెలుసుకోవడం ఒక నూతనప్రపంచాన్ని కనిపెట్టడంలాంటిదే. ప్రాచీన నాగరికత అంతరాంతరాలలో దాగివున్న ఆ నూతనప్రపంచంతో పరిచయం ఏర్పడితే జీవితం ఎక్కువ ఆనందమయం, అర్థవంతం అవుతుంది.

'షరర్' ఈ పుస్తకాన్ని మూడుభాగాలుగా విభజించారు. మొదటిభాగంలో అయోధ్య, లక్నోల సంక్షిప్తచరిత్ర వుంది. ఆ తరువాత అయోధ్య నవాబుల గాథ. బుర్హానుల్ ముల్క్ దగ్గరినుంచి ఆ వంశపు ఆఖరు రాజు వాజిద్ అలీషా వరకు వృత్తాంతం వుంది. వాజిద్ అలీషా జీవితవివరాలు అధికంగా వున్నాయి. ఈ వివరాలు మనసుపెట్టి ఎంతో వేదనతో రచించబడినవి. ఇంగ్లీషువారు, వారి ప్రతినిధుల కుట్రలు, వాజిదలీషా నిస్సహాయస్థితి, ఆఖరుకు భోగలాలసతకు బలియైపోవడం, తన సహచరుల ప్రభావానికిలోనై నిర్ణయాలుచేయడం మొదలయినవివరాలను ఎంతో అందంగా చెప్పారు రచయిత. మూడవభాగం - ఈ పుస్తకరచనలు అసలు ఉద్దేశ్యం - లక్నో నాగరికతయొక్క ప్రగతికి సంబంధించినది. ఈ భాగంలో 'షరర్' విభిన్నశీర్షికలద్వారా మానవజీవితంలోని అన్ని ముఖ్య అంశాలను వివరించడానికి ప్రయత్నించారు. దుస్తులు, భోజన భాజనాలు, ఆచారవ్యవహారాలు, ధార్మిక విశ్వాసాలు, సంబంధబాంధవ్యాలు, వినోద విలాసాలు, ఆటపాటలు, సాహిత్యం, విజ్ఞానం, ఆయుధాలు, సభ్యత - ఇలాగే విభిన్న సాంస్కృతికవిషయాలపై అమూల్యమైనసమాచారం అందించబడింది. దీనివిలువ కేవలం చారిత్రాత్మకమేగాక ఈనాడు మనం ఎలా జీవించాలోకూడా దీనినుండి నేర్చుకోవచ్చు. ఆ నమ్రత, ఆ లాలిత్యం ఏ నాగరికతకైనా గర్వకారణాలు.

షరర్ మనకు మరో రెండురూపాల్లోనూ సాక్షాత్కరిస్తారు. ఒకటేమిటంటే - వాజిదలీ షాను ఈస్టిండియా కంపెనీవారు ఖైదుచేసి లక్నోనుంచి మటియాబుర్జ్ (కలకత్తా) పంపించినప్పుడు ఆయన కేసును విక్టోరియారాణి మరియు బ్రిటిష్ సామ్రాజ్యం ముందుంచడానికి షరర్ తాతగారు (మాతామహులు) లండన్ వెళ్లారు. దీన్నిబట్టి షరర్ కుటుంబం అయోధ్య నవాబులకు ఎంత సన్నిహితంగా వుండేదో అంచనా కట్టవచ్చు. అయోధ్య ఆఖరురోజులకథను ఎంతో వేదనాభరితంగానూ, ప్రభావవంతంగానూ షరర్ చెప్పినపద్ధతిచూస్తే ఇది మహాకావ్యమే అనాలి. ఇది చరిత్రలోని ఒక అధ్యాయంమాత్రమే కాదు. అది ఒక విషాదాంత నాటకంలోని అంకం. ఆయన సుప్రసిద్ధపత్రిక 'దిల్ గుదాజ్' చాలాకాలం ఉర్దూసాహిత్యానికి సేవచేసింది. ఆ సేవ అసాధారణమైనది. ఈ పుస్తకంకూడా మొదట లేఖలరూపంలో ఇదే పత్రికలో ధారావాహికంగా ముద్రితమైనది. చారిత్రక నవలాకారుడుగా

ఈయనకు చరిత్రలో చాలా ఆసక్తి వుండేది. అందుకే ఈ పుస్తకంలో చరిత్రకారుని సారదృష్టి, పాత్రికేయుని సరసశైలీ, సంస్కృతినిగురించిన సంపూర్ణపరిజ్ఞానం గల వ్యక్తిలోని నిండుదనం ద్యోతకమౌతాయి.

(నేటివరకు భారతీయసంస్కృతిలోని ఏ విభాగంగురించి అయినా ఇంత సమగ్ర చిత్రణ జరగకపోవడంవల్ల ఈ దృష్టితోకూడా ఈ పుస్తకానికి ప్రత్యేకత వుంది. సభ్యత, సంస్కృతి అంటే భోజనభాజనాలు, వేషభాషలు, ఆహారవ్యవహారాలు, ఆటపాటలు, విజ్ఞానవినోదాలు, పెళ్ళిళ్లూ పేరంటాలు మాత్రమే కాదనేమాట నిజమే. కాని వీటన్నిటినిగురించి తెలుసుకోకపోతే సభ్యతా, సంస్కృతుల సమగ్రచిత్రం సాక్షాత్కరించదు. ఆధునికయుగంలో మానవుడు జీవితపు కల్లోలంలో చిక్కుకుని జీవనానందాన్ని పోగొట్టుకున్నాడు.

ప్రశాంతంగా జీవించడానికి తగిన అవకాశాలులేని ఈనాటి జీవితవేగంలో ఈ పుస్తకంవిలువ మరింతగా పెరుగుతుంది. లిన్-యు-టాంగ్ రచించిన సుప్రసిద్ధ గ్రంథం 'ఇంపార్టెన్స్ ఆఫ్ లివింగ్' వెలువడి చాలాకాలమైంది. అందులో జీవితానందంగురించి చర్చించబడింది. ఈ పుస్తకంలో ఇంకా కొంత ముందుకువెళ్లి భారతదేశంలోని ఒక ప్రాంతవాసులు అందించిన ఒక నాగరికతను చిత్రించడం జరిగింది. ఈ దృష్టితో ఇది ఒక మరో సంస్కృతిచరిత్రమాత్రమే కాదు, మన జాతీయవికాసంలోని ఒక మహత్తరమైన భాగం.)

తమ జీవితకాలంలోనే ప్రజాదరణపొందిన 'ఫిర్దౌసే-బరీ', 'మంసూర్-మోహనా', 'మలికుల్ అజీజ్ వర్జినా', 'ఫ్లోరా-ఫ్లోరిండా' వంటి చరిత్రాత్మక నవలల మూలాన అబ్దుల్ హలీమ్ 'షరర్' మనకు జ్ఞాపకం వుంటారు. పరిణామశీలమైన పత్రిక 'దిల్‌గుదాజ్' సంపాదకులుగా షరర్ మనకు జ్ఞాపకం వుంటారు. ఈయన ఉర్దూ పత్రికారచనకు కొత్త దృష్టినిచ్చి ఉర్దూ సాహిత్యానికి కొత్తమార్గం చూపారు. ఉర్దూసాహిత్యాన్ని సంపన్నంచేసిన తమ సుందరలేఖావళివల్లకూడా షరర్ మనకు జ్ఞాపకం వుంటారు. తమ హాస్యరచనలవల్లకూడా వారు సాహిత్యజగత్తులో ఎల్లప్పుడూ సజీవంగా వుంటారు. కాని 'ప్రాచీన లక్నో' అనే ఈ పుస్తకం ఒకటి ఆయనను అమరుణ్ణిచేయడానికి చాలు. ఈ పుస్తకం, చరిత్రయొక్క ఉరకలువేస్తున్న వేడిరక్తంలాగా వర్తమానంనుంచి భవిష్యత్తువరకు జీవితానందసందేశాన్ని తీసుకువెళుతుంది. సంస్కృతులకు నూతనరూపాన్ని, భవిష్యత్తుకు నూతనవిజయాన్ని

అందిస్తుంది. ఈ దృష్టితో ఈ పుస్తకంమీద ఉర్దూవారికేగాక యావత్తు భారతదేశానికి హక్కువుంది. ప్రతిభారతీయుడికి ఇందులో అలనాటివైభవప్రాభవాలు స్ఫురణకు రాగలవు. ఇందులో అతడు జీవిత విభిన్నవిభాగాలలోని ఆనందాన్ని రేఖా మాత్రంగా చూడగలడు.

అందుకే షరర్ రచించిన ఈ పుస్తకం కేవలం మాటలమూట కాదు. మానవునికి నూతనదృష్టిని ప్రసాదించి అతన్ని తీర్చిదిద్దగల సజీవ అనుభవం.

ఉర్దూశాఖ, ఢిల్లీ విశ్వవిద్యాలయం,
ఢిల్లీ.

డా॥ ముహమ్మద్ హసన్.

# 1

తూర్పు నాగరికతా సంస్కృతుల ఆఖరు నమూనా అయోధ్య ఆస్థానంలోనే కని పించిందనేమాటను అంగీకరించడానికి ఎవరికీ అభ్యంతరం వుండదు. పాతకాలపు జ్ఞాపకచిహ్నాలుగా ఇంకా ఎన్నో దర్బార్లు ఆస్థానాలు వున్నాయి కాని ప్రాచీన నాగరికతా, సంస్కృతీ ఈ అయోధ్యలోనే అంతమైపోయాయి. అయోధ్య ఆస్థానం చాలా ఆఖరున స్థాపితం అయింది. ఎన్నో ఔన్నత్యాలను చేరుకుని చాలా తొందరలో అంతమైపోయింది. అందుకే ఈ ఆస్థానంగురించి సంక్షేపంగాచెప్పి అక్కడి విశేషాలను వివరిస్తాను.

ఈ ఆస్థానం ఏర్పడినకాలం విశిష్టత భారతదేశంలోని అన్నిప్రాంతాలకంటే అధికమైనదనేమాటను అంగీకరించడానికికూడా ఎవరికీ అభ్యంతరం వుండదనుకుంటాను.

సూర్యవంశీయుల, ముఖ్యంగా శ్రీరామచంద్రుని అసమాన సాహసకార్యాలు అనంతాలు. వాటిని చరిత్ర తనలో ఇముడ్చుకోలేకపోవడంవల్ల అవి పవిత్ర మత రూపం ధరించినవి. నేడు భారతదేశంలో—ఏటేట రామలీల అనే మతపరమైన నాటకంద్వారా ఆ గాథలను మరీమరీ జ్ఞాపకంచేసుకోని ఊరే లేదనుకుంటాను. అతి ప్రాచీనమైన అయోధ్యావైభవాన్ని వాల్మీకి తన మనోహరశైలిలో రామాయణ మహాకావ్యంలో వర్ణించాడు. అందుకని ఆ విషయాలను ఇక్కడ పునశ్చరణ చేయదలచడంలేదు. వాల్మీకి రామాయణంలో అయోధ్యావైభవచిత్రణం చదివిన వారు అదేచోట వెలసిన పైజాబాద్ చిత్రం నాటి [1]'దిల్‌గుదాజ్'లో చూడవచ్చును. అందుకని సుమారు యాభై సంవత్సరాలక్రితం అంతరించిన ఆఖరు ఆస్థానస్థాపన జరిగిన నాటిసంఘటనలు వివరిస్తాను.

ఢిల్లీచక్రవర్తి తరపున అయోధ్యకు సూబేదారుగా నవాబ్ బుర్‌హానుల్‌ముల్క్ అమీనుద్దీన్‌ఖాన్ నైషాపూరీ నియుక్తుడైనాడు. ఆయన లక్నోపాలకులను ఓడించి

1. షరర్ నడిపిన 'దిల్‌గుదాజ్' అనే పత్రికలోనే ఈ పుస్తకం వరసగా ముద్రితమైంది.

ప్రాచీన రాజధాని అయిన అయోధ్యానగరం చేరుకున్నాడు. నగరానికిదూరంగా ఘూఘ్రా నదీతీరాన ఎత్తయినప్రదేశంలో గుడారం వేశాడు. రాష్ట్రపరిపాలనా వ్యవహారాలమూలాన ఈయనకు పెద్దపెద్దమేడలు నిర్మించుకోడానికి తగినవ్యవధి చిక్కలేదు. అంతేగాక సామాన్యజీవితం గడపాలనే మనస్తత్వంగలమనిషి కావడం వల్లనూ ఆవైపు ఆయనమనస్సు పోలేదు. అందుకే చాలాకాలం గుడారాల్లోనే గడిపాడు. కాని వర్షాకాలంలో ఇబ్బందిగావుండడంవల్ల అక్కడికి కొద్దిదూరంలో తనకోసం ఒక గుడిసె వేయించాడు. ఆ తరువాత ఆ గుడిసెచుట్టూ విశాలంగా ఒక మట్టికోట కట్టించాడు. నాలుగుమూలల్లో కోటపద్ధతిలో చుట్టుపక్కల కాపలా కాయడానికి వీలుగా నాలుగు మట్టిబురుజులు కట్టించాడు. అశ్వికదళాలు సైనికదళాలు, ఫిరంగులు, అశ్వశాలలు మొదలైన అవసరకర్మాగారాలు అవలీలగా ఇమిడిపో గలిగేంతవిశాలంగా కోట ఆవరణ వుండేది. బుర్‌హానుల్‌ముల్క్‌కు మేడ మిద్దెలపై ఆసక్తిలేదు గనుక రాణివాసానికికూడా మట్టిఇళ్ళే కట్టించాడు. జిల్లాలపర్యటనలు, పరిపాలనకు సంబంధించిన ప్రయాణాలనుండి విశ్రాంతి లభించినప్పుడు అవధ్‌రాజు ఈ మట్టిఇళ్ళలోనే హాయిగా కాలక్షేపం చేసేవాడు. ఏవిధమైన లోటుపాట్లూ ఉండేవికావు. ఈ పరిపాలనాకేంద్రం త్వరలోనే 'బంగ్లా' అనేపేరుతో ప్రసిద్ధి కెక్కింది.

బుర్‌హానుల్‌ముల్క్ చనిపోయినతరువాత నవాబ్ సఫ్‌దర్‌జంగ్ హయాంలో ఈ ఊరే ఫైజాబాద్ అయింది. ఇదీ [1]ఫైజాబాద్ అవతరణగాథ. ఫైజాబాద్ తన నిర్మాణవేగంలోనూ, నిర్యాణవేగంలోనూ లక్నోను వెనకపడవేసింది. ఆరోజుల్లో ఈ మట్టికోటచుట్టూ మొగల్‌సైనికాధికారులు ఆహ్లాదంకోసం తోటలు వేయించారు. విశాలమైన మహళ్లు కట్టించారు. క్రమంగా నగరశోభ పెరిగింది. కోటకు పశ్చిమానగల ద్వారంపేరు 'ఢిల్లీ దర్వాజా'. దీనిఅవతల దీవాన్ ఆత్మారామ్ కుమారులు బ్రహ్మాండమైన బజారు కట్టించారు. దానివరసలోనే వుండడానికి ఇళ్లూ ఏర్పాటు చేశారు. ఇలాగే ఇస్మాయిల్‌ఖాన్ అనే అశ్వికదళాధిపతి మరోబజారు కట్టించాడు. కోటలో రాజాసౌధ రక్షకులకోసం, వివిధసైనికులకోసం ఇళ్లనిర్మాణం జరిపించాడు.

---

1. ఫైజాబాద్‌వివరాలన్నీ మున్షీ మహమ్మద్ ఫైజ్ బక్ష్ రచించిన 'తారీఖ్ ఫర్హ్‌బక్ష్' నుంచి తీసుకోబడినవి. మూలగ్రంథం దొరకలేదు. దాని ఆంగ్లానువాదం లభిస్తున్నది.

(నవాబ్ సఫ్దర్‌జంగ్ మరణించినపిమ్మట ఈ కొత్తనగరం కొన్నాళ్ళపాటు పాడుపడిపోయింది. ఆయనకుమారుడు నవాబ్ షుజాఉద్దౌలా తన నివాసానికి లక్నోను ఎన్నుకున్నాడు. అక్కడే వుండేవాడు. అందువల్ల తన పూర్వీకుల పాత ఇంట ఏటేటా ఒకటి రెండు రాత్రుళ్లు గడుపుతూండేవాడు.

క్రీ. శ. 1764 లో బక్సర్‌యుద్ధంలో ఇంగ్లీషువారితో ఈయన ఓడిపోయాడు. రిక్తహస్తాలతో పరిగెత్తుకుంటూ ఫైజాబాద్ వచ్చాడు. కోటలో దొరికిన వస్తువాహనాలు తీసుకుని రాత్రికిరాత్రి లక్నో చేరుకున్నాడు. అక్కడా ఒకే ఒకరాత్రి బసచేసి చేతికి అందినది తీసుకుని రుహేల్‌ఖండ్‌లోని పఠానుల శరణుపొందడంకోసం ఢిల్లీ వైపు బయలుదేరాడు. యుద్ధం అయిన తొమ్మిదినెలలకు ఇంగ్లీషువారితో ఈయనకు సంధి కుదిరింది. ఈ సంధిప్రకారం రాజ్యాదాయంలో రూపాయికి అయిదుఅణాలు ఇంగ్లీషువారికి షుజాఉద్దౌలా చెల్లించవలసివస్తుంది.)

(ఈ సంధి కుదరడానికి ముందు ప్రయాణంలో అనుకోకుండా ఈయన ఫర్రుఖాబాద్ వెళ్ళడం జరిగింది. అక్కడ అహ్మద్‌ఖాన్ బంగష్‌తో పరిచయం అయింది. ఆరోజుల్లో బంగష్‌ను బాగా అనుభవంగల పాతకాలపుపీడులలో ఒకరిగా చెప్పుకునేవారు. ఆయన షుజాఉద్దౌలాకు 'నీవువెళ్ళి రాజ్యపరిపాలన చేతిలోకి తీసుకున్నప్పుడు నా ఈ రెండుమాటలు మరచిపోకు :—

ఒకటి : మొగలులను నమ్మవద్దు. ఇతర నౌకర్లతోనూ రక్షకులతోనూ పని తీసుకోవాలి.

రెండు : లక్నోనివాసం మానేసి ఫైజాబాద్‌ను నీ రాజధానిగా చేసుకో' అని సలహా ఇచ్చాడు. )

ఈమాటలు షుజాఉద్దౌలా మనసులో నాటుకుపోయాయి. ఇంగ్లీషువారితో ఒప్పందం కుదరగానే క్రీ. శ. 1779 లో తనరాజ్యంలోకివస్తూ తిన్నగా ఫైజాబాద్ చేరుకున్నాడు. దానినే తన రాజధానిగా చేసుకున్నాడు. కొత్తసైన్యాన్ని ఏర్పాటు చేశాడు. కొత్త అశ్వికులను నియమించాడు; నూతనభవనాలకు పునాదులువేశాడు. పాతకోటను నగరరక్షణకు ఉపయోగపడేలా పునర్నిర్మాణం చేయించాడు. దాన్నే "ఖిల్లా" అనేవారు. కోటలోపలి మొగలుల ఇళ్ళను కూలగొట్టించాడు. కోటఅవతల ఇళ్లు కట్టుకోవలసిందిగా తన స్వంతనౌకర్లకు ఆదేశాలిచ్చాడు. కోటచుట్టూ అన్ని

పైపునా రెండు రెండుమైళ్ళ మైదానం వదిలేసి చుట్టూ లోతైన కందకం తవ్వించి ఖిల్లాపద్ధతిలో దానిని కట్టుదిట్టంగా తయారుచేయించాడు. ప్రభుత్వోద్యోగులకు, సైనికాధికారులకు వారివారి తాహతునుబట్టి ఇళ్ళస్థలాలుతీసుకుని ఆ మైదానంలోనే ఇళ్ళు కట్టుకోవలసిందని ఆదేశాలు అందాయి. షుజాఉద్దౌలా ఫైజాబాద్‌ను తన రాజధాని చేసుకున్నాడనేవార్త తెలియగానే ప్రపంచం ఇటు తిరిగింది. వేలసంఖ్యలో జనంవచ్చి నివాసం ఏర్పరచుకున్నారు. షాహజహాన్‌అబాద్‌లోని ప్రతిఒక్కరూ ఫైజాబాద్ వెళ్ళడానికే సిద్ధపడేపరిస్థితి ఏర్పడింది. ఢిల్లీలోని శిల్పులు చాలామంది తమ జన్మస్థలానికి స్వస్తిచెప్పి తూర్పువైపు బయలుదేరారు. రాత్రింబవళ్లూ యెడతెరిపిలేకుండా జనం వస్తూవుండేవారు. గుంపులు గుంపులుగావచ్చి ఫైజాబాద్ చుట్టుపట్ల చేరిపోయేవారు. కొద్దిరోజుల్లోనే అన్నిమతాలవారు, అన్ని జాతులవారు, సంపన్నులు, సాహితీపరులు, సమరవీరులు, వర్తకులు, శిల్పులు, అన్నివర్గాలకు అన్ని అంతస్థులకు చెందినవారు వచ్చి చేరిపోయేవారు. ప్రతివాడూ ఇక్కడికి రాగానే కాస్త స్థలం సంపాదించి ఇల్లు కట్టుకోవాలనే ఆలోచనలో పడిపోయేవాడు.

కొన్నిఏండ్లలోనే మొదటి కోటగోడకాక, మరోకోట తయారయింది. చతుష్కోణ ఆవరణానికి దక్షిణాన కలిసివున్న మొదటికోటపొడవు, వెడల్పు రెండు రెండుమైళ్లు. రెండవకోట ఖిల్లాకూ, బయటిగోడకూ మధ్యగా ఒకమైలు విస్తీర్ణంలో వుండేది. ఇదేరోజుల్లో త్రిపోలియా, చౌక్‌బజార్ నిర్మించబడ్డాయి. వీటిరోడ్డు ఖిల్లా దక్షిణద్వారాన మొదలై అలహాబాద్‌రోడ్డు మొనదాకా వుంది. ఒకేసారి ఒకదాని పక్కన ఒకటిగా పదిబండ్లు సునాయాసంగా వెళ్ళగలిగేంతవిశాలంగా ఈ రోడ్డు వుండేది. నగరపు కోటగోడ నేలమట్టంలో ఎంతవున్నా మధ్యన పదిగజాలకు తక్కువ వుండదు. పూర్తిగా పైకి వెళ్లేసరికి అయిదుగజాలైనా వుండేది. ఈ కోటమీద రాత్రంతా సక్రమ, అక్రమ సైనికదళాలు కవాతుచేస్తూ కాపలా కాస్తూ వుండేవి. సక్రమసైనికులదుస్తులు ఎఱ్ఱరంగుగాను, అక్రమసైనికులదుస్తులు నల్లరంగులోనూ వుండేవి. ఈ సైనికులకోసం వర్షాకాలంలో అంతటా గుడిసెలు వేసేవారు. కాని వర్షాలు తగ్గగానే అగ్నిప్రమాదాల భయంవల్ల ఆ గుడిసెలను తిరిగా విప్పించేసేవాడు. కేవలం కోటగోడలకోసం ఏటేటా [illegible] గుడిసెలు వేసేవాడు. నాలుగునెలలు కాగానే తీసేస్తుండేవాడు.

నగరసమీపంగా రెండు గడ్డిబీళ్ళు వేటకోసం కేటాయించారు. ఒకటి పశ్చిమాన గురజీ బేగ్ ఖాన్ మసీదునుంచి గుప్తార్ ఘాట్ వరకు చాలా విశాలంగా వుండేది. దానికి రెండువైపులా మట్టిగోడలు వుండేవి. మూడవవైపు ఘాఘ్రా ప్రవహిస్తూ వుండేది. ఈ బంజరు గడ్డిబీళ్ళలో జింకలు, చిరుతపులులు, కొమ్ముల దుప్పులు, నీలి గోవువంటి వన్యమృగాలను వదిలేవారు. అవి స్వేచ్ఛగా విహరిస్తూ ఎవరైనా భయపెడితే చెంగణాలువేస్తూ పరిగెడుతూవుండేవి. రెండోవేటస్థలం నగరానికి తూర్పుగా జనౌరాగ్రామం, గోసాయి సైనిక శిబిరంనుంచి నదీతీరంవరకు వుండేది. దీని విస్తీర్ణం ఆరుమైళ్లు. పదకొండుగ్రామాలు, వాటిబాపతు భూములు ఈ వేటస్థలం పరిధిలోకి వచ్చాయి. అయితే యీ వేటస్థలంలోకి వేటజంతువులను వదిలేపరిస్థితి రానేలేదు. నిరుపయోగంగానే వుండిపోయింది.

అసలు నగరం ఆవరణలో మూడు ఉద్యానవనాలుండేవి. వాటిలోకి ధనికులూ, రాకుమారులూ వాహ్యాళికివచ్చి, అక్కడి పచ్చికపరుపులపై సేదదీర్చుకుంటూ అక్కడి వసంతశోభను తిలకిస్తూ ఆనందిస్తూండేవారు. ఖిల్లా లోపలిభాగంలో సుమారు నాలుగోవంతు విస్తీర్ణంలో ద్రాక్షతోట వుండేవి. రెండోది మోతీబాగ్, చౌక్ లోపలిభాగంలో వుండేది. మూడవది లాల్ బాగ్. ఇది అన్ని తోటలలోకి పెద్దది. ఇందులో ఎంతో సుందరంగా మొక్కలు చెట్లు నాటారు. అన్నిరకాల మనోహరమైన పుష్పాలు యీ తోటలో వుండేవి. రాజ్యమంతటా యీ తోటకు పెద్దపేరుండేది. దూరప్రాంతాలవాళ్లుసైతం మానసోల్లాసకరమైన ఈ ఉద్యానవనంలో ఒక్క సాయంత్రం గడపే భాగ్యం కలగాలనుకుంటూవుండేవారు. పట్నంలోని ఉన్నతకుటుంబాలకుచెందిన నవయువకులు సాయంత్రాలు యీ ఉద్యానంలో హాయిగా విహరిస్తూ కనిపించేవారు. ఈ ఉద్యానవనం కీర్తి వినే, ఢిల్లీచక్రవర్తి షాః ఆలమ్ అలహాబాద్ నుంచి తిరిగివస్తూ, ఈ తోటలో వాహ్యాళిచేయాలనే కోరికతో ఫైజాబాద్ కు వచ్చారు. కొంతకాలం యీ తోటలో బసచేసి ఢిల్లీ వెళ్లారు. ఈ మూడు ఉద్యానవనాలేకాక ఆసఫ్ బాగ్, బులంద్ బాగ్ నగరానికిదగ్గరగా లక్నోవెళ్లే దారిలో వుండేవి.

నవాబ్ షుజాఉద్దౌలాకు పట్టణాభివృద్ధిపట్ల ఎంతో ఆసక్తివుండేది. ఆయన ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం బయలుదేరి వీధులూ ఇళ్లూ తనిఖీచేసేవాడు. కూలీలు

పారలు, గునపాలూ తీసుకుని వెంట నడుస్తుండేవారు. ఎక్కడైనా ఏదైనా ఇల్లు వంకరగానూ హద్దుదాటి చొచ్చుకువచ్చినట్టుగానూ కనపడినా, లేదా వీధినేల జానెడైనా ఎవరైనా ఆక్రమించుకున్నా వెంటనే తవ్వించేసి చదునుచేసి సవరింపచేసేవాడు.

సైన్యాన్ని సంస్కరించడంలోకూడా షుజాఉద్దౌలా ప్రత్యేకశ్రద్ధ కనపరిచేవాడు. అశ్వికదళాల ఉన్నతాధికారులుగా ముర్తజాఖాఁబరీజ్, హిమ్మత్ బహాదుర్ ఉమ్రావ్ గిర్ వుండేవారు. వీరిలో ఒక్కొక్కరి అధీనంలో, మిగతా చిన్నచిన్న [1]సైనికాధికారులక్రిందగల సైనికులమొత్తం సంఖ్యకంటే ఎక్కువసైన్యం వుండేది. ఇతర సైనికాధికారులు, ఎహసాన్ కంబోహీ, గురజీ బేగ్‌ఖాన్, గోపాల్‌రావ్ మరాఠా, మీర్‌జుంలా అల్లుడు నవాబ్ జమాలుద్దీన్‌ఖాన్ ముజఫ్ఫరుద్దౌలా, కాకోరీకిచెందిన బహూర్‌జంగ్‌బక్షీ అబుల్ బర్కాత్‌ఖాన్, లక్నో జాగీర్‌దార్ (అగ్రహారీకుడు) ముహమ్మద్ ముయిజుద్దీన్‌ఖాన్. వీరిలో ప్రతిఒకరిఅధీనంలో కనీసం అయిదు వందలు, వెయ్యిసైనికులదళం వుండేది. వీరుగాక కొజ్జాలూ, వాళ్ల పర్యవేక్షణలో శిక్షణపొందే యువకకొజ్జాలూ, పనివాళ్లూ వుండేవారు. బసంత్ అలీఖాన్ అనే కొజ్జా అధీనంలో రెండుడివిజన్ల సైన్యం, అనగా పన్నాలుగువేల సక్రమసైనికులుండే వారు. వారు ఎఱ్ఱటిదుస్తులు ధరించేవారు. బసంత్ అనే పేరుగల మరో కొజ్జా ఆధిపత్యంలో బల్లెములు విసరగల వెయ్యిమంది అశ్వికులదళం, దానితోపాటు ఒక పటాలం వుండేవి. అంబర్ ఆలీఖాన్ అనే కొజ్జా అధికారంక్రింద అయిదువందల మంది అశ్వికులదళం, దానితోపాటు ఒక పటాలం వుండేవి. వీరంతా నల్లరంగు దుస్తులు ధరించేవారు. మహబూబ్ అలీఖాన్ అనే కొజ్జావద్ద శిక్షణపొందే అశ్వికులు అయిదువందలమందీ, పటాలాలు నాలుగు. లతాఫత్ అలీఖాన్ అధీనంలోకూడా ఇంతసైన్యం వుండేది. రఘునాథ్‌సింగ్, ప్రసాద్‌సింగ్ - ఈ ఇద్దరిలో ప్రతి ఒక్కరి అధీనంలో మూడువందల అశ్వికులు, నాలుగుపటాలాలు ఉండేవి. ఇదే విధంగా మొదటి మఖ్బూల్ అలీఖాన్, రెండవ మఖ్బూల్ అలీఖాన్, యూసుఫ్ అలీఖాన్ - వీరిలో ప్రతిఒక్కరికింద అయిదువందల మొగల్ అశ్విక, పదాతిదళాలు వుండేవి, ఇక ఫిరంగీలకు లెక్కలేదు.

ఈవిధంగా షుజాఉద్దౌలా అధీనంలో ఫైజాబాద్‌లోఉండే మొత్తంసైన్యం: ఎఱ్ఱటి దుస్తులవారు ముప్పైవేలమంది సక్రమసైనికులు; నల్లటి దుస్తులవారు నలభై

1. జమాదార్.

వేలమంది అక్రమపదాతిదళాలు. వారి ముఖ్యసేనాపతి సయ్యద్ అహమద్. 'బాన్స్ వాలా' అనే ఉపనామంతో ఈయన ప్రసిద్ధుడు. త్వరత్వరగా దట్టించి కాల్చడం విషయంలో వీరి తుపాకులతో పోల్చిచూస్తే ఇంగ్లీషువారితుపాకులలో ప్రత్యేకత ఏమీ వుండేదికాదు.

ఈ దళాలుకాక షుజాఉద్దౌలా వద్ద ఇరవైరెండువేలమంది వార్తాహరులు, వేగుల వాళ్లు వుండేవారు. వీరు ప్రతి ఏడవరోజు పూనానుంచి, ప్రతి పదిహేనవరోజు కాబూల్‌నుంచి వార్తలు తెచ్చేవారు. ఆస్థానంలో ఎల్లప్పుడూ రాజప్రతినిధులుండే వారు. మరాఠాల ప్రతినిధి, దక్కన్‌రాజు నిజాం అలీఖాన్ ప్రతినిధి జాబ్తేఖాన్ ప్రతినిధి, నవాద్ జుల్ఫిఖారుద్దౌలా నజఫ్‌ఖాన్ ప్రతినిధి వుండేవాడు. వీరివెంట వీరి కార్యాలయాలుండేవి. వీరి సైనికులుకూడా వుండేవారు. వీరేకాక ఇంకా చాలా మంది సైనికాధికారులు తమతమ పటాలాలతో వుండేవారు. మీర్ నయీంఖాన్ పతాకచ్ఛాయలో సాబిత్‌ఖానీ, బుందేల్‌ఖండీ, చందేలా, మేవాతీ సైనికులుండే వారు.

మహమ్మద్ బషీర్‌ఖాన్ [1]దుర్గాధిపతి. నగరపుకోటగోడ పైభాగంలో అశ్వికులు, పదాతులు కాపలా తిరుగుతూఉండేవారు. ఖిల్లాలోనే ఈయన నివాసానికి, కార్యాలయానికి మంచి ఇళ్లు, ఈయన సైనికులకు శిబిరాలు వుండేవి. బయట గోడలవద్ద చోటులేకపోవడంవల్ల సయ్యద్ జమాలుద్దీన్‌ఖాన్, గోపాల్‌రావ్ మరాఠా కోట బయటకువెళ్ళి 'నౌరాహీ' గ్రామంవద్ద తమఇళ్లు, శిబిరాలు నిర్మించుకుని అక్కడే నివాసం ఏర్పరచుకున్నారు. స్థలం చాలకపోవడం కారణంగా నావాబ్ ముర్తజా ఖాన్ బారీజ్, మీర్ అహమద్ బాన్స్‌వాలా, మీర్ అబుల్‌బర్కాత్, షేఖ్ ఎహసాన్ - వీరంతా అయోధ్యకు పైజాబాద్‌కూ మధ్య గుడిసెల్లో నివసించేవారు.

జనసమ్మర్దంవల్ల, అధికసంఖ్యాకులైన సైనికులవల్ల నగరం కిటకిటలాడుతూ వుండేది. ముఖ్యంగా 'చౌక్'లో ఎంతో రద్దీగావుండి, పాదచారులు నిర్భయంగా నడిచేందుకు వీలులేకుండావుండేది. ఏ వ్యక్తి అయినాసరే గుంపులో ఇరుక్కోకుండా సాఫీగా నడిచిపోవడం అసాధ్యంగావుండేది. అది పైజాబాద్ కాదు మానవారణ్యం. బజార్లలోచూస్తే వివిధదేశాలసరుకులు కుప్పలుకుప్పలుగా వుండేవి. ఫైజాబాదులో

1. ఖిలేదార్.

నాణ్యం యెరిగిన ధనికులూ, దొరలు చాలామంది వున్నారనితెలిసి వర్తకులు రకరకాల సరుకుల్ని విపరీతంగా తెచ్చేవారు. ఎంత విలువైన వస్తువైనా చేతులమీద క్షణాల్లో అమ్ముడై పోయేది. ఒకదానినిమించి ఒకటిగా మంచిమంచివస్తువులు అమ్మకానికి నిరంతరం వస్తూనేవుండేవి. ఎప్పుడుచూసినా, ఈరానీ, కాబూలీ, చీనీ, ఫ్రెంచివర్తకులు చాలా విలువైన సరుకులతో సిద్ధంగా వుండేవారు. లాభాలు అర్జించినకొద్దీ, వారిలో ఉత్సాహం హెచ్చి ఇంకా ఎక్కువప్రయత్నంచేసి కొత్తసరుకు తెచ్చేవారు. ఇక్కడే నివాసం ఏర్పరచుకున్న మోస్యో జాంతేల్, మోస్యో సోన్ సోన్, మోస్యో పోట్రోజ్ మున్నగు రెండువందలమంది ఫ్రెంచివారు ప్రభుత్వోద్యోగాలలో వుండేవారు. షుజాఉద్దౌలాతో సత్సంబంధాలు వుండేవి. సైనికులకు శిక్షణ ఇచ్చేవారు. ఫిరంగులు, తుపాకులు మున్నగు అస్త్రశస్త్రాలను తమ పర్యవేక్షణలో తయారుచేయించేవారు.

మున్షీ ఫైజ్ బక్ష్ 'తారీఖ్-ఎ-ఫరహ్ బఖష్' రచయిత. ఆయన దయవల్ల మనకీ సంఘటనలు తెలిశాయి. ఆయన ఆరోజుల్లో సజీవుడు. ఆయన స్వానుభవాన్ని ఆధారంగాచేసుకొని రచనలు చేశాడు. ''మొట్టమొదట ఇల్లువదలి నేను ఫైజాబాద్ వెళ్ళేటప్పుడు ముమ్‌తాజ్‌నగర్ చేరుకొన్నాను. అది పట్టణపు పశ్చిమ ద్వారానికి నాలుగుమైళ్ళదూరంలో వుంది. ఒకచెట్టుక్రింద రకరకాల మిఠాయిలు, రొట్టెలు, పరోటాలు, మాంసంకూరలు, వేడివేడి అన్నం వగైరా తయారవుతూండడం చూశాను. మంచినీటి చలివేంద్రాలున్నాయి. మధురపదార్థాలు, రకరకాల షర్బత్తులు, గోధుమపిండి వంటకాలుకూడా అమ్ముడుపోతున్నాయి. వందలమంది ఆ దుకాణాలమీదికి ఎగబడుతున్నారు. అక్కడి సందడి వాతావరణం, నేను పట్టణంలోకి చేరుకొన్నట్లు - ముఖ్యమైనకూడలిలో వున్నట్లు స్ఫురింపచేసింది. కాని ఇంకా పట్టణంద్వారం రానేలేదే! నేను లోపలికి ఎలా చేరుకోగలిగానని సందేహం పొడసూపింది. అక్కడివాళ్లను అడిగాను. 'అయ్యా, పట్టణద్వారం ఇక్కడికి నాలుగుమైళ్లదూరంలో వుంది. మరి ఏలోకంలో వున్నారో మీరు' అన్నాడు ఒక బాటసారి.

ఈసమాధానంవిని విస్తుపోతూ, కొంతసేపటికి పట్టణంలోకి ప్రవేశించాను. ఆశ్చర్యకరమైన జనకోలాహలం వినిపించింది. అలంకారాలు, మనోరంజనాలు

ఎక్కడపడితే అక్కడ నృత్యాలు నయనాభిరామంగా వున్నాయి. గారడీవాళ్లుచేసే సాహసికచర్యలుచూసి ఆనందించేగుంపులు, షికార్లు - తమాషాలలో నిమగ్నులైన వారు ఎక్కువగా కనిపించాయి. నే నీ శోభనీ, ఆనందాన్నీచూసి ఆశ్చర్యచకితుణ్ణి అయ్యాను. ఉదయంనుంచి సాయంత్రంవరకు, సాయంత్రంనుంచి ఉదయం వరకూ సైనికుల - పటాలాల నగారామోత వినపడని క్షణమంటూలేదు. జాముల్నీ, గడియల్నీ తెలియచేసేందుకు యధావిధిగా నగారా మ్రోగడం, గడియలపై సమ్మెట పడ్తూండడం మొదలైన శబ్దాలవల్ల చెవులు చిల్లులు పడిపోతున్నాయి. రోడ్లుచూస్తే ప్రతిక్షణం వస్తూపోతూవుండే గుర్రాలు, ఏనుగులు, ఒంటెలు, కంచరగాడిదలు, వేటకుక్కలు, ఆవులు, గేదెలు, ఎడ్లు, ఆయుధశకటాలు, బళ్లు వగైరాతో ఎంతో రద్దీగా వున్నాయి. ఇందువల్ల అక్కడిరోడ్డుమీద నడవడం ఎంతో శ్రమతోకూడిన పనిగా కనిపించింది. ఆ రోడ్లమీద వచ్చేపోయేమనుష్యులనీ, జంతువులనీ, వాహనాలనీ లెక్కించగలగడం, లేదా అంచనా వేయగలగడం అసాధ్యం.

ఢిల్లీకిచెందిన సంపన్నకుటుంబాలవారు, యూనానీ అధికారులు, ఉన్నతశ్రేణికి చెందిన స్త్రీ పురుషులూ, వేశ్యలు, ప్రతిప్రాంతానికిచెందిన ప్రసిద్ధగాయకులు, ప్రభుత్వపదవులలో లేదా ఆశ్రయంలో వున్నారు. వాళ్లు గొప్పగొప్ప జీతాలు పొందుతూ సిరిసంపదలతో, భోగవిలాసాలతో జీవిస్తున్నారు. వీరిమూలంగా ఒక వింతశోభ, కాంతి పట్టణానికి చేకూరాయి. పిన్నలు పెద్దలు జేబులనిండా డబ్బు నింపుకుని తిరుగుతున్నారు. ఇక్కడి వాతావరణాన్నిచూసేక ఇక్కడ ఎవ్వరూ ఎప్పుడూ పేదరికాన్నీ, లేమినీ స్వప్నంలోకూడా చూడలేదేమో అనిపించింది. నవాబ్ షుజాఉద్దౌలా, ఫైజాబాద్ పట్టణాన్ని సిరిసంపదలతో శోభాయమానంగా రూపొందించేందుకు, ప్రజల సుఖశాంతులను పెంపొందింపచేయడంలో సంపూర్ణంగా నిమగ్నులయ్యారు. ఆయనజరిపే అవిరళకృషివల్ల కొద్దిరోజులలోనే ఫైజాబాద్ ఢిల్లీని మించిపోవచ్చుననే నమ్మకంఏర్పడింది.

నవాబ్ షుజాఉద్దౌలా రాజ్యంలోని భాగ్యవంతులు ఎంతో డాబు దర్పాలతో వుంటూండేవారు. ప్రతికార్యానికి ప్రతిసందర్భంలోనూ చేతికి ఎముకలేకుండా డబ్బు ఖర్చుపెట్టేందుకు సిద్ధపడేవ్యక్తులు అక్కడ వున్నట్లు ఇంకెక్కడా వుండ

కనిపిస్తుంది. అందుకే అన్నిప్రాంతాలనుంచీ రకరకాల శిల్పులు, నిపుణులైన కార్మికులు, తెలివైనవిద్యార్థులు తమతమవూళ్లను ప్రాంతాలను విడిచివచ్చి పైజాబాద్‌నే తమనిలయంగా చేసుకొన్నారు. ఇక్కడ ప్రతికాలంలోనూ, ఢక్కా, బెంగాల్, గుజరాత్, మాల్వా, హైదరాబాద్, షాహ్‌జహానాబాద్, లాహోర్, పెషావర్, కాబూల్, కాశ్మీర్, ముల్తాన్ విద్యార్థులబృందాలు వుంటూంటాయి. పైజాబాద్‌లోవున్నట్టి జ్ఞానపీఠ మనదగిన విద్వాంసులపాఠశాలలో ఈ బృందాలు విద్య నార్జించుకొని ఎంతో తృప్తితో తమతమఇళ్లకు తిరిగి వెళ్ళిపోతూండేవి. నవాబ్ వజీర్ మరో దశాబ్దంపాటో, పుష్కరంపాటో జీవించివుంటే ఎంత బాగుండేది! ఘాగ్రా నదీతీరంలో మరో నవీన షాహ్ జహానాబాద్ విలసిల్లివుండేది; ప్రపంచం మరో కొత్త ఢిల్లీరూపాన్ని సందర్శించివుండేది.''

(నవాబ్ షుజాఉద్దౌలా కేవలం తొమ్మిదేళ్లు అక్కడ నివసించినఫలితంగా పైజాబాద్ అంత ఉన్నతస్థితికి రాగలిగింది. ఆ తొమ్మిదిసంవత్సరాలలోనూకూడా ప్రతి సంవత్సరం ఆయన అక్కడవుండేది కేవలం నాలుగునెలలుమాత్రమే. మిగతా ఎనిమిదినెలలూ రాజపర్యటన, వేట. అందమైన యువతులపట్ల, నృత్యగానాలపట్ల షుజాఉద్దౌలాకు సహజాకర్షణ వుండేది. అందుకే వారాంగనలు, నృత్యగానాలు తెలిసిన భోగంపడుచులు లేని వీధి, సందూ అంటూ పైజాబాద్‌లో వుండేదికాదు. అక్కడ, వాళ్లకు చాలాప్రాముఖ్యం వుంటూండేది.

నవాబుగారి బహుమతులు వగైరాలమూలంగా వాళ్లు ఎంతో మంచిస్థితిలోను భాగ్యవంతంగాను వుండేవాళ్లు. తరుచు వేశ్యల దేరాలు-వాటివెంట రెండు మూడు ఉన్నతమైన గుడారాలు నవాబుగారు జిల్లాలలో పర్యటించేటప్పుడు, ప్రయాణాలు చేసేప్పుడు నవాబుగారి గుడారాలతోబాటు రాచఠీవితో హుందాగా వాహనాలపై వెడ్తూండేవి. వాటిప్రక్కన పది పన్నెండుమంది తెలంగాలు కాపలా కాస్తూండేవారు. పరిపాలకుల ఈ తీరుచూసి అధికారులు, సర్దారులుకూడా నిర్భయంగా ఆ పద్ధతినే అనుసరించేవారు. అందరివెంటా వేశ్యలు వుంటూండేవాళ్లు. దీనివల్ల నైతిక పతనం, సిగ్గులేనితనం పెరిగిపోయినప్పటికీ అసంఖ్యాకమైన ఆ వేశ్యల, అధికారుల ఆడంబరాలవల్ల పట్టణము తళుకుబెళుకులు చాలా పెంపొంది పైజాబాద్ నవవధువులాగ తయారైంది.)

క్రీ. శ. 1773 లో షుజాఉద్దౌలా పడమటివైపు దిగ్విజయానికి బయలుదేరాడు. ఈ యాత్రలోవి శోభనీ, కోలాహలాన్ని వర్ణించడం అసాధ్యం. నవాబుగారి పతాకంతోపాటు ఒక పెద్దపట్టణం ప్రయాణం చేస్తున్నదేమో అన్నట్లు వుంది. లక్నోమీదుగా ఇటావా చేరారు. ఇటావా మహారాష్ట్రులఆధీనంలో వుంది. ఒకే దాడితో దాన్ని వారినుంచిలాక్కొని నవాబ్ తనవశం చేసుకొన్నాడు. ఎహ్‌మద్ ఖాన్ బంగశ్‌రాజ్యంలో చొరబడి కౌడియాగంజ్, కాస్ గంజ్‌లో తిష్టవేశాడు. ఇక్కడినుంచి 'బరేలీ' పాలకుడు హాఫిజ్ రహ్‌మత్‌ఖాన్‌కు :—

'క్రితం సంవత్సరం మహామహిమాన్వితులైన సింధియా మరాఠేగారికి నేను కోటిరూపాయలు పంపించాను. రమారమి రెండువందలకోట్ల రూపాయలు విలువచేసే మీ ప్రదేశాన్ని ఆయన స్వాధీనపరచుకొన్నారు. కోటిరూపాయలు ఇచ్చి ఆ ప్రదేశాన్ని ఆయన ఆధీనంలోంచివిడిపించి మీకు ఇప్పించాను. ఇందువల్ల మీతరఫున నేను చెల్లించిన ఆ సొమ్ములోంచి వెంటనే మీరు ఏభై లక్షలు నాకు అందచెయ్యండి' అని లేఖ వ్రాశాడు నవాబ్.

తన ఆఫ్ఘన్ సామంతుల్నీ, పరివారకుల్నీ పిలిపించి 'షుజాఉద్దౌలా యుద్ధానికి ఏవేవో సాకులు వెతుకుతున్నాడు. ఆయన అడిగినసొమ్ము ఇచ్చివేయడమే నాకు ఉచితమని తోస్తోంది. నాదగ్గరవున్నటువంటి ఇరవై లక్షలు నే నిస్తాను, మిగతా ముప్పై లక్షలు మీరు ప్రోగుచేసి యివ్వండి' అన్నాడు హాఫిజ్ రహమత్ ఖాన్.

'షుజాఉద్దౌలా మనుష్యులు లెఖ్ఖకేకాని వాళ్లు మాతో ఎలా యుద్ధం చేయగల్గుతారు? ఇంక ఆయన వెంటవుండే ఇంగ్లీషుసేన అంటారా - వాళ్లఫిరంగులమీద మనం కత్తులుదూసి విరుచుకుపడితే వాళ్ల ప్రాణాలు పైకెగిరిపోతాయి. కప్పం చెల్లించవలసినఅవసరం ఏమాత్రం లేదు' అని ముందుచూపులేని పఠాన్‌సర్దారులు సమాధానమిచ్చారు. వారిసమాధానం విని హాఫిజ్ రహమత్‌ఖాన్ 'మీకు అధికారం వుంది. కాని యుద్ధవైఖరి మారితేమటుకు నేను రణరంగంనుంచి ప్రాణాలతో తిరిగిరాను. దీనిఫలితాన్ని మీరే అనుభవించవలసివుంటుందని ఇప్పుడే చెప్పేస్తున్నాను' అన్నాడు.

షుజాఉద్దౌలాకు అతడికోరికకు అనువైనజవాబు లభించలేదనేవిషయం వేరే చెప్పనక్కరలేదు. ఆయన సైన్యంతో దండెత్తాడు. యుద్ధం జరిగింది. హాఫిజ్

రహమత్‌ఖాన్ నోటినుంచి అదృష్టం ముందే చెప్పించినవిధంగా యుద్ధఫలితం విదిత మైంది. హాఫిజ్ రహమత్‌ఖాన్ వీరస్వర్గం అలంకరించాడు. అతడిపాలన అంతమై పోయింది. కాని ఆ విజయం షుజాఉద్దౌలాకుకూడా అచ్చిరాలేదు. 13 సఫర్[1] 1188 హిజరీ (క్రీ.శ. 1774)లో యుద్ధం జరిగింది. 11 శాబాన్[2] రోజున షుజాఉద్దౌలా బరేలీనుంచి సైన్యసమేతంగా బయలుదేరి లక్నో వెళ్లాడు. రమ్‌జాన్[3] మాసం లక్నోలో గడిపాడు. 8 శవ్వాల్[4] రోజున లక్నోనుంచి బయలుదేరి 14 న ఫైజా బాద్ చేరాడు. ఒకటిన్నరనెలలైనా విశ్రాంతి తీసుకొనేందుకు అవకాశం లేక పోయింది. విజయంసాధించిన 9 నెలల 10 రోజులకు 23 జికాద్[5] 1188 హిజరీ- (క్రీ.శ. 1774) నాడు ఆయన స్వర్గస్థుడయ్యాడు. ఆయన మరణంతోపాటే ఫైజా బాద్ అభివృద్ధి క్రమంకూడా సమాప్తమైపోవడం విచారకరం.

ఆ రోజుల్లో అయోధ్యపరిపాలనలో నవాబ్ షుజాఉద్దౌలా బహాదూర్‌భార్య 'బహూ బేగమ్ సాహిబా' ప్రభావం ఎక్కువగావుండేది. ఆమె చాలా సంపన్ను రాలనికూడా ప్రతీతి వుండేది. ఆమె స్వీకృతితో నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా సింహాస నాన్ని అధిష్ఠించాడు. కాని అతడిప్రవర్తన ఎంతమాత్రం మంచిదికాదు. దీన్ని దృష్టిలోపెట్టుకొని తల్లీ - కొడుకుల్ని విడివిడిగా నివసింపచేయడం సముచితమని మంత్రులు భావించారు. కొన్నాళ్లు విలాసయాత్రలు, వేటలు మొదలైనవాటిలో నిమగ్నుడై ఆ తరవాత నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా బహాదూర్ లక్నోలో ఉంటూ, తరచు డబ్బు అడుగుతూ తల్లిని పీడిస్తుండేవాడు.

బహూబేగమ్ సాహిబా మూలాన ఆమె జీవితపర్యంతం, 'ఫైజాబాద్' కొద్దో గొప్పో శోభాయమానంగా వుండేది. ఆమె జీవించివున్నరోజులలోనే నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా అయోగ్యకృత్యాలు బేగమ్ సాహిబా సంతోషాన్ని, ఫైజాబాద్ సుఖ శాంతులనీ, భంగపరచినప్పటికీ రాణి జీవితాంతంవరకు ఆ పోట్లాటలు, గందరగోళాలుకూడా ఒకవిధంగా అక్కడిశోభను వృద్ధిపరిచేయి. ఆమె నిర్యాణంతోనే ఫైజాబాద్ చరిత్ర సమాప్తమైపోయింది. లక్నో పరిపాలనకాలం ప్రారంభమైంది. ఆ వివరాలు ముందు అధ్యాయంలో వివరిస్తాను.

---

1-5. ఇస్లామ్‌నెలల పేర్లు - సఫర్ : రెండోనెల; శాబాన్ : ఎనిమిదోనెల; రమ్‌జాన్ : తొమ్మిదోనెల; శవ్వాల్ : పదోనెల; జికాద్ - పదకొండోనెల.

## 2

లక్నో నిర్మాణానికి ఎప్పుడు పునాది పడిందో, దాని స్థాపకులెవరో, దానికి ఆ పేరు ఎందుకు వచ్చిందో ఎవరికీ సరిగ్గా తెలియదు. కాని కొన్ని అంచనాలనుబట్టి ఈవిధంగా పేర్కొనవచ్చు.

శ్రీరామచంద్రప్రభువు లంకను జయించి, తన వనవాసకాలాన్ని పూర్తిచేసుకొని రాజ్యసింహాసనాన్ని అధిష్ఠించినప్పుడు, అరణ్యాలలో తనకు చేదోడు వాదోడుగా వున్నటువంటి సహచరుడు - సానుభూతితో వ్యవహరించిన సోదరుడు అయిన లక్ష్మణునకు అగ్రహారంరూపంలో ఈప్రదేశాన్ని బహూకరించారనీ, ఆయన నివసించడంవల్లనో లేక ఆయన రాకవల్లనో ఇక్కడ నదీతీరాన ఒక ఎత్తయిన చిన్నకొండపైన ఒక ఊరూ నిర్మితమైందనీ, ఆకాలంలో దానికి 'లక్ష్మణపూర్' అనేపేరు పెట్టబడిందనీ, ఆ చిన్నకొండ 'లక్ష్మణ్ టీలా'గా ప్రసిద్ధికెక్కిందనీ అంటారు. ఆకొండలో లోతైన గుహ లేక బావో వుండేది. దాని అడుగుభాగం ఎవరికీ అంతు దొరికేదికాదు. అది శేషనాగ్‌వరకు వ్యాపించివుంటుందని ప్రజలలో ప్రసిద్ధి వ్యాపించింది. ఈ అభిప్రాయంతో ప్రజలలో ఆస్తికభావాలు మేల్కొన్నాయి. హిందువులు భక్తిభావంతో దానిలో పుష్పజలం పోస్తూండేవారు.

యుధిష్ఠిరమహారాజు మనుమడు జనమేజయమహారాజు ఋషి-ముని - తపస్వులకు యీప్రదేశాన్ని బహూకరించాడనీ, వారు ఇక్కడ మెల్లిమెల్లిగా తమ ఆశ్రమాలు నిర్మించుకొని భగవత్‌ధ్యానంలో లీనమైపోయారనీకూడా తెలుస్తోంది. చాలా కాలం తరువాత, వారు బలహీనులన్గ్రహించి హిమాలయాలనుంచి భర్-పాంసీ అనే రెండురకాల క్రొత్త జాతివాళ్లువచ్చి ఈ ప్రదేశంపై ఆధిపత్యంవహించారు. ఈ రెండుజాతులు పరస్పరం ఒకేపోలికగల్గిన ఒకేవంశానికిచెందిన రెండుశాఖలు అనిపిస్తోంది.

క్రీ. శ. 1030 వ సంవత్సరంలో సయ్యాద్ సాలార్ మసూద్‌గాజీ వీళ్ళను ఎదుర్కొన్నారు; బహుశః క్రీ. శ. 1202 లో వాళ్ళపై బక్తియార్‌ఖిల్జీ దండెత్తాడు. ఈ ఇద్దరు ఆక్రమణదారులవెంట, ముఖ్యంగా సయ్యాద్ సాలార్ మసూద్‌గాజీవెంట,

వచ్చి మొట్టమొదటిసారిగా మహమ్మదీయ కుటుంబాలు యీప్రదేశంలో స్థిరపడ్డాయి. ఛర్, పాంసీలే కాకుండా బ్రాహ్మణులు, కాయస్థులు ఇక్కడ మొదటినుంచీ వుంటూండేవారు. వీరందరూకలిసి ఇక్కడ ఒక చిన్నపట్టణాన్ని నిర్మించి సుఖ శాంతులతో జీవించసాగేరు.

కాని ఈ బస్తీపేరు లక్ష్మణపురంనుంచి లక్నోగా ఎప్పుడు మారిందో చెప్పడం కష్టం. అక్బర్ చక్రవర్తికిముందు 'లక్నో' జాడ తెలియదు. హిందూ-ముస్లింజనాభా అంతకుముందునుంచీ తగినసంఖ్యలో వుండేదనేవిషయాన్ని ఒప్పుకోకతప్పదు. క్రీ. శ. 1540 లో షేర్‌షాహ్‌చేతుల్లో 'జౌన్‌పూర్'వద్ద హుమయూన్ చక్రవర్తి ఓటమి సంభవించింది. ఆయన యుద్ధరంగాన్నివదిలేసి సుల్తాన్‌పూర్, లక్నో, పీలీభీత్‌లగుండా తిరోగమించాడు. లక్నోలో ఆయన నాలుగుగంటలసేపుమాత్రమే విశ్రాంతి తీసుకొన్నాడు. ఆయన పరాజితుడు, పదచ్యుతుడు, శక్తివిహీనుడూ అయినప్పటికీ, లక్నోపౌరులు మానవత్వపు సానుభూతితో, అతిథిసేవాపరాయణత్వపు ఆదర్శంతో ఆ కొద్దిగంటలలోనే పదివేలరూపాయలనూ, ఏభై గుర్రాలనూ ఆయనకు బహూకరించాడు. ఈ కథనం లక్నోలోని షేఖ్‌వంశ పరంపరలోని వ్యక్తులది. ఈకథనం, పై అభిప్రాయాన్ని బలపరుస్తోంది. ఇంత కొద్దివ్యవధిలో అన్నిగుర్రాలు, రూపాయలు ప్రోగవడాన్నిబట్టి ఆరోజుల్లో ఇక్కడ తగినంత జనాభా వుండేదనీ, ఆనాటి లక్నో ఈనాటి అనేకపట్టణాలకంటె ఎక్కువ శోభాయమానంగాను, సంపన్నస్థితిలోనూ వుండేదనీ అభిప్రాయపడవచ్చు.

ఆకాలంలో వచ్చినవారిలో షాహ్‌మీనాగారి కుటుంబంకూడావుంది. ఆయన సమాధి నేటివరకూ జనసామాన్యానికి పూజాస్థలంగా భాసిల్లుతోంది. బహుశః అదే కాలాన వచ్చినవారిలో షాహ్ పీర్‌మహమ్మద్‌కూడా వున్నారు. ఆయన 'లక్ష్మణ టీలా' పై నివసించాడు. అక్కడే ఆయన మరణించాడు. అక్కడ ఆయన నివసించడంవల్లనే ఆ పాతకొండ 'లక్ష్మణ టీలా'కి బదులు 'షాహ్ పీర్ ముహమ్మద్ కా టీలా' అయిపోయింది. కాలక్రమేణా ఆ లోతైన గుహకూడా పూడిపోయింది. ఆతరువాతకాలంలో ఔరంగజేబ్ చక్రవర్తి అక్కడికి స్వయంగావిచ్చేసి దానిపీద ఒక చక్కని మసీదును నిర్మింపచేశాడు.

(క్రీ. శ. 1590 వ సంవత్సరంలో అక్బర్ చక్రవర్తి హిందూదేశాన్నంతనీ పన్నెండుప్రాంతాలుగా విభజించారు. అయోధ్యప్రాంతపు గవర్నరు లేక శాసకుని రాజధానిగా మొట్టమొదట 'లక్నో'యే నిర్ణయించబడింది. ఆరోజుల్లో అదృష్ట వశాత్తు బిజనౌర్‌జిల్లాకుచెందిన షేఖ్ అబ్దుర్రహీమ్ ఉద్యోగం సంపాదించుకొనేందుకు ఢిల్లీ చేర్షుకొన్నాడు. ఆయన నిర్ధనుడు, దీనావస్థలోవున్న పెద్దమనిషి. అక్కడి ఆస్థాన అధికారుల ఆశ్రయం సంపాదించి ఆయన చక్రవర్తి ఆస్థానంలో చేరారు. చివరికి ఆయనకు రాజకీయోద్యోగులలో స్థానం దొరికింది. లక్నోలో జాగీర్‌కూడా ఆయనకు లభ్యమైంది. అనంతరం కొన్నాళ్ళకి ఆయన శీవిగా తన జాగీర్ చేరుకొని అక్కడే నివసించసాగారు.

ఇక్కడ ముఖ్యంగా లక్ష్మణ టీలా లేక పీర్ ముహమ్మద్ టీలాను తన నివాసస్థానంగాచేసుకొని పంచ్ ముహల్లా నిర్మింపచేశాడు; శేఖన్ దర్వాజా కట్టించాడు. లక్నోలోనే ఆయన మరణించాడు. 'నాదాన్ మహల్' పేరిట నేటికికూడా ఆయన సమాధి ప్రసిద్ధమైంది. భారతప్రభుత్వం, ఆసక్తి కనపరచి కొద్దిరోజులక్రితమే ఈ భవనాన్ని తన అధీనంలోకి తీసుకొంది.)

ఆకాలంలోనే అక్కడ షేఖ్ అబ్దుర్రహీమ్, లక్ష్మణ టీలా వద్దనున్న మరో గుట్ట మీద ఒక చిన్నకోటను నిర్మించాడు. చుట్టుప్రక్కలవుండే గట్టి కట్టడాలన్నిటికంటె అది ఎక్కువ దృఢమైనది. షేఖ్ అబ్దుర్రహీమ్‌కి చక్రవర్తిఆస్థానంలో 'ఇత్మే మాహీ మరాతిబ్'-'మత్స్యశాస్త్రవిశారద' అనేబిరుదు లభ్యమైంది. అందుకో, లేక గట్టికోటను కట్టించినందుకో, లేదా ఈ కోటలోని ఒకభవనంలో ఇరవైఆరు ఆర్చీలను - ప్రతి ఆర్చీలో రెండేసిచొప్పున ఏభై రెండుమీనాలను శిల్పులచే చెక్కించినందుకో అక్కడిప్రజలకు అతడిపై మంచిగురి ఏర్పడింది. 'మచ్ఛీభవన్' అనే పేరుతో ఈకోట ప్రసిద్ధికెక్కింది. 'భవన్ శబ్దం కోట అర్థంలోనో లేక [1]'బావన్'కి వికృతరూపంలోనో ప్రయోగించబడివుండవచ్చు. ఈకోటను కట్టినశిల్పి 'లఖానా' అనేపేరుగల యాదవుడు. అతడిపేరనే పట్టణంపేరు 'లక్నో' అయిందని కొందరి అభిప్రాయం. లక్ష్మణ్‌పూర్ వికృతనామధేయం 'లక్నో' అయిందని కొందరి అభిప్రాయం. ఈ రెండింటిలో ఏదైనప్పటికీ అబ్దుర్రహీమ్ ఆగమనంతరువాతే ఈపేరు వచ్చింది.

---

1. 'బావన్'-ఏభై రెండు.

కొన్నాళ్ల తరువాత అబ్దుర్రహీమ్ వంశీయులు అంటే శేఖ్ వంశీయులేకాకుండా, దక్షిణంవైపునుంచి ఇక్కడికి పఠానులబృందంవచ్చి స్థిరపడింది. వాళ్లు రామ్‌నగర్ పఠానులుగా ప్రఖ్యాతిచెందారు. వాళ్ళు తమ జమీందారీసరిహద్దును ఇప్పుడుండే 'గోల్‌దర్వాజా'వరకు స్థిరపరిచారు. అక్కణ్ణుంచి నదివైపుకు సాగిపోతే షేఖ్ వంశీయులభూములు ప్రారంభమౌతాయి కనుక అలా నిర్ణయించారు. ఈ పఠానుల తరువాత షేఖ్‌ల మరో క్రొత్తబృందంవచ్చి తూర్పువైపున నివసించింది. వాళ్లి 'ఖయూాఖ్ నబిహరా' అని పిలువబడేవాళ్లు. ఇప్పుడు రెసిడెన్సీభవనాల అవశేషాలు పడివున్నచోట వాళ్ళభూమి ఉండేవి.

ఈ మూడుబృందాలకూ తమతమప్రాంతాలపై అధికారాలుండేవి; వారు తమ తమ సీమలకు పరిపాలకులై వుండేవారు. అయినప్పటికీ షేఖ్‌వంశీయులలో చాలా మందికి ఢిల్లీ ఆస్థానంతో మంచిసంబంధాలుండేవి. వాళ్ళలో అనేకులు సంపూర్ణ అయోధ్యప్రాంతానికి గవర్నర్లుగా నియుక్తులయ్యారు. అందువల్ల శేఖ్‌వంశీయుల ప్రభావానికి అందరూ వశులై వుండేవారు. చుట్టుప్రక్కలప్రజలపై వారిప్రాబల్యం వుంటూండేది. వారికోట 'మచ్ఛీభవన్' దృఢత్వాన్నిగురించి చాలా ప్రసిద్ధివుండేది. మచ్ఛీభవన్ ఎవరిచేతుల్లోవుంటే లక్నోవారికే చెందుతుందని జనం చెప్పుకొంటూండే వారు.

అక్బర్‌కాలంలో లక్నో అభివృద్ధి చెందసాగింది; దానిజనాభా పెరిగింది; అవధ్ ప్రాంతపు గవర్నర్లు ఆ షేఖ్‌వంశీయులనుంచే ఎన్నిక చేయబడ్తూండేవారనేసంగతి నిజమే. కాని ఏళ్లతరబడి ఇంట్లోకూర్చునివుండే ఢిల్లీవ్యక్తులే ఈపనికి నియుక్తులౌతూండే ఆచారం వుండేది. కేవలం భూమిపన్ను వసూలుచేసే జమాబందీ సమయంలో మాత్రం వారు పర్యటించేవారు. వారి సహాయకులు ఇక్కడ వుంటూండే వారు. ఇందువల్ల వారినుంచి పట్టణాభివృద్ధి ఆశించడం అసాధ్యంగావుండేది. అయితే స్థానికులైన ఒకరిద్దరు షేఖ్‌వంశీయులుకూడా గవర్నర్లుగా నియుక్తులయ్యారు. వారి నియుక్తివల్ల నిస్సందేహంగా లక్నోకి లాభం చేకూరింది.

అక్బరుచక్రవర్తికి లక్నోపై ముఖ్యంగా దృష్టివుండేదని తెలుస్తోంది. ఆయన అక్కడి బ్రాహ్మణులకు వాజపేయయాగం నిమిత్తం లక్షరూపాయలు ఇవ్వడం ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు. ఆకాలంనుంచే లక్నోకిచెందిన వాజపేయు

బ్రాహ్మణులు ప్రసిద్ధిచెందేరు. అక్బరుకాలంలో వాజపేయీ టోలా, కటారీ టోలా, సోంఫీ టోలా, బజారు టోలా, అహిరీ టోలా ప్రాచీనతమ హిందూవీధులని ఎంచ బడ్తున్నాయి.

మీర్జా సలీమ్ సింహాసనారూఢుడై నూర్ ఉద్దీన్ జహాంగీర్ పేరుతో ప్రఖ్యాతి చెందేడు. మంచిభవనాలతో పడమటివైపున విలసిల్లే మిర్జామండీ పునాదుల్ని తండ్రి సజీవుడై వున్నప్పుడే ఆయన వేశాడు. అక్బర్‌కాలంలో ఇక్కడిగవర్నర్ 'జవాహర్ ఖాన్'. ఆయన ఢిల్లీలోనే వుంటూవుండేవాడు. కాని ఆయన ప్రతినిధి కాజీ మహమూద్ బిల్‌గ్రామీ, కూడలి (చౌక్)కి దక్షిణంవైపు దానితోకలిసే కుడివైపున 'మహమూద్‌నగర్' ఎడమవైపున 'షాహ్‌గంజ్'లను నిర్మించాడు. కూడలిమధ్య చక్రవర్తిపేరిట 'అక్బరీద్వారం' నిర్మించాడు.

ఈ భవనాలు తయారౌతూ, ఈవీధులు నిర్మితమయ్యే అక్బర్‌పరిపాలనాకాలంలో లక్నో మంచి సంతజరిగే స్థలంగా రూపొందింది. గుర్రాలవ్యాపారంచేసే ఒక ఫ్రెంచివ్యాపారి ఇక్కడ నివసిస్తూ లాభాలు ఆర్జించాలనేప్రయత్నం చేసేటంత ప్రగతిని అది సాధించింది. చక్రవర్తి ఆస్థానంనుంచి లక్నోలో వుండేందుకు [1]'సనదే ముస్తామినీ'ని పొంది ఆయన ఇక్కడ అశ్వశాలను కట్టించాడు.

చౌక్‌దగ్గర నాలుగు పెద్దభవనాలను కట్టించగలిగేందుకు తగినలాభాన్ని మొదటి సంవత్సరంలోనే ఆ ఫ్రెంచివ్యాపారి ఆర్జించగలిగాడు. సంవత్సరం పూర్తికాగానే 'ముస్తామినీ' ఆజ్ఞాపత్రాన్ని పునర్నవీకరణం (రెన్యూ) చేయించుకోగోరాడు. కాని అంతకంటె ఎక్కువకాలం వుండేందుకు అతనికి అనుజ్ఞ లభించలేదు. అయినప్పటికీ అతడు మొండిగా అక్కడే నివసిస్తూవుండేందుకు సిద్ధపడ్డాడు. అయితే చక్రవర్తి ఆజ్ఞానుసారం పట్టణపుఅధికారులు అతడిభవంతుల్ని స్వాధీనపరచుకొని ప్రభు

1. ముస్తామిన్ అంటే శాంతికాముకుడు అని అర్థం. హిందూ-ముస్లింలు తమను ఇక్కట్లపాలు చేస్తారేమోననేభయంతో ఐరోపాదేశస్థులకు వుండేది. అధికారులు, ప్రజలు తమను బాధించకుండా చేసుకోడానికి యూరోపియులు తాము కోరుకున్నస్థలాలలో వుండేందుకు ఢిల్లీ ఆస్థానంనుంచి ముస్తామిన్ అనుమతిపత్రాన్ని పొందుతుండేవారు. ఇటువంటి ప్రమాణపత్రాలు నివ్వడంవల్ల ప్రభుత్వంపై బాధ్యతలు ఎక్కువైపోతాయి కనుక ఒక సంవత్సరానికిమించి ప్రమాణపత్రాలు సాధారణంగా ఇవ్వబడేవికావు.

త్యానికి అప్పగించి అతణ్ణి అక్కడినుంచి గెంటేశారు. ఆ నాలుగుభవంతులు చాలా కాలంవరకు ప్రభుత్వాధీనంలో వున్నాయి. ఔరంగ్‌జేబ్ ఆలమ్‌గీర్ చక్రవర్తి శాసనకాలంలో 'ముల్లా నిజామ్ ఉద్దీన్ సిహాలవీ' తనవూరులోజరిగే గందరగోళాల వల్ల చికాకుపడి లక్నోవెళ్ళి కాపురముండాలని నిశ్చయించుకొన్నప్పుడు ప్రభుత్వం తరపున ఆ నాలుగుభవంతులు బహుమానరూపంలో ఆయనకివ్వబడ్డాయి. ఆయన తనకుటుంబంతోవచ్చి ఆ భవంతులలో కాపురమున్నాడు. ఆ భవనాలు, చుట్టుపక్కల గల అనేకగృహాలతోపాటు 'ఫిరంగిమహల్' అని పిలువబడుతున్నాయి. ముల్లా రాకతో లక్నో విజ్ఞానకేంద్రంగాను, విద్యార్థుల నివాసస్థలంగాను రూపొందగలి గింది. ఆ జ్ఞానపీఠం ఎంతోప్రగతిని సాధించగలిగింది. 'సిల్ సిలా-ఏ-నిజామియా' గా ప్రఖ్యాతివహించిన ముల్లా నిజామ్ ఉద్దీన్‌చే తయారుచేయబడిన పాఠ్యక్రమం చాలాకాలంనుంచీ భారతదేశానికి మాత్రమేకాక ఆసియాఖండానికంతకీ పాఠ్య క్రమమై అలరారుతోంది. ఈ పాఠ్యక్రమంలో జ్ఞానానికిసంబంధించిన విశేషాలతో పాటు కొన్ని కొత్తవిషయాలుకూడా చేర్చబడ్డాయి. ఈ పాఠ్యక్రమంమూలంగా ఎక్కడెక్కడివిద్యార్థులూ ఎంతెంతదూరంనుంచో లక్నోవచ్చి విద్యాభ్యాసం చేసే వారు.

('లాకెట్' అనే ఐరోపాఖండపు యాత్రికుడు క్రీ. శ. 1631 వ సంవత్సరం, అంటే షాహ్‌జహాన్ చక్రవర్తి పరిపాలించేరోజులలో పర్యటననిమిత్తం భారత దేశం వచ్చాడు. 'ఇది చక్కని వ్యాపారకేంద్రం, షాహ్‌జహాన్‌కాలంలో 'సుల్తాన్ అలీ షాహ్ కులీఖాన్' ఇక్కడి గవర్నరు. మీర్జా ఫాజిల్, మీర్జా మన్సూర్ ఆయన పుత్రులు. మహమూద్‌నగర్‌కు దక్షిణంవైపు 'ఫాజిల్ నగర్', 'మన్సూర్ నగర్' అనే రెండు కొత్తఊళ్ళను తన ఇద్దరు పుత్రులపేరిట ఆయన నిర్మించాడు.) (ఆకాలంలో ఇక్కడ అషరఫ్ అలీఖాన్ అనేఆయన అశ్వికదళాధిపతిగా వుంటూండే వాడు. ఆయనకూడా యీ క్రమంలోనే అషరఫాబాద్ నిర్మించాడు. కాలువకి అవ తలివైపు ఆయనసోదరుడు ముషర్రఫ్ అలీఖాన్ ఇల్లుకట్టుకొని ముషర్రఫాబాద్ అనే మరొకపేట నేర్పరిచాడు. అదే కాలక్రమంలో మారిమారి ఇప్పుడు 'నౌబస్తా' అయిపోయింది. ఆ రోజుల్లోనే పీర్‌ఖాన్ అనే మరొకసైన్యాధికారి వుండేవాడు. ఆయన ఈ పేటలన్నిటికి పడమటివైపు కొద్దిదూరంలో తన భవనాన్ని కట్టించు

కొన్నాడు. ఇప్పటివరకు ఆస్థలం 'పీర్‌ఖాన్‌గారి భవనం' పీర్‌ఖాన్ కీ గఢీ అని చెప్పుకోబడుతూంది.)

ఔరంగజేబ్ చక్రవర్తి ఒకప్పుడు ఏదో అవసరమైనపనిమీద అయోధ్య వెళ్లాడు. తిరిగివెళ్లేప్పుడు లక్నోలో ఆగి ఢిల్లీ చేరుకొన్నారు. ఈసందర్భంలో ఆయన షాహ్ పీర్ ముహమ్మద్‌గారి మసీదు నిర్మింపచేశాడు. సరిగ్గా 'లక్ష్మణ్ టీలా' పైన యీ మసీదు నిర్మాణం జరగడంవల్ల ఇది ఎంతో ఎత్తునవుండి లక్నోలో మసీదు కట్టేందుకు దీనికిమించిన సముచితస్థలం మరొకటిలేదని రుజువుచేస్తోంది. బహుశః ఇదే తరుణంలో ఆయన 'ఫిరంగీమహల్' భవనాలను ఆనాటి విద్వాంసుడైన ముల్లా నిజామ్ ఉద్దీన్‌కు బహూకృతిగా ఇచ్చివుండవచ్చు.

ముహమ్మద్ షాహ్‌రంగీలే కాలంలో గిరధానాంగా లక్నోకి గవర్నరు అయ్యాడు. ఆయన అశ్వదళాధిపతి, పరాక్రమశాలియైన హిందువు. ఆయన పినతండ్రి 'ఛబీలేరామ్' ఢిల్లీపక్షాన అలహాబాద్ శాసకుడిగా నియుక్తుడయ్యాడు. ఛబీలేరామ్‌గారి మరణానంతరం గిరధానాంగా తన పినతండ్రిస్థానంలో అలహాబాద్ శాసకుడవాలనేసంకల్పంతో తిరుగుబాటు చేశాడు. కాని ఆ తరువాత కొంచెం వెనుకముందులాలోచించి తన విశ్వాసపాత్రతను, విధేయతను ప్రకటించుకొని, ఆ స్థానంద్వారా అయోధ్య రాజుయొక్క [1]'ఖిలఅత్' సన్మానాన్ని పొందాడు. ఆయన లక్నోలోనే నివసించసాగాడు. ఆయనభార్య రాణీ. ఆమెపేరుతో 'రాణీ కటరా' నిర్మాణం జరిగింది.

(కాని ఇక్కడిఅధికారులు, గవర్నర్లు ఎవరైనప్పటికీ, వాళ్లు ఎంత బలవంతులైనప్పటికీ, ప్రభుత్వంనుంచి ఎన్ని ప్రమాణపత్రాలు పొందినవారైనప్పటికీకూడా షేఖ్‌వంశీయుల అధికారాన్ని ధిక్కరించి వాళ్లప్రాంతాలలో అడుగుపెట్టగలిగే సాహసం వారిలో వుండేదికాదు. మచ్ఛీభవనానికి భాగ్యవంతుల భవనపుహోదా ప్రాప్తమైవున్నప్పటికీ షేఖ్‌వంశీయులు దానిని తమ వంశపారంపర్యపు స్థిరాస్తిగా చేసుకొన్నారు.

ఢిల్లీనుంచి ఏ అధికారివచ్చినప్పటికీ దాన్ని స్పృశించేందుకుకూడా వీలుండేది కాదు. ఆ అధికారులు మచ్ఛీభవన్‌వద్ద 'ముబారక్ మహల్' 'పంచ్‌మహలా' పేర్ల

---

1. చక్రవర్తితరపున సన్మానార్థం బహూకరించబడే వస్త్రాలు.

గల మరో రెండుకట్టడాలను కట్టించారు. పంచ్‌మహలానుగురించి కొందరు అది ఐదంస్తుల భవనమనీ, మరికొందరు ఐదుభవనాలు ఒకదాని ప్రక్కన ఒకటి నిర్మించబడడంవల్ల దానికాపేరు వచ్చిందనీ అంటారు. ముబారక్ మహల్, పంచ్ మహలాకు దక్షిణంగా ఒక పెద్ద ఆర్చీలగేటు వుండేది. దాన్ని 'షేఖన్ దర్వాజా' అని పిలిచేవారు. షేఖ్‌వంశీయుల భవనాలలోకి వెళ్లాలంటే ఈ ద్వారందాటి వెళ్లవలసి వుండేది.

ఈ ద్వారపుఆర్చీకి సాహసికులైన షేఖ్‌వంశీయులు ఒక విచ్చుకత్తిని వ్రేలాడగట్టారు. ఎవరైనా, వారు ఎంతగొప్పవారైనప్పటికీ షేఖ్‌వంశీయుల ప్రాంతంలోకి వెళ్లదలచుకొంటే ముందు ఆ కత్తికి వంగి సలామ్‌చేసి ముందు అడుగెయ్యాలని వాళ్లు కట్టడిచేశారు. ఈ ఆజ్ఞను శిరసావహించడంలో సంకోచించే గుండెధైర్యం ఎవరికుంటుంది ? అంతవరకూ ఎందుకు, ఢిల్లీ చక్రవర్తిచేత నియుక్తులైన శాసకులుసహితం షేఖుల్ని దర్శించేందుకు వెళ్లవలసినసందర్భాలలో తప్పనిసరిగా ఆ కత్తిముందు నతమస్తకులై ముందుకు అడుగెయ్యవలసి వచ్చేది.

క్రీ. శ. 1732 లో 'నవాబ్ సఆదత్‌ఖాన్ బురహాన్ ఉల్-ముల్క్' ఢిల్లీ ఆస్థానంచే అయోధ్యప్రాంతపు గవర్నర్‌గా నియుక్తులై వచ్చారు. ఈయన మూలంగా భారతదేశపు తూర్పు ఆస్థానానికి చివరిసారిగా పునాది ఏర్పడింది. ఈ ఆస్థానపు ఉన్నతిని తూర్పు సంస్కృతికి చివరి నమూనాగా భావించి ముందుకు సాగాలనుకుంటున్నాను. ఈ తూర్పుసంస్కృతికే తొలిచిహ్నం, ఈ లక్నో ఆస్థానానికే నాంది అయిన ఫైజాబాద్‌నుగురించి ఇంతకుముందు అధ్యాయంలో చెప్పివున్నాను. ఈ ఆస్థానం ఏర్పడకపూర్వం వుండే లక్నోనుగురించి యీ అధ్యాయంలో వివరించాను. నైశాపురీ వంశంనాటి పరిపాలనాచరిత్రను ముందు కొన్ని అధ్యాయాలలో వివరించి ఆతరువాత ఆ సంస్కృతి ఏమిటో, ఎట్లాంటిదో మీదృష్టికి తెస్తాను.

# 3

నవాబ్ బుర్‌హాన్-ఉల్-ముల్క్ ఆరుసంవత్సరాలైనా అయోధ్య, లక్నోలలో గడిపారో లేదో క్రీ. శ. 1735 వ సంవత్సరంలో నాదిర్‌షాహ్ భారతదేశంపై దాడిజరిపాడు. అప్పుడు నవాబు ఢిల్లీకి పిలిపించబడ్డాడు. ఆ సంకటకాలంలో జరిగిన సంఘటనలకు లక్నోతో ఏ సంబంధంలేదు. తనకు సహాయకుడిగాను, ప్రతినిధిగానూ ఆయన తన మేనల్లుడు-అల్లుడు అయిన సఫ్‌దర్‌జంగ్‌నుపెట్టి వెళ్లాడు. నాదిర్ ఢిల్లీని దోచుకున్నాడు, దారుణ హత్యాకాండను జరిపించాడు. అవన్నీ అలా జరిగేరోజుల్లో ఢిల్లీలోనే నవాబ్ బురహాన్-ఉల్-ముల్క్ మరణించాడు. ఆయన సోదరుని కుమారుడు షేర్‌జంగ్, నవాబ్ మరణానంతరం అయోధ్యప్రాంతపు గవర్నరుపదవికి నాదిర్‌షాహ్‌చేత సిఫారసు చేయించుకొన్నాడు. కాని బుర్‌హాన్ ఉల్-ముల్క్‌గారి విశ్వాసపాత్రులైన అధికారులలో ప్రముఖుడైన రాజా లక్ష్మీ నారాయణ్‌కు ఈ ఏర్పాటు నచ్చలేదు. అందువల్ల ఆయన నాదిర్‌షాహ్‌కు ఒక నివేదికను అందజేశాడు. 'నవాబ్ బుర్‌హానుల్ ముల్క్ పట్ల షేర్‌జంగ్ అసంతృప్తులై వుండేవారు. అందుకే ఆయన తనకుమార్తెను షేర్‌జంగ్‌కివ్వక సఫ్‌దర్ జంగ్‌కిచ్చి వివాహం చేశారు. సఫ్‌దర్‌జంగ్ ఆయనకు ప్రతినిధిగా వుంటూండే వాడు, ఇప్పుడుకూడా ఆయనతరపున ఇక్కడే వుంటున్నాడు. బురహాన్-ఉల్-ముల్క్ ధన కనక వస్తువాహనాల యజమాని ప్రభుత్వమేకనుకనూ ఇవి పారంపర్యంగా వచ్చేవికావు కనుకనూ ఎవరికివ్వాలనుకొంటే వారికివ్వవచ్చును. సఫ్‌దర్ జంగ్ గంభీరస్వభావంగలవాడు, దైవభక్తుడు, యోగ్యుడు, ప్రతిజ్ఞాపాలకుడు, సైనికులహృదయాలను చూరగొన్నవాడు అని తమకు నివేదిస్తున్నాను. ఇంతేగాక ప్రభువులవారికి బుర్‌హాన్-ఉల్-ముల్క్ రెండుకోట్లరూపాయలు సమర్పించు కొంటానని వాగ్దానం చేసివున్నారుగదా! ఆ ధనాన్ని చెల్లించేఏర్పాట్లు సఫ్‌దర్‌జంగ్ చేశాడు. తమ ఆజ్ఞ అవగానే ఆ సొమ్ము సమర్పించబడుతుంది. ఈ పై కారణాలను

దృష్టిలోపెట్టుకొని ప్రభువులవారు సఫ్‌దర్‌జంగ్‌నే గవర్నర్‌గా సిఫారసుచేస్తారని ఆశిస్తున్నాను.'

ఈ నివేదికనుచూడగానే నాదిర్‌షా గవర్నర్‌దుస్తులను ఖిల అత్-ను తిరిగి తీసేసుకొని తన క్రిందిఅధికారిని వందమంది గుర్రపురౌతులతో అయోధ్యలోవున్న సఫ్‌దర్‌జంగ్‌కు 'ఖిల అత్' ఇచ్చేందుకు పంపించాడు. ఈవిధంగా గవర్నర్‌దుస్తులు ధరించి సఫ్‌దర్‌జంగ్, నాదిర్‌షాకు రెండుకోట్లరూపాయలను బహుమానంగా సమర్పించి ఆ ప్రాంతాన్ని పాలించసాగాడు.

సఫ్‌దర్‌జంగ్ పూర్తిపేరు 'మీర్జా నకీమ్ అబుల్ మన్‌సూర్‌ఖాన్ సఫ్‌దర్‌జంగ్. ఆయనలో బుర్‌హాన్-ఉల్-ముల్క్‌లోని సాహసం, నిరాడంబరత, నిజాయితీ పట్టుదల మొదలైనగుణాలు లేకపోయినప్పటికీ ఆయన గొప్పదాత; సాహసోపేతుడు, దయాళువు, ప్రజల సుఖశాంతులను దృష్టిలోపెట్టుకొని పరిపాలించేవాడని అంగీకరించవలసివుంటుంది. పట్టణానికి మూడుమైళ్ళదూరంలో ఆయన జలాలాబాద్ కోటను నిర్మించాడు. మచ్చీభవన్‌లోని పాతబడిపోయిన పంచ్‌మహల్ కట్టడాలను షేఖ్ వంశీయులనుండి ఆయన హస్తగతం చేసుకొన్నాడు. వాటికిబదులు రెండు గ్రామాలలోని ఏడువందల ఎకరాలభూమిని షేఖ్ వంశీయులు వుండేందుకు, ఇవ్వడం జరిగింది. దీనివల్ల షేఖ్ వంశీయులకు అన్యాయం జరిగినప్పటికీ, లక్నో పెరుగుదలకి, జనాభివృద్ధికి దోహదమేర్పడింది. సఫ్‌దర్‌జంగ్ మచ్చీభవనాన్ని రెండోసారి నిర్మించి దాన్ని పటిష్ఠంగా రూపొందించాడు.

కాని సఫ్‌దర్‌జంగ్ అయిదేళ్లమాత్రం అక్కడ పదవిని నిర్వహించగలిగాడు. అయిదేళ్లు పూర్తిఅవగానే ఆయనకు ఢిల్లీనుంచి పిలుపువచ్చింది. రాజా నవల్‌రాయ్‌ని తన ప్రతినిధిగా లక్నోలో నియమించి ఆయన ఢిల్లీ వెళ్ళిపోయాడు. నవల్‌రాయ్ విద్యాసంపన్నుడు, కాలంవిలువ తెలిసినవాడు, కష్టపడి పనిచేసేవాడు, సాహసోపేతుడు, చాలా గొప్పపరిపాలకుడు అని పేరు తెచ్చుకొన్నాడు. అంతేగాక సఫ్‌దర్‌జంగ్‌లోగల ఉత్సాహం, ఔదార్యం ఆయనకు భగవత్‌ప్రసాదితాలుగా సంక్రమించాయి. మచ్చీభవనానికి ఎదుట నదిపైన వంతెన కట్టించాలని ఆయన సంకల్పించాడు. స్తంభాలు కట్టించేందుకు పునాదులనిమిత్తం నదిలో లోతైన నూతులవంటి గోతులు తవ్వించాడు. కాని ఇంకా స్తంభాలు కట్టించడం ప్రారంభమవకుండానే

తన యజమాని ఆదేశానుసారం 'ఎహమద్ ఖాన్ బంగశ్'ను ఎదుర్కోవడానికి ఆయన యుద్ధరంగంలోకి ఉరకవలసివచ్చింది. ఈ దాడికి ఆయన చాలా బలమైన సైన్యాన్ని తీసుకువెళ్లాడు. కాని దురదృష్టవశాన వీరస్వర్గం అలంకరించాడు. ఆ వంతెనపని మధ్యలోనే నిలిచిపోయింది.

ఎహమద్ ఖాన్ బంగశ్ ఆరోజుల్లో గొప్ప పరాక్రమవంతుడైన వ్యక్తి. అతణ్ణి ఎదిరించేందుకు బురహాన్-ఉల్-ముల్క్ వంటి వ్యక్తులు కాని ఇతరులు పనికిరారు. సఫ్దర్ జంగ్ అతడికి ప్రత్యర్థిగా తగడు. తత్ఫలితంగా ఎహమద్ ఖాన్, అతడితో పాటు అఫ్ఘన్ల శక్తి పెరిగిపోసాగింది. సఫ్దర్ జంగ్ ఎన్నో ప్రయత్నాలు చేశాడు. చివరికి ఢిల్లీ చక్రవర్తినికూడా ఎహమద్ ఖాన్ కి పోటీగా నిలబెట్టాడు. అయితేనేం, వాళ్ళంతా ఏకమైనప్పటికీ అతణ్ణి ఏంచేయలేకపోయారు. ఎహమద్ ఖాన్ సంజ్ఞతో 'హాఫీజ్ రహమత్ ఖాన్' అయోధ్యప్రాంతపు పట్టణాలలో, పెద్దపెద్ద పల్లెలలో దోపిడీలు హత్యాకాండలు జరిపించాడు. ఖైరాబాద్ హస్తగతమైంది. ఎహమద్ ఖాన్ బంగశ్ పుత్రుడు మహమూద్ ఖాన్ లక్నోను వశపరచుకొనేందుకు సైన్యసహితంగా స్వయంగా పురోగమించాడు.

క్రీ. శ. 1750 వ సంవత్సరంలో మహీహాబాద్ లో పఠానులు సొంతపోలీస్ చౌకీని ఏర్పరిచారు. క్రీ. శ. 1751 లో మహమూద్ ఖాన్ బంధువు ఒకాయన ఇరవై వేలమంది సైనికులతో లక్నోవైపు పురోగమించాడు. పట్టణంబయట తన సైనికశిబిరాన్ని ఏర్పాటుచేసి పోలీసుఅధికారిని నియమించి పట్టణంలోనికి పంపించాడు. కాని సఫ్దర్ జంగ్ మనుష్యులు అప్పటికే పట్టణాన్ని ఖాళీచేసి వెళ్ళిపోయారు. పఠానుల రాకనుగురించి పట్టణంలో మిగిలిన కొద్దిమందీ పారిపోయారు. పఠానుల పోలీసుఅధికారి అక్కడ అరాచకం వ్యాపింపజేశాడు.

ఆరోజులలో షేఖ్ ము ఇజ్ ఉద్దీన్, షేఖ్ వంశీయులందరిలోకీ చాలా పేరుప్రతిష్ఠలుగల పెద్దమనిషి. పట్టణం బయటకివెళ్ళి ఆయన అఫ్ఘన్ సేనానాయకుని కలుసుకొన్నాడు. అదేసమయాన ఎవరోవచ్చి 'లక్నోప్రజలు మీ పోలీస్అధికారిని అవమానపరుస్తున్నారు. ఎవరూకూడ ఆయన ఆజ్ఞలను పాటించడంలేదు' అని నేరారోపణచేస్తూ చెప్పారు. 'అలా ప్రవర్తించే దుస్సాహసం ఎవరికుంది? దుండగులను దండించేందుకు నేను వెళ్లుతున్నాను' అని షేఖ్ ము ఇజ్ ఉద్దీన్ పట్టణానికి

తిరిగి వెళ్ళిపోయాడు. ఆయన సోదరులను, ఆశ్రితులను సమావేశపరచి 'పఠానుల మాటలకీ చేతలకీ సామ్యంవుండదు. మనం నవాబ్ సఫ్దర్‌జంగ్‌ని బలపరుస్తూ పఠాన్ల ముఠాని ఎదుర్కొని వాళ్లను ఇక్కడినుంచి తరిమివేయడం మంచిది' అని ఉద్బోధించాడు. అనంతరం అతడు తన ఇంట్లోని నగలుఅమ్మి ఆడబ్బుతో సైన్యాన్ని ప్రోగుచేశాడు; షేఖ్ వంశస్థులను వెంటపెట్టుకొని సైన్యంతో పోలీస్ అధికారిని ఎదుర్కొన్నాడు. ఆ పోలీస్‌అధికారి ప్రాణాలని గుప్పెట్లోపెట్టుకొని పారిపోయాడు. షేఖ్‌సాహెబ్ ఒక మొగలాయీవ్యక్తికి ఆస్థానవస్త్రాలు ధరింపచేసి తన ఇంట్లో అట్టేపెట్టుకొని 'సఫ్దర్‌జంగ్ తనతరఫున ఒక మొగలాయీని పోలీస్‌అధికారిగా పంపించాడ'ని చాటింపు వేయించాడు. అంతేకాక ఆయన 'అలీ' అనే ఆకుపచ్చ జండాను ప్రతిష్ఠాపించాడు. ప్రజలంతా ఆ జండాక్రిందకువచ్చి చేరుకోసాగారు. (ఈ వార్తవిని పఠానులు దాడిజరిపారు. షేఖ్‌వంశస్థులు ప్రాణాలకుతెగించి తమ పూర్వ పరాక్రమాన్ని ప్రదర్శిస్తూ పఠానులను వీరోచితంగా ఎదుర్కొన్నారు. పఠానులు వారి వీరవిహారాన్ని తట్టుకోలేక పదిహేనువేలమంది సైనికులతో పారి పోయారు. షేఖ్‌వంశీయులు ఈ అవకాశాన్ని సద్వినియోగపరచుకుంటూ అయోధ్య లోని పఠానులందరినీ వెళ్లగొట్టించారు.)

రెండేళ్ళతరవాత ఎహ్‌మద్‌ఖాన్ బంగశ్‌తో సంధి జరిగింది. క్రీ. శ. 1753 లో నవాబ్ సఫ్దజర్‌జంగ్ తిరిగి లక్నోవచ్చి 'మెహదీ ఘాట్'వద్ద కొన్నాళ్లు నివసించాడు. తనకోసం ఒక ప్రత్యేకభవంతిని ఆయన నిర్మించుకొని దాన్ని అలంకరింపచేశాడు. సైన్యాన్ని సంస్కరించడంలో ఆయన నిమగ్నుడయ్యాడు. కాని ఆయన గడువు తీరిపోయేసమయం ఆసన్నమైంది. ఆ సంవత్సరమే సుల్తాన్‌పూర్‌కు సమీపంలో వున్న పాపడ్ ఘాట్‌లోని శిబిరంలో ఆయన నిర్యాణం చెందేడు. ముందు శవాన్ని ఫైజాబాద్ తీసుకువెళ్ళి సమాధి చేశారు; ఆతరువాత కొద్దిరోజులకు ఆయన అస్థి కలను ఢిల్లీ తీసుకువెళ్ళి సమాధి చేశారు. దానిమీద ఎంతో చక్కనిభవనాన్ని కట్టారు. దేశదేశాలయాత్రికులు నేడుకూడా ఆ సమాధిని ఎంతో ఆసక్తితో సందర్శిస్తుంటారు.

# 4

సఫ్దర్‌జంగ్ మన్సూర్ ఆలీఖాన్ నిర్యాణానంతరం క్రీ. శ. 1753 లో ఆయన పుత్రుడు నవాబ్ షుజాఉద్దౌలా సింహాసనాధిష్ఠితుడయ్యాడు. ఆయన స్థితిగతులను గురించి ఇంతకుముందు అధ్యాయాలలో వివరించడం జరిగింది. ఆయన చపల చిత్తుడే అయినప్పటికీ పరాక్రమవంతుడైన పరిపాలకుడని చెప్పకతప్పదు. కాని దురదృష్టవశాత్తూ ఆయన పరిపాలనాకాలంలో గొప్పగొప్ప కల్లోలాలు, పోరాటాలు, తిరుగుబాట్లు జరిగాయి. ప్రపంచంలో పరాక్రమవంతమైన రెండుజాతుల అదృష్ట నిర్ణయం ఆయన కళ్ళముందే జరిగింది. భయంకరమైన మొదటి పానీపత్ యుద్ధం జరిగింది; ఒకవైపు ఎహ్మద్ షాహ్ దుర్రానీ, షుజాఉద్దౌలా, నజీబ్ ఉద్దౌలాలతో పాటు రుహేల్‌ఖండ్‌కు చెందిన బలశాలులైన సైనికులూ, మరోవైపు మరాఠీల మిడుతలదండువంటి సిపాయిలు యుద్ధంలో పాల్గొన్నారు. 1761 లో జరిగిన ఈ యుద్ధం ఒకే ఒక్కరోజులో - భారతదేశం మహమ్మదీయులది అయినా కాకున్నా మరాఠీలదిమాత్రం కాబోదు అని తీర్పుచెప్పింది. అనంతరం ఆంగ్లేయుల సైన్యానికీ షుజాఉద్దౌలా సైన్యానికీమధ్య బక్సర్‌లో ఘోరయుద్ధం జరిగింది. పానీపత్ యుద్ధం జరిగిన నాలుగేళ్ళతరువాత క్రీ. శ. 1763 లో 24 గంటల్లో—ఈ యుద్ధం ఇకనుంచీ భారతదేశం ఆంగ్లేయులదేననీ, ముసల్మానులది కాదనీ తీర్పు చెప్పింది.

ఈ యుద్ధాలు జరిగేముందు షుజాఉద్దౌలా లక్నోలోనే వుండినప్పటికీ గొప్ప గొప్ప దండయాత్రలలోనూ - రాజకీయాలలోనూ నిమగ్నుడై వుండడంవల్లనూ, సైనికులకు కావలసిన ఆయుధనిర్మాణం మున్నగుకార్యాలలో సమయాన్ని వెచ్చిస్తూ వుండడంవల్లనూ, లక్నోపట్టణాన్ని అభివృద్ధిపరచేందుకుకాని, దాన్ని అందంగా రూపొందించేందుకు కాని ఆయనకి బొత్తిగా తీరిక చిక్కలేదు. ఆయన కోటలు కట్టించాడు, దృఢమైనభవంతులను నిర్మించాడు. సైనికసామగ్రినీ, యుద్ధాలకు అవసరమైన ఆయుధాలనీ తయారుచేయించాడు. కాని తనఇంటిని దిద్దుకోడానికిగాని

తన పట్టణాన్ని అందంగా అలరారేట్లు చేసేందుకుగాని ఆయనకు అవకాశం లభించ లేదు. బక్సర్ యుద్ధానంతరం ఆయన ఫైజాబాద్ వెళ్ళి స్థిరపడిపోయారు. ఇందు వల్ల లక్నో ఆయనకృపకు దూరమైపోయింది. క్రీ. శ. 1775 లో ఆయన దివం గతుడైనాడు. నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా ఆయన వారసుడయ్యాడు.

అయోధ్య ఆస్థానపు పరిపాలనాశక్తి క్షీణించిపోయి లక్నో సౌందర్యం అభి వృద్ధి చెందుతున్నరోజులలో ఆసఫ్ ఉద్దౌలా రాజ్యసింహాసనాన్ని అధిష్టించడం, అధిష్టించిన వెనువెంటనే తల్లిమీద కోపగించుకొని లక్నో దారిపట్టడం సంభ వించింది. బక్సర్ యుద్ధంలో గెలిచాక, అవధ్ ఆస్థానవ్యవహారాలలో జోక్యం కలుగచేసుకొనే అధికారాన్ని ఆంగ్లేయులు హస్తగతం చేసుకొన్నారు. దీనివల్ల ఇక్కడ సైనికాభివృద్ధి కుంటుబడింది. శక్తిని పుంజుకొని మరోసారి ఆంగ్ల సైన్యాన్ని ఎదుర్కోలేకుండా చేసేందుకు అయోధ్యఆధిపత్యంపై అహర్నిశం ఆంగ్లే యుల కాపలా వుంటూండేది. అయినప్పటికీ ఫైజాబాద్‌లో తనప్రాణంపోయే తుది గడియవరకూ షుజాఉద్దౌలా సైన్యాన్ని సంస్కరించడంలోనే నిమగ్నుడయ్యాడు. తనశక్తిని పెంపొందించుకొనేందుకు శక్తివంచనలేకుండా సతతం ప్రయత్నం చేసేడు. 'త్వరగా మందు దట్టించడాన్నీ, పేల్చడాన్నీ దృష్టిలో పెట్టుకొంటే షుజా ఉద్దౌలా సైనికుల తుపాకులముందు ఆంగ్లేయులతుపాకులు దిగదుడుపే' అని ఆకాలపు స్థితిగతులను స్వయంగాచూసిన మున్షీ ఫైజ్‌బక్ష్ తాను రచించిన **'తారీఖ్-ఏ-ఫరహ్ బక్ష్'** ఇతిహాసగ్రంథంలో ఉల్లేఖించాడు.

కాని ఆసఫ్ ఉద్దౌలా కాలంలో ఇవన్నీ మరుగున పడిపోయాయి. ఆంగ్లేయులు చాలా చాకచక్యంతో అతడి పరిపాలనావ్యవస్థలో జోక్యంచేసుకొనేఅధికారాన్ని పొందారు. ఆసఫ్ ఉద్దౌలా సైనికసంస్కరణ వ్యవహారాలను నిశ్చింతగా తమకు అప్పచెప్పి, ఇతర విలాసవినోదాలలో సరదాగా గడిపేందుకు ఒప్పుకొనేట్లుగా ఆంగ్లేయులు చాతుర్యంతో అతణ్ణి వలలో వేసుకొన్నారు. సహజంగానే ఆసఫ్ ఉద్దౌలాకు సైనికవ్యవహారాలపట్ల అంతగా అభిరుచి వుండేదికాదు. భోగవిలాసా లకూ, తలకుమించిన ఖర్చులకి చాలా డబ్బు కావలసివుండేది. అందువల్ల సైనిక ఖర్చుల్ని చాలావరకు తగ్గించేయడం ఆయనకి ఎంతో అవసరంగా కనిపించింది. ఇందువల్ల కొద్దిసైన్యాన్నిమాత్రమే అట్టేపెట్టుకొని, మిగతా సైనికులనందరినీ

ఉద్యోగాలలోంచి తొలగించేశాడు. భోగవిలాసాలలో నిమగ్నుడై పోయాడు. తన మిత్రుల సలహాలనే పాటిస్తూ, ఇంకెవరినీ లెక్కచేయకుండా ప్రవర్తించేవాడు.

ఈ స్నేహానికి ప్రతిఫలంగా అనధికారమిత్రులైన ఆంగ్లేయులు రూహెల్ ఖండ్‌పై ఆయన అధికారం చెలాయించేలా చేశారు. ఆయన తనతల్లి బహూబేగమ్ సాహెబాను చాలా బాధించి డబ్బు గుంజుకునేందుకు ఆంగ్లేయులసహాయాన్ని అర్థించాడు. ఆయనకీ సందర్భంలో వాళ్ళ అండదండలు బాగా లభ్యమయాయి. ఇలాంటివి ఎన్నో జరిగిపోతున్నప్పటికీ పరిపాలనావ్యవస్థలో బయటివాళ్ళజోక్యం ముడిపడివుందనేవిషయం ఆసఫ్ ఉద్దౌలా కాని, లక్నోప్రజలు కాని అంత ఎక్కువగా పట్టించుకోలేదనే చెప్పవచ్చు. ఇందుకు ముఖ్యంగా, ఆసఫ్ ఉద్దౌలాలోని ఔదార్యం, విలాసప్రియత్వం కారణాలై వుండచ్చు. 'యథా రాజా తథా ప్రజా' అనే సూక్తి నిజంచేస్తూ ప్రజలుకూడా విలాసప్రియులుగా మారారు. ఎవరిమట్టుకు వారు తమతమవిలాసాలలో నిమగ్నులై పోయి భవిష్యత్తునుగురించి, దాని పర్యవసానాన్నిగురించి ఆలోచించనే లేదు.

ఎక్కడా, ఏ ఆస్థానంలోనూ లేనట్టి 'తళుకుబెళుకులు' లక్నో ఆస్థానంలో ప్రవేశించడానికి కారణం, ఇంకెక్కడా లభ్యంకాని భోగవిలాసాలకు ఉపయుక్తమయ్యే అమూల్య - అసాధారణసామగ్రిని లక్నో ఆస్థానం సాధించుకోగలగడమే. భారతదేశంలోనేకాదు బహుశః ప్రపంచంలో మరేపట్టణం, సంపన్నతలో, ఔన్నత్యంలో ఆనాటి లక్నోకు సమఉజ్జీ కాలేదుఅనడం అతిశయోక్తికాదు. ఆనాటి లక్నో పట్టణ శోభ అద్వితీయం అనక తప్పదు. షుజా ఉద్దౌలా, సైన్యంకోసం యుద్ధాలకోసం విపరీతంగా కర్చుపెట్తే ఆసఫ్ ఉద్దౌలా విలాసాలకోసం, నగరాన్ని రమణీయంగా రూపొందించడంకోసం విచ్చలవిడిగా కర్చుపెడ్తూండేవాడు. అంతేకాదు, ప్రపంచంలోని వైభవాన్నంతా కొద్దిరోజుల్లోనే పోగుచేసి లక్నో ఆస్థానానికి సంక్రమింపచేశాడు. హైదరాబాద్ నిజామ్, టిప్పుసుల్తాన్, లేక మరో గొప్ప నవాబ్ ఎవరైతేనేం ఎంత గొప్పశాసకుని ఆస్థానంకూడా తన ఆస్థానంకంటే భోగవిలాసాలవిషయంలో మించకూడదనే ఆకాంక్ష ఆయనలో ప్రబలంగా వుండేది.

ఆయనపుత్రుడు వజీర్ అలీ వివాహసందర్భంలో బరాత్ (పెండ్లికొడుకు తరఫువారి ఊరేగింపు) ఆడంబరం, చరిత్రలో ఎప్పుడూ కనీ విననంతగొప్పగా

ప్రఖ్యాతిగాంచింది. బరాత్ ఊరేగింపులో పన్నెండువందల ఏనుగులనెక్కి రాజాధి రాజులు, నవాబులు, యువరాజులు, రాణులు, యువరాణులు, మంత్రులు, గవర్నర్లు మొదలగు ప్రముఖులు పాల్గొన్నారు. వరుని రాజోచితమధుపర్కాలలో ఇరవై లక్షల రూపాయలవిలువచేసే రత్నాలు పొదగబడ్డాయి. గొప్పగా అలంకృతమైన రెండు మంటపాలు నృత్యగాన సభలకోసం నిర్మించబడ్డాయి. అరవై అడుగుల ఎత్తు, పన్నెండువందల అడుగులపొడవు, అరవై అడుగులవెడల్పుగల ఆ మంటపాలు విలువైన వస్త్రాలతో ఎంతో అందంగా అలంకరింపబడ్డాయి. ఈ రెండుమంటపాల నిర్మాణానికి పదిలక్షలరూపాయలు కర్చుఅయింది.

నదీతీరంలో మచ్ఛీభవన్‌కు పశ్చిమదిశలో ఆయన దౌలత్ ఖానా, రోమన్ దర్వాజా ఇమామ్ బాడాలను ఆయన నిర్మింపచేశారు. క్రీ. శ. 1784 లో అవధ్ ప్రాంతం ఘోరమైన క్షామాన్ని ఎదుర్కోవలసివచ్చింది. పట్నంలోని గౌరవంగాబ్రతికే పెద్ద మనుష్యులు సహితం ఆకలిమంటలకు గురి అవసాగారు. ఆ దుర్భిక్షపురోజులలో కరువుబాధితులకు పని కల్పించడంకోసం ఇమామ్ బాడ నిర్మాణం జరగాలని నిర్ణయించబడింది. గౌరవంగాబ్రతికిన పెద్దమనుష్యులు కరువుగుప్పిటిలో చిక్కుకొని కూలీపనికి సిద్ధపడ్డారు. వారి గౌరవమర్యాదలను దృష్టిలోపెట్టుకొని వారికి రాత్రులు కూలిపనిచేసే అవకాశాన్ని ఆసఫ్ ఉద్దౌలా కలుగచేసేడు. ఈ క్రొత్తఏర్పాటు ప్రకారం కూలీజనం పగలు అక్కడ పనిచేస్తుండేవాళ్లు, కరువుబాధితులైన గౌరవనీయులు రాత్రిళ్లువచ్చి కాగడాలవెలుతురులో కూలీపని చేస్తూండేవాళ్లు. ఈ కట్టడాన్ని ఎంతో భక్తియుక్తులతో నవాబు నిర్మింపచేయదలచుకొన్నాడని గ్రహించినకూలీలు, కూలీలుగామారిన కులీనులు చాలా శ్రద్ధతోను, ఉత్సాహంతోను తమవిధుల్ని నిర్వర్తించారు. ఫలితంగా సుందరమైనభవనం తయారైంది. అద్భుతమైన ఇమామ్ బాడాగా ఇది ఎంచబడింది. దీని నమూనాపటాన్ని తయారుచేసేందుకు నవాబ్‌గారి పిలుపువిని ఎందరో ప్రసిద్ధశిల్పులు అక్కడికివచ్చారు. ఒకరినిమించి ఒకరు తమ ప్రతిభలను వినియోగించి పటాలను తయారుచేసేరు. కాని 'కిఫాయత్ ఉల్లాహ్' అనే సాటిలేని మేటిశిల్పి తయారుచేసినపటం ఎన్నుకోబడింది. దానిలో సూచించిన ప్రకారం కట్టడంనిర్మాణం ప్రారంభమైంది. పొడుగు 167 అడుగులు. వెడల్పు 53 అడుగులుగల ఆ భవనం ప్రత్యేకమైన ఇటుకలతోను, మేలురకమైన సున్నంతోను కట్టబడింది. ఆ భవనంలో ఎక్కడాకూడ కలప ఉపయోగింపబడకపోవడం

ఒక విశేషం. ఆ కట్టడానికీ మొగలాయిచక్రవర్తుల పాలరాతికట్టడాలకీ ఏ పోలికా లేదు. లక్నోలో తగినంత పాలరాయి దొరక్కపోవడమే బహుశః ఇందుకు కారణమై వుండచ్చు. కాని ఆ ఇమామ్ బాడాను, అసఫ్ ఉద్దౌలాగారి ఇతరకట్టడాలనీ దర్శించేవారికి వాటిలో ఒకరకమైన నూతనసౌందర్యం, ఒక గొప్పతనం కనిపిస్తాయి. ఇమామ్ బాడా అంతస్థుల కప్పు ఇనుపచట్రాలువేసి తయారుచేయబడింది. ఇంత గొప్ప అంతస్థులకప్పు ప్రపంచంలో ఇంకెక్కడా లేదు. ఈ కారణాలవల్ల అది ప్రపంచంలోని ఆశ్చర్యజనకమైన శిల్పంగా గణనీయమైంది.

అసఫ్ ఉద్దౌలా కట్టడాలపై ఐరోపీయభవనాలప్రభావం కొంచెంకూడా లేదు. అవి అచ్చమైన ఆసియా కట్టడాలే. సహజమైనశోభతో బాహ్యాడంబరాలేం లేకుండా అలరారినవి. నవాబ్ అసఫ్ ఉద్దౌలా తదనంతరం ఆ కట్టడాలని సంరక్షించే నాథుడంటూ లేకపోయాడు. విప్లవానంతరం ఆంగ్లేయులు వాటిని వశపరచుకొన్నారు. నదివైపునున్న భవనాలనుతప్ప మిగతావాటిని పడకొట్టించేశారు. మూడు వైపుల్నీ మైదానంగా రూపొందించి, 'ఇమామ్ బాడా'ను కోటగాను, 'రోమన్ దర్వాజా'ను దాని గేటుగాను వాడుకొనేవారు. ఆరోజులలో ఇమామ్ బాడాలో ఆంగ్లేయులు నివసిస్తూండేవారు, దాని పెద్దహాలులో అస్త్రాగారం వుండేది. దాని గచ్చు నేలమీద పెద్దపెద్ద ఫిరంగిశకటాలు తిరుగుతూండేవి. కాని ఎప్పుడూ నేల గోతులు పడలేదు. లోపలి గోడలకుకాని, బయటి గోడలకుగాని పెళ్లలు ఊడలేదు. ఆమధ్య ఆంగ్లేయులు ఇమామ్ బాడాను ముసల్మానులకు తిరిగి స్వాధీనపరిచేశారు. దాని మసీదులో ఒక మతాచార్యుడు నవాజ్ చేస్తుంటాడు. ఇమామ్ బాడాలో రంగు కాగితాలతోరణాలు వుంటూంటాయి.

నవాబ్ అసఫ్ ఉద్దౌలా కట్టడాలుకట్టించి రమారమి ఒకటిన్నరశతాబ్దం గడిచిపోయినప్పటికీ నేటికికూడా వాని తళుకుబెళుకులు చెక్కుచెదరకుండా ఆస్థలంలో వున్నదున్నట్లుగా వుండడాన్నిబట్టి వాని గట్టితనాన్ని మనం అంచనా వేసుకోవచ్చు. ఒక్క ఇటుకైనా కదలలేదు, ఒక్క సున్నంపెళ్లయినా ఊడలేదు. సరిగ్గా దీనికి విరుద్ధంగా అయోధ్యప్రాంతపు ఇతరచక్రవర్తులు కోట్లకొద్దీ రూపాయలు ఖర్చుపెట్టి అనంతరం నిర్మించిన కట్టడాలలో మన దేశీయవాస్తుకళ రూపురేఖలు అసలు లేవు అంతేకాకుండా అవి బలహీనమైనవిగాకూడా కనిపిస్తాయి. మాటిమాటికీ వాటిని

మరమ్మత్తుచేయిస్తూ వుండివుండకపోతే అవి ఈపాటికి ఎప్పుడో కాలగర్భంలో కలిసిపోయివుండేవి.

ఆసఫ్ ఉద్దౌలా ఇమామ్ బాడా మస్జీదుభవనాల దగ్గరవుండే తనభవనం 'దౌలత్ ఖానా'లో వుంటూండేవాడు. పట్నంబయట నదికి ఆవల జనకోలాహలానికిదూరంగా ప్రశాంతంగా విలాసాలలో మునిగి తేలుతూ జీవించేందుకు 'బిబియాపూర్-మహల్'ను నిర్మించాడు. వాహ్యాళికి, వేటలకు వెళ్ళేప్పుడు తరచు ఈ మహల్‌లోనే బస చేస్తూవుండేవాడు. ఇదేవిధంగా 'చన్‌హట్'లో ఆరోగ్యకరమైన, ఆనంద ధాయకమైన గృహాన్నీ, చార్‌బాగ్, ఐష్‌బాగ్‌లలో అందాకారంలోవున్న కట్టడాలను నిర్మింపచేశాడు. ఆకాలంలోనే యాహియాగంజ్‌లోను, దాని చుట్టుప్రక్కలను అశ్వశాలలు తయారయ్యాయి. ఆసఫ్ ఉద్దౌలా పుత్రుడు వజీర్ అలీఖాన్ నివసించే ప్రాంతంలో 'వజీర్ గంజ్' అనే క్రొత్తవీధి ఏర్పడింది. అతడి స్మృతిచిహ్నంగా ఆవీధి ప్రసిద్ధిచెందింది.

ఆకాలంలో పాలకులు అధికారులు స్థిరంగా లక్నోలో నివసించడం గమనించి జనులదృష్టి మళ్ళీ లక్నోవైపు మళ్ళింది. షుజా ఉద్దౌలా కాలంలో ఫైజాబాద్‌లో స్థిరపడిపోయిన ఎందరోవ్యక్తులు ఫైజాబాద్‌ను వదిలేసి లక్నోవచ్చి స్థిరనివాసా లేర్పరచుకోసాగారు. మరోప్రక్కన ఢిల్లీ పౌరులుకూడా తమ స్వస్థలాన్ని విడిచి పెట్టేసి తిన్నగా లక్నో వస్తూండేవారు, మళ్ళీ తిరిగి వెళ్ళేవారుకాదు. ఇలా వచ్చి చేరిన జనం ఎక్కడ స్థలం కనిపిస్తే అక్కడ తమతమ అంతస్తులకుతగినట్లు ఇళ్లు కట్టుకున్నారు. ఫలితంగా వందలకొద్దీ క్రొత్తవీథులు ఏర్పడ్డాయి.

అమానీగంజ్, ఫతేహ్‌గంజ్, రకాబ్‌గంజ్, నర్‌వాస్, దౌలత్‌గంజ్, బేగమ్ గంజ్, [1]ఖాన్ సామాంకా అహాతా, టికెట్‌గంజ్, [2]టికెట్‌రాయ్ కా బజార్, తరమ్‌నీ గంజ్, టికరీ, హసీన్ ఉద్దీన్ ఖాన్ కీ ఛావనీ, హసన్ గంజ్ బావలీ, భవానీగంజ్, బాలక్‌గంజ్, కశ్మీరీ ముహల్లా, సూరత్ సింహ్ కా అహాతా, నవాబ్

1. ఖాన్ సామాంకా అహాతాను నవాబ్ ఆసఫ్ ఉద్దౌలాగారి ఒక పోలీసుఅధికారి కట్టించి ప్రారంభోత్సవానికి నవాబ్‌గారిని ఆహ్వానించాడు.

2. టికెట్ రాయ్ కా బజార్ ఆనాటి ప్రధానమంత్రి మహారాజా టికెట్ రాయ్‌గారి పేర నిర్మితమైంది.

గంజ్, తహసీన్‌గంజ్, ఖుదాగంజ్, [3]నగరియా, అంబర్‌గంజ్, మహబూబ్ గంజ్, తోప్ దర్వాజా, [4]ఖయాలీగంజ్, ఝూవూమల్ కా పుల్ మున్నగునవన్నీ ఆసఫ్ ఉద్దౌలా పరిపాలనాకాలంలో ఏర్పడ్డాయి. హసన్ రాజాఖాన్ ఆ రోజుల్లోనే నదికి అవతలిగట్టున హసన్‌గంజ్‌ను నిర్మించాడు.

నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా విశాలహృదయంగల వ్యక్తి అని అన్నిప్రాంతాలలోను ప్రసిద్ధికెక్కాడు. ఆయన దానశీలతనుగురించి అనేకపట్టణాలలో, సుదూరప్రాంతాలలో సహితం చెప్పుకొంటూండేవారు. ప్రజలు సర్వకాలసర్వావస్థలలోను ఆయన పట్ల ప్రేమాభిమానాలు చూపుతూండేవారు, ఆయన వ్యక్తిగత బలహీనతలన్నీ ఆయన దానగుణ-కవచంలో దాక్కొని మరుగునపడిపోతూండేవి. ఆయన భోగ విలాసప్రియుడే, కాని ప్రజలహృదయాలలో ఆయన సాధుస్వభావంగల నిస్వార్థ పరిపాలకుడుగా స్థానం పొందగలిగాడు. నేటికికూడా హిందూ వ్యాపారస్థులు ఉదయం లేవగానే భక్తిపూర్వకంగా 'యా ఆసఫ్ ఉద్దౌలా వలీ' అంటూ ఆయనను స్మరించుకుంటూంటారు.

ఆ రోజులలోనే 'జనరల్ క్లాడ్ మార్టిన్' అనే పేరుగల ఒక గొప్ప ధనిక ఫ్రెంచివ్యాపారి లక్నోవచ్చి చేరుకొన్నాడు. అతడు భవంతిపటాన్ని తయారుచేసి ఆసఫ్ ఉద్దౌలావారివద్దకు తీసుకువెళ్లాడు. ఆ పటం నవాబ్‌గారికి ఎంతో నచ్చింది. పదిలక్షల స్వర్ణముద్రికలు ఇచ్చేందుకుకూడా ఆయన సిద్ధపడ్డాడు. కాని ఖజానా ఇచ్చేలోగానే నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా స్వర్గస్థుడయ్యాడు; అంతేకాదు, భవననిర్మాణం పూర్తికాకుండానే మార్టిన్‌కూడా మరణించాడు. మార్టిన్ చాలా ధనవంతుడు. ఆయనకు వారసులు ఎవరూలేరు. ఆయన తనశవాన్ని, పూర్తిగా కట్టబడని ఆ భవనం లోనే సమాధి చేయవలసినదనీ, ఆ భవనాన్ని అయోధ్యపాలకులు జప్తుచేయకూడదనీ, ప్రజలు సందర్శించేందుకు దాన్ని అలాగే వుంచివేయవలసినదనీ వీలునామా వ్రాశాడు. ఆయన ఆ భవనానికి 'కాంస్టెన్షియా' అని పేరుపెట్టేడు. కాని 'మార్టిన్ సాహబ్-కీ-కోఠీ' అనే పేరే ఆ భవనానికి ఉండిపోయింది. వీలునామాప్రకారం

---

3. నవాబ్ ఆసఫ్ ఉద్దౌలాగారి తల్లి బహూబేగమ్ సాహబా, నదికి అవతలిగట్టునవున్న అలీగంజ్‌కి పునాదివేసినరోజునే నగరియాకి పునాది వేసింది.

4. ఖయాలీ గంజ్, ఝూవూమల్ కా పుల్ - ఈ రెండింటిని కట్టించిన 'రాజా ఝూవూమల్' అవధ్‌రాజ్యపు ఆర్థికమంత్రి.

'మార్టిన్' ఆ భవనప్రాంగణంలోనే సమాధి చేయబడ్డాడు. అది నేడు పాఠశాల భవనంగా రూపొంది చాలామంది విద్యార్థులకు విద్య, వసతి, సౌకర్యాలను చేకూరుస్తోంది.

ఈ పాఠశాల విద్యార్థుల కివ్వబడే వుపకారవేతనాలు జాతి మత విచక్షణ లేకుండా హిందూ, ముస్లిం, క్రైస్తవుల మతస్థులందరికీ ఉపయోగపడాలనే సదుద్దేశ్యంతో 'మార్టిన్' వీలునామా వ్రాశాడు. కాని ప్రస్తుతం ఈ పాఠశాల, స్కాలర్‌షిప్‌లు ఐరోపీయ విద్యార్థులకుమాత్రమే పరిమితమైవున్నాయి. గదర్ విప్లవసమయంలో కొందరు మూర్ఖులైన ఆవేశపరులు మార్టిన్‌గారి గోరీని త్రవ్వి ఆయన ఎముకలని పైకితీసి, వాటిని ఎక్కడపడితే అక్కడ అవమానకరంగా వెదజల్లేశారు. ఆంగ్లేయులకు, వారి అధిపత్యం అమలులోకివచ్చాక మార్టిన్‌గారి శల్యాలలో ఒకటి అదృష్టవశాత్తూ దొరికింది; దాన్ని తిరిగి పాతిపెట్టారు. కాని ఈ తిరుగుబాటుదారుల పేరుతో కొందరుమూర్ఖులు జరిపిన ఈ దుష్టచర్యకు భారతీయులందరూ ఎలా బాధ్యులౌతారు? బహుశః పై సంఘటనవల్లనే ఆంగ్లప్రభుత్వం తన హయాంలో స్కాలర్‌షిప్‌లమాట అలావుంచి భారతీయవిద్యార్థులకు అక్కడ ప్రవేశంకూడా లేకుండా చేసింది.)

క్రీ. శ. 1798 లో నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా మరణించాడు. ఆయనపుత్రుడు నవాబ్ వజీర్ అలీఖాన్ సింహాసనారూఢుడయ్యాడు. ఆయన వివాహవిశేషాలను ఇంతకుముందే వివరించడం జరిగింది. కాని ఆయన, అశేషజనం అసహ్యించుకునే తెలివితక్కువపనులు సింహాసనం ఎక్కిన నాలుగునెలలు తిరగకుండానే జరిపేశాడు. ఆయనతల్లి బహూబేగమ్ సాహెబా, నవాబ్ వజీర్ అలీఖాన్‌కంటే తన సవతికొడుకు యామీన్ ఉద్దౌలా నవాబ్ సఆదత్ అలీఖాన్ అంటే ఎక్కువ ఇష్టపడేది. అంతేకాకుండా వజీర్ అలీఖాన్, ఆసఫ్ ఉద్దౌలాకి పుట్టనేలేదనీ, ఆసఫ్ ఉద్దౌలా పుట్టుకతోనే నపుంసకుడనీ ప్రచారం జరిగింది.

నవాబ్ సఆదత్ అలీఖాన్, ఆసఫ్ ఉద్దౌలాతోవున్న విరోధంవల్ల లక్నో ప్రాంతానికి చాలాదూరాన వుండేవాడు. కొంతకాలం కలకత్తాలోగడిపి ఆతరువాత కాశీలో స్థిరపడ్డాడు. వజీర్ అలీఖాన్‌నుగురించి ఈ ప్రచారం ముమ్మరమవడంతో సఆదత్ అలీఖాన్ కాశీనుంచి రాజప్రతినిధుల అభ్యర్థనను మన్నించి లక్నోవచ్చి చేరు

కున్నాడు. బిబియాపూర్ భవంతిలో గవర్నర్ జనరల్, లక్నోలోని అధికారులనీ, ఉన్నతోద్యోగులనీ, నవాబుగారి కుటుంబసభ్యులనీ సమావేశపరచి వారందరి అభిప్రాయాలను తెలుసుకొని వజీర్ అలీఖాన్‌ను పదవినుంచి తొలగించాడు; సఆదత్ అలీఖాన్‌ను సింహాసనమెక్కించాడు; అంతేకాక వజీర్ అలీఖాన్‌ను ఖైదుచేయించి బనారస్ పంపించాడు. అక్కడ వజీర్ అలీఖాన్ క్రోధావేశంతో మిస్టర్ చరీని హత్య చేశాడు. ఈ అపరాధానికి ఏడేళ్ళశిక్ష అనుభవించేందుకు ఆయన 'చినార్ గఢ్'కు పంపించబడ్డాడు. ఆయన యాతనలగాథ చాలా పెద్దదే, కాని దానిని ఈ చిన్న గ్రంథంలో వివరించడం సాధ్యమయ్యే పనికాదు. చివరికి వజీర్ అలీఖాన్ చినార్‌గఢ్ ప్రవాసంలోనే మరణించాడు.

## 5

నవాబ్ సఆదత్ అలీఖాన్ క్రీ. శ. 1798 లో సింహాసనం అధిష్ఠించగానే సగం రాజ్యాన్ని ఆంగ్లేయులకు బహూకరించాడు. ఆయన రాజ్యంమీద ఆశవదలుకొని కాశీలో వుండేరోజులలో నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా మరణవార్త, వజీర్ అలీఖాన్ రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకొన్నాడనే వార్త విని ఇంక రాజ్యంపై కొద్దిగా మిగిలిన ఆశకూడా నీళ్లు కారిపోయింది. ఆయన నిరాశతో సతమతమవుతూన్న సమయంలో ఒక ఆంగ్లేయఅధికారివచ్చి 'నవాబ్‌సాహబ్, మీకు అయోధ్యపై అధిపత్యంలభిస్తే ఆంగ్లప్రభుత్వానికి ఏం బహూకరిస్తారు?' అని ప్రశ్నించాడు. చేతికందదని అనుకొన్నవస్తువు, అది ఎంతమాత్రం దొరకదనుకొనే నమ్మకంతో వున్న వ్యక్తికి దానివిలువేం తెలుస్తుంది? అందువల్ల ఆయన వెంటనే 'ఆంగ్లేయులకు అయోధ్యలో అర్ధరాజ్యం బహూకరిస్తాను' అన్నాడు. ఈ వాగ్దానం విన్న వెంటనే 'చాలామంచిది, మీరు నిశ్చింతగా వుండండి. మీరే లక్నో పరిపాలకులుగా ఎన్నుకోబడ్డారనే శుభవార్త తెలియచేసేందుకు నాకెంతో సంతోషంగావుంది' అన్నాడు ఆ ఆంగ్లేయ అధికారి. అకస్మాత్తుగా ఇంతగొప్ప సంతోషవార్తవిని

ఆయన చాలా ఆనందించాడని వేరే చెప్పక్కర్లేదు. కాని తనవాగ్దానం జ్ఞాపకం రాగానే స్తబ్దుడైపోయాడు. రాజ్యసింహాసనంమీద కూర్చోగానే వాగ్దానంప్రకారం ఆంగ్లప్రభుత్వానికి సగంరాజ్యం అప్పగించవలసివచ్చింది - ఈ సంఘటన ముల్లువలె బ్రతికున్నన్నాళ్లూ ఆయనహృదయాన్ని కెలుకుతూనేవుంది - ఈ కథనం, ఆయన అయోధ్యలో అర్ధరాజ్యం ఆంగ్లేయులకు ధారాదత్తంచేయడాన్నిగురించిన తెర మరుగు తంతుగా ప్రఖ్యాతినొందింది.

బ్రిటిష్‌చరిత్రలో నవాబ్ సఆదత్ అలీఖాన్‌దగ్గర ఈవిధంగా వాగ్దానంచేయించు కొని అయోధ్యరాజ్యంలో సగం భూభాగం ఆంగ్లేయులు హస్తగతం చేసుకొన్నారని వివరించకపోయినప్పటికీ ఇది జగద్విత మైన యథార్థగాథ. 'ఈ మనోవ్యధవల్లనే ఆయన అనవసరమైన దుర్వ్యయాలన్నిటికీ స్వస్తిచెప్పి, పన్నువసూళ్లను నిక్క చ్చిగా జరిపించి ఆదాయమార్గాలను పెంపొందింపచేసి ఇరవై రెండు, ఇరవై మూడు కోట్లరూపాయలు ప్రోగుచేశాడు. హిందూదేశపు పరిపాలనకు సంబంధించిన గుత్త అధికారాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీకికాకుండా తనకు ఇప్పించవలసినదని ఇంగ్లాండ్‌లోని బ్రిటిష్‌ప్రభుత్వంతో ఆయన ఉత్తరప్రత్యుత్తరాలు జరిపాడు. ఈయన ప్రస్తావన అంగీకరించబడేలాగే కనిపించింది. ఏర్పాట్లు మరికొన్నిరోజు లలో పూర్తి అవబోయేముందు ఆయన భావమరది, కుట్రదార్లతో చేతులుకలిపి విష మిచ్చి ఆయనను హత్యచేశాడు. 'చంద్రుడూ వుండడు, వెన్నెల కాయదు' అనే సామెత చరితార్థమైంది—అని లక్నోలోని పాతకాలపుపెద్దలు ఆయన సాధనను గురించి చెప్పుతూవుండేవారు.

ఇటువంటివే అనేకగాథలు ప్రచారంలోవున్నాయి. ఇవి చరిత్రపుటలలోకి రాలేక పోయినప్పటికీ లక్నోప్రాంతంలో ప్రచారంలోవున్నాయి. సఆదత్ అలీఖాన్ మితవ్యయి, మంచి పరిపాలనాదక్షుడు - కనుక ఆయన అంత తేలికగా అయోధ్యలో అర్ధభాగాన్ని ఆంగ్లేయులకు అర్పించివుండడు. రెండవది అతడివిధానాలలోను, రాజనీతిలోను అస్థిరత కానవస్తుంది. అది ఎందువల్లనో కనిపెట్టడం సాధ్యంకాని పని అయినప్పటికీ ఆయన ఇంకొంతకాలం జీవించివుంటే ఎన్నో గొప్పపనులు చేసివుండేవాడనీ, ఆయన నిశితదృష్టి సార్థకమైవుండేదనీ అనడానికేం సందేహం లేదు.

రాజ్యాన్ని పంచిఇవ్వడంవల్ల, ఆయన అన్నిటికంటేముందు సగం ఆదాయాన్ని కోల్పోయి ఆర్థికసమస్యను ఎదుర్కోవలసివచ్చింది. ఆయనకు పూర్వపుపరిపాలకుడు ఆసఫ్ ఉద్దౌలా విచ్చలవిడిగా అన్నిఖర్చులనీ పెంచేశాడు. ఆస్థానపుఖర్చులను తగ్గించడం అంతతేలికగా కుదిరేవ్యవహారం కాదు. అయినప్పటికీ ఆయన ఈ ఆశయంతోనే ఆస్థానం జమాఖర్చులను తనిఖీ చేశాడు. చిన్నచిన్న అనవసరపు ఖర్చులనుకూడా ఆయన తగ్గించాడు. అగ్రహారాలను, జాగీర్లను జప్తుచేయించి అక్కడినుండికూడా ఆదాయాలను కట్టుదిట్టంగా రాబట్టాడు. ఆస్థానంఖర్చులను వీలైనంతవరకూ బాగా తగ్గించేశాడు. చివరకు తాను అనుకొన్నప్రకారం చెడ్డపేరు వస్తుందేమో అని భయపడకుండా ప్రజలనుంచి కట్టుదిట్టంగా పన్నులు వసూలుచేసి ఆయన రాజ్యాదాయాన్ని పెంపొందించి, ఖర్చుల్ని చాలావరకు తగ్గించి చేశాడు.

ఈ కార్యదక్షతనుచూసి బుద్ధిమంతులు, న్యాయప్రియులు, సఆదత్ అలీఖాన్ యోగ్యతనీ, బుద్ధికుశలతనీ అంగీకరించినప్పటికీ ప్రజాబాహుళ్యానికి ఆయనపద్ధతులు ఆగ్రహాన్ని కలుగచేశాయి. ఒకవైపున అగ్రహారీకులు, జాగీర్‌దారులు తమ పొలాలు, జాగీర్లు రద్దు అయిపోయాయని, మరోవైపు అవసరమైన అదనపునౌకర్లు ముసలిఉద్యోగులు, తమ ఉద్యోగాలు ఊడిపోయాయని గగ్గోలుపెట్టసాగారు. వజీర్ అలీఖాన్ సమర్థకులు అయోధ్యప్రాంతంలో తగినంత ఎక్కువసంఖ్యలోనే వుండేవారు. వాళ్లు వజీర్ అలీఖానే అయోధ్యప్రాంతానికి నిజమైనవారసుడనీ, సఆదత్ అలీఖాన్ దోపిడీదొంగ అనీ అభిప్రాయపడుతుండేవారు. వీళ్ల దుష్ప్రచారం చాలా విపరీతంగా కొనసాగుతూవుండేది. మొత్తంమీద అయోధ్యప్రాంతం నిండా సఆదత్ అలీఖాన్‌కి అసంఖ్యాకమైన శత్రువులు ఏర్పడినమాట వాస్తవం. ఆయనకు ప్రాణాపాయంకూడా ఈ శత్రువులవల్ల ఏర్పడవచ్చుననే భయం ఆయన హితులకు కలిగింది. ప్రజలలోనేకాక సైన్యంలోకూడా అసంతృప్తివర్గం ఆయనకు వ్యతిరేకంగా ఏర్పడింది. మిడుతలదండులాంటి అసంఖ్యాకసైన్యం నవాబ్ షుజా ఉద్దౌలా కాలంలో వుండేది. ఆంగ్లేయులసలహాప్రకారం ఆసఫ్ ఉద్దౌలా సమయం నుంచే సైన్యాన్ని అంచెలవారీగా తగ్గించేకార్యక్రమం ప్రారంభమైంది. కాని ఆసఫ్ ఉద్దౌలా దానశీలత, ధారాళంగా ఖర్చుచేసేతత్వాలు ఆ సైనికుల్ని మౌనం వహింప

చేశాయి; అసంతృప్తిని ప్రకటిస్తూ గట్టిగా గొడవచేసేందుకుకూడా సైనికులు ఉంకారు. సఆదత్ అలీఖాన్ మితవ్యయాన్ని దృష్టిలోపెట్టుకొని వీలైనంతమంది అనవసరసైనికులనీ, సైనికాధికారులనీ సేవలనుంచి తొలగించివేయడంతో నాలుగు వైపులనుంచీ హాహాకారాలు చెలరేగాయి. ఉద్యోగాలుపోయినవాళ్లు తమ ఉద్యోగాలు పోయాయని, ఉద్యోగాలలో మిగిలినవాళ్లు పాతజీతాలతోనే రెట్టింపుపనిని బాధ్యతతో నిర్వర్తించవలసి వస్తూన్నందుకు గగ్గోలు పెట్టసాగారు. ఇటువంటి అనేకకారణాల వల్ల ఆయనప్రాణాన్ని రక్షించేందుకు ఏర్పాట్లు అవసరమనేభావం ఆంగ్లప్రభుత్వా నికి కలిగింది. (మంచి కట్టుదిట్టమైన ఆంగ్లసైనిక గార్డుల దళాన్ని సరిగ్గా పట్టణం మధ్యలో ఆయన రక్షణకోసం ఆంగ్లప్రభుత్వం నియమించింది. పట్టణంలో విద్రో హకరచర్యలు జరపబూనే అసంతృప్తివర్గాన్నీ, కొట్లాటలుజరిపే దుండగులనీ అణచివేసి పట్టణంలో శాంతి భద్రతలను కాపాడలనేసాకుతో ఆంగ్లప్రభుత్వం లక్నోలో బలశాలురు, సాహసోపేతులు అయిన ఎక్కువమంది ఆంగ్లసైనికుల్ని మంచిజీతాలపై నియుక్తపరచింది. ఆ సైనికదళం ఖర్చులు, జీతాలు సఆదత్ అలీఖాన్ నెత్తిన రుద్దబడతాయనేవిషయం వేరే చెప్పనక్కర్లేమకదా. ఈ ఏర్పాటును నవాబ్ సఆదత్ అలీఖాన్ తప్పనిసరి పరిస్థితులవల్ల అనిష్టంతో అంగీకరించాడని చెప్పుకొంటారు.)

ఇంతకుముందు, అయోధ్య నవాబులు తమ రీతిరివాజులలో చాలా సాదాతనం చూపించేరు. మొదటి ముగ్గురునవాబులు అనగా నవాబ్ బుర్హాన్-ఉల్-ముల్క్, నవాబ్ సఫ్దర్‌జంగ్, నవాబ్ షుజా ఉద్దౌలా ఎంతో సాధారణమైన ఇళ్ళలో జీవిం చారు. అవికూడా తమ స్వంతానివికావు, అద్దెవి. యుద్ధరంగమే మా స్వగృహం-అయోధ్యరాజ్యమంతా మా స్వంతఇల్లు అనే సాహసపూర్ణమైన విశాల ఆదర్శ భావాలు వారిలో విలసిల్లేవి. నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా తన విలాసాలకూ వ్యర్థమైన ఖర్చులకూ, భవననిర్మాణ వ్యసనానికి చెడుపేరు తెచ్చుకొన్నప్పటికీ ఆయనకూడా ఒక సాదా, పాతరకమైన పంచమహలాలోని ఇంట్లో కాలక్షేపం చేసేవాడు. ఇరవై లక్షలరూపాయలు ఇమామ్‌బాడా, మసీదులనిర్మాణంలోను, చౌక్ అనే బజారు, ధాన్యాగారాలు, వంతెనలు, సత్రాలు వగైరా నిర్మాణంలో రమారమి నలభై లక్షలు ఆయన వ్యయపరిచాడు. మొదటి ముగ్గురు నవాబులు భవననిర్మాణానికి సంబంధిం

చిన తమ సరదాలను - కోటల, కట్టడాల, సైనికాస్త్రాల గిడ్డంగుల నిర్మాణంద్వారా తీర్చుకొన్నారు; ఆసఫ్ ఉద్దౌలామాత్రం మసీదులు మొదలైన మతసంబంధమైన భవంతులు, ప్రజోపయోగకరమైన కట్టడాల నిర్మాణంద్వారా తన సరదాను తీర్చుకొన్నాడు. అనంతర పరిపాలకులలో పెద్దపెద్ద కట్టడాలను కట్టించాలనే సరదా తగ్గుతూవచ్చింది. ఆసఫ్ ఉద్దౌలా నిర్మింపచేసిన 'ఇమామ్ బాడా'వరకు నిర్మితమైన భవనాలని ప్రాచీన వాస్తుకళబాపతు నమూనా కళాఖండాలుగా ఎంచవచ్చు. షాహ్‌జహాన్ చక్రవర్తికి ఉత్కృష్టమైన తెల్ల పాలరాయి, కెంపులవంటి ఎర్రరాయి ఢిల్లీ, ఆగ్రా పరిసరాలలోని గనులలో కావలసినంత లభ్యమైంది. అందువల్ల అక్కడి కట్టడాలలో అందమూ ఠీవీ కొట్టొచ్చినట్లు కనిపిస్తూంటాయి. లక్నోలో అలాంటి రాయి దొరకదు; ఆగ్రా, లేక జయపూర్‌లనుంచి తెప్పించగలగడంకూడా సాధ్యమయ్యేపనికాదు. అయితేనేం? ఇటుకలతోను, సున్నంతోను కట్టించిన తన భవనాలలో ఆసఫ్ ఉద్దౌలా మొగలాయి కట్టడాలఅందాన్నీ, ఠీవినీ ప్రతిబింబింప చేయించాడు.

మితవ్యయత, పిసినిగొట్టుతనం, డబ్బు కూడబెట్టాలనే తృష్ణలతోపాటు నవాబ్ సఆదత్ అలీఖాన్‌కి భవనాలు కట్టించాలనే యావకూడా వుండేది. అయితే కలకత్తా, కాశీ మొదలైన అనేకప్రాంతాలలో నివసించడంవల్లనైతేనేం, అనేకఊళ్లు తిరిగి రావడంవల్లనైతేనేం భవననిర్మాణంబాపతు ఆయన అభిరుచి చాలా మారిపోయింది. ఆయన కట్టించిన భవనాలనుచూస్తే ప్రాచీన పరంపరాగత విశేషతలు సమాప్తమైపోయి, వాస్తుకళ అంతస్థు మారిపోయిందా అనిపిస్తుంది.

సింహాసనం హస్తగతంకాకముందు సఆదత్ అలీఖాన్ అన్యప్రాంతాలలో నివసించడం, నిలువ నీడలేని నిరుపేదలనీ, ఐరోపీయులనీ తరచు కలుసుకొంటూండడం, జనరల్ మార్టిన్ తన అభిరుచిప్రకారం కట్టించిన ఒకటి రెండు కట్టడాలు నవీన వాస్తుశైలితో ఆకర్షణీయంగావున్నట్లు కనిపించడం మొదలైనవి లక్నోలో కట్టడాలకుసంబంధించిన దృక్పథం మారేందుకు ముఖ్యకారణాలుగా ఎంచవచ్చు. ఈ 'కొత్తరకం భవనాలు' ప్రాచీనవాస్తుకళతో సంబంధంలేనివి, దృఢత్వందృష్టిలో కూడా ప్రాచీనభవనాలతో ఏమాత్రం తులతూగలేనివీ అయినప్పటికీ అవి జీవితావసరాలను తీర్చగలిగే అన్ని హంగులతో ఆకర్షణీయంగా వుండేవి. చిన్నపిల్లల ఆట

బొమ్మలు ఎంతో ముద్దుగావుంటాయి, ఆకర్షణీయంగావుంటాయి, కాని అట్టే కాలం మన్నవు. తరుచు విరిగిపోతాయి. మళ్ళీ కొత్తవి కొనుక్కొని ఆడుకొంటూంటారు. ఈ కొత్తరకం భవనాలస్థితికూడా సరిగ్గా ఆటబొమ్మల తంతే. 'ఆసఫ్ ఉద్దౌలా అనంతరం లక్నో నవాబులభవనాలను కట్టించే అభిరుచిలో పూర్తిగా భ్రష్టత్వం ఏర్పడిపోయింది. వారి భవనాలన్నీ మొగపిల్లల ఆటబొమ్మలో, ఆడపిల్లల బొమ్మరిళ్లో అనిపించేలా తయారయ్యాయి' అని ఐరోపీయ సమీక్షకులు చాలా కటువుగా ఉల్లేఖిస్తూంటారు. కాని ఈ అభిరుచిని ఎవరు పాడుచేశారు? అసలు ఒక జాతే అంటూ ఇక్కడ లేదనీ, అందువల్లనే ఇక్కడ జాతీయ అభిరుచి నష్టమైపోయిందనీ కొందరంటారు. ఇక్కడి జాతీయతను నాశనంచేసింది ఎవరు? ఎవరి కపట తంత్రాలవల్ల ప్రజాబాహుళ్యం తన పురాతన సంప్రదాయాలకు తిలోదకాలిచ్చుకోవలసిన దుస్థితికి లోనైంది? నిజం చెప్పాలంటే ఆంగ్లేయుల ఎత్తులవల్లనే ఇవన్నీ సంభవించాయి.

మొట్టమొదట సఆదత్ అలీఖాన్ 'ఫర్‌హత్ బక్ష్' కట్టడాన్ని ఏభై వేలరూపాయలకు జనరల్ మార్టిన్‌వద్ద కొన్నాడు. ఆ కట్టడంలోనే తాను నివసిస్తూ, దాని చుట్టుపక్కల అనేకభవనాలను కట్టించాడు. అక్కడికి కొద్దిదూరంలోనే 'రెసిడెంట్' నివసించేందుకు అనువైన భవంతిని కట్టించాడు. ఆ భవంతి అవశేషాలు ఇప్పటికీ రెసిడెన్సీలో మిగిలివున్నాయి. అనంతరం తన దర్బారుకోసం ఆయన 'లాల్ బారహ్ దరీ' భవనాన్ని నిర్మించాడు. ప్రస్తుతం ఇందులో గ్రంథాలయం వుంది. ఆరోజులలో ఈ భవనానికి 'కస్ర్-ఉల్-సుల్తాన్' అని పేరు వుండేది. ఇంతేకాక నదికి అవతలిఒడ్డున 'దిల్ ఆరామ్' అనే కొత్త కట్టడాన్ని నిర్మించాడు. ఆ దిగిలోనే ఆయన ఒక ఎత్తయిన దిబ్బమీద మరో అందమైన కొత్తభవనాన్ని కట్టించాడు. దానికి 'దిల్‌కుషా' అని పేరుపెట్టేడు. అక్కడినుంచి పూర్తి పట్టణం చుట్టుపక్కల మైదానాలు, నదీ పరిసర సుందరదృశ్యాలు ఇంపుగా కనిపిస్తూంటాయి. లక్నో సైనికస్థావరంప్రాంతంలో అది కట్టబడింది. ఇదేవిధంగా 'హయాత్ బక్ష్' అనే మరోభవంతి కట్టించాడు. కాని ఈ భవంతినిమాత్రం నవాబ్ సఆదత్ అలీఖాన్ తరువాతి నవాబులు ఉపయోగించుకోలేదు. గదర్ విప్లవానికిముందు అందులో మేజర్ బేరిక్ ఉంటూండేవాడు. గదర్ విప్లవానంతరం అయోధ్యప్రాంతానికి ఆంగ్ల

పరిపాలకులచే నియమించబడే ఆంగ్లేయ ముఖ్య కమీషనర్లు ఈ భవంతిలో నివ సించే ఆచారం అమలులోకి వచ్చింది.

పై భవంతులనేకాక 'మునవ్వర్ బక్ష్' 'ఖుర్షీదా మంజిల్' భవనాలను ఆయన కట్టించాడు. చౌపడా అశ్వశాలనుకూడా ఆయనే నిర్మింపచేశాడు. కాని ఈ అన్ని నిర్మాణాలలోను ఆయన తన ప్రాచీన దేశీయరీతుల్ని వదిలిపెట్టేశాడు. క్రొత్తగా వచ్చిన ఐరోపీయశైలిని అనుసరించి కట్టించాడు. బ్రిటిష్‌ప్రభుత్వం ప్రభావంవల్లను ఏర్పాట్లవల్లను ఇటువంటి ఉన్నతభవనాలు నిర్మించబడ్డాయి. లక్నోలోని ఏ ప్రాచీన భవనమూ ఈ క్రొత్తభవనాలతో పోటీచేయలేవు. అందుకే ఇట్టి కట్టడాలు అనేక పట్టణాలలో నిర్మితమయ్యాయి. ఇప్పుడుకూడా నిర్మించబడుతూనేవున్నాయి. చారిత్రకప్రశస్తి ప్రత్యేకవిశిష్టతమూలంగా దేశ, విదేశయాత్రికులను ఆకర్షించే ఆ ప్రాచీనపద్ధతి భవననిర్మాణం లక్నోలో సఆదత్ అలీఖాన్ కాలంలోనే సమాప్తి అయిపోయింది.

నవాబ్ సఆదత్ అలీఖాన్ లక్నో పశ్చిమభాగంలో ఒక పెద్దఅంగడిని (సూపర్ మార్కెట్) కట్టించాడు. అది విజయవంతంగా దినదినాభివృద్ధినొందేందుకు వ్యాపారస్తులకు, దుకాణదారులకు విశేషాధికారాలను కూర్చిపెట్టే ప్రత్యేకచట్టాన్ని చేశాడు. ఆ సూపర్‌మార్కెట్ మూడు పువ్వులు ఆరుకాయలుగా అభివృద్ధి చెందింది. ఇప్పటికీ అది పట్టణానికిదూరంలో విడిగా వున్నప్పటికీ అన్నిరకాలవస్తువులు పుష్కలంగా అమ్ముడుపోయే పెద్ద బజారుగా అది నిలిచివుంది. అది ఆలమ్‌నగర్ రైలుస్టేషన్ దగ్గరలోవుంది. ఈ పెద్దబజారుమూలంగానే ఆలమ్‌నగర్ స్టేషన్ దిన దినాభివృద్ధి చెందుతూ వుంది.

'సఆదత్ గంజ్'తోపాటు నవాబ్ సాహబ్ కాలంలో రకాబ్ గంజ్, ప్రస్తుతం ఇనుపసామానులు, ధాన్యం వ్యాపారాలు లక్నో మొత్తంలో చాలా ఎక్కువగా జరిగే బజారూ, జంగ్లీగంజ్, మక్‌బూల్‌గంజ్, మౌల్వీగంజ్, గోలా గంజ్, రస్తోగీ మొహల్లా మొదలైన పెద్దపెద్దవీధులు నిర్మింపబడి అభివృద్ధి చెందాయి, చెందుతున్నాయి. ఇంతేకాక మోతీమహల్‌లో పురాతనమైన కట్టడాన్ని ఆయన కట్టించాడు. ఇది వర్తమాన మోతీమహల్ ప్రాంగణంలో ఉత్తరంవైపున వుంది. దానిపైన ముత్యాలవంటి రాళ్ళు పొదగబడిన తెల్లటి గుమ్మటం వుండేది.

అయోధ్యనవాబు లందరికంటె స ఆదత్ అలీఖాన్ ఎక్కువ బుద్ధిశాలి, చతుర రాజనీతిజ్ఞుడు. సంపదలోని అమూల్యమైన విలువ తెలిసిన పొదుపరిగా ప్రఖ్యాతి గాంచాడు. అయితే ఆయన్ని పిసినిగొట్టుగా లెక్కవేసేవ్యక్తులూ కొందరు లేక పోలేదు. ఆయన అనుపమానమైన యోగ్యతతో, చాతుర్యంతో పరిపాలనావ్యవస్థను తీర్చిదిద్దాడు. ఆయన హత్య జరిగివుండకపోతే, మరో దశాబ్దంవరకూ శాంతి యుతంగా జీవించే అవకాశం ఆయనకు వుండివుంటే, వెనుకటి నవాబుల దుష్ట కార్యాలఫలితాలన్నీ దూరమైపోయివుండేది, అయోధ్యప్రాంతం ఎంతో ప్రగతిని సాధించివుండేది అనడం అతిశయోక్తి కాదు. దురదృష్టవశాత్తు ఈస్టిండియా కంపెనీతో ఆయన సంబంధాలు ఏమాత్రం బాగుండేవికావు. ఆంగ్లేయులప్రవర్తన వల్ల ఆయన ఖిన్నుడై ఎన్నోసార్లు సింహాసనాన్నివదిలేసి ఎక్కడికైనాపోయి సుఖంగా జీవిద్దామనికూడా అనుకొన్నాడు. 'సగానికిపైగా అయోధ్యప్రాంతాన్ని ఆంగ్లేయులపరం చేశానుకదా, మిగతాప్రాంతాన్నీ నిస్సంకోచంగా పరిపాలించ వచ్చు'నని ఆయన ఆశించాడు. కాని పాపం! ఆయనకి ఆ ఆశకూడా అడియాసే అయింది. ఆయన ప్రాంతంలోకూడా రక్షణకని శిక్షణకని ఏదోవంకతో ముఖ్యంగా లక్నో పట్టణంలోను, దాని చుట్టుప్రక్కల ఊళ్లలోను ఆంగ్లసైనికశిబిరాలు వెలి శాయి. ఆ సైన్యసంరక్షణ, గతి-విధులను గమనించడం చాలా కష్టమైనపని. ఆంగ్లసైనికులసంఖ్య అమితమైవుండడంవల్ల స ఆదత్ అలీఖాన్ ఆస్థానం అవాం ఛిత ఆంగ్లసైనికుల అనివార్య వ్యయభారాన్ని మోయవలసివచ్చింది. అందువల్లనే ఆయన తన సైన్యంనుంచి చాలామంది సైనికుల్ని తొలగించివేయవలసిన అగత్యం ఏర్పడింది.

కాని ఈవిధమైన కష్టాలు, నష్టాలు సహిస్తూనే ఆయన ప్రశంసనీయమైన అనేక సంస్కరణలను అమలు జరిపాడు. అనేక క్రొత్తబజార్లను నిర్మించి వర్తక వ్యాపారాలనీ బాగా ప్రోత్సహించడంతోపాటు పేరుప్రతిష్ఠగల సద్గుణసంపన్నులను తన ఆస్థానంవైపు ఆయన ఆకర్షించుకోగలిగాడు. స ఆదత్ అలీఖాన్ దర్బారులో వున్నంతమంది గుణవంతులు భారతదేశంలో ఏ ఇతర ఆస్థానంలోను లేరనే చెప్ప వచ్చు. సాధారణంగా ఎక్కువఔదార్యంతో, దానశీలతతో తమను జనసామాన్యం కంటే ఎక్కువగా గౌరవించే ధనవంతులవద్దకే గుణవంతులు చేరుకుంటూంటారు.

సఆదత్ అలీఖాన్ మితంగా ఖర్చుపెట్టేస్వభావంకలవాడే, కాని ఎదుటివ్యక్తులలోని గుణాలని గ్రహించగలిగే మంచి నేర్పుగలవాడు. ఆయనలోని మితవ్యయలక్షణం, లేవా పిసినిగొట్టుతనం పాత్రతగల యోగ్యులను తగినట్లు సన్మానించడానికి, గౌరవించడానికిమాత్రం అడ్డురాలేదు. అంతకుముందుకంటె స ఆదత్ అలీఖాన్ సమయంలో లక్నో ఆస్థానం సద్గుణసంపన్నులైన పెద్దమనుష్యుల నిలయంగామారి, పేరుప్రతిష్ఠలను తెచ్చుకోగలిగింది. అనేకప్రాంతాలలోని యోగ్యవ్యక్తులు గుణగ్రాహి అయిన స ఆదత్ అలీఖాన్ ప్రఖ్యాతిని వినగానే తమతమ స్వస్థలాలనుంచి లక్నో వచ్చేవారు. లక్నో ఆస్థానంలో వారికి సముచితసన్మానం, విశ్రాంతి, వారివారి అభిరుచులకు అనువైన సృజనాత్మక క్రియాకలాపాలు లభ్యమౌతూండేవి. వారికి ఆ ఆస్థానం వదల బుద్ధేసిందికాదు.

క్రీ. శ. 1814 లో నవాబ్ స ఆదత్ అలీఖాన్ మరణించాడు. ఆయనపుత్రుడు గాజీ ఉద్దీన్ హైదర్ సింహాసనమెక్కాడు. కైజర్‌బాగ్‌లోని వర్గాకారపుకట్టడంలో నవాబ్ స ఆదత్ అలీఖాన్, ఆయనభార్య ముర్షిద్ జాదీల సమాధులున్నాయి. ఇప్పుడు ఆ గోరీ ఉన్నస్థలంలో ఆకాలంలో ఒక భవంతి ఉండేది. గాజీ తన యౌవనదశను ఆ భవంతిలోనే గడిపాడు. తండ్రి మరణానంతరం గాజీ రాజమహల్‌లోకి వస్తూనే 'నేను నాన్నగారి భవనానికివచ్చాను. నాన్నగారుండేందుకు నా భవంతినిస్తాను' అన్నాడు. ఈ అభిప్రాయంప్రకారమే స్వర్గస్థుడైన నవాబ్‌ను గాజీ తన భవంతిలోనే సమాధిచేయించి భవంతిని పడగొట్టించి గోరీ కట్టించాడు.

'గాజీ' తనతండ్రిలా తెలివిగలవాడు కాదు, మితవ్యయీకాదు, తాత ముత్తాతలవలె సైన్యాభివృద్ధి, ఆయుధనిర్మాణంపట్ల అభిరుచిగలవాడు కాదు; ఆసఫ్ ఉద్దౌలావలె విలాసప్రియుడు. కాని ఇందులోకూడా కొట్టొచ్చినట్లు ఒక పెద్దతేడా కనిపిస్తుంది. ఆసఫ్ ఉద్దౌలాగారి దూబరాఖర్చులో చాలాభాగం ప్రజలకి దేశానికి లాభం చేకూర్చేందుకు ఉపకరించింది. అయితే గాజీగారి దుర్వ్యయం ఆయనకీ, కొద్దిమంది స్వార్థపరులకూ, వినోదం కలుగచేసేందుకుమాత్రం పనికివచ్చేది.

తండ్రి సంపాదించిన కోట్లకొద్దీసొమ్ముగల ఖజానా గాజీ హస్తగతమైంది. గాజీ మహారాజ భోగాలనుభవించడానికి ఆ డబ్బు మంచినీళ్ళప్రాయంగా ఖర్చయిపోయింది.

మోతీమహల్లో ఉత్తరంవైపు సఅదత్ అలీఖాన్ ఒకకట్టడాన్ని నిర్మించిన విషయం ఇంతకుముందే చెప్పాను. గాజీ, మోతీమహల్ ప్రాంగణంలో మరో రెండు భవనాలు కట్టించాడు. వాటికి 'ముబారక్ మంజిల్' 'షాహ్ మంజిల్' అని పేరు పెట్టాడు. షాహ్‌మంజిల్ దగ్గర పడవలవంతెన వుంది. ముబారక్ మంజిల్ దానికి తూర్పువైపున వుంది. షాహ్‌మంజిల్ ఎదుట నదికి అవతలగట్టున పచ్చికనిండిన మైదానం వుండేది. అదే ఇప్పుడు 'హజారీబాగ్'గా రూపొందింది. ఆరోజుల్లో అక్కడ మైళ్లకొద్దీ అందమైనతోటలు వుండేవి. ఆ తోటల్లో తరచు మదించిన ఏనుగుల్ని, ఖడ్గమృగలను, వేరే అడవిమృగాలను పోట్లాడిస్తూండేవారు. చక్రవర్తి ఆ ఒడ్డునవుండే 'షాహ్‌మంజిల్'లో కూర్చుని ఆ జంతువులపోరాటాలను తమాషాగా చూస్తూండేవాడు. ఇనుప కటకటాలున్న కొన్నిబోనులలో సింహాలచేతకూడా పోట్లాడిస్తూండేవారు. అదే పెద్ద సర్కస్‌లా వుండేది. కాని అపాయం కలుగజేయ లేని చిన్నచిన్న జంతువులపోట్లాటలు ఇవతలిఒడ్డునవుండే షాహ్‌మంజిల్‌లోనే జరిపిస్తూండేవాడు.

భారతదేశంలో, జంతువులను, అడవిమృగాలను పోట్లాడించేవ్యసనం తొలిసారిగా 'గాజీ' కాలంలోనే లక్నోలో పొడసూపిందనీ, అంతకుముందు ఇలాంటివేం లేవనీ అంటారు. రెసిడెంట్లు, ఆస్థానంలోకి వచ్చేపోయే ఐరోపీయులద్వారా రోమన్ ఎంఫీ థియేటర్లను (చక్రాకారముగల నాటకశాలలు) గురించి గాజీ విని వుండడంవల్ల ఆయనకీవ్యసనం అబ్బివుండవచ్చునని కొందరంటారు. కాని జంతువులను పోట్లాడించే రివాజు మొగలాయీ సామ్రాజ్య స్థాపననాటినుంచీ ప్రారంభమైందని మౌలానా హబీబుర్రహమాన్ ఖాన్‌సాహబ్ సేఖానీ వక్కాణించారు. (గాజీ తన ఐరోపీయ భార్యకోసం విదేశీమహల్ కట్టించాడు. దానికి 'విలాయతీబాగ్' అనే పేరుపెట్టాడు. దానికి కొద్ది అడుగులదూరంలో ఆయన రసూల్ ఈశ్వర దూత కట్టడం కట్టించాడు. గాజీ ఉద్దీన్ హైదర్‌కోర్కెపై ఆంగ్ల ప్రభుత్వం ఆయనకు 'బాద్‌షాహ్' బిరుదు ప్రదానంచేసింది. ఇంతకుముందు అయోధ్యపరిపాలకుల శ్రేణి, మంత్రిపదవికి తుల్యమైనదిగా వుండేది. 'నవాబ్' అనేబిరుదు వారికి వుండేది కాదు. భారతదేశంలో మొగలాయీలచేతులలో ఢిల్లీ, దానిచుట్టుపక్కల కొద్ది ప్రాంతం మిగిలింది. దేశం చిన్నచిన్న రాజ్యఖండాలుగా విభజితమైపోయింది.

ఆంగ్లేయుల ఆగడాలు, విభజించి పాలించాలనే కుటిలనీతితో దేశమంతా కుతకుత లాడిపోతోంది. మొగలాయీలు, మిగతా నవాబులు, రాజులు పేరుకుమాత్రమే స్వతంత్రులు. ఇట్టి దుస్థితి ఏర్పడినప్పటికీ మొగలాయీపరిపాలకుడే 'షహిన్‌షాహ్' (రాజాధిరాజు) అయనే జహాంపనాహ్ (జగద్రక్షకుడు) అంతవరకూ ఢిల్లీ రాజుతప్ప ఎవ్వరూ 'బాద్‌షాహ్' అనేబిరుదు పొందలేదు. మొగలాయీ పరిపాలకుల గర్వం అణచాలనేవుద్దేశ్యంతో ఈస్టిండియా కంపెనీవారు గాజీదగ్గర కొన్నికోట్ల రూపాయలు అప్పుపుచ్చుకొని రాజబిరుదము ఆయనకిచ్చారు. అయోధ్య ఆస్థానం ఈ సన్మానాన్ని ఎంతో గౌరవదృష్టితో చూసింది. గాజీ ఆబిరుదును చాలా సంతోషంగా పరిగ్రహించాడు. ఆకాలపు అయోధ్యపాలకులు రెసిడెంట్ల చేతుల్లో కీలుబొమ్మలే అయినప్పటికీ చక్రవర్తులయిపోయారు. ఆఖరుపరిపాలకుడు వాజిద్ అలీ షాహ్ మరణపర్యంతం లక్నోరాజులు ఆంగ్లేయుల కృపాపాత్రులై జీవించారు.

గాజీ ఉద్దీన్ హైదర్ ఈ చక్రవర్తి బిరుదుకి స్మృతిచిహ్నంగా మచ్ఛీభవన్‌కు ఎదుట నదికి అవతలిగట్టున 'బాద్‌షాహ్ గంజ్' అనే ఒక కొత్తబజారు కట్టించాడు. ఆసమయంలోనే హకీమ్ మెహది 'మెహదీ గంజ్' నిర్మించాడు. ప్రధానమంత్రి ఆగామీర్‌గారి రాజోచితభవనం చాలాదూరంవరకు వ్యాపించిపోతూండడం వల్ల పట్టణమధ్యభాగంలో 'ఆగా మీర్‌కి డ్యోఢీ' అనే వీధి విలసిల్లింది. అదే విధంగా 'ఆగామీర్‌గారి సత్రం'కూడా వెలసింది.

రాజుకూ, అంతకంటే ఎక్కువగా రాణీకీ మతతత్పరత అధికంగా వుండేది. సఫవియా[1] వంశీయులకాలంనుంచీ ఈరాన్‌దేశీయులు షియా ఇసనా ఆషరీ[2] సాంప్రదాయాలను అవలంబించారు. కాని భారతీయ ముస్లిములలో అధికసంఖ్యాకులు సున్నీసాంప్రదాయాన్ని అనుసరించేవారు. నవాబ్ బుర్‌హాన్ ఉల్-ముల్క్ విదేశంనుంచి కొత్తగావచ్చాడు కనుక ఆయనా, ఆయన కుటుంబికులూ షియా సాంప్రదాయకులు. ఇస్లాం సామ్రాజ్య ప్రారంభదశనుంచీ భారతీయపట్టణాలలో, ఇతరగ్రామాలలో సున్నీ సాంప్రదాయాన్నే పాటిస్తూవుండేక్రమాన్నే చాలాకాలం వరకు లక్నోప్రభుత్వంకూడా పాటిస్తూ వచ్చింది. కాని రాజు, పట్టపురాణీల మతాభి

1. ఈరాన్‌లోని ఒక కుటుంబం.

2. పన్నెండుమంది పురోహితుల్ని (ఇమామ్‌లను) అంగీకరించే షియా సంప్రదాయం.

రుచివలన షియా సంప్రదాయాన్ని అనుసరించడం లక్నో ప్రభుత్వవిధానంగా 'గాజీ' కాలంలో రూపొందింది. ఫిరంగీమహల్ బాపతు విద్వాంసులపట్ల పరిపాలకుల శ్రద్ధ తగ్గిపోవడంవల్ల, ముజ్‌తహిద్[1] కుటుంబీకుల ప్రభావం హెచ్చి వాళ్లే మతచట్టాలను చేసే అధికారాన్ని పుణికిపుచ్చుకోగలిగారు.

షియా సాంప్రదాయాన్ని దాని అసలు సిద్ధాంతాల ప్రకారం పాలించివుంటే బాగానేవుండేది. కాని నవాబ్‌లు బేగమ్‌లు ధనవంతులు మొదలైనవాళ్ళు ఈ సాంప్రదాయాన్ని అభిమానించడంవల్ల విచ్చలవిడిఖర్చులు పెట్టూ, అజ్ఞానభూయిష్ఠమైన చాదస్తపుపద్ధతులని దీనికి జోడించారు. లక్నోలోని షియా సంప్రదాయం మిగతా ముస్లింప్రపంచపు షియా సాంప్రదాయాలకి భిన్నంగా అధికమైన ఆడంబరాలకి, అనవసరమైన అమిత వ్యయాలకి, అర్థంలేని చాదస్తపుతంతుకి ఆలవాలమయింది.

అన్నిటికంటెముందు బేగమ్, పెద్ద ఇమామ్‌గారి ఛఠీ (పుట్టిన ఆరోరోజున చంటిపిల్లలకు ఆరోగ్యస్నానం) శుభకార్యం మహమ్మదీయులలో జరిపేతంతూ, షియా సంప్రదాయానికి పూర్తివిరుద్ధంగా జరిపించింది. సాధారణంగా సభ ఏర్పాటు చేసి ఇమామ్ సాహెబ్‌నుగురించి వివరింపచేయడం, మతగాథను వినిపింపచేయడం చేస్తుంటారు. కాని ఆమె అలాగ చేయించకుండా హిందువుల శ్రీ కృష్ణజయంతి పద్ధతిలో చిన్నపిల్లల బువ్వాలాటగా షియాలచరిత్ర ఛఠీని జరిపించి అపహాస్యపరిచింది. మొదట ప్రసూతిగృహాన్ని ఈ తంతులో ప్రవేశపెట్టింది. అనంతరం నిష్కళంకమైన పన్నెండుగురు సయ్యద్‌వంశీకుల కన్యలను రప్పించి పన్నెండుగురు ఇమామ్‌లకు భార్యలుగా వాళ్ళచేత నటింపజేసింది. వాళ్ళకు 'అస్పృశ్యకన్యలు' అని పేరుపెట్టింది. వాళ్లు భార్యలు ఎలాగూ అయ్యారు కనుక వాళ్లకు పిల్లలు పుట్టినట్లు, ఆపిల్లలకే ఛఠీ జరిపిస్తున్నట్లు ప్రదర్శింపచేసింది. చిన్నపిల్లల బువ్వాలాటలాగ, ధనవంతుల నాటకంమాదిరిగా ఈ మతసాంప్రదాయపు తంతుని వికృతంగా మార్చివేసింది. గాజీ చాలా వ్యాకులచిత్తుడు, కోపిష్టి. కాని అతడు ఆంగ్లేయులకు అణకువగానేవుంటూ వాళ్ళతో ఏ పేచీలేకుండా కాలాన్ని వెళ్లబుచ్చుతూ వుండేవాడు. గాజీ ప్రధానమంత్రి 'ఆగామీర్' చాలా అత్యాచారాలుజరిపే శక్తి

1. షియా సాంప్రదాయపు అధికారవిద్వాంసుడు.

మంతుడు. దర్బారులోని అధికారులనీ, బేగమ్‌ని, యువరాజునీకూడా అతడు హింసిస్తూండేవాడు. గాజీ, తన ప్రధానమంత్రి ఆగామీర్‌ని గుద్దుతూ, తన్నుతూ వుండేవాడు. ఆగా వాటిని సహర్షంగా స్వీకరిస్తూండేవాడు. కాని గాజీకుటుంబం వారిపైన, అధికారులపైనా తన అవమానానికి ప్రతీకారచర్యలు జరుపుతూండే వాడు.

ఇంతకుముందు అయోధ్య చక్రవర్తి మతంపట్ల శ్రద్ధతో నదిఒడ్డున మోతీ మహల్ దగ్గర 'నజ్‌ఫే-అష్‌రఫ్'కు (హజరత్ అలీగారి సమాధి) నకలు లక్నోలో కట్టించాడు. దాని సంరక్షణకు, నిత్యవిధులను అమలుపరిచేందుకు ఆయన ఆంగ్లే యులకు ఎంతో డబ్బు ఇచ్చాడు. దానిమీద వచ్చేవడ్డీతో ఆ ఏర్పాట్లు ఇప్పటికీ జరుగుతూనేవున్నాయి. క్రీ. శ. 1827 లో గాజీ ఉద్దీన్ హైదర్ మరణించాడు. ఆయనను లక్నోలోని నకిలీ 'నజ్‌ఫే అష్‌రఫ్' ప్రక్కనే సమాధి చేశారు.

# 6

క్రీ. శ. 1827 లో గాజీ ఉద్దీన్ హైదర్ కుమారుడు నసీర్ ఉద్దీన్ హైదర్ సింహా సనారూఢుడయ్యాడు. గాజీ ఉద్దీన్ హైదర్ కాలంనుంచీ అయోధ్యపాలకులు నవాబ్‌లు కారు. పాదుషాలవిషయం క్రితం అధ్యాయంలోనే విదితం చేయడం జరిగింది. మొదట వజీర్‌పదవితో ప్రారంభమై నవాబ్‌గా మారి అనంతరం పాదుషా బిరుదువరకూ లక్నోపరిపాలకులు రాగలిగారు. బలవంతులు, కట్టుదిట్టమైన పాలన చేయగలిగినపాలకులు నవాబ్ వజీర్‌లుగా పిలువబడ్డారు. శక్తిప్రభావం నశించిపోయినటువంటిన్నీ, భారతరాజనీతిని తీర్చిదిద్దేవ్యవస్థలో ఎంతమాత్రం స్థానం లేనటువంటిన్నీ ఈ బలహీనులు బాద్‌షాహ్ లయ్యారు.

ఆంగ్లేయులు పక్షపాతంతో లక్నో శాసకులకు పాదుషా బిరుదును కట్ట బెట్టారు. కనుక ఈ పాదుషాలను శక్తివంతులుగా ప్రభావశాలురుగా అయోధ్య పరిపాలనావ్యవస్థ శోభను వృద్ధిచేసే దక్షులుగా రూపొందించివుంటారనీ, వీరికే

పేరుకిమాత్రంకాక నిజమైన పాదుషాలుగా లక్నో పాలకులస్థానాన్ని పెంపొందించివుంటారనీ ఎవరైనా అభిప్రాయపడవచ్చు. కాని, ఈ అభిప్రాయం ఎంత మాత్రం నిజంకాదు. ఆరోజుల్లో అయోధ్య సరిహద్దుల బయట లక్నో పాదుషాల ప్రభావం ఏమాత్రం లేదు సరేకదా, స్వంతరాజ్యంలో సహితం వాళ్ళకి తమ పూర్వీకులకున్నంత స్వాతంత్ర్యంకూడా లేకుండాపోయింది. ఆంగ్లేయుల అనుమతి లేనిదే ఎవ్వరికీ రాజ్యాభిషేకంకూడా జరిగేందుకు వీలులేని స్థితి గాజీకి ముందుకాలం నుంచే ఏర్పడింది. ముఖ్యమైనసమస్యలేవీ రెసిడెంట్ జోక్యంలేకుండా పరిష్కరించేందుకు పాదుషాలు జంకుతూండేవారు. రాజాస్థానం ఒక నాటకం. పాదుషా నాయకుడు. ప్రధానమంత్రీ, ఇతరమంత్రులూ, సైన్యాధిపతులూ సైనికులు వగైరా నటులు. ఆంగ్లప్రభుత్వం నాటకదర్శకత్వం వహించేది. కాని అమాయక ప్రజలకు దర్శకుణ్ణిగురించి ఏం తెలుస్తుంది? దర్శకుడికుండే నియంతృత్వాధికారాలు, పాపం, ప్రజలకెలా తెలుస్తాయి? తెరచాటునవుండే నియంత తన ఇచ్ఛానుసారం నాయకుణ్ణీ, నాయికనూ, మిగతా నటీ, నటుల్నీ ఆడిస్తున్నాడనే అసలుసంగతి జనసామాన్యానికి ఎట్లా తెలుస్తుంది? అంతేకాదు, భగవంతునిదయవల్ల గాజీ ఉద్దీన్ హైదర్‌కాలంనుంచీ, అయోధ్యపాలకులలో వుండే స్వాతంత్ర్య పిపాస, ధైర్యసాహసాలు, మానాభిమానాల అనుభూతి లుప్తమైపోయాయి. ఫలితంగా లక్నో పాదుషాలు తాము ఎటువంటి నికృష్టస్థితిలో వుంటూ నామమాత్రంగా పరిపాలనావ్యవస్థలో పాల్గొంటూన్నదీ, ఎంత బలహీనులై విజ్ఞులదృష్టిలో హీనంగా జీవిస్తున్నదీ తెలుసుకోలేని దుస్థితికి దిగజారిపోయారు. గాజీ ఉద్దీన్ హైదర్ రాజు కాగానే భోగవిలాసాలలో లీనమైపోయాడు. నసీరుద్దీన్‌హైదర్ తండ్రికితగిన తనయుడు. ఆయన 'అవశ్యం పితురాచారం' అనే ఆర్యోక్తిని అక్షరాలా పాటించేందుకు ద్విగుణీకృతఉత్సాహం చూపించారు. సఆదత్ అలీఖాన్ కష్టించి పోగుచేసినసంపద, విచ్చలవిడిగా ఖర్చుపెట్టేందుకు ఆయన కొడుక్కేకాక మనుమనికీ ఉపయోగపడింది. సంపదలోని కొంతభాగం ఆంగ్లేయులకు ఋణంపేర సమర్పించబడింది. పాదుషా ఆయన రాణులు తమ మత అభిరుచులను అతి గొప్పగా చూపించుకునేందుకు కొంత భాగం, మిగతాది భోగవిలాసాలలో వ్యయమైపోయింది. నజఫే అషరఫ్‌కి సకలుగా తన సమాధికి గాజీఉద్దీన్ హైదర్ తన జీవితకాలంలోనే ఏర్పాట్లు చేసు

కున్నాడు. అతడికి తన వారసునిమీద అట్టే నమ్మకంవున్నట్లు కనిపించదు. అందుకే ఈ ఏర్పాటుతో ఆయన చాటుగా ఆంగ్లేయులకు కొన్నిలక్షల రూపాయలిచ్చి దాని మీదవచ్చే వడ్డీతో తన అంత్యక్రియలు, అనంతరం గోరీ సంరక్షణనీ సక్రమంగా జరిపిస్తూండవలసినదనీ కోరాడు. అందుకే ఇప్పటికికూడా ఆయన గోరీవద్ద రోజూ దీపం వెలిగించబడుతూవుంటుంది, శోకసభలు జరుగుతూంటాయి, ఖురాన్ పఠించ బడుతూవుంటుంది, మొహరమ్ రోజుల్లో ఉత్సవాలు జరుగుతూంటాయి. ఆయన చేసిన ఈ ఏర్పాటువల్ల కొంతమంది ముస్లింపేదలకైనా పరంపరాగతంగా ఈనాటికి లాభం కల్గుతూవుంది. కాని భోగవిలాసాలలో పూర్తిగా మునిగి వుండడంవల్ల నసీర్ ఉద్దీన్ హైదర్‌కు ఈమాత్రం తీరుబడికూడా దొరకలేనట్టుంది। నదికి అవతలగట్టున 'ఇరాదత్ నగర్'లో ఆయన గోరీస్థలాన్ని కేటాయించాడు. దానిలో తన గోరీ నిర్మించాలని అనుకొన్నాడు. కాని అనంతరం ఆ ధ్యాసేలేనట్టు కనబడుతుంది. ఆయన మరణానంతరం అక్కడే పాతిపెట్టబడినప్పటికీ తగిన ఏర్పాట్లు చేయకపోవడంవల్ల నేడది డాలీగంజ్ రైలుస్టేషన్‌సమీపంలో శిథిలావస్థలో వుంది. బహుశః దానిమీద దీపం పెట్టేవాళ్లుకూడా వున్నట్లు లేదు. ఆయనకాలంలో 'గణేశ్ గంజ్' 'చాంద్ గంజ్' అనే క్రొత్తవీథులు నదికి అవతలిగట్టున నిర్మిత మయ్యాయి.

నసీర్ ఉద్దీన్ హైదర్‌కు జ్యోతిషశాస్త్రంపై అభిమానం ఎక్కువగా వుండేది. అదే ఆయనను ఖగోళశాస్త్రంవైపు మొగ్గు చూపించేలా చేసింది. ఆయన లక్నో పట్టణంలో ఒక బ్రహ్మాండమైన ఖగోళపరిశోధనశాలను నిర్మించాలని నిర్ణయించాడు. ఈ వాంఛాసిద్ధికోసమే ఆయన స ఆదత్ అలీఖాన్ సమాధికీ మోతీమహల్‌కీ మధ్యలో ఒక భవనాన్ని కట్టించాడు. అది 'తారే వాలీ కోఠీ' అనేపేరుతో ప్రఖ్యాతి వహించింది. పెద్దపెద్ద దుర్బిణీయంత్రాలు, అనేకరకాల అన్యసామగ్రి పరిశోధన కోసం తెప్పించబడ్డాయి. చాలా గొప్ప ఖగోళశాస్త్రజ్ఞుడైన కర్నల్ వైల్‌కావన్ అధ్వర్యంలో ఖగోళపరిశోధనశాల ప్రారంభమైంది. లక్నోలోని ఈ ఖగోళశాల కర్నల్‌గారి జీవితంలోని అజ్ఞాతఘటనలా కనిపిస్తుంది. క్రీ. శ. 1827 లో నసీర్ ఉద్దీన్ హైదర్ పరిపాలన ప్రారంభమైంది. ఆ తరువాత నాలుగైదేళ్లలో ఈ పరి శోధనశాల స్థాపించబడివుండవచ్చు. అప్పటినుంచీ క్రీ. శ. 1847 వ సంవత్సరం

వరకు, అంటే అయోధ్య ఆఖరిపాలకుడు వాజిద్ అలీషాహ్ సమయంవరకు ఆ పరిశోధనశాల ఆయన అధ్వర్యంలోనే నడుస్తూవుండేది. ఆ సంవత్సరమే కర్నల్ స్వర్గస్థుడయ్యాడు. ఆయనస్థానంలో ఖగోళశాస్త్రజ్ఞుని నియామకం ఏదీ జరగలేదు. వాజిద్ అలీషాహ్ దానిపట్ల నిర్లక్ష్యంచూపాడు, అక్కడవుండే ఒక పెద్ద దుర్భిణీ యంత్రాన్ని ఒక పెద్ద ఆటబొమ్మ అనుకొని, వాజిద్ తన హైదరీ వేశ్యకు దానిని బహూకరించాడని లక్నోలోని కొందరు పెద్దమనుష్యులంటారు. డంకాషాహ్‌గా వినతికెక్కినటువంటిన్నీ, ఆంగ్లసేనలతో శౌర్యపరాక్రమాలతో పోరాడినటువంటిన్నీ ఎహ్‌మద్ ఉల్లాషాహ్ ఈ 'తారేవాలీ కోఠీ'లోనే తన నివాసస్థానాన్ని ఏర్పరచుకొని తిరుగుబాటుదారులను, వారి అధికారులను ఇక్కడ సమావేశపరుస్తూ విప్లవానికి బీజాలువేస్తూవుండేవాడని కొందరంటారు. కాని తారేవాలీ కోఠీ అయోధ్య రాజ్యం అంతరించేవరకూ వుండేదని 'గెజెటియర్' వల్ల తెలుస్తూంది. బహుశః గదర్ విప్లవంలో ఇది నాశనమైపోయి వుండవచ్చు.

ఈకాలంలో రోశన్ ఉద్దౌలా ప్రధానమంత్రి. ఆయన తన నివాసంకోసం ఒక అందమైన భవంతిని కట్టించాడు. దీన్నే కైసర్‌బాగ్ అంటారు. ప్రస్తుతం అది డిప్యూటీ కమీషనర్ కార్యాలయానికి వుపయోగపడుతోంది. నిజానికి వాజిదలీషా ఈ భవనాన్ని తనవశం చేసుకున్నాడు. ఈ ప్రాంతమంతా ఆంగ్లేయుల అధీనంలోకి వచ్చినప్పుడు ఇదీ ఆంగ్లేయుల వశమైంది.

నసీర్ ఉద్దీన్‌కాలం చాలా చిక్కులతోటీ, ప్రమాదాలతోటీ నిండినసమయం అనేది నిజం. ఒకవైపు బిగిలేని పరిపాలనావ్యవస్థ. పాదుషా ఎప్పుడూ భోగవిలాసాలలో, తను ఏర్పరచుకొన్న మతసంబంధమైన విధివిధానాలలో క్షణం తీరిక లేకుండా మునిగితేలుతూండేవాడు. అధికారాలన్నీ ప్రధానమంత్రి హస్తగతమయ్యాయి. సత్ప్రవర్తన, తెలివితేటలుగల మంత్రులు మచ్చుకుకూడా దొరికేవారు కారు. హకీమ్ మెహదీని ప్రధానమంత్రిగా ఆహ్వానించారు. ఆయన మంచి దక్షత కలవాడే కాని రాజ్యాన్నే కబళించాలనే దురాశతో ప్రజాకంటకంగా ప్రవర్తించాడు. అనంతరం రోషన్ ఉద్దౌలా ఆ స్థానాన్ని ఆక్రమించాడు. కాని అసమర్థుడవడంవల్ల ఆయనపాలన అధ్వాన్నంగా తయారైంది. పాదుషా కోట్లకొద్దీ సంపత్తిని విచ్చలవిడిగా వెచ్చించాడు. ఖజానా ఖాళీ అయిపోయింది. పన్నులద్వారావచ్చే ఆదాయం

రాజభవనపునిర్మాణాలకు వాడేస్తూ ప్రజోపయోగకరమైన పనులేమీ చెయ్యకుండా ఆయన చాలా చెడ్డపేరు తెచ్చుకొన్నాడు. దీనికితోడు పాదుషాకి ఆయన తల్లికీ మధ్యగల మాటపట్టింపులు, పోట్లాటలు రచ్చకెక్కాయి. ముఖ్యంగా పాదుషా వారసుని విషయంలో బహిరంగంగా పోట్లాడుకొంటూండేవారు. 'మున్నాజాన్' పాదుషాపుత్రుడు, నిజమైనవారసుడూ అని ఆమె అంటూండేది. కాని పాదుషా 'మున్నాజాన్' నావల్ల పుట్టలేదు, అతడు నాకొడుకు కాదు, వారసు డంతకంటే కాదు అని వాదిస్తూండేవాడు. ఇటువంటి అసహ్యకరమైన విషయాలు రచ్చకెక్కి 'బాద్‌షాహ్' పరిపాలనావ్యవస్థకు అసమర్థుడనీ, రాజ్యాన్ని అంతంచేసేందుకే అతడు పుట్టాడనీ జనులు అభిప్రాయపడసాగారు.

పరిపాలనావ్యవస్థను తీర్చి దిద్దించవలసినదనీ, ప్రజల అసంతృప్తిని పోగొట్టి కొద్దో గొప్పో ప్రజాహితకార్యాలను కూడాచేస్తూ శాంతిని స్థాపించవలసిందనీ రెసిడెంట్, గవర్నర్ జనరల్ అనేకసార్లు నయాన్నా-భయాన్నా పాదుషాకు చెప్పి చూశారు. కాని ఆయన బొత్తిగా వినిపించుకోలేదు. నసీర్ ఉద్దీన్ హైదర్ పాదుషా భోగవిలాసాలలో మునిగిపోయి సర్వదా ఆడవాళ్లమధ్య వుంటూ ఆడవాళ్లలాగే మాట్లాడుతూండేవాడు. అంతేకాదు, ఆడవాళ్లదుస్తులనే ధరిస్తూండేవాడు. స్త్రీ సహజ భావాలను అలవర్చుకోవడంతోపాటు తన మతవిశ్వాసాలు వెర్రితలలు వేయగా పన్నెండు ఇమామ్‌ల ఉత్సవాల్ని తనపద్ధతిలో జరిపిస్తూండేవాడు. వాటిని ఆయన తల్లి కొన్నేళ్లక్రితం ప్రారంభించినవిషయం పాఠకులకు విదితమే; వాటిని ఆయన ఇంకా ముమ్మరంగా కొనసాగించాడు. ఈ ఉత్సవాలలో ఆయన 'గర్భవతి'గా నటించేవాడు. ప్రసూతిగృహంలో కడుపుకి గుడ్డలు కట్టుకొని గర్భిణీస్త్రీలా కూర్చొనేవాడు. ప్రసవవేదనను ప్రకటిస్తూ కుహనాశిశువును కనేవాడు. ఆ శిశువుకు బారసాల, ఛటీ, స్నానం వగైరా వేడుకలని రాజోచితంగా జరిపిస్తూండేవాడు. ఇటువంటివే అనేకఉత్సవాలు సంవత్సరమంతా ఎడతెరిపిలేకుండా జరిపిస్తూ ఆయన వాటిలో మునిగి తేలుతూవుండేవాడు. ఇంక పరిపాలన వ్యవహారాలవైపు కన్నెత్తి చూసేందుకైనా ఆయనకి తీరిక వుండేదికాదు.

రెసిడెంట్, గవర్నర్ జనరల్ ఉదారంగా ప్రవర్తించివుండకపోతే, ఇంగ్లాండ్ లోని బోర్డ్ ఆఫ్ ఇండియన్ ఎఫైర్స్, ఈస్టిండియా కంపెనీకి క్లెయింవేసి అదుపులో

వుండేట్లు చేసివుండకపోతే అయోధ్య ఆస్థానం ఈ పాదుషాచేతుల్లోంచి ఎప్పుడో జారిపోయివుండేదని చెప్పవచ్చు. ఆడంగిచేష్టలుచేసే పాదుషా ఆస్థానాన్ని కబళిం చేందుకు ఆంగ్లేయులు సరియైన అదనుకోసం బహుశః పొంచివున్నారని భావించ వచ్చు.

ఈ ఆడంగిచేష్టలు, కుర్రతనపుచేష్టలుమాత్రమే పాదుషాకుగల బలహీనతలు కావనీ, ఆయన చాలా దుర్మార్గుడుకూడా అనీ లక్నోలోని విశ్వసనీయులైన పెద్దలు చెప్తుంటారు. ఆడవాళ్ళమధ్య - ముఖ్యంగా అందమైన అమ్మాయిలమధ్య పాదుషా సర్వకాల సర్వావస్థలలోనూ గడుపుతూవుండడంవల్ల ఆయన దుర్మార్గాలకు, క్రూర త్వానికి గురిఅయిన వాళ్లలో ఎక్కువశాతంలో అందమైన యువతులేనని ఆ పెద్దల అభిప్రాయం. చిన్నచిన్నపొరపాట్లు, తప్పులుచేసిన ఎందరో అందమైన యువతుల్ని ప్రాణాలతోనే పాదుషా సమాధి చేయించాడనీ, చెట్టాపట్టాలువేసుకొని వెడుతున్న భార్యాభర్తల జంటని పట్టించి ,భార్య స్తనాలనీ, భర్తచేతుల్నీకోయించి పారేశాడనీ, ఇలాంటివే పాదుషా పరమ కిరాతకకృత్యాలను, లక్నో నివాసులు బాధపడుతూ వివరిస్తుంటారు.

పదేళ్ళపాటు జనకంటకంగా, అటు ప్రజల్నీ ఇటు రాజమహల్‌లోనివారినీ ఎంతో హింసిస్తూ అయోధ్యలోని ప్రతివ్యక్తిని విసిగించి. విసిగించి క్రీ. శ. 1837 లో విషప్రయోగంవల్ల నసీర్ ఉద్దీన్ హైదర్ హత్యచేయబడ్డాడు. ఆయనకి పిల్లలు పుట్టలేదు. గాజీఉద్దీన్‌భార్య బేగమ్ సాహబా, అంటే నసీర్ ఉద్దీన్ హైదర్ తల్లి 'మున్నాజాన్'ను తన మనుమనిగాను, రాజ్యానికి నిజమైన వారసునిగాను ఎంచేది. కాని నసీర్ ఉద్దీన్ హైదర్ తల్లి ప్రచారాన్ని, ఎన్నికనూ బాహాటంగా ఖండిం చాడు. ఈ అభిప్రాయభేదాలని దృష్టిలోపెట్టుకొనే ఆంగ్లేయులు నవాబ్ స ఆదత్ అలీఖాన్ కుమారుడైన 'నసీర్ ఉద్దౌలా ముహమ్మద్ అలీఖాన్‌ను అయోధ్యరాజ్య వారసునిగా నిర్ణయించారు. కాని బేగమ్ సాహబా ఆంగ్లేయులు నిర్ణయించిన వార సుణ్ణి అంగీకరించలేదు. మున్నాజాన్‌కి రెసిడెంట్ ఎంతచెప్పినా వినకుండా పట్టాభి షేకం చేయించింది. సింహాసనం ఎక్కగానే మున్నాజాన్‌ను ముద్దుపెట్టుకుంది. తన శత్రువులపై ప్రతీకారచర్యలు తీసుకొనేకార్యక్రమాన్ని ఆయనద్వారా అమలు జరిపించింది. అనేకుల ఇళ్ళను దోచుకొనేలా చేసింది. కొందర్ని ఖైదు చేయించింది. మూక ఉమ్మడిహత్యలు జరిపించింది. దానితో లక్నో అట్టుడికినట్లు ఉడికిపోయింది.

రెసిడెంట్ తన అనుచరులతోసహా వెంటనే ఆస్థానానికి వచ్చాడు. 'మున్నాజాన్ అయోధ్య ఆస్థానానికి వారసుడుకాదు. ఈప్రయత్నంలో మీకెంతమాత్రం విజయం సిద్ధించద'ని చెపుతూ ఆయన బేగమ్ సాహబాకు, గవర్నర్ జనరల్ లిఖితపూర్వకంగా వ్రాసిపంపించిన తాఖీదు చూపించాడు. వెంటనే మున్నాజాన్‌ను దింపేసి నసీర్ ఉద్దౌలాకు పట్టాభిషేకం చేయించవలసిందని ఆయన కోరాడు. కాని ఎవరూ ఆయనమాటలని వినిపించుకోదలచలేదు. అంతేకాక బేగమ్ సాహబా మనుష్యులు కర్రలనీ, కటారులనీ అసిస్టెంట్ రెసిడెంట్‌పై ప్రయోగించారు. ఆయన మొహం, శరీరం రక్తసిక్తమైంది. ఇటువంటిదేదో జరుగుతుందని రెసిడెంట్ ముందే తగిన జాగ్రత్త వహించాడు. పట్టాభిషేక భవనం ఎదుట ఫిరంగులతోవున్న ఆంగ్లసైనికులనీ, ప్రాంగణంలో తుపాకులుపట్టుకు నిలిచిన ఆంగ్ల పదాతిదళాన్ని ఆయన సిద్ధపరచివుంచాడు. ఇంక గత్యంతరంలేక రెసిడెంట్ తన చేతిలో గడియారాన్ని పట్టుకొని 'మీకు పదినిమిషాలవ్యవధి ఇస్తున్నాను. ఈలోగా 'మున్నాజాన్' సింహాసనం నుంచి దిగి దాన్ని ఖాళీచెయ్యాలి. లేకపోతే కఠినచర్యను తీసుకోవలసివస్తుంది' అని అన్నాడు. అయినా రెసిడెంట్ హెచ్చరికను ఎవ్వరూ లక్ష్యపెట్టలేదు. 'ఇంక అయిదునిమిషాలే వుంది'—'ఇంక రెండునిమిషాలకంటె ఎక్కువవ్యవధి లేదు'—'ఒక్కనిమిషమే ఇంక మిగిలింది' అంటూ నిమిష నిమిషానికి రెసిడెంటు శాంతంగా హెచ్చరికచేస్తూ నుంచున్నాడు. వీటినీ వాళ్ళుపెడచెవినిపెట్టేరు. సరిగ్గా పదినిమిషాలు పూర్తికాగానే ఫిరంగులు పేలాయి. ముప్పై నలభైమంది వెంటనే చచ్చిపడిపోయారు. ఆస్థానాధికారులు పడుతూ, లేస్తూ పారిపోయారు. నృత్యగానమండలిలోని వ్యక్తులు ఎక్కువగా గాయపడ్డారు. అద్దాలు, గాజుపాత్రలు వగైరా ధన్ ధన్ మనేశబ్దంతో ఛిన్నాభిన్నమైపోయాయి. కొందరు విశ్వాసపాత్రులైన రాజభక్తిగల వీరులు ఆంగ్లేయులను ఎదుర్కొని వాళ్ళతాకిడి కాగలేక వీరస్వర్గమలంకరించారు. మున్నాజాన్ ఇంక లాభంలేదనుకొని సింహాసనంమీదనుంచి దూకి పరుగు లంకించుకొన్నాడు. కాని పట్టుపడ్డాడు. కేవలం బేగమ్‌సాహబాను, మున్నాజాన్‌ను ఆంగ్లేయులు ఖైదుచేశారు. నసీర్ ఉద్దౌలాను సింహాసనమెక్కించి పట్టాభిషేకం చేశారు. ఆయన 'మహమ్మద్ అలీ షాహ్' అనేపేరుతో అయోధ్య ఆస్థానానికి పాదుషాగా ప్రకటించబడ్డాడు. మున్నాజాన్, బేగమ్ సాహెబాలను లక్నోనుంచి కాన్‌పూర్, అక్కడినుంచి చినార్‌గఢ్ ప్రవాసానికి పంపించారు. నెలకు రెండువేల నాలుగువందల

రూపాయలు వారుభయుల ఖర్చులనిమిత్తం లక్నో ఖజానానుంచి పంపిస్తూవుండేం దుకు నిర్ణయించబడింది.

పట్టాభిషిక్తుడైన మహమ్మద్ అలీషాహ్ వయస్సు అరవైమూడేళ్ళు. వయస్సు మళ్ళిన ఉపాయశాలి అయివుండడంవల్ల ఆయన కాలానుగుణ్యమైన ఎగుడుదిగుళ్ళనీ ఆస్థానపు కుర్రచేష్టలను చూస్తూ ఊరుకొనేవాడు. ఆయన సఆదత్ అలీఖాన్ పుత్రుడై వుండడంవల్ల అన్నీ కళ్ళారాచూసిన అనుభవజ్ఞుడే అని చెప్పవచ్చు. ఆయన అతి జాగ్రత్తతో ప్రతివిషయాన్ని గమనిస్తూ మితవ్యయాన్ని పాటింపచేస్తూ వీలైనంతవరకూ పరిపాలనావ్యవస్థను చక్కబరిచేందుకు ప్రయత్నించాడు. కాని వయోవృద్ధుడవడంవల్ల శక్తి ఉడిగిపోయింది. సింహాసనారూఢుడవగానే ఆయన ఫర్‌ఖాబాద్ నుంచి హకీమ్ మెహదీని పిలిపించి ప్రధానమంత్రిపదవిని, రాజకీయవస్త్రాలను ఇచ్చాడు. అయితే రెండు మూడు నెలలైనా తిరక్కుండానే మెహదీ మరణించాడు.

అనంతరం జహీర్ ఉద్దౌలాను ప్రధానమంత్రిగా నియమించాడు. ఆ ప్రధాన మంత్రికూడా రెండు మూడు నెలలలో దివంగతుడయ్యాడు. ఆ తరువాత మునవ్వర్ ఉద్దౌలా ప్రధానమంత్రిగా ప్రకటించబడ్డాడు. ఈ ప్రధానమంత్రి, నాలుగునెలలు గడిచాయో లేదో తనపదవికి రాజీనామా ఇచ్చేసి కర్బలా వెళ్ళిపోయాడు. చివరికి అశ్రఫ్ ఉద్దౌలా ఇబ్రాహిమ్ ఖాన్ ప్రధానమంత్రిగా నియుక్తుడయ్యాడు. ఆయన మిగతా అందరికంటే తెలివైన గంభీరప్రకృతిగల వ్యక్తి. మహమ్మద్ అలీషా పట్టాభిషిక్తుడయ్యాక అయోధ్య ఆస్థానానికీ ఆంగ్లేయులకూ మధ్య ఒక ఒప్పందం జరిగింది. ఈ ఒప్పందంప్రకారం ఆంగ్లేయులసైన్యం అయోధ్యలో విస్తృతపరచబడింది. అంతేకాదు, అయోధ్యలో ఏ ప్రాంతంలోనైనా లేక మొత్తం అయోధ్య ఆస్థానం అంతటాకూడా పరిపాలనావ్యవస్థ బిగి తగ్గిపోయినట్లుకనిపిస్తే ఆంగ్లేయులు అటువంటిప్రాంతాన్నికాని లేక అయోధ్య మొత్తంరాజ్యాన్నికాని స్వాధీనపరచుకొని ఎంతకాలంపడితే అంతకాలం పరిపాలించవచ్చును. పాదుషా అయిష్టంగానే ఆ ఒప్పందంపై సంతకం చేశాడు. వీలైనంతవరకూ ఆస్థానవ్యవస్థను సంస్కరించేందుకు ఆయన శక్తివంచనలేకుండా ప్రయత్నించాడు.

పట్టాభిషిక్తుడైన మరుసటిసంవత్సరమే పాదుషా తన ఇమామ్‌బాడా హుసైనాబాద్‌ను, దానికి సమీపంలో ఒక అందమైన మసీదును నిర్మింపజేశాడు. ఆ మసీదు

ఢిల్లీలోని జుమ్మామసీదుకంటే ఎక్కువ పెద్దదిగాను, శోభాయమానంగాను ఉండేందుకు తగిన ఏర్పాట్లు ఆయన చేశాడు.

ఆరోజుల్లో లక్నో జనాభా, దానితోపాటు పట్టణశోభ ఎంతో వృద్ధిచెందాయి. లక్నో చుట్టుప్రక్కలకూడా అనేకమంది నివసించసాగారు. దాన్ని హిందూదేశపు 'పుట్టిల్లు' అని పిలవడం అనుచితంకాదు. నిజానికి ఆనాటి లక్నోపట్టణం ఏ దృక్పథంతో చూసినప్పటికీ ఆరోజుల్లో అది పుట్టిల్లుగా విలసిల్లింది.

ఈ పోలికనుగురించి ఆస్థానంలోని పెద్దలో, ఆంగ్లేయులో ప్రశంసించడం వల్ల మహమ్మద్ అలీషాహ్ లక్నోను సంపూర్ణంగా బాబుల్‌లా చేసేయాలనీ, తన పూర్వీకులకంటే తనను ఎక్కువ చిరస్థాయిగా తలచుకొనేందుకు అనువైన గొప్ప స్మారకచిహ్నాన్ని 'బాబుల్ మీనార్' లేక 'హవాయీ బాగ్'వంటి కట్టడాన్ని హుస్సేనాబాద్‌కి సమీపంలో నేటి ఘంటా స్తంభందగ్గర నిర్మించసాగేడు. అర్చీలమీద అర్చీలు కట్టించి ఏడంతస్థులభవనాన్ని, ప్రపంచంలో అన్నిటికిమించిన గొప్ప ఎత్తయిన మీనార్‌ను కట్టించాలని, ఆ మీనార్‌మీద కెక్కిచూస్తే లక్నో పట్టణం చుట్టుపక్కల మైదానాలు కనిపించాలని ఆయన ఆశయం. ఆ మీనార్‌కి 'సత్ ఖండా' ఏడంతస్థుల మీనార్ అని పేరు పెట్టాలనికూడా ఆయన ఆశించాడు. ఆయన అనుకున్నట్లు అది పూర్తయితే నిశ్చయంగా అది అపూర్వమైన సాటిలేని మేటి మీనార్‌గా ఖ్యాతి వహించివుండేది. కాని అయిదో అంతస్థు పూర్తికాగానే ఆయన క్రీ. శ. 1842 లో మరణించాడు. మహమ్మద్ షాహ్ ఈ పనులన్నిటితో బాటు కొట్లాటలు, కల్లోలాలు లేకుండా ప్రజల సుఖశాంతులను సంరక్షిస్తూ అయోధ్యను చక్కగా పాలించాడు. అంతేకాదు, లక్నోపట్టణాన్ని సుందరతమంగా తీర్చిదిద్దాడు. హుసైనాబాద్ గేట్‌నుంచి రోమన్ గేట్‌వరకు నదిఒడ్డున విశాలమైన ఒక రోడ్డు వేయించాడు. రోడ్డుకి రెండువైపులా శోభాయమానమైన ఉన్నత భవంతులతోబాటు, రోడ్డుకి ఒకవైపున రోమన్‌గేటు, ఆసఫ్ ఉద్దౌలాగారి ఇమామ్‌బాడా-దానిబాపతు పెద్దమసీదు. రెండోవైపున 'సత్‌ఖండా' హుసైనాబాద్ గేటువున్నాయి. ఈ క్రొత్త ఇమామ్‌బాడాలో ఎత్తయిన గొప్పగొప్ప భవనాలనేకం వున్నాయి; వాటిప్రక్కన జుమ్మామసీదు వుంది. రోడ్డు కిరువైపులావుండే ఆ ఉన్నత భవనాలు, గేట్లు, ఇమామ్‌బాడా, మసీదు వగైరాలన్నీ కలిపి ప్రపంచంలోని అన్ని ప్రసిద్ధ

మనోహర దృశ్యాలన్నిటినీ తలదన్నినట్లు శోభాయమానంగా వుండేవి. ఇప్పు డవన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి. అయితే వాటిని ప్రపంచంలోని సుందర తమదృశ్యాలుగా అంగీకరించవలసి వుంటుంది.

# 7

మహమ్మద్ అలీషాహ్ అనంతరం అమ్జద్ అలీషాహ్ సింహాసన మెక్కాడు. ఆయనకు యువరాజదశలో ఉన్నతవిద్య నేర్పించాలనే ప్రయత్నం జరిగింది. అందుకే ఆయనను విద్వాంసులమధ్య ఉంచేవారు. చదువులో అట్టే శ్రద్ధచూపక పోయినా అమ్జద్ అలీషాహ్ శిష్టాచారాన్ని, మంచిఅలవాట్లనీ, సాత్విక స్వభావాన్నీ విద్వాంసుల సాన్నిధ్యంలో నేర్చుకోగలిగాడు. ఈదృష్టితో ఆయనని మౌల్వీ, ధర్మనిష్ఠగల ముసల్మాన్ అనవచ్చును. ప్రజలంతా తనను ధార్మికుడైన బాద్‌షాహ్‌గా గుర్తించగలగాలనే అభిలాషమాత్రం సింహాసనమెక్కిన తొలిరోజులలో ఆయనకు వుండేది. కాని ధార్మికవేత్తలు, సాత్వికస్వభావశీలురు వేరు - రాజనీతిజ్ఞులు, రాజమర్మజ్ఞులు వేరూను. ఆయన చివరివి రెండింటికి అందుబాటులోవున్న వ్యక్తికాదు. సయ్యద్ ముస్లిం ధార్మికవేత్తలసేవ చేయించవలసిందనీ, ఖజానాలోని డబ్బును ఈశ్వరభక్తుల సహాయార్థం ఖర్చుపెట్టవలసినదనీ ఆయన తరుచు తన అధికార్లను ఆదేశిస్తూండేవాడు. ఈ దానధర్మాలుకూడా శ్రద్ధాభక్తులతో, సంయమంతో, సత్‌శీలాలతో అలరారే అయోధ్య పాదుషా తన చేతులమీదుగాకాకుండా 'ముజ్తాహిద్-ఉల్-అస్ర్'గారి మంగళకర 'కర-కమలాల'మీదుగా జరిపించడం గమనించదగినవిషయం. అలా జరిపించడమే ఆయనకు సంతోషకరంగావుండేది. అందువల్ల రాజ్యం ఆదాయంలో లక్షలకొద్దీరూపాయలు దానధర్మాలపేరిట 'అస్ర్' గారికి అర్పించబడుతూవుండేవి. వీటితోబాటు ధర్మనిధినుంచికూడా ఎంతోడబ్బు ఆయనకు హస్తగతమౌతూండేది.

అమ్జద్ అలీషాహ్‌ను సంయమం, పరిశుద్ధత మొదలైన ఆలోచనలు మొండి రోగాలుగా పట్టుకున్నాయి. వీటిబంధనాల్లో చిక్కుకునివుండడంవల్ల పరిపాలన వ్యవ

హారాలను గమనించేందుకే ఆయనకు బొత్తిగా తీరిక చిక్కేదికాదు. మహమ్మద్ అలీషాహ్ తన అనుభవం, బుద్ధికుశలతతో చేసిన మంచిఏర్పాట్లన్నీ 'అమ్‌జద్' కాలంలో వమ్ము అయిపోవడం జరిగింది. 'రాజ్యాధికారులు-ఉద్యోగులు-నౌకర్లు, అన్యాయపరులుగా స్వార్థపరులుగా తయారయ్యారు. ప్రజలస్థితి అధోగతిపాలై పోయింది. అన్యాయదండం ప్రజలనెత్తిమీద తాండవమాడసాగింది. దుర్మార్గులకు, నేరస్థులకు శిక్షఅనేది లేకుండాపోయింది. ఖజానా ఖాళీ అయింది. లంచగొండితనం పెచ్చుపెరిగింది. గందరగోళాలను,పోట్లాటలను అణిచే నాథుడంటూ లేకపోయాడు' అని కాజీ ముహమ్మద్ సాదిక్‌ఖాన్‌గారి వక్తవ్యంవల్ల మనం గ్రహించవచ్చు.

కాని సంయమశీలంతో జనసామాన్యహితం పరికించడంలో ఉదాసీనత, నిర్లక్ష్యం చూసినప్పటికీ అమ్‌జద్ అలీషాహ్‌మూలంగా లక్నోపట్టణానికీ, ప్రజానీకానికి కొన్ని మేళ్ళుకూడా చేకూరకపోలేదు. నేటి లక్నోనగరం మొత్తంలో ఎక్కువ దట్టమైన జనాభాతో పరిశుభ్రంగా, మిక్కిలి ధనవంతులైన వ్యాపారస్థుల పెద్దపెద్ద దుకాణాలతో అత్యంతశోభాయమానంగా విలసిల్లే 'హజ్‌రత్ గంజ్' వీధిని అనాడు ఆయనే నిర్మించాడు. సివిల్ లైన్స్‌లోని, అన్నిటికంటే మించిన సుందరతమభాగంగా దీన్ని ఎంచవచ్చు. ఇంతేకాకుండా ఆయన లక్నోనుంచి తిన్నగా కాన్పూర్‌వరకూ వెడల్పాటిరోడ్డు వేయించాడు. నదిపైన ఇనుపవంతెనను నిర్మింపచేయడమనే మహత్కార్యం ఆయన చేసిన మంచిపనులలో ప్రధానమైనదని ప్రశంసించవలసి వుంటుంది. ఈ వంతెననిర్మాణం అనేకసంవత్సరాలుగా, ఆయన పూర్వీకుల నిర్వి రామకృషివల్లకూడా జరగకుండా వాయిదా పడుతూవచ్చి ఆయనకాలంలో పూర్తి అవడం ముఖ్యంగా గమనించదగినది. ఈ వంతెనకు అవసరమైన ఇనుపసామగ్రిని 'గాజీ ఉద్దీన్ హైదర్' ఇంగ్లాండునుంచి తెప్పించాడు; కాని ఆ సామగ్రి లక్నో చేరుకొనేలోగానే ఈ సారహీనమైన ఇహలోకాన్నివిడిచి ఆయన కన్నుమూశాడు. నసీర్ ఉద్దీన్ సమయంలో ఆ సామగ్రి లక్నో చేరింది. ఆయన తన ఆస్థానపు ఇంజినియర్ మిస్టర్ సింక్లేయర్‌ను వంతెన నిర్మాణానికి పురమాయించి, ఇంగ్లాండు నుంచివచ్చిన ఇనుపసామగ్రిని రెసిడెంసీకి ఎదుట నదికి అవతలగట్టున సురక్షిత పరచాలని ఆయన ఆదేశించాడు. ఆ ఇనుపసామగ్రి గిడ్డంగులు ఇప్పుడు లేకపోయినప్పటికీ అక్కడ దీనిజ్ఞాపకార్థం ఒక దేవాలయం, రేవు ఇప్పటికి మిగిలివున్నాయి.

నదిలో స్తంభాలు పాతేనిమిత్తం సింక్లేయర్ పెద్దపెద్ద నూతులలాంటి లోతైన గోతులు తవ్వించాడు. ఇనుప స్తంభాలను జోడించేపనికూడా పూర్తి చేయించాడు. ఆ తరువాత ఆయన ఏం చేసినట్లు కనిపించదు. వంతెననిర్మాణం పూర్తి కాలేదు. మహమ్మద్ అలీషాహ్‌కాలంలో ఈ వంతెనపని అసంపూర్తిగా అలాగే నిలిచిపోయింది. కాని అమ్‌జద్ అలీషాహ్ వంతెననిర్మాణాన్నిగురించి తగినశ్రద్ధ తీసుకొన్నాడు. ఫలితంగా చక్కనివంతెన తయారైంది. కాని లక్నోలో నేడున్న ఇనుపవంతెన అమ్‌జద్ నాటిదిమాత్రం కాదు. అది హేంగింగ్ బ్రిడ్జి. నాలుగు స్తంభాలపైన బరువంతామోపి మధ్యలో ఊగే వంతెనగా అది రూపొందింది. ఆంగ్లేయులకాలంలో దాని చక్రాలపైన యుద్ధం జరిగింది. అవి బలహీనమై పోయాయి; వంతెనపై రాకపోకలు అపాయంతోకూడిన పనిగా భావించపడింది. అందువల్ల దాన్ని పడగొట్టించి ఆంగ్లేయులు కొత్త ఇనుపవంతెనను కట్టించారు. అదే ఇప్పటి వంతెన.

అమ్‌జద్ అలీషాహ్‌కాలంలోనే అయోధ్య ప్రధానమంత్రి అమీన్ ఉద్దౌలా 'అమీనాబాద్'ను కట్టించాడు. ఆ ఉపనగరం ప్రస్తుతం మూడుపువ్వులు ఆరు కాయలుగా దినదినాభివృద్ధి అయి లక్నో శోభకు ఇనుమడింపచేస్తోంది. అమ్‌జద్ అలీషాహ్ తనకాలంలో కొత్త కట్టడాలను కట్టించకపోయినప్పటికీ ఆయన అద్భుతమైన నిగ్రహశక్తిగల పవిత్రహృదయు డవడంవల్ల, ఈనాటి లక్నోలో అమితజనాభాతో కిలకిలలాడే భాగ్యవంతమైన సుప్రసిద్ధ ఉపనగరాలైన హజ్‌రత్ గంజ్, అమీనాబాద్ ఆయనకాలంలోనే నిర్మితమై, ఆయన ప్రసిద్ధిపొందేందుకు దోహదమిచ్చాయి. నలభై ఎనిమిదేళ్ళవయస్సులో, కేన్సర్ వ్యాధిపీడితుడై క్రీ. శ. 1848 లో ఆయన కన్నుమూశాడు. ఆయన నిర్మించిన హజ్‌రత్‌గంజ్‌లో 'మేండూఖాన్ రిసాల్‌దార్-ఛావనీ'లో ఆయన సమాధి చేయబడ్డాడు. హజ్‌రత్ గంజ్‌కి పడమటివైపునవున్న ఇమామ్‌బాడాలో ఆయన అంత్యక్రియలు జరిగాయి. ఆయన మరణానంతరం వాజిద్ అలీషాహ్ పదిలక్షల రూపాయలఖర్చుతో ఆయన సమాధిభవనం కట్టించాడు. ఈ ఇమామ్‌బాడా 'హుసైనాబాద్ ఇమామ్ బాడా'లాంటి ఉత్కృష్టమైనదికాదు. ఇక్కడ దానధర్మాలకు తగిన ఏర్పాటు చేయబడలేదు. వీటికి ఏర్పాటు జరిగివుంటే ముహర్రమ్‌రోజులలో లక్నో

తూర్పువైపుకూడా శోభాయమానంగా వుండివుండేది. ఈ ఇమామ్‌బాడాకి పెన్షన్ నిర్ణయించబడకపోయినప్పటికీ, తగినఆదాయంమాత్రం వుంది. కట్టడం వెలుపలి వైపునవున్న దుకాణాలను పెద్దపెద్ద వ్యాపారస్థులు అద్దెకు తీసుకున్నారు. లోపలి వైపు వాటాలలో ఎందరో యూరోపియన్లు అద్దెకుంటున్నారు. వీట్లవల్ల ఆదాయం బాగానే వస్తుంది. అద్దె వసూలుచేసేవాళ్ళ దయవల్ల ముహర్రం సమయంలో గోరీ పైన, ఇమామ్ బాడాలో అక్కడక్కడ కొద్దిగా దీపాలు వెలుగుతూంటాయి.

అమ్‌జద్ అలీషాహ్ అనంతరం ఆయన పెద్దకుమారుడు వాజిద్ అలీషాహ్ సింహాసనారూఢుడయ్యాడు. ఆయనకాలం ఈ ప్రాచ్య ఆస్థాన ఇతిహాసానికి చివరి పుట అనీ, ఈ ప్రాచ్య శోకగీతికకు అంతిమచరణమనీ అనవచ్చు. అయోధ్య పరిపాలనావ్యవస్థ ఆయనకాలంలోనే పతనమైపోయింది కనుక అందరి తీవ్రవిమర్శలకు ఆయనే గురి అయ్యాడు. కాని వాస్తవానికి అయోధ్య పరిపాలనావ్యవస్థ పతనమై పోయినకాలంలో భారతదేశంలోని జాతీయశక్తులన్నీ ఒకొక్కటే పతనమైపోవడం గమనించవలసినవిషయం. మంచి చెడు తారతమ్యాలులేకుండా ప్రాచీనపరిపాలనా వ్యవస్థలు ఈ ప్రపంచంనుంచి మాసిపోనారంభించాయి. వీరులు, ధీరులు, బుద్ధిశాలురు అయిన పంజాబ్‌లోని శిక్కులు, దక్కన్‌లోని మహారాష్ట్రుల అధ్వర్యంలోని రాజ్యాలు ఎందుకు సమసిపోయాయి? వారూ ధైర్యశాలురు, శౌర్యవంతులు, తెలివైనవారేకదా। లక్నో పాదుషాలలోని కుర్రతనపుచేష్టలు బొత్తిగా కనిపించని ఢిల్లీలోని మొగల్‌ల సామ్రాజ్యం, బెంగాల్‌లోని నవాబ్ నాజిమ్ బెంగాల్‌ల పతనాలు ఎందుకని సంభవించాయి? పై నాలుగు ఆస్థానాలలో వాజిద్ అలీ వంటి వ్యక్తి లేకపోయినప్పటికీ వాటి పతనం, లక్నో పతనంకంటె తక్కువస్థాయిలోమాత్రం సంభవించలేదు.

ఇటు భారతీయులలో నిర్లక్ష్యం, అజ్ఞానం చరమస్థాయి నందుకొన్నాయి. అటు ఆంగ్లసామ్రాజ్యశక్తి, ఆంగ్లేయులలోని దూరదృష్టి, సాధన, యోగ్యత, ఉచ్ఛ సంస్కృతి, సభ్యత సత్ఫలితాన్నిపొందేందుకు వారు పాత్రులని రుజువుచేశాయి. ఆంగ్ల రాజనీతిజ్ఞుల బుద్ధికుశలత, క్రమశిక్షణ, వ్యవహారదక్షత, సమయస్ఫూర్తి భారతీయుల అజ్ఞానం, ఆత్మవిస్మృతులపై విజయాన్ని సాధించాయి. ఆకాలం ప్రపంచంలోని సంస్కృతికి ఒక క్రొత్తరూపాన్ని ఇచ్చింది. 'నన్ను వరించనిజాతి నశించి

పోతుంది' అని ఈ క్రొత్తసంస్కృతి ప్రపంచంలోని ప్రతిజాతినీ హెచ్చరించింది. కాని ఈ హెచ్చరికను వినిపించుకొనే ఓపిక భారతీయులలో, ముఖ్యంగా భారత దేశ రాజ్యాధిపతులలో లేకపోయింది. ఫలితంగా దేశీయ ఆస్థానాలు అధఃపతనమై పోయాయి. ఇలా పతనమైన ఆస్థానాలలో 'అయోధ్య'కూడా వుంది. ఈ పతనానికి సంబంధించిన బాధ్యతనంతనీ పాపం! వాజిద్ అలీషాహ్ నెత్తిన రుద్దడం చరిత్రకు అపచారం చేయడమే అవుతుంది.

మతవిషయాలపట్ల శ్రద్ధగల తండ్రి, వాజిద్ అలీషాహ్‌ను విద్వాంసుల సాంగత్యంలోవుంచి తన అంతవాణ్ణి చేయాలని తాపత్రయపడ్డాడు. ఆయనధ్యేయం కొంత వరకూ నెరవేరిందని చెప్పాలి. యవ్వనావస్థలో అంత ప్రస్ఫుటంగా కనిపించక పోయినా వయస్సు మళ్లేక వాజిద్ అలీషాహ్ ధర్మచింతనవైపు మొగ్గు చూపినట్లు దాఖలాలు కనిపించాయి. యవ్వనంలో 'వాజిద్' యువరాజులందరికీ సాధారణంగా వుండే మనఃప్రవృత్తితో భోగవిలాసాలలోను, ముఖ్యంగా లలితకళలలోనూ మునిగి తేలుతూండేవాడు. తండ్రి పట్టుదలవల్ల పాండిత్యం సంపాదించాడు. అయితే సంగీతాభిరుచికి ఆయన వశీభూతుడయ్యాడు. అందువల్ల తనతండ్రి ఆశ యానికివిరుద్ధంగా గాయకులనీ, నాట్యకత్తెలనీ చేరదీసి యువరాజుగావున్నప్పుడు ఆయన నాట్య, గానాలను నేర్చుకొన్నాడు. నృత్యంచేసే వారాంగనల సంపర్కం, ఇంకా కొంతమంది నీచజాతి యువతులస్నేహం అతని కుండేవి. అందమైన యువతులవల్ల, నృత్యగాన నిపుణులవల్ల ఆయనకు లభించే ఆనందం, విజ్ఞానసంపదతో తులతూగే పండితబృందంలో ఆయనకు లభించేదికాదు. అంతేకాక తండ్రి ఆశయాలకు విరుద్ధమైన కళపట్లకూడా ఆయన యువరాజుగావున్న సమయంలోనే మొగ్గుచూపేడు. తనకోసం ఆనందసభను, శోభాన్వితమైనతోటనూ, ఆ తోటలో రెండు అందమైన భవంతులనూ ఆయన నిర్మింపచేశాడు. 'అలీనకీఖాన్' అనేవ్యక్తి ఒక వేశ్యఇంట ఆయనకి పరిచయమయ్యాడు. 'అలీ నకీ ఖాన్'లోని యవ్వన చాపల్యం ఆయన్ని చాలా ప్రభావితుని చేసింది. అలీ నకీ ఖాన్ అధ్వర్యంలోనే ఆనందసభ, తోట, తోటలోనిభవంతులు తయారయ్యాయి. అవన్నీ యువరాజుకు ఎంతో నచ్చాయి. తన కొత్తమిత్రుడు అలీ నకీ ఖాన్ ఎంతో ప్రతిభావంతుడనే సదభిప్రాయం ఆనాడే ఆయనకు కలిగింది. వాజిద్ అలీషాహ్ పట్టాభిషిక్తుడవగానే అలీ నకీ ఖాన్‌ను, అయోధ్య మంత్రిపదవి వరించింది.

అందంగావుండే యువక పాదుషా వాజిద్ అలీషాహ్ శాంతిభద్రతలను కాపాడడం, సేనను సంస్కరించడంపట్ల విశేషమైన శ్రద్ధ చూపించాడు. ఆయన ఏనుగుకుముందు, ఒక వాహనంమీద రెండు వెండిపెట్టెలనుపెట్టించి పర్యటించేవాడు. తమకష్టాలనూ లేదా సలహాలనూవ్రాసి ఆ పెట్టెలలో పడేసేందుకు ప్రజలకు స్వాతంత్ర్యం ఇచ్చాడు. ఆ పెట్టెల తాళంచెవులు పాదుషాదగ్గరే వుండేవి. రాజభవనానికి చేరుకోగానే ఆయన స్వయంగా ఆ పెట్టె తెరిచేవాడు. కాగితాలుతీసి శ్రద్ధగా చదివి, వాటిపైన స్వదస్తూరితో అతి ఓపికగా నిర్ణయాలు వ్రాసేవాడు. ముఖ్యంగా ఆయన ఎందరో బలశాలురైన యువకులకు సైన్యంలో ఉద్యోగమిచ్చాడు. యోగ్యులైన వ్యక్తులతో అనేక సైనికదళాలు అశ్వికదళాలు కొత్తగా ఏర్పడ్డాయి. ఆయన స్వయంగా మంచి రచయిత. అశ్వికదళాలపేర్లు బాంకా, (సాహసోపేతమైన అందమగుదళం) తిరఖా, (కుటిల) ఘన్ఘోర్ (భయంకర) అనీ మామూలుసైనికదళాలకు 'అఖ్తరీ' (నక్షత్రసంబంధమైన) 'నాదరీ' (అద్భుతమైన) అనీ తన రచనాకౌశలాన్ని ఉపయోగిస్తూ పేర్లు పెట్టాడు. పాదుషా స్వయంగా గుర్రాన్నెక్కి వెళ్ళి పటాలాల కవాతును, యుద్ధకౌశలంలో వారిశిక్షణనూ తిలకిస్తూండేవాడు. దక్షతగల సైనికులకు ఆయన బహుమానాలను సహర్షంగా అందజేస్తూండేవాడు. 'రాస్త్ రౌ' తిన్నగా పురోగమించు, 'పస్‌బయా' వెనక్కి తిరోగమించు, 'దస్తర్ చప్ బగిరద్' ఎడంవైపుకి తిరుగు వగైరా సైనికశబ్దావళిని కవాతుకై పార్శీ భాషనుంచి తయారుచేశాడు. కొన్నాళ్ళతరువాత ఆయన అందమైన యువతులని సైన్యంలోకి చేర్చుకొని, ఒక చిన్న స్త్రీ సేనాదళాన్ని (జనానీ ఫౌజ్) ఏర్పాటు చేశాడు. రోజూ ఈ శబ్దావళితో వాళ్ళకూ కవాతుశిక్షణ నిప్పించేవాడు.

కాని ఆధునికయుగపు ఈ తొలిచిహ్నం చాలా కొద్దిరోజులే నిలిచింది. ఒక సంవత్సరంకూడా పూర్తి కాకమునుపే ఆయనకీ సైనిక వ్యవస్థీకరణపై విసుగు పుట్టుకొచ్చింది. యువరాజుకాలంలోని అభిరుచులు మళ్లీ ఆయనలో తలెత్తాయి. అందమైన పడుపుపడతుల సాంగత్యం ఆయన కిప్పుడు అత్యవసరం కాసాగింది; రసికులబృందాలతో కాలం గడపడం 'హాయ్' అనిపించింది. అయోధ్య ఆస్థానం మరి కొన్నాళ్ళలో వేశ్యల, తార్పుడుగాళ్ళకూటంగా తయారైపోయింది. పాదుషా హృదయంలోని ఉన్నతాభిరుచులన్నీ ఒక్క కవిత్వంతప్ప ఒక్కొక్కటే దిగజారిపోయాయి. ఆయన కవితలు వ్రాసేవాడు, కవుల్ని ఆదరించేవాడు.

ఆనాటి లక్నోలో కవిత్వ తత్వచర్చలు హద్దుమీరి కొనసాగుతూండేవి. మిగతా భారతదేశంలో కవులనీ, ఒక్క లక్నోపట్టణంలోమాత్రం వుండేకవులనీ లెక్కిస్తే లక్నోలో కవులసంఖ్యే హెచ్చుగా వుండేదనేందుకు సందేహం వుండదు. 'మీర్', 'సౌదా'ల పాతకవిత్వం ఆనాటి లక్నోదృష్టిలో వ్యర్థప్రలాపంగా మారిపోయింది. నాటి లక్నో మస్తిష్కాలు 'నాశిఖ్' భాషనూ, 'ఆతష్' ప్రతిపాదించే అభిప్రాయాలనూ మెచ్చుకొంటూండేవి. 'రింద్' 'సహబా'ల సురా, సుందరీ విషయప్రధానమైన కవితలు, కామగంధపూరితాలైన 'నవాబ్ మీర్జా షౌక్'గారి మస్నవీ (ద్విపదలు) ఇంకా, ఈ కోవకే చెందిన కవిత్వాలు రాజుకు నచ్చుతూండేవి. ఆయన స్వభావానికి అనువైన ఇటువంటి కవితలను అల్లేకవులు ఆయన ఆదరానికి పాత్రులౌతూండేవారు.

'కవులు ఒకానొక సుందరిని ప్రేమించేవారు. ఆమె సౌందర్యాన్ని, హావ భావాలనీ, కులుకుల్నీ మరీమరీ తలచుకొని విరహంలో తాము ఎంత తపనపడేది ఆమెను ఉద్దేశించి వర్ణిస్తూండేవారు. తరచు రహస్యంగా ఆమెను కలుసుకొంటూండేవారే కాని, సభ్యతా పరిధిని దాటేవారుమాత్రం కాదు' ఇస్లామీ ఖిలాఫత్‌లోని తొలిశతాబ్దంవరకూ ఇస్లామీకవిత్వతత్వం ఇలాగే వుండేది.

కొన్నాళ్లకు అరబ్బీకవితలో ప్రేయసి ఒక నిర్దిష్ట వ్యక్తిగాకాక అనామకురాలైపోయింది. కవులదృష్టిలో ఆమె ఊహాప్రేయసిగా మిగిలిపోయింది. కవులు కవిత్వంలో అందమైన యువతుల, యువకుల భోగవిలాసాలను వివరిస్తూండేవాళ్ళు. కాని సూఫీ సిద్ధాంతవాదులు వ్యంగ్యంద్వారా అర్థంలో కొంచెం మార్పుచేసి ఆ ప్రేయసిని తమ దైవముగా ఉల్లేఖిస్తూండేవాళ్ళు. ఇటువంటిధ్వని ప్రధానమైన మార్మికత కనిపించేది పార్శీకవిత్వం. ఇదేస్థాయిలో ఉర్దూ కవిత్వంకూడా వుంటూండేది. కాని 'నవాబ్ మిర్జా షౌక్' తనకవిత్వంతో అందమైన తెరచాటు పడతులపై ప్రేమను వ్యక్తపరచి సంప్రదాయాన్ని భంగపరచడానికి ప్రయత్నించాడు. ఆయన కవితలోని భాష చాలా అద్భుతంగాను, సాటిలేనిదిగాను, సూటిగాను వుండేది. లౌకికప్రణయంపట్ల ఆసక్తిచూపని పెద్దమనుష్యు లనబడేవారు సహితం ఆయన కవిత్వంలోని ప్రణయభావాలను చదివి ఆనందించకుండా వుండలేకపోవడం ఆయన 'మస్నవీల'లో వుండే గొప్పతనానికి నిదర్శనం.

వాజిద్ అలీషాహ్ వస్తుతః కవీ, రసికుడూ అవడంవల్ల ఈ మస్నవీలు ఆయన నెంతో ఆకర్షించాయి. ఆయన తన ప్రేమకలాపాలను, యవ్వనంలో జరిపిన వందల కొద్దీ కామకలాపాలను ఉటంకిస్తూ మస్నవీలరూపంలో స్వయంగా కవితలనల్లి దేశాన్నంతనీ ముంచెత్తేశాడు. ఆయన తన నైతిక అపరాధాలను ఒప్పుకొంటున్నానని వాటిలో గొప్పగా వ్రాసుకొన్నాడు. రాజులమాట అటుంచి మంత్రులు, ఉన్నతాధికారులు, ధనవంతులు తమ యవ్వనంలో, లేదా అవకాశాలు వచ్చినప్పుడు తమ కామవాంఛలను మనసారా తీర్చుకోనివారు వుండరని నా ఉద్దేశ్యం. కాని వాజిద్ అలీషాహ్ మాదిరి మరెవ్వరూ సిగ్గూ, లజ్జా లేకుండా తమ నైతికపతనాన్ని, అపరాధాలనీ పాఠకలోకందృష్టికి తెచ్చివుండదు. వాజిద్ అలీషాహ్ కవిత్వరంగంలోకి ఎంతో వేగంగా ప్రవేశించాడు. అదేవేగంతో ఈ రంగంలోంచి ఆయన తిరోగమించాడు. అయితే తన చెడ్డపనులనీ, భావాలనీ, అభిప్రాయాలనీ లోకం ముందుకు నిర్భయంగా తీసుకురావడంలో 'నవాబ్ మిర్జా' కంటె రెండడుగులు ముందుకు పురోగమించాడనిమాత్రం చెప్పక తప్పదు. అవసరమనుకొన్న సందర్భాలలో నింద్యమైన బజారుభాషనూ, అశ్లీలతనూకూడా ప్రయోగించడంలో ఆయన ఏమాత్రం సంకోచించలేదు.

బోయజాతిస్త్రీలు, వేశ్యలు, దాసీలు, రాజభవనంలోకి వచ్చేపోయే రసికయువతులు, డబ్బు అవసరానికి కక్కూర్తిపడే రకరకాలస్త్రీలు ఆయన కామ వాంఛలకు బలిఅయినట్లు, తాను యువరాజు కనుక తన కామకలాపాలలో సంపూర్ణంగా సఫలుడైనట్లు స్వయంగా అతని రచనలనుబట్టి తెలుస్తుంది. సిగ్గుతో తల దించుకోవలసిన ఈ కామవృత్తాంతాలను ఆయన తన కవితలలో, ఇతర రచనలలో చూడవచ్చు. అందుకే ఆయనప్రవర్తన అందరికంటే ఎక్కువ అపవిత్రమైనదిగాను, కలుషితమైనదిగాను అయోధ్య చరిత్రలో కనపడుతుంది.

ఆయనకు భవననిర్మాణంపట్ల అమితమైన అభిరుచివుండేది. సింహాసనమెక్కగానే కైసర్‌బాగ్ భవననిర్మాణాన్ని ప్రారంభింపచేశాడు. అవి ఆసఫ్ ఉద్దౌలా కాలంనాటిభవనాలలా దృఢమైనవి కాకపోయినప్పటికీ అందంలోను, తళుకు బెళుకులలోనూ ఆకర్షణీయంగా తయారయాయని ఒప్పుకోవలసివుంటుంది. వీటిలో అందమైన, ఉన్నతమగు రెండంతస్థులమేడల వరస అర్ధచంద్రాకారంలో దూరం

దాకా వ్యాపించింది. ఈ వరసలో ఒకభాగం నదివైపు, మిగతాభాగాలు కైసర్‌బాగ్ మైదానంవైపు వుండేవి. నదివైపుభాగం గదర్ విప్లవానంతరం త్రవ్వివేయబడింది. మిగతా దిశలలోని భాగాలు ఇప్పటికి చెక్కుచెదరకుండా వున్నాయి. వాటిని అనేక విభాగాలుగాచేసి అయోధ్య తాలూకుదార్లకు ఆంగ్లప్రభుత్వం అప్పగించింది. వాటిలో నివసిస్తూ వాటిని యథాస్థితిలో వుంచవలసినదిగా తాలూకుదార్లను ఆదేశించింది.

కైసర్‌బాగ్‌లోని సమతలభూమి చెట్లుచేమలతో నిండివుంది. అందులోనే 'జిలౌఖానా' అశ్వశాల వుంది. మధ్యలో 'బారాదరీ' రాతికట్టడం వుంది. అది టౌన్‌హాల్‌గా ప్రస్తుతం ఉపయోగించబడుతూవుంది. ఇవేకాక ఇంకా ఎన్నోభవనాలు ఇక్కడ ఆ రోజుల్లో వుండేవి. మొత్తంమీద ఇవన్నీకలిసి, ప్రపంచంలోని ఒక ఉత్తమప్రదేశంగా కైసర్‌బాగ్‌కు పేరు తెచ్చాయి. ఈ భవనాలన్నీ కైసర్‌బాగ్ తూర్పుద్వారం బయటవున్నాయి. ఆ గేటు దాటగానే రెండువైపులా కఱ్ఱతో అమర్చిన గోడల్లాంటివి కనిపిస్తాయి. కొంతదూరం నడిచాక చీనీబాగ్ వస్తుంది. అక్కడినుంచి ఎడమప్రక్కగా తిరిగి జలకన్యల చిత్తరువులతో అలంకరింపబడిన ఒక బ్రహ్మాండమైనద్వారం కనిపిస్తుంది. అక్కడ ప్రధానమంత్రి 'నవాబ్ అలీనకీ ఖాన్' భవనం వుండేది. సదా ఆయన రాజుగారికి అందుబాటులోవుంటూ అవసరమైనప్పుడు పిలవగానే వెంటనే రాగలిగేందుకు వీలుగా ఈ ఏర్పాటు జరిగింది. ఈ ద్వారానికి మరోవైపు 'హజరత్ బాగ్' వుండేది. దానిలోపల కుడివైపున 'చాందీవాలే బారహదరీ' వుండేది. ఇది మామూలు ఇటుకలతోటీ సున్నంతోటి తయారైనభవనమే. కాని పైకప్పుమీద వెండిరాళ్ళు పొదగబడివుండడంవల్ల దీనికి 'చాందీవాలీ బారహదరీ' అనేపేరు వచ్చింది. దీనికి ఆనుకునివుండేభవనం 'ఖాస్ మకామ్'లో రాజు నివసించేవాడు. దానిప్రక్కనే నవాబ్ 'సఆదత్ అలీఖాన్' నిర్మించిన 'బాద్‌షాహ్ మంజిల్' పాతబడివుండేది.

కఱ్ఱగోడల సందుల్లోంచి రెండోవైపుకుతిరిగితే గట్టి కట్టడాల వరస చాలా దూరం వ్యాపించివుండడం కనిపించేది; అవి 'చౌలఖీ' అనేపేరుతో ప్రసిద్ధికెక్కినవి. వీటికి ఆస్థానమంగలి అజీముల్లా పునాదివేశాడు. రాజు అతనికి నాలుగులక్షల రూపాయలిచ్చి వాటిని కొన్నాడు. రాజు పట్టమహిషి, ఇతరభార్యలు ఈ భవనంలో నివసిస్తూండేవారు. ఇందులోనే గదర్ విప్లవసమయంలో హజరత్ మహల్ నిలపిల్లింది. రాజు తన దర్బారు ఇక్కడే తీర్చేవాడు.

ఇక్కడినుంచి కైసర్‌బాగ్‌వైపు ఒకరోడ్డు వెళుతుంది. రోడ్డుప్రక్క నీడనిచ్చే పెదచెట్టు ఒకటుండేది. దీనిక్రింద అందమయిన పాలరాళ్ళతోకట్టిన గుండ్రని అరుగు వుండేది. కైసర్‌బాగ్‌లో జరిగే ఉత్సవాలలో రాజు కాషాయవస్త్రాలుధరించి యోగివేషంతోవచ్చి దానిమీదకూర్చుని చలిమంట వేయించుకొనేవాడు. ఆ అరుగుకి కొద్దిదూరంలో అందమయినద్వారం ఒకటి వుండేది. దాన్ని 'చౌలఖీ ఫాటక్' అనే వారు. దాన్ని దాటితే కైసర్‌బాగ్ వస్తుంది. కైసర్‌బాగ్‌లోని నాలుగువైపులా వుండే కట్టడాలు ఎనభై లక్షల రూపాయలతో నిర్మితమయ్యాయి. ఈ నాలుగువైపుల వుండే భవనాలలో రాజుగారి రాణులు, అప్సరసలలాంటి అందమయినస్త్రీలు నివ సిస్తూండేవారు. ఆచోట ఆ సుందరాంగులకు బదులు ఈనాడు వికారాకృతులనుచూసి పాతకాలం మనుష్యులు :—

''పరీన హూస్తా రుఖాం - ఓ-దేవ్ దర్‌కరిశ్మా - ఓ నాజ్
బశౌఖ్త్ అక్లజ్ హైరత్ కి ఈచే బుల్ అజ్ బీస్త్'

అంటూంటాడు. 'అప్సరస తన ముఖారవిందాన్ని దాచేసుకుంది. రాక్షసులు తమ ఒయ్యారాన్ని ఒలకబోస్తున్నారు. ఇలా ఎందుకైపోయిందా అని మస్తిష్కం విస్తు పోతుంది.'

కైసర్‌బాగ్ పడమటిద్వారానికిబయట రౌషన్ ఉద్దౌలాగారి భవంతి వుంది. దాన్ని వాజిద్ ఉద్దౌలా హస్తగతంచేసుకొని దానికి 'కైసర్ పసంద్' అని పేరు పెట్టాడు. పాదుషా ప్రియురాలు 'నవాబ్ మాషూక్ మహల్' అనే ఆమె కైసర్ పసంద్‌లో నివసిస్తూండేది. ఇప్పుడది డిప్యూటీ కమీషనర్ కార్యాలయంగా మారింది. కాని ఎదుట కైసర్‌బాగ్ పడమటి మూలవద్ద ఒక అశ్వశాలవుంది.

సంవత్సరానికోసారి కైసర్‌బాగ్‌లో బ్రహ్మాండమైన ఉత్సవమొకటి జరుగు తూండేది. సాధారణప్రజలు సహితం ఆ ఉత్సవంలోపాల్గొని రాజుగారివిలాసాలనీ, రసికత్వాన్నీచూసే అవకాశాన్ని కలుగచేయడం ఈ ఉత్సవధ్యేయమని చెప్పవచ్చు. హైందవపురాణాల్లోని శ్రీ కృష్ణలీలలనుగురించి పాదుషా విని ఎంతో ముగ్ధు డయ్యాడు. ఆయన ఆ లీలలను కథావస్తువుగాతీసుకొని తన స్వంతపద్ధతిలో ఒక నాటకాన్ని రచించాడు. ఆ నాటకంలో శ్రీ కృష్ణపాత్రధారి పాదుషా, రాణులు, వేశ్యలు, మాతంగయువతులు, దాసీలు మొదలైనవారు గోపిక పాత్రధారిణులుగా వుండేవారని వేరే చెప్పాలా ? కృష్ణలీలలపేరుతో బహిరంగ కామలీలలు ప్రదర్శింప

బడుతుంటే రసికప్రేక్షకులు తన్మయత్వంతో తిలకిస్తూండేవారు. అప్పుడప్పుడు ఆవేశంవచ్చి రాజుగారు యోగివేషంకూడా ధరిస్తూండేవాడు. ఆయన యోగివేషంలో కూడా తన రాజదర్పాన్ని చూపించేందుకు ముత్యాలనుకాల్చి ఆ విభూతి ముఖానికి పూసుకొనేవాడు. ఈ ఉత్సవాలలో కాషాయవస్త్రాలు ధరించినవా రెవరైనాసరే నిరాటంకంగా పాల్గొనవచ్చు. ఆ మిషతో ఎనభై తొంభై ఏళ్ళ ముసలులుసహితం కాషాయవస్త్రాలుధరించి రసికులు అయిపోయేవారు; పాదుషాగారి శ్రీరాసిక్య సాగరం లోంచి తమ ముసలితనపు గిన్నెలలో మధువు నింపుకొంటూండేవారు.

ఇదే వరసలో లక్నో ఆస్థానం ఎప్పుడుచూసినా భోగవిలాసాలతో మునిగి తేలుతూవుండేది. రెసిడెంట్ హెచ్చరికచేసినా రాజు వినిపించుకొనేస్థితిలో లేక పోవడంతో ఇంగ్లాండులోని బోర్డ్ ఆఫ్ ఇండియన్ ఎఫైర్స్ అయోధ్యరాజ్యాన్ని 'బ్రిటిష్-ఇండియా'లో విలీనపరచాలనే నిర్ణయం చేసింది. ఈ నిర్ణయాన్ని అమలు పరిచేందుకు ఆంగ్లసైన్యం లక్నో చేరుకొంది. ఆ సైన్యదళాధిపతి పాదుషా ఎన్నడూ అనుకోని ఆదేశాన్ని చదివి వినిపించాడు.

'మీ అయోధ్యరాజ్యాన్ని బ్రిటిష్ - సామ్రాజ్యంలో విలీనపరచబడింది. మీకు సంవత్సరానికి పన్నెండులక్షలు, మీ రక్షణసైన్యదళాలకు సంవత్స రానికి మూడులక్షలు పెన్షన్‌రూపంలో ఇవ్వబడుతూవుంటుంది. ఈ పెన్షన్లు మీకు, మీ ఆశ్రితులకు, మీ రక్షణసైనికులకు అత్యధికమనేది నిర్వివాదం. నిశ్చింతగా విశ్రాంతి తీసుకొంటూ, నిరాటంకంగా రసికక్రీడలను కొనసాగించండి. లక్నోలో వుండేందుకుకూడా మీకు అనుమతి అనుగ్రహించబడింది.'

ఈ ఆదేశాన్ని విని లక్నో విచారసాగరంలో మునిగిపోయింది. పాదుషా ఏడ్చి, మొత్తుకొని క్షమాపణలు చెప్పుకొన్నాడు. పాదుషా తల్లి, రాజభవనంలోని ముఖ్యులు ఎంతో వేడుకొన్నారు. కాని గవర్నర్ జనరల్ ఆజ్ఞాపత్రంలో మార్పులు, కూర్పులు చేసే అధికారం రెసిడెంట్‌కి ఎలావుంటుంది? అవరోధమేం లేకుండా ఆంగ్లసైని కులు అయోధ్యరాజ్యాన్ని వశపరచుకొన్నారు. తన నిర్దోషిత్వాన్ని రుజువుచేసు కొంటూ ఇంగ్లాండులో మనవిచేసుకుని చెయ్యి జారిపోయినరాజ్యాన్ని తిరిగి పొంద వచ్చుననే ఆశతో పాదుషా తన తల్లి, యువరాజు, రాణులు వగైరా పరివారంతో కలకత్తా బయలుదేరారు.

# 8

సింహాసనచ్యుతుడు వాజిద్అలీషాహ్ క్రీ. శ. 1856 లో లక్నో వదిలిపెట్టి, రాజ్యంకోసం అపీల్ చేసేందుకూ, ఒకవేళ బ్రిటిష్ ఇండియా గవర్నర్ జనరల్ తన ప్రార్థనను తిరస్కరిస్తే లండన్ పార్లమెంటుద్వారా బ్రిటిష్ మహారాణీవరకూ ఈ సంగతిని తీసుకువెళ్ళే దృఢనిశ్చయంతో కలకత్తా వెళ్ళడం భారతదేశపు అదృష్ట మని చెప్పకతప్పదు. భారతదేశంలో ఆయనప్రయత్నం విఫలమయింది. ఇంగ్లాండ్ వెళ్ళాలనుకొన్నాడు. కాని సముద్రయానం ఆయన ఆరోగ్యానికి భంగకరమని వైద్యులు చెప్పడంవల్ల ఆయనప్రయత్నాన్ని ఆయన సలహాదారులు వారించారు. ఫలితంగా ఆయన కలకత్తాలోనే వుండిపోయి తనతల్లినీ, సోదరునీ, యువరాజునీ ఇంగ్లాండు పంపించాడు. ఈ యాత్రలో మా తాతగారు మున్షీ కమర్ ఉద్దీన్‌సాహెబ్ కూడా ఆ రాజు పరివారంలో వున్నారు. ఆంగ్లేయులు అన్యాయంగా వశ పరచుకొన్న సింహాసనాన్నీ, కిరీటాన్నీ తీసుకుందామనే పట్టుదలతో పింఛను డబ్బు తీసుకోడానికి రాజు నిరాకరించాడు.

రాజు కలకత్తాలోనూ, ఆయనకుటుంబం లండన్‌లోనూ, వాదోపవాదాలతో కేసు సుప్రీంకోర్టులోను ఉండేరోజులలో అకస్మాత్తుగా ఆంగ్లప్రభుత్వం దమననీతి కార ణంగా భారతదేశంలో 1857 వ సంవత్సరంలో 'గదర్ విప్లవం' చెలరేగింది. మీరట్‌నుంచి బెంగాల్‌వరకు స్వపరభేదంలేకుండా అందరికీ అంటుకునే విప్లవ జ్వాల, బ్రిటిష్ ఇండియాప్రభుత్వపు పునాదుల్ని ఊపే ప్రచండసమరంగా రేకెత్తింది. అన్ని ప్రాంతాలనుంచీ విప్లవయోధులు ఢిల్లీకి చేరుకొని 'బహాదుర్ షాహ్ జఫర్'ను భారతదేశ చక్రవర్తిగా ప్రకటించారు. ఇదేవిధంగా అలహాబాద్, ఫైజాబాద్ మొదలైనచోట్లనుంచి తిరుగుబాటుదార్లు మే 1857 లో అతి ఉత్సా హంతో లక్నో చేరుకున్నారు. అంతవరకు అయోధ్యలో విశ్రాంతగాజీవించే వ్యక్తు లనేకులు నడుంబిగించి తిరుగుబాటుదార్లతో చేతులుకలిపారు. తగినవ్యక్తి దొరక్క

పోవడంవల్ల వాజిద్ అలీషాహ్ పుత్రుడు పదేళ్ళబాలుడు అయిన 'మీర్జా బిర్ జీస్ కద్ర్'ను అయోధ్య సింహాసనంపై అధిష్ఠింపచేసి అతడితల్లి 'నవాబ్ హజ్రత్ మహల్'ని రాజ్యప్రతినిధిగా చేశారు. లక్నోలోనూ అయోధ్య రాజ్యంలోను తిరుగు బాటుదార్ల హత్యలకు గురికాకుండా బ్రతికిన ఆంగ్లేయఅధికారులు, వాళ్లు కట్టుకొన్న కోటలో ఆంగ్ల సైనికదళరక్షణతో తలదాచుకొన్నారు. వాజిద్ అలీషాహ్ అదృష్టం కొద్దీ కలకత్తా వెళ్ళిపోయాడు. లేకపోతే అనవసరంగా ఈ గొడవలలో చిక్కుకొని లక్నో సింహాసనంమీద మళ్ళీ అధిష్ఠితుడవడం, అనంతరం జఫర్ కంటె నికృష్ట మైన ఆపదలకు గురికావడం జరిగివుండేది. అంతేకాదు, అదృష్టవిహీనులైన కొద్ది మంది అయోధ్య కళాకారులకైనా 'మటియా బుర్జ్' ఆస్థానంలో తగినస్థానాలు లభించే సదవకాశం ఏర్పడివుండేదికాదు.

లక్నోలో తిరుగుబాటు సైనికులకు అయోధ్యబాపతు జమీందార్లు, తాలూకాదార్లు పాదుషాకాలంలో తొలగించబడిన సైనికులు వగైరా లక్షలకొద్దీవ్యక్తులు అండగా నిలిచారు. వీరితో పట్టణంలోని విటులు రకరకాలవ్యక్తులు తుఫానులావచ్చి కలి శారు. కొద్దిమంది ఆంగ్ల సైనికులమీద లెక్కకులందని తిరుగుబాటుదార్లు విరుచుకు పడ్డట్టు కనిపించింది. కాని ఈ తిరుగుబాటుపక్షంలో చేరినవ్యక్తులలో పట్టణంలోని పోకిరీలు, రౌడీలు, మూర్ఖులు మొండితనంగలవాళ్ళు తప్ప యుద్ధకళతో కొద్దిపాటిగా నైనా పరిచయంగలవ్యక్తులు కాని, చెల్లాచెదురుగావున్న మానవశక్తిని సంఘటిత పరిచేవ్యక్తులు కాని లేరనే చెప్పవచ్చు. ఇందుకు పూర్తి విరుద్ధంగా ఆంగ్లేయులు, ప్రాణాలకుతెగించి తమనుతాము రక్షించుకోవడంకోసం తిరుగుబాటుదార్లను ఆధునిక యుద్ధకౌశలంతో ఎదుర్కోడంలో తమప్రతిభను అద్భుతంగా ప్రదర్శించారు.

ఇక అయోధ్యరాజ్యంలో 'బిర్ జీస్ కద్ర్' రాజుగా 'హజ్రత్ మహల్' పరి పాలన ప్రారంభమయింది. బిర్ జీస్ కద్ర్ పేరుతో నాణాలు ముద్రితమయ్యాయి. రాజ్యంలో ఉన్నతాధికారుల నియామకం జరిగింది; పన్ను వసూళ్ళు యథావిధిగా కొనసాగాయి. మనోరంజకమయిన వాతావరణం తయారుచేసే కార్యక్రమంకూడా మొదలైంది. హజరత్ మహల్ శ్రద్ధనీ, మంచితనాన్నీ ప్రజలు అభినందించారు. ఆమె సైనికులపట్ల చాలా గౌరవం చూపించేది. వారిపనులను, హోదాలనుమించిన బహుమానాలనిస్తూ వారిని తృప్తిపరుస్తూండేది. కాని ఆమె పర్దాను తీసిపారేసి

సైన్యాధ్యక్షురాలు అయేంతసాహసం చేయలేకపోయింది. ఆమె సలహాదారులు అంత మంచివాళ్ళుకారు, సైనికులుకూడా అంత పనికొచ్చేఘటాలు కావు. రాజ్యంలో ఉన్నతాధికారులు స్వార్థపరులుగా ఒకరిమాటను ఒకరు వినిపించుకోకుండా ప్రవర్తిస్తూండేవాళ్ళు. ఆంగ్లసైన్యాన్ని ఎదిరించిన తిరుగుబాటుసైనికులు 'అసలు యజమానులం మేమే, ఎవడినెత్తిమీద మేం కిరీటంపెడ్తే వాడే రాజు అయిపోతాడు' అనే ధీమాతో గర్వంగా మాట్లాడుతూవుండేవాళ్ళు. ఫైజాబాద్ తిరుగుబాటుదార్లతో లక్నోచేరిన ఎహ్మద్ ఉల్లాహ్ అనే రాజవంశస్థుడు ఎన్నోయుద్ధాలలో వీరోచితంగా పోరాడాడు. ఆయన తన అధికారాన్ని చూపించేందుకు తరచు ప్రయత్నిస్తూండేవాడు. అంతేకాదు. ఆయన, రాజ్యాన్ని కబళించాలనేకోర్కెతో అవకాశంకోసం వీక్షించసాగాడు. అదనుచూసుకొని ఆయన తనపక్షంవారి అండతో లక్నోలోనే బిర్జీస్ కద్ర్‌కి పోటీగా తన ఆస్థానాన్ని నెలకొల్పగలిగాడు. ఈ రెండుఆస్థానాలకీ రాజకీయదృక్పథంలో అభిప్రాయభేదాలతోపాటు షియా, సున్నీ శాఖల విభేదాలు కూడా పెచ్చుపెరిగిపోయాయి. బాద్‌షాకూ ఎహ్మద్ ఉల్లాహ్‌కిమధ్య శత్రుత్వం ప్రబలనారంభించింది. ఆ సంవత్సరమే నవంబర్‌నెలలో ఆంగ్లసైన్యం లక్నోను వశపరచుకోవడానికి దండెత్తివచ్చింది. ఆంగ్లసైన్యంలో శిక్కులు, భూటాన్ పర్వతప్రాంతీయులుకూడా వున్నారు. లక్నోప్రజలను అమానుషంగా హింసించడం వగైరా ఘోరకృత్యాలు ఆంగ్లేయులకంటే ఎక్కువమోతాదులో శిక్కులు, భూటానీలే చేశారు. రెండు మూడురోజులయుద్ధంలో నూతనరాజ్యవ్యవస్థ, సాలెగూడులా విడిపోయింది. వేలకొద్దీశరణార్థులతోపాటు హజ్రత్ మహల్, బిర్జీసకద్ర్ నేపాల్ వైపు పారిపోయారు. ఎహ్మద్‌ఉల్లాహ్ రెండు మూడురోజులపాటు ఆంగ్లసైన్యంతో వీరోచితంగా పోరాడాడు. ఈ భయంకరయుద్ధంవల్ల ఆంగ్లసేన అతనివైపే కేంద్రితమయింది. ఈ అదనుచూసుకొని పాదుషా, ఆయనతల్లీ ఆట్టే శ్రమలేకుండా పారిపోగలిగారు. కాని తుదకు ఎహ్మద్ ఉల్లాహ్ యుద్ధంలో ఓడిపోయే పరిస్థితినిగమనించి బాడీ, మహమ్మదీలమీదుగా పవాయీ చేరాడు. అక్కడ ఎవరో ఆయన్ని తుపాకీతో కాల్చిచంపారు. పవాయీరాజు ఆయన తలనరికి ఆంగ్లేయులకు అందచేసి, ఆంగ్లేయులనుంచి బహుమానరూపంలో జాగీర్లు పుచ్చుకొన్నాడు.

లక్నో పట్టణవాసులను తిరుగుబాటుదారులనుండి రక్షించేసాకుతో ఆంగ్లేయ సైనికులు కఠినచర్యలు తీసుకొన్నారు. వాళ్ళదుర్మార్గాలకు, దుష్టచర్యలకు ఎంతో మంది అమాయకప్రజలు గురిఅయ్యారు. ఎందరో ఇళ్లూ వాకిళ్లూ వదిలేసి పారి పోయారు. దోపిడీలు, గృహదహనాలు, మానభంగాలు, చిత్రహింసలు ఒకటేమిటి రౌరవ నరకం కంటె అధ్వాన్నంగా లక్నో మారిపోయింది. వాటిని చూసిన వ్యక్తుల నోటినుంచి ఈ గాథలని వినేప్పుడు విన్నవ్యక్తులు సహితం భయంతో వణికి పోయారు. సుకుమార సుందరస్త్రీలు సహితం అడవులలో ముళ్ళదారుల్లోపడి పారి పోవలసిన అగత్యం ఏర్పడింది. దైన్యస్థితిలో వున్నవాళ్ళను మిత్రులని నమ్మించినవాళ్ళుకూడా అన్యాయాలుచేసిన సంఘటనలు ఎన్నోవున్నాయి. 'సాదీ' కవి చెప్పినట్లు 'యారాం ఫరామోశ్ కర్దంనా ఇశ్క్' ప్రియులు ప్రేమించడాన్ని మరిచిపోయారు అనే చరణం యథార్థమయింది. కొన్నిమాసాలు యీ అమానుష చర్యలు ఎడతెరిపిలేకుండా జరిగినతరువాత శాంతిస్థాపనకు ప్రయత్నం జరిగింది. ఆ శాంతి లక్నోలో నేటివరకు చెక్కుచెదరకుండా కొనసాగుతోంది; రోజురోజు లక్నోలో సుఖ శాంతులు పెంపొందుతున్నాయనికూడా ఒప్పుకోవచ్చు. కాని పాదుషాకు సన్నిహితవర్గాలలోని ఉన్నతాధికారులు, సైన్యాధిపతులు, బంధుమిత్రులు పదవులలోంచి పనులలోంచి తొలగించడంవల్ల నిరుద్యోగులైనారు. అంతేకాకుండా రాజు అనుగ్రహంతో ధనవంతులుగా మారినవేశ్యలు, తార్పుడుగాళ్లు, తార్పుడు కత్తెలు వగైరా వ్యక్తులు క్రమక్రమంగా మధ్యతరగతివారు, పేదలుగా, నిరుపేద లుగా మారడంకూడా సంభవించింది. కొన్నివీధులు పాడుపడిపోయాయి. కొన్ని కుటుంబాలకు కుటుంబాలు నాశనమైపోయాయి. బహుశః లక్నోపట్టణమే ఎడారిలా మరుభూమిలా మారిపోతుందేమోనని చాలామంది అనుకున్నారు. కాని ఆంగ్లపరి పాలకుల చాకచక్యంవల్ల లక్నో పురోగమించగలిగింది. పోయినవారుపోగా మిగిలిన వారు తమను తాము సంబాళించుకొనేందుకు తగినయోగ్యతను సంపాదించుకో గలిగారు. మిస్టర్ బట్లర్‌లాంటి యోగ్యులైన అధికార్లు మరికొద్దిమంది లక్నోకు దొరికివుంటే లక్నో ఎంతో త్వరితగతిని బాగుపడివుండేదని అనేకులఅభిప్రాయం. ఈ సంఘటనల్లో వాజిద్ అలీషాహ్‌గారి మిగిలినజీవితాన్నిగురించి, కలకత్తాలో ఆయన ప్రవాససమయంలోని స్థితిగతులనుగురించి పాఠకలోకానికి మనవిచెయ్యడం

అవసరమని నా ఉద్దేశ్యం. అలా చేయకపోతే అనాటి లక్నోచరిత్రకు అన్యాయం చేసినట్లౌతుంది. కలకత్తాలో వాజిద్ అలీషాహ్‌గారి ఆశ్రయంలో నా బాల్యదశ గడిచింది. ఇంతవరకూ, పెద్దలద్వారా విన్నవిషయాలనూ, చరిత్రపుటలలో ఉటంకించబడ్డ వివరాలనూ మీ దృష్టికితెచ్చే ప్రయత్నం చేశాను. ఇక ముందుభాగంలో నేను స్వయంగాచూసిన సంఘటనలనూ, స్థితిగతులనూ వివరిస్తాను.

ఆరోజుల్లో కలకత్తాకు నాలుగైదుమైళ్ళదూరంలో హుగ్లీనదీతీరంలో నగరానికి దక్షిణదిశను 'గార్డెన్ రిజ్' అనే వీధివుండేది. నగరంలోని హడావిడేంలేకుండా ఆ వీధి ప్రశాంతంగా కనిపించేది. అక్కడ మట్టిదిబ్బలు ఎక్కువగా వుండేవి. అందువల్ల దేశీయభాషల్లో దాన్ని 'మటియా బుర్జ్' అని సామాన్యజనులు పిలుస్తూండేవారు. అక్కడ ఎన్నో సుందరభవనాలు వుండేవి. భవనాలవెనుక రెండు మూడుమైళ్ళ విశాలస్థలం నదివరకూ వ్యాపించివుండేది. పాదుషా కలకత్తా చేరాక బ్రిటిష్ ఇండియాప్రభుత్వం ఈ భవనాలనూ, ఖాళీస్థలాన్నీ ఆయనకిచ్చింది. వాటిలో రెండుభవనాలు పాదుషాకోసం, ఒకటి నవాబ్ ఖాన్‌మహల్‌కోసం, మరొకటి అలీ నకీ ఖాన్‌కోసం కేటాయించబడ్డాయి. నదిఒడ్డున ఒకటిన్నరమైళ్ళ వెడల్పు, ఏడెనిమిదిమైళ్ళ పొడవున వ్యాపించివున్న విశాలస్థలంకూడా పాదుషాకు ఇవ్వబడింది. ఆ స్థలంలో కొంతభాగంలో పాదుషా ఇళ్ళునునిర్మించి తన ఆశ్రితులైన బంధు, మిత్ర, వేశ్యా, పరిచారకులకు ఇచ్చాడు. ఈ స్థలంమధ్యలో మునిసిపల్ రోడ్ కూడా వుంది. రాజు తన భవనాలకు 'సుల్తాన్ ఖానా', అసద్ మంజిల్' అని పేర్లుపెట్టాడు. నవాబ్ ఖాన్ మహల్ భవనాన్ని రాజు ఆక్రమించుకొన్నప్పుడు ఆ భవనానికి 'మురస్సా మంజిల్' అని పేరుపెట్టాడు. అలీ నకీ ఖాన్ భవనం, చివరివరకూ ఆయనకే వుంది. అలీ నకీ ఖాన్‌గారి కుమార్తె, పాదుషాగారి పట్టమహిషి, రెండో యువరాజు ఖుష్ బఖ్త్ బహాదుర్‌తల్లిగా ప్రసిద్ధినొందింది.

గదర్ విప్లవ సమయంలో ఆంగ్లసైన్యాన్ని ఎదిరించిన తిరుగుబాటుదార్లు, పాదుషా తమ చక్రవర్తిఅయితే కలకత్తాలోకూడా విప్లవాన్ని తీసుకురావచ్చునని ఆశించారు. కాని పాదుషా ఇలాంటిఆశయానికి ఎన్నడూ తావివ్వలేదు. పైగా ఆయన తిరుగుబాటుదార్ల నాయకుల అభిప్రాయాలను ఖండించి బ్రిటిష్ ఇండియా గవర్నర్ జనరల్‌కు ఈ సంగతులన్నీ తెలియచేశాడు. గవర్నర్ జనరల్ ఈయనకు

ధన్యవాదాలు అర్పించాడు. కాని నాలుగైదురోజులలోనే గవర్నర్ జనరల్ బుద్ధి మారిపోయింది. రాజును స్వేచ్ఛగా ఇలా విడిగా వదిలెయ్యడంకంటే, విప్లవ నాయకులకు అందుబాటులో లేకుండా ఆయనకు ఫోర్ట్ విలియంలో బస ఏర్పాటుచేసి తన అజమాయిషీలో వుంచుకోవడం మంచిదనేఉద్దేశ్యం కలిగింది. 'అయోధ్య రాజ్యం ఆంగ్లేయుల ఆధిపత్యంలో లేదు. కనుక దానినిగురించిన కేస్‌ను లండన్ కోర్టులు లేక పార్లమెంట్ చర్చించే అధికారం ఎలా వుంటుంది? అందుకని శాంతి నెలకొనేవరకూ కేసును వాయిదా వేయాలి' అనే తీర్మానంతో పాదుషా కేసు ముందుకి పోకుండా ఆగిపోయింది.

పాదుషా ఫోర్ట్‌విలియంలో ఆంగ్లేయుల బందీగా అతిథి రూపంలోవున్న రోజులలో 'లక్నో'లో సాధారణపరిస్థితి ఏర్పడింది. అయోధ్య ఆంగ్లేయులచేతుల్లోకి మళ్ళీ వచ్చింది. లండన్‌లో పాదుషా ప్రతినిధి 'మసీహ్ ఉద్దీన్‌ఖాన్' కేస్ నడప నారంభించాడు. ఆయనకు తొలిదశలోనే కేస గెలుస్తుందనీ, చేతినుంచి జారిపోయిన అయోధ్యరాజ్యం తిరిగి హస్తగతమవుతుందనీ మంచినమ్మకం ఏర్పడింది. కాని పాదుషా సలహాదారులు తమ స్వార్థంకోసమో లేక బయటివారి ప్రేరణవల్లనో సరిగ్గా చెప్పడం కష్టం, మొత్తానికి పెద్ద కుట్రచేశారు. మసీహ్ ఉద్దీన్ కేస్ గెలిపించితే ఇంక తమ పదవులు ఊడిపోతాయనే జంకుతో, ఆయననే పాదుషా అయోధ్య రాజ్యానికి ప్రధానమంత్రిగా నియమిస్తాడేమోననే భయంతో వాళ్ళంతా బహుశః కుట్ర చేసివుండవచ్చు. 'ప్రభూ, ఎక్కడైనా చేజిక్కినిరాజ్యాన్ని కేవలం కేస్ పెట్టినంతమాత్రాన మీకు తిరిగి ఇచ్చే మూర్ఖులుంటారా? మసీహ్ ఉద్దీన్, ప్రభువుల వారిని మోసగించేందుకు ప్రయత్నం చేస్తున్నాడు. తమరు అనవసరంగా శ్రమ పడుతున్నారు. సంవత్సరం, సంవత్సరన్నరనుంచి తమరు పించనుకూడా స్వీకరించకుండా ఇబ్బందిపడుతున్నారు. తమ నౌకర్లం మేముకూడా దమ్మిడీ దమ్మిడీకీ యాతనపడుతున్నాం. ఆంగ్లప్రభుత్వం షరతుల్ని అంగీకరించి వారిచ్చే డబ్బు తీసుకొంటూ హాయిగా రాణులతోటీ, పరిచారకులతోటి నిశ్చింతగా కాలం వెళ్ళబుచ్చడం కంటె తమకు కావలసిందేముంటుంది?' అని అందరూ ఆయనకు నచ్చచెప్పడం మొదలుపెట్టారు.

రాజుగారికి చేతిలో డబ్బులేక తహతహలాడే దుస్థితి ఏర్పడింది. నౌకర్లకూ, అధికారులకూ అసలే కష్టంగా వుంటోంది. అధికారులు, సలహాదారులు మాటి

మాటికి చెప్పిందేచెప్పి ఆయన్ని తమత్రోవకి రప్పించుకోవడంలో సఫలీకృతు లవగలిగారు.

'నాకు ఆంగ్ల ప్రభుత్వం ప్రతిపాదించిన పింఛనుసొమ్ము తీసుకోవడానికేం అభ్యం తరంలేదు. అయితే ఇంతవరకూ ఇవ్వవలసిన పింఛనుసొమ్ము లెక్కచూసి పూర్తిగా ఇప్పించాలి. లండన్‌లో జరుగుతున్న కేసును, డబ్బు అందగానే ఉపసంహరించు కొంటాను' అని ఆయన గవర్నర్ జనరల్‌కు లేఖ వ్రాశాడు.

'తమకు ఇంతకు ముందుకాలం పించను ఇవ్వడం సాధ్యంకాదు. ఈనాటినుంచీ లెక్కచూసి ఇవ్వబడుతుంది. రెండవది; తమకుమాత్రమే పన్నెండులక్షలరూపాయల లెక్కన పింఛను ఇవ్వబడుతుంది. ఇంతకుముందు సూచించినప్రకారం మీ రక్షణ సైన్యానికి నిర్ణయించిన పింఛను సంవత్సరానికి మూడులక్షలచొప్పున ఇవ్వవలసిన అవసరం ఇప్పుడుండదని ప్రభుత్వం భావిస్తోంది' అని గవర్నర్ జనరల్ సమా ధానం వ్రాసి పంపించాడు.

పాదుషా చాలా అసంతృప్తితో ఈ క్రొత్తనిర్ణయాన్ని నిరాకరించేందుకు తయా రయ్యాడు కాని ఉద్యోగులు ఆయనకు నచ్చచెప్పి రాజీచేశారు. గవర్నర్ జనరల్ క్రొత్త ప్రతిపాదన అంగీకరించి పాదుషా లండన్‌లో కేసును ఉపసంహరించు కొన్నాడు. మా తాతగారినోట ఈ విషయాలన్నిటిని నేను విన్నాను. పాదుషా పింఛను తీసుకొనేందుకు రాజీ అయ్యారనేసంగతి లండన్‌లో తెలియగానే మసీహ్ ఉద్దీన్‌కు ప్రైప్రాణాలు పై కెగిరిపోయేటంతబాధ కలిగింది. పాదుషా తల్లి, సోద రుడు, యువరాజు ఇంతవరకూ తాము చేసినప్రయత్నాలన్నిటినీ వమ్ముచేసి పాదుషా ఈనగాసి నక్కలపాటు చేసినట్లు ఇంత తెలివితక్కువ నిర్ణయం ఎలా చేశారా అని ఎంతో బాధపడ్డారు. చివరికి మసీహ్ ఉద్దీన్‌ఖాన్ ఎంతో ఆలోచించి 'పాదుషా ప్రస్తుతం బ్రిటిష్ ఇండియా గవర్నర్ జనరల్ బందీగా సెంట్ విలియం ఫోర్టులో వుంటున్నారు. ఇటువంటిపరిస్థితిలో ఆయన స్వేచ్ఛావాఙ్మూలము ఇచ్చేందుకు అవ కాశం వుండదు. కనుక దీన్ని ప్రామాణికమయిన రాజీగా ఎంచేందుకు వీలులేదు' అని తనవాదనను బ్రిటిష్ శాసనసభ సమక్షంలో న్యాయవాదఅభ్యంతరాన్ని విజ్ఞప్తిరూపంలో ఉంచాడు.

'మీరు తొందరపడి రాజీకి ఒప్పుకోవడం మాకెవ్వరికీ నచ్చలేదు. కొద్దిరోజు లలో అయోధ్యరాజ్యం మీకు హస్తగతమవగలదని మా అందరికీ పూర్తిగా నమ్మక

ముంది. కనుక మీ అభిప్రాయాన్ని మార్చుకోండి' అనే లేఖనుప్రాసి దానిపై తాను సంతకంచేసి లండన్‌లోవున్న రాజకుటుంబ సభ్యులచేత సంతకాలుచేయించి విజ్ఞప్తి సకలుకు జతపరచి పాదుషాపేర పంపించాడు.

అప్పటికే తిరుగుబాటు అణచివేయబడి దేశంలో శాంతి కొంతవరకూ నెల కొంది. బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం పాదుషాను కోటనుంచి విడుదలచేసింది. ఆయన సంతోషిస్తూ మటియా బుర్జ్‌కి చేరుకొన్నాడు. స్వేచ్ఛావాయువుల్ని పీలుస్తూ ఆయన హాయిగా వుంటూన్నసమయంలో ఈ లేఖ అందింది. ఆయనక్రింది అధి కారులు 'ప్రభూ! చూశారా, మసీహ్ ఉద్దీన్ లండన్‌లో ఏం ప్రచారంచేస్తున్నాడో ; పాదుషావారు జైలు భయంతో పింఛను ఒప్పుకున్నారని ఒకటే దుష్ప్రచారం చేస్తున్నాడు. తమరు అతనికి తగినట్లు బుద్ధిచెప్పాలి' అని ఆయన పౌరుషాన్ని రెచ్చగొట్టి తమస్వార్థాన్ని సఫలంచేసుకొనే ధ్యేయంతో నివేదించారు. ఇది వినగానే పాదుషా చాలా ఉత్తేజితుడయ్యాడు. 'నేను స్వేచ్ఛగా నా యిష్టంతో బ్రిటిష్ ఇండియా గవర్నర్ జనరల్ ప్రతిపాదనను అంగీకరించాను. నేను ఖైదులో వుండడంవల్లకాని, ఎవరి బలాత్కారం వల్లగాని ఒత్తిడిమూలంగాకాని రాజీకి రాలేదు. మసీహ్ ఉద్దీన్‌ఖాన్ చేసేప్రచారం ఆధారరహితమైనది. నా అనుమతిలేనిది ఆయన శాసనసభకు విజ్ఞప్తిచేయడం అనధికారచర్యగా నేను భావిస్తున్నాను. ఇప్పుడు నేను స్వేచ్ఛ ననుభవిస్తూ ప్రశాంతంగా జీవిస్తున్నాను. నేను నా ప్రతినిధిగా నియమించిన మసీహ్ ఉద్దీన్‌ఖాన్‌ను ఆ పదవినుంచి తొలగించాను. కేసును మనస్ఫూర్తిగా ఉప సంహరించుకొంటున్నాను' అని శాసనసభ ముఖ్యకార్యదర్శికి ఆయన లేఖ వ్రాసి గవర్నర్ జనరల్‌ద్వారా పంపించాడు.

ఇంకేముంది! లండన్‌లో కేస్ కొట్టివేయబడింది. మటియా బుర్జ్‌లో పాదుషా భోగవిలాసాలలో లీనమైపోయాడు. ఆయన ఉద్యోగుల జేబులు రూపాయలతో బరు వెక్కసాగాయి; లండన్ వెళ్ళిన పాదుషా కుటుంబం అక్కడే నాశనమయిపోయింది. వాళ్లని అక్కడిస్నేహితులు ఆదుకోకుండా వదలిపెట్టేశారు. పాదుషా తల్లి ఈ దుఃఖంతో మంచంపట్టింది. భారతదేశం బయలుదేరేముందు ఫ్రాన్స్, ముస్లిం పుణ్యక్షేత్రాలూ సందర్శించాలని ఆమె అనుకుంది. కాని ఆమెను మృత్యుదేవత పేరిస్‌లోనే కబళించివేసింది. పేరిస్‌లో ఉస్మానీ రాయబారకార్యాలయం బావతు

మసీదు సమీపంలో ముస్లింల శ్మశానవాటిక వుంది. అక్కడే ఆమె అంత్యక్రియలు జరిగాయి. పాదుషా తమ్ముడు మీర్జా సికందర్ హశ్మత్ మాతృదేవి మరణంతో ఎంతో వేదనపడ్డాడు. రోగగ్రస్తుడై తల్లి మరణించిన పది పదిహేనురోజులలో ఆయనకూడా పేరిస్‌లో స్వర్గస్థుడయ్యాడు. యువరాజుమాత్రం ఎలాగో కలకత్తా వచ్చి తల్లిదండ్రుల్ని కలుసుకోగలిగాడు. /

ప్రారంభదశలో, మరియూ బుర్జ్‌లోకూడా రాజు ఎంతో మెలకువతో జీవితాన్ని గడపసాగాడు. ఈ స్థితినుంచి ఆయనదృష్టిని భోగవిలాసాలవైపు ఆకర్షించేందుకు ఆయన ఆశ్రితులు కొందరు ఆయనకు సంగీతవాద్యాలను బహూకరించారు. ఈ వాద్యాలు వాయించేందుకు మరియూ బుర్జ్‌లో, భారతదేశంలో మరెక్కడా లేనంత మంది మంచి జంత్రవాద్యనిపుణులు పోగయ్యారు.

అందమయిన ఆడవాళ్ళను ఆకర్షించేందుకు, ప్రణయకలాపాలను కొనసాగించు కొనేందుకు లక్నోలోలాగే ఇక్కడా ఆయనకు అవకాశాలు ఏర్పడ్డాయి. కాని కలకత్తాలో ఆయన తన కామవాంఛకూ మతానికీ ముడిపెట్టాడు. ఆయన షియా శాఖీయుడు. షియా శాఖీయులకు 'ముత్‌ఆ' ధర్మసమ్మతమయిన వివాహం. అందువల్ల ఈ మతనియమం చూపిస్తూ అనుచితలాభాన్ని పొందేందుకు ఆయన ఉపక్రమించాడు. ముత్‌ఆ చేసుకొనే స్త్రీముఖం చూసేందుకుకూడా ఆయన ఇష్టపడేవాడు కాదు. జనానాభవనంలో ఒక సీళ్ళుమోసేయువతి రాజు కంటబడింది. ఆమెనుకూడా ముత్‌ఆ చేసుకొని ఆమెకు 'నవాబ్ ఆబ్‌రసాన్ బేగం' అనే బిరుదు ఇచ్చాడు. రాజసౌధంలోకి రాకపోకలుచేసే ఒక పాకీయువతినికూడా ముత్‌ఆ చేసుకొని ఆమెకు నవాబ్ మునప్ఫా బేగమ్ అనే బిరుదు ఇచ్చాడు. ఈవిధంగా సంగీతాభిరుచినికూడా ముత్‌ఆ ప్రకారం వివాహం చేసుకొన్న యువతుల బృందంవరకే పరిమితంచేశాడు. ఆయన బజారువేశ్యల నృత్యాలనుకూడా చూడడం మానేశాడు. ముత్‌ఆ ప్రకారం వివాహమాడిన ఎంతోమందిభార్యలలో అన్ని రకాలవాళ్ళు వుండేవారు. వాళ్ళను వాళ్ళ అభిరుచులు, ప్రతిభలనుబట్టి కొన్నిబృందాలుగా ఆయన ఏర్పాటుచేశాడు. వాళ్ళకు ఆయా కళలలో శిక్షణ ఇప్పిస్తూండేవాడు. ఒకబృందానికి రాధా మంజిల్‌వాళ్ళు, ఇంకో బృందానికి లోలకులవాళ్లు, మరోబృందానికి ఊగేవాళ్ళు, ఇలాగే శారదా మంజిల్

వాళ్లు, ముక్కుపోగులవాళ్లు, ముసుగులవాళ్ళు, రాసలీలవాళ్లు, అనుకరణంవాళ్లు అని ఆ బృందాలకు వాళ్ళపేర్లు పెట్టాడు. ఆ యా బృందాల ఆదరాభిమానాలను చూర గొంటూ ఆయన ఆనందిస్తూండేవాడు. యుక్తవయస్సురాని కన్యల బృందాలుకూడా వుండేవి. వాళ్ళు యుక్తవయస్కులయ్యాక పెళ్ళి చేసుకొనేందుకు రాజు నిరీక్షిస్తూ వుండేవాడు. ఇలా పెళ్ళిచేసుకోబడిన రాణులలో ఎక్కువమంది రాజుదగ్గర సుల్తాన్ ఖానాలో వుండేవారు. మిగిలినవాళ్ళు ఇతర భవంతులలో, అంతఃపురాలలో వుండే వాళ్ళు. ఈ రాణులకు మాతృత్వం సిద్ధించినప్పుడు వాళ్ళకు 'మహల్' అనే బిరుదు, ప్రత్యేక అంతఃపురం, ఎక్కువజీతం, అధిక గౌరవం ప్రసాదించబడుతూండేవి।

సంగీతం పిచ్చితప్ప మిగతావిషయాలలో రాజు షియా మత సిద్ధాంతాలప్రకారం ధర్మవేత్త. సాత్వికస్వభావంగల సజ్జనుడు. నియమానుసారం వేళతప్పకుండా నమాజు చేస్తూండేవాడు. నల్లమందు, త్రాగుడు, వేట వగైరా ఏ దుర్వ్యసనం ఆయన కుండేదికాదు. మతవ్రతాలను చాలా నిష్ఠగా పాటిస్తూండేవాడు.

ఆయనలో భవననిర్మాణానికి సంబంధించిన అభిరుచి తగుమోతాదులో వుండేది. సుల్తాన్‌ఖానావద్ద ఆయన అనేక అంతఃపురాలను కట్టించాడు. ప్రభుత్వం ఆయనకు మూడుభవనాలనే ఇచ్చింది. ఆయన కొద్దిరోజులలోనే అనేక భవనాలను అక్కడ కట్టించాడు. వాటిచుట్టూ పచ్చని చెట్టుచేమలతో నయనానందకరంగా చక్కనితోటలు వేయించాడు.

సుల్తాన్‌ఖానా, కన్స్ ఉల్ బైజా, గోషయే సుల్తానీ, షాహిన్‌షాహ్ మంజిల్, మురస్సా మంజిల్, అసద్ మంజిల్, తఫ్‌రీహ్ బక్ష్, హద్ద్ ఏ సుల్తానీ, సద్ద్ ఏ సుల్తానీ, అదాలత్ మంజిల్ మొదలైన గొప్పగొప్పభవనాలు పాదుషావశంలో వుండడం నే నెరుగుదును. దక్షిణంనుంచి ఉత్తరంవరకు ఇవి వరుసగా వుండేవి. ఇవేకాక ఇంకా అనేకభవనాలుండేవి, కాని నేను వాటిపేర్లను మరచిపోయాను। ఇదికాక తోటలలో చెరువుల ఒడ్డున చాలాగదులు, బంగళాలు, చిన్నచిన్నభవనాలు వుండేవి. ఈ అన్నిభవంతులలోను, గదులలోను, బంగళాలలోను, మహళ్ళలోను అందంగావుండే పరిశుభ్రమైన తివాసీలు వేయబడివుండేవి; వెండి మంచాలపైన బూరుగుమాది పరుపులు, తలగడా, ఔక్కేలువేసి వాటిపై ఖరీదైన దుప్పట్లు పరచబడివుండేవి. గదులు పటాలు, విలువైన బంగారు, వెండి, గాజు సామగ్రు

ళ్ళతో అలంకరించబడి వుంటూవుండేవి. వీటిని శుభ్రంచేసేందుకు, అలంకరించేం దుకు, కాపలా కాచేందుకు అవసరమయినవారికంటె ఎక్కువమందినే రాజు నియమించేవాడు. ప్రతీగది ఎంతో శుభ్రంగా, శోభాయమానంగా, తళుకుబెళుకులతో చూసేవారిని ముగ్ధపరిచేలా వుండేది. భవనాలదగ్గరవుండే పూదోటలు, అంకెల, అక్షరాల ఆకారాలతో చూడ ముచ్చటగావుండేవి. శిల్ప కళపట్ల పాదుషాగారికిగల సహజమయిన అభిరుచిని వాటిలో గమనించి విద్యాధికులు ఎంతో ఆశ్చర్యపోతూండేవాళ్లు.

లక్నోలో వుండేరోజుల్లో కైసర్‌బాగ్, దానిదగ్గరలో కొద్దిభవనాలు, తన తండ్రిగారి ఇమామ్‌బాడా సమాధి కట్టడం మాత్రమే రాజు నిర్మించాడు. కాని మటియా బుర్జ్‌లో శ్రేష్ఠమయిన ఉన్నతశ్రేణికిచెందిన భవనాలతో ఒక అందమైన పట్టణాన్నే ఆయన నిర్మింపచేశాడు. నదికి అవతలగట్టున మటియా బుర్జ్‌కి సరిగ్గా ఎదుట కలకత్తాబాపతు ప్రసిద్ధ 'పొలిటికల్ గార్డెన్' వుండేది. కాని భూలోకస్వర్గంగా పిలిపిల్లిన మటియా బుర్జ్‌ముందు దానిలోని చిత్రవిచిత్ర వస్తువులముందు పొలిటికల్ గార్డెన్ దిగదుడుపై పోయిందనే చెప్పవచ్చు.

ఈ భవనాలు, పూదోటలు, లతాకుంజాలు, పచ్చని విశాలమైన బీళ్ళ చుట్టూ ఎత్తయినప్రాకారం వుండేది. కాని మునిసిపల్ రోడ్డుకి ఇటు అటు సుమారు ఒక మైలు దూరంవరకు పెద్దపెద్ద దుకాణాలు వుండేవి. వాటిలో రాజుగారి చిన్ననౌకర్లు నివసిస్తూండేవారు. లోపలికివెళ్ళాలంటే ఈ దుకాణాలవెనుక ప్రహరీగోడలకున్న గేట్లలోంచి వెళ్ళవలసివుంటుంది. గేట్లవద్ద సదా దిట్టమయిన కాపలా వుండేడి. పాత పద్ధతిప్రకారం జాములనూ, గడియలనూ సూచిస్తూ రాత్రింబగళ్ళు గంటలు కొట్టే ఏర్పాటు, ఉదయం సాయంత్రంవేళలలో మంగళవాద్యాలు వాయించే ఏర్పాటు వుండేది.

ఈ ప్రపంచంలో భవననిర్మాణం పట్ల అభిరుచిగల వేలకొద్ది చక్రవర్తులు, రాజులు పుట్టారు, గిట్టారు, కాని తన అభిరుచికి అనుగుణంగా వాజిద్ అలీ కట్టించినన్ని ఎక్కువభవనాలనూ, అంత తక్కువ అవధిలో ఎవరూ కట్టించివుండరు. షాహ్ జహాన్ తరువాత భవననిర్మాణం విషయంలో వాజిద్ అలీ పేరునే గర్వంగా చెప్పుకోవచ్చు. ఆంగ్లేయుల అక్రమాలకు గురియై అయోధ్యరాజ్యాన్ని పోగొట్టుకొని పర్వారజీవితం గడుపుతూకూడా ఇన్ని అద్భుతమయినభవనాలను కళాత్మకంగా

నిర్మింపజేయగలగడం గమనించదగినవిషయం. ఒకరు కట్టించిన ఒకటో రెండో భవనాలు శతాబ్దాల తరబడి చెక్కు చెదరకుండా నిలిచివుండడం, మరొకరు కట్టించిన శతాధికభవనాలు ఒకటి రెండు దశాబ్దాలలో ఆనమాలుకూడా లేకుండాపోవడం, ఒక దానితో ఒకటి పోలికలేని విభిన్నవిషయాలే!

భవననిర్మాణమేకాక జంతువులనుపెంచే అభిరుచికూడా ఈ రాజుకు అమితంగా వుండేది. ఆకాలంలో ప్రపంచంలో ఏ వ్యక్తీ జంతుసేకరణవిషయంలో ఈయనతో సరితూగలేకపోయాడు. ఏ ఇతరవ్యక్తీ ఈయనకృషిలో సగంకూడా చేసివుండడు.

నూర్ మంజిల్ ఎదుట అందమయిన ఇనుప కటకటాలుగల విశాలమైన బోనులు వుండేవి. వానిలో వందలకొద్దీ చిరుతపులులు, లేళ్లూ, అడవిజంతువులు వుంటూం డేవి. దానిమధ్యలో పాలరాతితో కట్టిన చెరువు ఎప్పుడూ నిండుగా వుండేది. ఆ చెరు వులో నిప్పుకోళ్ళు, టర్కీ కోళ్ళు, కొంగలు, పెద్దబాతులు, హంసలు, చకోర పక్షులు ఇంకా వందలకొద్దీ అందమయినపక్షులు, తాబేళ్ళు వుండేవి. ఇన్ని వున్నప్ప టికి ఆ నీళ్ళలో ఒక్క ఆకుకాని, ఈకకాని కనిపించేదికాదు. ఎప్పుడూ పాలరాతి చెరువు, దానిగట్లు చాలా పరిశుభ్రంగా వుండేవి. చెరువుగట్లకి ఆనుకొనివున్న పెద్ద పెద్ద బోనులలో అనేకరకాల కోతులు, కొండముచ్చులు వుండేవి. ఆ కోతిచేష్టలను చూడకుండా ముందుకువెళ్ళడం ఎవరికీ సాధ్యపడేదికాదు. పెద్దపెద్ద గాజుతొట్టెలలో రకరకాలచేపలు పెంచబడ్డాయి. సవ్వడివిని అవి పైకివచ్చేవి. పేలాలు, అటుకులు, మాంసంతునకలు పడేస్తే అవి తింటూ ఆడుతూవుండేవి. రాజు 'షాహీ౽షా మంజిల్' ఎదుట లోతైన పెద్ద హౌజు త్రవ్వించి, దానిమధ్య కృత్రిమ క్రీడాపర్వ తాన్ని నిర్మింపజేశాడు. ఆ పర్వతంలో పెద్ద కాలువలు, జలపాతాలు ఏర్పాటు చేయిం చాడు. ఆ చెరువుగట్లమీద చిల్లులుగల ఇనపపలకలతో తగిన బందోబస్తు చేయిం చాడు. అందులో రకరకాల పాములు పెరుగుతూవుండేవి. రెండు మూడుగజాల పొడుగుగావుండే వేలకొద్దీసంఖ్యలోగల లావుపాటి ఆపాములు కాలువలోను, జలపాతాలలోను వేగంగా పాకుతూ, పర్వతంమీదకు ఎక్కి దిగుతూ భయంకరంగా కనిపిస్తూండేవి. ఎవరైనా కటకటాలలోంచి ఎలకల్నీ, కప్పల్నీ పడేస్తే వేగంగా ఒక దానితో ఒకటి పోటీపడ్తూవచ్చి పాములు గుటుక్కుమని తినేస్తూండేవి. ఆ పర్వతం క్రింద కటకటాలగదిలో రెండు చిరుతపులులు వుండేవి. అవి సాధారణసమయా

లలో చాలా మౌనంగావుండి విశ్రాంతి తీసుకొంటూండేవి. కాని ఎవరైనా పైనుంచి ఆ గదిలోకి కోళ్ళనుపడేస్తే చటుక్కున పోటాపోటీలుగా వాటిని పట్టుకొని మింగేస్తూండేవి. పాములను పెంచే ఏర్పాటు ప్రపంచంలో బహుశః ఆనాడు ఎక్కడా వుండివుండదు. వాజిద్ అలీషాహ్ దీన్ని ప్రారంభించాడు. అందువల్ల విదేశ యాత్రికులు ఆశ్చర్యంగా ఈ వింతచూసి ముగ్ధులై ఫొటోలుతీసి, ఆ వివరాలు వ్రాసుకొని తీసుకువెళ్తూండేవారు.

సుల్తాన్‌ఖానా లోపల వేలకొద్దీ ఇత్తడిపంజరాలలో రకరకాలపక్షులు పెంచబడుతూండేవి. ఇవికాకుండా అనేకమైన పెద్దపెద్ద ఇనుపవలలతో కప్పబడిన పెద్దగదులు వుండేవి. వీటిని 'గంజ్' లనేవారు. వీటిలో వేలకొద్దీరకాల పక్షులుండేవి. వీటిని పెంచేందుకు కావలసిన ఆహారసామగ్రికూడా అందులో వుంటూండేది. ప్రపంచంలోని నడిచే, ఎగిరే, పాకే అన్నిరకాల పశు, పక్ష్యాదులనీ, జీవులనీ అధికసంఖ్యలో ప్రోగుచేసి సజీవ సంపూర్ణ జంతు ప్రదర్శనశాలను ప్రపంచంలోకల్లా పెద్దదైన దానిని నిర్మించడం పాదుషాధ్యేయం. ఇందుకోసం ఆయన అమితమైనధనాన్ని, శక్తినీ వెచ్చించాడు. ఎవరైనా కొత్తరకం జంతువునో, పక్షినో, పాకేజీవినో తెచ్చి చూపిస్తేచాలు. ఆ వ్యక్తి ఎంతడిగితే అంతడబ్బుఇచ్చి సంతోషంగా ఆయన దాన్ని వెంటనే కొనేసేవాడు. ఆయన పట్టురెక్కలుగల పావురాలజంటను ఇరవైనాలుగువేల రూపాయలిచ్చిన్నీ, తెల్లనెమళ్ళజంటను పదకొండువేల రూపాయలిచ్చిన్నీ కొన్నాడని చెప్పుకొనేవారు. ఆఫ్రికాలోని విచిత్రజంతువు 'జిరాఫీ' జోడా బాగ్దాద్ ఒంటెలజోడా, బర్మా ఏనుగులజంటకూడా ఆయన జంతుప్రదర్శనశాలలో వుండేవి. అన్నిజంతువులూ అందులో వుండితీరాలనే పట్టుదలతో ఆయన జంతు ప్రదర్శనశాలకుచెందిన పచ్చికమైదానంలో రెండు గాడిదలనుకూడా వదిలేడు. క్రూరమృగాలు, బబర్‌జాతి సింహాలు, దేశీయసింహాలు, చిరుతపులులు, నల్లచిరుతపులులు, ఎలుగుబంట్లు, భయంకరమయిన అడవికుక్కలు, ఖడ్గమృగాలు, తోడేళ్లు మొదలైనవి కటకటాలబోనులలో వుండేవి. అవి శ్రద్ధగా పెంచబడ్తూండేవి.

పావురాలపెంపకం ఏర్పాటు ఇతర పశుపక్ష్యాదులతోబాటుకాక ప్రత్యేకంగా వుండేది. రాజుగారి విభిన్నభవంతులలో మొత్తంమీద పాతిక, ఇరవైవేల పావురాలు వుండేవి. వాటిని ఎగరవేయడంలో పావురాలపోటీదార్లు అద్భుతమైన ప్రతిభను

ప్రదర్శిస్తూండేవారు. ఎనిమిదివందలమంది, జంతువులనుపెంచే నౌకర్లు, రమారమి మూడువందలమంది పావురాలనుపెంచే నౌకర్లు, మరో మూడువందలమంది అడవి జంతువుల్నిపెంచే నౌకర్లు, ముప్పై నలభై మంది పాములనుపెంచే నౌకర్లు వుండే వాళ్ళు. వాళ్ళకు వాళ్ళవాళ్ళ నిపుణతనుబట్టి నెలకు ఆరుమొదలు పదిరూపాయలవరకు జీతాలు ఇవ్వబడుతుండేవి. జీతాలేకాక అన్నిజంతువుల ఆహారపదార్థాలకు, కొత్త జంతువులను, పక్షులను తరచు కొంటూండేందుకు ప్రతినెలా కొన్నివేలరూపాయలు ఖర్చు అవుతూండేది. దీన్నిబట్టి రాజు ఈ జంతుప్రదర్శనశాలపై ప్రతినెలా ఎన్ని వేలరూపాయలు ఖర్చుపెట్టూండేవాడో తేలికగా అంచనా వేసుకోవచ్చు.

భవనాలపని మూనిస్ ఉద్దౌలా, రేహాన్ ఉద్దౌలా అధీనంలో జరుగుతూండేది. వాళ్ళకి నెలకు సుమారు ఇరవై అయిదువేల రూపాయలు జీతం ఇవ్వబడుతూండేది.

సుమారు వెయ్యిమందిసైనికులు పహరా నిమిత్తం నియమించబడ్డారు. వాళ్ళకు ఆరురూపాయలనుంచి ఎనిమిదిరూపాయలవరకు నెలజీతం వారివారి సామర్థ్యాన్ని బట్టి ఇవ్వబడేవి. కొందరికి పదిరూపాయలజీతంకూడా వుండేవి. అయిదువందల మంది, భవనాలను శుభ్రంచేసే దాసదాసీలుండేవారు. వాళ్ళకూ సైనికులలాగే జీతాలు ముడుతూవుండేవి. పదిరూపాయలు మొదలు ముప్పైరూపాయలవరకు జీతాలుపొందే గుమాస్తాలు రమారమి ఎనభై మందీ, ఎనభై అయిదురూపాయల నెలజీతాలు తీసు కొనే అధికారులు రమారమి నలభై మందీ వుండేవారు. నీళ్లుమోసేవాళ్ళు వంద మందివరకు వుండేవాళ్లు.

ఇంతేకాక వంటవిభాగం, దీపాలవిభాగం, కూరలవిభాగం, సుగంధద్రవ్యాల విభాగం మొదలయినవిభాగాలుండేవి. వీటి నిర్వాహకులకు, అసంఖ్యాకులైన ముత్ఆ రాణులకు, వారిబంధువులకు వారివారి తాహతునుబట్టి జీతాలు ఇవ్వబడుతూండేవి.

వీళ్ళంతా భవనాలపరిధికిబయట, కొంతమంది ఈ కుటియా బుర్జ్ స్థలంలోనే గల ఇళ్ళలో నివసిస్తూండేవారు. రాణులు, సలహాదార్లు, అధికారులు, గుమాస్తాలు, వాళ్ళకుటుంబాలు, నౌకర్లు మొత్తం నలభై వేలవరకు వుండేవాళ్ళు. వీళ్ళందరూ రాజుగారిచ్చే నెలకు లక్షరూపాయలజీతాలతో జీవిస్తూండేవారు. కాని ఇంత తక్కువ ఖర్చుతో వీళ్ళంతా సుఖంగా ఎలా జీవిస్తున్నారో అర్థంకాక కలకత్తా నగరవాసులు, ఆంగ్లేయులు చాలా ఆశ్చర్యపోతూండేవారు. రాజువద్దగర పరుసవేదిరాయి తాకించి

నంతనే లోహాలను బంగారంగా మారిపోయేట్లు చేసేరాయి వుండేదనీ, ఆయనకు డబ్బు అవసరమయినప్పుడు పరుసవేది నుపయోగించి రాగిపాత్రలనూ, ఇనపకడ్డీలను బంగారంగా మార్చేస్తూంటాడనీ ప్రచారం ఒకటుండేది.

రాజుగారు నివాసం ఏర్పరచుకోవడంవల్ల కలకత్తా పరిసరాల్లో రెండో లక్నో వెలకొన్నది. అసలు లక్నో తుడుచుకుపోయింది. అక్కడి ముఖ్యులంతా మటియా బుర్జ్‌కు వెళ్లారు. నిజానికి ఆరోజుల్లో లక్నో లక్నోకాదు మటియా బురుజే లక్నోగా రూపొందింది. అదే కోలాహలం, అదే భాష, అదే కవిత్వం, అవే గోష్ఠులు, అవే మానసోల్లాసకర వస్తువులు. లక్నోలోని విద్వాంసులు, భక్తులే ఇక్కడా వుండేవారు. అక్కడి ధనికులు, పెద్దమనుష్యులు, ప్రజలు ఇక్కడ వుండేవారు. బెంగాలులో వున్నామని ఎవ్వరూ అనుకునేవారుకారు. అవే గాలిపటాల పందాలు, అవే కోడిపందాలు, అవే పిట్టల పందాలు, ఆ నల్లమందు భాయీలే, ఆ హరిదాసులే. ఈ మటియా బుర్జు కర్బలా. ఇదే ఇమాంబాడా. ఇక్కడ వుండేంత స్వేచ్ఛావాతావరణం వాజిద్ అలీషాహ్‌కు కాని ఆయన పూర్వీకులకుకాని లక్నోలో వుండేదికాదు. పీర్ల పండగకూడా అత్యద్భుతంగా మటియా బుర్జ్‌లో జరుగుతూండేది. కాని గదర్ విప్లవానంతరం ఎక్కడా పీర్ల పండగ జరపబడేదికాదు. వేలమంది భారతీయులు, ఆంగ్లేయులు మటియా బుర్జ్‌ను సందర్శించేందుకు కలకత్తా వస్తూండేవాళ్లు.

రాజు షియా సంప్రదాయానికి చెందినవాడైనప్పటికీ ఆయనకు మతవిషయాలలో దురాగ్రహం వుండేదికాదు. 'నాకు షియా, సున్నీ శాఖలు రెండూ రెండు కళ్ళలాంటివి' అని ఆయన ఎన్నోసార్లు అన్నాడు. ఒకసారి ఆయన క్రిందివాళ్ళు షియా, సున్నీ మతభేదాలతో కొట్టుకొన్నారు. ఈసంగతి రాజుకు తెలిసి ఇద్దర్నీ పదవుల్లోంచి తీసేశాడు. 'ఇటువంటివ్యక్తులు మనమధ్య వుండేందుకు వీలులేదు. వీళ్ళకు నా ఆస్థానంలో భవిష్యత్తులో ఎప్పుడూ ప్రవేశార్హత వుండదు' అనికూడా ఆయన తన నిర్ణయాన్ని ప్రకటించాడు.

పాదుషా వ్రాసిన ఒక పుస్తకంలో కొందరి మనస్సులను గాయపరచేవిషయాలు ప్రకటితమయ్యాయి. కలకత్తా సున్నీశాఖీయులు వాటిని చదివి కోపంతో కంపించిపోయారు. కాని నిజం చెప్పాలంటే అవి ఆయన అభిప్రాయాలుకావు. వేరే రచయితల అభిప్రాయాలు. వాటిని తరువాత పుటలలో ఆయన ఖండించారు. కావి

అంతవరకు చదవకుండానే సున్నీలు గొడవచేయడం మొదలుపెట్టారు. ఏమైతేనేం రాజా, తాను తప్పుచేయకపోయినప్పటికీ సున్నీలని మన్నింపు వేడుకొన్నారు. రాజా గారి ప్రధానమంత్రి 'మున్‌సరిమ్ ఉద్దౌలా' సున్నీ మతస్థుడే। మటియా బుర్జ్ వ్యవస్థకు సంబంధించిన బాధ్యతాయుతపదవులలో ఎక్కువమంది సున్నీలే వుండే వాళ్లు. అంతఃపురాలకు, గుమాస్తాలకూ, ఎన్నో విభాగాలకూ ఉన్నతాధికారిగాను రాజుకు అతి సన్నిహితుడుగానూ మెలిగే 'మున్షీ ఉస్సుల్తాన్'గూడా సున్నీమతస్థుడే। రాణులకు, రాకుమారులకు, వుద్యోగులకు, నౌకర్లకు జీతాలిచ్చే బక్షీ అమానత్ ఉద్దౌలా బహాదుర్‌కూడా సున్నీమతానికి చెందినవాడే. సిబ్తైనాబాద్ ఇమామ్‌బాడా, సొంత ఇమామ్‌బాడా విద్యాలయాల వ్యవస్థను, సభలను, మత విషయక ఉత్సవా లను ఏర్పాటుచేసే బాధ్యతకూడా సున్నీలచేతుల్లోనే వుండేది. అక్కడ ఎవరు సున్నీలో, ఎవరు షియాలో ఎవరికీ తెలిసేదికాదు. మతవిషయంలో చక్రవర్తి ఎంత ఉదారహృదయంతో ప్రవర్తించేవారో ఇంతకుమించిన ఉదాహరణలు ఇంకేం కావాలి?!

మటియా బుర్జ్‌లోని వ్యాపారస్థులు, వడ్డీ వ్యాపారులు లక్నోకు చెందినవాళ్ళే. అక్కడ లక్నోలోని వస్తువులన్నీ లభిస్తూండేవి. ప్రతిచోట సందడి, సౌందర్యం ఆవరించుకొనివుండేవి. అక్కడివ్యక్తులు తమ తమ పనులలో లీనమైపోయి ఇతర ప్రపంచాన్ని మరచివుండేవారు. రాజభవనాలలోకి, పచ్చికబయళ్ళలోకి, తోటలలోకి లక్నోనివాసులు, అంటే మటియాబుర్జ్‌కి సంబంధించినవ్యక్తులు నిరభ్యంతరంగా వెళ్ళేందుకు అనుమతివుండేది. తోటలలో తిరిగేప్పుడు ఇంతకంటె రమణీయస్థలం ప్రపంచంలో ఎక్కడా వుండదని అనిపించేది. నదిఒడ్డున నుంచుని చూస్తే చిత్ర విచిత్రదృశ్యాలు నయనానందకరంగా వుండేవి. కలకత్తాకు వచ్చే పోయే ఓడలు విలియం కోట ఎదుట గౌరవార్థం తమ జెండాలను దింపుకొని వెళ్తూండేవి. రాజా గౌరవార్థం ఓడల అధికారులు అలా చేస్తూన్నారని ప్రజలు అపోహ పడేవారు. రాణుల అంతఃపురద్వారాలముందు నుంచుంటే, జీవితాంతంవరకూ జ్ఞాపకముండే మధురమయిన ప్రణయసంభాషణలు తరుచు వినిపిస్తూండేవి. సుందరవదనార విందాలు అప్పుడప్పుడు కన్నులకు విందు చేస్తూండేవి.

ఇటువంటి ఆ భూతలస్వర్గం, కాలరాక్షసి కబంధహస్తాలలో నలిగిపోకుండా సదా నిలిచివుంటే ఎంత బాగుండేది। క్రీ. శ. 1887 వ సంవత్సరం పాదుషా ముగ్గిన పండులా రాలిపోయాడు.

'వీక్షించినదంతా సుందరస్వప్నం. ఆకర్షించినదంతా మధురగాథ' అన్నట్లు మటియా బుర్జ్‌కథ ముగింపుకొచ్చేసింది. ఒక అత్యద్భుతచమత్కారం హఠాత్తుగా కాలగర్భంలో కలిసిపోయింది. ఒకనాడు ప్రపంచచక్రవర్తులనూ, భారతదేశపు రాజులనూ తనవైపు అమితంగా ఆకర్షించుకోగలిగిన అందాలతో, హుందాగా అల రారిన ఆ 'భూలోకనాకం' ఇప్పుడో యెడారి. అనాడు మటియా బుర్జ్‌ను దర్శించి ఈనాడు సజీవులుగావున్న పెద్దలు, ఈ మరుభూమిని చూసి దుఃఖంతో నిట్టూర్చి 'అల్లాపేరు వర్ధిల్లాలి' అని అనుకోవడంతప్పించి ఏం చేయగల్గుతారు?

## 9

అయోధ్య పాదుషాలచరిత్ర 'మీర్జా బిర్‌జీస్‌కద్ర్ బహాదూర్' వృత్తాంతంతో ముగుస్తుంది. బిర్‌జీస్ లక్నోనుంచి ఏకబిగిని పారిపోయి నేపాల్ సరిహద్దులలో ఊపిరి పీల్చుకున్నాడు. లక్షపైచిలుకు జనం లక్నోనుంచి ఆయనను అనుసరించింది. వారు 'బిర్‌జీస్ కద్ర్'తోబాటు నేపాల్‌రాజ్యంలోని హిమాలయాలలో తలదాచు కుందామనీ, అవకాశం లభించగానే ఆంగ్లేయులపై దాడిచేద్దామనీ, విజయంసిద్ధిస్తే కోటలో వుందామనీ, అపజయం సంభవిస్తే మళ్ళీ పారిపోయివచ్చి హిమాలయా ల్లోనే కాపురముండవచ్చనీ పథకం వేసుకొన్నారు. కాని ఈపథకం, అమలు జరిపేం దుకు అనువైనదిగా తోచలేదు. నేపాల్‌రాజ్యం ఇంతమందికి శరణు ఇచ్చేస్థితిలో లేదు. అంతేకాదు. వీళ్లకోసం నేపాల్‌రాజు ఆంగ్లేయులతో యుద్ధానికి దిగేందుకు కూడా సుముఖత్వం చూపించలేదు. నేపాల్‌రాజ్యానికి ఆంగ్లేయులతో పోరాడేందుకు తగిన ఆధునిక ఆయుధాలు, సైనికులు లేకపోవడం ఇందుకు అసలైనకారణంగా భావించవచ్చు. బిర్‌జీస్ కద్ర్‌కీ, ఆయనతల్లికీ నేపాల్‌ప్రభుత్వం ఆశ్రయమిచ్చి ఔదార్యం చూపించింది. దీనితోబాటు ఆయనతోవచ్చిన లక్షమందినీ వెంటనే తమ తమప్రాంతాలకి తరలివెళ్ళి పొమ్మనీ, లేకపోతే తన్ని తరిమించివేయవలసి వస్తుం దనీ నేపాల్‌ప్రభుత్వం హెచ్చరించింది. ఈ హెచ్చరిక విని అనేకులు ఇంటిముఖం

పట్టారు. కొంతమందిని ఆంగ్లేయులు పట్టుకొని చంపివేశారు. కొందరు తెలివైన వ్యక్తులుమాత్రం వేషాలుమార్చుకుని భారతదేశంలోని ఇతరరాజ్యాలకు వెళ్ళిపోయారు.

బిర్‌జీస్ కద్రకి నేపాల్‌ప్రభుత్వం సాధారణమయిన ఉపకారవేతనాన్ని నిర్ణయించింది. నేపాల్‌ప్రభుత్వం, బిర్‌జీస్ కద్ర్‌కూడా తెచ్చుకొన్న అమూల్యమయిన భూషణాలన్నిటినీ వశపరచుకొన్నట్లు కొందరంటారు. బిర్‌జీస్ కద్ర్ తల్లి హజ్రత్ మహల్ నేపాలులోనే స్వర్గస్థురాలైంది. విక్టోరియా మహారాణి స్వర్ణోత్సవ సమయంలో బిర్‌జీస్ కద్ర్ అపరాధాన్ని బ్రిటిష్‌ప్రభుత్వం క్షమించింది. ఆయనకు స్వేచ్ఛ లభించింది. ఆయన కలకత్తా చేరుకొన్నాడు. వాజిద్ అలీ షా నిర్యాణానంతరం, ఆయన జ్యేష్ఠపుత్రుడు మీర్జా కమర్ కద్ర్ అందరికంటె ఎక్కువ పింఛను పొందుతూ మిగతా రాజకుటుంబానికి పెద్దగా వుంటూండేవాడు. కాని బిర్‌జీస్ కద్ర్ ఆంగ్లప్రభుత్వానికి 'వాజిద్ అలీ షా పుత్రులందరిలోనూ ఎక్కువ పేరు ప్రతిష్ఠలు గలవాడిని నేనే కనుక నియమానుసారం వారి పింఛనులో మూడోవంతుభాగానికి నేనే నిజమయినవారసుణ్ణి. రాజకుటుంబీకులపై పెత్తనం నాకే ఇవ్వాలి' అని విజ్ఞప్తి వ్రాసి పంపించాడు. ఈసందర్భంలో ఆయన బ్రిటిష్‌ప్రభుత్వానికి స్వయంగా నచ్చ చెప్పాలనే ధ్యేయంతో ఇంగ్లాండ్‌కు ప్రయాణసన్నాహాలు చేసుకొన్నాడు. వీడ్కోలు నిమిత్తం ఆయన కుటుంబీకులు భారీ ఎత్తున విందు ఏర్పాటుచేశారు. విందు ముగిసిన కొద్దిసేపటికి బిర్‌జీస్ కద్ర్‌కు వాంతులు, విరేచనాలు అయాయి. నిమిషనిమిషానికి ఆయనపరిస్థితి విషమించసాగింది. ఒకేరోజులో ఆయన, ఆయనభార్య, బిడ్డలు అందరి జీవితాలు సమాప్తమయిపోయాయి. అయోధ్యను కొన్నాళ్ళపాటు పాలించిన ఆఖరిరాజు బిర్‌జీస్ కద్ర్, కుటుంబంతోసహా మట్టిలో కలిసిపోయాడు.

లక్నోలో పాదుషా కట్టించి అభివృద్ధిపరచిన మటియా బుర్జ్ క్రొత్త ఉపనగరం ఎంతో అందంగా, కోలాహలంగా, జనసమ్మర్దంతో దేశీయులనీ, విదేశీయులను ఆకర్షిస్తూవుండేది. ఇది దుర్ఘటనలకు గురికాకుండావుంటే ఆ దురదృష్టవంతుడైన పాదుషా ఆస్థానంలోని అధికారులు, అంతఃపురకాంతల బంధువుల ఉచ్ఛస్థితినీ, ఉన్నతాభిరుచుల్నీ, దర్జానీ నేటికి జ్ఞాపకం చేస్తూవుండేది.

కానీ బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం న్యాయప్రయత్నంపేరిట వాజిద్ అలీ షా స్థిరచరాస్తులను అమ్మేసి, వచ్చిననగదును ఆయన వారసులకు, బంధువులకు వా

వారి వంతుల ప్రకారం పంచేసింది. ఫలితంగా కొన్నికోట్ల విలువైన భవనాలు, స్థిర చరాస్తులు చాలా చవకగా అమ్ముడుపోయి, మరియా బుర్జ్ మట్టిపాలై పోవడం సంభవించింది. మరియా బుర్జ్‌లో పాదుషాగారి ఆస్థానం (బాగే-ఇరమ్. షద్దాద్ అనేపేరుగల చక్రవర్తి భూమిమీద కృత్రిమస్వర్గాన్ని నిర్మించాడనీ దానికే బాగే-ఇరమ్ అని పేరుపెట్టాడనీ, దాంట్లో ప్రవేశిస్తూండగా గుర్రంమీదనుంచి పడి మరణించాడనీ అంటారు.) ఎంతవేగంగా నిర్మితమైనదో అంత త్వరగానూ అది శ్మశానవాటికగా మారిపోయింది. అక్కడికి ఇప్పుడు వెళ్ళిచూస్తే దుమ్ముతప్ప ఇంకేం కనిపించదు. ఒకవేళ మనకళ్ళు గతకాలంనాటి శోభనీ, ఆనందోత్సవాలనీ వెతకబోతే, అప్పుడు [1]'ఇమరో ఉల్ కైస్'వంటి ప్రఖ్యాతకవి ఎవరైనా ఎదురైతే కన్నీరుకారుస్తూ - 'ఇక్కడే మురస్సామంజిల్ ఉండేది, ఇక్కడ నూర్‌మంజిల్ వుండేది, ఇక్కడ సుల్తాన్ ఖానా, ఇక్కడ అసద్‌మంజిల్ వుండేవి. ఇదిగో ఇక్కడ సభలు, సమావేశాలు, ఇక్కడ కవితాగోష్ఠులు జరుగుతుండేవి. అక్కడే పాదుషా తన ఆప్తమిత్రులతో ఇష్టాగోష్ఠులు జరుపుతూండేవాడు. అక్కడ దిగ్గజాల వంటి కవులు, కళాకారులు తమ కళాకౌశలాన్ని, ప్రతిభనీ ప్రదర్శిస్తూండేవారు. ఆ స్థలంలో ప్రపంచంలోని సౌందర్యరాసుల అంతఃపురాలు వుండేవి. ఈ స్థలంలో నాట్యాలు, సంగీతాలు కళ్ళకీ, వీనులకీ విందుచేస్తూండేవి. ఆ స్థలంలో అప్సరల వంటి అందమైన యువతులకు సంగీత నాట్యశిక్షణ లివ్వబడుతూండేవి. ఇక్కడే పాదుషావారు ఎందరెందరో చక్కని చుక్కలవంటి రాణులమధ్యకూర్చుని వ్రతాలు, ఉత్సవాలు మొదలైన మతక్రతువులలో పాల్గొంటూండేవారు. ఇక్కడే నల్లమందు భాయీలు గుమిగూడి కథలు చెప్పుకుంటూండేవాళ్లు. ఇక్కడే పక్షులు పెంచబడు తూండేవి. ఈ స్థలంలో పావురాలు ఎగురుతూండేవి. ఈ కోటవాకిలిమీది కిటికీల లోంచి తలలెత్తిచూస్తూన్న సుందరవదనాలు కనిపిస్తూండేవి. ఆ వాకిలిలో వంట లక్కల రాకపోకలు ప్రతిక్షణం వింతసవ్వడి కలుగజేస్తూండేవి. ఈ దేవిడీలోనే ఫలాన ప్రఖ్యాతకవి పాదుషాగారికి తన తాజా కవితలను వినిపించేందుకు వచ్చేవాడు. ఆ దేవడీలో రోజూ రసికశైలిలో రాణులు పాదుషాపేర వ్రాసే ప్రేమలేఖలను 'తోమానామా' రచించే యువరచయితలబృందం వుంటూండేది' అని వివరించి వుండేవాడు.

1. ఇస్లాం మతస్థాపనకుపూర్వం ఈ కవి వుండేవాడు. తన ప్రాచీన నాటకరంగం ఎలా నాశనమైందీ వ్యంగ్యంగా తన కవితలో వర్ణించాడు.

మటియా బుర్జ్ పతనానంతరంకూడా ఆ ఆస్థానంబాపతు వేలకొద్దీ స్మృతి చిహ్నాలు మిగిలివున్నాయి. లక్నోపట్టణం, దాని నాగరికతలు అయోధ్యరాజ్యంలోని ప్రతి అంగుళం, ఆనాటి మటియా బుర్జ్ ఆస్థాన స్మృతిచిహ్నాలేనని మనం భావించ వచ్చు. వాటిలో ఆనాటి రాజ్యచిహ్నాలు కొద్దిగానో, గొప్పగానో ప్రస్ఫుటమౌతూనే వున్నాయి. లక్నో నాగరికుల ప్రతిచేష్టలోను, ప్రతి హావభావంలోను ఆనాటి ఆస్థాన సదస్యుల సజీవచరిత్ర మిళితమైవుంది.

'ఐ గుల్! బతూ ఖుర్ సన్‌దమ్ తూ బూ ఐ కసే దారీ' - (ఓ కుసుమమా! నీలో ఎవరి సువాసన వుంది? నువ్వంటే నాకిష్టం.) లక్నో నాగరికుల్ని చూస్తే హఠాత్తుగా ఈ కవిత జ్ఞాపకమొస్తుంది.

ఈ ఆస్థానం స్థాపనవల్ల లక్నోలో ఉత్పన్నమైన సమాజం ఎలాంటిదో, ఆ ఆస్థానం భారతీయసంస్కృతిపై ఎటువంటి ప్రభావాలను వేయగలిగిందో, ఈ ప్రాచీన అవశేషాల స్మృతులను గుర్తుకుతెచ్చేసందర్భంలో వివరించగోరుతున్నాను.

భారతదేశంలో 'ఫార్సీ' ముస్లిం ఆస్థానాలభాషగా వుండేది. భారతీయ ముస్లిం సంస్కృతిపై ఈరానీ నాగరికతప్రభావం చాలా ఎక్కువగా వుండేది. సఫ్‌వియా సామ్రాజ్యసమయంలో 'షియా' రాజులమతంగా పెంపొందింది. భారతదేశంలోని మొగలాయీ చక్రవర్తులు 'చుగతాయియా మజహబ్-ఉల్-మిన్నత్' మతావలంబకులైవుండేవారు. అయితే సంస్కృతిపై ఫారసీప్రభావం ఉండడంవల్ల మత సంబంధమయిన విభేదాలు వున్నప్పటికీ ఈరాన్‌దేశస్థులు ఇక్కడికి వస్తూండేవారు. స్థిరనివాస మేర్పరచుకొని ఇక్కడే వుండిపోయేవారు. వారిని మొగలాయీలు ఆదర దృష్టితో గౌరవిస్తూవుండేవారు. ఈ విశిష్ట సంప్రదాయంవల్లనే మెహరున్నీసా బేగమ్ నూర్‌జహాన్, జహంగీర్ కిరీటాన్నీ, సింహాసనాన్నీ హస్తగతం చేసుకో గలిగింది. ఈ మార్పువల్లనే ఢిల్లీలోని ఎక్కువమంది ఉన్నతాధికారులు ఆకాలంలో షియా శాఖీయులే అనేందుకేం సందేహంలేదు. వీరిలోనే ఒకరైన 'అమీన్ ఉద్దీన్ ఖాన్ నైశాపురీ' లక్నోవచ్చి 'నవాబ్ బుర్‌హాన్-ఉల్-ముల్క్' అనే బిరుదుతో విశాలగంగా మైదానప్రాంతానికి అధిపతి అయ్యాడు. బుర్‌హాన్ ఉల్ ముల్క్ తన ప్రభావాన్నీ, ప్రభుత్వాన్నీ అభివృద్ధి చేసుకోవడంతోబాటు ఢిల్లీలోని విభిన్నరంగాల లోని దక్షితగలవ్యక్తులకు సంరక్షకత్వపు బాధ్యతనుకూడా వహించేవాడు. యుద్ధ

కాలంలోకంటే సకలసంపదలతో తొణికిసలాడే శాంతికాలంలోనే సాంస్కృతిక, సామాజికవికాసం ఏర్పడుతుందనే నిజాన్ని ఎవరూ కాదనలేరు.

బుర్హాన్ ఉల్ ముల్క్, నవాబ్ సఫ్దర్‌జంగ్‌ల కాలమంతా కొత్తదైన అయోధ్యరాజ్యపు పునాదులను పటిష్టపరచడంలోనే గడిచిపోవడంవల్ల, వారు ఋయులూ శూరులైన సైనికులను గౌరవిస్తూ, ప్రోత్సహించేవారు. కాని జాతీయ సంస్కృతికీ, సమాజానికీ సేవచేయగలిగే తీరుబడి వారిద్దరికీ లేకపోయింది.

కాని షుజా ఉద్దౌలా, బక్సర్ యుద్ధంలో ధైర్యాన్ని కోల్పోయినతరువాత, ఆంగ్లేయులతో సంధిచేసుకొని వివశుడై ఫైజాబాద్‌లో ఆయన మౌనంగా వుండిపోయినరోజులలో అయోధ్యలో ఒక కొత్తసంస్కృతి ప్రారంభమైంది. షుజా ఉద్దౌలా కాలంలో ఢిల్లీలోని నిపుణులు అసంఖ్యాకంగా, తమ స్వస్థలాలను వదులుకొని ఫైజాబాద్ వచ్చిచేరినసంగతి, కేవలం తొమ్మిదిసంవత్సరాల స్వల్పవ్యవధిలో ఫైజాబాద్ ఎంత అద్భుతంగా అభివృద్ధిశిఖరాన్ని అందుకొన్నదీ, షుజా ఉద్దౌలా అనంతరం నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా లక్నోవచ్చి నివసించడం ప్రారంభించాక అభివృద్ధిశిఖరాగ్రాన్నందుకొన్న ఫైజాబాద్ ఎలా పాడుపడనారంభించిందీకూడా పాఠకులకు విదితమే. త్రోవలోవున్నందున లక్నోలోనే ఢిల్లీనుంచి తరలివెళ్ళే ఉన్నత కుటుంబికులు, కళాప్రవీణులు ఫైజాబాద్ వెళ్ళకుండా ఆగిపోయి అక్కడే స్థిరపడిపోయారు. ఫైజాబాద్‌లో బేగమ్‌ల ఛత్రచ్ఛాయల్లో జీవించే పెద్దమనుష్యులు, కళాకారులుకూడా ఆసఫ్ ఉద్దౌలా పారించే ధనప్రవాహంలో తేలిపోయేఉద్దేశ్యంతో ఒకొక్కరే లక్నోవచ్చి చేరసాగారు.

భారతదేశంలో ఎన్నో హిందూసంస్థానాలు వుండేవి. కాని నాగరికత, సభ్యతా విషయంలో ముస్లింసంస్థానాలదే పైచెయ్యిగా వుండేది. ఆంగ్లేయుల నాగరికతా ప్రభావంతో హిందూరాజులు తమ ప్రాచీనసంస్కృతిపట్ల అంత ఎక్కువమోజు చూపేవారుకాదు. అందువల్ల హిందూరాజులు స్వయంగా లక్నో ఆస్థానాన్ని, దాని నాగరికతను ప్రశంసిస్తూండేవారు. ప్రాచీననాగరికత, సంస్కృతులపట్ల మొగ్గు చూపే ఉన్నతకళాకారులు హిందువులలో లభ్యమవడమే కష్టంగావుండేది. అందువల్ల ఎప్పుడైనా, ఎక్కడైనా ముస్లిం ఆస్థానాలపట్ల అసంతృప్తితో విరాళచెందిన కళాకారులు, కవులు, విద్వాంసులు ఆ ఆస్థానాలనుంచి వైదొలగినసందర్భాంలో

అట్టివారిని హిందూరాజులు సంతోషంగా తమ ఆస్థానాలలోకి తీసుకొంటూండే వారు. వారిని దేవతలుగా ఎంచుతూ ఎక్కువగా గౌరవిస్తూండేవారు.

ముస్లిం ఆస్థానాలు ఆరోజులలో అట్టే ఎక్కువసంఖ్యలో వుండేవికావు. వీటిలో ప్రధానమైనది ఢిల్లీ ఆస్థానం అని చెప్పవచ్చు. ప్రాచీనవైభవం, ఆర్థికస్తోమతలవల్ల దేశంలోని వివిధరంగాలకుచెందిన ప్రామాణిక కళాప్రవీణులు, విశిష్టవ్యక్తులు తమ కేంద్రంగా ఢిల్లీనే ఎన్నుకొన్నారు. దక్షిణభారతదేశంలో హైదరాబాద్‌లో ఆసఫ్ జాహ్ సంస్థానం, మైసూరులో టిప్పుసుల్తాన్‌సంస్థానం ముఖ్యమయినవి. ఢిల్లీకి ఉత్తరంగా పఠానుల రుహేల్‌ఖండ్. దానితరువాత ఈ అయోధ్య ఆస్థానం అనంతరం ముర్షిదాబాద్ నవాబ్ నాజిమ్ ఏ బంగాల్ ఆస్థానం ఉత్తరభారతదేశంలో పేర్కొనతగిన ముస్లిం ఆస్థానాలు. ఉత్తరభారత ముస్లిం ఆస్థానాలకు దాక్షిణాత్య ముస్లిం ఆస్థానాలు చాలాదూరంలో వుండేవి. వీటిమధ్యనుండేమార్గం అడవులు, కొండలతో దుర్గమంగావుండేది. ఒకవేళ అక్కడికి ఎవరైనా ధైర్యంచేసి వెళ్లదామని బయలుదేరినా మార్గంలో అడవిలోని క్రూరమృగాలో, బందిపోటుదొంగలో పొట్టను పెట్టుకొనేప్రమాదం వుండేది. ఆ రోజులలో బందిపోటుదొంగల దౌర్జన్యాలు అమితంగా సాగిపోతూండేవి. టిప్పుసుల్తాన్ రాజ్యంవరకూ వెళ్లగలగడంమాట అలావుంచి హైదరాబాద్ నిజాం ఆస్థానంవరకైనా వెళ్లగలగడం ఎవరో అదృష్టవంతులకుకాని సాధ్యమై వుండేదికాదు.

అందుకే ఢిల్లీ కళలను చిన్నచూపు చూడడం ప్రారంభించాక అక్కడి గొప్పగొప్ప కళాకారులు, పండితులు, కవులు దక్షిణంవైపు ప్రయాణమయ్యారు. ఢిల్లీకి రూహేల్‌ఖండ్ ఆస్థానం సమీపంలోనేవుంది. అక్కడి పఠానురాజులు అభ్యర్థిస్తే వీరు వాళ్ళకే దక్కివుండేవాళ్ళు. కాని పఠానుల్లో పరాక్రమం, మత పక్షపాతం, మిగతా సుగుణాలు ఎక్కువగా వున్నప్పటికీ వాళ్ళకు కళలన్నా, కళాకారులన్నా, కవిత్వమన్నా, కవులన్నా, జ్ఞానమన్నా, విజ్ఞానమన్నా అంత ఎక్కువ మక్కువ వుండేదికాదు. వాళ్ళకు కేవలం సైనిక కార్యకలాపాలపట్ల మాత్రం అభిరుచి వుండేది. తమదేశస్థులను కూడగట్టుకోవడం, తమ యువకులకు సైనికశిక్షణ ఇప్పించి శక్తిని పెంపొందించుకోవడంకంటే వాళ్ళకు కావలసిందేమీ వుండేది కాదు. సామాజిక, సాంస్కృతిక దృక్కోణంనుంచి వారిని పరికిస్తే వారిస్థితి

అచ్చం ఆటవిక, అనాగరికులను మించివుండేదికాదు. పాపం, అటువంటివ్యక్తులకి కవుల, సాహిత్యకారుల, కళాకారుల విలువలేం తెలుస్తాయి? ఫలితంగా పఠానుల రాజ్యంలోంచే ఢిల్లీనుంచి తరలివచ్చే కవులు, కళాకారులు ముందుకు సాగివెళ్లారు. నాలుగైదుచోట్ల మకాంవేసి చివరకు లక్నో చేరుకున్నారు. అక్కడి చిన్నలు, పెద్దలు, ధనవంతులు, నిర్ధనులు, స్త్రీలు, పురుషులు—ఒకరేమిటి అన్నివర్గాలు - అన్ని వయస్సులవాళ్ళూ వారిని హృదయపూర్వకంగా ఆహ్వానించారు. సేవా సత్కారాలు లభించే దివ్యస్థలంలో ప్రవేశించినవ్యక్తులకు, మళ్ళీ వెనక్కు వెళ్ళడం అనే ప్రశ్న ఎందుకు తలెత్తుతుంది? వచ్చినవాళ్ళంతా అక్కడే స్థిరపడిపోయారు. లక్నోలో చెల్లని కొందరుమాత్రం ఇక్కడినుంచి పురోగమించి 'నవాబ్ నాజిమ్-ఏ-బంగాల్' వరకూ వెళ్ళి చేరారు. [ఇటువంటి కొద్దిమంది వ్యక్తులుతప్ప మిగతా వారందరూ లక్నోలోనే వుండిపోయారు.][స్వల్పవ్యవధిలోనే ఆ కాలంలోని అత్యున్నత, సుసంస్కృత, సభ్య సమాజంలోని పెద్దలందరికీ 'లక్నో ఆస్థానం' నిలయంగా ప్రఖ్యాతికెక్కింది. ఈ మార్పుకు ముందుకాలంలోకూడా 'అరబ్బీవిజ్ఞానం' లక్నో పట్టణానికి వరప్రసాదమై వుండేది. ఔరంగజేబ్ చక్రవర్తి లక్నోలోని ఫిరంగిమహల్‌ను ముల్లా నిజామ్ ఉద్దీన్ సిహాలవీకి బహూకరించిననాడే అరబ్బీ విజ్ఞానస్రవంతి లక్నోలో ప్రవేశించింది. ముల్లాగారి వారి అనుచరుల అవిరళకృషి వల్ల కొద్దిరోజులలోనే ప్రపంచంలోని నలుమూలలనుంచీ విద్వాంసులను, మహా పండితులను, |విద్యాపిపాసులైన ప్రతిభావంతులగు విద్యార్థులను ఆకర్షించుకొనే విశ్వవిద్యాలయంగా 'ఫిరంగి మహల్' రూపొందింది. 'షేఖ్ అబ్దుల్ హక్ దెహ్లవీ' అనంతరం ఢిల్లీలోకూడా అంతటి ప్రతిభాన్వితుడైన విద్వాంసుడు జన్మించలేదు. షాహ్ వలీ ఉల్లాహ్‌గారి కుటుంబం తగినంతప్రగతిని సాధించగలిగినప్పటికీ, వారి ప్రసిద్ధి కేవలం పండితులవరకే పరిమితమైవుండేది. హజ్రత్ ముహమ్మద్ సాహబ్ వారి ఉపదేశాలు 'హదీస్' బాపతు పాఠ్యక్రమంతప్ప మిగతా విద్యావిషయాలన్నిటిలో ఉన్నత విశ్వవిద్యాలయంగా లక్నోలో ఫిరంగిమహల్ పేరు తెచ్చుకుంది. ఆ రోజులలో లక్నో ప్రసిద్ధపట్టణమేం కాదు. అటువంటి అజ్ఞాతపట్టణం 'లక్నో' విదేశాలలోని బుఖారా, ఖ్వారిజ్మ్, హిరాత్, కాబూల్‌వంటి పట్టణాలలోని సుప్రసిద్ధ విశ్వవిద్యాలయాలను తలదన్నే విశ్వవిద్యాలయాన్ని స్థాపించగలగడం నిజంగా చాలా ఆశ్చర్యకరమైన విషయం. ఇస్లామీ జగత్తుఅంతా ఈ విశ్వవిద్యాలయాలలోని

విద్యాబోధనను గుర్తించి గర్విస్తూండేది. ఇక్కడి పాఠ్యక్రమాన్నే అంటే 'సిల్ సిలా-ఏ-నిజామియా'ని తమతమ విశ్వవిద్యాలయాలలో అమలుపరుస్తూండేవి. లక్నో ఆస్థానం ఉచ్ఛస్థితికి రాకపూర్వమే ఫిరంగీ మహల్‌లోని విద్వాంసుల నిర్విరామ కృషివల్ల లక్నో వేదాంత-తర్క-ధర్మశాస్త్రాలకూ, వారి సిద్ధాంతాలకూ, విజ్ఞానానికి చెందిన అనేక శాఖోపశాఖలకూ కేంద్రం కాగలిగింది. కేవలం ఈ ఒక్క విషయానికే 'లక్నో' ఈ ఆస్థానానికి ఋణపడివుండలేదు. (అయితే మిగతా అన్నిరంగాల ప్రగతినీ ఈ ఆస్థానమే లక్నోకు సిద్ధింపచేసింది.)

ఢిల్లీనుంచి లక్నోకు ఏయే విషయాలు సంక్రమించాయో, అవి లక్నోలో ఏయే రూపాలు ధరించాయో విడివిడిగా వివరింప దలుస్తున్నాను. మొట్టమొదట 'ఉర్దూభాష' ఢిల్లీలోని పెద్దమనుష్యులు, సేనాధిపతులు మాట్లాడుకొనే వాడుకభాష. బుర్‌హాన్-ఉల్-ముల్క్ బహాదుర్‌తోబాటు ఈ ఉర్దూభాష లక్నోలో ప్రవేశించింది. ఈ భాషకు జన్మస్థానం ఢిల్లీ అయితే, ఉర్దూ కవితకు జన్మస్థానం దక్షిణదిశనుండే 'గుజరాత్' అని చెప్పవచ్చు. 'వలీ' గుజరాత్‌నుండి ఢిల్లీవచ్చి దర్బార్‌లో తన కవిత్వాన్ని వినిపించాడు. మనోహరమైన తన కవితలతో ఉర్దూ భాషీయులను నిద్రలోంచి లేపాడు. ఒకసారి వినీవినడంతో మనస్సుకు హత్తుకుపోయేట్లుచేసే అత్యద్భుతశక్తి ఆయన కవితలో వుండేది. ఆయన రాకతో ఢిల్లీలో ఉర్దూ కవిత్వం మొలకలెత్త నారంభించింది.

ప్రారంభదశలో ఢిల్లీలోని వయస్సుమళ్ళిన పెద్దలు ఈ ఉర్దూ కవిత్వాన్నివిని 'ఆహా, చాలా బాగుందే' అని ప్రశంసిస్తూండేవారు. ఆ కాలం ఉర్దూభాషకు బాల్యావస్థ కాకపోయినా ఉర్దూ కవిత్వానికిమాత్రం నిస్సందేహంగా బాల్యదశే. ఉర్దూ జగత్తులో ఆనాడు 'ఖాన్-అర్‌జూ' చిన్నలు పెద్దలు అయిన కవులలో, అందరినీ మించినకవి. కాని మౌలానా ముహమ్మద్ హుస్సైన్ ఆజాద్ ఆయనను రెండోతరంకవులలో లెక్కించాడు. అనంతరం గొప్పగొప్ప కవులుగా పేరొందిన సౌదా, మీర్, మీర్జా మజ్‌హర్ 'జానే జనా', ఖాజామీర్ 'దర్ద్' మున్నగువారు 'ఖాన్ అర్‌జూ' శిష్యులే. లక్నోలో కవిత్వంపై భాషపై అధికారాన్ని సాధించే విధానానికి మార్గదర్శి ఈ 'ఖాన్ అర్‌జూ' గారే. నవాబ్ షుజా ఉద్దౌలాగారి మామ 'సాలార్ జంగ్' ఎంతో గౌరవమర్యాదలతో 'ఖాన్ అర్‌జూ'ను లక్నో ఆహ్వా

పించాడు. కొన్నాళ్ళపాటు ఆయన అయోధ్యలో తన ప్రతిభావిశేషాలను ప్రదర్శించి షుజా ఉద్దౌలా పట్టాభిషిక్తుడైన రెండేళ్ళతరువాత క్రీ. శ. 1752 లో లక్నోలోనే స్వర్గస్థుడయ్యాడు. ఆయన లక్నోకు సంబంధించినంతవరకు ఉర్దూ కవితా పితామహుడు. ఉర్దూ కావ్యరచనలు లక్నోలో కొనసాగేప్రయత్నానికి ఆయనే నాంది పలికారు. కాని ఆయన మరణానంతరం ఆయన అస్తికల్ని లక్నోనుంచి బలాత్కారంగా లాక్కువెళ్ళి ఢిల్లీలో సమాధిచేయడం విచారించదగ్గ విషయం।

అనంతరం ఎహ్మద్‌షా పాదుషాకు స్వంత సోదరునివంటి 'ఉస్తాద్ అషరఫ్ అలీఖాన్' కవిత్వయుగాన్ని లక్నోలోని ఉర్దూ కవిత్వానికి రెండోదశగా భావించవచ్చు. ఆయన ఎక్కువ ధనకీర్తుల నార్జించుకోవడానికి లక్నోవచ్చి చేరుకొన్నాడు. షుజా ఉద్దౌలా ఆయనను స్వయంగా ఆహ్వానించి ఎంతో గౌరవమర్యాదలతో తన ఆస్థానంలో ఆయనకు ప్రముఖస్థానాన్ని ఇచ్చాడు. కాని కొంతమందికవులలో సున్నితభావసంపద కొరవడివున్నప్పటికీ, వారిలో సున్నితమయిన మస్తిష్కాలకేం కొదవ వుండదు. ఏదో చిన్నవిషయంలో అభిప్రాయభేదంవచ్చి ఉస్తాద్ అష్రఫ్ అలీఖాన్ కోపగించుకొని 'అజీమాబాద్' వెళ్ళిపోయాడు. షుజా ఉద్దౌలాకంటె రెండేళ్ళు ముందుగా ఆయన అజీమాబాద్‌లోనే స్వర్గస్థుడయ్యాడు.

ఆయన నిర్యాణానంతరం మౌలానా ముహమ్మద్ హుస్సైన్ ఆజాద్ ఉర్దూ కవిత్వయుగం ప్రారంభమయింది. దీన్ని మూడోదశగా ఎంచవచ్చు. అంతవరకు ఖాన్‌గారి కవిత్వధోరణులు వారి శిష్యులద్వారా ఏకఛత్రాధిపత్యం వహించివున్నాయి. ఆనాటిపరిస్థితిని పరికిస్తే ఢిల్లీ తన కళాకారుల్ని తన ఒడిలో కూర్చోబెట్టుకొని వారి ముద్దుమాటలను వినగలిగే ఓపికతోవున్నట్లు కనిపించదు. ఒక్కొక్క కవీ, ఒక్కొక్క కళాకారుడు అక్కడినుంచి మెల్లిగా జారుకోడం మొదలుపెట్టాడు. వెళ్ళినవాళ్ళు తిరిగి రావడం అంటూ లేకపోయింది. కాని లక్నోది ఇందుకు పూర్తిగా విరుద్ధస్థితి అనవచ్చు. అక్కడికి ఎక్కడినుంచి ఏ కవి వచ్చినా, కళాకారుడు వచ్చినా అక్కడే స్థిరపడిపోతూండేవాడు. మీర్జా రఫీ 'సౌదా', మీర్‌తకీ 'మీర్', సయ్యద్ మహమ్మద్ మీర్ 'సొజ్', ఈ తృతీయదశలోని మహాకవులు. వీళ్ళందరూ ఢిల్లీనివదిలేసి లక్నో చేరారు. అక్కడే రచనావ్యాసంగం చేశారు. ధన కీర్తుల నార్జించారు. లక్నో మట్టిలోనే కలిసిపోయారు.

మీర్ జాఫర్ అలీ 'హస్రత్', మీర్ హైదర్ అలీ 'హైరాన్', ఖ్వాజా హసన్ 'హసన్', మీర్జా 'ఫాఖర్' మకీం, మీర్ 'జాహక్', బకా ఉల్లాహ్‌ఖాన్ 'బకా', మీర్ హసన్ దేహ్లవీ, మీర్ జాహక్ పుత్రుడు మొదలైన ప్రథమశ్రేణికిచెందిన కవులు. ఇంకా ఇల్లాంటివాళ్లే ఎందరో సుప్రసిద్ధకవులు లక్నోవచ్చి స్థిరపడ్డారు. మీర్ కమర్ ఉద్దీన్ మిన్నత్, మీర్ జియా ఉద్దీన్ 'జియా', అష్రఫ్ అలీఖాన్ 'ఫుగాం' ఢిల్లీనుంచి లక్నోవచ్చి అనేకసంవత్సరా లున్నారు. అక్కడే తమ ప్రతిభ లని ప్రదర్శించుకోగలిగారు. కాని చివరిరోజులలో ఇంకా ధన కీర్తుల నార్జించు కోవాలనే ఆశతో వాళ్లు కలకత్తా, అజీమాబాద్ లకువెళ్ళి అక్కడే నిర్యాణం చెందారు. షేక్ ముహమ్మద్ కాయమ్ 'కాయమ్' ఆయన స్వగ్రామమయిన 'నగీనా'లో మరణించినప్పటికీ ఆయన అనేకసంవత్సరాలు లక్నో ఆస్థానంలో తన ప్రతిభను చూపించగలిగాడు.

కేవలం మీర్జా మజ్‌హర్ జాన్‌జానాం, ఖ్వాజామీర్ 'దర్ద్'వంటి కొందరు పెద్దలు ఢిల్లీలోనే వుండిపోయినమాట వాస్తవం. అయితే వీళ్లు ఫకీరులవంటి మన స్తత్వం, సంయమం, అల్పసంతోషం వగైరాలక్షణాలు కలిగివుండడంవల్లనూ సజ్జాదానషీనీ (ఒక పెద్దఫకీరు మరణించాక ఆయనస్థానానికి వారసునిగా అవకాశం లభించగలదనే) విశ్వాసంతోను ఢిల్లీలోని తమతమస్థానాలను విడనాడలేకపోయారు. ఢిల్లీకవులంతా లక్నోచేరుకొని ఎక్కడా లభించని గౌరవమర్యాదలనీ, ధనాన్నీ పొందగలిగిన ఉర్దూ కవుల మూడోదశ భారతదేశచరిత్రలోనే అపూర్వమైన ఘట్ట మని చెప్పకతప్పదు.

ఇంక ఉర్దూకవుల నాలుగోదశలోకూడా ఢిల్లీ, అక్బరాబాద్‌లలో జన్మించిన కవులు లక్నోవచ్చి అక్కడి పోషణవల్లనే, ప్రఖ్యాతిపొందగలిగే కవితలనూ, రచన లనూ కొనసాగించారు. ఇక్కడే వారిపేర్ల ప్రసిద్ధి ప్రారంభమైంది. ఇక్కడి కవి సమ్మేళనాలకు వాళ్లే అధ్యక్షులుగా వుంటూండేవారు. వీరందరిప్రతిభలు ఇక్కడే వెలికివచ్చాయి; ఇక్కడే నివసించారు, ఇక్కడే ఉన్నతస్థితికి చేరుకున్నారు, ఇక్కడే మరణించారు. జుర్ అత్, సయ్యద్ ఇన్‌షా ముస్ హఫీ, కతీల్, రంగీన్ మున్నగువారు నాలుగోదశలో ప్రఖ్యాతకవులు. వీరికి వీరికాలంలో భాషపై అద్భుత అధికారం వుండేది. వీరిముందు ఏ ఉర్దూకవి నిలబడలేకపోయాడు. వీరందరి అస్తి కలు ఎక్కడున్నాయి? లక్నోభూమిలో!

(ఆకాలంలో ఢిల్లీ సాహిత్యవేత్తలు అత్యధికంగా లక్నోవచ్చి చేరుతూండేవారు. ఆకాలంలో పెద్దమనిషి తరహాగా జీవించే మీర్‌సాహబ్ అనే ఒకవృద్ధుడు. 'నూరన్‌బీ' అనే వేశ్యకూడా ఢిల్లీనుంచి లక్నో వచ్చిచేరారు.

'రండి, రండి మీర్‌సాహబ్! బహుకాలదర్శనం! మీదర్శనమే దుర్లభమైపోతూంది. ఢిల్లీలోవున్నప్పుడు మా యింటికి పొద్దుటొచ్చి అర్ధరాత్రిదాకావుండి వెళ్లుతూవుండేవారు. లక్నోవచ్చాక ఏమిటిలా మారిపోయారు? అంత తీరుబడిలేని పనులేమొచ్చి పడ్డాయి? ఉత్సవంలోకూడా మీకోసం ఎంతో వెతికాను. అక్కడా మీరు కనిపించలేదు. ఎన్నిపనులుంటేమాత్రం వయస్సు మళ్ళినవాళ్ళు ధార్మిక ఉత్సవాలలోపాల్గొనడం మానెయ్యొచ్చా? దేవుడితోడు, మీరల్లా మానెయ్యకూడదు' అంది నూరన్ బీ. అందుకు మీర్‌సాహబ్‌కూడా మంచి రసబంధురమయిన సమాధానమిచ్చాడు. కాని గ్రంథవిస్తారభయంవల్ల దాన్నిక్కడ పొందుపరచడంలేదు. పై విషయాన్ని 'సయ్యద్ ఇన్‌షా' ఢిల్లీలో తీరుబడివుండే వ్యక్తులకి లక్నోలో బొత్తిగా తీరుబడివుండేదికాదు అనేసంగతిని వివరించేందుకు ఒకగ్రంథంలో ఉటంకించారు. కవులు, కళాకారులు, మేధావులేకాక ఆకాలంలో ఢిల్లీ మొదలైన ఇతర ప్రాంతాలనుండి వేశ్యలు, తార్పుడుగాళ్ళుకూడా లక్నోవచ్చి స్థిరపడ్డారు. ఢిల్లీలో పూల అంగళ్లలో షికార్లుకుతిరిగే రసికులు లక్నోలో ధార్మికోత్సవాలలో పాల్గొని తమ రసికహృదయాలను రంజింపచేసుకొనేవారు. కవిత్వయుగపరిణామాన్నీ లేక కవిత్వతత్వ తరతమభేధాలనూ దృష్టిలో పెట్టుకోకుండా 'షమ్స్-ఉల్-ఉల్మా మౌలానా అజాద్' అనే కవి ఢిల్లీలోని కవులందరినీ సమావేశపరచి నాలుగో దశలోని కవిత్వపుబిగిని సడలింపచేసి ఐదోదశను ప్రారంభించేప్రయత్నం చేశాడు. ఇది అసందర్భపు పనే. ఆయనకు సఫలత సిద్ధించలేదు.)

నాసిఖ్, ఆతిష్ రోజులలో ఉర్దూకవిత్వానికి ఐదోదశ ప్రారంభమయింది. ఉర్దూ కవిత్వానికి ఇది చాలా మంచిదశ అని చెప్పవచ్చు. ఈ దశలోనే ఉర్దూభాష నవీన రూపాన్ని ధరించింది. పాత లోకోక్తులనూ, సామెతలనూ వెనక్కు నెట్టివేయడం, కొత్తసంప్రదాయాలనూ నవ్య దృక్పథాన్నీ ప్రవేశపెట్టడం, ఢిల్లీ లక్నోలలోని కవులందరికీ అనువైన చనువైన ఉర్దూభాషను రూపొందించడం మొదలైనప్రగతిని ఈ ఐదోదశ సాధించగలిగింది. ప్రస్తుతం భారతదేశంలోని ప్రామాణిక ఉర్దూభాష

న్వరూపానికి ఐదోదశలోనే పునాది ఏర్పడింది. అంటే ఉర్దూకవిత్వ సామ్రాజ్యంలో తొలిసారిగా లక్నో నాణాలు చెలామణీలోకి వచ్చాయన్నమాట. లక్నోలో వజీర్, జియా, రింద్, గోయా, రశ్క్, నసీమ్; దేహ్లవీ, అసీర్ మొదలైనవారు మస్నవీ (ఒకరకమయిన ఛందస్సు) కవులుగా ప్రఖ్యాతిపొందిన నావాబ్ మిర్జా 'షౌక్', పండిత్ దయాశంకర్ 'నసీమ్'-ఢిల్లీలో తమ కవితాగీతాలను వినిపించే మోమిన్, జౌక్, గాలిబ్ మొదలైనవారు విలసిల్లినకాలం ఉర్దూకవిత్వానికి ఆరో దశగా భాసిల్లింది. నిజం చెప్పాలంటే అది భావకవిత్వానికి సంబంధించినయుగం। సరసమైనభాషలో, చక్కనిశైలిలో భావకవిత్వాన్ని ఆ కాలం ప్రగతిమార్గంవైపు మళ్ళించింది.

(అమీర్, దాగ్, మునీర్, తస్లీమ్, మజ్రూహ్, జలాల్, లతాఫత్, అఫ్జల్, హకీమ్ మున్నగు సుప్రసిద్ధకవులు ఏడవదశలో సాహిత్యసేవ చేశారు.) భాషలోని సొంపు, కవిత్వంలోని లాలిత్యం లక్నోలో అగ్రస్థానాన్ని అందుకోగలిగినవనే సంగతిని ఈ ఏడోదశ రుజువుచేసింది. కొన్నాళ్ళలోనే షేర్‌లు (ఉర్దూలో రెండు చరణాలకవిత) అల్లడం లక్నో పట్టణవాసులకు 'ఫ్యాషన్' అయిపోయింది. ఏ భాషలోనూ ఏ ప్రాంతంలోనూ లేనంతమంది అసంఖ్యాకులైన ఉర్దూకవులు లక్నోలో తయారయ్యారు. స్త్రీలుకూడా షేర్ కవిత్వచర్చలలో పాల్గొంటూండేవారు. అక్షరం చదువుకోనివ్యక్తుల సంభాషణలలో సహితం కవితాభావాలు, ఉపమాలంకారాల ప్రతిబింబాలు గోచరిస్తూ ఉండేవి.

## 10

పార్సీకవిత్వ పురోగమనం [1]మస్నవీలవల్లనే ఏర్పడింది. ఈ ఛందోరూపం తక్కిన రూపాలు అన్నిటికంటే జనసామాన్యంచేత సదా అధికంగా కొనియాడబడుతూ వుంది. ఫిర్‌దౌసీ మహాకావ్యం 'షాహ్నామా'నుంచి మస్నవీకావ్యాల నిర్మాణం

1. మస్నవీ ఉర్దూ ఛందో విశేషం. ఇందులో కథలు, ఉపదేశాలు చెప్పవచ్చు. ఇందులో ప్రతిద్విపదకు ప్రాస వుంటుంది. అయితే ఒక ద్విపదకు ఇంకో ద్విపదకు యతిప్రాసలమైత్రి వుండదు.

ప్రారంభమయింది. అనంతరం నిజామీ, సాదీ, మౌలానారూమీ, ఖుస్రో, జామీ, హాతిఫీ మున్నగుకవులు మస్నవీ కవిత్వంలో గొప్ప కీర్తి గడించగలిగారు. మీర్ తకీ 'మీర్' తాను ఢిల్లీలోను లక్నోలోను ఉంటున్నకాలంలో మస్నవీలను రచించారు. కాని అవి చిన్నవేకాకుండా చాలా సాధారణమైనవి. అందువల్ల మస్నవీలనుగురించిన చర్చలో ఆయనను తీసుకురావడం అనుచితమని అనుకోవచ్చు. (లక్నోలో మస్నవీ రచన ప్రసిద్ధ ఉర్దూకవి మీర్ జాహక్ పుత్రుడు మీర్ గులామ్ 'హసన్' ప్రారంభించాడు. ఆయన బాల్యంలోనే తన తండ్రితోపాటు లక్నో చేరుకొన్నాడు. లక్నో వాతావరణంలోనే ఆయన పెరిగి పెద్దవాడయ్యాడు. ఇక్కడే ఆయన కావ్యరచనాప్రతిభ వికసించింది. ఈ లక్నో సమాజ వాతావరణమే ఆయన మస్నవీకావ్యాలైన 'బేనజీర్', 'బద్ర్-ఏ-మునీర్' లను రచించేందుకు దోహదం చేసింది. ఈకాలంలోనే మీర్జా ముహమ్మద్ తకీ ఖాన్ 'హవస్' 'మస్నవీ-లైలా మజ్నూ'ను రచించాడు. వీటివల్ల లక్నోలో మస్నవీల పట్ల అభిరుచి పెంపొందసాగింది. ఆతిశ్, నాసిఖ్ లకాలంలో కొద్దిగా మౌన వాతావరణం ఏర్పడినప్పటికీ 'గుల్ జార్-ఏ-నసీమ్' అనేగ్రంథాన్ని పండిట్ దయా శంకర్ 'నసీమ్' రచించాడు. 'అఫ్ తాబ్ ఉద్దౌలా 'కలక్' తిలిస్మె ఉల్ ఫత్ అనే రచన చేశాడు. నవాబ్ మీర్జా షౌక్ అనే కవి బహార్-ఏ-ఇశ్క్, జహర్-ఏ-ఇశ్క్, ఫరేబ్-ఏ-ఇశ్క్ రచించాడు. ఈ మస్నవీకవితలు మళ్ళీ పాఠశాలలో సంచలనాన్ని కలుగజేశాయి. పండిత పామరులందరినీ ఈ మస్నవీలు ఆకట్టుకోగలిగేయి. 'మస్నవీ మీర్ హసన్'కి జవాబుగా ఎవరో అజ్ఞాతకవి 'లజ్జత్-ఏ-ఇశ్క్' అనేపేరుతో మస్నవీలు రచించాడు. అది నవాబ్ మీర్జా షౌక్ గారి మస్నవీలతోపాటు ప్రచురితమవడంవల్ల ఆయనపేరుతో ముడిపడిపోయింది. కాని నిజానికి అది మీర్జా షౌక్ రచనకాదు సరికదా ఆయన సమకాలానిదికూడా కాదు.

ఈ మస్నవీలన్నిటినీ పరికించిచూస్తే 'గుల్ జార్-ఏ-నసీమ్' జనసామాన్యానికి ఎంతో బాగా నచ్చినప్పటికీ దాంట్లో పందలకొద్దీ తప్పులున్నాయనేవిషయం స్పష్టమౌతుంది. అంతేకాదు, ఇది కవిత్వం నేర్చుకొనే వ్యక్తిబాపతు ప్రారంభకరచన అనీ, కావ్యలక్షణాలన్నిటిని ఈ రచనలోనే గుచ్చెత్తాలనే విఫలప్రయత్నం రచయిత చేశాడనీ, కవితారచనలో బొత్తిగా అధికారం లేకపోవడంవల్ల రచయిత అడు

గడుక్కీ లోకరాలు తిన్నాడనీ తేలికగా అర్థమౌతుంది. అందువల్ల రచయిత ఎక్కడాకూడా తన లక్ష్యానికి చేరుకోలేకపోయాడని తేలుతుంది.

కాని ఇందుకువిరుద్ధంగా, అనుభవశాలి, చక్కనికవి ఆగా అలీ 'శమ్స్', అదే ఛందస్సుతో మస్నవీలు రచించాడు. వాటిలో ఎక్కడా తప్పులులేవు. అంతేకాకుండా అర్థాలంకారాల, శబ్దాలంకారాల చమత్కృతిని తన కవితలో చూపాడు. కాని ఆయన మస్నవీలు 'గుల్‌జార్-ఏ-నసీమ్'లా ప్రసిద్ధిని పొందలేకపోయాయి; కొద్దిరోజుల లోనే అవి తెరమరుగుకు వెళ్ళిపోయాయి. ఆ రోజులలో మోమిన్‌ఖాన్ ఢిల్లీలో అనుపమమైన చిన్నచిన్న మస్నవీలను రచించాడు. అవి జనాదరణపొంది ప్రఖ్యాతి నొందాయి. మోమిన్‌ఖాన్ కవిత్వం లాలిత్యంతో, గూఢార్థాలతో నిండివుండేది. చక్కని కల్పనలను, అలంకారాలను ఉపయోగించి ఆయన తన కవిత్వసౌధాన్ని నిర్మిస్తూండేవాడు. మస్నవీలలో ఆయన తరుచు కల్పనలనీ, భావాలనీ, అభిప్రాయాలనీ సమ్మిళితపరచి తన కవితలలో రసాన్ని ఉద్భవింపచేసేవాడు. మోమిన్ ఖాన్ ప్రధానశిష్యుడు 'నసీమ్' దేహ్లవీ లక్నో వచ్చాడు. ఆయన కవులగోష్ఠులలో మకుటంలేని చక్రవర్తిగా తన అధికృతవల్ల అత్యున్నతస్థానాన్ని సంపాదించుకో గలిగాడు. ఎందరో కవులు ఆయనకు శిష్యులయ్యారు. నసీమ్ దేహ్లవీ లక్నోలో తన కవిరాజపీఠాన్ని దృఢతరం చేసుకొన్నాడు. ఆయనశిష్యుడు 'తస్లీమ్' లఖ్‌నవీ తన ఉర్దూ మస్నవీలలో నజీరీ, ఉర్ఫీ, శాయిబ్ మున్నగు ప్రఖ్యాతకవుల రూప కల్పనలవంటి కల్పనలు విజయవంతంగా ప్రవేశపెట్టి ఉర్దూకవితలను పైజీ, గనీమత్ కవులస్థాయికి తేగలిగాడు. త్రాగుడునుఖండిస్తూ 'సాకీనామా నకస్కియా' అనే అనుపమ నీతిప్రబోధకమైన కావ్యఖండాన్ని తమ చివరిరోజులలో మౌల్వీ మీర్ అలీ హైదర్, తబాయీ, నజ్మ్‌లఖ్‌నవీ జంటకవులు ఉర్దూపాఠకులకు అందించేరు. ఆ కావ్యం పండిత, పామరులందరిచేతా అమితంగా కొనియాడబడింది. మోమిన్‌ఖాన్ రచించిన కొద్ది మస్నవీలను వదిలేస్తే ఉర్దూ మస్నవీల రచనా ప్రారంభంకూడా లక్నోలోనే జరిగిందనీ, అవి ప్రగతినికూడా ఇక్కడే సాధించ గలిగాయనీ చెప్పవచ్చు.

కొందరు మీర్ హసన్ బాపతు మస్నవీలను, గుల్‌జార్-ఏ-నసీమ్‌లను దృష్టిలో పెట్టుకొని ఢిల్లీ లక్నోభాషలను తులనాత్మకంగా మదింపువేసే ప్రయత్నం చేస్తారు. 'గుల్‌జార్-ఏ-నసీమ్' 'నజీర్' అక్బరాబాదీగారి 'బంజారీనామా' వలె పేరు

తెచ్చుకోగలిగినదైనప్పటికీ దానిని మీర్ హసన్‌గారి మస్‌నవీలతో పోల్చి చూసే ప్రయత్నం. ఉర్దూ కవిత్వానికి ఘోరమైన అవమానం కలుగచేయడానికి చేసే ప్రయత్నంవంటిదే అవుతుంది. ఒకవేళ మదింపువేయాలనే అనుకుంటే 'మీర్ హసన్' నీ, మస్‌నవీ 'తిలిస్మ్-ఏ-ఉల్‌ఫత్'నీ తీసుకోవచ్చు. ఒకవేళ 'గుల్‌జార్-ఏ-నసీమ్'లోని భాషను బలవంతంగా లక్నోభాషగా ఎంచడమే సంభవిస్తే మీర్ హసన్‌గారి మస్‌నవీలు, గుల్‌జార్-ఏ-నసీమ్‌ల తులనాత్మకపరిశీలన ఢిల్లీ-లక్నో కవిత్వాలకు కాక లక్నోలోని ముందు వెనుక తరాల భాషల తులనాత్మక పరిశీలనగా ఒప్పుకోవలసివుంటుంది. మీర్ హసన్‌గారి మస్‌నవీలు ముందుతరంభాషకు నమూనా. పండిట్ దయాశంకర్ 'నసీమ్‌గారి గుల్‌జార్-ఏ-నసీమ్ లోని మస్‌నవీలు వెనుకతరంభాషకు నమూనా అయివుండడంవల్ల పై సిద్ధాంతాన్ని కాదనేందుకు వీలుండదు.

కవిత్వానికి అతి ప్రాచీనమైనరూపం 'మర్సియా' (శోకగీతం). ప్రాచీన అరబ్బీ కవిత్వంలో, ఈ మర్సియాలు రజజ్ యుద్ధంలో తమ వంశస్థుల శూరత్వాన్ని వర్ణించడానికి మాధ్యమంగా ఉపయోగించేవారు. కొన్నాళ్ళకి ఫార్సీలో 'మర్సియా'లు చదివేపద్ధతి వెనుకపడిపోయింది. కాని సఫ్‌వియావర్గం అధికారాన్ని హస్తగతం చేసుకొన్నకాలంలో షియా సంప్రదాయానికి ఈరాన్‌లో ఆశ్రయం లభించింది. హజ్‌రత్ ముహమ్మద్ సాహబ్ బంధువులకు సంప్రాప్తమైనకష్టాలను జ్ఞప్తికి తేవడంకోసం ఈరాన్ కవులదృష్టి మర్సియాల రచనవైపు మళ్ళింది. 'మౌలానా మోహత్ శిమ్ కాశ్‌ఫీ' కొన్నిచరణాలతో ఒక గొప్ప మర్సియాను రచించాడు. అది జనాదరణను బాగా పొందగలిగింది. కవులు అప్పుడప్పుడు హుసైన్‌స్మృతిలో శోకంతో ఒకటి రెండు మర్సియాలను వ్రాసే రివాజు ఏర్పడింది. 'ఎందుకూ పనికి రాని కవి మర్సియా కవిగా చెలామణీ అవుతాడు' అనే సామెత వుంది. అందువల్ల కావ్యజగత్తులో మర్సియా కవులకు అట్టే స్థానం లేకుండాపోయింది. మతదృష్టితో సఫ్‌వియా సామ్రాజ్యానికి వారసత్వంగా అయోధ్యరాజ్యం అవతరించినకాలంలో లక్నోలో కవితాగోష్ఠులు అసంఖ్యాకంగా జరిగే ఆ రోజులలో పాదుషా లేక ఆయన కుటుంబంలోని వ్యక్తులు మరణించినప్పుడు ఆవేశంలో మర్సియా కవితలు అల్లబడి అభినయయుక్తంగా ఆలాపించబడుతూవుండేవి. రాజకుటుంబం, అధికారులు,

ప్రజలుకూడా ఈ మర్సియాకవితలను అమితంగా అభిమానిస్తూండేవారు. ఈ కళ లక్నోలో అసాధారణప్రగతి నొందగలిగింది. కవిత్వవిషయంలో లక్నో ఉన్నత స్థితికి రావడానికి అసలు కీలకం మర్సియాకవిత్వమే అనడం అసత్యమనిపించు కోదు.

భారతదేశంలో మొగలాయీ రాజులు పార్సీని తమ ఆస్థానభాషగా ప్రకటించారు. వాళ్ళజీవితాలలోని అన్ని కార్యకలాపాలకూ పార్సీ, సంస్కృతికేంద్రమై విలసిల్లింది. తత్ఫలితంగా ఈరాన్‌నుంచి వచ్చే ప్రతివ్యక్తీ మొగలాయీ ఆస్థానంచే గౌరవింపబడుతూవుండేవాడు. ఈరానీల ప్రతిపలుకూ, ప్రతిచర్యా మొగలాయీ సామ్రాజ్యంలో జనాదరణ పొందుతూండేది. కాని ఢిల్లీ చక్రవర్తులు సున్నీ సంప్రదాయానికి చెందినవారవడంవల్ల ఈరానీలు తమగుట్టు బయటపడనిచ్చేవారు కాదు. కవితాగోష్ఠులలో వాళ్ళు అట్టే ఎక్కువ కలిసికట్టుతనంగా పాల్గొనేవారుకాదు. అయోధ్య ఆస్థానం షియా సంప్రదాయాన్ని అనుసరించే నవాబులది అవడంవల్లనూ, వారి మూలపురుషుడు ఈరాన్‌లోని 'ఖురాసాన్' నుంచి వచ్చినవ్యక్తి అవడం వల్లనూ అయోధ్య ఆస్థానంలో ఈరానీలు హృదయపూర్వకంగా, తమ ప్రతిభను, శక్తినీ, కలిసిగట్టుతనాన్ని ప్రదర్శిస్తూండేవాళ్లు. అందువల్ల లక్నో ఆస్థానంలోని అధికారులు ఈరానీల విశేషతలను తాము అలవరచుకునేందుకు మనస్ఫూర్తిగా ప్రయత్నిస్తూండేవాళ్ళు. సాసానీ, అబ్బాసీలలో పుష్పించిన ఈరానీ సంస్కృతి కొద్ది రోజులలోనే లక్నో సంస్కృతిలో భాగంగా పరిణతి చెందింది.

సౌదా, మీర్‌గార్లకాలంలో మియాఁ సికందర్, గదా, మిస్కీన్, అఫ్‌సుర్దాలు మాత్రమే మర్సియా కవులుగా చెలామణి అయ్యేవారు. వీరు ఇమామ్‌హుసైను గారి మరణగాథను చిన్నచిన్న నజమ్ (పద్యాలు)లుగా రచించి కవి సమ్మేళనాలలో వినిపిస్తూండేవారు. వీరితరువాత మీర్ ఖలీక్, మీర్ జమీర్ అనే కవులు మర్సియా కవిత్వాన్ని అభివృద్ధిచేశారు. మర్సియా కవిత్వపు ఆధునికరూపం వీరికాలంనుంచే ప్రస్ఫుటమైంది. మీర్ జమీర్‌గారి శిష్యుడు మీర్జా 'డబీర్', మీర్ ఖలీక్‌గారి పుత్రుడు మీర్ 'ఆనీస్'లకు ఆ కాలం ఎంతో కీర్తిప్రతిష్ఠలను ఆర్జించి పెట్టింది. ఆ ఇద్దరు మహానుభావులూ మర్సియా రచనలో సూర్యచంద్రులుగా సాహిత్యాకాశంలో ప్రకాశించేటంత అత్యద్భుతచమత్కారాన్ని ప్రదర్శించారు. ఆనాడు

మీర్, సౌదా, ఆతిశ్, నాసిఖ్‌లలోవుండే కవిత్వపటుత్వాన్ని మీర్ 'అనీస్', మీర్జా 'దబీర్' రచనలలోకూడా వారి సమకాలీనపాఠకులు చూడగలిగారు. మీర్జా 'దబీర్' కవిత్వంలో భాషాగరిమ, ఉన్నతమైన కల్పనానైపుణ్యం, అసాధారణపాండిత్యం తొణికిసలాడేవి. మీర్ అనీస్ కవిత్వంలో సరళత, అనుభవం, మాననీయభావనలను ప్రభావితపరచే ఇంపైన భాషాపటిమ ద్యోతకమయ్యేది. ఇవి నేర్చుకుంటే వచ్చేవి కావు. భగవత్ప్రసాదితమైన ప్రతిభవల్లనే అంతటి చక్కనికవిత్వం చెప్పగలగడం మీర్ 'అనీస్'కి సాధ్యమైందని విజ్ఞులయినపాఠకులు భావిస్తూండేవారు. ఆంగ్లభాషా ప్రభావానికి లోనైన ఆధునికపాఠకులు అన్వేషించే ఎన్నో క్రొత్తపోకడలను తమ మర్సియా కవిత్వంలో చూపడంద్వారా ఈ ఇద్దరు కవులూ ఉర్దూసాహిత్యానికి పుష్టి చేకూర్చారు.

ఒకరకంగా ఈ ఇద్దరు కవులమూలంగా లక్నోపట్టణం ఇంతకుముం దెప్పుడూ కనీ వినీ ఎరుగని గందరగోళాన్ని ఎదుర్కోవలసివచ్చింది. లక్నో పాఠకలోకం ఈ ఇద్దరి రచనలనూ ఎంతో ఆప్యాయంగా చదివి, వీరిద్దరినీ ముక్తకంఠంతో ప్రశంసిస్తూండేది. ఫలితంగా పట్టణంలోని పాఠకులు రెండుబృందాలుగా చీలిపోయారు. ప్రతిపాఠకుడూ అనీస్ బృందానికో, దబీర్ బృందానికో చెందినట్లు భావించి తనని తాను అనీసియా గానో లేక దబీరియా గానో చెప్పుకోడానికి గర్విస్తూండేవాడు. ఆ రెండుబృందాలలోని సభ్యులమధ్య సదా పరస్పరవిరోధాలు వుంటూవుండేవి.

మీర్ 'అనీస్' మర్సియా కవిత్వంతోబాటు మర్సియా ఖానీ (వచనం)కి కూడా కళాత్మకరూపాన్నిచ్చాడు. గ్రీస్‌దేశపు వక్తలు కొందరు తమ ఉపన్యాసాలతో శ్రోతల్ని ప్రభావితులుగా చేసేందుకు కొన్నికొన్ని ప్రత్యేకపద్ధతుల్ని అవలంబించేవారని అంటారు. వాళ్లు తమ స్వరాన్ని అవసరమైనచోట్ల హెచ్చించడం, తగ్గించడం, హావభావాలను అవసరమనుకొన్నచోట్ల మారుస్తూండడంతో శ్రోతలను ఆకట్టుకొంటూండేవారు. దీర్ఘకాలీన ఇస్లాం సామ్రాజ్యజీవితంలో ఈ అత్యంత ఆవశ్యకమైన 'కళ'ను మీర్ 'అనీస్' కవిత్వంలో ఒక అంగంగా గుర్తించి తన రచనలలో, ముఖ్యంగా వచనరచనలలో ప్రవేశపెట్టాడు. ధ్వనులలో వైవిధ్యానికీ, వివిధహావభావాల ప్రదర్శనకు ఆస్కారముండే అనువైన సముచిత పదజాలాన్ని ప్రయోగించి ఆయన తన రచనలను కొనసాగించాడు. ఈ కళ లక్నోలో, ముఖ్యంగా

ఆసిఫ్ కుటుంబంలో ఉత్పన్నమైంది. ఇప్పటికీ దాని పురోభివృద్ధికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. మన రాజకీయవేత్తలు, వక్తలు, నటీ నటులు తమ ఉపన్యాసాలతో లేక సంభాషణలతో శ్రోతల్నీ లేక ప్రేక్షకుల్నీ ప్రభావితపరచేందుకు ఈ నిపుణులవద్ద కొద్దిగా నేర్చుకొంటే మంచి వక్తలుగాను, నటీ నటులుగాను పేరు తెచ్చుకోగలుగుతారు.

'నాటకం' పాశ్చాత్యకావ్యాలలో ఒక ప్రముఖఅంగం. అరబ్బీ, పార్సీ సాహిత్య క్షేత్రాలలో ఆనాడు నాటకరచనలు బొత్తిగా లేనేలేవని చెప్పవచ్చు. ఉర్దూభాష పార్సీకి ఆశ్రితురాలు కనుక ఉర్దూకూడా ఆనాడు నాటకాలంటే ఏమిటో తెలియని స్థితిలో వుండేది. సంస్కృతంలో ఆనాటికే గొప్పగొప్ప నాటక రచనలు వెలువడ్డాయి. కాని ఆనాటి భారతీయ ముస్లింలకు సంస్కృతనాటకాలనుగురించి ఏమాత్రం తెలియదు. శ్రీరామచంద్రుని, శ్రీ కృష్ణుని లీలలు హిందువులపండుగలలో ప్రదర్శింపబడుతూవున్నప్పటికీ ముస్లింలు వాటినిగురించి బొత్తిగా పట్టించుకోలేదు. శ్రీరామచంద్రునిలీలలు ఇంగ్లాండ్‌లో ఒలింపిక్ ఆటలలా బహిరంగ మైదానాలలో ప్రదర్శింపబడుతూండేవి. నాట్యాలలో, గానసభలలో శ్రీ కృష్ణలీలలు ప్రదర్శితమయ్యేవి. 'రాసలీలలు' మాత్రం ఒపేరా థియేటర్‌లలాంటి ధార్మికక్షేత్రాలలో కానవచ్చేవి. వాజిద్ అలీషాకు ముందుతరం ముస్లింలెవ్వరూ ఈ హిందూనాటకాలను గుర్తించలేదు. వాజిద్ అలీకి రాసలీలలు ఎంతో నచ్చాయి. ఆయన రాసలీలను కథావస్తువుగా తీసుకొని తన స్వంతబాణీలో నాటకాన్ని రచించాడు. ఆ నాటకంలో ఆయనే శ్రీ కృష్ణపాత్రధారి. ఆ నాటకంలో శ్రీ కృష్ణపాత్రధారి విఫలప్రేమతో విరాగియై మంటపెట్టుకొని కూర్చుండిపోతాడు, ఆయన రాణులు, వేశ్యలు వగైరా అప్సరసల, గోపికలవేషాలతో ఆయనను అన్వేషిస్తూ తిరుగుతారు. కైసర్‌బాగ్ జన బాహుళ్యానికికూడా ప్రవేశార్హతను కలుగజేసింది కనుక నాటకకళ లక్నో రసికులనందరినీ తనవైపు విశేషంగా ఆకర్షించుకోకలిగింది. అందువల్ల కొంతమంది సుప్రసిద్ధకవులు ఆకాలంనాటి అభిరుచికి అనువైన నాటకాలను రచించేంతవరకు నాటకకళ పురోగమించగలిగింది. మియా౯ అమానత్ అనే అనుభవజ్ఞుడైన కవి 'ఇంద్రసభ' అనే నాటకాన్ని రచించాడు( ప్రస్తుతకాలంలోని నాటకసమాజాలలా ఆనాడు లక్నోలోని వాడవాడలా నాటకమండలులు స్థాపితమై ఇంద్రసభానాటకాన్ని ప్రదర్శింపసాగాయి. కొన్నిచోట్ల స్త్రీపాత్రలను స్త్రీలు, పిల్లలపాత్రలను పిల్లలు ధరించి

నటించేవాడు. కొన్నిచోట్ల అన్నిపాత్రలనూ స్త్రీలే ధరించి నటించేవారు. ఈ నాటకంలో సంగీతనియమాలనుపాటిస్తూ వీనులకు విందుచేసే మధురసంగీతం, స్వరాలు కూర్చబడ్డాయి. లక్నో పట్టణమంతా ఈ నాటకాన్ని చూసేందుకు ఉవ్విళ్లూరుతూవుండేది. మియా అమానత్ విరచిత 'ఇంద్రసభ' సాఫల్యతనుచూసి మరికొందరు కవులు రకరకాల నాటకాలను రచించాడు, ఈ నాటికల పేర్ల చివర 'సభ'ని జోడిస్తూండేవారు. రామసభ, కృష్ణసభ, పాండవసభ మొదలయినపేర్లతో నాటకాలు తయారయ్యాయి, పట్టణంలో 'మదారీలాల్' మున్నగువారి అనేక సభలు ప్రారంభమయ్యాయి. ఈ నాటకాలు ఆ రోజులలోనే విభిన్నకథావస్తువులతో తయారవడం గమనించవలసినవిషయం. జనం 'ఇంద్రసభ' లాంటి నాటకాలకి తప్ప ఇతరవినోదాలను, అంటే నాట్యసభలను, సంగీతసభలను చూసేందుకుకూడా వెళ్ళేవారుకాదు. నాటకాలు చాలా స్వల్పవ్యవధిలో లక్నో పట్టణంలోని ప్రజలను అంత ఎక్కువగా ఆకర్షించగలగడం చాలా ఆశ్చర్యకరమైన విషయం. సమాజపు అభిరుచికి అనువుగా పురాతన ప్రేమోపాఖ్యానాలనుంచి మంచిమంచి కవితలను గుదిగుచ్చి నాటకాలద్వారా వాటిని చక్కగా ప్రేక్షకులకు అందజేయడం ఒక రివాజు అయిపోయింది. అనంతరం పార్శీథియేటర్లు తమ చక్కని ఏర్పాట్లవల్లనైతేనేం, ఆకర్షవంతమైన ప్రదర్శనలవల్లనైతేనేం ఈ 'సభల' నాటకాల ప్రాబల్యాన్ని తగ్గించగలిగినప్పటికీ ఈ సభలను పూర్తిగా అంతంమాత్రం చేయలేకపోయాయి. ప్రారంభంలో పార్శీలుకూడా నాటకాన్ని లక్నోనుంచే ఎంచుకొన్నారు. వారి తొలి నాటక ప్రదర్శన అమానత్ రచించిన 'ఇంద్రసభ'. లక్నోలో జాతీయ ఉత్సవాల సందర్భంలో సపేరా, హరిశ్చంద్ర మొదలయిన నాటకాలెన్నిటినో ప్రదర్శిస్తూంటారు. లక్నోలోని పెద్దమనుష్యులలో జాతీయ అభిరుచి సమాప్తమైపోయినప్పటికీ సాధారణజనంలో ఇంకా ప్రాచీనకథావస్తువులుగల నాటకాలపట్ల శ్రద్ధ తగ్గిపోలేదు. అందువల్ల అటువంటి నాటకాలలో అభినయించే నటీ నటవర్గం అక్కడ ఇంకా మిగిలివుంది. ఉర్దూ నాటకాలకు లక్నోలోనే పునాది పడిందనడంలో సందేహమే లేదు. ఇక్కడినుంచే భారతదేశమంతటా ఉర్దూనాటకాలు వ్యాపించాయి.

ప్రత్యేకలక్షణాలుగల ప్రేమకవితలను 'వాసోఖ్త్' అంటారు. దీనిపద్ధతి ప్రకారం కవి ప్రథమంగా తనప్రేమను ప్రకటించుకుంటాడు. అనంతరం తన ప్రేయసి రూపలావణ్యాలను నఖశిఖపర్యంతం వర్ణిస్తాడు. ఆ తరువాత ఆ ప్రేయసి కృత

ప్ను తతో తనకేవిధంగా దూరమైనదీ, తనని ఏయే యువతులు ఎంతగాఢంగా ప్రేమిస్తూన్నదీ, తానుకూడా వారిలో ఒక నవయువతిపట్ల ఏవిధంగా ఆకర్షితుడౌ తున్నదీ, అసలు ప్రేయసిని ఏడ్పించాలని ఈ అబద్ధాలు వర్ణిస్తాడు. ఈ ఊహాప్రేయసి సౌందర్యాన్ని అసలు ప్రేయసి వినేలా వర్ణిస్తాడు. ఈ వర్ణనలు విని ఆమె మండి పడుతుంది. ఈర్ష్యతో కుమిలిపోతుంది. ఈ ఈర్ష్యాగ్నిలో ఆమెగర్వం కరిగి పోతుంది. అసలు ప్రేయసిని ఆవిధంగా తనవైపు కవి ఆకర్షించుకుంటాడు.

ఉర్దూ కావ్యాలలో ఈ రూపకల్పన లక్నోలోనే ప్రారంభమైంది. మధ్యయుగం లోని ఉర్దూ కవులందరూ వాసోక్తులు రచించారు. వాటిలో అద్భుతమైన చమత్కారాలను చూపేరు. అనంతరం ఢిల్లీలోకూడా అనేక వాసోక్తులు రచింపబడ్డాయి. ముఖ్యంగా మోమిన్‌ఖాన్ ఎన్నో మంచిమంచి 'వాసోక్తు'లు రచించాడు.

విలాసప్రియులయిన ధనవంతుల ఆశ్రయంలో ఇంకా అనేకమయిన కావ్య రూపాలు ఉద్భవించాయి. ఢిల్లీ ఇట్టి కావ్యరూపాలకు పుట్టిల్లు. వీటన్నింటిలో హజల్ గోయీ (అశ్లీల కవితలు) ఎందుకూ పనికిరానిచెత్త. కొంతవరకూ రేఖ్తీ (స్త్రీలభాషలో) అల్లబడినకవిత్వం ఆకర్షణీయంగా ఉంటుందని అంగీకరించవచ్చు. బహుశః ముహమ్మద్‌షాకాలంలో ఢిల్లీలోనే 'జాఫర్ జటల్లీ' హజల్‌గోయీ కవితకు అంకురార్పణ చేశాడు. ఆయన కవితలను నేను ఆరంభంనుంచి ఆఖరువరకూ చదివిచూశాను. అశ్లీలత, హద్దుమీరిన బూతుకవిత్వం తప్పించి కావ్యసౌందర్యం కాని, సరసభావాత్మక భాషాశైలికాని అందులో మచ్చుకుకూడా కనిపించలేదు. దీనితరువాత ఢిల్లీప్రాంతం 'బిల్‌గ్రామ్' నుంచి 'సాహబ్‌కరాఁ' అనే కలంపేరుగల కవి లక్నో వచ్చిచేరాడు. ఆయన అసలుపేరు సయ్యద్ ఇమామ్ అలీ. అసఫ్ ఉద్దౌలా కాలంలో ఆయన ప్రసిద్ధికెక్కాడు. లక్నోలో చవకబారు అభిరుచిగల ధనవంతులకు ఆయనకవిత్వం బాగా నచ్చిందని భావించబడుతోంది. ఆయనకవిత్వం అశ్లీలమైనదీ, అసభ్యమైనదీ అయినప్పటికీ ఆయనకు ఆస్థానంలోకూడా మంచి స్థానమే లభించింది. కాని ఆ అశ్లీలకవిత్వంలో కావ్యాత్మకగుణగణాలున్నాయి. సరసమయిన భాష, అందమయిన జాతీయపదాలతో ప్రయోగాలు ఆయనకవితలలో కనిపిస్తాయి. కాని మీర్జా దబీర్ శిష్యుడు 'మియాఁ ముశీర్' ఆఖరుదశలో ఈరకం కవిత్వాన్ని ఉన్నతస్థితికి తెచ్చాడు.

హజల్ గోయీలసందర్భంలో మియాఁ 'చిర్‌కీఁ' పేరుకూడా చెప్పుకోవలసి వుంటుంది. లక్నోబాపతు మధ్యయుగంలో ఆశూర్ అలీ ఖాన్ అనే ధనికుడు వుండే వాడు. ఆయన సరసహృదయుడు, యోగ్యుడు, ఉదారస్వభావుడు, కవితాపోష కుడు. ఆయనగృహంలో తరచు జరిగే కవిసమ్మేళనాలు ఆనాటి సమాజపు సజీవ మైన నమూనాలుగా ఖ్యాతినొందేయి. ఆయన ప్రోత్సాహం. ఆదరణలవల్లనే జాన్ సాహబ్, చిర్‌కీఁలు పైకి రాగలిగారు. కొందరు, 'సాహబ్ కరాఁ'కూడా ఆయన సాంగత్యంవల్లనే ఉన్నతస్థితికి రాగలిగాడని అంటారు. చిర్‌కీఁ తన కవిత్వంలో మాటిమాటికీ మరుగుదొడ్లను, పాకీదొడ్లను ఉదహరిస్తూంటాడు. ఆయన ప్రతి పద్యంలోనూ పాఠకులకు డోకుపుట్టించే కంపు నిండివుంటుంది. కాని ఆయన కవి త్వంలో కావ్యాత్మకసౌందర్యం, చక్కని ఉపమాలంకాలకుకూడా కొదవలేక పోవడంవల్ల ఆయనను కవుల జాబితాలోంచి త్రోసివేయలేకపోతున్నాం. ఏమై తేనేం, ఆయన అభిరుచిస్థాయీ యీ అందాన్నంతనీ మలినపరిచి భ్రష్టం చేసింది.

కాని రేఖ్తీ కవిత అసభ్యమైనదే అయినప్పటికీ మనోహరంగా వుంటుంది. చిర్‌కీఁ కవిత్వంలా భయంకరంగా వుండదు. స్త్రీ పురుషుల సంభాషణాక్రమంలో, సామెతలలో, లోకోక్తులలో ఎంతో కొంత భేదం తప్పకుండావుంటుంది; కాని ఉర్దూభాషలో చూపినంత ఎక్కువగామాత్రం తేడావుండదు. పార్సీ, అరబ్బీ భాషల లోను, ఇతరభాషలలోను ఈ తేడాను సహజరీతుల్లో చూపించారు. కాని ఉర్దూలో ఈ తేడా అతిగా చూపించడం జరిగింది. స్త్రీలు తమభాషలోనే కవిత్వంవ్రాస్తారనీ, పురుషులు ఎప్పుడైనా స్త్రీలభాషలో ఏదైనా భావాన్ని ప్రకటిస్తే భాషలో లాలిత్యాన్ని ఉద్భవింపచేసేందుకుమాత్రమే అలా చేస్తారనీ ప్రాచీన పార్సీ, అరబ్బీకవుల అభి ప్రాయం. ఆంగ్లేయుల అభిప్రాయంకూడా ఇలాంటిదే. ఉర్దూకవిత్వం సర్వదా పురుష భాషలోనే వ్రాయబడేది. ఆకవిత్వంలో స్త్రీలపాత్రలచేతకూడా పుంలింగప్రయోగాలు ఉండేవి. కవయిత్రిపేరు కనుక తెలియపరచకపోతే అది పురుషుని రచనే అని అను కోవడం సర్వసాధారణంగా జరిగేవిషయం.

ఉర్దూకవిత్వపు మూడోదశలోనో, నాల్గోదశలోనో చంచలస్వభావులైన నవ యువకులలో 'రేఖ్తా' మాదిరి 'రేఖ్తీ'ని సృష్టించాలనే అభిప్రాయం కలిగింది. మీర్ హసన్ తన మస్నవీలలో అవసరాలకు అనువుగా ఈ భాషను ప్రయో

గించాడు. ఇదేం అభ్యంతరకర విషయంకాదు. ఢిల్లీనుంచి లక్నోవచ్చి కవిసమ్మేళనాలలో పాల్గొంటూండే మియాఁ 'రంగీన్' ఈ శైలిని పుణికి పుచ్చుకున్నాడు. సభ్యతగల పెద్దలు ఈ శైలిని అశ్లీలమైనదీ, అసభ్యమైనదీ అని భావించి బహిష్కరించారు. ఢిల్లీకిచెందిన గౌరవనీయుడైన ఒక వృద్ధుడికీ అక్కడేఉన్న ఒక వేశ్య 'నూరన్'కీ మధ్య జరిగిన సంభాషణ సయ్యద్ఇన్షా చెప్పగా వ్రాసుకున్నాను. ఆ పెద్దమనిషి అంటాడూ 'సఆదత్ యార్ తహ్మాస్ప్ కుమారుడు 'అన్వరీ రేఖ్తా' పటుత్వంగల కవి. 'రంగీన్' అనేది అతని ఉపనామం. ఒక కథ చెప్పాడు. తన కవితకు 'దిల్పజీర్' అనే పేరుపెట్టాడు. వేశ్యలభాషను ఇందులో కూర్చాడు. మీర్ హసన్మీద విషం కక్కాడు. కీర్తిశేషులందరూ తెలివైనవారనే అభిప్రాయం ఉండకూడదని నిక్కచ్చిగా చెప్పాడు. 'బద్ర్-ఏ-మీనార్' మస్నవీ కవిత్వంకాదు దున్నపోతు ఈనిందంటే దూడను కట్టేయ్ అన్నమాదిరి పిచ్చి అభిప్రాయాల పుట్ట. దాన్ని కవిత్వమని ఎలా అనగలం? పాఠకులంతా ఢిల్లీవారు, లక్నోవారూ వేశ్యల నుండి విటులదాకా, స్త్రీలనుండి పురుషులదాకా అంతా ఇది చదువుతారు.

'చలీ వహాం సే దామన్ ఉఠాతీ హుయీ - కదే సే కదే కో బజాతీ హుయీ' 'కొంగు ఎగరేస్తూ బిగువైనదానితో బిగువైనదానిని వాయించుకుంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయింది.'

'మీనాన్న గొప్ప సైనికుడు, బల్లెం విసిరేవాడు, కత్తి తిప్పేవాడు. అలాటి వాడికి నీవెలా పుట్టావు. పోకిరీబుద్ధులు, వ్యభిచారం అలవాటు చేసుకున్నావు. రేఖ్తా అనే కవితారీతికి పోటీగా 'రేఖ్తీ' (అశ్లీల కవిత) సృష్టించావు. పరువుగలవారి ఇళ్ళలోని ఆడవాళ్లుకూడా అశ్లీలగీతాలు చదివి కామోద్రిక్తులై చెడిపోవాలనా? ఈ పద్యమేమిటి?

జరా ఘర్కో 'రంగీఁ' కే తహకీక్ కర్లో
యహాఁ సే హై కైసె డోలీ కహారో!

'రంగీన్ అనే కవి ఇల్లు ఎక్కడో కాస్తచెప్పండి! ఇక్కడినుండి ఆయన ఇంటికి తీసుకువెళ్ళడానికి ఎంతడబ్బు పుచ్చుకుంటారో చెప్పండి' అని పల్లకీ బోయీలను అభిసారిక అడుగుతోంది. ఒక పుస్తకమే వ్రాశావట? ఏమిటీ రాతలు? అందులో అంతా వేశ్యలభాష వాడావు. ఆ 'సోగ్గాడు చందమామ, కులుకుతోంది చాకలిది....వగైరా వగైరా రాశావు' అని ఎవరయినా అడిగితే 'రంగీన్' పట్టించుకునేవాడు కాదు. తన అశ్లీలధోరణి మానుకునేవాడు కాదు.

పాపం ! సభ్యతగలవృద్ధులు ఇట్టి రచనలను తిట్టుకుంటూ, విమర్శిస్తూ ప్రాణాలు విడిచారు. నవయువకుల విలాసప్రియత్వం 'రంగీన్' అభిరుచిని అభివృద్ధిపరచింది. 'రేఖ్తీ' కావ్యరచనా ప్రక్రియ ఉర్దూలో స్థిరపడింది. ఇది ఢిల్లీలో ఉద్భవించినప్పటికీ లక్నోలో పెరిగి శక్తినీ వ్యాప్తినీ పుంజుకుంది. మీర్ హసన్ తదనంతరం నవాబ్ మీర్జా 'శౌక్' ఈ భాషకు మెరుగులుదిద్దాడు. కవి తన అవసరాలకు అనుగుణంగా వాడుకభాషలో ఎక్కడెక్కడ ఏయే మార్పులుచేశాడో పుస్తకమంతా చదివినా గుర్తించడం కష్టమౌతుంది. ప్రవాహంలాటి సరసశైలిలో భాష, పదాల వాడకం జరిగింది. కాని గజల్ రచనకు 'రంగీన్'కు జాన్ సాహబ్ వారసుడయ్యాడు. ఆయన లక్నోలోని సాధారణవ్యక్తి అసూర్ అలీఖాన్‌గారి శిష్య పరంపరలో వాడు. జాన్‌సాహబ్ తరువాత తరంలోకూడా లక్నోలో ఎంతోమంది రేఖ్తీ కవిత్వం రచించిన కవులు లేకపోలేదు. అయితే వాళ్లు జాన్‌సాహబ్‌లా జనాదరణనూ, పేరు ప్రఖ్యాతులనూ ఆర్జించలేకపోయారు. ఆయన గజల్, వాసోఖ్త్, నజమ్ మొదలయిన వివిధప్రక్రియలలో రచనలు జరిపాడు.

అశ్లీలత, కాముకతలను జొప్పించకుండా రేఖ్తీలో విశుద్ధభావాలను వ్యక్తపరచివుంటే ఈ కళకూడా ప్రగతిని సాధించి వుండేది. కాని కామాన్ని రెచ్చగొట్టే భావాలు, అశ్లీలాలతో చౌకబారు ఆనందాన్ని రేకెత్తించే అభిప్రాయాలు ఈ రేఖ్తీకి పునాదులు కావడం విచారకరం! ఇందుకే రేఖ్తీకవులు సదా సభ్యమార్గంనుంచి, సంయమ పథంనుంచి తప్పుకుని నడిచారు. వారివల్ల ఉర్దూభాషకు ఏదైనా ప్రయోజనం కలిగినప్పటికీ నైతికంగా పాఠకులకు అపారనష్టం వాటిల్లిందని అనక తప్పదు.

## 11

ఉర్దూ గద్యరచన పద్యరచనకంటే వయస్సులో చిన్నది. కొందరు ఫార్సీభాషలోనే షేర్‌లు వ్రాస్తూండేవారు. కాని ఎక్కువమంది ఉర్దూ 'గజల్'వైపే మొగ్గు చూపుతూండేవారు. భారతదేశంలో ఉర్దూ కవులసంఖ్య, ఫార్సీ కవులసంఖ్యను మించి

వుంటూండేది. కాని భారతీయులు పార్సీ గద్యాన్నే ఎక్కువ అభిరుచితో చదువుతూండేవారు. విజ్ఞానాలకి సంబంధించిన గ్రంథాలు, మతసంబంధమైన గ్రంథాలు పార్సీభాషలోనే రచింపబడుతూవుండేవి. పెద్దలనుంచి పిన్నలదాకా అన్ని వయస్సులవ్యక్తులూ పార్సీలోనే ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకుంటూండేవారు. పాఠశాలలలో పిల్లలచదువుకూడా పార్సీభాషలోనే కొనసాగుతూండేది. ఫలితంగా వ్యావహారికభాషరూపంలో ఉర్దూ తన మధురమైన ఉన్నతస్థానాన్ని నిలుపుకోగలిగినా, లిపివరకూ వచ్చేసరికి ఉర్దూ మూగదై పోయేది.

ఆంగ్లేయుల ప్రోత్సాహంతో మీర్ అమ్మన్ దేహ్లవీ ఉర్దూభాషలో ఓంప్రథమంగా 'చార్ దర్ వేశ్' అనే వచన గ్రంథాన్ని రచించాడు. ఆకాలంలోనే మీర్జా అలీ లుత్ ఫ్ 'తజ్ కిరా-ఏ-శోఅరా-ఏ-ఉర్దూ' రచించాడు. ఈ గ్రంథం హైద్రాబాద్ లో అబ్దుల్లా ఖాన్ సాహబ్ ప్రయత్నంమూలంగా ప్రచురితమయింది. రమారమి ఆకాలంలోనే మౌల్ వీ ఇస్మాయీల్ సాహబ్ శహీద్ గారు 'తౌహీద్' (అద్వైతం,) ఇత్తివాఅ-ఏ-సున్నత్ (మతప్రచారకుల ఉపదేశమార్గానుకరణం) ఇతివృత్తంగా 'తక్ వీయత్-ఉల్-ఈమాన్' అనే రెండు ఆధ్యాత్మిక గ్రంథాలు వ్రాశారు. అవి సాహితీ వైచిత్రి ప్రదర్శించేందుకు వ్రాయబడలేదు. కనుక పాఠకులు ఈ దృష్టితో ఆ గ్రంథాలనుంచి చెడ్డలను అంచనా వేయకూడదు. సరళమైనభాషలో, సూటిగా తాను చెప్పదలచుకొన్నసంగతులను పాఠకులకందచేసి సామాన్యజనంలో మత విషయాలపట్ల ఆసక్తిని రేకెత్తింపచేయడం ఆ గ్రంథాలలక్ష్యం. ఆ ఇద్దరు మహనీయులు ఉర్దూసాహిత్యంలో చమత్కారం చూపదలచుకొనివుంటే - ఆ రోజులలో సుప్రసిద్ధులయిన 'జహూరీ', 'నే మత్-ఖాన్-ఏ-అలీ', 'అబుల్ ఫజల్', 'తాహిర్ వహీద్'ల శైలినీ పోకడలనూ తమ గద్య రచనలలో జొప్పించివుండేవారే. సాహిత్యక్షేత్రంలోనేకాక, శిష్టుల సంభాషణలలోకూడా జహూరీ, అలీ, అబుల్ ఫజల్ కవుల గద్యశైలి వాడబడుతూవుండింది.

ఉర్దూ గద్యరచన నిజం చెప్పాలంటే లక్నోలోనే మిర్జా రజబ్ అలీ బేగ్ సురూర్ తన 'ఫసానా-ఏ-అజాయబ్' అనే గ్రంథాన్నీ, ఇంకా ఇతరరచనలను ప్రచురించడంతో ప్రారంభమైంది. ఆకాలంలో 'నౌరతన్'కూడా లక్నోలో రచింపబడింది. దానిరచయిత ముహమ్మద్ బక్ష్ 'మహజూర్'. ఆయన జుర్ అత్ శిష్యుడు. లక్నోలో ప్రఖ్యాతి గడించాడు.

(రజబ్ అలీ బేగ్ సురూర్ గద్యరచనలో అపూర్వచమత్కారాన్ని చూపించాడు. ఆయన రచించిన 'నౌరతన్' ప్రచురించబడ్డాక ఉర్దూప్రపంచం అత్యంతాశ్చర్యంతో ఆ గ్రంథాన్ని తిలకించింది. కాని ఆ గ్రంథపీఠికలో దురదృష్టవశాత్తూ 'మీర్ అమ్మన్'ను కటువుగా విమర్శించడం జరిగింది. ఇందువల్ల ఢిల్లీ నగరపాఠకుల దృష్టిలో ఈ గ్రంథంలోని విశేషాలన్నీ బూడిదలోపోసిన పన్నీరులా వమ్మ అయిపోయాయి.

ముహమ్మద్ హుసైన్ అజాద్ వంటి విశిష్టవ్యక్తికూడా రజబ్ అలీ బేగ్ సురూర్‌ను లక్నోగుండాగా పేర్కొని అతడి రౌడీతనపు వ్రాతలకు ఏనాటికయినా ప్రతీకారచర్య తీసుకోవాలని వక్కాణించాడు. మీర్ అమ్మన్ గద్యగ్రంథంలో అంగ్లేయులకు ఏరకమైనసౌందర్యం కనిపించిందో వారికే తెలియాలి. కాని భారతీయ ఉర్దూభాష తెలిసినవారిలో ఎవరికి ఆయనకవిత్వంలో సౌందర్యం కనిపించలేదు, కనిపించబోదు. ఆంగ్లవిద్యాప్రభావం ఆనాటివరకు భారతీయ సాహిత్యసంప్రదాయాన్ని మార్చకపోవడం, ప్రాచ్యసాహిత్యభావాలు భారతీయమస్తిష్కాలలో చెక్కుచెదరకుండా మిగిలివుండడం బహుశః ఇందుకు కారణాలేమో!)

విద్య, అభిరుచుల విశేషవికాసంవల్లనే సాహిత్యశైలి ఏర్పడుతుందనే విషయంలో నాకెంతో నమ్మకముంది. ఆహారపదార్థాలు, సుగంధద్రవ్యాలు, రంగులు, భవనాలు, రోడ్లు, తోటలు, దీపాలు మొదలగు వస్తుసముదాయం ఒక నగర సంస్కృతివిశేషాన్ని మంచిగానో లేక చెడుగానో చూపేందుకు ఉపయుక్తమవుతాయి. దేశదేశాలమధ్య, జాతికీ జాతికీమధ్య, ఒక కాలానికీ, ఇంకో కాలానికీ మధ్య ఈవిషయంలో ఎన్నో భేదాభిప్రాయాలుంటాయి. ఒకదేశపు అత్యంత ప్రియతమవస్తువు మరొకదేశందృష్టిలో అత్యంత నీరస గర్హనీయమైనదిగా కనిపించవచ్చు. అదేపద్ధతిలో సాహిత్యాభిరుచికూడా దేశదేశాలలో, జాతిజాతిలో వారివారి సంస్కారాన్నిబట్టి విభిన్నమైవుంటుంది. ఒకరకమయిన సాహిత్యశైలి మన దేశంలో వికసించి జనాదరణను పొందుతుందనుకోండి. అదే ఇంకోదేశం దృష్టికి నీరసమయినదిగాను, నిరర్థకమయినదిగాను, మూర్ఖంగాను కనిపిస్తుంది. సాధారణ పాఠకులు ఈ రెండు దృక్పథాలలోనూ ఏది మంచిదో, ఏది చెడ్డదో నిర్ణయించుకోలేనిస్థితికి గురి అవుతారు.

అనుప్రాసలను అత్యధికంగా ఉపయోగికచడం వాక్యవిన్యాసంలో వాడుకలో వుండే సముచితశబ్దాలను వాడడం, ఒకే ఆశయాన్ని మాటిమాటికీ పునశ్చరణం చేయడం, ఇస్లామ్‌కు పూర్వపు అరబ్ దేశంలో సుందర కవిత్వతత్వానికి ఉత్తమ లక్షణాలుగా భావించబడేవి. ఆ భాష, ఆ శైలీ కురాన్ గ్రంథంనిండా కనిపిస్తాయి. ఒకవిధంగా ఆ భాషాశైలి అరబ్బీ సాహిత్యానికి అవసరంగా రూపొందింది. 'ముకామాత్-ఏ-హరీరీ', 'తారీఖ్-ఏ తైమూరీ' అరబ్బీ సాహిత్యంలో ఉత్తమగ్రంథాలు. అనేకశతాబ్దాలపాటు ముస్లింప్రపంచం ఆ గ్రంథపఠనంవల్ల ఆనందానుభూతిని పొందగలిగింది. కాని నేటిదృష్టితోచూస్తే 'అత్యధికమైన అనుప్రాసలు, అనుచిత విషయ విస్తరణ, అనావశ్యకపదజాలంతో నిండివుండడం తప్పించి ఆ గ్రంథాలలో మరేవిశేషం లేదు అనిపిస్తుంది. అయితే ఈ శైలినే ఫార్సీ సాహిత్యవేత్తలు స్వంతం చేసుకొన్నారు. సాహిత్యం ప్రగతిమార్గంలో పురోగమించడంవల్ల ఈ శైలికూడా కాలానుగుణంగా ప్రౌఢమై స్థిరపడింది. ఉర్దూ సాహిత్యవేత్తలు ప్రారంభదశలో ఈ శైలిచే ప్రభావితులు కావడంవల్ల వారుకూడా ఈశైలినే అనుసరించారు. ఉర్దూ కవులందరూ ఈశైలిని ప్రశంసించారు. ఉర్దూ ఏమాత్రం ఎరుగని ఆంగ్లేయులకు 'చార్ దర్ వేశ్' నచ్చినంతమాత్రాన, భారతీయ విద్యావేత్తలు ఈ గ్రంథంలోని సాహిత్యమూల్యాలను గుర్తించారని అనుకోవడం శుద్ధ పొరబాటు.

ఉర్దూకవిత్వం ధరించిన ప్రాచీన సాహిత్యాభరణాలను, పాత పట్టుపుట్టాలనూ విప్పేసి ఆ కవితామతల్లికి విదేశీ కొత్తచొక్కాను కట్టబెట్టిన అశుభసమయం ఆసన్నమైంది, నిస్సందేహంగా ఆంగ్లేయుల, ముఖ్యంగా ఆంగ్లభాషా ప్రభావంవల్లనే ఉర్దూకవిత్వం ఈమార్పుకు గురిఅయింది. 'చార్ దర్ వేశ్' ఇంకా ఇలాంటివే అన్యరచనలూ పాతకాలంనాటి వేషభాషలు లేకపోవడంవల్లనే పాఠకులకు బాగా నచ్చాయి. అంతేకాని వాటిలో ఏదైనా విశేషముండడంమూలంగా మాత్రం కాదు! ఆనాటి పాఠకులకు నచ్చని ప్రాచీన, సాహిత్యవిశేషాలు ఆ రచనలలో లేకపోవడమే ఆ రచనలపట్ల ఆదరణకు నిజమయినకారణం.

ఆకాలంలో లక్నోలోని మౌల్వీ గులామ్ ఇమామ్ 'షహీద్' 'మౌలూద్ శరీఫ్' అనే గ్రంథాన్ని రచించారు. అది ఆనాటి సాహిత్యాభిరుచికి అనుగుణంగా వుండడం

వల్ల మంచిపేరు తెచ్చుకుంది. మతగ్రంథం అవడంవల్ల ఈనాడూ దానికి జనాదరణ వుంది.

కాని ఆధునిక ఉర్దూ వచన రచన ఢిల్లీలోనే ప్రారంభమైంది. సదా ఉర్దూ వచన రచనాప్రక్రియ ఢిల్లీకి ఋణపడివుంటుంది. మీర్జా గాలిబ్ ఉర్దూ వచన రచనలో ఆధునిక అభిరుచికి ఎంతో అనువైన సరళత, సహజత్వంగల శైలిని ప్రవేశ పెట్టారు. ఆయన తన గద్యశైలిలో అక్కడక్కడ అనుప్రాసలవంటి చిన్నచిన్న ఆకర్షణలను అతి సహజంగా చొప్పించాడు. అయితే పట్టుబట్టి పరిశీలిస్తేకాని ఆయన అనుప్రాసలను చొప్పించాడనేవిషయం పాఠకులు గమనించలేరు. ఆధునిక విద్య, ఈ శైలిని ప్రజలు స్వీకరించడానికి అనువైనవాతావరణం సిద్ధం చేసింది, ప్రతిచోట ఈ శైలి ప్రశంస నందుకోగలిగింది. అనంతరం సర్ సయ్యద్ ఈ సరళతకు గాంభీర్యాన్ని చేకూర్చిపెట్టాడు. జటిలపదాలను వాడకుండా, భాష సౌంష్ఠ చెడకుండా చిన్నపెద్ద అందరికీ అందుబాటులో వుండేలా ఆయన ఎంతో కృషి చేశాడు. లక్నోప్రజలు అప్పటికింకా ఆంగ్లప్రభావానికి లోనుకానందువల్లనూ, ప్రాచీనశైలినే వారు ఇష్టపడుతూ వుండడంవల్లనూ మౌల్వీ ముహమ్మద్ హుసైన్ ఆజాద్ ఆ గంభీరతను చెడగొట్టకుండా సరళశైలిని ప్రవేశపెట్టాడు. ఇక్కడ వాజిద్ అలీషా జీవితాంతంవరకూ విలాసకవితలు, అనుప్రాసాన్విత వాక్యవిన్యాసా లతోకూడిన గంభీరకవితలు రచించబడుతూ వుండేవి. అందువల్ల సామాన్యపాఠ కులు ఆ కవిత్వంలో తాము కోరే సరళత, సరసత లభ్యంకాక ఆనందించలేక పోతూండేవారు.

అనంతరం అలీగఢ్ నుంచి 'తహ్జీబ్-ఉల్-అఖ్లాక్', ఆగ్రానుంచి 'తేరహ్ పీం సదీ', లక్నోనుంచి 'అవధ్ పంచ్' పత్రికలు వెలువడసాగాయి. ప్రతి పత్రికా ఉర్దూ వచనంలోపతు ఒకొక్క విశిష్టమయిన నమూనాకు ప్రతిబింబంగా వుండేది. తహ్జీబ్ ఉల్ అఖ్లాక్‌లో గంభీరత, పాండిత్య ప్రకర్షలతోబాటు జాతీయతపట్ల సానుభూతి ప్రస్ఫుట మవుతూండేది. అందులో సుపరిష్కృతమైన స్వచ్ఛమైన భాషలో పాశ్చాత్య ఆధునిక సాహిత్యవిషయాలు, తార్కికవిషయాలు, ప్రతిభా వంతమయిన వ్యాసాలు, ఉపన్యాససారాంశాలు వెలువడుతూవుండేవి. 'తేరహ్ పీం సదీ'లో ప్రాచీన సాహిత్యవిశేషాలను, అర్వాచీన సాహిత్యవిశేషాలను తులనాత్మ

కంగా చర్చించి, ప్రాచీనసంస్కృతిని ప్రశంసిస్తూ వ్రాయబడే సరిక్రొత్తశైలిలోని వ్యాసాలు, వ్యాఖ్యలు ప్రచురితమవుతుండేవి. ప్రాచీనసాహిత్యాన్ని, సంస్కృతిని మెచ్చుకొనే పాఠకులనూ; ఆధునికసాహిత్యాన్నీ సంస్కృతినీ ప్రశంసించే విద్యాధికులనూ ఈ 'తేరహ్ వీం సదీ' అద్భుతంగా ఆకట్టుకోగలిగేది.

'అవధ్ పంచ్' పత్రిక పిసలైన భాషాస్వరూపాన్ని పాఠకలోకానికి అందిస్తూండేది. ఇది హాస్యప్రధానమయిన పత్రికగా పేరుపొందింది. వివిధ హాస్య రచనలు ఇందులో ప్రచురితమవుతూండేవి. ప్రతి హాస్యరచనలోనూ భిన్నత్వం కనిపిస్తూండేవి. మున్షీ సజ్జాద్ హుసైన్ సంపాదకీయంలోని వాడితనం, మీర్జా మచ్చ్ బేగ్ సాహబ్‌గారి 'కౌసర్' (స్వర్గకుండం) లోని మంచి ముత్యాలలాంటి విలువయిన శబ్దజాలం ఎహ్‌మద్ అలీ కస్‌మండవీగారి ఫార్సీ ఖాయిష్టశైలీ, పండిత్ త్రిభువన్ నాథ్ 'హిజ్ర్'గారి మధురమయిన హిందీకవితలు మొదలయిన చక్కని విషయాలతో 'అవధ్ పంచ్' పాఠకలోకాన్ని అమితంగా ఆనందపరచేది.

(ఆకాలంలోనే 'అవధ్ పంచ్' పత్రికతోబాటు పండిత్ రతన్ నాథ్ సర్‌షార్ గారి నవల 'ఫసానా-ఏ-ఆజాద్' ప్రచురణ ప్రారంభమైంది. అది ఉర్దూజగత్తును ఉర్రూతలూగించగలిగింది. ఉర్దూ పాఠకలోకం నవలాపరిచయంపొంది నవలలపట్ల ఎక్కువమోజు జూపించింది.

'ఫసానా-ఏ-ఆజాద్'లో రచయిత 'ఫసానా-ఏ-అజాయబ్' బాపతు పురాతన శైలికే ఆధునికరూపాన్నిచ్చి తన స్వంతశైలిలో దృశ్యాలని చిత్రించాడు, సంఘటనలను వర్ణించాడు. ఇతరపాత్రలచేత సంభాషణలను చెప్పించేసందర్భాలలో మాత్రం చాలా సాధారణమైన సరళభాషను వాడాడు. ముఖ్యంగా స్త్రీలభాషకు అత్యంత సుందరరూపురేఖల నివ్వగలిగాడు. అయితే ఈ ప్రయత్నంలో కొన్ని తప్పులు దొర్లినమాట వాస్తవం. కాని ఈ ప్రయత్నంలో అంతకుపూర్వం ఏ కవికీ లభించని సఫలత ఆయనకు సిద్ధించిందని ఒప్పుకోక తప్పదు.)

ఆకాలంలోనే మౌల్వీ నజీర్ ఎహ్‌మద్ సాహబ్ ఆంగ్లప్రభుత్వపు ఆదేశంతో 'తాజీరత్-ఏ-హింద్'ను అనువదించాడు. ఆయన సహజమయిన భాషనీ, సరసమయిన శైలినీ, సరళమయిన కవితాప్రవాహాన్నీ తన రచనద్వారా ఉర్దూ పాఠకలోకం ముందుంచాడు. అయితే అరబ్బీ శబ్దాలభారం ఎక్కువైపోవడంవల్ల

దుర్గమంగాను, అలంకారభూయిష్ఠంగాను ఆయన రచన తయారయింది. ఆ కాలం లోనే మౌల్వీ ముహమ్మద్ హుసైన్‌సాహెబ్ అజాద్‌గారి సాహిత్యంకూడా ఎంతో జనాదరణం పొందగలిగింది. ముఖ్యంగా ఆయన రచించిన 'జబాన్ ఉర్దూకీ తారీఫ్' (ఉర్దూభాషా చరిత్ర), 'తజ్‌కిరా షొఅరాయె ఉర్దూ' (ఉర్దూ కవులచర్చ) అనే గ్రంథాలు ఉర్దూ సాహిత్యరంగంలో ఆయనకు కీర్తి గడించిపెట్టేయి. ఈ కాలం లోనే అంటే క్రీ. శ. 1882 వ సంవత్సరంలో, మౌల్వీ ముహమ్మద్ అబ్దుల్ బాసిత్ సాహెబ్ మహాశర్‌గారి పేరుతో నేను 'మహాశర్' అనే వారపత్రికను ప్రారంభించాను. ఎడిసన్ శైలిని ఉర్దూలో సుందరశీర్షికలతో, సముచిత పద జాలంతో, అమూల్యమైన వ్యాఖ్యలతో ఈ పత్రికను పాఠకులకు అందించాను. ఈ పత్రిక ఉర్దూపాఠకులలో సంచలనాన్ని కలిగించింది. దీనితోబాటు 'అవధ్ అఖ్ బార్' (అవధ్ పత్రిక) లో నా వ్యాసాలు ప్రచురితమవుతూండేవి. పాఠకుల జిజ్ఞా సను పెంపొందింపజేసే నా వ్యాసాలు పండితపామరులందరి మెప్పునీ పొందగలి గాయి. ఎందరో రచయితలు నేను రూపొందించినశైలినే వాడుకుంటూండడం, పాఠకమహాశయులందరు ఈ శైలిపై మోజు చూపుతూండడం నేను గుర్తించి సంతోషించాను. ఆ రోజులలోనే నేను 'షహీద్-ఏ-వఫా' నాటకాన్ని రచించి పాఠ కులకందచేశాను. ఈ నాటకం మనోహరమైనదిగా, శక్తివంతమైనదిగా అందరి ప్రశంసలనందుకొని నాకు మంచిప్రోత్సాహాన్నిచ్చింది. (చివరికి దేశప్రజలు పట్టు పట్టడంవల్ల క్రీ. శ. 1887 వ సంవత్సరం ప్రారంభంలో నేను 'దిల్ గుదాజ్' పత్రికను స్వంతంగా ప్రారంభించి నడపడం మొదలుపెట్టాను. ఆంగ్లవిద్యాభిమాను లకూ, పాతకాలపు పెద్దలకూకూడా ఈ పత్రిక సమానంగా రుచించింది. క్రీ. శ. 1886 వ సంవత్సరంనుంచీ పత్రికతోబాటు చరిత్రాత్మక నవలలను రచించ మొదలు పెట్టాను. వీటిలో 'మలికుల్-అజీజ్-వర్జినా' అనేది నా తొలినవల. నా నవలలకు దేశంలో ఎటువంటిస్వాగతం ఇవ్వబడిందీ వివరించడం అనవసరం. కాని ఈ నవలలవల్లనే, చరిత్రఘట్టాలను తెలుసుకోవాలనే జిజ్ఞాసనూ, పుస్తకాలు చదవా లనే అభిరుచినీ వృద్ధిపరచేందుకు తోడ్పడ్డాయనే సత్యాన్ని సవినయంగా మీదృష్టికి తేవడం అవసరమని భావిస్తున్నాను. ఈ నవలద్వారా దేశంలో 'చరిత్ర'ను చదివే అభిరుచీ బాహ్యప్రపంచాన్నిగురించి తెలుసుకోవాలనే అభిలాషా ఉద్భవించాయి. అంతేకాకుండా నా ఈ నవలలమీదనూ, దిల్‌గుదాజ్ పత్రికపుటలలోని శైలిమీదనూ

వర్తమాన ఉర్దూ సాహిత్యపు పునాది ఏర్పడింది. ఉర్దూ వచనసాహిత్యానికి, ప్రాచీన సాహిత్యశైలితో ఏర్పడిన సంబంధానికి పునాది లక్నోలోనే పడింది. అధునికశైలి ఢిల్లీలోనే ప్రారంభమైంది. ఈ ప్రయత్నంలో వీలయినంత ఎక్కువగా లక్నో ఢిల్లీకి సహకరించింది. ముఖ్యంగా హాస్యసంబంధమైన అభిరుచి లక్నోనుంచే ఉద్భవమైంది. లక్నోలోనే అది వికాసం పొందడంకూడా జరిగింది.

# 12

లక్నోలో ఉర్దూ భాషావికాసం కవుల, సాహితీపరుల, రచయితలవరకే సీమితమై వుండలేదు. వేరు వేరు సంస్థలలో, వర్గాలలో భాషావికాసంమూలంగా క్రొత్తక్రొత్త అభిరుచులకు దోహదమేర్పడి, మొత్తానికి అన్నివర్గాలవారికి వారివారి అభిరుచుల కనువైనసామగ్రి లభించింది.

వీటిలో అతి ప్రధానమైనవి 'కథలు' అని చెప్పవచ్చు. అసలు ఈ కథలు ఆశు కవిత్వంగా ప్రారంభమయ్యాయి. ఈ కళ నిజానికి అరబ్బులసొత్తే. ఇస్లామ్ మతా వతరణకుపూర్వమే అరేబియాదేశంలో కథలకు గోష్ఠులు ఏర్పాటవుతూండేవి. కాని భారతదేశం కథలకూ, అరేబియాలోని కథకులగోష్ఠులకూ ఏమైనా సంబంధం వుందో లేదో సరిగా తెలియదు. 'అమీర్ హమ్‌జా' కథకులకు ప్రేరణనిచ్చేగ్రంథం. నిజానికిది పార్సీభాషకి చెందినది. అక్బరు చక్రవర్తికాలంలో అమీర్ ఖుస్రో దీనిని రచించాడని అంటారు. కాని తుగ్లక్ వంశీయుల పరిపాలనకాలంలో 'దాస్తాన్-ఏ-అమీర్ హమ్‌జా' అనే కథాసంగ్రహం వుందనేవిషయాన్ని చరిత్ర రుజువుచేసింది. ఢిల్లీలోని ప్రఖ్యాతకథకులు లక్నో చేరుకోసాగారు. ఇక్కడ నల్లమందు భాయీలు ఆ కథకులను ఆహ్వానించి కథాగోష్ఠులను ఏర్పాటుచేశారు. లక్నోలోని ధనవంతు లందరూ తమతమగృహాలలో ఈ కథకులకు ఆశ్రయమిచ్చారు; ఉద్యోగాలిచ్చారు. కొద్దికాలంలోనే వందలకొద్ది క్రొత్తకథకులు బయలుదేరారు. అనాటికథకులకు భాషపై కథావస్తువుపై పూర్తి అధికారం వుండేది. అందుకే అనాటికథకుల కథా

కథనకౌశలానికి తగినప్రతిష్ఠ చేకూరింది. ఢిల్లీలో ఒకరిద్దరు ఉచ్చకోటికథకులు మిగిలివున్నప్పటికీ లక్నోలోని కథకులసంఖ్య అమితం. వీరిప్రభావం లక్నో నాగరికులభాషపై ఎంతో ఎక్కువగా ప్రతిబింబించింది. నవలాసాహిత్యంపట్ల పాఠకులకు మక్కువ ఏర్పడ్డాక కథకులభాషతోనే, కథలు వ్రాయించాలనే ప్రయత్నం ప్రారంభమైంది. అప్పుడు లక్నోనుంచే సమర్థులయిన కథకులనేకులు ముందు కొచ్చారు. వీరు అతి తేలికగా పెద్దపెద్ద కథాసంపుటాలురచించి ఉర్దూ పాఠకలోకానికి అందించారు. 'జాహ్', 'కమర్'గారి కథారచనలకు ప్రత్యేకఆదరం లభించింది. (రజ్మ (యుద్ధం), బజ్మ (నృత్యసంగీతాలు), హుస్న్-ఓ-ఇష్క్' (సౌందర్యారాధన, ప్రేమ), ఐయారీ (మాయాశక్తి) - ఈ నాలుగూ కథలో తప్పనిసరిగా వుండవలసిన లక్షణాలుగా నిశ్చయింపబడ్డాయి. ఈ నాలుగు లక్షణాలనూ చేర్చి కథకులు తమరచనలలో అద్భుతమైన ఆకర్షణను ప్రవేశపెట్టారు. వాటిని చదివితీరవలసిందేగాని వర్ణించడం అసంభవం. చక్కని పదజాలంతో వాతావరణాన్నీ, భావాలనూ చిత్రించడం, చిత్రణతో పాఠకులమనస్సులపై వింతప్రభావాన్ని కలిగించడం ఆ కథకుల ప్రత్యేకలక్షణం.)

(సాంఘికవినోదాల, పరిహాసాల, హాస్యాలతోకూడా లక్నోలో భాషాశైలి అనేక రూపాలను దాల్చగలిగింది. భాషాశైలిలోని వైవిధ్యంతో ఏ పట్టణం లక్నోతో పోటీ చేసేస్థితిలో వుండేదికాదు. ఇంక 'ఎత్తిపొడుపుల్ని' తీసుకొంటే దీనిలోనూ లక్నోకే అగ్రతాంబూలం లభిస్తుంది. 'ఎత్తిపొడుపులు' నిజం చెప్పాలంటే కావ్యాలలోని అలంకారాలకు సంబంధించినవి. ఎవరినైనా లేక దేనినైనా వికృతంగా చూపాలన్నా, లోపాలను బట్టబయలు చేయాలన్నా సమయానుకూలంగా ఏదో హాస్యాన్ని అందించాలన్నా కవులు ఉపమాలంకారాన్ని వాడడం ఉచితమే: కాని లక్నోలోని నిమ్నవర్గంలోని యువకులు, బజారువేశ్యలు, విద్యావిహీనులైన చిన్నచిన్న వ్యాపారస్థులు, చేతిపనులుచేసే వ్యక్తులు, కూలీలుసహితం 'ఎత్తిపొడుపుల్ని' అద్భుతంగా ప్రయోగించేసామర్థ్యం కలిగివుండడాన్ని చూసి బయటవాళ్లు విస్తుపోతూండేవారు.

ఒక పెద్దమనిషి కర్బలా (ఇరాక్‌లో హజ్‌రత్ ఇమామ్ హుసైన్ వీరస్వర్గమలంకరించినచోట కట్టబడిన సమాధి) దర్శనం చేసుకొని భారతదేశం తిరిగివచ్చాడు. ఆయన తెల్లటి వస్త్రాలుధరించి స్నేహితులమధ్యకూర్చుని కబుర్లు చెబుతున్నసమ

యంలో ఒక అందమైనయువకుడువచ్చి 'అరే, ఈ ముసలికొంగ ఎక్కడ్నుంచి ఊడిపడింది?' అని అడిగాడు.

ఒక ముసలి వరుడు తన తెల్లవెంట్రుకలకు నల్లరంగువేసుకొని పెళ్ళివారింటికి బ్రహ్మాండమైన ఊరేగింపుతో వచ్చాడు. వరండాదగ్గర చెప్పులు విప్పుకొనేందుకు వంగి మోకాళ్ళమీద నడవసాగాడు. 'పెళ్ళికొడుకేడీ?' అని ఎవరో అడిగారు. చంచలస్వభావురాలైన వేశ్య చటుక్కున 'కనబడ్డంలేదూ: మ్యాం మ్యాం అనుకుంటూ వస్తుంటే!' అంది. పాతబజారులో పెద్దపెద్ద చెరుకుముక్కల్ని తన ముందు పెట్టుకొని 'గాలి పటా లెవరిక్కి కావాలోయ్, తియ్యతియ్యని గాలిపటాలు, రంగురంగూల గాలిపటాలు, రసాన్నిచ్చే గాలిపటాలు, దోచుకోండి బాబు దోచుకోండి' అంటూ అమ్మసాగాడు ఒకతను. ఇంతకుమించిన వినోద సల్లాపాలు ఇంకేముంటాయి? వెక్కిరింపుతోకూడిన ఉక్తి వైచిత్రి ప్రదర్శించడం ఒక అలంకారం.

చెరుకుముక్కలపేరు ఎత్తకుండా, కొనడం అమ్మడం అనేమాటలు రాకుండా గాలిపటాలను దోచుకోండి అంటూ అమ్మకాన్ని కొనసాగించడం ఇందుకో చక్కని ఉదాహరణ. ఇంతకుమించిన ఉక్తివైచిత్రి బజారుమనుష్యులలో ఎలా వుండగలుగుతుంది? ఇటువంటివే వందలు వేలు ఉదాహరణలు ఇక్కడ ప్రతినిమిషం వినిపిస్తూండేవి.

రెండోది జిలా (అసలు అర్థంతోపాటు వ్యంగ్యార్థంవచ్చే రెండర్థాల కవిత) ఇది నిజానికి కావ్యాలంకారం. ఈ అలంకారం సంభాషణలలోను, వేళాకోళాలలోను మంచిరక్తి కట్టిస్తుంది. మంచి అర్థం వచ్చేలా, ఒకవిషయంచెబుతూ దానినే వ్యంగ్యదృష్టితో చూసినప్పుడు వక్రార్థం వచ్చేలా పదప్రయోగాన్నిచేసే శక్తిగలవారే ఈ 'జిలా' జోలికి వెళుతూవుండేవారు. జిలాలు వ్రాయడంలో 'ఆజాద్ ఫకీర్' సిద్ధహస్తుడు. 'అమానత్'కూడా తన కవిత్వాన్ని అలంకారాలప్రయోగంతో ముంచెత్తేశాడు. కాని ఈ ప్రయత్నం మిగతాకావ్యగుణాలను అణగదొక్కేసింది. ఫలితంగా ఆయనరచనలు కవిత్వం అనిపించుకోక, కేవలం 'జిలా' మాత్రమనిపించుకున్నాయి. కాని లక్నోపాఠకులకు ఈ 'జిలా'లే బాగా రుచించినట్లు కనిపిస్తుంది. అనేకులు రీతిరివాజులకు భిన్నమైన తమ కవితాగోష్ఠులలో ఈ 'జిలా' కళను ఎంతో వృద్ధిచేసి 'అమానత్' కవితలను మరిపించగలిగారు. ఏ ప్రాంతంవారైనాసరే 'జిలా'

కవిత్వంలో లక్నోవారిని మించలేరనేవిషయం సత్యదూరంకాదు. ఈ కళనుగురించిన గ్రంథంకూడా ప్రచురించబడింది.

మూడోశైలి తుక్‌బందీ (అంత్యానుప్రాసలతోకూడిన కవిత) ఎంతోమంది నిరక్షరాస్యులుసైతం 'ప్రశ్నలు-జవాబులు' రూపంలో ఈ 'తుక్‌బందీ'ని ఆశువుగా చెబుతూ వుండేవారు. అదివిని పెద్దపెద్దకవులు సహితం ఆశ్చర్యచకితులౌతూండేవారు. నేను విద్యార్థిదశలో (సన్న పీచుమిఠాయి)ని విక్రయించే హిందూయువకుణ్ణి రోజూ ఉదయంపూట తట్ట నెత్తిమీద పెట్టుకొని తీసుకువెళ్తూండడం చూచేవాణ్ణి. అతణ్ణి చూసీ చూడ్డంతో ఊళ్లో కుర్రాళ్ళు అతడిచుట్టూ మూగిపోతూండేవారు. అందువల్ల త్రోవలోనే తట్ట దింపుకుని కూర్చుండిపోతూండేవాడు. వెంటనే కుర్రాళ్ళకూ అతడికీ తుక్‌బందీపోటీ ప్రారంభమయ్యేది. ఊళ్లో కుర్రసజ్జంతా ఒకవైపు. ఈ కుర్రాడొక్కడూ ఒకవైపు. ఈ రెండుపక్షాలమధ్యా తిట్లవర్షం కురుస్తూండేవి. కాని అవి మామూలు తిట్లుకావు; 'తుక్‌బందీ'కి లోబడిన సరసకవిత్వపు తిట్లు. నేనీ తమాషాను అనేకసార్లు చూశాను. ఈ తిట్లకవిత్వం గంటలతరబడి సాగిపోతూండేది. కాని ఆ హిందూకుర్రాడు ఎప్పుడూ ఓడిపోయేవాడు కాదు. ఆఖరికి అలసిపోయి ఊళ్లోకుర్రాళ్ళు తోక ముడిచేస్తూండేవాళ్లు.

ఈవిధంగా లక్నోలో వేళాకోళాలు, వెక్కిరింతలసంభాషణలు వింతగావుండేవి. ఈ నిరక్షరకుక్షులు అప్పుడప్పుడు అద్భుతమైనభావాలను వెలిబుచ్చుతూండేవాళ్ళు. వాటిని విని పెద్దపెద్దకవులు, పేరుమోసిన పండితులు విస్తుపోతూండేవారు. ఆకాలం నిజం చెప్పాలంటే లక్నోకు స్వర్ణయుగం. కవిత్వం, సాహిత్యం, పఠనాసక్తి ప్రజల నరనరాల్లో జీర్ణించిపోయాయి. కొద్దిగా చదువుకొన్న ప్రతివాడూ కవిత చదివేవాడు, కవిత చెప్పేవాడు. నిరక్షరాస్యులలో, కిందివర్గంవాళ్లలో ఇంట్లో కూర్చునేఆడవాళ్లలో సహితం సాహిత్యపిపాస, రమణీయభావాలు అంకురించాయి. పాతవస్తువులమ్మే చదువురానివాళ్ళుకూడా కవులుగా రూపొందారు. నిరక్షరాస్యుల సంభాషణలుకూడా స్వచ్ఛంగా, శుభ్రంగా శిష్టశబ్దాలతో పెద్దమనిషితరహాగా వుండేవి. వాళ్ళను ఎరిగివున్న కవులు పండితులు వారిసంభాషణలను విని చకితులౌతూండేవారు. వాళ్లు చదువురానివారని ఇతరులు గుర్తించగలగడం అసంభవం. (కిందితరగతిప్రజలుకూడా తమ అభిరుచికి అనువైన సాహిత్యసృష్టి చేయసాగారు. ఉదా

హారణగా 'ఖయాల్' (అభిప్రాయ) శైలి ఉత్పన్నమైంది. వాళ్లు అట్టే ఆలోచించ కుండా పద్యాలువ్రాసి తమ మిత్రబృందాలలో పాడ్తూండేవాళ్లు. ప్రతివ్యక్తి తన కల్పనాశక్తితో ఏదో ఒక అభిప్రాయాన్ని తన కవితలలో ప్రదర్శిస్తూండడం వల్లనే ఈ శైలికి ఖయాల్ (అభిప్రాయ) శైలి అనేపేరు వచ్చింది. ఈ కళ లోతు పాతులు తెలిసినవారు చాలామంది ఉండేవారు. వీరికి ప్రముఖకవుల గోష్ఠులకూ ఏం సంబంధం వుండేదికాదు. ఇస్లామ్ పూర్వపు అరబ్బీకవిత్వంలా వీరికవిత్వం సహజంగా, స్వభావసిద్ధంగా భాసించిందని ఒప్పుకోవలసివుంటుంది.

ఇదేవిధంగా మరోబృందం 'డండేవాలే' (కోలాటం వాళ్లది) ఉత్పన్నమైంది. గతకాలంనాటి ప్రసిద్ధగాథలను చమత్కారపూర్వకంగా కవితాబద్ధంచేయడం వీళ్ళ ప్రత్యేకత. ఎంతటి ధనవంతులనైనా, ఎంతటి వీరులనైనా, వాళ్లను ఉన్నదున్నట్లు (అంటే వారిమూలంగా దేశానికీ) సంఘానికీ ఏ యే లాభాలు కలిగాయో, ఏ యే నష్టాలు కష్టాలు వాటిల్లాయో నిర్భయంగా కవితలలో చిత్రించేవారు. ఈ కవితలను 'షేర్లు' చదివే ప్రత్యేకపద్ధతిలో కోలాటంవేస్తూ పాడుతూ వుండేవారు.

స్త్రీలభాష పురుషులభాషకంటే ప్రతిజాతిలోను, ప్రతిదేశంలోనూ ఎక్కువ విశిష్టంగాను, ఆకర్షణీయంగాను వుంటుంది. పెద్దపెద్ద ప్రాసాదాలలోని, అంతః పురాలలోని, గొప్ప కుటుంబాలలోని విదుషీమణులు భాషలో స్త్రీ సంబంధమయిన ఆకర్షణలతోబాటు సాహిత్యక సౌకుమార్యంకూడా తొణికిసలాడుతూవుండడం లక్నో ప్రత్యేకత. ఆ కోమలాంగులు మాట్లాడితే పుష్పాలు వెదజల్లినట్లుండేది. వారిసంభాషణలలో వ్యంగ్యంచూస్తే లక్నో విదుషీమణుల భాష ఎంత చక్కగా అభివృద్ధి చెందిందో స్పష్టమవుతుంది.

# 13

అరబ్బీకవితలు అల్లే గొప్పగొప్పవిద్వాంసులు లక్నోలో పుట్టినప్పటికీ, గొప్పగొప్ప మతప్రవర్తకులు, నాయకులుమాత్రమే అరబ్బీ నేర్చుకొంటూండేవారు. సాధారణ జనుల అధ్యయనానికి ఈ భాష అందుబాటులో వుండేదికాదు. హిందూదేశపు రాజ

కీయభాష పార్సీ. ఉద్యోగాలు పొందేందుకు కవితాగోష్ఠులలోనూ, సభలు, సమావేశాలలోనూ పాల్గొనేందుకు, ప్రతిష్ఠ నార్జించుకొనేందుకు లక్నోవాసులకు ఆనాడు పార్సీవిద్యే సరిపోతూండేది. అయోధ్యలోనేకాదు, భారతదేశమంతటిలోనూ సాహిత్య సాంస్కృతిక పురోభివృద్ధికి పార్సీయే ఏకైక సాధనమని భావించబడుతూ వుండేది. మహమ్మదీయులమాట అటుంచి ప్రతిభావంతులైన హిందువుల మొగ్గు కూడా పార్సీ సాహిత్యరంగంవైపే అమితంగా వుండేది. ఉన్నతశ్రేణికిచెందిన చాలా మంచిమంచి వ్యాసాలు హిందూ రచయితల లేఖినులనుంచే వెలువడ్డాయి. టేక్‌చంద్ 'బహార్', 'బహార్-ఏ-అజమ్' అనే సాటిలేని మేటి ఉద్గ్రంథాన్ని రచించాడు. అది నిస్సందేహంగా పార్సీభాషా శబ్దకోశమని చెప్పవచ్చు. ఆ గ్రంథంలో ప్రతిసామెతకు ప్రామాణికంగా, ప్రఖ్యాతకవుల కవితల్లో వానిని ఎక్కడెక్కడ ఎలా ఉపయోగించిందీ ఉదహరిస్తూ పొందుపరిచాడు. లక్నోలో ప్రారంభదశలో ముల్లా 'ఫాయక్', ఆ తరువాత మీర్జా 'కతీల్'గారి పేర్లు ఖ్యాతివహించేయి. మీర్జా 'కతీల్' అవిరళకృషిసల్పి గొప్పపండితుడుగా రూపొందగలిగాడు. ఆయన కొత్తగా ముస్లిం మతం పుచ్చుకొన్న పార్సీ పండితుడు. ఆయన వేళాకోళంగా 'బూ. ఏ కబాబ్ మరా ముసల్మాన్ కర్ద్' (కబాబ్ సువాసన నన్ను ముసల్మాన్‌గా మార్చింది) అంటూండేవాడు. కాని నిజం చెప్పాలంటే పార్సీవిద్య, పార్సీపై మోజు, పార్సీలో పాండిత్యాన్ని సిద్ధింపచేసుకొనే కోర్కె ఆయనను ముసల్మాన్‌గా మార్చాయి. ఆయన ఈ మోజుతోనే ఈరాన్‌దేశాన్ని సందర్శించాడు. శిరాజ్, ఇస్ఫహాన్, టెహరాన్, అజర్‌బైజాన్ పట్టణాలను పర్యటించాడు. పార్సీ మాతృభాషగా కల వారు సహితం ఆయన పార్సీభాషాజ్ఞానాన్నిచూచి ఈర్ష్యపడేంత,లేక ఆశ్చర్యపడేంత గొప్ప పాండిత్యాన్ని ఆయన పుణికి పుచ్చుకోగలిగాడు.

మీర్జా గాలిబ్ మాటిమాటికీ 'కతీల్'ను ఎదుర్కొంటూండేవాడు. నిస్సందేహంగా మీర్జా గాలిబ్‌గారి పార్సీ భాషాజ్ఞానం ఉన్నతమైనదే. 'ఏ భాషపైనైనా అధికారంపొందాలంటే అది వారి మాతృభాష అయివుండడం తప్పనిసరి. ఎడతెరిపిలేకుండా ఎంతో సాధనచేసి పరాయిభాషలో పాండిత్యాన్ని సంపాదించుకోగలిగినా ఆ పండితునికి పరాయిభాషపై అధికారం లభించదు. అట్టి పండితులవాదం ప్రామాణికం కాజాలదు.' ఈ సిద్ధాంతాన్ని మీర్జా గాలిబ్ మాటిమాటికీ పునశ్చరణ

వేస్తూండేవాడు. అయోధ్యనుంచి బంగాళాప్రాంతంవరకూ 'కతీల్' అభిమానులు వుంటూండడంవల్ల గాలిబ్‌గారి సిద్ధాంతానికి విలువేం లేకపోయింది. అందువల్ల క్రోధావేశంతో కాలిబ్—

'పై జే అజ్ సోహబత్-ఏ-కతీలమ్ నీ స్త్
రశ్క్ బర్ శోహరత్-ఏ-కతీలమ్ నీ స్త్'
మగర్ ఆనా కి ఫారసీ దానంద్
హమ్ బరీం అహద్-ఓ-రాఏ-పై మానంద్
కి జఅహల్-ఏ-జబాం న బూద్ కతీల్
హర్‌గిజ్-అజ్ ఇస్పహాం న బూద్ కతీల్
లాజరమ్ ఏతిమాద్ రా న సజద్
గుఫ్తా అశ్ ఇన్తనాద్ రా న సజద్
కి జబాన్ ఖాన్ అహల్-ఏ-ఈరాన్ అస్త్
ముశ్కిల్-ఏ-మా-ఓ-సహల్-ఏ-ఈరాన్ అస్త్
సుఖ్ నస్త్ అశ్‌కార్-ఓ-పిన్హాం నీ స్త్
దేహలీ-ఓ-లఖ్‌నఊ జ-ఈరాం నీ స్త్.'

అనేపద్యం రచించాడు. ఈ పద్యానికి అర్థం ఏమనగా—

['కతీల్'తో నాకు సాంగత్యం కలుగలేదు. ఆయనవల్ల లాభం పొందే అవకాశం కాని నాకు లభించలేదు. ఆయనకీర్తిని విని నేను ఈర్ష్యపడలేదు. పార్సీ మాతృభాషగాగల పార్సీ పండితులపట్ల నాకు ద్వేషం, ఈర్ష్య కలుగవచ్చు. కతీల్ మాతృభాష పార్సీకాదు, ఆయన ఇస్‌ఫహానీ నివాసికూడా కాదు. ఇందువల్ల ఆయన కావ్యం ప్రామాణికమైనదిగా, విశ్వసనీయమైనదిగా అంగీకరించబడకూడదు. పార్సీ ఈరానీలభాష. అది మనకు కఠినమైౖ వారికి సరళమైవుండడం సహజం. ఢిల్లీ, లక్నో, ఈరానీపట్టణాలు కావు. అందువల్ల కతీల్‌గారి కవిత్వంలో ప్రత్యక్షంగా కాని పరోక్షంగాకాని చెప్పుకోతగ్గ విశేషమేదీ నాకు కనిపించలేదు.]

గాలిబ్‌గారి ఈ కవిత విని పార్సీ జ్ఞానార్జనకోసం కతీల్ చేసినప్రయత్నాలు, పార్సీలో పాండిత్యం సంపాదించడానికి ఆయన చేసిన అవిరళకృషి పూర్తిగా వ్యర్థమైపోతుందని ఎవరైనా అనుకొంటే అది పొరపాటు. పార్సీ మాతృ

భాషగాగల విద్వాంసులు ఒప్పుకోనంతవరకూ తన పాండిత్యాన్ని అంగీకరించ కూడదనే ఆలోచన కతీల్ మనస్సులోకి వచ్చివుండదని భావించడం సముచితం. అయితే గాలిబ్‌గారి సిద్ధాంతం ఒక్క 'కతీల్'కుమాత్రమే అన్వయించదు. గాలిబ్ గారికి, మిగతా భారతదేశంలో జన్మించిన పార్సీ కవులందరికీకూడా అన్వయిస్తుంది. ఈరానీల అభిప్రాయాన్ని అడగకుండా గాలిబ్‌కూడా పార్సీ లోకోక్తులను వాడేందుకు ఆయన ఈ సిద్ధాంతంప్రకారం వీలుండదన్నమాట. పార్సీ కావ్యాలను క్షుణ్ణంగా అధ్యయనంచేసి వుండడంవల్లను, ప్రతి పార్సీశబ్దపు సముచితప్రయోగం ఎక్కడెక్కడ ఏవిధంగా జరిగిందో తెలుసుకోగలగడంవల్లనూ పార్సీ సాహిత్యక్షేత్రంలో భారతీయులైన పార్సీ విద్వాంసులకు ఉన్నతస్థానం లభించింది. ఈదృష్టితోచూస్తే 'కతీల్' గాలిబ్‌నీ మించిపోయాడని నిక్కచ్చిగా చెప్పవచ్చు. గాలిబ్ జీవితమంతా భారతదేశంలోనే గడిచింది. అంతేకాక ఉదరపోషణార్థం ఆయన పరిశ్రమించ వలసినస్థితి ఏర్పడింది. కాని 'కతీల్' సిరి సంపదలతో, సుఖ సంతోషాలతో జీవితాన్ని గడిపాడు. ఈరాన్‌లో చాలాకాలంవుండి అక్కడివాళ్లనూ, ఆచారవ్యవహారాలనూ, భాషాసంప్రదాయాలనూ, కవితారీతులనూ పరికించి వచ్చాడు.

ఏది ఏమైతేనేం, లక్నోలో పార్సీ పరిజ్ఞానానికి 'కతీల్' ప్రారంభోత్సవం చేశాడు. ఆయనకు కొద్దిగా ముందు ముల్లా ఫాయక్ ఆగ్రా ప్రాంతంనుంచివచ్చి లక్నోకు సమీపగ్రామంలోవుంటూ పార్సీభాషలో కొన్ని గద్య పద్య గ్రంథాలు రచించాడు. పార్సీవాళ్ళు, పార్సీ విద్వాంసులైన భారతీయులు కతీల్‌కు ముందు తరాలలోకూడా భారతదేశంలో ఉన్నమాట వాస్తవమే. కాని పార్సీ పరిజ్ఞానంతోబాటు, ఆ భాషానియమాలు, దాని వ్యాకరణం తయారుచేయాలనే అభిలాష లక్నోనివాసి 'కతీల్'లోనే ఓంప్రథమంగా ఏర్పడింది. ఆయన తన ధన సంపదనీ, మంచి మనస్సునీ, మేధాశక్తినీ అమూల్యసమయాన్నీ వెచ్చించి ఆ అభిలాషను పూర్తి చేసుకోవడంద్వారా పార్సీసాహిత్యానికి ఎనలేని సేవచేశాడు. ఆయన రచనలన్నీ సాటి లేని మేటి గ్రంథరాజాలు.

అనంతరం పార్సీవిద్య జనసామాన్యానికికూడా అందించేందుకు కృషిజరిగింది. అయితే దాని పాఠ్యక్రమం కఠినాతికఠినంగా రూపొందించబడింది. పార్సీని మాతృభాషగా నేర్చుకొనే ఈరానీలుకూడా యీ పాఠ్యక్రమాన్నిచూసి హడలెత్తిపోయారు.

వరళమైనభాషలో సూటిగా చెబితేనే విద్యార్థులకు విద్య అబ్బుతుంది. ఈ విష యాన్ని అన్నిదేశాలు పాటించినట్టే ఈరాన్‌దేశంకూడా పాటిస్తూవచ్చింది. కాని భారతదేశంలో ఆనాటి పార్సీ పాఠ్యక్రమంలో 'ఉర్ఫీ', 'ఫైజీ', 'నేమత్‌ఖాన్-ఏ-అలీ' లవంటి దిట్టమైన కవుల కావ్యాలను చేర్చడం జరిగింది. ముల్లా తుగరా, పంజ్‌రుక్కా రచయితల కొరకబడని కఠినకవితలను చదవడం, చదివించడం ఆపాఠ్యక్రమ ధ్యేయమైంది. 'భారతదేశం పార్సీభాషాజ్ఞానం ఈరాన్‌ను మించి పోయింది' అని చెప్పుకోవడానికి బహుశః ఇలాంటి పాఠ్యప్రణాళికను రూపొం దించడం జరిగివుంటుంది. పార్సీ పాఠ్యపుస్తకాలన్నిటికీ చక్కని టీకా తాత్పర్యాలు వ్రాయబడ్డాయి. వీటిని భారతీయులే, ముఖ్యంగా లక్నోలోని పార్సీపండితులు తయారుచేశారు. ఇటువంటి పనులవల్లనే గాలిబ్ సిద్ధాంతానికి విలువ హెచ్చింది.

ముఖ్యంగా గతశతాబ్దంలో విద్యాభ్యాసంవిషయంలోను ఇతరరంగాలలో ప్రగతి విషయంలోనూ లక్నో చాలా ఖ్యాతినొందింది. అక్కడి పిల్లలుసహితం పార్సీ మాట్లాడుతూవుండేవాళ్ళు. ఆ రోజుల్లో పార్సీకవులు ఈరాన్‌లోకంటే ఎక్కువ సంఖ్యలోకాకపోయినా సమసంఖ్యలోనే భారతదేశంలో ఉద్భవించారు. చదువురాని వేశ్యలు, కూలీనాలీ జనాలనోళ్ళలో పార్సీ శృంగారకవితలు (గజలు) దొర్లిపోతూం డేవి. విదూషకులు సహితం పార్సీ వేషభాషలను తమ స్వంతం చేసుకొంటూండే వాళ్లు. అయోధ్యరాజ్యంలోని పెద్దమనుష్యులు తమ ముఖ్యజీవికగా, పార్సీ అధ్యాప కత్వాన్నే వరించుకున్నారు. ఇటువంటి గ్రామీణ పార్సీ అధ్యాపకులు లక్నోలో కోకొల్లలుగా వుండేవారు. వీరి భాషాపాటవాన్నిచూసి ఈరానీలుకూడా ఆశ్చర్యచకితు లవుతూండేవారు. వీరి మాటపొందిక ఈరానీల వాడుకభాషతో సరిసమంగా తూగ లేకపోయినప్పటికీ పార్సీ లోకోక్తులనూ, సామెతలనూ, శబ్దప్రయోగాలనూచూసి సాధారణ ఈరానీ పార్సీవిద్వాంసులు విస్తుపోతూండేవారు.

లక్నో ఉర్దూభాషనుచూస్తే అక్కడికవులకు, పాఠకులకూ పార్సీభాషపట్ల ఎంత ఎక్కువ వ్యామోహంవుండేదో తేలికగా అవగాహనమవుతుంది. నిరక్షరాస్యుల, స్త్రీల సంభాషణలలోకూడా పార్సీ సంధులు, శబ్దవిన్యాసాలు, కారకాలు నిండి వుంటాయి. లక్నోభాషలో పార్సీప్రభావం హద్దుమీరివుందనేమాట తప్పించి లక్నో ఉర్దూలో మరేలోటూ చూపించేందుకు వీలుండదు. కాని ఆ పార్సీప్రభావం వుండడం

వల్లనే లక్నో ఉర్దూభాషకు ఇంకెక్కడాలేని సోయగం, లక్నోప్రజలకు మంచి నాగరికత సమకూరినవి. ఢిల్లీభాషనుగురించి చెప్పుకోవలసివచ్చినా కొంచె మించు మించు ఇలాగే చెప్పవలసివుంటుంది. అయితే ఢిల్లీభాష లక్నోభాషలా అతివేగంగా కాక క్రమంగా పార్సీ ప్రభావానికి లోనైంది.

ముసల్మానులేకాదు, హిందువులుకూడా పార్సీభాషలో ప్రావీణ్యం సంపాదించే వారు. హిందువులకు మొగలాయీసామ్రాజ్య ప్రారంభదశనుంచిమాత్రమే పార్సీపై మోజు కలిగింది. ఆకాలంకూడా లక్నో చుట్టుపక్క వుండేంతమంది ప్రఖ్యాత పార్సీ విద్వాంసులైన హిందువులు మరెక్కడా వుండేవారుకాదు. కాయస్థులు, కాశ్మీరీలు తమతమ మాతృభాషలలో పాండిత్యాన్ని గడించడంతోపాటు పార్సీభాష నేర్చు కోవడం ఒక అనివార్యవిషయంగా భావిస్తూండేవారు. కాశ్మీర్‌పండితులు ఉర్దూనే తమ మాతృభాషగా మలచుకొనేటంతగా పురోగమించారు. వారికీ ముసల్మానులకూ పార్సీ జ్ఞానోపార్జనవిషయంలో ఏ తేడా కనిపించేదికాదు. కాయస్థులు ఉత్తరభార తీయులు కావడంవల్ల వారి మాతృభాష ఖడీబోలీ వర్తమాన హిందీ వాడుకభాషగానే స్థిరపడిపోయింది. అయినప్పటికీ వాళ్ళు ఎన్నెన్నో లోకోక్తులతోనూ, సామెతల తోను పార్సీభాష మాట్లాడుతుండేవారు. ఇంతప్రగతిని మరే హిందువులు సాధించ లేకపోయారు. ఈనాటి ఆంగ్లభాషావ్యామోహపరులు ఆంగ్లశబ్దాలను వాడేలాగ ఆనాడు కాయస్థులు అవసరమున్నా లేకపోయినా పార్సీశబ్దాలను తమ సంభాషణల లోకి చొప్పించి, సభలలో, బజార్లలో, స్నేహితులతో ఆఖరికి భార్యాబిడ్డలతోకూడా మాట్లాడుతూవుండేవాళ్ళు. మిగతా కులాలవాళ్లు వాళ్ళను ఆక్షేపిస్తూండేవాళ్లు. కాని నిజం చెప్పాలంటే ఆక్షేపించడానికిబదులు, పరాయిభాషలో ప్రావీణ్యాన్ని సంపా దించుకొనేందుకు చేసే సాధననుగుర్తించి ప్రశంసించి వుండవలసింది.

లక్నోలో ఆ రోజుల్లో వందలకొద్దీ పార్సీపండితులు, కవులు వుండేవారు. ఉర్దూ కవి సమ్మేళనాలలాగే పార్సీ కవిసమ్మేళనాలు తరచు జరుగుతూండేవి. 'పార్సీ' పెద్దలభాషగానేకాక సాధారణప్రజలభాష అయిపోయింది. పార్సీ ఆస్థానభాష కాక పోయినప్పటికీ, ఉర్దూకే సింహాసనం దక్కినప్పటికీ ప్రజాబాహుళ్యంలో పార్సీయే చెలామణీ అవుతూండేది. పార్సీ, పాఠశాలలనుంచి పారద్రోలబడినా, జీవనోపాధికి ఇంక దాని అవసరం తీరిపోయినా, సభ్యసమాజంలో కూర్చోవడానికి, నాగరికులమధ్య

మసలుకోవడానికి పార్సీ భాషాభ్యసనం అత్యవసరమని అందరూ భావిస్తూండేవాళ్లు. పెద్దమనిషితరహాగా జీవించాలంటే పార్సీ నేర్చుకుతీరాలని అభిప్రాయపడుతూ వుండేవాళ్లు. ఒకానొకప్పుడు 'ఫ్రెంచి' బ్రిటిష్‌దీవుల రాజభాషగా అలరారింది. కొన్నిశతాబ్దాలక్రితం 'ఫ్రెంచి'ని ఆంగ్లప్రభుత్వం రాజభాషస్థానంనుంచి తొలగించివేసింది. అయితే ఇప్పటికీ ఇంగ్లాండ్‌లో సాంస్కృతిక కార్యకలాపాలు ఫ్రెంచి భాషలోనే జరుగుతూంటాయి; ఆచారవ్యవహారాలలోను, రీతి రివాజులలోను, సుఖ దుఃఖాలలోనూ ఆంగ్లేయులపై ఫ్రెంచిభాష ఇంకా రాజ్యం చేస్తూనేవుంది. ఆంగ్ల యువతులు ఫ్రెంచిభాషను నేర్చుకోకపోతే ఆధునిక మహిళలుగా తాము పరిగణింపబడమేమోనని భయపడుతూంటారు. లక్నోదీ ఇదే స్థితి. పార్సీ, ఆస్థానంలోంచి మాయమైంది. ఉత్తరప్రత్యుత్తరాలలోంచికూడా వైదొలగింది. కాని సమాజంలోని అన్నిక్షేత్రాలపై దాని ఆధిపత్యం ఇప్పటికీ చెక్కుచెదరకుండా వుంది.

దురదృష్టవంతుడైన ఆఖరి అయోధ్య రాజువెంట మటియా బుర్జ్ (కలకత్తా)వెళ్ళిన వారిలో విద్యావంతులందరూ పార్సీ నేర్చుకొన్నవారే! అక్కడ అధికారభాష పార్సీయే. ఆయన ఛత్రచ్ఛాయలో ఎందరో హిందూ ముసల్మాన్ పార్సీకవులు వుండేవారు. స్త్రీలుకూడా పార్సీలో కవిత్వం చెప్పేవారు. అక్కడి చిన్నచిన్న పిల్లలుకూడా తమ అభిప్రాయాలను పార్సీలోనే వ్యక్తపరుస్తూండేవాళ్లు.

కాని ప్రస్తుతకాలంలో లక్నోలో పార్సీ విద్యాభ్యాసం చాలా తగ్గిపోయింది. హిందువులు ఈభాషను పూర్తిగా వదిలేశారు. ఈభాష కాయస్థులవరకే పరిమితమైంది. పార్సీ నేర్చుకున్నందుకు కాయస్థులను వేళాకోళం చేసేవారు. విదూషకులు పార్సీ కలగలిసినభాషను అనుకరించేవారు. అయితే వయస్సుమళ్ళిన పెద్దలలో, ముఖ్యంగా ముసల్మాన్‌పెద్దలలో ఈ పార్సీ అభిమానం ఇంకా నశించలేదు. వాళ్ల ఉర్దూ పాండిత్యానికి పార్సీభాషాజ్ఞానం చాలావరకు ఉపయోగపడడమే బహుశః ఇందుకు కారణమైవుండవచ్చు. ముసల్మానులలో భారతదేశమంతటా ఖ్యాతిపొందిన పార్సీపరిశోధకుడు ఖ్వాజా అజీజ్ ఉద్దీన్ సాహబ్ ఆనాటి పార్సీ కవితాగోష్ఠులను గుర్తుకుతెచ్చేందుకు ఇంకా సజీవుడై వున్నాడు. అంతేకాదు, హిందువులలోకూడా, కాలం మారిపోయినప్పటికీ భూమ్యాకాశాలు మారినప్పటికీ, వాతావరణం పూర్తిగా మారినప్పటికీ తానేమాత్రం మారకుండా సందేలా మహారాజా 'దుర్గాప్రసాద్'వంటి

పార్సీభాషాకోవిదులైన పెద్దలెందరో వున్నారు. పార్సీపరిజ్ఞానాన్ని ప్రశంపించి ప్రశంసలుపొందడానికీ, గతచరిత్రలో పురుగుతిన్న పుటలాగా ముద్దుపెట్టుకోడానికీ, కళ్ల కద్దుకోవడానికీ ఆయన ఇంకా మిగిలివున్నారు.

# 14

అరవై నాలుగుకళలలో లేఖనం (అందంగా వ్రాయడం) ఒక కళ. ముసల్మానుల ప్రాచీన లిపి అరబ్బీ. దాన్నే 'నస్ఖ్' అంటారు. బాగ్దాద్ 'ఖిలాఫత్ ఆందోళన'నుంచి మధ్యయుగంవరకూ ఇస్లామీప్రపంచంలో తూర్పునుంచి పడమరవరకూ ఇదే లిపి వ్యాప్తిలో వుండేది. హీరా (దక్షిణ అరేబియాలోని ఒక జిల్లా) ప్రాచీన లిపినుంచి కూఫీలిపి, కూఫీ లిపినుంచి నస్ఖ్‌లిపి ఉద్భవించాయి. బాగ్దాద్‌లో వికసించిన సర్వ విద్యలు, సర్వకళలు 'తాహిరియా' వంశీయులకాలంనుంచీ ఈరాన్, ఖురాసాన్‌ల వైపు రా సాగేయి. వేల్‌మియా, సల్‌జూకియా (ఈరాన్‌ను పాలించిన రెండు రాజ వంశాలు)లకాలంలో బాగ్దాదులోని ఎన్నోకళలు ఈరాన్‌లో విలసిల్లాయి. ముఖ్యంగా వేల్‌మియాల కృషివల్ల ఈరాన్, ఈరాక్, అరబ్ ఈరాక్‌లమధ్యనుండే 'అజర్ బైజాన్' ప్రకృతిసిద్ధంగా, సుభిక్షంగా రూపొందింది. (ఈ ప్రాంతంలోనే తొలి సారిగా 'లిపి'కూడా నవీనరూపాన్ని ధరించింది. లిపి 'లేఖన' పరిధిని దాటి నగిషీ క్షేత్రంలోకి ప్రవేశించింది. ఇందులో చిత్రకళను ప్రవేశపెట్టిన సున్నితమైన భావాలు గల ఈరానీలకు, అరబ్బీ లిపిలోని పాత సాదాతనం వికారంగావున్నట్లు కనిపించింది. పాతగీతలు వాటంతట అవే చెరిగిపోసాగాయి. 'నస్ఖ్'లో అక్షరాల, శబ్దాల పొందిక మొదటినుంచి చివరిదాకా ఒకేరకంగా వుండేవి. అక్షరాలలో ఒంపులతో బాటు అనుచితమయిన అసమానత వుండేది. అంచులు గుండ్రంగా వుండేవికావు, క్రిందికి అణగి చప్పిడఆకారంలో వుండేవి. ఇటూ అటూ కోణాలు వుండేవి. అందువల్ల నగిషీపనిని లేఖనంలో విలీనంచేసి దస్తూరిలో సొగసుని ఉద్భవింపచేయడం మొదలుపెట్టారు. అక్షరాలఅంచుల్ని అందంగా, గుండ్రంగా రూపొందించారు. ఈ

ఆధునికపద్ధతిని/వేలమ్ నివాసి 'మీర్ అలీ తబ్రేజీ' అందరికంటే ముందుగా దస్తూరిలో ప్రవేశపెట్టి దానికి స్థిరత్వాన్నికలుగజేసి తూర్పుపట్టణాలలో అమలులోకి తెచ్చాడు. ఈ క్రొత్తలిపికి 'నస్తాలీక్' అనే పేరుపెట్టేడు. నస్ఖ్-తాలీక్ (నస్ఖ్ లిపికి అనుబంధం) నస్తాలీక్ అయింది.

'మీర్ అలీ తబ్రేజీ' ఏకాలంనాటివాడో సరిగ్గా తెలియదు. 'ఆయన తైమూర్‌కు ముందుకాలంనాటివాడని' ప్రస్తుతం లేఖకులందరిలో ప్రసిద్ధికెక్కిన మున్షీ షమ్సుఉద్దీన్ సాహబ్ అన్నారు. కాని అంతకు చాలాకాలంక్రితమే 'నస్తాలీక్'లో తయారైనపుస్తకాలు లభించాయి. ఈ ఆధునికలిపి అవిష్కారం తైమూర్ కాలంమాట అటుంచి మహమ్మద్ గజినీ కాలానికి ముందే జరిగివుందనేది నిర్వివాదాంశం. గజనీ దండయాత్రలతోబాటే పార్సీలేఖకులు భారతదేశం వచ్చారనేది నిర్వివాదాంశం. వీరి ప్రభావంవల్లనే భారతదేశంలో నలుమూలలా 'నస్తాలీక్' వ్రాయసగాండ్రు తగినసంఖ్యలో తయారయ్యారు. అంటే మీర్ అలీ తబ్రీజ్‌గారి యుగం చాలా ప్రాచీనమైనదైనా అయివుండాలి. లేదా ఆయన ఈ లిపికి ఆద్యుడైనా కాకపోయి వుండాలి. కాని ఎందువల్లనో తెలియదు, ఢిల్లీ లక్నో మాటేమిటి, భారతదేశంలోని వ్రాయసగాండ్రు అందరూ 'మీర్ అలీ తబ్రేజీ' నే తమ ఆది గురువుగా భావిస్తూంటారు. ఆయన నిర్యాణానంతరం, చాలాకాలంతరువాత 'మీర్ ఇమాదుల్ హసనీ' 'నస్తాలీక్' లిపికి ఈరాన్‌లో ఆచార్యుడుగా ప్రసిద్ధినొందాడు. ఆయన మేనల్లుడు ఆగా అబ్దుర్రశీద్ వైలీ, నాదిర్‌షా దండయాత్రసమయంలో భారతదేశం వచ్చాడు. ఆయన లాహోర్‌లో నివసించి అనేకమంది వ్రాయసగాండ్రను తయారుచేశాడు. వారే భారతదేశంలోని అన్నిప్రాంతాలలోను లేఖన కళకు ఒరవడిపెట్టారు. వీరు లేఖనానికి [1]'ఆదమ్'లు కాకపోయినా నిస్సందేహంగా [2]'నూహ్'లని

1. ఆదమ్ మానవజాతి మూలపురుషుడు.

2. నూహ్ : యూదులు, క్రైస్తవులు, ముసల్మానుల అభిప్రాయాలప్రకారం ఒకానొక మతప్రవక్త. ఆకాలంలో ఎవరూ కనీ వినీ ఎరుగని జలప్రళయం వచ్చినప్పుడు ఆయన ఒక పెద్ద స్వదేశీ ఓడలో అన్నిరకాల జీవులలోంచి రకానికి ఒక జోడా చొప్పున రక్షించి సృష్టి కొనసాగించడానికి దోహదం కలుగజేశాడు. ఆ ఓడలోని జీవులుతప్ప మిగతా ప్రపంచంలోని సర్వప్రాణులూ జలప్రళయంలో మునిగిపోయి నామరూపాలుకూడా లేకుండాపోయాయి. ఆ ప్రవక్త ఈ సర్వనాశనాన్ని చూసి జీవితాంతం దుఃఖిస్తూ గడిపాడు. అందుకే ఆ ప్రవక్తకు 'నూహ్' అని పేరు వచ్చింది.

రుజూవయ్యారు. (ఈయనశిష్యులే హాఫిజ్ నూరుల్లా, కాజీ నేమతుల్లా అనే ఇద్దరు విదేశీయులు లక్నోవచ్చారు. అగా అబ్దుర్రశీద్‌గారి శిష్యుడు అబ్దుల్లాబేగ్ అనే ఆయనకూడా లక్నోవచ్చాడని అంటారు. లక్నోవచ్చిన ఏ కళావేత్తా, కవీ స్వంతఊళ్ళకు తిరిగి వెళ్ళిపోకుండా లక్నోలోనే తిష్ఠవేసుకొనివుండే 'నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా' కాలంలోనే బహుశః వీరు ముగ్గురూ ఇక్కడకి వచ్చారు. కాజీ నేమతుల్లా ఇక్కడికి చేరుకోగానే యువరాజులకూ, యువరాణులకూ లేఖనకళను నేర్పేపనిలో చేరాడు. హాఫిజ్ నూరుల్లాకుకూడా అయోధ్య ఆస్థానంతో సంబంధమేర్పడింది. వీరిద్దరూ లేఖనకళకు అయోధ్యరాజ్యంలో ఎంతో గొప్పసేవ చేశారు.

వీరిద్దరేకాకుండా ఇక్కడ స్థానికలేఖకులు ఎందరో వుండేవారు. వీరిలో మున్షీ మహమ్మద్ అలీ, పేరుప్రతిష్ఠల నార్జించుకొన్న వ్రాయసగాడు. కాని ఆయననీ, స్థానికలేఖకుల్నీ వెనక్కినెట్టి, అబ్దుర్రశీద్‌గారి శిష్యులు లేఖన కళపట్ల అభిరుచిగల వ్యక్తుల్నీ, లక్నోప్రజలను తమవైపు ఆకర్షించుకోగలిగారు. వంకరటింకర వ్రాతలనూ, పాతపద్ధతి దస్తూరీలనూ వీళ్ళు పూర్తిగా బహిష్కరించారు.

హాఫీజ్ నూరుల్లా, ఆస్థానంలో ఉద్యోగం సంపాదించుకోగలిగాడు. కనుక మహాఘటికుడని అనుకోవడం పొరపాటు. ఆయనవ్రాసిన ఖితా (కాగితాల)లను ముత్యాలిచ్చి కొనుక్కున్నసందర్భాలూ, ఆయనవ్రాతల్ని అక్షరానికి రూపాయి చొప్పున ఇచ్చి పుచ్చుకున్నఘట్టాలూ ఆయన లేఖనకళలో గొప్పఘటికుడనే విషయాన్ని విదితం చేస్తున్నాయి.

ఆరోజులలో ధనవంతులు. లేఖన కళపట్ల మోజుగల పెద్దమనుష్యులు బొమ్మలకులదులు ఖితాలతో గోడల్ని అలంకరిస్తూండేవారు; అందువల్ల చక్కనివ్రాతలకు ఎక్కువ గిరాకీవుండేది. వ్రాయసగాండ్ర ఖితాలు దొరికేచోట్ల దీపపుపురుగులలా ధనవంతులు గుమిగూడి పోటాపోటీగా ఎక్కువధరఇచ్చి వాటిని కొనుక్కొని తెచ్చుకొంటూండేవాళ్ళు. ఇందువల్ల కొనుగోలుదార్లకూ, వ్రాయసగాండ్రకూకూడా లాభం చేకూరుతూండేది. అనేకమైన నీతిసూత్రాలు, ఉపదేశాలు అందంగా వ్రాయబడి ఖితాలరూపంలో గోడలపై వ్రేలాడుతూవుండడంవల్ల ప్రతిక్షణం ధనవంతులకు నీతిపాఠం లభిస్తూండేది. వ్రాయసగాండ్రకు ఇంట్లోనే కూర్చుని తమ కళానైపుణ్యంతో సముచితమైన ధనార్జన చేసుకొనేందుకు అవకాశం కలుగుతూండేది.

కాని ఈకాలంలో భారతదేశంనుంచి లిఖిత, శిలాలేఖనాలకు సంబంధించిన అభిరుచి మటుమాయమైపోతూంది. వాటిస్థానాన్ని పటాలు ఆక్రమించాయి. ఇందువల్ల ప్రాచీనసభ్యత, సంస్కృతులపై మోజు తగ్గిపోతూండడంతోబాటు లేఖనకళ అంత ర్థానమైపోతూంది. ఇప్పుడూ లేఖకులు లేకపోలేదు. కాని సులేఖకులుమాత్రం కరువైపోయారు. ఇటువంటి కొద్దిమంది సులేఖకులు తమప్రతిభల్ని కళకోసం కాక పొట్టకూటికోసం కాపీలు తయారుచేయడంలోను, లిథోప్రెస్సులకై వ్రాతలు వ్రాసి పెట్టడంలోను నిమగ్నులైనారు. నిజం చెప్పాలంటే ఇటువంటిపనులు సులేఖకులకు గొడ్డలిపెట్టులాంటివి.

ఇందుకు భిన్నంగా ఆకాలంలో లేఖన కళానిపుణులబృందం ఒకటి లేఖననియమాలను తయారుచేసేందుకు, కాలానుగుణంగా వానిలో మార్పులు చేర్పులు చేసేందుకు నియమితమైవుండేది. అందుకే ఆనాటి వ్రాయసగాండ్రు లిథోపనిని తమ అంతస్తుకు తగనిపనిగా భావిస్తూండేవారు. పూర్తిపుస్తకాన్ని నకలుచేస్తే మొదటి నుంచీ ఆఖరుదాకా లేఖననియమాలను పాటించగలగడం సాధ్యంకాదనికూడా వారు అభిప్రాయపడేవారు. వాళ్ళు ఒక్కొక్క పస్లీ (డ్రాయింగ్ పేపరు) ని సులేఖనంతో పూర్తిచేసేందుకు పడేశ్రమతో పోల్చిచూస్తే కాతిబ్‌లు (నకళ్ళు వ్రాసేవాళ్లు) పుస్తకాన్ని పూర్తిగావ్రాయడంలో శతాంశంకూడా శ్రమపడవలసివచ్చేది కాదనిపిస్తుంది.)

ఒకసారి నవాబ్ సఆదత్ అలీఖాన్, హాఫిజ్ నూరుల్లా ఖాన్‌ని 'నాకు 'గులిస్తాం' (పార్సీకవి శేఖ్ సాదీగారి) కథాకావ్యం ప్రతినొకదాన్ని వ్రాసి ఇవ్వండి' అని అడిగాడు. సాదీగారి 'గులిస్తాం' పేరెత్తితే నవాబ్ చెవి కోసుకొనేవాడు. నిద్రపోతూన్నప్పుడుకూడా గులిస్తాంప్రతి ఆయన తలక్రింద ఉంటూండేది. మరొకరెవరైనా ఇటువంటికోర్కె కోరివుంటే నూరుల్లా దాన్ని అవమానంగాభావించి ఆ కోరినవ్యక్తి గుడ్లను పీకేసివుండేవాడు. కాని ఇది రాజాజ్ఞ. ఎలా కాదనగల్గుతాడు? అందువల్ల ఆయన 'అల్లాగే. నాకు ఎనభై గడ్డీ (రీమ్)ల కాగితాలనూ, ఒకవంద చాకులనూ, రెండువేల పేముపుల్లలనూ (కలాలుగా చెక్కుకొనేందుకు) ఇప్పించే ఏర్పాటు చేయించండి' అన్నాడు. నవాబ్ ఆశ్చర్యచకితుడై 'ఒక్క ప్రతిని తయారుచేయడానికి ఇంత సామగ్రి కావాలా?' అని అడిగాడు. 'అవును, ప్రభూ! నేను వ్రాయ

వలసివస్తే నాకింతసామగ్రి కావలసివుంటుంది' అన్నాడు. రాజు తలచుకొంటే దెబ్బలకేం కొదవ? వెంటనే ఆ సామగ్రి హాఫిజ్ నూరుల్లా ఇంటికి చేర్చబడింది. హాఫిజ్ 'గులిస్తాం' వ్రాయడం ప్రారంభించాడు. పూర్తిగా వ్రాయకుండానే ఏడధ్యాయాలుమాత్రం పూర్తిచేసి ఆయన స్వర్గస్థుడయ్యాడు. ఇక ఎనిమిదో అధ్యాయం మాత్రమే మిగిలింది. ఆయన తదనంతరం ఆయనకుమారుడు హాఫిజ్ ఇబ్రాహీమ్ ఆస్థానంలో పదవీప్రమాణం చేయబోయేముందు నవాబ్ సఆదత్ అలీఖాన్ ఆయనకు వల్లపట్టుపుట్టాలు సానుభూతిపూర్వకంగా ఇస్తూ, 'తమ్ముడూ, నేను మీ నాన్నగారిని 'గులిస్తాం' వ్రాయమని పురమాయించాను. అది ఎంతవరకూవచ్చిందో భగవంతునికే ఎరుక' అన్నాడు. 'నాన్నగారు ఒక్క అధ్యాయాన్నిమాత్రం వ్రాయలేకపోయారు. తమరు అనుమతిస్తే ఆ ఎనిమిదో అధ్యాయాన్ని ఈ సేవకుడు (నేను) పూర్తి చేస్తాడు. నాన్నగారువ్రాసిన ఏడధ్యాయాలు నేను వ్రాయబోయే ఎనిమిదో అధ్యాయం తమకు సమర్పిస్తాను. ఈ రెండింటికీ తమరు తేడా కనిపెట్టలేరు. కాని ఈరాన్ వ్రాయసగాండ్రు పరిశీలిస్తేమాత్రం తేడా కనిపెట్టేస్తారు' అన్నాడు హాఫిజ్ ఇబ్రాహీమ్ వినయపూర్వకంగా. నవాబ్ అనుమతించాడు. గులిస్తాం తయారైంది.

హాఫిజ్ నూరుల్లా శిష్యులందరిలో ఉత్తముడు ఆయనపుత్రుడు హాఫిజ్ మహమ్మద్ ఇబ్రాహీమ్ అనే చెప్పాలి. రెండోస్థానం మున్షీ సరబ్ సింహ్ అనే హిందూ కాయస్థునికి దక్కింది. కొందరు 'సింహ్' కాయస్థుడుకాడనీ కాశ్మీరు పండితుడనీ అంటారు. లక్నోనివాసి మహమ్మద్ అబ్బాస్ మూడోస్థానాన్ని సంపాదించుకోగలిగాడు. హాఫిజ్ ఇబ్రాహీమ్‌కూడా ఈకళలో చాలా మంచిపేరు సంపాదించుకొన్నాడు. ఆయన తన అవిరళకృషివల్ల వందలమంది వ్రాయసగాండ్రను తయారు చేశాడు. ఈకళకు ఒక నవీనశైలిని రూపొందించి తండ్రి కనపరచని ప్రత్యేకతను కనపరిచాడు. హాఫిజ్ నూరుల్లా అక్షరాలు చాలా గుండ్రంగావుండేవి. హాఫిజ్ ఇబ్రహీమ్ వాటిని కోడిగుడ్డు ఆకారంగా మార్చాడు. మున్షీ సరబ్‌సింహ్ తన గురువుకుతగ్గ శిష్యుడని పేరు పొందాడు. తాను వ్రాసిన ఎన్నో వస్‌లీల (డ్రాయింగ్ పేపర్ల)ను హాఫిజ్ నూరుల్లాఖాన్ పేరిట చెలామణీ చేశాడు. అయితే వాటిని నిపుణులు సహితం గుర్తుపట్టలేకపోతూండేవారు. ఆయన ఇటువంటి అద్భుతాలెన్నో చేసి చాలా పేరు తెచ్చుకొన్నాడు.

హాఫిజ్ ఇబ్రాహీమ్ శిష్యులలో ఆయనపుత్రుడు 'హాఫిజ్ సఈద్ ఉద్దీన్'కే అగ్రతాంబూలం లభిస్తుంది. ఆయన శిష్యకోటిలోని మున్షీ నజీర్ హమీద్, మున్షీ అబ్దుల్ మజీద్ ఆంగ్లప్రభుత్వానికీ, అయోధ్యరాజ్యానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలను జరిపేందుకు, ఆస్థానంలోని ముఖ్యమైన ఆదేశాలను లిపిబద్ధం చేసేందుకు లక్నో ఆస్థానంలో నియమించబడ్డారు. వీరేకాకుండా కాశ్మీరు పండిత కుటుంబంలో జన్మించిన మున్షీ మంసారామ్, మున్షీ మహమ్మద్ హాదీ అలీ ఈ కళలో సిద్ధహస్తులుగా దేశమంతటా పేరుతెచ్చుకొన్నారు. రాజులమధ్య అతి ముఖ్య లేఖలను వ్రాయడంలో మున్షీ మహమ్మద్ హాదీ అలీది అందెవేసిన చెయ్యి.

కాజీ నేమత్ఉల్లా శిష్యులలో ఒకరు మౌల్వీ మహమ్మద్ అష్రఫ్, రెండో వారు మౌల్వీ గుల్ ఎహ్మద్. వీరుభయులూ కాజీ నేమత్ ఉల్లాగారి పుత్రులే।

నస్తాలీక్ లిపికి సంబంధించినవ్యక్తులే ఈ కళకూ ఆచార్యత్వం వహించగలి గారు. ఈ కళావేత్తలవల్ల లక్నోలో లేఖనకళ ఉన్నతస్థాయి నందుకోగలిగింది. ముద్రాక్షరశాల (ప్రింటింగ్ ప్రెస్)లు ప్రారంభమయ్యాక లిథో వ్రాతలు, నకళ్ళు వ్రాసేపనులు అభివృద్ధినొందసాగాయి. ఈ రెండూకూడా లేఖనకళకు చెందినవే. లక్నోలో అసంఖ్యాకులైన ముసల్మానులు, వేలకొద్దీ కాయస్థులు, వందలకొద్దీ కాశ్మీరుపండితులు లేఖనకళలో ప్రావీణ్యం సంపాదించారు. వీరిలో ఎక్కువమంది లక్నోలోని నౌబస్తా, అశరఫాబాద్ వీథుల్లో నివసిస్తూండేవారు. కాని కాశ్మీరుపండితులు ఆంగ్లభాషా వ్యామోహంతోనూ, ఈ కళకి గిరాకీ తగ్గిపోతూండడాన్ని గమనించకంవల్లనూ దీన్ని పూర్తిగా వదిలేయడం విచారకరం. ఇప్పుడు మంచి దస్తూరీ వ్రాసే నిపుణులు, ముసల్మానులలోను, కాయస్థులలోనూ మాత్రమే కనిపిస్తారు.

చివరికాలంలో సందేలా నివాసి 'మున్షీ అబ్దుల్ హై' కూడా లేఖనకళలో ప్రవీణుడని పేరొందాడు. మున్షీ అమీర్ ఉల్లా తస్లీమ్, ఆయన అన్నలు మున్షీ అబ్దుల్ లతీఫ్, మున్షీ అషరఫ్ అలీలు ఆయన శిష్యులే। ప్రస్తుతం 'నస్తాలీక్'లో మున్షీ షమ్సుఉద్దీన్ సాహబ్, 'నస్ఖ్'లో మున్షీ హామిద్ అలీ సాహబ్ సుప్రసిద్ధ లేఖకులు. వీరుభయులూ మున్షీ అబ్దుల్ హైగారి శిష్యులు.

(యాకూత్ ముస్తాసీ అనే ఉపనామంతో ప్రసిద్ధుడయిన 'యాకూత్ అవ్వల్' అనే ఆయనకు భారతీయ 'నస్ఖ్' లేఖన కళానిపుణులతో ప్రథమస్థానాన్ని ఇవ్వవలసి

వుంటుంది. ముఅతసిమ్ బిల్లా కాలంలో ఈ పేరుగల వ్రాయసగాడు ఉన్నట్లు నిర్ధారించడానికి ఆధారాలు లేవు. 'ఖరీదా' అనే గ్రంథంద్వారా సుప్రసిద్ధుడయిన 'ఇమామ్ కాతిబ్'ను ఈ వ్యక్తిగా భావిస్తున్నారేమో! ఇమామ్ కాతిబ్ తొలుత సిరియాలో సుల్తాన్ అతాబక్ నూరుద్దీన్ జంగీ వద్దను, తరువాత 'మిసర్'లో సుల్తాన్ సలాహుద్దీన్ అయ్యూబీ వద్దను వ్రాయసగాడుగా వుండేవాడు. నస్ఖ్‌పద్ధతి లేఖనంలో అందరికీ అగ్రేసరుడుగా భావించబడేవాడు ఇతనే.

అనంతరం ఔరంగ్‌జేబ్ పరిపాలనా కాలంలో మహమ్మద్ ఆరిఫ్ అనే గొప్ప నస్ఖ్ లేఖకుడు జన్మించాడు. ఆయనకు 'యాకూత్ రకమ్-ఏ-సానీ' అనే బిరుదు ఇవ్వబడింది. ఆయన నస్ఖ్‌కు నవీనశోభను చేకూర్చాడనీ, అంతకుముందుండే లిపి కన్నా ఈయన ఏర్పరచిన లిపి ఎక్కువ అందంగా రూపొందిందనీ అంతా అంటూంటారు. ఆయన నూతనలిపి సంస్కారాన్ని ఇస్లామీ ప్రపంచమంతా సంతోషంతో అంగీకరించిందని లక్నోలోని లేఖన కళాప్రవీణులు వక్కాణిస్తూంటారు. వారితో నేను ఏకీభవించను. యాకూత్-రకమ్-ఏ-సానీకి భారతదేశంలో అత్యున్నతస్థానం లభిస్తే లభించివుండవచ్చు. కాని నస్ఖ్ జాతీయలిపిగాగల దేశవాసులు, అరబ్బీని జాతీయభాషగాగల దేశవాసులు యాకూత్ పేరునైనా ఎరుగను. ఆయన అనుయాయులు ఆ దేశాల్లో ఎవరూ లేరు.

మహమ్మద్ ఆరిఫ్ యాకూత్ రకమ్ కాలంలో 'అబ్దుల్ బాకీ' అనే పేరుగల వ్యక్తి కమ్మరివృత్తి చేస్తూండేవాడు. ఆయనకు లేఖన కళలో యాకూత్ రకమ్‌వలె సాధనచేసి పేరు ప్రతిష్ఠలనార్జించాలనే కోరిక కలిగింది. 'అబ్దుల్లా తబ్బాహ్' అనే వ్యక్తి 'నస్ఖ్' లేఖనంలో నిషణుడుగా ఆ రోజులలో ప్రసిద్ధినొందాడు. అబ్దుల్ బాకీ 'హద్దాద్' వెళ్ళి 'తబ్బాహ్'కు శిష్యుడయ్యాడు. ఆయనదగ్గర ఎంతో శ్రమించి సాధనచేసి లేఖన కళానిపుణుడయ్యాడు. వారిద్దరు కాలగర్భంలో కలిసిపోయాక, యాకూత్ రకమ్‌గారి స్థానాన్ని ఆయన అన్నగారిపుత్రుడు 'కాజీ అస్మత్ ఉల్లా' ఆక్రమించాడు. 'హద్దాద్' జ్ఞాపకచిహ్నంగా ఆయనపుత్రులు అలీ అక్బర్, అలీ అస్గర్ పేరు ప్రఖ్యాతు లార్జించుకొన్నారు.

వారి తదనంతరం భారతదేశంలో గొప్ప గొప్ప వ్రాయసగాండ్రు జన్మించారు. నస్ఖ్ లిపి భారతదేశంలో నిరంతరంగా ప్రగతినొందింది. షాహ్ గులామ్ అలీ

సాహబ్ 'నస్ట్' లేఖనకళలో సాటిలేని మేటియని ఖ్యాతి వహించాడు. ఆయన తరువాత ఒకవైపు లక్నోలో మౌల్వీ హాదీ అలీ సాహబ్ ప్రసిద్ధినొందసాగారు. ఆయన వంశీయులు ఢిల్లీనుంచి వచ్చారు. ఆయన 'కాలపీ'లోని గొప్ప వ్రాయసగాడైన మీర్ అక్బర్ అలీ గారి శిష్యుడు. మౌల్వీ హాదీ అలీ సాహబ్‌గారికి గొలుసుకట్టు వ్రాతలో మంచి నైపుణ్యం వుండేది.

హాదీ అలీ గారి కాలంలో నస్ట్ లేఖనంలో మీర్ బందా అలీ 'ముర్తఇశ్' అనే ఆయనకూడా మంచిపేరు తెచ్చుకున్నాడు. ఆయన నవాబ్ ఎహ్‌మద్ అలీ దగ్గర ఈ కళ నభ్యసించాడు. అలీగారు గొప్ప ధనవంతుడు, లేఖన విద్యానిపుణుడుకూడా. 'మీర్ బందా అలీ' చేతులకు వణుకుడురోగం వుండేది. కాని కలంపట్టుకొని కాగితం మీదపెట్టగానే ఇనుపచెయ్యిలా ఆయనచెయ్యి సాగిపోయేది. ఆయన, దస్తూరీలను కనిపెట్టడంలో సునిశితమైన దృష్టిగల ప్రజ్ఞావంతుడుకూడా అయివుండడం మరొక విశేషం.

(ఒకసారి మున్షీ హాదీ అలీ, మున్షీ ముహమ్మద్ యాహియా (ఈయన నస్ట్ కళలో ప్రముఖుడు. ఈయన ముద్రణనిమిత్తం లక్నోలో కురాన్ శరీఫ్‌ను వ్రాశాడు.) మున్షీ అబ్దుల్ హై సందేలవీ, మీర్ బందా అలీ ముర్తఇశ్ వగైరా ప్రముఖులు ఒకచోట సమావేశమయ్యారు. ఇది నస్ట్‌లేఖన నిపుణులగోష్ఠి. అప్పు డొకాయన నస్ట్‌లో వ్రాసిన ఒకపత్రాన్ని అమ్మకానికి తెచ్చాడు. ఆ పత్రంలో లేఖకుని పేరు లేదు. కాని అక్కడి ప్రముఖులందరూ ఆ పత్రం 'యాకూత్' వ్రాసినదని ఏకగ్రీవంగా భావించారు. ప్రతిఒక్కరూ దాన్ని ఎంత మూల్యాన్నైనా చెల్లించి స్వంతం చేసుకోవాలని తహతహలాడారు. కాని మున్షీ హాదీ అలీ సాహబ్ శాంతస్వరంతో 'దీన్ని ఒక్కరోజుపాటు నాకిస్తే పరిశీలించి, ఇది యాకూత్‌గారి దస్తూరి అవునో కాదో తేల్చిచెప్తాను' అన్నాడు. అమ్మకందారు దాన్ని ఆయన కిచ్చాడు.

మర్నాడు మళ్ళీ సమావేశమై హాదీ అలీ ఏమిచెబుతాడో విందామని అంతా చెవులు నిక్కబొడుచుకొని కూర్చున్నారు. 'ఇది నిజానికి యాకూత్‌గారి దస్తూరీయే అనేందుకు ఏం సందేహంలేదు. యాకూత్‌గారు వ్రాసిన ఇలాంటిపత్రమే నా దగ్గర వుంది. రెండింటినీ దగ్గరపెట్టుకొని పరీక్షగా చూశాను. ఒకేలా వున్నాయి' అంటూ ఆయన రెండుపత్రాలనూ సదస్యుల సమక్షంలో వుంచాడు. అందరూ ఈయనను

ఏమాత్రం సందేహించకుండా విశ్వసించారు. కాని [మీర్‌బందా అలీ, 'హాదీ'గారి పత్రాన్ని బాగా పరిశీలించి, మందహాసంచేస్తూ దానిక్రింద 'ఈఁ కార్ అజ్ తూ ఆయద్-ఓ-మర్దా మనీఁ కునంద్' - 'ఈ పనిని నువ్వే చేశావు. మొగతనంగలవాళ్లు ఇలాగే చేస్తారు' అని వ్రాసేడు.

ఇలా వ్రాయడాన్నిగమనించి అబ్దుల్ హై సాహబ్ చికాకుపడుతూ 'మీ కిందులో సందేహమేమన్నా వుందా?' అని అడిగాడు.

'అవును, ఈ పత్రంలోవిది ఎంతమాత్రం యాకుత్‌గారి దస్తూరి కాదు' అన్నాడు నిశ్చలంగా. మిగతావాళ్ళంతా అది యాకూత్‌గారి దస్తూరియే అని గట్టిగా వాదించారు. మీర్‌బందా అందులో 'వావ్' అనే అక్షరం కొసభాగాన్ని చూపించి 'ఇది యాకూత్‌గారి దస్తూరికాదు. ఆయన ఈ అక్షరాన్ని ఈవిధంగా ఎంతమాత్రం వ్రాసేవారు కాదు' అన్నాడు. అప్పుడు అక్కడివారందరూ అయోమయస్థితిలో పడ్డారు. హాదీ అలీ ఆ పత్రం మూలలో ఒకభాగాన్నిచింపి దాని మధ్యలోంచి తనపేరు చూపించాడు. ఇదంతా హాదీ అలీ చేసిన తమాషా అని అందరూగ్రహించి ఆయనను అభినందించారు. అప్పుడు హాదీ అలీ తన సంతోషాన్ని వ్యక్తంచేస్తూ, 'కాని నేను మాత్రం మీర్‌బందా అలీసాహబ్‌గారి సునిశితదృష్టిని తార్కికశక్తినీ గుర్తించి ముగ్ధుణ్ణి అవుతున్నాను' అన్నాడు.)

అందరు వ్రాయసగాండ్రవలెనే మీర్‌బందా అలీ సాహబ్‌కుకూడా పత్రాలు వ్రాయడంలోతప్ప పుస్తకాల నకళ్ళు తయారుచేయడంలో ఏమాత్రం అభిరుచి వుండేదికాదు. జీవితంలో ఎన్నడూ ఆయన చిన్నపుస్తకానికైనా నకలు వ్రాయలేదు. 'హాజీ హర్‌మెన్ శరీఫైన్' ముద్రాక్షరశాలను స్థాపించాక, ఆయన మీర్‌బందాను ప్రత్యేకంగా అభ్యర్థించి ఒక 'పంజ్‌సూరా' (చనిపోయినవారి సమాధివద్ద ముసల్మానులు చదువు ఖురాన్‌నందలి మొదటి అధ్యాయములోని ఐదు చిన్నచిన్నస్కందాలు) ముద్రణనిమిత్తం వ్రాసిఇచ్చేందుకు ఒప్పించాడు. మీర్‌బందా చాలాశ్రమించి దాన్ని తయారుచేశాడు. దాన్ని హాజీగారికి ఇచ్చేందుకు తీసుకువెళ్ళి ఆయన ముద్రాక్షరశాలలో దాన్ని తుదిసారి చూశాడు. ఎందువల్లో ఆయనకు మనస్కరించలేదు. చటుక్కున ఆ వ్రాతప్రతిని చింపేసి, 'అయ్యా, ఈపని నావల్లకాదు' అని నమస్కారం పెట్టి వచ్చేశాడు.

పై పెద్దమనుష్యులనుగురించి చర్చించి లేఖన కళలో భారతదేశంమొత్తంలో లక్నోదే అగ్రస్థానం అని నివేదించడం నా ధ్యేయం కాదు. ఇందుకు నాది పూర్తిగా వ్యతిరేకమైన అభిప్రాయం. మొగలాయీ సామ్రాజ్యస్థాపనకు ముందుకాలంలోనే ఈ లేఖన కళలో అత్యంత ప్రతిభనుచూపిన కొందరు మహనీయులు వుండేవారు. వారికి లక్నోలేఖకులు సాటిరాలేరు. అంతేకాదు. లక్నోయుగంలో 'నస్త్' లేఖనం దిగజారింది. అయితే హాఫిజ్ నూరుల్లా, హాఫిజ్ ఇబ్రాహీమ్ ఖితాలు, (పత్రాలు) లేఖనకళ విషయంలో లక్నో పట్టణానికి భారతదేశంమొత్తంలో కీర్తిని తెచ్చి పెట్టాయి అనిమాత్రం మనవి చేస్తున్నాను. లక్నోపట్టణంలోవుండే నిపుణులవంటి వారు విదేశాలలోని సాంస్కృతికకేంద్రాలుగా భావించబడే వివిధనగరాలలోకూడా వుంటూండేవారని ఒప్పుకోవడానికి నాకేం అభ్యంతరంలేదు.

కాని లక్నోకుచెందిన 'లేఖన కళ' ముద్రాక్షరశాలలకు సహకరించినంత ఎక్కువగా మరెక్కడి లేఖన కళా సహకరించివుండదు. భారతదేశంలో ప్రప్రథమంగా ఏచోట ముద్రణ ప్రారంభమైందో నాకు తెలియదు. కలకత్తాలో ఉర్దూ సాహిత్యాభివృద్ధికోసం, ప్రాచ్యవిద్యలను ప్రోత్సహించడంకోసం అనన్యసామాన్యమైన కృషి జరిగింది. కాని అక్కడ టైపుతో ముద్రితమైనగ్రంథాలే నాకు కనిపించాయిగాని ముద్రితమైనవీ, రాతిపలకలతో ముద్రితమైనపుస్తకాలుమాత్రం నా కంటపడలేదు.

గాజీ ఉద్దీన్ హైదర్ పరిపాలనాకాలంలో క్రీ. శ. (1814-1827) 'అర్చల్' అనే యూరోపీయుడు లక్నోవచ్చి ముద్రణనుగురించిన ప్రాథమికవిషయాలను విద్యావంతులగోష్ఠిలో వివరించాడు. విద్యావంతులు ముద్రణనుగురించి విని ఎంతో సంతోషించి ఆయనను ప్రోత్సహించారు. 'అర్చల్' లక్నోపట్టణంలో ముద్రాక్షరశాలను స్థాపించాడు. అదే లక్నోలో తొలి ముద్రాక్షరశాల. ఆయన అన్ని పరికరాలను లక్నోలోనే తయారుచేయించి ముద్రాక్షరశాలను స్థాపించడం ప్రత్యేకంగా పేర్కొనతగినవిషయం. 'జాద్-ఉల్-మఆద్' 'హప్త్ కుల్ జుమ్' 'తాజ్-ఉల్-లుగాత్' మున్నగుపుస్తకాలు ముద్రితమై పాఠకులసమక్షానికి వచ్చాయి. దీన్నిచూచి మరికొందరు ఉత్సాహవంతులైన వ్యాపారదక్షులు ముద్రాక్షరశాలలను స్థాపించారు. వీరిలో ప్రథమంగా ముందంజవేసినవాడు బహుశః హాజీ హర్మైన్ శరీఫైన్ అని అనుకొంటారు. ఆరోజులలో ముస్తఫాఖాన్ అనే గాజుసామాన్లవ్యాపారి హాజీగారి

ప్రెస్‌లో ఏదో ముద్రింపచేయడానికి వెళ్లాడు. హాజీ మాట్లాడేధోరణిలోని అసభ్యత మూలాన ముస్తఫాఖాన్ పని ఇవ్వకుండానే తిరిగి వెళ్ళిపోయాడు. ఆయన మంచి ధనవంతుడు. అందువల్ల హాజీకి పోటీగా ముద్రాక్షరశాల ప్రారంభించాడు. దానికి 'ముస్తఫాయీ ప్రెస్' అని పేరుపెట్టాడు. అది మంచి లాభసాటిగా అభివృద్ధి నొందింది. అనంతరం కొన్నాళ్లకు అలీబక్ష్‌ఖాన్ 'అలవీ ప్రెస్'ను ప్రారంభించాడు. అలాగే క్రమేపీ లక్నోలో చాలాచోట్ల ముద్రణశాలలు స్థాపించబడసాగాయి.

ప్రారంభదశలో ఈ ప్రెస్‌లను వ్యాపారదృష్టితోకాక కొందరు ధనవంతులు తమమోజు తీర్చుకోవడానికి స్థాపించారు. గొప్పగొప్ప శిల్పులచేత పల్చని రాతి పలకలమీద అక్షరాలు చెక్కించి, శ్రేష్ఠమయిన కాగితాలమీద ముద్రిస్తుండేవారు. పనిగంటల నియమం, లేక రోజుకు కనీసం చేయవలసినపని నిర్ణయం ఏవీ వుండేవి కావు. అడిగినంతడబ్బు శిల్పులకూ, ప్రెస్సులో పనిచేసే కార్మికులకి యజమానులు ముట్టచెబుతూండేవాళ్లు. పైగా యజమానులు వారిని ఎంతో గౌరవంగా చూసేవాళ్లు. ఆవనూనెతో వేలకొద్దీ దీపపు ప్రమిదలను వెలిగించి కాటుకపొడిని తయారుచేసేవారు. ఆ కాటుకపొడినే సిరాగా తయారుచేసి ఉపయోగించేవారు. పులుపుకుబదులు నిమ్మకాయలు, బట్టలకుబదులు అసలైన స్పాంజిని వాడేవారు. ఈవిధంగా ముద్రణ కవసరమైన సామగ్రికి ఎంతోధనం వ్యయం చేసేవారు. నవాబులపరిపాలనకాలంలో పార్సీ, అరబ్బీ పాఠ్యపుస్తకాలు, మతగ్రంథాలు లక్నోలోలాగ అంత ఎక్కువగా మరెక్కడా ముద్రితం కాలేదు. ఆనాటిగ్రంథాలు ప్రస్తుతం ఎవరిదగ్గరవున్నా వారు భాగ్యవంతులే. వెతికినా అవి ఇప్పుడు లభించడంలేదు.

మా నాన్నగారి పినతండ్రి అంటే మా చిన్నతాత ఎహ్మద్ సాహబ్ వ్యాపారమన్నా, ఊళ్లు తిరగడమన్నా ఎంతో మోజుపడేవారు. ఆ కాలంలో ఉన్నఊరువదిలి ప్రక్కఊరికి వెళ్ళడమన్నా జనులు ఇష్టపడేవారుకారు. కాని వయస్సుమళ్ళిన చిన్నతాతగారి మనస్తత్వం ఇందుకు పూర్తిగా భిన్నంగా వుండేది. ఆయన హాజీ హర్మైన్ శరీఫైన్‌గారి ప్రతినిధిహోదాలో రథాలలోనూ, ఎడ్లబళ్ళలోనూ వేలకొద్దీ పుస్తకాలకట్టలు పెట్టుకొని ప్రయాణం చేసేవారు. లక్నోనుంచి రావల్‌పిండి, రావల్‌పిండినుంచి లక్నో తరుచు ఈ పుస్తకప్రచారయాత్రలో ఆయన నిమగ్నులై వుండేవారు.

'ఆరోజుల్లో అచ్చుపుస్తకం అనేది దుర్లభమైన ఒక వింతవస్తువు. అచ్చుపుస్త కాలనుచూసి జనసామాన్యం చాలా ఆశ్చర్యచకితమవుతూండేది. చదువుకొన్న వ్యక్తులు బెల్లంచుట్టూ ఈగలలా నాచుట్టూ మూగుతూండేవారు. నేను ఏ గ్రామమో, ఏ పట్టణమో చేరేందుకుముందే అక్కడిప్రజలకు అచ్చుపుస్తకాలసంగతి తెలిసి పోతూండేది. అక్కడి అక్షరాస్యులు, విద్యాధికులు నా రాకకోసం ఎదురుచూస్తూండే వారు. గ్రామం లేక పట్టణపుపొలిమేరలలో వారు నాకు పూలదండలువేసి స్వాగతం చెప్పి సగౌరవంగా ఊళ్ళోకి తీసుకువెళ్లుతూవుండేవారు. ఆతిథ్యమిచ్చి ఎంతో గౌరవించేవారు. పుస్తకప్రదర్శనను ఆబాలగోపాలంవచ్చి చూసి పోతూండే వారు. వారివారి ఆర్థికస్తోమతననుసరించి పుస్తకాలు కొనుక్కొని తీసుకు పోతూండేవారు. ఆ రోజులలో పుస్తకాలమీద వెల వేయబడివుండేదికాదు. నేను వారివారి స్థితిగతులనుగుర్తించి నా ఇష్టమొచ్చినమూల్యాన్ని తీసుకొని వారికి పుస్త కాలు ఇచ్చేవాణ్ణి. వారు కళ్ళకద్దుకొని సరస్వతీదేవిని తీసుకొన్నట్లు భక్తితో పుస్త కాలను తీసుకొంటూండేవాళ్లు. అయితే 'కరీమా', 'మామ్ కీ మాం' (పార్సీ భాషలో వాచకాల) మొదలైన చిన్న వాచకాలను అరణాలు, అర్ధరూపాయికీ, 'గులిస్తాం', 'బోస్తాం' (షేక్ సాదీగారి ప్రసిద్ధరచన) మున్నగు ఉద్గ్రంథా లను ఒక్కొక్కప్రతి మూడు నాలుగు రూపాయలకూ సాధారణంగా విక్ర యిస్తూండేవాణ్ణి. అయినప్పటికీ పాఠకుల గిరాకీ తీరేటన్నిప్రతులు మిగిలేవి కావు. ఒక పట్టణంనుంచి మరోపట్టణం చేరేలోపుగానే పుస్తకాలన్నీ అమ్ముడై పోతూండేవి. ప్రారంభపురోజులలో కొత్తప్రతులకోసం నెలల తరబడి ఎదురు చూస్తూ కూర్చోవలసివచ్చేది. అనుభవం గడించాక లక్నోనుంచి నిరంతరం నా దగ్గ రకు పుస్తకాలబళ్లు వస్తూవుండేలా ఏర్పాటు చేసుకొన్నాను' అని మా చిన్నతాత గారు ఆ రోజులలో నాతో తరచు చెప్పేవారు.

లక్నోనవాబు ఆఖరుదశలో 'ముస్తఫాయీ ప్రెస్' ముద్రణ దృష్ట్యాచూస్తే ప్రపంచంలోని శ్రేష్ఠమయిన ముద్రాక్షరశాలల్లో ఒకటిగా స్థిరపడింది. అయోధ్య ఆస్థానం అంతరించాక లక్నోలో 'మున్షీ నవల్ కిశోర్' స్వంతప్రెస్సు స్థాపించాడు. ముద్రణలో దానికి అంతమంచిపేరు రాకపోయినప్పటికీ వ్యాపారదృష్టితోచూస్తే అది చాలా లాభసాటిగా నడిచింది. ఈరోజుల్లోకూడా నవల్ కిశోర్‌గారిప్రెస్‌లో

అరబ్బీ, పార్శీభాషలలో ముద్రితమైనన్ని పెద్దపెద్దగ్రంథాలు మరే ముద్రాక్షరశాల లోనూ ముద్రితం కాలేదనే చెప్పవచ్చు. ఆరోజులలో సాహిత్యంపై అభిరుచిగల ధనవంతులప్రోత్సాహంతో రచయితలూ, అనువాదకులు అనేక పాండులిపులను తయారుచేశారు. నవల్ కిశోర్ వాటినన్నిటినీ, సాహసోపేతంగా రాత్రింబగళ్లు ప్రెస్సు కార్మికులచేత పనిచేయించి ప్రచురించాడు. ఫలితంగా ప్రాచీనప్రాచ్య సాహిత్యంలోని ముఖ్యరచనలన్నీ ముద్రితమయ్యాయి. మధ్యాసియాలోని కాశ్గర్, బుఖారా నగరాల, ఆఫ్ఘన్‌స్థాన్, ఈరాన్‌దేశాల పాఠకుల గ్రంథావసరాలన్నిటినీ ఈ నవల్ కిశోర్ ప్రెస్ తీర్చగలిగింది. అంతేకాదు, ముస్లిం ప్రపంచంలో సాహిత్య ప్రచురణలకు కేంద్రస్థానంగా లక్నోకు నవల్ కిశోర్ ప్రెస్ ఖ్యాతిని చేకూర్చింది. నిజం చెప్పాలంటే నేటికికూడా విజ్ఞానగ్రంథాలప్రచురణకు నవల్ కిశోర్ ప్రెస్ కేంద్రంగా స్థిరపడిపోయింది.

కాని, నేడు లక్నోలో అసంఖ్యాకమైన ప్రెస్సులు ఉన్నప్పటికీ ముద్రణ స్థాయి రోజురోజుకూ దిగజారిపోతోందని చెప్పడానికి విచారంగా వుంది. 'ఇతర పట్టణాలే ఈ విషయంలో మేలు' అనికూడా అనక తప్పడంలేదు. ప్రెస్సు ఉద్యోగులలో, కార్మికులలో, యజమానులలో, ఎక్కువమందియొక్క నైతికపతనమే ఇందుకు కారణమని నా నమ్మకం. వీరి అశ్రద్ధవల్ల ముద్రణస్థాయి నానాటికి తీసికట్టుగా తయారయింది. కాని మున్షీ రహ్మత్ ఉల్లా సాహబ్ కృషివల్ల ముద్రణస్థితి కాన్పూర్‌లో ఇంతవరకూ బాగావుండడం ముదావహం. కాన్పూర్, లక్నోప్రగతికి ప్రతిబింబమని నా ఉద్దేశ్యం.

ప్రెస్‌తోబాటే లక్నోలో శిలాముద్రణకళకూడా ప్రారంభమైంది. శిలపై ఏ ముద్ర వేసినప్పటికీ దాన్ని ఏదోవిధంగా గాట్లుపెట్టి ఇనుప పనిముట్లతో దాన్ని సరిచెయ్యడం బహుశః ఐరోపాఖండంలోనే ప్రారంభమైవుంటుంది; ఇప్పటికింకా ఆ కళ అక్కడ అభివృద్ధి పొందుతూనేవుంది. లక్నోలో ఈ కళ చాలా అద్భుతంగా పెంపొందింది. కొన్నాళ్లకు ఇంకా సమర్థులు ఈ కళకు లభ్యమయ్యారు. శిలలపై ముద్ర వెయ్యనక్కరలేకుండానే తలక్రిందు అక్షరాలను అత్యంతసుందరంగా శిలలపై చెక్కి ముద్రణకు అనుకూలించేలా వీరు చేయగలిగారు. ఈ శైలికి మూల పురుషుడు 'ముస్తఫాయీ' ప్రెస్సుకు సంబంధించిన ఒక వ్యక్తి. ఆయన పుస్త

కాలకు పుస్తకాలే రాతి పలకమీద తలక్రిందులుగా ఎంతో అందంగా ముద్రణకు అనువుగా వుండేలా చెక్కి ఇస్తూండేవాడు. ముస్తఫా ప్రెస్‌మూలంగా ఆయనకు ఎంతో ఖ్యాతి చేకూరింది. ఆయనకాలంలోనే ఆయనవద్ద తయారైన చాలామంది కళావేత్తలు ఈరకమైన రాతిపలకలను సునాయాసంగా అత్యంతసుందరంగా తయారుచేయడంలో నిపుణులయ్యారు. వీరి సేవలమూలంగా ప్రెస్ యజమానులకు అమితలాభాలు వస్తూండేవి. ఇక్కడి శిలా సంశోధకులు అనేకదేశాలకు, పట్టణాలకు ఆహ్వానితులై వెళ్ళి ఉద్యోగాలు చేసుకుంటూండేవాళ్లు. శిలలపై తలక్రిందులుగా వ్రాసేనిపుణులలో మున్షీ జాఫర్ హుసైన్ ముఖ్యుడు. అయితే మొదటిరోజులలో పెద్దపెద్ద ప్రెస్సులకు ఈ పద్ధతిలో నమ్మకమేర్పడలేదు. అందువల్ల చిన్నప్రెస్సుల లోనే ఈపద్ధతిని ప్రవేశపెట్టడం జరిగింది. దీనివల్ల చిన్నప్రెస్సులుకూడా మంచి లాభాలు పొందగలుగుతూండడం గమనించి పెద్ద ప్రెస్సుల యజమానులు దీన్ని అమలుపరచడానికి ముందుకొచ్చారు. మున్షీ సయ్యద్ అలీ హుసైన్‌సాహబ్ తన తలక్రిందుదస్తూరితో ప్రఖ్యాతలేఖకులను మించిపోయాడు. ఆయనకళకు నమూనాగా ఈ దిల్ గుదాజ్ పత్రికలోని ప్రాచీన లక్నో వ్యాసావళి పేర్కొనవచ్చు. ఈ వ్యాసాలు రాతిపలకలపై తలక్రిందుదస్తూరితో ఆయనచే వ్రాయబడి ముద్రితమవు తున్నాయి. దీన్నిబట్టి లక్నో శిలాసంశోధనకళ ఎంత ఉన్నతస్థితిని అందుకోగలి గిందో మీరు తేలికగా అంచనా వేసుకోవచ్చు. వివిధపట్టణాలలోవుండే శిలాసంశోధన కళావేత్తలంతా లక్నోకు చెందినవాళ్ళే. అయితే తలక్రిందులదస్తూరీతో శిలా ఫలకా లపై అక్షరాలు చెక్కబడి ముద్రించేపద్ధతి ప్రస్తుతం ఒక్క లక్నోలోతప్ప మరిం కెక్కడా లేదు; కాని ఇంతకుముందే మనవిచేసినట్లు లక్నోప్రెస్ యజమానులు, కార్మికులలో అధికసంఖ్యాకుల నైతికవిలువలు దిగజారిపోయివుండడంవల్ల లక్నో శిలా సంశోధకులవల్ల పొందవలసినంత లాభాన్నీ, సేవలనీ పొందలేకపోతూందని చెప్పడానికి విచారిస్తున్నాను.

# 15

నేను లక్నోకు సంబంధించిన అనేక నైతిక, సాంస్కృతిక క్రియాకలాపాలను గురించిన విశేషాలను ఇంకా చెప్పాలని అనుకుంటున్నాను. కాని దీనికిముందుగా యుద్ధకౌశల్యానికి సంబంధించిన చరిత్రను సూక్ష్మంగా తెలియజేయడం ఉచితమని భావిస్తున్నాను.

భారతీయులసైనికశక్తి బలహీనమైనకాలంలో అయోధ్య ఆస్థానం స్థాపించబడింది అనడంకంటే పాతకాలపు ఆయుధాలు, కొత్త ఆయుధాలముందు, నూతన యుద్ధకౌశలంముందు దిగదుడుపుఅయి ప్రాచీన యుద్ధపద్ధతులు పనికి రాకుండాపోతూన్న సంధికాలంలో ఈ ఆస్థానస్థాపన జరిగిందనడం సముచితం. ప్రాచీన యుద్ధపద్ధతులు తెలిసినవీరులు భారతీయులనుంచి వేరైపోయి విదేశీయుల చత్రచ్ఛాయలలో రాణిస్తూండేవాళ్లు. మిగతావాళ్లు తమ పూర్వీకుల బలపరాక్రమాదులను బొత్తిగా గుర్తించలేనిదుస్థితిలో వుండిపోయారు. ధైర్యం అనేది మన దేశస్థులలో లేకుండాపోయింది. ఈ యుద్ధకళనుగురించి సంక్షిప్తంగా పాఠకులకు పరిచయం చేద్దామనుకుంటే యుద్ధకళలనుగురించి వివరించేందుకు ఏ వ్యక్తీ కనిపించడం లేదు. 'షాహ్ జాదా మీర్జా మసూద్ కద్ర్ బహాదుర్, బి.ఏ;' లక్నోలోని 'సులేమాన్ ఖాఁ సాహబ్' (బరేలీ రాజైన హాఫిజ్ రహ్మత్ ఖాన్‌గారి బంధువు)గార్లు ప్రాచీన యుద్ధకళలనుగురించి నాకు వివరించి చెప్పారు. ఈ అధ్యాయంలోని వివరాలన్నీ ఆ ఇద్దరు మహానుభావుల సహాయంవల్లనే వ్రాయగలుగుతున్నాను.

ఢిల్లీలోను, ఢిల్లీఅనంతరం లక్నోలోనూ అభివృద్ధిపొందిన యుద్ధకళలు ముఖ్యంగా మూడు వేరువేరుజాతులకు సంబంధించినవి. మూడుజాతుల ఐక్యత ఈ యుద్ధకళల పెంపుదలకు కారణమైంది. యుద్ధకళల ఏకత్వంలో భిన్నత్వం, చివరి వరకూ తమతమ ప్రత్యేకతను విడనాడకుండావుండడం మరో విశేషం. కొన్ని యుద్ధపద్ధతులు ఆర్యజాతి యుద్ధవీరులను ప్రసాదించాయి. అరబ్బులు పెంపొందించిన యుద్ధరీతులు కొన్నివున్నాయి. అవి ఈరాన్ ద్వారా భారతదేశంలో ప్రవే

శించాయి. లక్నోలో అభివృద్ధియై అమలులోవుండే యుద్ధకళలవివరాలు, ఆ కళలను పెంపొందించిన యుద్ధవీరుల వివరాలు ఇక్కడ ఇస్తున్నాను.

1. లక్‌డీ, 2. పటా హిలానా, 3. బాంక్, 4. బిన్నౌట్, 5. కుస్తీ, 6. బల్లెం, 7. బాణా, 8. తీరందాజీ, 9. కటార్, 10. జల్‌బాంక్.

## 1-లక్‌డీ

ఈ కళ ముఖ్యంగా ఆర్యులసొత్తు. దీన్నే 'ఫికైతీ' అనికూడా అంటారు. ఇది భారత, ఈరాన్‌దేశాల ఆర్యులకు తెలిసివున్న యుద్ధపద్ధతి. అరబ్బుల విజయానంతరం ఈరానీ ఫికైతీతో అరబ్‌యోధులు ప్రభావితులయ్యారు. ఈ ఫికైతీ భారతదేశపు ఫికైతీకంటె శ్రేష్ఠమయినది. భారతదేశంలో చివరివరకూ ఈ రెండుకళలు తమతమ ప్రత్యేకలక్షణాలతో విలసిల్లాయి. లక్నోలో ఈరానీ ఫికైతీ, భారతీయ ఫికైతీ వ్యాయామశాలలు విడివిడిగా అనేకవీధులలో వుండేవి. ఈరాని, అరేబియా సమ్మిశ్రిత ఫికైతీ లక్నోలో 'అలీ మద్' అనేపేరుతో ప్రసిద్ధికెక్కింది. శుద్ధ భారతీయ ఫికైతీ 'రుస్తుమ్‌ఖానీ'గా పేరుబడ్డది. అలీమద్‌లో ఫికైతీ చేసేవ్యక్తి తన ఎడమపాదం కదల్చకుండా దృఢంగా ఒకేచోట ఆన్చి కుడిపాదాన్నిమాత్రం అవసరాన్ని అనుసరించి ఇటూ అటూ, ముందు వెనకలకు ఇష్టమొచ్చినట్లు మార్చుకొంటూ ప్రత్యర్థిపై విరుచుకుపడతాడు. కాని దీనికి విరుద్ధంగా రుస్తుమ్‌ఖానీలో ఫికైతీ చేసేవ్యక్తి ఒకేచోట పాదాన్ని ఆన్చకుండా ఇష్టమొచ్చినట్లు కదంతొక్కుతూ ప్రత్యర్థిని ఎదుర్కోవచ్చు. అంతేకాక 'అలీమద్' ప్రత్యేకంగా ధనవంతుల, గుణవంతులవరకే సీమితమైవుండేది. 'అలీమద్' వస్తాదులు, వస్తాదుల గురువులు, ఈ యుద్ధపద్ధతి నేర్చుకోదలచిన కిందితరగతివారినీ, చిన్నకులాలవాళ్లనీ తమ శిష్యులుగా చేసుకొనేవారుకాదు; ఏ పరిస్థితిలోనూ ఈ కళారహస్యాన్ని చెప్పేవారుకాదు. కాని రుస్తుమ్‌ఖానీపద్ధతి జనసామాన్యానికికూడా అందుబాటులో వుండేది.

ఫైజాబాద్‌లో షుజా ఉద్దౌలా కాలంలో, అనంతరం ఆయనభార్య బహూబేగమ్ సాహిబా కాలంలో అయోధ్య ఆస్థానంలో అలీమద్ కళావేత్త ఒక దిట్టమైన వస్తాద్ వుండేవాడు. ఆయననుగురించినవివరం ఫైజాబాద్‌చరిత్రలో వుంది. ఈ కళలో అందరికంటే ముందు ఆయనే వస్తాద్ అయ్యాడని తెలుస్తోంది. కొన్నిసంవత్స

రాలు ఆయన హైదరాబాద్‌లో గడిపి అనంతరం లక్నో చేరుకొన్నాడు. ఈ కళకు సంబంధించిన రెండో వస్తాదు 'ముహమ్మద్ అలీఖాన్'. ఆయన మేముండే 'కటారా బిజ్లాన్‌ఖాన్' వీధిలోనే వుంటూండేవాడు. ఆయనే లక్నోలో ప్రప్రథమంగా 'అలీ మద్' పద్ధతిని ప్రవేశపెట్టాడు. మూడో వస్తాద్ మీర్ నజ్మ ఉద్దీన్. ఆయన ఢిల్లీ యువరాజులతో మొదట కాశీ వెళ్లాడు, ఆతరువాత లక్నో వచ్చాడు. ఆయన కేవలం రాజకుమారులకూ, కులీనులబిడ్డలకూ ఈ కళ నేర్పుతూండేవాడు. రాచబిడ్డల దగ్గర ధనాన్నీ, కులీనులబిడ్డలవద్ద మిఠాయి పుచ్చుకొంటూండేవాడు. ఈయన వీటిని తన సొంతానికికాకుండా ఆధ్యాత్మికచింతనలో జీవితాన్ని గడిపే సయ్యద్‌లకు, సన్యాసులకు బహూకరిస్తూండేవాడు. ఈయన నవాబ్ ఆసఫ్ ఉద్దౌలాకాలంవాడు. హకీమ్ మెహదీ ముఖ్యసహచరుడు 'మీర్ ఆతా హుసైన్‌కూడా ఆకాలంలో గొప్ప వస్తాద్‌గా పేరుతెచ్చుకొన్నాడు. గాజీ ఉద్దీన్ హైదర్‌కాలంలో 'అలీమద్' పద్ధతికి ప్రారంభకుడుగా, సంస్థాపకుడిగాను 'ఉస్తాద్ ఏ బెబాజ్‌ఖాన్' చాలా ప్రఖ్యాతి వహిం చాడు. ఆయన క్రొత్తగా ఇస్లాంమతం పుచ్చుకొన్నవ్యక్తి అనీ, ఆయనకూడా కులీ నుల కుమారులకుమాత్రమే తనకళను నేర్పేవాడనీ చెప్పుకుంటారు. ఆయన తన స్మృతిచిహ్నంగా లక్నోలో ధనియామెహరీ వంతెన సమీపంలో ఆలంనగర్‌వద్ద ఒక మసీదును కట్టించాడు. అది నేటికీ మంచి స్థితిలో వుంది.

రుస్తుమ్‌ఖానీ పద్ధతి సామాన్యజనానికి అందుబాటులో వుండడంవల్ల హిందువు లలో కాని, ముసల్మానులలో కాని ఈపద్ధతికి అంత ప్రముఖస్థానం ఏర్పడలేదు. అయితే ఈకళ వాడవాడలా, గ్రామ గ్రామాలలో బాగా అభివృద్ధిపొందింది. ప్రతి చోట ఈ కళను నేర్పే వస్తాదులు వుంటూండేవారు. లక్నోలో యాహియాఖాన్ బిన్ ముహమ్మద్ సిద్దీక్‌ఖాన్, రుస్తుమ్‌ఖానీలో గొప్ప నిపుణుడని పేరు సంపాదించాడు. ఉన్నతకుటుంబాలలో 'నవాబ్ ఫతేహ్‌యాబ్'కు మంచి పేరుండేది. ఆయన వస్తాదు గానేకాక లేఖన కళానిపుణునిగాకూడా పేరు తెచ్చుకొన్నాడు. ఇలా రెండుకళలలో సమానప్రతిభను చూపగల కళాకారులు వుండడం అరుదు. 'మీర్ లంగర్' అనే యువకవస్తాద్‌కుకూడా లక్నోలో గొప్ప పేరుండేది. ఈ కళ ఇప్పటికీ కిందితరగతి వారిలో మిగిలివుంది. అలీమద్ కళ ఉన్నతవర్గాలలో వ్యాపించివుండడంవల్ల, వాళ్లకు యుద్ధాలతో ఏం సంబంధంలేకపోవడంవల్ల ఆకళ పూర్తిగా నశించిపోయింది. కాని

రుస్తుమ్‌ఖానీ కింది తరగతులవారు నేర్చుకొనివుండడంవల్లనూ, వారు తరుచు ఒకరితో ఒకరు దెబ్బలాడుకొంటూ వుండడంవల్లనూ ఆకళ ఇంకా నిలిచివుంచి.

'అలీమద్' బాపతు ఒకరిద్దరు వస్తాదులను నేను మటియా బుర్జ్‌లో చూశాను. మహ్మూద్ నగర్‌పేటలో నివసించే 'మీర్ ఫజ్‌లే అలీ' అనేవ్యక్తి నేను చూసిన వారిలో ఆఖరువాడు.

## 2-పటాహిలానా (కర్రసాము)

ఒకవేళ దురదృష్టవశాత్తూ ఒకే ఒకవ్యక్తి శత్రుకూటంలో చిక్కుకొనేపరిస్థితి ఏర్పడితే కర్రపట్టుకొని దాన్ని నాలుగువైపులకూ పద్ధతిప్రకారం తిప్పుతూ శత్రు వ్యూహాన్ని ఛేదించుకొంటూ, శత్రువుల్ని బాదుతూ ఆత్మరక్షణచేసుకొని బయట పడడం ఈ కర్రసాము ముఖ్య ఉద్దేశ్యం. కర్ర నాధారంగాచేసుకొని శత్రువ్యూహం లోంచి బయటపడే సమర్థతను సంపాదించగలగడం దీనిలోని విశేషం. ఒకవేళ నాలుగువైపులనుంచీ బాణాలవర్షం, లేదా రాళ్లవర్షం కురుస్తూన్నప్పటికీ అవి తనమీద పడకుండా చెల్లాచెదరు చేయగలగడం ఈ కళలో ప్రశంసనీయమైనవిషయంగా చెప్ప వచ్చు. ఇది భారతీయ కళకాదు. యూరోపునుంచి లక్నోకు ఇది దిగుమతిఅయింది ప్రారంభంలో దీన్ని చేనేతపనివారు నేర్చుకొన్నారు. కాని ఆతరువాత చాలామంది, ముఖ్యంగా శేఖ్‌వంశీయులు దీన్ని నేర్చుకొన్నారు. గులాం రసూల్‌ఖాన్ కుమారుడు 'గౌరీ పతే ఖాజ్' లక్నోలో ఈ కళలో నిష్ణాతుడు. ఈయననుగురించిన ఎన్నో వీరగాథలు లక్నోలో ప్రచారంలో వుండేవి. కాని నేటి లక్నోజనం ఆ గాధల్నికూడా మరచిపోయారు.

మీర్ రుస్తుమ్ అలీ, సైఫా (కాగితాలనుకోసే చాకు) కు రెండువైపులా పదును పట్టించి దాన్ని తిప్పుతూ కొన్నివందలమంది శత్రువుల్ని చీల్చుకొంటూ తప్పించు కొని బయటికి వస్తూండేవాడు. అసేవన్ యువరాజు 'శేఖ్ హుసైన్ మహమ్మద్' రెండుచేతులలో కర్రలు తిప్పేవాడు. గాజీ ఉద్దీన్ హైదర్‌కాలంలో ఒకసారి రెసిడెంట్‌కోర్కెపై కర్రయుద్ధం ప్రదర్శన ఏర్పాటుచేయబడింది. రెసిడెంట్, ఆయన ఆంగ్లేయ మిత్రులు, రాజకుటుంబంవారు, ఆస్థానంలోని ఉన్నతాధికారులు, ఇంకా ఎందరో ఈ కర్రయుద్ధం ప్రదర్శనను చూసేందుకు వచ్చారు. ఈ ప్రదర్శనలో

శేఖ్ ముహమ్మద్ హుసైన్ పాల్గొన్నాడు. ఆయన కర్ర తెచ్చుకోలేదు. అందువల్ల ఆస్థాన ఆయుధాగారంలోని పొన్నుకర్ర ఆయన కియ్యబడింది. ఆ పొన్నుకర్రతో ఆయన సాహసోపేతమైన అద్భుతప్రదర్శన జరిపాడు. సభికులందరూ, ముఖ్యంగా ఆంగ్లేయులందరూ ఈ అనుపమప్రదర్శనాన్ని ఆశ్చర్యంగా తిలకించి ఎంతో ప్రశంసించారు. కరతాళధ్వనులతో సభాభవనం ప్రతిధ్వనించిపోయింది. అమితమయిన ఉత్సాహావేశంతో శేఖ్ ముహమ్మద్ హుసైన్ పొన్నుకర్ర తిప్పుకొంటూ జన సమూహాన్ని చీల్చుకుంటూ తన స్వగృహానికి వెళ్ళిపోయాడు. ఈ కళానిపుణులు, పదిమంది కత్తియోధుల్నికూడా ఓడించగల్గుతారు.

లక్నోలో ఈ కళలో నిపుణుడు 'మీర్ విలాయత్ అలీ' కర్రలను విరగకొట్టడంలో దిట్ట. ప్రత్యర్థిచేతిలో ఎంత బలమైన కర్రవున్నప్పటికీ దాన్ని అవలీలగా విరగకొట్టడంలో అతనిది అందెవేసినచెయ్యి అని చెప్పుకొంటూండేవారు.

## 9-బాంక్ (కత్తిసాము)

యుద్ధ నైపుణ్యంలో 'బాంక్' పద్ధతికి గొప్పస్థానం వుంది. కులీనుల పిల్లలు ఈ 'బాంక్'ను కష్టపడి నేర్చుకొంటూండేవారు. చిన్నకత్తులతో ప్రత్యర్థిని ఎదుర్కొనడం ఈ పద్ధతిలక్ష్యం. ఈ పద్ధతి ప్రాచీనకాలంలో హిందువులలోను, అరబ్బులలోనూకూడా అమలులోవుండేది. కాని కత్తులలోమాత్రం తేడా వుంటూండేది. హిందువులకత్తులు సాపుగా, రెండువైపులా పదునుతో వుండేవి. కాని అరబ్బుల కత్తులు వంగి, బాకుమాదిరిగా ఒకేవైపు పదునుకలిగి వుండేవి. తరువాత కాలంలో అరబ్బులు 'జంబియా' అనే చిన్నకత్తిని ఉపయోగించేవారు. ఆ రకం కత్తులకు అగ్రభాగంలో రమారమి నాలుగు అంగుళాలమేర నాలుగువైపులా పదును వుండేది. దానితోపొడిస్తే నాలుగుప్రక్కలా గాయం ఏర్పడుతుంది. ఆ గాయానికి కట్టుకట్టడం చాలా కష్టం. ఈ ఆయుధంతో పోరాడేకళకే 'బాంక్' అని పేరు.

గురు శిష్యులిద్దరూ ఎదురెదురుగా మోకాళ్లు నేలకుఆనించి కూర్చుంటారు. కాని హిందువుల కత్తియుద్ధంలో, ఇద్దరు ప్రత్యర్థులు మోకాళ్లమీద కూర్చోడంతోబాటు ఒక మోకాలును నిలబెడుతారు. అరబ్బులుమాత్రం పూర్తిగా మోకాళ్లు ఆనించి కూర్చొనే కత్తిని ప్రయోగిస్తారు. గాయపరచడంతోపాటు బలమైన పట్టుకూడా

పడుతుండేవారు. వానిముందు కుస్తీపట్లు ఎందుకూ పనికిరావు. అరబ్బులు ఏడు పోట్లు పొడుస్తారు. హిందువులు తొమ్మిదిపోట్లు పొడుస్తారు. అరబ్బుల 'బాంక్'లో పట్టు పూర్తిగా పట్టగలిగితే ప్రత్యర్థిని సజీవునిగా వదిలే అవకాశం గెలిచినవానికి దొరకదు. హిందువుల 'బాంక్'లో గెలిచినవారిచేతుల్లో తుదివరకూ చిత్తుఅయిన వ్యక్తి కదలకుండా పడివుండేఅవకాశం వుంటుంది. విజేత తన ఇష్టప్రకారం పట్టు వదిలితే చిత్తైనవ్యక్తి బంధనం సడలి బయటికి రాగలుగుతాడు. ఈకళలో కేవలం గాయపర్చడం, గాయపడడం అనేదిమాత్రమే కాక పట్లుపట్టడం, చిత్తుచేయడం, ఇద్దరు ప్రతిద్వంద్వులూ ఒకర్నొకరు గంటలకొద్దీ దొర్లించుకొంటూ పొర్లడం వగైరా తంతులుకూడా వుంటాయి. కుస్తీ, కర్రయుద్ధంవగైరా ఇతర యుద్ధపద్ధతులు ఈ 'బాంక్' లోంచే వచ్చినవని కొందరంటాడు. ఈ బాంక్ కళలోని పట్లు, తప్పించుకోడానికి వీలులేనివీ, నియమబద్ధమైనవీ అని చెప్పవలసివుంటుంది. 'బాంక్' ప్రత్యర్థిని పడుకోపెట్టినప్పుడే పూర్తి అయినట్లు, కూర్చోబెట్టితే సగం అయినట్లు, నుంచోబెట్టితే నాలుగోవంతు అయినట్లు లెక్క అని అంటూంటారు. బాంక్ లక్ష్యం కేవలం ప్రత్యర్థిని గాయపరచి వదిలెయ్యడం కాదు, ప్రత్యర్థిని చిత్తుచేసి సజీవంగాబంధించి ఖైదుచేసి తీసుకుపోవడం దాని అసలు ధ్యేయం.

కత్తిసాములో నిపుణులు తమ నిపుణతను అతి గోప్యంగావుంచుకొని బయటి వారి కేమాత్రం తెలియనివ్వరు. వాళ్ల ఆకృతులు, వగైరా మామూలుగానే వుంటాయి. ఏ ఆయుధాన్నీ, కనీసం ఇనుపకలాన్నీ, సూదినీకూడా దగ్గర వుంచుకోరు. కేవలం ఒక జేబు రుమాలును దగ్గర ఉంచుకొంటారు. దాని ఒకకొసకు ఇనుపఉంగరాన్ని కట్టి ఉంచుకొంటారు. ఇంకా మరికొందరు చేతిలో జపమాలను ఉంచుకొంటారు. అందులో మామూలు ఇనుప దిగ్దర్శకయంత్రంమాత్రం వుంటుంది. అవసరమైనప్పుడు ఈ వస్తువుతోనే శత్రువుల్ని ఎదుర్కొంటారు. అంటే, ఈ రెండు చిన్న ఆయుధాలలో ఏదో ఒకటి వారికి చాలు.

ప్రాచీనకాలంనుంచీ ఈ 'కత్తిసాము' కళ కేవలం బ్రాహ్మణులవరకే సీమితమై వుండేది. రాజపుత్రులుకూడా ఈ కళ నెరుగరు; వాళ్లు నేర్చుకోవాలని కుతూహలపడినా బ్రాహ్మణులు నేర్పేందుకేమాత్రం ఇష్టపడలేదు. ఇందుకు కారణంగా 'ఈ విద్య నేర్చుకోవడానికి సంఘంలో శ్రేష్ఠులయివుండడం అత్యవసరం. రాజపుత్రులు

కేవలం సైనిక మన స్తత్వంగల వ్యక్తులు. అందువల్ల వారికీవిద్య దుర్లభం' అని చెప్పేవారు. బ్రాహ్మణవీరులు తమ యజ్ఞోపవీతంలో దిగ్దర్శకయంత్రాలు, ఇనుప సెనగలు కట్టుకోవడానికిబదులు ఇనుప తాళంచెవి కట్టుకొంటూండేవారు. చాలా పెద్ద మనిషి తరహాగా, గంభీరంగా వాళ్ల తమ శత్రువులను తుదముట్టిస్తూండేవారు. షాహ్ ఆలమ్ పరిపాలనకాలంలో, మీర్జా ఖుర్రమ్ బఖ్త్ బహాదుర్ కాశీవెళ్లి తిరిగివచ్చి నప్పుడు తనతో ఇద్దరు బాంక్ వస్తాదుల్ని తీసుకురావడంతో ఈ కళ లక్నో చేరి నట్లు షహ్‌జాదా మీర్జా హుమాయూన్‌కద్ర్ బహాదుర్ అన్నాడు. కాని షుజాఉద్దౌలా కాలంలోనే ఫైజాబాద్‌కు కత్తిసాములో నిపుణుడు 'మన్‌సూర్ అలీఖాన్' వచ్చి స్థిరపడ్డాడని ఫైజాబాద్ చరిత్ర నధ్యయనం చేయడంవల్ల నాకు నమ్మకంగా తెలిసింది.

నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా పరిపాలనకాలంలో లక్నోలో 'షేక్ నజ్మ్ ఉద్దీన్' ఈ బాంక్ కళలో గొప్ప ఉస్తాద్. ఆయన అనంతరం లక్నోలో 'మీర్ బహాదుర్ అలీ' అనే ఆయన ఈ విద్యలో దిట్టమైన ఉస్తాద్. 'మంచంక్రింద అడవి పావు రాయినివదిలి తమాషా చూడండి. అది ఏవైపునుంచైనా ఎగిరిపోగలిగితే నేను కత్తిసాము తెలిసినవాణ్ణే కాదు' అని ఆయన పందెం వేసేవాడు. ఈవిషయం ఆయనవరకే పరిమితంకాదు. కత్తిసాములోవుండే గొప్పతనమే ఇది. ప్రతి బాంక్ వస్తాదూ ఇలాగే పందెం వెయ్యవచ్చు. లక్నోలో మూచో వస్తాద్‌గా ముహమ్మద్ ఖాన్ కీర్తిగడించాడు. నసీర్ ఉద్దీన్ హైదర్‌కాలంలో షేఖ్ నజ్మ్ ఉద్దీన్‌గారి శిష్యుని శిష్యుడు అబ్బాస్‌కు కూడా ఈ కళలో చాలా మంచిపేరు వుండేది. ఆయనకు నలుగురు శిష్యు లుండేవారు. వారిలో ఒకడు పెద్ద దొంగ, మిగతా ముగ్గురూ పెద్దమనుష్యులే. ఈ కళలో 'మీర్ జాఫర్ అలీ' ఆఖరి ఉస్తాద్. ఆయన అయోధ్య ఆస్థాన పతనానంతరం వాజిద్ అలీ షా వెంట 'మటియా బుర్జ్' వచ్చిచేరాడు. నేను ఆయన వద్ద ఈ కళాభ్యాసం చేశాను. కాని ఒకటి రెండునెలలు నేర్చుకొని ఈ అభ్యాసాన్ని మానేశాను. అయితే నేర్చుకున్నంతవరకూ స్వప్నంలో సంగతిలా చూచాయగా గుర్తుంది. ఇంక ఇప్పుడు ఈ కళానిపుణులు మిగిలివున్నారా లేదా అనేవిషయం నాకు తెలియదు.

## 4-బిన్నొట్

ప్రత్యర్థిచేతులలోంచి కత్తి, కర్ర లేదా మరే ఇతర ఆయుధాన్నైనాసరే దాన్ని పడగొట్టి పైసా కట్టివున్నరుమాలుతో ప్రతర్థిని స్పృహతప్పేట్లు దెబ్బకొట్టడం ఈ కళ ముఖ్యోద్దేశ్యం. ఈ కళలో గొప్పగొప్పప్రవీణులు, హైదరాబాద్‌దక్కన్‌లో వుండేవారని లక్నోవాసుల నమ్మకం. స్వయంగా అక్కడికివెళ్లి తెలుసుకున్నాను. నిజంగానే ఈ కళ అక్కడ ఇప్పటికీ సజీవంగావుంది. నిరాయుధులైన ప్రత్యర్థుల్ని ఎదుర్కోవడాన్ని 'కుస్తీ' అనీ, ప్రత్యర్థిచేతుల్లో చిన్న కత్తికనుక వున్నప్పుడు ఎదుర్కోవడం తటస్థిస్తే దాన్ని 'బాంక్' అనీ, ఒకటి రెండు గజాలగుడ్డ లేక రుమాలు చేతుల్లో వుంచుకున్న ప్రత్యర్థుల్ని ఎదుర్కోవలసివస్తే దాన్ని 'బిన్నొట్' అనీ అంటూంటారనే సంగతులు హైదరాబాద్‌లో అభిజ్ఞులవల్ల నేను తెలుసుకోగలిగాను. 'బిన్నొట్' కళాకారులుకూడా తమ శక్తిసామర్థ్యాలను గుప్తంగానే దాచుకొంటారు. అంతేకాదు, ఉన్నత కుటుంబీకులకే ఈ కళను నేర్పాలనీ, ఎన్నడూకూడా శక్తి శాలురపైనా లేక దుర్బలులపైనా బిన్నొట్‌ను ప్రయోగించకూడదని వస్తాదులు శిష్యులకుచెప్పి వారి అంగీకారాన్ని ప్రమాణరూపంలో తీసుకొని ఈ విద్యను నేర్పాలనీ ఒక ఒప్పందం వుండేది. బిన్నొట్ సాధకుల కండరాలు చాలా బలంగావుండేవి. ఇవి వయస్సుమళ్ళినవారికి ఉండడం అసాధ్యం. అంతేకాక బిన్నొట్ సాధకుడికి మానవశరీరంలో ఎక్కడెక్కడ ఏ యే నరాలు, కండరాలు వుంటాయో, దానిబాపతు సంపూర్ణజ్ఞానం వుండాలి. ఎక్కడ నొక్కితే, లేక ఎక్కడ చిన్నదెబ్బకొడితే ఎదుటిమనిషి కళ్లుతిరిగి స్పృహతప్పి పడిపోతాడో అవగాహన చేసుకోగలిగేపాటి సూక్ష్మ పరిశీలకుడైకూడా వుండాలి. ఈ బిన్నొట్ విద్యలో హైదరాబాద్ వస్తాదులదే పైచెయ్యి అయినప్పటికీ లక్నోలోకూడా తగి నంతమంది వస్తాదులు వుండేవారు. ప్రప్రథమంగా ఈ బిన్నొట్‌కళను రామ్‌పూర్ వస్తాదు 'ముహమ్మద్ ఇబ్రహీం ఖాన్' లక్నోలో ప్రవేశపెట్టాడని చెబుతారు. ఆ రోజుల్లో 'తాలిబ్ శేర్‌ఖాన్' అనే బాంక్ వస్తాద్‌ప్రభ లక్నోలో వెలిగిపోతూం డేది. కత్తియుద్ధంలో ఆయనను మించినవ్యక్తి ఎక్కడా లేడు. ఆయన ఇబ్రాహీమ్ ఖాన్‌నుగురించి విని కత్తియుద్ధానికి ఆహ్వానించాడు. ఇద్దరూ ఒకరోజున కలియ బడ్డారు. తాలిబ్ శేర్‌ఖాన్ కత్తి ఎత్తగానే ముహమ్మద్ ఇబ్రాహీం ఖాన్ పైసాకట్టిన

రుమాలును ఒడుపుగా ఎత్తికొట్టాడు. కత్తి పట్టుతప్పి దూరంగావెళ్ళి ఖంగుమంటూ క్రిందపడిపోయింది. తాలిబ్ శేర్‌ఖాన్ నోరుతెరచుకొని విస్తుపోయిచూస్తూ వుండిపోయాడు. ప్రేక్షకులంతా పరమానందంతో కరతాళధ్వనులుచేస్తూ వస్తాద్ మహమ్మద్ ఇబ్రాహీంఖాన్‌ను ప్రశంసించారు. లక్నోలో అయోధ్య ఆస్థాన పతనంవరకు ఈకళ బాగా ఆదరించబడింది. మటియా బుర్జ్‌లో, నవాబ్ మాశూక్ మహల్ అంతఃపుర రక్షణాధికారి 'ముహమ్మద్ మెహదీ' బిన్నోట్‌కళలో వస్తాద్‌గా మంచిపేరు తెచ్చుకొన్నాడు.

## ౫-కుస్తీ

ఈ కుస్తీ కళకూడా ఆర్యులదే. భారతదేశంలోను, ఈరాన్‌లోనూ ఇది బాగా అభివృద్ధి చెందింది. అరేబియా, టర్కీదేశాలు ఈ కళ నెరుగవు. భారతదేశంలో కూడా ఆర్యులకు ముందునుంచీ నివసించే ద్రావిడులు కుస్తీఅంటే ఏమిటో బొత్తిగా ఎరుగరు. లక్నోలో ప్రత్యర్థుల్ని చిత్తుచేసేపద్ధతులు, కిటుకులు వస్తాదులు నేర్చుకొని ప్రఖ్యాతి నార్జించారు. కాని కుస్తీవిజయం శారీరకశక్తిపై ఆధారపడివుంటుంది. లక్నో వాతావరణానికి శక్తివంతులయిన భీమకాయుల్ని ఉత్పన్నంచేసే సుగుణాన్ని ప్రకృతి ప్రసాదించింది. తనకంటె రెట్టింపు బరువుండే వ్యక్తుల్ని చిత్తుచేయగలిగే ఎత్తులను, కిటుకులను కుస్తీలో ప్రదర్శించడం లక్నోవారి విశేషత. కాని అంతకు మించి బరువుండేవ్యక్తులను చిత్తుచేయగలుగడం అసంభవం. శక్తిదృష్ట్యా కాకపోయినప్పటికీ ఎత్తుల, కిటుకులమూలంగా లక్నో వ్యాయామశాలల, వస్తాదుల గాథలు చాలా ప్రసిద్ధిచెందాయి. ఒకసారి నేను లక్నోలోని ప్రఖ్యాత వస్తాదు సయ్యద్ కుస్తీని చూశాను. ఆయన తనకు రెట్టింపు ఒడ్డూ, పొడుగూవున్న ఒక పంజాబీ వస్తాదుతో కుస్తీకి తలపడ్డాడు. ఈ కుస్తీ మొదటినుంచీ చాలా బాగుంది. వాళ్ళఎత్తులు, పైఎత్తులు చిత్తుచేసేందు కుపయోగించే కిటుకులు చాలా ప్రశంసనీయంగా వున్నాయి. ఒకగంటసేపు కుస్తీ జరిగింది. సయ్యద్ శరీరం చెమటతో స్నానంచేసినట్లు అయిపోయింది. ఆయనశక్తి పూర్తిగా సన్నగిల్లింది. చివరికి సయ్యద్ గోదా విడిచేసి బయటపడి తన ఓటమిని అంగీకరించాడు.

## 6—బల్లెం

ఆర్యులు, తురకలు, అరబ్బులలో ప్రాచీనకాలంనుండీ బల్లెంతో యుద్ధంచేసే పద్ధతులు అమలులో వున్నాయి. అరబ్బుల బల్లెం పొడుగ్గా, ములికిమొనగలిగి వుంటుంది. తురకలబల్లెం చిన్నదిగా ములికి శంఖాకారాన్ని కలిగివుంటుంది. భారత దేశపు ఆర్యులబల్లెం పొడుగుగా ములికి పలుచగా పదునైన తమలపాకు ఆకారాన్ని కలిగివుంటుంది. కాని మూడురకాల బల్లాలూ లక్నోలో వాడుకలోవుండడం ఆశ్చర్యకరమైన విషయం. పెద్దబల్లాలు అయిదడుగుల పొడుగు, చిన్నవి మూడడు గులపొడుగు వుండేవి. పెద్దబల్లాలలో వంగిపోయేగుణం ఏమాత్రం వుండకూడదు. పెద్దబల్లాలనూ, చిన్నబల్లాలనూ ప్రయోగించే పద్ధతులుకూడా వేరువేరుగా వుండేవి. బుహారాన్ ఉల్ ముల్క్ కాలంలోనే లక్నోలో సిసలయిన బల్లెపుయోధుడుగా 'మీర్ కల్లూ' ప్రఖ్యాతి నొందాడు. ఆయన అనంతరం 'మీర్ అక్బర్ అలీ' ఈ కళలో మంచిపేరు తెచ్చుకొన్నాడు. బరేలీ, రామ్‌పూర్‌లనుంచి ఆకాలంలో ఎందరో బల్లెపు యోధులు లక్నో చేరుకోసాగారు. గాజీ ఉద్దీన్ హైదర్‌కు ఏనుగులవేటపై అమిత మైనమోజు వుండేది. అందువల్ల ఆయన తన ఆస్థానంలో ఎందరో బల్లెపుయోధు లకు గౌరవప్రదమయిన పదవులిచ్చి ఆదరించారు. ఏనుగుల వేటలకే వారిసేవలు పరి మితమైవుండక యుద్ధాలలోకూడా ఎక్కువగా ఉపయోగపడుతూండేవి. ఈ ఆయు ధంతో గొప్పగొప్ప ప్రాచీనజాతులు యుద్ధకళలో పేరుప్రఖ్యాతు లార్జించాయి. నేటికీ లక్నోలో ఈ కళ కొద్దిగా మిగిలివుంది. కాని కేవలం ఇది పెళ్లి ఊరేగింపు లలోమాత్రం ఉపయోగపడుతోంది.

## 7—బాణా కర్ర

ఈ కళకూడా అన్ని నీచజాతులలోనూ ప్రచారంలో వుంది. కొంతవరకూ నేటికీ మిగిలివుంది ఇది. కర్రయుద్ధం దీనిలోంచే ఉద్భవించింది. బాణాకర్ర లేక దుద్దుకర్ర తిప్పుతూ యోధుడు తన శత్రువర్గం బారినుంచి బయటపడడమే బాణాకళ ధ్యేయం. పెద్దకర్రకి మారుపేరే బాణా. దీని కొకవైపున తొడుగుపుంటుంది. కొంత మంది కర్రకు రెండువైపులా తొడుగులు వేయిస్తారు. ఎవ్వరూ తనదగ్గరికి రాలే కుండాచేసే నిపుణతతో బాణాకర్రను తిప్పుతారు. పోటీదారులు తొడుగులకు గుడ్డ

చుట్టి బిగించి నూనెపోసి అంటిస్తారు. మండే బాణాక్రను తమ కే విధమయిన సెగ తగలకుండా మంచి నైపుణ్యంతో తిప్పుతూ ఆ మంటలతో శత్రువులను ఛేదించు కొని బయటపడగలుగుతారు.

## 8-ధనుర్విద్య

'బాణం' ప్రపంచంలోని అన్ని పరాక్రమవంతమైన జాతులలోనూ ప్రాచీన ఆయుధం. ప్రాచీనయుగంలో తుపాకీ అంత ప్రాముఖ్యంగలదీ అని చెప్పడం అతిశయో క్తికాదు. ఈ ధనుర్విద్యలో ఎన్నో అద్భుతాలు చూపించబడేవి. ఉన్నత, మధ్య, నిమ్నవర్గాలయోధులందరూ ఈ విద్య నేర్చుకొంటూండేవారు. శ్రీరామచంద్రుడు ధనుర్విద్యలో అందరినీ మించినవాడు కనుకనే సీతాదేవిని వివాహమాడగలిగాడు, రాక్షససైన్యాన్నీ రావణున్నీ చంపగలిగాడు. ఆరోజులలో ఇంతకుమించిన గొప్ప ఆయుధాలు చాలా తక్కువ. కాని తుపాకీ వచ్చాక విల్లంబుల విలువ వెనకబడింది. కాని యుద్ధకళదృష్టితోచూస్తే దీనిస్థానం ఉన్నతమైనదే అని ఒప్పుకోవలసి వుంటుంది. ఎంతో దృఢంగావుండే వింటిలో అంబులు పెట్టి కొట్టగలగడం అందరికీ సాధ్యమయ్యేపనికాదు. అయితే విల్లుబద్ద ఎంత గట్టిగావుంటే అంత ఎక్కువదూరం బాణాన్ని కొట్టవచ్చు. వేగంగాకూడా బాణం దూసుకుపోతుంది. అరబ్బులు విలు విద్యతో అనేకయుద్ధాలలో విజేతలయ్యారు; అద్భుతాలు చూపారు; ప్రజల్ని విస్మయపరిచారు. 'ఉమ్మేలబ్బాన్' అనే అరేబియాదేశపు యువతి ధనుర్విద్యలో ఘటికురాలనే పేరు తెచ్చుకొంది. వివాహమైన వారం పదిరోజులలో డెమాస్కస్‌పై దాడిలో ఆమెభర్త వీరస్వర్గమలంకరించాడు. ఆమె అందుకు ప్రతీకారచర్యగా తన బాణాలతో ముందు శత్రుధ్వజవాహకుని హతమార్చి శత్రు సైన్యాధిపతి సర్దార్ తామస్ కంటిపాపపై గురిచూసి ఒక అంబును కొట్టింది. గురి తప్పలేదు. కంటి పాపనుంచి ఎంత ప్రయత్నించినా ఆ అంబును పీకలేకపోయారు. చివరికి అంబును కోసి దానిమొనను కంట్లోనే వుంచివేయవలసి వచ్చింది.

అయోధ్య ఆస్థానానికిచెందిన 'పాంసీ', 'ఖర్' జాతులవాళ్ళు మొదటినుంచీ ఈ ధనుర్విద్యలో నిపుణులే. ఢిల్లీనుంచి ఆసఫ్ ఉద్దౌలా కాలంలో ఎందరో ధను ర్విద్యా పారంగతులు లక్నోకి చేరుకున్నారు. వారిలో 'ఉస్తాద్ ఫైజ్ బక్ష్' అగ్ర

గణ్యుడు. ఆయన పాదుషా కనుసైగతో, ఏనుగునెక్కి, వచ్చే 'మీర్జా హైదర్'గారి తంత్రిపై గురిచూసి బాణంవేశాడు. ఎవ్వరూకూడా ఆయన బాణంవేయడం చూడ లేదు. దెబ్బతిన్న పెద్దమనిషికికూడా తనను ఎవరు గాయపరచిందీ తెలియలేదు. ఆయన ఎల్లాగో ఇంటికి చేరుకొని పట్కా విప్పేసరికి డొక్కలోంచి చిచ్చుబుడ్డిలా రక్తం పైకిచిమ్మి కొద్దిసేపట్లో మరణించాడు. ఈ కళను నేర్పడం, నేర్చుకోవడం కూడా చాలా శ్రమతో కూడిన పనులు. అగ్నిని వర్షింపగలిగే ఆయుధాలఉత్పత్తి జరిగిన ఈ రోజులలో నాగరికజాతులలోంచి ఈ ధనుర్విద్య అంతర్ధానమైపోయింది. కాని భారతదేశంలోమాత్రం ఆటవికజాతులు జంతువుల వేట, శత్రుసంహారాల నిమిత్తం ఇప్పటికీ ఈ ధనుర్విద్యనే ఆశ్రయించుకొని ఉన్నారు. వారిలో ఈనాడూ అద్భుతంగా గురిచూసి కొట్టగలిగే నిపుణులున్నారు.

## 9-కటారి

కటారి (చిన్నకత్తి) ఆర్యజాతి ఆయుధం. కాని కాలక్రమేణా 'బందిపోటు దొంగలు' దీన్ని తమ స్వంత ఆయుధంగా చేసేసుకున్నారు. ముఖాముఖీగా ప్రత్యర్థిని ఈ ఆయుధంతో ఎదుర్కొనగలగడం తేలికకాదు. కాని ఏమరుపాటులోవున్న వ్యక్తిపై ఈ ఆయుధాన్ని ఉపయోగించి గాయపరచి దొంగతీసుకోవడం తేలిక. అందుకే నాగరికవ్యక్తులు ఈ కటారిని ఉపయోగించడానికి ఇష్టపడరు. చాలామంది కటార్లను తమదగ్గర అట్టేపెట్టుకుంటూ తిరుగుతారు. అయితే వాళ్ళకు దీన్ని ఉపయోగించడం, దీనితో ఎదుర్కొనడం బొత్తిగా తెలియదు. శత్రువును లేక ధనవంతులను కటారినిచూపి భయపెడుతూ తమవశంచేసుకొని తమపని తీర్చుకోవడానికే ఉపయోగిస్తారు. అంతేకాని దీనితో గాయపరచరు. అందుకే దొంగలు రాత్రి నిద్రపోయేవ్యక్తులను దీనితో అదుపులోపెట్టుకొని దొంగతనంచేసి పారిపోతూంటారు.

## 10-జల యుద్ధం

భూమిపై కత్తిసాము పద్ధతిలోనే నీటిలో పోరాటం జరగడాన్ని, జలయుద్ధ విద్య అంటారు. రహస్యంగా జలాశయాలలో దాగివున్న శత్రువును ఈదుకొంటూ వెళ్ళి పట్టుకొని అతణ్ణి వశపరుచుకోవడం లేదా నీటిలోనే చంపివేయడం ఈ విద్య

ధ్యేయం. చరిత్రలో ఈ కళనుగురించినవివరాలు లేకపోయినప్పటికీ అయోధ్య ఆస్థానంలో 'ఉస్తాద్ మీరక్ జాన్' అనే ఈతగాడు ఈవిద్యను ప్రవేశపెట్టాడు. ఎందరో శిష్యులకు ఈవిద్య నేర్పాడు. నిజానికి లక్నోలోనే ఈవిద్య ప్రారంభమైంది. నేడుకూడా ఈతలోని కొన్ని మెళకువలు ఇక్కడివస్తాదులే ఎరుగుదురు.

'ఈత'లో లక్నో సాధించిన ప్రగతినిగురించి ముందు అధ్యాయాలలో వివరిస్తాను.

# 16

'వార్ధక్యంలో మనుష్యుల 'కామేచ్ఛ' నాలుకలపై నాట్యమాడుతుంది' అని ఉర్దూలో ఒక లోకోక్తి వుంది. అలాగే వయస్సుమళ్ళిన, శక్తిఉడిగిన పూర్వాశ్రమంలో యోధులుగా చెల్లిన ముసలివీరుల శూరత్వం, వీరత్వంకూడా చేతుల్నివీడి నాలుకల్లో ప్రవేశిస్తాయి. వాళ్ళు తరుచు యవ్వనంలో తాము ప్రదర్శించిన సాహసాలను, యుద్ధకుశలతనూ గురించి వీలైనంత ఎక్కువమందితో చెప్పుకుని మురిసిపోతూంటారు. అంతేకాకుండా జంతువుల పోట్లాటలవంటివి ఏర్పాటుచేసి దానిసాకుతో వీరత్వాన్ని, యుద్ధపద్ధతుల్నిచూసి, ఇతరులకు చూపిస్తూ తమ అనుభవాలను అప్పుడప్పుడు జోడిస్తూ గెలిచే జంతువుల్ని ప్రశంసిస్తూంటాడు.

లక్నోలోకూడా సరిగ్గా ఇలాగే జరిగింది. అయోధ్య ఆస్థానానికి యుద్ధాల అవసరం తీరినతరువాత, యుద్ధంచేసేశక్తి సామర్థ్యాలు ఉడిగిపోయాక, వాళ్ళ యుద్ధవాంఛ జంతువులచేత పోరాడించి వాటివీరత్వాన్ని, రక్తప్రవాహాన్నిచూసి ఆనందించడం వైపు మళ్ళింది. ఇటువంటిమోజు ఇతరచోట్ల కొద్దికొద్దిగా వున్నప్పటికీ, లక్నో వాళ్ళకు ఈవిషయంలో వున్నంతఅభిరుచి, నోరులేనిజంతువుల్ని క్రూరంగా ఈ యుద్ధపిశాచానికి గురిచేసి వాటి రక్తపాతాన్నిచూసి ఆనందించాలనే దాహం మరెక్కడా లేదు. అయితే బాగా ఆలోచించిచూస్తే ఇటువంటి అద్భుతాలు, తమాషాలు లక్నోలోను, లక్నోకు సమీపప్రదేశాలలోను తప్ప ఇంకెక్కడా ప్రదర్శింపబడేవికావు.

భారతదేశంలోని ఢిల్లీవంటి గొప్పనగరాలలోనేకాదు. బహుశః ప్రపంచంలో కూడా ఇటువంటి అద్భుతాలు, తమాషాలు జరిగివుండవు.

అన్యుల వీరత్వంతో తమ హృదయపిపాసను తీర్చుకోవడంకోసం లక్నోలో ముఖ్యంగా మూడురకాలయిన పోటీలు ఏర్పాటుచేయబడ్డాయి. 1. క్రూరమృగాల, పశువుల పోట్లాటలు; 2. పక్షులను పోట్లాడించడం; 3. గాలిపటాల పందాలు. ఈ మూడింటినిగురించి నాకు తెలిసినంతలో మీకు వివరిస్తాను.

1. సింహాలు, 2. చిరుతపులులు, 3. నల్ల చిరుతపులులు, 4. ఏనుగులు 5. ఒంటెలు, 6. ఖడ్గమృగాలు, 7. కొమ్ముల దుప్పులు, 8. పొట్టేళ్ళు.

జంతువులను పోట్లాడించేమోజు ప్రాచీనభారతదేశంలో ఎక్కడా ఎప్పుడూ ఉన్నట్లు వినలేదు. ఇది నిజానికి రోమ్‌దేశంనుంచే మనకు సంక్రమించింది. మనుష్యుల్ని-జంతువుల్ని, మనుష్యుల్ని-మనుష్యుల్ని, జంతువుల్ని-జంతువుల్ని పరస్పరం పోట్లాడించడం అక్కడి అభిరుచి. క్రైస్తవమతం ప్రబలిన తరువాత అక్కడకూడా ఈ అభిరుచి తగ్గిపోయింది. కాని నేటికికూడా స్పెయిన్ మున్నగు దేశాలలో అడవి ఆబోతుల్ని రంగంలో వదిలి పరస్పరం పోట్లాడిస్తూంటారు. ఒకొక్కప్పుడు అడవి ఆబోతునీ, మనిషినీపెట్టి పోట్లాడిస్తూంటారు. లక్నోలో బహుశః గాజీ ఉద్దీన్ హైదర్ పాదుషాగారి ఐరోపీయమిత్రులు అడవిజంతువుల పోట్లాటలపై అభిరుచిని కలుగచేశారు. వెంటనే పాదుషా క్రూరమైన, శక్తిపాతి పూరితమైన అడవిజంతువులపోట్లాటకు భారీఎత్తున ఏర్పాటుచేశాడు. మోతీమహల్లో సరిగ్గా నది ఒడ్డున ముబారక్ మంజిల్, షాహ్ మంజిల్ పేర్లతో ఆయన రెండు క్రొత్తభవనాలని కట్టించాడు. వాటికెదుట నదికి అవతలిఒడ్డున మైళ్ళకొద్దీ వైశాల్యంలో సుందరమైన ఉద్యానవనాలను వేయించాడు. ఆ ఉద్యానవనాలలో ఇనుప కటకటాలతో ఎన్నో బోనులు నిర్మించాడు. మిగతాస్థలాన్ని పచ్చగడ్డిమైదానంగా వుంచాడు. ఆ మైదానంలో వేలకొద్దీ జంతువులను తెప్పించి వదిలేశాడు. ఇనుప కటకటాల బోనులలో క్రూరజంతువులను బంధించివుంచే ఏర్పాటుచేశాడు. ఈ మైదానంలో నదిఒడ్డున క్రూరజంతువులపోట్లాటకై పెద్దపెద్ద గోదాలను ఇనుప కటకటాలతోను, వెదుళ్లతోను నిర్మింపచేశాడు. అవి షాహ్ మంజిల్‌కు సరిగ్గా ఎదుట నదికి అవతలిపక్క వుండేవి. అక్కడ నది వెడల్పు అట్టే ఎక్కువ వుండేది కాదు.

పాదుషా తన అతిథులు, ఉద్యోగులతోబాటు షాహ్ మంజిల్ డాబాపైన రంగు రంగుల 'షామియానా' (గుడ్డతో ఏర్పరచిన పందిరి)లో విశ్రాంతిగాకూర్చుని అవతలిగట్టున మైదానంలో అడవిమృగాలమధ్య జరిగే ఘోరయుద్ధాన్నిచూపి ఆనందిస్తూండేవాడు. క్రూరమృగాలను, ఏనుగులను పోట్లాటకు ఆయత్తపరచడం తేలికే. కాని అవి కటకటాలను ఛేదించుకొని ఊళ్ళోకనుక ప్రవేశిస్తే వాటిని అదుపులో పెట్టగలగడం ఎంతో శ్రమతోకూడుకొన్న వ్యవహారం. వాటిని అదుపులో పెట్టలేకపోతే విపరీతమైన జన, ధన, హాని కలుగుతుంది. కాని లక్నోలోని క్రూరమృగ పాలకులు వాటిని అదుపులోపెట్టడంలో చాలా నిపుణులు. వారి నిపుణతను మన దేశస్థులేకాక ఐరోపీయులుకూడా ప్రశంసిస్తూండేవారు.

'అడవి జంతువుల్ని మచ్చిక చేసుకోవడం, సంరక్షించడం మున్నగు పనులలో లక్నో నిపుణులను మించినవారు ప్రపంచంలో మరెక్కడా లేరు. ఈ నిపుణులే ఏనుగులను, క్రూరమృగాలను యుద్ధరంగంలోకి తెచ్చి వదుల్తూంటారు. వాటిని సదా అదుపులో వుంచుతారు. ఓడిన క్రూరమృగాలను, గెలిచిన క్రూరమృగాలను వశపరచుకొంటూ ఉంటారు. ఈ పనులకైన నిపుణులు కొరడాలనూ, బల్లాలనూ ఉపయోగిస్తారు. వాటి క్రూరచర్యలకు బలి అయిపోకుండా తమను తాము కాపాడుకోవడానికీ, చెప్పినట్లు అవి నడచుకోవడానికి కొరడాలు, బల్లాలు వారి చేతుల్లోవుంటాయి. నిప్పుతో కాలి కణకణలాడే ఇనుపకడ్డీలను, బాణాకాయలను చేతిలో ఉంచుకొని క్రూరమృగాలను ఇష్టమొచ్చినచోటికి మళ్లిస్తూ ఇష్టమొచ్చినచోటికి తోలుకుంటూ వెళతారు: సింహాలనూ, నల్ల చిరుతపులులనూ ఇనుపబోనులలో బంధిస్తారు. నిపుణులయిన మృగపాలకుల సాహసం, చలాకీతనం, నడకలోని హుందాతనం, మెళకువతోనిండిన చురుకుతనం మొదలయినవి క్రూరజంతువులయుద్ధంకంటె ఎక్కువ మనోహరంగాను, ఆశ్చర్యకరంగాను కన్పిస్తాయి. నిపుణులలోని ఈ లక్షణాలను పరిశీలిస్తే భయానక బలాఢ్య క్రూరమృగాలను మానవుడు ఏ తీరున వశపరచుకోవచ్చునో అవగతమౌతుంది' అని ఆ కాలంలో లక్నోవచ్చిన విదేశపర్యటకుడొకాయన తనగ్రంథంలో ఉల్లేఖించాడు.

ఇంక ఆ జంతువుల యుద్ధాలపద్ధతుల్నిగురించిన వివరాలు వింటే వీనులకు విందుగా వుంటుంది.

## 1 సింహం

పాదుషా చాలా సింహాల్ని తెప్పించివుంచాడు. వీటిని నేపాల్ లోయలలోంచి వేటాడించి తెప్పించాడు. వీటిలో కొన్ని చాలా పెద్దవి. కొన్ని, యుద్ధాలలో గెలిచి పాదుషాకి ప్రీతిపాత్రమయ్యాయి. ఇనుపబోనులలో వుంచబడిన సింహాలు యుద్ధ రంగంలోకి బోనులతోనే రప్పించబడతాయి. వాటిని నిర్ణీతసమయంలో తలుపులు తెరిచి వదులుతారు. తలుపులుతెరవగానే రెండుసింహాలు భయంకరంగా గర్జిస్తూ కయ్యానికి తలబడతాయి. పళ్ళతోటీ, పంజాలతోటి ఒకదాన్నొకటి గాయపరచు కొంటూ కట్టకట్టుకొని పోట్లాడతాయి. కొంతసేపు ఒకటి రెండోదాన్ని పడగొట్టి దానిపైకి ఎక్కి కూర్చుంటుంది. మరికొంతసేపు క్రిందవున్నసింహం గింజుకొని పైదాన్ని పడగొట్టి దానిపైకి ఎక్కి కూర్చుంటుంది. ఈవిధంగా చాలాసేపు భయం కరయుద్ధం జరుగుతుంది. ఒకొక్కప్పుడు బలవంతమైన సింహంచేతిలో బలహీన మయిన సింహం హతమారిపోతుంది. ఒకొక్కప్పుడు బలమయినగాయాలుతగిలి ధైర్యాన్నికోల్పోయి రక్తం విపరీతంగా స్రవించిపోతూండగా పారిపోయేందుకు ప్రయత్నిస్తుంది. కాని విజేత దాన్ని వదలదు. అటువంటప్పుడు సింహపాలకులు ఆ రెండుజంతువుల్ని విడదీసి యథాస్థానాలలో వాటిని బంధించేందుకు పడే తాప త్రయాన్ని, చురుకుతనాన్ని, సాహసాన్ని, అద్భుతమైన ప్రతిభనీ చూపితీరవలసిందే కాని వ్రాయ నలవికాదు.

సింహాలను తరుచు నల్ల చిరుతపులులతో పోట్లాడించేవారు. లక్నోలో చాలా బలిష్ఠమయిన నల్ల చిరుతపులులుండేవి. వాటి బలంముందు సింహాలబలం అప్పు డప్పుడు ఎందుకూ పనికిరాకుండా పోతూండేది. సింహాలు రెండూ దెబ్బలాడుకొనే ప్పుడు జరిగే తంతే సింహం, నల్ల చిరుతపులుల పోట్లాటలోనూ జరుగుతుంది. అప్పుడప్పుడు ఏనుగులకూ సింహాలకూమధ్య పోట్లాటలు పెడుతుండేవారు. ఏను గులపోషణ బాగా జరిగివుంటే సింహాన్ని ఏనుగు తేలికగా లొంగదీసేది. ఎన్నో సార్లు ఈ రెండిటిమధ్య జరిగేయుద్ధాలలో ఆశ్చర్యకరమైన ఫలితాలు కలిగాయి. సింహానికి, ఖడ్గమృగానికిమధ్య జరిగేయుద్ధం అన్నిటికంటే ఎక్కువ మనోహరంగా వుండేది. ఖడ్గమృగానికి కడుపుతప్ప మిగతా క్రింది శరీరభాగమంతా ఉక్కు ముక్కలా గట్టిగా వుంటుంది. అందువల్ల సింహం దంతాలుకాని పంజాలుకాని

ఉక్కులాంటి ఖడ్గమృగం శరీరాన్ని ఏం బాధించలేకపోయేవి. ప్రకృతిసిద్ధమయిన బలగర్వంతో ఖడ్గమృగం ఎంత బలిష్ఠమయిన క్రూరజంతువునైనాసరే బొత్తిగా లక్ష్యపెట్టదు. అది తలవంచి ప్రత్యర్థి కడుపుక్రిందకుదూరి తన వెన్నెముకపైనుండే వాడికొమ్ముతో ఒక్క పోటుపొడిస్తే ప్రత్యర్థిప్రేగులు ఒక్కసారిగా బయటికి వచ్చేస్తాయి; వెంటనే దాని ఇహలోకయాత్ర పూర్తి అయిపోతుంది. ఎప్పుడోకాని సింహానికి ఖడ్గమృగాన్ని జయించేఅవకాశం దొరికేదికాదు. సాధారణంగా ప్రతిసారి ఖడ్గమృగం తనకొమ్ముతో సింహాన్నిపొడిచి తేలిగ్గా చంపేస్తూండేది.

పాదుషా నసీర్ ఉద్దీన్ హైదర్‌కాలంలో ఒకసారి ఒకగుర్రంమూలంగా సింహాలకు చాలా నష్టం వాటిల్లింది. మనుష్యులను కష్టపెట్టడంలో అడవిజంతువులను తలదన్నే క్రూరత్వంగల ఒక వింతగుర్రం పట్టుబడింది. ఎవరికీ దాన్ని అదుపులో పెట్టగలగడం సాధ్యమవలేదు. దానికి తగినంతదూరంలోవుంటే దాణా అందించవలసివచ్చేది. అది అప్పుడప్పుడు తప్పించుకొని ఎంతోమందిని క్షణాలమీద చంపేసేది. ఎదుటపడే మనుషుల్ని నిర్దాక్షిణ్యంగా చంపేసేది. ఎముకల్నీ, వెన్నెముకనీ చెరుకుముక్కల్లా నమిలి పిప్పిచేసి పారేసేది. శవాలు ఆనవాలు పట్టేందుకుకూడా వీలులేకుండా వికృతంగా తయారయేవి. ఇంక లాభం లేదనుకొని దాన్ని సింహం చేత చంపించేయాలని నిర్ణయించబడింది. పాదుషాకు ఎంతో ప్రీతిపాత్రమైన 'భూరియా' అనేసింహాన్ని దానిమీదికి వదిలారు. భూరియా ఎన్నో ఏనుగులనూ, ఖడ్గమృగాలనూ పోట్లాటలో పొట్టనుపెట్టుకొన్న శక్తిగల సింహం! ఆ గుర్రం సింహాన్నిచూసి ఏమాత్రం భయపడలేదు. అది సింహాన్ని ఎదుర్కొనేందుకు ధైర్యంగా నిలబడింది. సింహం ఒక్కదుముకుతో గుర్రం వీపుపై కెక్కికూర్చుంది. గుర్రం తన శరీరంలోని అగ్రభాగాన్ని చటుక్కున నేలమీదకువంచి ఒక్క కుదుపుతో సింహాన్ని క్రిందికి పడగొట్టేసింది. సింహం క్షణంలో సర్దుకొని లేచినిలబడి గుర్రం ముడ్డిమీద పంజాతో గట్టిగా కొట్టింది. వెంటనే గుర్రం వెనకకాళ్ళతో సింహాన్ని ఒకే ఒకతాపు తన్నింది. సింహం పల్టీలు కొట్టుకొంటూ దూరంగావెళ్ళి పడింది. అయితే కొద్దిక్షణాలలోసర్దుకొని సింహం ఇటూ అటూచూస్తూ గుర్రం మీదకి మళ్ళీ దుమికింది. గుర్రం మళ్ళీ తన అగ్రభాగాన్నివంచి సింహాన్ని పడగొట్టేందుకు ప్రయత్నించింది. అయితే సింహం గుర్రం పిక్కలమీద చాకుల్లాంటి

పంజాతో దరువువెయ్యడం మొదలుపెట్టింది. ఇంక గుర్రమే సింహంతోసహా పట్టీలుకొట్టడం ప్రారంభించింది. సింహం దవడలు అప్పళ్లా ఊడిపోయాయి. సింహం దూరంగావెళ్ళి చిత్తుగా పడిపోయింది. ఈ దెబ్బలతో అది ధైర్యాన్ని పూర్తిగా కోల్పోయి గుర్రానికి వీపుచూపిస్తూ పారిపోయింది/ ప్రేక్షకులు ఆశ్చర్య పోయారు. ఆ తరువాత గుర్రంమీదకి మరో పెద్దసింహాన్ని ఉసిగొల్పేరు. ఆ పెద్ద సింహం అసలు గుర్రంకంట పడేందుకే భయపడిపోయింది. విధిలేక ఆ పెద్ద సింహాన్ని బోనులోకి యథాప్రకారం చేర్చేశారు. అనంతరం మూడు అడవి ఎను బోతుల్ని గుర్రంముందు వదిలారు. పాపం, అవికూడా గుర్రాన్ని ఎదిరించేందుకు సాహసించలేకపోయాయి. ఐతేనేం, ఎవ్వరూ రెచ్చగొట్టకపోయినా గుర్రం అడవి ఎనుబోతులలో ఒకదానిమీదికి ఒక్కుదుముకుదుమికి దాన్ని మూడుపట్టీలు కొట్టిం చింది. పట్టీలుకొట్టిన ఎనుబోతు సహచరులు ప్రశంసిస్తున్నభంగిమలో తలలు ఊప సాగాయి. చివరకు విధిలేక గుర్రాన్ని యుద్ధరంగంలోంచి బయటకి తీసుకు వెళ్ళి పోయారు.

'నేను దీనికోసం ఒక కటకటాలబోను తయారుచేయిస్తాను. దీన్ని జాగ్రత్తగా పోషించేందుకు తగిన సదుపాయాలు సమకూరుస్తాయి. నాన్నగారితోడు, ఇది చాలా పరాక్రమవంతమైన గుర్రం!' అన్నాడు నసీరుద్దీన్ హైదర్./

## 2 చిరుత పులి

పోట్లాడించేందుకు ఒకటి రెండు రోజులముందునుంచీ అడవిమృగాలకు ఆహార మివ్వడం మానేస్తారు. కాని చిరుతపులుల విషయంలో గమనించతగిన ప్రత్యేక విషయం మరొకటి వుంది. అది రక్తపిపాసగల క్రూరమృగమే. అయితే అప్పు డప్పుడు ఎంతో పిరికితనంతో ప్రవర్తిస్తుంది. చెడిపోయిన ధనవంతునిలా చిరుత పులి పొగడ్తలంటే మోజుపడుతుంది. దాని కిష్టముంటేనే యుద్ధరంగంలో అది పోట్లాడుతుంది, దాని కిష్టంలేనప్పుడు లక్షప్రయత్నాలుచేసినా అది పోట్లాటకు దిగదు. ప్రత్యర్థి పోట్లాటకు తయారుగావుండని సమయాన్ని కనిపెట్టి అది దొంగచాటున హఠాత్తుగా మీదపడుతుంది. మొదట పైకిదుమికి పరస్పరం గాయపరచుకొనే ప్రయత్నాలు జరుగుతాయి. ఇలా ఒకటి రెండు దూకుళ్లు జరిగేక వెనకకాళ్ళమీద

నిలబడి పంజాలతో కొట్టుకొంటాయి. ఇది రక్తపాతం ఎక్కువగా అయ్యే పోట్లాట. రెండూ కోపంతో గుర్రుమంటూ, పంజాలతో కొట్టుకుంటూ పోట్లాడతాయి. చివరికి బలమైన చిరుతపులి బలహీనమైనదానిని చిత్తుచేసి పంజాతో కొట్టికొట్టి చంపేస్తుంది. అయితే విజేతకూడా ఆపాదమస్తకం గాయాలతో, రక్తంతో అతి భీభత్సంగా తయారై పోతుంది.

## 3 నల్ల చిరుతపులి

చూసేందుకు ఇవి చిన్న ఆకారంగల సింహాలలావుంటాయి. లక్నోలో తరుచు సింహాలతో పోట్లాడేవి ఈ నల్ల చిరుతలే. ఇవి అతి భయంకరంగా పోట్లాడేవి. ఎన్నోసార్లు వీటిచేతుల్లో సింహాలు చావుదెబ్బలుతిని ఓడిపోతూండేవి. నల్ల చిరుత పులులపోట్లాట అచ్చంగా సింహాల పోట్లాటలులాగే వుండేవి. ఈ పోట్లాటలలో రెండుమృగాలూకూడా ఎక్కువగా గాయపడేవి. ఓడిపోయినమృగం తరుచు యుద్ధ రంగంలోనే వీరస్వర్గ మలంకరించేది; ఎప్పుడో కాని తోక ముడుచుకొని పారి పోయే పిరికితనం చూపేవికావు.

## 4 ఏనుగు

లక్నోలో ఏనుగులపోరాటం చూసేందుకు అందరూ మోజుపడుతుండేవారు. ఈపోరాటం ఎంతో గంభీరంగాను, భయంకరంగానూ వుండేది. పాదుషా నసీర్ ఉద్దీన్ హైదర్ కాలంలో నూటఏభై యుద్ధగజాలు వుండేవి. అవి కేవలం పోట్లా టల నిమిత్తమే కేటాయించబడ్డాయి. ఊరేగింపులకూ, ఇతరకార్యాలకూ వాటిని ఎప్పుడూ ఉపయోగించేవారుకాదు. పోట్లాటకు మదమెక్కిన ఏనుగులనే ఉపయో గించాలి. లేకపోతే వాటిలో పోట్లాడాలనే యావ ఏర్పడదు. ఒకవేళ బలవంతంగా వాటిని ఉసికొలిపి పోట్లాటకు పంపినప్పటికీ శత్రువును ఓడించి తాను గెలుద్దామనే దృష్టితో అది పోట్లాడదు; నిజమైన ఆవేశం, ఆగ్రహం దానిలో ఏర్పడదు. అందు వల్ల ప్రేక్షకులఆసక్తి చప్పబడిపోతుంది.

పోట్లాట సమయంలో ఏనుగు మెడదగ్గరనుంచి తోకవరకూ ఒకత్రాడు కట్టబడి వుంటుంది. గట్టిగా ఘీంకరిస్తూ తొండాలనూ, తోకలనూ పైకెత్తిపెట్టుకొని అవి పరస్పరం ఢీకొంటాయి. వాటి ఘీంకారాలు ఎంతోదూరంవరకూ వినిపిస్తాయి. అనం

తరం అవి ఒకదానిముఖాన్ని ఒకటి గుద్దుకొని, దంతాలపై దంతాలను ఆనించి తోసుకోవడం మొదలుపెడతాయి. వాటికేకీరాలు చుట్టు తిరగడాన్నిబట్టి అవి యెంత గట్టిగా పోట్లాడుకుంటూన్నదీ అంచనా వేసుకోవచ్చును. మావటీళ్ళు అంకుశాలతో పొడిచి పొడిచి పోట్లాటను పరాకాష్ఠకు తీసుకొచ్చేందుకు ప్రయత్నిస్తుంటారు. చివరికి బలహీనమైన ఏనుగు, నెట్టుళ్ళను, దంతంపోట్లను సహించుకోలేక నేలమీద పడిపోతుంది. గెలిచిన ఏనుగు తన దంతాలతో ఓడిపోయిన ఏనుగు కడుపునుచీల్చి చెండాడి చంపేస్తుంది. సాధారణంగా ఓడిపోయేస్థితికి గురిఅయిన ఏనుగు పారిపోవడానికి ప్రయత్నిస్తుంది. గెలిచినఏనుగు దాన్ని తరుముకుంటూ వెడుతుంది. దొరికితే దానిమీదికి లంఘించి పడగొట్టి, దంతాలతో పొట్టచీల్చి చంపేస్తుంది. దొరక్కపోతే ఓడిపోయిన ఏనుగు బతికిపోతుంది.

లక్నోలో తరచు ఏనుగులకు ఖడ్గమృగాలకు మధ్య పోట్లాటలు జరుపుతూండేవాళ్ళు. కాని సాధారణంగా ఆ రెండు విభిన్నమృగాలు పోట్లాటకు సిద్ధపడేవికావు. అయితే దెబ్బలాటకు సిద్ధపడితేమాత్రం అతిఘోరంగా పోట్లాట జరిగేది. ఎప్పుడైనా ఏనుగు ఖడ్గమృగాన్ని దొర్లించడం సంభవిస్తే ఏనుగుదంతాలు ఖడ్గమృగం కడుపులోదిగి ఖడ్గమృగం చచ్చిపోతూండేది. ఇందుకు విరుద్ధంగా ఖడ్గమృగానికే ఏనుగుకడుపు వాటంగా చిక్కితే ఏనుగుచర్మం చాలాభాగం చీల్చుకుపోయేది. కాని ఖడ్గమృగం కొమ్ముల్ని తన శరీరంలోకి ఎక్కువలోతుగా గుచ్చనీయకుండా ఏనుగు తన తొండంతో తన్ను తాను రక్షించుకొంటూండేది.

## 5 ఒంటె

ప్రపంచంలో ప్రతిజీవీ అన్యజీవులతో పోట్లాడేందుకు ప్రయత్నిస్తుంది; కాని ఒంటెమాత్రం పోట్లాటకు దిగేరకం కాదు. ఇటువంటి వింత మనస్తత్వంగల జంతువులు ప్రకృతిలో చాలా అరుదుగా వుంటాయి. కాని లక్నోలో ఒంటెలను బాగా పోషించి, మదమెక్కేలాచేసి వాటినికూడా పోట్లాటకు ఆయత్తపరుస్తూండేవారు. ఒంటెపట్టు ఉడుంపట్టులాంటిదని ప్రసిద్ధి. అది పడిపోయిందంటే దానికి ఓటమి దాపురించిందనుకోవలసిందే. కాలుదువ్వుతూ నోట నురుగులు కక్కుతూ వుంటే ఒంటెకు ఆవేశం వచ్చిందనుకోవాలి. ఒంటెలు నురుగులు కక్కుతూ ఒకదాన్ని ఒకటి తిట్టుకొంటాయి. ఒకదాని మొహంమీద ఒకటి ఉమ్మేసుకొంటాయి.

నోటినుంచి నురుగు చిమ్మడంతో పోట్లాట ప్రారంభమవుతుంది. అవకాశం దొరక గానే ఒంటె తన ప్రత్యర్థియొక్క వేళాడే క్రిందిపెదవిని పళ్ళతో పట్టుకొంటుంది. ఇంక లాగడం ప్రారంభిస్తుంది. పెదవిని దొరకపుచ్చుకొన్న ఒంటె గెలిచినట్లు, తనపెదవిని శత్రువు పళ్ళకు దొరకనిచ్చి క్రిందపడిపోయిన ఒంటె ఓడిపోయినట్లు భావించబడుతుంది. అంతటితో ఆ పోట్లాట అంతమవుతుంది.

## 6 ఖడ్గమృగం

ఖడ్గమృగంకంటె శక్తివంతమైన మృగం ఈ సృష్టిలో లేదు. అది ఆకారంలో సింహం, ఏనుగుకంటె చిన్నది. కాని దానిశరీరం ఇనుప కవచంలా వుంటుంది కనుక ఏనుగు దంతాలుగాని, సింహం పంజా గోళ్ళుకాని దాన్ని ఏం చెయ్యలేవు. అయితే దాని కడుపుక్రింద చర్మంమాత్రం మెత్తగా వుంటుంది. ఏదైనా జంతువు దాన్ని ఎదుర్కొని ఉపాయంగా దానికడుపును చీల్చగలిగితే అది చస్తుంది. కాని సాధారణంగా దాని శత్రువులు ఖడ్గమృగం పొట్టలో పొడవలేవు. పొడిచేందుకు చేసే ప్రయత్నంలోనే అవి తమశక్తినంతా ఉపయోగించి అలిసిపోతాయి. అప్పుడు ఖడ్గమృగం అతి తేలికగా ప్రత్యర్థిని తన వాడికొమ్ముతో పొడిచిపొడిచి చంపేస్తుంది.

లక్నోలో ఖడ్గమృగాలచేత, ఏనుగులతోను, సింహాలతోనూ, నల్ల చిరుతపులుల తోను, అన్య ఖడ్గమృగాలతోనూ పోట్లాడిస్తూండేవారు. గాజీ ఉద్దీన్ హైదర్ కాలంలో కొన్ని ఖడ్గమృగాలను మచ్చికచేసి వాటిని బళ్లు లాగించడానికి, వాటిమీద అంబారీవేసి ఏనుగుమీదవలె స్వారీ చేయడానికికూడా ఉపయోగిస్తూండేవారు. ఖడ్గ మృగంప్రకృతి సిద్ధంగా పోట్లాడేస్వభావం కలదికాదు. వీలైనంతవరకూ కొట్లాటల నుంచి తప్పించుకొనేందుకే ప్రయత్నిస్తుంది. కాని వాన్ని రెచ్చగొడితేమాత్రం ఎదుర్కోడానికి సిద్ధపడి అతిక్రూరంగా మారిపోతుంది. నసీర్ ఉద్దీన్ హైదర్ కాలంలో 'చాంద్ గంజ్'లో పదిహేనో, ఇరవయ్యో ఖడ్గమృగాలు పోట్లాట నిమిత్తం వుండేవి. ఖడ్గమృగపాలకులు వాటిని తరిమి పోట్లాటకి ఆయత్తపరచి నప్పుడు అవి తలవంచుకొని వేగంగా పరిగెత్తుకొచ్చి ఒకదాన్నొకటి ఢీకొంటూ ఘోరంగా పోట్లాడేవి. అవి ప్రత్యర్థిపొట్టనుచీల్చి చెండాడేందుకు గట్టిప్రయత్నం చేస్తూండేవి. కొమ్ములతోటీ, ముఖాలతోటీ ఒకదాన్ని ఒకటి కుమ్ముకుంటూ, నెట్టు

కుంటూ అరుచుకుంటూ చాలా సేపు పోరాడుతూండేవి. శక్తిని కోల్పోయిన ఖడ్గమృగం రంగంలోంచి మెల్లిగా నిష్క్రమించేందుకు ప్రయత్నించేది. కాని గెలిచిన ఖడ్గమృగం తరిమి తరిమి దాన్ని కొట్టేది. చివరికి శక్తిని కోల్పోయిన ఖడ్గమృగం పోటీని విరమించుకొని చాలా వేగంగా పారిపోయేది. యుద్ధరంగం చిన్నదయితే ఓడిపోయినదాని పొట్టలో కొమ్ముతో కుమ్మి చంపేయడం గెలిచినదానికి తేలికే. కాని యుద్ధరంగం విశాలంగావుంటే ఓడిపోయినది చాలా వేగంగా పరిగెత్తుకుపోయి ప్రాణాలు కాపాడుకోగలిగేది. ఖడ్గమృగపాలకులు గెలిచినదానిని అదుపులో పెట్టేందుకు గట్టిప్రయత్నంచేస్తేనే సాధారణంగా ఓడిపోయినదాని ప్రాణాలు దక్కడం సంభవమయ్యేది. ఖడ్గమృగాల చావు బ్రతుకులు లేక గెలుపు ఓటములు అవి తమ కడుపును తలవంచుకొని కాపాడుకోవడంపై ఆధారపడివుంటుంది. పొరపాటునైనా సరే ఒక్కసారి తల ఎత్తిందో అది శత్రువుచేతిలో చచ్చిందన్నమాటే! ఒకసారి ఇటువంటిపోట్లాటలో గెలిచిన ఖడ్గమృగం విజయగర్వంతో తన ప్రత్యర్థిని మంచి ఉత్సాహంతో తరుముకుపోతూ మరిచిపోయి తలపైకెత్తింది. ఇంకేముంది, మెరుపులా ఓడిపోయిన ఖడ్గమృగం ఒకే ఒక పోటుతో గెలిచినదానిపొట్టను చీల్చి చంపేసింది. ఎవ్వరూ ఏమాత్రం ఊహించలేని వింతలు ఈ పోట్లాటలలో జరుగుతూండేవి.

## 7 పన్నెండు కొమ్ముల దుప్పి

ఇది సున్నితంగావుండే సుందరమైన చిన్నజంతువు. ఒక్క లక్నోలోతప్ప బహుశః ఇంకెక్కడా వినోదంకోసం వీటిని పోట్లాడించివుండరు. వీనిపోట్లాట చాలా బాగుంటుంది. కవులు తమ ప్రియురాండ్రను లేళ్ళతో పోలుస్తూవుంటారు. పోట్లాటల్లోకూడా ఇవి ఒయ్యారాన్ని చూపిస్తాయి. ఒకదాన్ని ఒకటి ఎదుర్కొన్నప్పుడు ప్రారంభంలో ఎంతో అందంగా అవి పందాలుమారుస్తూ చివరిదశలో ఒకదానిపై ఒకటి గట్టిగా తలపడతాయి. అవి తమ కొమ్ముల్ని కత్తులలాగ, డాళ్ళలాగ కూడా ఉపయోగిస్తాయి. చివరికి అవి చాలాసేపు పోట్లాడినతరువాత తమతమ కొమ్ముల్ని పెనవేసి జడలా అల్లుకొనేట్లుచేసి ఒకదాన్ని ఒకటి ముందుకు తోసుకుంటాయి. చివరికి ఒకదానికి ఓటమి, ఒకదానికి గెలుపు సమకూరేస్థితి ఏర్పడుతుంది. ఓడిపోయేదానిశరీరం జలదరిస్తుంది. అడుగులు భయంవల్ల కంపిస్తాయి.

కాని గెలిచినదుప్పి కనికరించకుండా విజయగర్వంతో ఓడిపోయినదాన్ని తరిమి తరిమి కొమ్ములతో పొడిచి, పొడిచి హింసిస్తుంది. పాపం, ఓడిపోయినదుప్పి కళ్ళ లోంచి అశ్రుబిందువులు, కొమ్ముల్లోంచి రుధిరబిందువులు టపటప రాలి క్రింద పడుతుండగా, అది ప్రాణాన్ని రక్షించుకొనేఉద్దేశ్యంతో వాయువేగంతో పారిపోతుంది కాని గెలిచినదుప్పికూడా అదేవేగంతో దాన్ని తరుముకుంటూ పరిగెత్తుతుంది. ఈ పరుగులు చూడవలసిందేకాని వర్ణించగలగడం అసాధ్యం. గెలిచినదుప్పి దొరికిన చోట ఓడిపోయిన దుప్పిని ఎక్కడపడితే అక్కడ పొడిచి పొడిచి గాయపరుస్తుంది. ఈ గాయాలవల్ల అది చనిపోతుంది. తన విజయానికి గెలిచినదుప్పి చాలా గర్విస్తుంది.

## 3 పొట్టేలు

అది చాలా దీనజంతువు. శాంతిప్రియత్వంతో జీవించే చిన్నజంతువు. కాని పోట్లాటకు దిగితేమాత్రం చాలా పౌరుషంగా పోట్లాడుతుంది. పొట్టేళ్ళ పౌరుషాన్ని చూసి ఆనందించేందుకే వీటిని పోట్లాడిస్తుంటారు. పొట్టేలు పోట్లాటలను అయోధ్య ఆస్థానం ప్రారంభించలేదు. ప్రాచీనకాలంనుంచీ అనేకదేశాలలో పొట్టేళ్ళ పోట్లాటలు అమలులో వున్నవే. భారతదేశంలో బెలూచిస్థానం వాళ్లు తొలిసారిగా ఈ పోటీలను ఏర్పాటుచేశారు. పొట్టేళ్ళను పెంచడం, పోరాటానికి ఆయత్తపరిచి శిక్షణ ఇవ్వడం, పోట్లాడించడం మొదలయినపనులు ఉన్నతవంశస్థులు చెయ్యరు. కసాయివాళ్లచేత ఈ పనులు చేయిస్తారు. కసాయివాళ్లు లేనిచోట్ల చిన్నతరగతుల వారిచేత ఈ పనులు చేయించేవాళ్ళు. ధనవంతులు వాళ్ళచేత ఈ ప్రదర్శన నేర్పాటు చేయించిచూసి ఆనందించి వాళ్ళకు డబ్బు ఇస్తూండేవాళ్ళు. నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా, సఆదత్ అలీఖాన్‌లు పొట్టేళ్ళ పోట్లాటలు చూసేందుకు చాలా మోజు పడుతుండే వారని వినికిడి. గాజీ ఉద్దీన్ హైదర్, నసీర్ ఉద్దీన్ హైదర్ల సమక్షానకూడా తరుచు పొట్టేళ్ళ పోటీలు జరిగేవి. వాజిద్ అలీ షాహ్ తన కలకత్తాప్రవాసంలో 'మటియా బుర్జ్'లో పొట్టేళ్ళపోటీలు జరిపిస్తూండేవాడు. 'మున్షీ ఉస్సుల్తాన్ బహాదుర్' పర్యవేక్షణలో కసాయివాళ్ళచేత వాజిద్ అలీ షాహ్ కోసం ఈ పోటీలు జరుగుతూండేవి. ఈ పోటీలలో పాపం ఓడిపోయిన పొట్టేళ్ళతలలు బ్రద్దలయిపోవడం నేను అనేక సార్లు చూశాను. పొట్టేలు ఓడిపోయేస్థితిలో తన ప్రత్యర్థి దాడిని తప్పించుకొనేం

దుకు తల పక్కకుతిప్పి పారిపోతుంది. ఒకసారి మటియాబుర్జ్‌లో వార్షికోత్సవానికి కలకత్తాలోని ఆంగ్ల ప్రముఖులు చాలామంది హాజరయ్యారు. పాదుషా తన హోదాకు విరుద్ధంగా చెవులుతెగిన పొట్టేలు ఎక్కి తమాషాగా మైదానంలోకి వచ్చాడు. పొట్టేళ్ళపోటీ ప్రారంభమైంది. భారతీయులకంటే ఆంగ్లేయులే వాటి పోట్లాటను ఎక్కువ చూస్తూ, ఉత్సాహంతో 'హుర్రే' అని అరుస్తూ, కరతాళ ధ్వనులుచేస్తూ తమ సంతోషాన్ని, ఉత్సాహాన్ని ప్రదర్శించారు. లక్నోలో అయోధ్య ఆస్థాన పతనానంతరంకూడా నవాబ్ మోహిసిన్ ఉద్దౌలా బహాదుర్ పొట్టేళ్ళపందాలను చూడడంలో ఎక్కువ అభిరుచి చూపేవాడు. ఇప్పుడు ధనవంతులు, కులీనులు ఈ శౌకబాజు అభిరుచిని వదులుకొన్నారు. కాని కింది తరగతులవారిలో ఇప్పటికీ ఈ మోజు మిగిలేవుంది.

# 17

ఆస్థానంవరకు, ధనవంతులవరకు మాత్రమే క్రూరమృగాల పోట్లాటలను ఏర్పాటు చేసే స్తోమత సీమితమైవుండేది. క్రూరమృగాలను వేటాడించి పట్టుకోవడం, సంరక్షించడం, శిక్షణ నిప్పించడం, పోట్లాటసమయాలలో వాటిని అదుపులో పెట్టించడం, వాటి మూలంగా ప్రజల కేవిధమైన అపాయాలు కలుగకుండా తగిన బందోబస్తుచేయడం వగైరా శ్రమా, డబ్బు ఖర్చుపెట్టేశక్తి సాధారణ ప్రజలలోను, వ్యక్తిగతంగా ధనవంతులలోనూ ఎవ్వరికీ ఉండదు. అందుకే ఈ పోటీలకు రాజపోషణ అవసరమైంది. రాజపోషణలోనే ఇవి ప్రారంభమై పెంపొందగలిగాయి. కాని అయోధ్య ఆస్థానం అంతమవడంతో ఈ క్రూరమృగాల పందాలు అంతమైపోయాయి.

కాని పెంపుడు పక్షులసంగతి దీనికి పూర్తిగా విరుద్ధమయినది. వీటిపోటీలను ధనవంతులనీ, ధనవిహీనులనీ తేడాలేకుండా నిర్వహించవచ్చు. అయితే వారిలో అభిరుచి వుండాలి; ప్రయత్నం వుండాలి. అంతే; ఆర్థికస్థితిగతులు ఈ అభిలాషకు అడ్డురావు. లక్నోలో మోజున్నవాళ్లు ఈ క్రిందిపక్షులతో పందాలు నిర్వహించేవారు.

1. కోడి, 2. బటేర్ (ఒకరకమైన చిన్న పక్షి), 3. తీతువు పిట్ట, 4. లవే (పొదలపిట్ట), 5. బుల్‌బుల్ (పికిలిపిట్ట), 6. లాల్ (ఎర్రపిట్ట), 7. పావురం, 8. చిలుక.

వీటి పందాలనుగురించి విడివిడిగా వివరించడం అవసరం. లక్నోలోని పావురాలపోటీలు, బటేర్ పోటీలు జగత్ప్రసిద్ధం. కాని నేటి ఆధునికనాగరికులు వీటిని హీనంగా చూస్తున్నారు. వీరికి వాటి పోటీలనుగురించి కాని, ఎంతో సాధనతో ఈ పోటీలకు కళాత్మకరూపాన్ని ఇచ్చిన నిపుణులనుగురించికాని బొత్తిగా తెలియదు. వీరు ఐరోపాలోని వివిధదేశాలకు వెళ్ళిచూస్తే అక్కడి ప్రజలుకూడా యీ పోటీలను ఎంత ఉత్సాహంతో తిలకించి ఆనందిస్తూంటారో అవగాహన మవుతుంది. అందువల్ల అప్పుడు స్వదేశస్తుల కళాత్మక అభిరుచులను నిస్సంకోచంగా తేలికచేసి వెక్కిరించే ఈ ఆధునికవ్యక్తులు తమ అభిప్రాయాలపట్ల సిగ్గుపడవలసి వుంటుంది.

## కోడి పందాలు

ప్రతిరకపుకోడినీ పోట్లాటకు వుపయోగించవచ్చు. కాని మంచి జాతికోడి పోట్లాటలో గెలుస్తుంది. చాలా పౌరుషంగా పోట్లాడుతుంది. నిజం చెప్పాలంటే సింహాలకంటే మంచి జాతికోళ్లు పోట్లాటలో ఎక్కువ పరాక్రమాన్ని చూపిస్తాయి. అవి పోటీలలో గెలవనయినా గెలుస్తాయి, లేకపోతే వీరస్వర్గాన్నయినా అలంకరిస్తాయి. కాని శత్రువుకు, భయపడి యుద్ధరంగంలో వెన్నుచూపి పారిపోవు. అసలయిన జాతికోళ్ళు అరేబియాదేశంనుంచి భారతదేశం వచ్చాయని పరిశోధకులు చెబుతూ వుంటారు. హైదరాబాద్, దక్కన్‌లో లభ్యమయ్యేన్ని మంచి జాతికోళ్ళు, ఒడ్డూ, పొడుగు బరువువుండే కోళ్ళు మరెక్కడా కనిపించవు కనుక పరిశోధకులమాటలు నిజమని భావించవచ్చు. అరేబియాదేశస్థులు భారతదేశంలోని మిగతా అన్నిచోట్ల కంటే హైదరాబాద్, దక్కన్‌లోనే ఎక్కువసంఖ్యలో స్థిరపడివున్నారు. ఉత్తర భారతదేశంలో ఈరాన్‌దేశపు జాతికోళ్లు ఎక్కువ. లక్నోలో కోడిపందెగాళ్ళలోని ఒక ప్రముఖుని కోడి, ఒక కోడిపందెంలో సరియైన అదనులో ఓడిపోయింది. ఆయన దుఃఖించి నిరాశతో 'ఇరాక్' వెళ్ళి 'నజ్‌ఫ్-ఏ-అశ్‌రఫ్'లో కొన్ని

మాసాలు పూజలుచేస్తూ వుండిపోయాడు. 'అల్లా, మా పూర్వీకుల పుణ్యఫలంగా ఏ పందెంలోను ఓడిపోకుండా వుండేటువంటి మంచికోడిని నాకు ప్రసాదించు' అని ఆయన రాత్రింబగళ్ళు ప్రార్థన చేసేవాడు. చివరికి ఆయనకు ఒకరాత్రి కలలో 'మంచి కోడికోసం అడవికి వెళ్ళు' అనే ఆదేశం వినిపించింది. ఉదయం లేవగానే ఆయన ఒక కోడిని చంకలో పెట్టుకొని అడవికి బయలుదేరేడు. కొంతదూరం నడిచిన తరువాత ఆయనకు ఒక పర్వతగుహలోంచి ఒక అందమైన పెద్దకోడివచ్చి ఈ కోడితో పోట్లాటకు దిగింది. ఉపాయంగా ఆయన ఆ పెద్దకోడిని వశపరచుకొని కూడా తెచ్చుకొన్నాడు. ఈ పెద్ద కోడివల్ల ఆయన కోడిపందాలలో ఎన్నడూ ఓడిపోలేదు.

(లక్నోలో నవాబ్ షుజాఉద్దౌలా పరిపాలనకాలంనుంచి అయోధ్య ఆస్థానం అంతమయిపోయేపర్యంతం కోడిపందాలమోజు వుండేది. నవాబ్ ఆసఫ్ ఉద్దౌలాకు కోడిపందాలపట్ల అమితమైన అభిరుచి వుండేది. నవాబ్ సఆదత్ అలీఖాన్‌కూ కోడిపందాలంటే చాలా ఎక్కువ మోజుండేది. అంతేకాకుండా ఆయన కోళ్ళపెంపకంలో ఆదర్శ యజమానిగాకూడా పేరు తెచ్చుకొన్నాడు. అయోధ్య ఆస్థానంలోని ధనికులు. బీదలు, ఐరోపీయులుసహితం కోడిపందాలంటే చెవి కోసుకుంటూండేవాళ్లు. జనరల్ మార్టిన్ భవనం లక్నోలో చూడతగ్గ గొప్పభవనం. అందులోనే ఆంగ్లేయ బాలకుల పాఠశాలకూడా స్థాపించబడింది. అటువంటి గొప్ప ఆంగ్ల విద్యావేత్త కూడా కోడిపందాలవైపు ఆకర్షితుడయ్యాడు; ఆయన ఎన్నో మంచిజాతికోళ్ళను పందాల నిమిత్తం పెంచాడు. నవాబ్ సఆదత్ అలీఖాన్ పందెపుకోళ్ళతో తన కోళ్ళ చేత పోట్లాడిస్తూండేవాడు.) లక్నోలో పందెపుకోళ్ళకు ముళ్లతీగకట్టి పోటీలలో వాటికి అట్టే నష్టం వాటిల్లకుండా జాగ్రత్తవహించేపద్ధతి ఆ రోజుల్లో వుండేది. అంతేకాకుండా కోళ్ళముక్కులను చాకుతో సూది మొనలవలె సన్నగా చెక్కుతూండేవాళ్ళు. పందెపుకోళ్లను రంగంలోకి పోట్లాటకు వాటి యజమానులు సమయం, సందర్భం, ఒడుపుచూసి వదలుతూండేవాళ్ళు. అలా వదలడం ఒక కళ. వదిలినతరువాతకూడ వాటియజమానులు వాటివెనుకనే వుంటూండేవారు. ఇంక పందెపుకోళ్ళు ముక్కులతోటీ, పంజాలతోటి పోట్లాడడం మొదలుపెట్టేవి. కోళ్ల పోటీదారులు తమతమకోడిని ఉత్తేజపరుస్తూ 'భేష్ బిడ్డా! బాగుంది. పొడు, కొట్టు,

ఇక్కడే. ఆఁ మళ్లీ మరో దెబ్బెయ్, సెభాష్' అంటూ ప్రోత్సహిస్తూండేవాళ్ళు. వాళ్ళభాష తమకు బాగా అర్థమవుతూన్నట్లు కోళ్లు తమ యజమానుల సూచనల ప్రకారం పోట్లాడుతూండేవి. బాగా ఒకదాన్ని ఒకటి పొడుచుకొని గాయపడి అవి అలసిపోయినట్లు కనిపించినప్పుడు రెండుపక్షాలవారి అంగీకారంతో కొద్దిసేపు విశ్రాంతి ఇవ్వబడుతుంది. కోడిపందాలవాళ్ళ పరిభాషలో ఈ విశ్రాంతిని 'పానీ' అని అంటారు. 'పానీ' సమయంలో కోళ్ళయజమానులు వాటితలలపై గాయాలను శుభ్రంగా తుడిచి, వాటిమీద నీళ్ళుచిలికి ఆ గాయాలపై నోరుపెట్టి రక్తాన్నిపీల్చి రక్తప్రవాహాన్ని అదుపులోకిపెట్టే ప్రయత్నం చేసేవారు, దువ్వేవారు, ముద్దు పెట్టుకొనేవారు. రకరకాలుగా వాటిని బుజ్జగించి నవోత్సాహాన్ని వాటికి ఒనగూరుస్తూండేవారు. మళ్ళీ వాటిని కదనరంగంలోకి విడుస్తూండేవాళ్ళు. ఈవిధంగా అప్పుడప్పుడు 'పానీ'లు జరుపుతూ పందాలు, సాధారణంగా నాలుగైదురోజులు కొనసాగేలా నిర్వహిస్తూండేవారు. ఒకొక్కప్పుడు బలమైన ఒకేజోడీ పోటీ ఎనిమిది, తొమ్మిది రోజులవరకూ కొనసాగేది. కోళ్ళలో ఒకటి కన్నుకోల్పోయి గుడ్డిదైనప్పుడు, లేక ఒళ్లు హూనమైపోయి నుంచోలేని దుస్థితి ఏర్పడినప్పుడు అది ఓడినట్లు భావించబడేది. తరుచు కోళ్ళముక్కులు ఈ పందాలసందర్భాలలో ఊడిపోతూండేవి. ఇటువంటి స్థితులలోకూడా వీలయినంతవరకూ ముక్కుల్ని కట్టి పోట్లాడిస్తూండేవాళ్ళు./

హైదరాబాద్ దక్కన్‌లో లక్నో పోటీలకు పూర్తివిరుద్ధంగా కోడిపందాలు జరుగుతూండేవి. అక్కడ కోళ్ళరక్షణకై ఇనుపతీగలు కట్టేపద్ధతి వుండేదికాదు. పైగా కోళ్ళకాళ్ళకు చిన్నచిన్న పదునయిన కత్తులు కడుతుండేవాళ్ళు. ఫలితంగా ఒకటి రెండు గంటలలోనే కోడిపందెం సమాప్తమై జయాపజయాలు తెలిసిపోతూండేవి. లక్నోలో ఇనుపతీగెలు కట్టేపద్ధతి బహుశః కోడిపందెం వీలైనంత ఎక్కువసేపు పొడిగించి ఆనందించడానికి ఏర్పడివుంటుంది.

కోళ్ళయజమానులు కోళ్ళకు మంచి ఆహారం ఇవ్వడం, ఎక్కువగా సంరక్షించడం, విశ్రాంతిసమయంలో గాయాలపైన నీళ్ళు చల్లడం దృఢమయిన ఇనుపతీగెలను తయారుచేయడం, ముక్కుల్ని చెక్కడం వగైరా పనులలో తమ అనుపమప్రజ్ఞను చూపిస్తూండేవారు. నేలమీద నూకలుచల్లితే కోళ్లు తినేప్పుడు వాటిముక్కులు

ఎక్కడ పాడయిపోతాయో అనే అనుమానంతో వాళ్ళు కోళ్ళదాణాను, గింజలను అరచేతులపై వుంచుకొని తినిపిస్తూండేవాళ్ళు.

ఈ కోడిపందాల అభిరుచి వాజిద్ అలీషాహ్ కాలంనాటికి దినదినాభివృద్ధిపొందుతూ పరాకాష్ఠ నందుకొంది. మటియా బుర్జ్‌లో నవాబ్ అలీనకీఖాన్ భవనముందు కోడిపందాల రంగస్థలం వుండేది. కలకత్తాలోని కొందరు ఆంగ్ల రసికులు తమ కోళ్ళను అక్కడికోళ్ళతో పోట్లాడించేందుకు తెస్తూండేవాళ్ళు. పాదుషాకుమాత్రమే కాక ఇంకా ఎందరో ధనికులకు ఈ కోడిపందాలమోజు వుంటూండేది. మీర్జా హైదర్ బహూ బేగమ్ సాహిబా సోదరుడు 'నవాబ్ సాలార్ జంగ్ హైదర్ బేగ్ ఖాన్' నసీర్ ఉద్దీన్ కాలంలోని 'మేజర్ స్వారిస్' రాజుగారికోళ్లతో తమకోళ్లను పోట్లాడిస్తూండేవాళ్లు. ఆగా బుర్‌హాన్ ఉద్దీన్ హైదర్ కూడా కోడిపందాలపట్ల అమితమైన అభిరుచిగల వ్యక్తి. ఆయనవద్ద ఆఖరివరకూ రెండువందలు లేక రెండువందల ఏభై కోళ్ళు వుండేవి. అవన్నీ చాలా శుభ్రంగానూ, సుందరంగాను పెంచబడుతూండేవి. పది, పన్నెండుగురు పనివాళ్లు వాటి సంరక్షణనిమిత్తం నియమించబడేవారు. మియా దారాబ్ అలీఖాన్ మరియు నవాబ్ ఘసీటా కోడిపందాలంటే చాలా మోజుపడేవారు. 'మలీహాబాద్'లోని ప్రముఖ పఠానులందరికీ కోడిపందాలంటే ఎంతో ఇష్టం. వారివద్ద పందలసంఖ్యలో మంచిజాతి కోళ్లుంటూండేవి. అంతే కాకుండా వారివద్ద ప్రథమశ్రేణికిచెందిన కోళ్ళ సంరక్షకులుకూడా వుండేవారు. కొక్కొరొకో శబ్దాన్ని వినగానే అది పందెంలో గెలుస్తుందో ఓడిపోతుందో చెప్ప గలప్రతిభ మీర్ ఇమ్‌దాద్ అలీ, శేఖ్ ఘసీటా, మునవ్వర్ అలీ మున్నగు కోడి పందాల నిపుణులలో వుండేదీ. ఈ కళలో సఫ్‌దర్ అలీ, సైయద్ మీరన్‌సాహబ్ కూడా సుప్రసిద్ధులే. ఫజ్‌లే అలీ జమాదార్, కాదర్ జీవన్‌ఖాన్, హుసైన్ అలీ, నౌరోజ్ అలీ, నవాబ్ ముహమ్మద్ తకీఖాన్, మియా జాన్, దిల్. ఛంగా, హుసైన్ అలీ బేగ్, ఎహమద్ హుసైన్ మున్నగువారు కోళ్లను పెంచడంలోను, పోట్లాడించడంలోనూ ప్రముఖులుగా పేరుపొందారు. కాని వారిలో ఏ ఒక్కరూ ఇప్పుడు సజీవులయి లేరు. వీరు కోడిపందాలను పరాకాష్ఠవరకూ పురోగమింపజేశారు. ప్రస్తుతం హైదరాబాద్‌లో కోడిపందాలపట్ల మోజు ఎక్కువ. అక్కడి ధనికులు, జాగీర్‌దార్లు, ఉన్నతాధికారులు మంచి జాతికోళ్ళను అధికసంఖ్యలో పెంచుతున్నారు.

## 2 బటేర్ పందాలు

పంజాబ్‌నుంచి బటేర్‌లు లక్నోకు దిగుమతి అయ్యాయి. నవాబ్ సఆదత్ అలీ ఖాన్ కాలంలో పంజాబ్‌నుంచి కొందరు కంచన్‌జాతివారు లక్నో వచ్చారు. వారి స్త్రీలు వేశ్యావృత్తి చేస్తారు. వారు తమవెంట కోడి ఆకారంలోవుండే బటేర్ పక్షుల్ని తెచ్చారు. వాటిపందాలు ఆ జాతి మొగాళ్లు జరిపిస్తూండేవాళ్లు. నేటి ప్రముఖ వేశ్యలందరూ ఈ జాతికి చెందినవాళ్ళే. ఈ పక్షులలో 'ఘాఘస్' అనీ 'చనంగ్' అనీ రెండురకా లున్నాయి. పంజాబ్‌లో 'ఘాఘస్ బటేర్' మాత్రమే దొరుకుతుంది. ఇది 'చనంగ్' కంటే ఎక్కువ దిట్టమైనది, శక్తివంతమైనదీను. 'చనంగ్' ఘాఘస్‌కంటె ఆకారంలో చిన్నది, చూసేందుకు నాజూకుగా వుంటుంది. కాని పోట్లాడడంలో అది ఎక్కువ పౌరుషాన్ని ప్రదర్శిస్తుంది. అందువల్ల దానిపోట్లాట చూసేందుకు ఎక్కువ సరదాగా వుంటుందనే విషయం లక్నోలో కనిపెట్టారు. లక్నోలో ఘాఘస్, చనంగ్‌ల పోటీలు తరచు ఏర్పాటుచేయబడుతుండేవి.

బటేర్ పందాలకు క్రీడారంగాలు, లేక యుద్ధ మైదానాల అవసరం ఏమాత్రం వుండదు. ఇంట్లోంచికూడా బయటకు పోవలసిన అవసరం వుండదు. ఇంట్లోనే శుభ్రమయిన గచ్చునేలమీద వీటిచేత దెబ్బలాడించవచ్చు. ఈ బటేర్ పందాలలో యీ సదుపాయం వుండడంవల్లనే, లక్నోవాసులను బటేర్ పందాలు ఎక్కువగా ఆకర్షించాయి. బటేర్‌లకోసం చాలా సుందరమగు పంజరాలను తయారుచేయించి వాటిని ఏనుగుదంతాలతో అలంకరించి బటేర్‌లను వాటిలో వుంచేవారు.

బటేర్‌ను పోట్లాటకు ఆయత్తపరచడానికి చేసేప్రయత్నాలు కొంత విచిత్రంగా వుంటాయి. ముందు పంజరంలోంచి దానినితీసి ఎడంచేతిపై ఎక్కించుకుంటారు. దానిని నీళ్ళలోతడిపి మళ్ళీ ఒక అరచేతిమీద కూర్చోపెట్టి ఇంకో అరచేతితో మూస్తారు. ఈవిధంగా ఒకటి రెండు గంటలపాటు తడుపుతూ అరచేతులమధ్య దాన్ని కూర్చోపెట్టుకుంటూ గడుపుతారు. ఇందువల్ల దాని పిరికితనం, గాభరా దూరమై కిలకిలలాడడం, ముక్కుతో కొట్టడం వగైరా చర్యలకు అది ఉపక్రమిస్తుంది. ఆ తరువాత దానికి మేతవేయకుండా ఒకపూటవుంచి చక్కెర మొదలగు (విరేచనాలయేందుకు అనువైన) ఆహారాన్ని తినిపిస్తారు. ఈవిధంగా శరీరం పైనా, లోపలాకూడా కట్టుదిట్టంచేసి సరియైనస్థితికి దాన్ని తీసుకువస్తారు. అర్ధరాత్రి దాని

చెవిలో 'కూ(' అని అరుస్తారు. దీన్ని 'కూక్‌నా' అంటారు. ఈ ప్రయత్నాలవల్ల బటేర్‌లోని కొవ్వు కరిగిపోతుంది. కురూపం దూరమౌతుంది. శరీరం చురుకుతనాన్ని, బలాన్నీ పుంజుకుంటుంది. ఇంత శ్రమించి బటేర్‌ను తయారుచేస్తేనే అది పందానికి ఎక్కువ ప్రయోజనకారిగా రూపొందగలుగుతుంది.

పోట్లాటసమయంలో నేలమీద తేలికరకం దాణా చల్లబడుతుంది. అనంతరం బటేర్‌లను పంజరాలలోంచి వదుల్తారు. అంతకుముందే పందెపు బటేర్ల ముక్కుల్ని చాకుతో వాడిగా చెక్కుతారు. బటేర్ పోట్లాటకూడా కోడి పోట్లాటల పద్ధతిలోనే వుంటుంది. ముక్కులతో అవి పరస్పరం పొడుచుకొంటాయి, పంజాలతో రక్కుకుంటాయి. ముక్కుతో ప్రత్యర్థిమొహాన్ని గాయపరచి తగిన అదనుచూసుకొని పంజాలతో డొక్క చీల్చేస్తుంది. పోట్లాట పావుగంటో, ఇరవై నిమిషాలో జరుగుతుంది. మంచి జాతి బటేర్లు అయితే అరగంటవరకూ పోట్లాడగలవు. చివరికి ఓడిపోయిన బటేర్ పారిపోతుంది. అలా పారిపోయిన బటేర్ మళ్ళీ ఇంకెప్పుడూ ఏ పోట్లాటకు తయారవదు. దాని పోరాటజీవితం ఇంక అంతమైపోయినట్లే లెక్క.

(బటేర్ అభివృద్ధి మూడు అంచెలుగా జరుగుతుంది. అంటే దాని ప్రసిద్ధికూడా మూడు అంచెలలోనే ఏర్పడుతుందన్నమాట !

తొలిసారిగా పందెంలో పాల్గొనడం బటేర్ పందెపుజీవితానికి మొదటి అంచె. అది పారిపోకుండా ఎన్నో పందాలలో నెగ్గినతరువాత మామూలు పంజరంలో అట్టిపెట్టబడుతుంది. ఆ పంజరంలోనే అది ఉంటూ ఈకలను దులుపుకుంటూ ఉంటుంది. ఒక ఏడాది తిరగకుండానే దానికి క్రొత్త ఈకలు మొలుస్తాయి. ఈదశను 'కురీజ్ బితానా' (ఈక రాలు కాలం) అంటారు. అనంతరం దానిహోదా పెరుగుతుంది. దాన్ని 'నోకార్' అంటారు. అది రెండోదశ. ఆ తరువాత మళ్ళీ 'కురీజ్' దశ వస్తుంది. ఇది దాని అంతస్తుపెరిగే మూడోదశ.) అంటే కొత్తదానికంటె నోకార్, నోకార్‌కంటె కురీజ్ బలవత్తరమైన బటేర్‌లుగా ఎంచబడుతాయన్నమాట. కురీజ్‌తో కొత్త బటేర్ ఒకటి రెండు క్షణాలుకూడా పోట్లాడలేదు. కొత్త బటేర్ల పందాలను నిర్వహించడం సర్వసాధారణంగా జనుల కంమబాబులో వున్నప్పటికీ 'కురీజ్' పందాలను ధనవంతులూ, ఈ పోటీలలో చాలా అభిరుచివున్న సాధారణ జనం నిర్వహిస్తూంటారు. ఈ పందాలలో రకరకాల మోసాలుకూడా జరుపుతూం

టారు. కొందరు తమ బటేర్ ముక్కుపైన చాలా చేదుపదార్థాన్నో లేక విషాన్నో పూసి పందానికి వదులుతారు. అటువంటప్పుడు దానిప్రత్యర్థి రెండు మూడుపోట్లకే బాధ భరించలేక వెనక్కుతగ్గి పారిపోతుంది. అయితే కొన్ని మొండివి పౌరుషంతో పోట్లాడడం కొనసాగించినా కొద్దిసేపట్లో చచ్చిపోవడం తటస్థిస్తుంది. కొందరు తమ బటేర్‌లచేత సారాలాంటి నిషాద్రవ్యాలను త్రాగిస్తారు. నిషా ఎక్కడంవల్ల అవి ఒళ్లు తెలియకుండా తమ ప్రత్యర్థి చచ్చేవరకూ లేదా పారిపోయేపర్యంతం పోట్లాడతాయి. కొందరు మంచిమంచి బటేర్లను కేవలం ఒకే ఒక చూపుచూసి, తమవద్దనుండే సాదా బటేర్లను సరిగ్గా అదేవిధంగా బరువులోనూ, ముక్కు వాడితనంలోనూ రూపొందించి అదనుచూసి కన్నుమూసి తెరిచేంత తక్కువవ్యవధిలో మార్పిడిచేసి తెచ్చుకుంటూండేవాళ్లు. ఇది చాలా దుర్మార్గమైన దొంగతనమే. కాని ఈ దొంగతనంలో వాళ్ళ నేర్పరితనం గమనించతగ్గది. కొందరు కొత్త బటేర్లకు చక్కని శిక్షణనిచ్చి కురీజులతో పోట్లాడించి గెలుస్తూండేవాళ్లు. కొందరు నిషా మాత్రలను బటేర్లకోసం తయారుచేసి నూరురూపాయలకు పదిమాత్రలుచొప్పున విక్రయిస్తూండేవాళ్లు. పందాలమోజులోపడ్డ వ్యక్తులు ఆ మాత్రలను కొనేస్తూండేవాళ్లు.

వీటికి వైద్యులుకూడా ఎందరో వెలిశారు. మూలికలను, ఆకులను, మందులను ఉపయోగించి ఎందుకూ పనికిరాని బటేర్లను, జబ్బుపడిన బటేర్లను, గాయపడి బ్రతకవనుకునే బటేర్లను ఆ పక్షిచికిత్సకులు ఆరోగ్యవంతంగా చేస్తుండేవారు. డాక్టర్లు, హకీములు ఆ పక్షిచికిత్సకుల ప్రతిభలను చూసి ఆశ్చర్యపడుతుండేవాళ్ళు. మంచి జాతి బటేర్లను పెంచి గ్రుడ్లలోనుంచి పిల్లలను పెట్టించాలనే ప్రయత్నాలు కూడా జరుగుతూండేవి. కాని ఆ ప్రయత్నాలు ఫలవంతం కాలేదు.

బటేర్లకు రుస్తుమ్, సోహ్‌రాబ్, శోహ్‌రా ఏ-ఆఫాక్ (జగత్‌ప్రసిద్ధ) మొదలైన ఆకర్షణీయమగుపేర్లు పెడుతుండేవాళ్లు. ఈ పోట్లాటసందర్భంలో ప్రేక్షకులు పందాలు వేసుకొంటూండేవాళ్ళు. వాళ్లవాళ్ల తాహతును అనుసరించి కానీ, రెండు పైసలు మొదలు వెయ్యిరూపాయల వరకూ పందాలలో పోగొట్టుకోవడమో, రాబట్టుకోవడమో జరుగుతూండేది. సాధారణప్రజలకూ, ధనికులకేకాక సాక్షాత్ పాదుషా

అతే ఈ బటేర్ పందాలపట్ల ఎంతో అభిరుచి వుండేది. నసీర్ ఉద్దీన్ హైదర్ తన ఎదుట మేజాబల్లపై బటేర్లనువదలి పోట్లాడించి ఆనందిస్తూండేవాడు.

మీర్ బచ్చూ, మీర్ అమ్దూ, ఖాజా హసన్, మీర్ ఫిదా అలీ, ఝంగా, మీర్, ఆబిద్ సయ్యద్ మీరన్ మున్నగువ్యక్తులు నా ముందుతరంలో ఈ బటేర్ పక్షులను పెంచి, శిక్షణనిచ్చి, పోట్లాడించడంలో ప్రఖ్యాతికెక్కిన వ్యక్తులు. నలభై ఏళ్ళక్రితం మటియా బుర్జ్‌లో దారోగా గులామ్ అబ్బాస్, ఛోటేఖాన్, గులాం ముహమ్మద్ ఖాన్ ఖాలిస్‌పురీ మున్నగు వయోవృద్ధులయిన పెద్దలు ఈ కళలో నిష్ణాతులు. ఆ తరువాతకాలంలో గాలిబ్ అలీ బేగ్, మీర్జా అసద్ అలీ బేగ్, నవాబ్ మీర్జా, మియా జాన్, శేఖ్ మోమిన్ అలీ, గాజీ ఉద్దీన్ ఖాన్ మున్నగు యువకులు ఈ కళలో కృషి చేసి మంచిపేరు తెచ్చుకున్నారు.

బటేర్‌పక్షులను వేటాడి తీసుకు రావడంలో లక్నోవాసులు అభిరుచి నేర్పరచుకొన్నారు. మొదట ఇది ఒక సరదాగా ఏర్పడింది. కాని దీనివల్ల బలహీనులు, నిరుత్సాహవంతులు. ఊరు వదిలేందుకు మనస్కరించని పిరికివాళ్లు అడవులకు, కొండలకువెళ్ళి బటేర్లను వేటాడడంలో ఉత్సాహాన్ని ప్రదర్శించారు. ఇది ఒక గొప్ప మేలు అనాలి. ఈ అభిరుచి దినదినాభివృద్ధినొంది ఎంతోమందికి ఈనాడు జీవనోపాధిని కలుగజేస్తూంది.

బటేర్ వేటకూడా విచిత్రంగా జరుగుతుంది. ఇవి పర్వతాగ్రప్రదేశాలనుంచి రాత్రిళ్ళు ఆకాశంలో చాలా ఎత్తున ఎగురుతాయి. వేటగాళ్ళు ప్రత్యేకంగా అరిచే బటేర్‌పక్షులకు శిక్షణ ఇస్తారు. వీటిని 'ఫందైత్' అంటారు. వేటగాని సూచనల ప్రకారం ఫందైత్‌లు అరుస్తూంటారు. తరువు కందిచేలపైన 'వల' వేస్తారు. ఫందైత్‌చేత అరిపిస్తారు. ఈ అరుపులువిని ఆహారంకోసంవచ్చి కందిచేలపైనున్న వలలో ఈ బటేర్‌పక్షులు చిక్కుకుంటాయి. తెల్లవారగానే వలలో చిక్కినవాటిని పోగుచేసి కోళ్ళ గంపలవంటి పెద్దగంపల్లో వేసుకుని తెచ్చుకుంటారు.

## 3 తీతువుపిట్ట పందాలు

ఈ పందాలుకూడా మనోహరంగా వుంటాయి. తీతువుపక్షులు ఇతరపక్షులకంటే ఎక్కువ వేగంగా ఎగిరెగిరి పోట్లాడుతాయి. ఈ తీతువుపిట్టల పందాలపై గ్రామీణు

లకు, క్రిందితరగతులవారికీ మోజు హెచ్చు. కులీనులు, ధనవంతులు దీని జోలికి వెళ్లరు. తీతువులలో ఆవేశాన్నీ, క్రోధాన్నీ కలుగజేసేందుకు వాటిచేత చెదపురుగులను తినిపిస్తారు. కాని ఇది ఏమాత్రం పెద్ద ఆట కాదు, పెద్దలు దీనిపట్ల ఏవిధమైన ఆసక్తి చూపరు. కాని లక్నోలోని కిందితరగతివారిలో ఈ పందాలపై బాగా మోజు వుండేది. ఇప్పటికీ వుంది.

## 4 లవాపక్షుల పందాలు

లవాపక్షి బటేర్ కంటే చిన్నది. చిన్నరకం తీతువుపిట్టలా వుంటుంది. ఇది తిండి తినకుండా ఆడ లవాపక్షితో పోట్లాడుతుంది. దానిచేత పోట్లాడించాలంటే ఆడ లవాపక్షి పంజరాల్ని తెచ్చి ఎదుట అట్టే పెట్టాలి. రీవా సంస్థానప్రజలకు ఈ పందాలంటే ఎక్కువ ఇష్టం. లక్నోప్రజలకూ ఈ పందాలపై అభిరుచి కలిగింది; ఒకవిధంగా ఈ పందాలు జరిపేందుకు ఎక్కువ కృషికూడా లక్నోలోనే జరిగింది. బటేర్ పందాలకంటే లవాపక్షుల పందాలే మిక్కిలి చూడ ముచ్చటగా వుంటాయి. అవి గోళ్లువిప్పి పోట్లాడతాయి, ఒకదానితో ఒకటి పెనవేసుకుంటాయి; పువ్వులు వికసించినట్లు లేస్తూ పడుతుంటాయి. లక్నోలో కొందరు ధనవంతులకు ఈ పందాలపై అభిరుచి ఏర్పడింది. మటియా బుర్జ్‌లోకూడా ఒక పెద్దమనిషి వీటినిపెంచి పోట్లాడిస్తూండేవాడు. వీటిపోరాటంకూడా చూడ ముచ్చటగా వుండేది. లవాపక్షులను ఆకలితోవుంచి పోరాడించాలి. ఈ పందాలు, బటేర్ పందాలకు ముందుకాలంనుంచీ అమలులో వుండేవి. కాని బటేర్‌పందాలు అమలులోకివచ్చాక, లవాపక్షుల పందాలు వెనుకపడసాగాయి. ఇవికూడా బటేర్ల లాగే వాయుమండలంలోకి ఎగుర్తూంటాయి. కందిచేలలో రాత్రిళ్లు వలవేసి ఆ వల దగ్గర ఒక కుండపెట్టి దాంట్లోంచి శబ్దం వచ్చేలా ఏర్పాటుచేస్తారు. ఆ శబ్దానికి ఆకర్షితమై లవాపక్షులువచ్చి వలలో చిక్కుకుంటాయి. వేటగాళ్లు ఉదయంవచ్చి వాటిని పోగుచేసి తీసుకుపోతుంటారు.

## 5 గుల్‌దుమ్ పక్షుల పందాలు

గుల్‌దుమ్ అనే పిట్టను సాధారణంగా జనం బుల్‌బుల్ అని అంటారు. కాని అది తప్పు. 'బుల్‌బుల్' బద్‌ఖ్షాం, ఈరాన్‌దేశాలలో శ్రావ్యంగా పాడే కోకిలవంటి పక్షిజాతికి చెందుతుంది. గుల్‌దుమ్‌పక్షి తోకక్రింద ఒక ఎర్రనిపువ్వు వుంటుంది. గుల్

అంటే పువ్వు, దుమ్ అంటే తోక అని అర్థం. అందువల్లనే ఈపక్షికి 'గుల్‌దుమ్' అని పేరువచ్చింది. ఈ పందాలను గ్రామీణులూ, కిందితరగతులవారే మోజుపడి చూస్తారు. ఉన్నతవర్గాలవారికి ఈ పందాలపట్ల ఆసక్తిలేదు. కాని ఈ పందాలు చూడడానికి చాలా బాగుంటాయి. ఇవి ధాన్యపుగింజలు తింటూ పోరాడతాయి. పోట్లాడేప్పుడు రెండుపక్షులలోనిపిట్టలు పైకెగిరి పెనవేసుకొని కింద పడుతుంటాయి.

## 6 లాల్‌పక్షుల పందాలు

లాల్ (ఎర్రపిట్ట) పంజరంలోపెట్టి పెంచబడేందుకుమాత్రమే ఉపయుక్తమైన పక్షి. ఇది పోరాటానికి ఎంతమాత్రం తగదు. కాని స్వార్థపరులు దీన్ని యుద్ధరంగంలోకి ఈడ్చి కొద్దిసేపు మనోరంజనాన్ని కల్పించుకొనేందుకు ప్రయత్నించారు. అసలు పంజరంలోంచి వీటిని బయటకురానిస్తే ఎగిరిపోకుండా చూడడం చాలా కష్టం. అంతేకాక ఎముటి ఎర్రపిట్టతో దీన్ని పోట్లాటకు ఆయత్తపరచడం మరీ కష్టం. అయితే తగిన శిక్షణనిచ్చి వీటిని పోరాడిస్తుండేవారు. పోట్లాట మొదలు పెడితే మిగతా చిన్న పెంపుడుపక్షులకంటే ఇవి ఎక్కువసేపు యుద్ధరంగంలో నిలబడగలవు. వీటిని పోరాడించే వస్తాదులు ఒకరిద్దరికంటే ఎక్కువ వుండేవారు కాదు. ఇవి పెనవేసుకొని పైకి ఎగిరెగిరి క్రిందకు పల్టీలుకొడుతూ మళ్ళీ పైకి ఎగురుతూ పోరాడతాయి. ఎక్కువమంది ఈ పందాలలో పాల్గొనేవారు కాదు. ఆ చూసే కొద్దిమందయినా బజారురకంవాళ్లు, కిందివర్గాలకు చెందినవాళ్లూ అని చెప్పవచ్చును.

## 7 పావురాల పందాలు

ప్రపంచంలో అన్నిదేశాలలోని ప్రజలు అతి ప్రాచీనకాలంనుంచీ నేటివరకూ పావురాలను పెంచుతున్నారు. ఇందుకు అనేక శాఖలాలున్నాయి. ఎగిరేసేందుకు 'గిరహ్‌బాజ్', 'గోలే' అనేరకం పావురాలనూ, అందంకోసం కొన్నిరకాల రంగురంగుల పావురాలను పెంచుతూంటారు. శీరాజీ, గులీ, నసావరీ, గుల్‌వే, లకీ, లోటన్, చుయాచందన్ మున్నగుజాతుల పావురాలు అందంగా వుంటాయి. 'యాహూ' అనే పావురం రాత్రింబగళ్ళు 'యాహూ' (భగవంతుడా) అని అరుస్తూంటుంది. ఇందువల్ల తరుచు భగవంతుని పూజించే ఫకీర్లు, శేఖ్‌లు శ్రద్ధగా వీటిని పెంచుతూంటారు.

'గిరహ్ బాజ్' పావురాలు తొలిసారిగా కాబూల్‌నుంచి వచ్చాయని వినికిడి. మొదట్లో సాధారణంగా వాటినే ఎగరేస్తూండేవాళ్ళు. ఆ తరువాత 'గోలే' జాతి పావురాలు వచ్చాయి. ఇవి అరేబియా, ఈరాన్, టర్కీ దేశాలనుంచి మనదేశానికి దిగుమతి అయ్యాయి. 'గిరహ్ బాజ్'లో కొన్ని విశేషలక్షణాలున్నాయి. ఉదయం వీటిని ఎగిరేందుకు వదలిపెడితే గంటలతరబడి ఇంటిముందు ఆకాశంలో ఎగురుతూ తిరుగుతాయి. ఇంటిముందు పెద్ద పళ్ళెంపెట్టి అందులో నీళ్ళుపోసిచూస్తే ఆనీళ్ళలో పైన ఎగిరే పావురాలప్రతిబింబాలు పగలల్లా కనిపిస్తూనేవుంటాయి. అవి తమను పెంచే యజమానిఇంటిని ఎన్నడూ మరచిపోవు. చాలా విశ్వాసపాత్రంగా వుంటాయి. 'గిరహ్ బాజ్'లు చాలా స్వామిభక్తితో ప్రవర్తిస్తూంటాయి. ఒకసారి నా గిరహ్ బాజ్ జాతి పెంపుడుపావురం ఒకరిచేతుల్లో చిక్కుకుంది. ఆయన ఈర్ష్యతో దానిరెక్కల్ని కోసేశాడు. దానికి రెక్కలు యథాప్రకారంగా మొలిచి తయారయేందుకు మూడేళ్ళకాలం పట్టింది. అంతవరకూ అది ఎక్కడ ఎలా గడిపిందో నాకు తెలియదు. అది ఒకనాడు తిరిగి మా ఇంటికి వచ్చేసింది. ఈలోగా అది వుండేగూట్లో వేరే పావురానికి స్థానం ఇవ్వడం జరిగింది. ఆ పాతపావురం సరిగ్గా అదే గూటిదగ్గరికొచ్చి తన స్థానంకోసం కొత్తపావురంతో దెబ్బలాటకు దిగింది.

కాని గిరహ్ బాజ్‌లను పది పన్నెండుకంటె మించి ఒక గుంపుగా ఏర్పరచకూడదు. ఇవి ఈ పరిమితసంఖ్యలోనే వుండాలి. వంద, రెండువందల సంఖ్యగల పావురాలగుంపును ఎగరవేయాలనే అభిరుచిగలవాళ్లు 'గోలే' పావురాలను పెంచవచ్చు. పావురాలపెంపకం ఢిల్లీలోనే అభివృద్ధి చెందింది. ఆఖరి మొగలాయీ పాదుషా 'బహాదుర్ షా' పావురాలను పెంచడంపట్ల, వాటికి చక్కని శిక్షణ ఇప్పించడంపట్ల ఎంతో అభిరుచినీ, శ్రద్ధనీ చూపించాడు. ఆయన ఏనుగుపైన ఎక్కి (అంబారీ లేకుండా) ఎక్కడికైనా బయలుదేరితే సరిగ్గా ఆయన తలమీద ఆకాశంలో ఆయన పెంపుడుపావురాలు రెండువందలు ఆయనకు ఏమాత్రం ఎండ తగలకుండా ఎగిరి వెళ్లుతుండేవి.

పావురాలకు తన యజమాని ఇల్లంటే అమితమయిన ఇష్టం: వీటిని పెంచే వ్యక్తులు సాధారణంగా పావురాలపెట్టెను తోపుడుబండిలో పెట్టుకొని తోసుకుంటూ

వెళతారు. రోడ్డుమీద మధ్యమధ్యలో ఆగి వాటిని ఎగరేస్తారు. కొద్దిసేపు ఎగిరాక వాటిని పిలుస్తే వచ్చి మళ్లీ అవి పావురాలపెట్టెలో యథాప్రకారం కూర్చుండి పోతాయి. ఈ అద్భుతాన్ని ఢిల్లీలోనే తొలిసారిగా చూశాను.) అయోధ్య ఆస్థానం స్థాపితమైనప్పటినుంచీ లక్నోలో పావురాలపెంపకంపట్ల అభిరుచి ప్రారంభమైంది. నవాబ్ షుజా ఉద్దౌలా ఎంతో మోజుపడి పావురాలను పెంచేందుకు ఏర్పాట్లు చేయించాడు. బరేలీ నివాసి సయ్యద్‌యార్ అనే పావురాలనిపుణునికి, ఆయన తన ఆస్థానంలో ఆదరపూర్వకంగా మంచిస్థానాన్నిచ్చాడు. నవాబ్ అసఫ్ ఉద్దౌలా, సఆదత్ అలీఖాన్‌లకు కూడా పావురాలమోజు వుండేది. గాజీ ఉద్దీన్ హైదర్, నసీర్ ఉద్దీన్ హైదర్ల కాలంలో పావురాలపెంపకం విషయంలో అయోధ్య ఆస్థానం చాలా ముందంజవేసింది. ఆరోజుల్లో మీర్ అబ్బాస్ అనే పావురాలనిపుణుడు వుండేవాడు. ఆయనదగ్గర చక్కని పావురాలు వుండేవి. ఆయన అయిదురూపాయలు పుచ్చుకొని తన పావురాలపెట్టెతీసుకొని ఎవరు పిలిస్తే వారింటికి వెళ్లేవాడు. అక్కడ ఆయన పావురాలను ఎగరవేసి కొంతసేపు ఎగరనిచ్చి మళ్లీ వాటిని పిలిచి పెట్టెలోపెట్టి తీసుకువెళ్ళిపోతూండేవాడు. తొమ్మిదివందల పావురాలనుకూడా పెంచే ధనవంతులు ఆ రోజుల్లో వుండేవాళ్లు. వాటిని ఒకేసారి ఎగరేస్తూండేవాళ్ళు.

ఖోస్త్ (అఫ్ఘనిస్తాన్ సరిహద్దుప్రాంతం) నుంచి 'షరైత్' అనే రంగు పావురాలు అయోధ్య ఆస్థానానికి దిగుమతి అయ్యాయి. వేలకొద్దీ రూపాయలు ఇచ్చి వీటినికొని ధనికులు తమ సరదా తీర్చుకొంటూండేవారు.

వయస్సుమళ్ళిన ఒకాయనకు క్రొత్తదనమంటే ఇష్టం. ఆయన లక్నో నివాసి: వయస్సులోవున్న రెండు మొగపావురాలను తీసుకొని ఆయన ఒకదాని కుడిరెక్కనీ, ఇంకోదాని ఎడంరెక్కనీ కోసేసి, రెండు పావురాలనూ అతికించి ఒకేపావురంగా అంటే రెండుతలల పావురంగా రూపొందించాడు. అది పావురాలను పెంచేవాళ్ళ నందరినీ ఆకర్షించుకొంది. అనేకమంది అటువంటి రెండుతలల పావురాలను తయారుచేయించుకొన్నారు. నసీర్ ఉద్దీన్ హైదర్ 'ఛత్తర్ మంజిల్' నుంచి నౌకా విహారం చేసేప్పుడు, అవతలగట్టుకు వెళ్ళేప్పుడు, అవతలిగట్టునుంచి తాను పెంచే రెండుతలల పావురాలను ఎగరవేయించేవాడు. అవి ఎగురుతూవచ్చి ఆయా సమీపం లోకివచ్చి వాలేవి. వాటినిచూసి ఆయన సంతోషించి వాటికి బహుమానంగా ఖరీదయిన ఆహారాన్ని పెట్టిస్తూండేవాడు.

మీర్ అమాన్ అలీ అనే పావురాలనిపుణుడు పావురాలరంగుల్ని కావలసినవిధంగా మార్చే కళలో ప్రత్యేకకృషి చేశాడు. కొన్నిచోట్ల ఈకలను పీకేసి అదే సైజులో వుండే వేరేరంగు ఈకలను ఆచోట జొనిపేవాడు. కొన్నాళ్ళకు ఆ ఈకలు అతుక్కుని అసలు ఈకలలా దృఢపడిపోయేవి. ఆతరువాత కొన్ని ఈకలకు రంగువేసేవాడు. ఆరంగులు కొన్నినెలలపాటు చెక్కుచెదరకుండా అలానే వుండిపోయేవి. అటువంటి ఒకొక్కపావురం ధర పదిహేనునుంచి ఇరవై రూపాయలవరకువుండేది. కాని రెక్కలు రాలు కాలం (కురీజ్)లో రెక్కలు రాలిపోయి ఆతరువాత 'అసలు రంగు' రెక్కలే మొలిచేవి. గొప్పజాతి పావురాలవలె సాధారణమైన పావురాలను రంగులతో మార్చడంకూడా ఈ కళవల్ల సాధ్యపడేది. (నవాబ్ పాలే అనేవ్యక్తి పావురాలను ఎగరేసే కళలో గొప్ప నిపుణుడు. గిరహ్ బాజ్ పావురాలను ఆయన తుపాకీగుళ్ళను వదిలినట్లు మంచివేగంగా దూసుకుపోయేలా ఎగరేసేవాడు. ఏచోట. లేదా ఏ ఇంటిమీద వాలాలంటే ఆచోట వాలేటట్లు గురిచూసి ఆయన గుడ్డను గుర్తుగా చూపించి వాటిని వదిలేవాడు. అవి మంచివేగంగా దూసుకుపోయి పల్టీలు కొట్టుకొంటూ గమ్యస్థానానికి చేరుకొని వాలేవి.)

వాజిద్‌అలీషా మటియాబుర్జ్‌లో ఎన్నో క్రొత్త క్రొత్త పావురాలను ప్రోగు చేశాడు. పట్టురెక్కల పావురాలజంటను ఆయన పాతికవేల రూపాయలిచ్చి కొన్నాడని చెప్పుకొనేవారు. ఆకుపచ్చరంగుతో చిలుకలవలె వుండే అందమైనపావురాలు కూడా ఆయనవద్ద వుండేవి. చివరిరోజులలో ఆయనదగ్గర ముప్పైవేల పావురాలుండేవి. వాటిని పెంచేందుకు పందలకొద్దీ పావురాలనిపుణులు ఉద్యోగులుగా వుండేవారు. పేరెన్నికగన్న పావురాలనిపుణుడు గులామ్ అబ్బాస్ వాళ్ళఅధికారిగా వుండేవాడు.

అభిరుచి, ప్రావీణ్యంగల పావురాలవిశేషజ్ఞులు పెంపుడుపావురాల రంగుల్నే కాక ఆకారాల్నికూడా తమ ఇష్టప్రకారం మార్చగలిగేసామర్థ్యాన్ని చూపించగలిగారు. ఒకగజం పొడుగు పావురాన్ని (శీరాజీ జాతి) 'గులీ' అనే మూడంగుళాల పావురాన్ని ఆ విశేషజ్ఞులు సృష్టించగలిగారు. పన్నెండేళ్ల అమ్మాయి జుట్టు ముడిలోంచి 'గులీ'ని ఎగిరించడం నేను స్వయంగా చూశాను. ఈ పావురాలవిశేషాలు ఇంతటితో పూర్తికాలేదు. ముందు అధ్యాయంలో ఇంకా వివరిస్తాను.

# 18

పెంపుడు పక్షులచేత పోట్లాడించి ఆనందించడం, తద్వారా ఉల్లాసంగా గడపడం లక్నోలోని ధనికులకు, రసికులకు పరిపాటి అయిపోయింది. పావురాలను బటేర్లను పెంచేమోజు, బటేర్లచేత పోట్లాడించే అభిరుచి భారతదేశంలో అన్ని ప్రాంతాలలోనూ వ్యాపించింది. ఈ దుర్మార్గమైన అభిరుచి దూరదృష్టిలేని ధనవంతులలోనే ఎక్కువగావుండడం దురదృష్టకరం; పావురాలను ఎగరవేసేందుకు, బటేర్లను పోట్లాడించేందుకు లక్నో ఉస్తాదులకే భారతదేశం నలుమూలలనుంచీ ఆహ్వానాలు అందుతూండేవి. ఈ హింసాయజ్ఞానికి లక్నో నివాసులయిన నిపుణులకే పౌరోహిత్యమనడం అతిశయోక్తి కాదు.

## చిలుకలు

పెంపుడుపక్షులచేత పోట్లాడించి ఆనందించే వ్యక్తులు పావురాలను ఎగర వెయ్యడంవైపు మొగ్గుచూపారు. దానిద్వారా మనోరంజన కార్యక్రమాలను ఏర్పాటు చేసుకొన్నారు. పావురాలనేకాక ఇంకా ఏయే పక్షులను పట్టుకొని ఎగరవేసి ఆనందం పొందేందుకు వీలుంటుందా అని మానవుడు బాగా ఆలోచించాడు. మీర్ ముహమ్మద్ అలీ అనేవ్యక్తి చిలుకలను పావురాలస్థాయికి తీసుకురావడంలో విజయాన్ని సాధించాడు.

(చిలుకస్వభావం కృతఘ్నతతో నిండివుంటుంది. జీవితమంతా దానికి విలువైన ఆహారమిస్తూ చక్కగా పోషించినప్పటికీ ఒక్కసారి పంజరంలోంచి తప్పించుకొంటే ఇంక మళ్లీ దొరకదు. తోతా అంటే చిలుక, చశ్మ అంటే కన్ను. ఈ రెండుపదాలు కలిపితే 'తోతా చశ్మ' అవుతుంది. దీనికి అర్థం 'అవిశ్వాసి' అని. దానికి మాటలు తెలుసు: నేర్పితే మాట్లాడుతుంది. జంతువుల అరుపులనుకూడా శిక్షణ ఇస్తే అనుకరిస్తుంది. తిట్లు నేర్పితే తిట్టడం నేర్చుకొంటుంది. కాని ఎగిరించేందుకు అది పనికిరాదు. అది పంజరాన్నివదిలిందా మళ్ళా కనిపించదు.

కాని మీర్ సాహబ్ అనే నిపుణుడు ఏయే ఉపాయాలతో వాటిని అదుపులో పెట్టగలగడంలో విజయాన్ని సాధించాడో 'అల్లా'కే తెలియాలి; ఆయన పది పన్నెండు

చిలుకలకు శిక్షణ ఇచ్చి ఆకాశంలోకి వదిలేసేవాడు. ఆయన ఈలవేసి 'రా' అని కేకవెయ్యగానే అవి వచ్చి తిన్నగా పంజరాలలోకి వెళ్ళిపోతూండేవి. ఆయన రోజూ హుస్సైనాబాద్‌కువెళ్ళి అక్కడ ఈ ప్రదర్శన చేస్తూండేవాడు)

పెంపుడుపక్షుల పోషణ, శిక్షణ వగైరా విషయాలలో లక్నోవాసులు వెచ్చించిన ధనాన్ని, ఆలోచనాశక్తినీ తమ స్వంతశరీరాలకోసం వ్యయపరచివుంటే నిజంగా అయోధ్య ఆస్థానచరిత్ర ఇంకోవిధంగా మారిపొయ్యేది :

## గాలిపటాల పోటీలు

గాలిపటాలు ఎగరవేయడం భారతదేశంలో అన్నిచోట్లా జరిగేపనే. ఈకాలంలో పిల్లలు, యువకులు గాలిపటాలను ఎగరెయ్యడంపట్ల ఎక్కువ అభిరుచి చూపిస్తున్నారు. ఈ అభిరుచినిచూస్తే ప్రాచీనకాలంనుంచీ ఈ గాలిపటాల ఆటలు, పోటీలు అనుస్యూతంగా వస్తున్నాయనిపిస్తుంది. కానీ ఇది నిజంకాదు. ఒక శతాబ్దంక్రింద భారతదేశంలో అసలు గాలిపటాలే లేవు. గాలిపటాల అభివృద్ధికి కేంద్రం లక్నో పట్టణమే :

ఐరోపాఖండప్పు దేశాలలోని బాలబాలికలు గుడ్డతో తయారైన ఒకరకం గాలిపటాలను దారంకట్టి పరిగెత్తుకుంటూ ఎగరేస్తూండేవారు. పరిగెత్తేంతసేపూ అవి గాలిలో ఎగురుతూనేవుంటాయి. కాని ఎక్కడైనా ఎప్పుడైనా ఆగిపోతే ఠక్కున అవి క్రిందపడిపోతూండేవి. కాని ఇవి ఎప్పుడు, ఎక్కడ కనిపెట్టబడ్డదీ ఇదమిద్ధంగా చెప్పడం కష్టం.

ఢిల్లీలో మొదటి షాహ్ ఆలమ్ పరిపాలనకాలంలో ఈ అభిరుచి ఏర్పడింది, ప్రారంభదశలో ఇది ధనవంతులవరకే సీమితమై వుండేది. వాటిలో రెండు వెదురు బద్దలు కొద్దికొద్దిదూరంలో ముందువెనుక ఎదురెదురుగా నిలబెట్టి కట్టేవారు. ఆ గాలిపటాలు, పైన మూడువైపులా గుండ్రంగా కొనలు తేరివుండేవి. వాటిలో ఒక ధనురాకారమైన వెదురుపుల్ల మధ్యలో అమర్చబడేది. దాన్ని 'ఝూడ్డా' అనేవారు. మరో రెండు కమానులను బాగా చీల్చి మెత్తబరచి పైనా క్రిందా అమర్చేవారు.

వాటిని 'కాంపులు' అనేవారు. పైనుండే కాంప్ ధనురాకారంగాను, క్రిందనుండే కాంప్ అర్ధ చంద్రాకారంగాను వుండేది. వాటిమధ్యలో సన్నని ఈలు దారాలువేసి బిగించేవారు. నాలుగువైపులా కాగితాలను మడిచి ఒక ప్రత్యేకమైన ఆకారపు మొన తేరిన గుమ్మటం తయారుచేసేవారు. దానిమధ్యలో పాతగుడ్డలతో తయారుచేసిన బంతిని నూనెలో ముంచి తీగెలతోకట్టి వ్రేలాడగట్టేవారు. నిప్పు అంటించి దానిని రాత్రిళ్లు బలమైన త్రాళ్లతోనో, పట్టుదారంతోనో ఎగరేసేవారు. అది తారాజువ్వలా పైకివెళ్ళి ఆకాశంలో లాంతరులా వెలుగుతూండేది. గాలి గుమ్మటానికి విరుద్ధంగా దానిని కావలసినప్పుడు పైకి ఎగరవెయ్యడం, అక్కర్లేదనుకొన్నప్పుడు క్రిందకు లాగడం ఎగరేసినమనిషి ఇష్టంమీద ఆధారపడివుండేది. అది గాలి వాలునుబట్టి అప్పుడప్పుడు తలక్రిందులుగా పల్టీలు కొడుతుండేది. కాని సాధారణంగా ఆకాశంలో గాలి పటాలలాగే వ్రేలాడుతూ వుండేది.

ఈకాలంలోనే కొందరు మనుష్యాకారపు మూర్తులను తయారుచేపి గాలిపటాల వలె వదులుతూవుండేవారు. ప్రప్రథమంగా వాటిని ఢిల్లీలోనే తయారుచేశారు. అవి ఇంకా అభివృద్ధిచెంది 'గాలిపటం' రూపాన్ని పొందాయి. గాలిపటాలను సర్వ సాధారణంగా పొడుగు వెడల్పు ఒకేవిధమైన కొలతలలో తయారుచేస్తారు. కనుక ఇవి గాలిలో తేలికగా ఎగిరేందుకు, ఎంతోసేపు గాలిలో వాటిని నిలిపేందుకూ ఎక్కువ అవకాశం లభించింది. వీటిని ఎగరవేసేమోజు హిందువులలోనే అధికంగా వుండేది. ఆకాశదీపంలోంచే గాలిపటం ఆవిర్భవించడంవల్ల గాలిపటాలకూ హిందూ మత సంప్రదాయానికి అవినాభావసంబంధం వుందనే నమ్మకం ఏర్పడసాగింది. ఈ గాలిపటాలను తెగకొట్టేందుకు, ఎగరవేసేందుకు 'తుక్కల్'లు (పెద్ద గాలి పటాలు) ఎగరసాగేయి. ఆకారంలో తేడా తప్పించి ఈ రెండింటికీ అట్టే భేదం లేదు. తుక్కల్‌ను గాలిపటంకంటె తేలికగా ఎగరవేయవచ్చు. దాని నడక, ఎగురుడు సొగసుగా వుంటాయి. గాలిపటం ఒకేచోట స్థిరంగా ఎగురుతుంది. తుక్కల్లో నడకకూడా వుంది కనుక గాలిపటాలవైపు దాని నడకను మళ్ళించి వాటిని పడ గొట్టేయడం తేలిక.

'కందీల్' అనబడే ఆకాశదీపాలను ఎగురవేసే అభిలాషను తుక్కల్ అణగ ద్రొక్కి ఆకాశంలో ఎంతో ఎత్తున తమ ఇష్టప్రకారం ఎగిరే గాలిపటాలనిర్మాణానికి

అంకురార్పణ చేసింది. ధనికులయిన మహమ్మదీయులలోను, కులీనులయిన హిందువులలోనూ కూడా తుక్కల్‌ను ఎగురవేసే అభిరుచి అభివృద్ధినొందింది. వీటికోసం ఎంతో డబ్బు ఖర్చుపెడుతూండేవారు. శ్రేష్ఠమైన తుక్కల్‌కు మారుపేరే గాలిపటం। వీటికి వినియోగపడే వెదురుబద్దలు ముర్షిదాబాద్ వెదురుబొంగులతో తయారయ్యేవి. దీనికి ఎనభై రూపాయలు ఖర్చు అయ్యేది. తళుకుబెళుకుల అలంకరణకోసం ఇరవై రూపాయలు, రంగుకాగితాలకు రెండురూపాయలు, మజాగా అయిదురూపాయలు మొత్తం ఒక గాలిపటానికి నూటఏడు రూపాయలవరకూ ఖర్చు అయ్యేది. (కొంత కాలానికి ఢిల్లీలోని గాలిపటాలమోజు గాలిలా లక్నోకివచ్చి చేరుకుంది. గాలిపటాలతోబాటు గాలిపటాలు తయారుచేసే నిపుణులు, గాలిపటాలను ఎగురవేసే మంచి ఆటగాళ్లు లక్నోవచ్చి చేరుకొన్నారు. లక్నోకివచ్చాక వారు గాలిపటాలను ఎగరవెయ్యడంమాత్రమేకాక పోట్లాడించేందుకు ఏర్పాట్లు చేశారు. అక్కడ తయారయ్యే బరువైన గాలిపటాన్ని ఒకమనిషి మోయగలగడం అసాధ్యంగా వుండేది. ఏడెనిమిది పిడుల బలమైనదారాన్ని రాట్నానికిచుట్టి గాలిపటానికి కట్టి రాట్నాన్ని పాతి ఇంకొకవ్యక్తి సహాయంతో గాలిపటాన్ని గాలిలోకి వదిలేవారు. రాట్నాలే గాలిపటాలభారాన్ని సంబాళిస్తూండేవి. పోటీ గాలిపటాన్నికూడా ఇదేవిధంగా వదిలేవారు. అవి రెండూ వలయాలు చుట్టుకుంటూ, పల్టీలు కొట్టుకొంటూ చాలా ఎత్తుకు ఎగిరిపోతూంటే ఆ రెండు రాట్నాలచక్రాలు ఖాళీ అయిపోతూండేవి. నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా తన గాలిపటాలను అయిదురూపాయల విలువచేసే వెండి లేక బంగారు జల్తారుతో అలంకరించేవాడు. దాన్ని పడగొట్టగలిగిన పందెగాడు ఆ జల్తారును తెచ్చిఇస్తే ఆయన అయిదురూపాయలిచ్చి తీసుకునేవాడు. ఒకవేళ ఆయన కివ్వడం సాధ్యపడకపోయినా ఎవరుపడితే వారు అయిదు రూపాయలిచ్చి ఆ గాలిపటానికి చెందిన జల్తారు కొనుక్కొనేవాడు.

ఆ రోజులలో లక్నోలోని గాలిపటాల పందెగాళ్ళలో మీర్ అమ్మూ, ఖ్వాజా మిఠన్, షేక్ ఇమ్‌దాద్ ప్రసిద్ధులు. ఒక చేనేతపారిశ్రామికుడు ఆ రోజులలో ఈ కళలో గొప్పప్రతిభ చూపించి ఎందరో ధనికులను ఈ గాలిపటాల పందాలవైపు ఆకర్షించగలిగాడు.

అమ్‌జద్ అలీషా కాలంలో 'గుడ్డీ' (బాదంకాయ ఆకారపు గాలిపటం) అవతరించింది. దాన్ని తుక్కల్‌కంటె తేలికగా తయారుచేయవచ్చు. తుక్కల్‌కు రెండు

త్రాళ్లు ఒక మొన వుంటాయి. కాని గుడ్డీకి ఒకే ఒకత్రాడు, ఒక మొన ఉంటాయి. వాజిద్ అలీషా కాలంలో ఒకటిన్నరరెట్లు గాలిపటాలు అంటే ప్రస్తుతకాలంలో వుండే గాలిపటాలలాంటివి తయారయ్యాయి. కాని వాటిక్రింద తుక్కల్‌కు జ్ఞాపక చిహ్నంగా చిన్న కాగితపు పువ్వు వుండేది. ఇంక నవాబ్ ముహమ్మద్ హుస్సైన్ ఖాం సాలార్ జంగ్. ఆగా అబూ తరాబ్ ఖాన్ మున్నగు కొందరు రసికహృదయులు కాగితపు పువ్వుకు బదులు గాలిపటంక్రింద చిన్నకాగితంతోక తగిలించసాగారు. అదే నేటి గాలిపటం ఆకారం: ఆ తరువాత గాలిపటం నిర్మాణంలో ఏవిధమైనమార్పూ ఇంతవరకూ రాలేదు. ఈనాడు భారతదేశపు గగనపథంలో ఎగిరే పూల గాలిపటాలు, తోక గాలిపటాలు ఆనాడు లక్నోలోని గాలిపటాల నిపుణులచే తయారు చేయబడిన నమూనాలకు చెందినవే! అందరి ఆదరాభిమానాలనూ ఆ నమూనాలు నేటికీ చూరగొనగల్గుతున్నాయి.

గాలిపటాల పోట్లాటకై ప్రారంభదశలో, తుక్కల్‌లాగే దారాన్ని వదులు కొంటూ గాలిపటాన్ని పైకి పోనిచ్చేపద్ధతి అమలులోవుండేది. చాలా పెద్దపెద్ద గాలిపటాలు తయారవుతూండేవి. శేర్లకొద్దీ నూలు వీనికై వినియోగపరచవలసివచ్చేది. 'విలాయతీ' అని పిలువబడే వస్తాద్ విలాయత్ అలీ అయోధ్య ఆస్థానం అంతమై ఆంగ్లప్రభుత్వం స్థాపన జరిగిన క్రొత్తరోజులలో పోటీ గాలిపటాలను తన గాలిపటాలతో కోసివేయించడంలో సిద్ధహస్తుడు. ఆయన మటియా బుర్జ్‌లో మాతో పాటే ఉంటూండేవాడు. లక్నోలో ఆయనలాంటి గాలిపటాల నిపుణులు ఎందరో వుండేవారు. కాని వారిపేర్లు నాకిప్పుడు గుర్తుకు రావడంలేదు.

ఆంగ్లప్రభుత్వం స్థిరపడిన ప్రారంభకాలంలో గాలిపటాల పోటీపద్ధతి అమలులోకి వచ్చింది. తక్కువదారంతో గాలిపటాలు ఎగరవేసే యువకులు, ఎక్కువ దారాన్ని ఉపయోగిస్తూ ఆకాశంలో చాలా ఎత్తువరకు తమ గాలిపటాలను ఎగరవేసే వ్యక్తుల పెద్దపెద్ద గాలిపటాలను మధ్యలోతెంపి మోసగిస్తూండేవారు. అందుకు తక్కువ దారాలను ఉపయోగించే యువకులు తమ దారాలకు గాజుపెంకులపొడినీ, తుమ్మజిగురునీ పూసి కోసేశక్తిని కలుగజేసేవారు. ఇటువంటివ్యక్తుల్ని పెద్దమనుష్యులు, ఉస్తాదులు అసహ్యించుకొనేవారు. అందువల్ల వాళ్లకు దూరంగా తీసుకువెళ్ళి తమ పెద్దపెద్ద గాలిపటాలను ఎగరవేసుకొంటూండేవాళ్లు. కాని ఆ తరువాత,

తరువాత ఈ లాగుడు ఆటే గాలిపటాలపోటీలలో గొప్ప కళగా పరిణమించింది. యువతరంలో ఈ కళలో ఎందరో నిపుణులు తయారయ్యారు. వీళ్ళు వేలకొద్దీ ఖరీదుచేసే ఆస్తులు తగలేసుకొని ఉస్తాదు లయ్యారు. కొంపలు కూల్చుకొన్న ఈ వస్తాదులకు ఇంట్లో తిండివున్నా లేకపోయినా గాలిపటాలరంగంలో ప్రతిష్ఠమాత్రం మిగిలింది. గాలిపటాలపోటీలుచూసే ప్రేక్షకులు వీరిని కళ్ళకద్దుకొని ఆదరాభిమానాలతో ప్రశంసిస్తూంటారు.

# 19

లక్నోలోని సంగీతాన్నిగురించి, దీనికి సంబంధించిన కళావేత్తలనుగురించి ఇంక వివరిస్తాను.

మానవప్రకృతి అన్నికళలలో ముందుగా సంగీతకళను అన్వేషించగలిగింది. ఏ మాటలను ఆవేశంతో వ్యక్తపరచాలనుకొన్నాడో ఆ మాటలను పాటరూపంలో వ్యక్తపరచడం, ఏరకమైన విన్యాసాలతో మనోగతభావాలు ఉప్పొంగుతాయో వాటికి అనువుగా నట్యంద్వారా వ్యక్తంచేయడం మానవుడు అలవాటు చేసుకొన్నాడు. అన్నిటికంటె అధికమైన ఉత్సాహం, ఏకాగ్రత ఆరాధనలో లభిస్తూండడంవల్లనూ, భరించరాని ప్రణయవేదనను అభివ్యక్తంచేయడానికి సంగీతంలోనే వీలుండడంవల్లనూ ప్రాచీనకాలంలో సంగీతం ఆరాధనకోసం, ప్రణయవ్యక్తీకరణకోసం ఆవిర్భవించింది. భారతదేశంలోమాత్రం గానం ఆరాధననుండే ఉద్భవించింది. ప్రాచీనకాలంలో ఇక్కడిగాయకులు బ్రాహ్మణులే. పూజలు, పునస్కారాలు వారు స్వయంగా చేస్తూండేవాళ్లు. ఇతరులచేత చేయిస్తూండేవాళ్లు. ఆ సమయాల్లో వారు తమ ఆరాధ్యదైవాలను స్తుతిస్తూ భక్తిగీతాలు పాడేవాళ్లు. శ్రీకృష్ణుని అవతారం, ప్రేమసంగీతాన్ని ఉద్భవింపచేసింది.

భారతదేశానికివచ్చిన ముసల్మానులతో సంగీతంకూడా వచ్చింది. ఆ సంగీతాన్ని మొట్టమొదట ఇబ్నె ముసహ్రజ్ కల్పించాడు. అనంతరం ఇరాక్‌లో అబ్బాసీ

ఆస్థానం స్థిరపడినకాలంలో అరబ్బీ, పారసీ సంగీతాల మేలు కలయిక ఒక నవీన సంపూర్ణసంగీతాన్ని ఆవిర్భవింపజేసింది. అది ప్రపంచమంతా వ్యాపించింది. అదే చివరికి 'ఈరానీ' సంగీతంగా చెలామణీ అవుతోంది. ముసల్మానులద్వారా ఈరానీ సంగీతం భారతదేశానికి వచ్చింది. ఆ సంగీతాన్ని తెచ్చిన సంగీతకళాకారుల స్మృతి చిహ్నంగా కవ్వాలీలు పాడేవారు భారతదేశంలో ఇప్పటికీ ఉన్నారు. సారంగీ, సరోద్, ఛంగ్, శహనాయీ, బర్బత్, రబాబ్ మున్నగునవి వాళ్ళవాద్యాలు.

భారతదేశంలో ప్రతిరంగంపైనా ముసల్మానులప్రభావం కొద్దో గొప్పో పడింది. విద్యారంగాన్నీ, కళలనూ, సభ్యతనూ, రమారమి అన్నిటినీ ముసల్మానులప్రభావం ఎంతో కొంత మార్చగలిగింది. కాని భారతీయసంగీతంమీదమాత్రం ముసల్మానుల ప్రభావం అట్టే పనిచేయలేకపోయింది. భారతీయసంగీతం ఉచ్చకోటికి చెందినదీ, నియమబద్ధమైనదీ, శ్రావ్యమైనదీ అయివుండడంవల్ల విదేశ సంగీతప్రభావానికి అది లొంగలేదు. అయితే, విదేశాలలోవుంటి అక్కడి భాషను, సభ్యతను జీర్ణించుకోగలిగితేనే అక్కడి భాషను, సంగీతాన్నీ నేర్చుకోవాలనే ఉత్సాహం కలుగుతుంది. విదేశసంగీతాలు స్వదేశాలపై అధిపత్యం వహించలేకపోవడానికి ముఖ్యకారణం ఇదే. అందువల్లే ఆక్రమణదారులుగా భారతదేశానికివచ్చి, స్థిరపడ్డాకకూడా మొదట్లో అరబ్బులు, ఈరానీలు భారతీయసంగీతంలోని మాధుర్యాన్ని చవిచూసేందుకేమాత్రం ప్రయత్నించలేదు. అయితే కొన్ని దశాబ్దాలపాటు ఇక్కడ నివసించాక, వారిలో భారతీయత ప్రవేశించడం జరిగాక, వారిలో స్వదేశభావన నశించిపోయాక భారతీయసంగీతంలోని తీయదనాన్ని ఆస్వాదన చేయగలిగారు. భారతీయసంగీతంలో మార్పులు చేర్పులు, కూర్పులు చేసేంతయోగ్యత, పాండిత్యం తమలో లేదని తెలుసుకొని తక్కువచూపు చూడకుండా భారతీయసంగీతాన్ని విని, నేర్చుకొని ఆనందించగలిగారు.

అయినప్పటికీ కొన్నాళ్ళకు ఈరానీ కవ్వాలీగీతాలు భారతీయసంగీతాన్ని కొద్దిగా ప్రభావితం చేసినవి. వాని అనేకరాగాలు భారతీయ సంగీతంలో లీనమైపోయాయి. జంగూలా, జీఫ్, శాహానా, దర్బారీ, జిలా, (కమాచ్) వగైరా రాగాలన్నిటికి మాతృక ఈరానీ సంగీతమనే చెబుతారు. ఇవన్నీ భారతీయ సంగీతంలో కలిసిపోయాయి.

అమీర్ ఖుస్రో ఈ రెండుసంగీతాలనూ నేర్చుకొన్నాడు. వీటి రెండింటినీ ఐక్యపరచి కొత్తసంగీతాన్ని రూపొందించేందుకు అమితంగా కృషిచేశాడు. సితార్ వాద్యాన్ని ఆయనే ప్రవేశపెట్టాడని చెప్తారు. అనేక స్వరాలను ఆయన రచించాడనేందు కేమాత్రం సందేహంలేదు. అయితే ఖుస్రో భారతీయ సంగీతానికి ఏయే విశేషతలను, ప్రత్యేకతలను చేకూర్చిపెట్టాడో తేల్చి చెప్పడం చాలా కష్టం.

ముసల్మానులలో రాజుల హయాంకుముందే శేఖులు, సాధువులు సంగీతం వైపు ఆకర్షితులయ్యారు. ప్రాచీనకాలంలో ఇరాక్, ఈరాన్‌లలో భక్తులు భక్తి భావంతో సంగీత, నృత్యగోష్ఠులు ఏర్పాటుచేసి వానిలో పాల్గొంటూండేవారు. అదే విధంగా ప్రారంభదశలో ముస్లింసాధువులు భారతదేశంలో గోష్ఠుల్ని ఏర్పాటు చేసి వాటిలో పాల్గొంటూండేవారు. హిందూ గాయకులుకూడా ఈ గోష్ఠులలో పాల్గొని భక్తిగీతాలని పాడుతుండేవారు.) భారతదేశంలోని మహమ్మదీయ రాజుల ఆస్థానాలలోకూడా ఇటువంటి భక్తులయినగాయకులు, నాట్యంచేసేవేశ్యలు వుండే వాళ్లు. కాని వారిపై ఏ ఈరానీగాయకుడో అధికారిగా నియమించబడేవాడు. అందు వల్ల వీరి నృత్య, సంగీతాలపై ఈరానీప్రభావం తప్పేదికాదు. మహమ్మద్ తుగ్లక్ పరిపాలనాకాలంలో భారతదేశం మొత్తంమీద అమీర్ శమ్స్ ఉద్దీన్ తబ్రేజీ గొప్పగాయకుడుగా పేరుపొందాడు. సంగీతరంగంలోని గాయనీ, గాయకు లందరూ ఆయన అధీనంలోనే వుండేవారు. ఆ రోజులలో దేవీగఢ్ (దౌలతాబాద్) వద్ద కళాకారుల ఊరొకటి తయారయింది. దానికి తర్‌బాబాద్ అని పేరు పెట్టారు. ఆ ఊరిలో నాలుగురోడ్లు కలిసేకూడలిలో ఒక పెద్దమండపం కట్టించబడింది. రోజూ సాయంత్రం సంగీతకళాకారుల నాయకుడువచ్చి అక్కడ కూర్చుంటూండే వాడు. ఆయన సమక్షానికి ఊళ్లోని గాయకులు, వేశ్యలు వంతులప్రకారం వచ్చి పాటలుపాడి వెళుతుండేవారు. వారిలో నియమప్రకారం నమాజ్‌చదివే యోగ్యులైన ముసల్మానులు అధికంగా వుండేవారు. ఆ ఊరిలో అక్కడక్కడ మసీదు లుండేవి. రమ్‌జాన్ మున్నగు పర్వదినాలలో తరావీహ్ చదువుతారు. (రమ్‌జాన్ నెలలో రాత్రి నమాజు అయ్యాక ప్రత్యేకంగా పఠించబడే నమాజ్‌లో ఖురాన్ చదువుతారు. దానికి తరావీహ్ అని పేరు) రాజులు అక్కడికివచ్చి ఆ సంగీతం వినేవారు. చాలామంది ముస్లిం చక్రవర్తులుకూడా అక్కడికివెళ్ళి సంగీతం విన్నారని ప్రసిద్ధి. సంగీత

బృందం నాయకుడూ గ్రామాధికారీ సాధారణంగా ముసల్మానే అయివుండడంవల్ల అరబ్బీ, ఈరానీ, భారతీయసంగీతాల సంగమం అక్కడ ఏర్పడేది. ఈ మిశ్రమ సంగీతం ఎంత శ్రావ్యంగా వీనులకు విందుచేస్తూ వుంటూండేవో పాఠకులే అంచనా వేసుకోవలసి వుంటుంది.

ఉత్తర భారతదేశంలో మధుర, అయోధ్య, కాశీ మున్నగు పుణ్యక్షేత్రాలలో సంగీతం కళ పరాకాష్ఠ నందుకొన్నది. జౌన్‌పూర్ శర్కీ సుల్తానులలో సుల్తాన్ హుసైన్ శర్కీకి సంగీతమంటే ఎంతో మక్కువ. ఆయన స్వయంగా మంచి గాయకుడు. అయోధ్య, కాశీ పట్టణాలు రెండూ ఆయన రాజ్యంలోనే వుండేవి. కనుక ఆయన విస్పందేహంగా భారతీయసంగీతానికి ఎంతో మేలు చేకూర్చి వుంటాడు.

అక్బర్ చక్రవర్తి సంగీతాన్ని, గాయకులనూ అమితంగా అభిమానించేవాడు. ఆయన తన ఆస్థానసవరత్నాలలో గాయకుడు తాన్‌సేన్‌కు సముచితస్థానం ఇచ్చి గాయకులనూ, సంగీతాన్నీకూడా గౌరవించాడు. ఒక మహమ్మదీయ చక్రవర్తిచూపిన ఈ శ్రద్ధనుచూసి ముగ్ధుడై తాన్‌సేన్, ఆయనకుమారుడు విలాస్ ముస్లింమతాన్ని స్వీకరించారు. ఆయనవంశీయులు చక్రవర్తి ప్రోత్సాహంతో భారతీయసంగీతాన్ని దినదినాభివృద్ధి నొనరించారు. అనంతరం ఏర్పడిన ఆస్థానాలలో కూడా తాన్‌సేన్ వంశానికిచెందిన గాయకులకే ఎక్కువప్రాధాన్యం వుంటూండేది. నేడు ఈ వంశీయులు తమను మొగలాయీ ఆస్థానానికిచెందిన గాయకులుగా భావించుకుంటారు. ఈ వంశంద్వారానే హిందూసంగీతకళ ముసల్మానులకు లభించిందని అంటారు. ఇంతకుముందే వివరించినట్లు ఈ వంశానికి చాలాముందే హిందూ సంగీతకళను ముసల్మానులు నేర్చుకొన్నారు. భారతీయ సంగీతకళాప్రవీణులనేకులు ముసల్మానులే అయివుండడం, పై నిజాన్ని ఋజువుపరుస్తుంది. ఢిల్లీలో సంగీత కళనుగురించిన తొలిగ్రంథం 'శమ్స్-ఉల్-అస్వాత్'. షాజహాను పరిపాలనా కాలంలో రచించబడింది. కాని దానిప్రతులు ఇప్పుడు దొరకడంలేదు. అనంతరం రెండవ అక్బర్‌కాలంలో, పండితుల సంస్కృతవిద్వాంసుల సహకారంతో 'మీర్జా ఖాన్' అనే ముసల్మాన్ గాయకుడు 'తుహఫా-తుల్-హింద్' అనేగ్రంథం రచించాడు. ఇందులో జ్యోతిష, శిల్ప, సాముద్రిక, నాయికాభేద, ఇంద్రజాల, కోక

శాస్త్రాలనుగురించి విపులంగా చర్చించాడు; వీటితోబాటు సంగీతకళను గురించికూడా విస్తృతంగా వివరించాడు.

ఢిల్లీలో ఇంతమాత్రమే ముందంజవేసి, ఈ ఆకర్షణీయమైన సంగీతకళ లక్నో వచ్చి అయోధ్య ఆస్థానాన్ని వరించింది. నవాబ్ షుజా ఉద్దౌలా గుణగ్రహణ పారీణత, ఔదార్యం భారతీయ సంగీతకళావేత్తలనందరినీ లక్నోకు ఆకర్షించగలిగాయి. అప్పటికే అయోధ్య ఆస్థానంలో కాశీలో ప్రాచీన సంగీతపాఠశాలలు వుండేవి. అక్కడ జౌన్‌పూర్ శర్కీరాజుల సంగీతప్రియత్వానికి, ఇంకా కొన్ని జ్ఞాపకచిహ్నాలు మిగిలివున్నాయి. ఢిల్లీకిచెందిన ప్రసిద్ధగాయకులు యాసీన్ ఖాన్ ఆధీనంలోని పాఠశాలలలోని సంగీతాచార్యులుకూడా లక్నోకుచేరడంతో సంగీత రంగంలో నవయుగం ప్రారంభమైంది.

'షుజా ఉద్దౌలాకు నాట్య, గానాలపట్ల చాలా అభిరుచి వుండేది. వేలకొద్దీ గాయనులయిన వేశ్యలు ఢిల్లీనుంచీ దేశం నలుమూలలనుంచీ లక్నో చేరుకొన్నారు. అయోధ్య ఆస్థానంలోని ప్రధానమంత్రి, ఇతర అధికారులు, సైనికాధికారులు ఏ ఊరు వెళ్ళినా తమవెంట నర్తకీమణులను, గాయకులైన వేశ్యలనూ, తీసుకు వెళుతూ వుండేవారు' అని 'తారీఖ్-ఏ-పైజాబాద్' రచయిత తనగ్రంథంలో వ్రాశాడు.

దీనిఫలితంగా నవాబ్ ఆసఫ్ ఉద్దౌలా బహాదుర్ పరిపాలనకాలంలో పార్సీ భాషలో 'ఉసూల్-ఉల్-నగ్‌మాత్-ఉల్-ఆసఫియా' అనే ఉద్గ్రంథం వ్రాయబడింది. భారతీయసంగీతకళపై దీనినిమించిన గ్రంథమేదీ ఇంతవరకూ రచింపబడలేదు. కాని ఈ గ్రంథం ప్రతులుకూడా చాలా పరిమితసంఖ్యలోనే దొరుకుతాయి. నేనొక ప్రతిని సంపాదించి చదివాను. దీని రచయితదృష్టి నిశితమైంది. ఆయన గొప్ప విద్వాంసుడు. అరబ్బీ, పార్సీ, సంస్కృతభాషలు క్షుణ్ణంగా తెలుసును. భారతీయ సంగీతకళా రహస్యాలను పాఠకులకు అందించేందుకు విజయవంతంగా ప్రయత్నం చేశాడు. అసద్ ఉల్లాహ్ ఖాన్ కౌకబ్ సంగీతకళావేత్త. కలకత్తాలో భారతీయ సంగీతాచార్యుడుగా తనపదవిని నిర్వహించాడు. 'సంగీతకళకు సంబంధించిన సంపుటిని సిద్ధపరచాడు; అనుభవజ్ఞులయిన సంగీతవేత్తలనుంచీ అనేక ప్రాచీన

గ్రంథాలనుంచీ అనేకవిషయాలు సేకరించి ఈ సంపుటి తయారుచేశాను. దీన్ని ప్రచురించేందుకు ఏర్పాటుచేస్తే సంతోషిస్తాను' అని నాకు లేఖవ్రాస్తూ ఆయన ఆ సంపుటిని నాకు పంపారు. అనంతరం కొన్నాళ్ళకు ఆయన స్వర్గస్థులయ్యారు. ఈ గొప్పరచన ఇంతవరకూ ప్రచురింపచేయలేకపోయాను. త్వరలో ప్రచురించక పోతే ఈ సంపుటి పాడైపోతుంది. కనుక ఎవరైనా ధనికులు దీన్ని ప్రచురించే ఏర్పాటుచేస్తే మనదేశానికీ, ప్రాచీనచరిత్రకు గొప్ప ఉపకారం చేసినవారవుతారు.

అసఫ్ ఉద్దౌలా పరిపాలనాకాలంలో సంగీతకళ ఎంత గొప్ప ప్రగతిని సాధించ గలిగిందో ఈ సంపుటి ఋజువు చేస్తుంది. దీని రచయిత ఒక గొప్ప పరిశోధకుడని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆయన ఈసంపుటిలో ఇబ్నేసీనా చికిత్సనుంచి పార్సీ సంగీతనియమాలవరకూ స్పష్టంగా వివరించారు. 'దిల్ గుదాజ్' పత్రికలో ఒక వ్యాసం రచించేందుకు ప్రొఫెసర్ 'కౌకబ్' గారిని కోరాను. ఆయన ఈ గ్రంథ ప్రతితోబాటు వ్రాసినలేఖనే పైన ఉటంకించడం జరిగింది. ఆ పుస్తకం పూర్తిగా చదివినతరువాత సంగీతకళ లక్నోలో చాలా ప్రగతిని సాధించగలిగిందనే విషయం విదితమైంది. ఆయన మరికొంతకాలం జీవించివున్నట్లయితే సంగీతకళకు ఎంతో ఉపకారం జరిగివుండేది.

నవాబ్ సఆదత్ అలీ ఖాన్ సమయంలో సంగీతాన్ని చిన్నచూపుతో చూడడం జరిగింది. గాజీ ఉద్దీన్ హైదర్‌కాలంలో 'హైదరీ' అనే గొప్పసంగీతవిద్వాంసుడు లక్నోలో వుండేవాడు. ఆ మహాశయుడు ఎప్పుడూ ఏదో పోగొట్టుకొన్నవ్యక్తిలా కనిపించేవాడు. అందువల్ల ఆయనను 'పిడే హైదరీ ఖాన్' అని పిలుస్తూండేవారు. ఆయన గోలాగంజ్‌లో నివసిస్తూండేవాడు. గాజీ ఉద్దీన్ హైదర్‌కు ఆయన పాటలు వినాలనేకోరిక వుండేది. కాని ఆయనకు అటువంటి అవకాశమే చిక్కలేదు. ఒక రోజున సాయంత్రం గాజీ ఉద్దీన్ హైదర్ గుర్రమెక్కి నదిఒడ్డున వాహ్యాళికి బయలుదేరాడు. రోమన్ గేట్‌దగ్గర 'పిడే హైదరీ ఖాన్' వెళుతుండడాన్ని ప్రజలు గమనించారు. పాదుషాగారికీ విషయం చెప్పారు. ఆయన సంతోషంగా హైదరీని పిలిపించాడు. 'ఏమయ్యా హైదరీ! మీ సంగీతం నాకు వినిపించకలవలేదా?' అని పాదుషా అడిగాడు. 'ఎందుకు వినిపించను? కాని నాకు మీ ఇల్లు ఎక్కడుందో తెలియదే!' అన్నాడు హైదరీ. రాజు అతడిమాటవిని నవ్వాడు. 'సరే, నాతో

'లండి, కూడా తీసికెళతాను' అన్నాడు. 'మంచిది' అని హైదరీ చక్రవర్తితో కూడా బయలుదేరాడు. ఛత్తర్ మంజిల్ దగ్గర తక్కున ఆగి 'నేముందు పూరీలు, బాలాయీ (మీగడ తారక) తినిపిస్తేనే పాటలు పాడతాను' అన్నాడు హైదరీ. బాద్‌షా సరేనని తీసుకువెళ్ళి పాటలు విన్నాడు. కొద్దిసేపు విని ఆయన ఆనందించాడు. కాని సంగీతంలో లీనమైపోవడంవల్ల ఆయన స్పృహతప్పి పడిపోయాడు. ఆయన అలా పడిపోవడం గమనించి హైదరీ తనపాట నాపుచేశాడు. పాదుషా కొంతసేపటికి తేరుకొని మళ్లీ పాడమని కోరాడు. అప్పుడు, హైదరీ 'మీ పెద్దహుక్కాలో నింపిన ఈ పొగాకు చాలా బాగున్నట్టుందే! దీన్ని మీరే దుకాణంనుంచి తెప్పించారేమిటి?' అని అడిగాడు. గాజీ ఉద్దీన్ హైదర్‌లోకూడా కొద్దిగా వెర్రికళ లుండేవి. ఈ ప్రశ్న వినేసరికి రాజుకు చిర్రెత్తుకొచ్చింది. అక్కడి అధికార్లు 'ప్రభూ! ఇతడు వెర్రివాడని తమకు తెలుసుకదా! ఇతనికి తాను ఎవరితో మాట్లాడుతున్నదీ ఇంతవరకూ తెలియక ఏదో వాగాడు. క్షమించి వదిలెయ్యండి' అన్నారు.

పాదుషా ఆదేశానుసారం అధికారులు హైదరీని వేరేగదిలోకి తీసుకువెళ్ళి పూరీలు, మీగడ తినేందుకిచ్చారు. శ్రేష్ఠమైన పొగాకువేసి హుక్కా అతనిముందు వుంచారు. హైదరీ ఒక పావుసేరు పూరీలను, అర్ధపావుసేరు వెన్ననీ, ఒక కానీ (రెండుపైసలు) పంచదారనీ అలవాటుప్రకారం అడిగిపుచ్చుకొని తనభార్యకు పంపించాడు. ఇక్కడ ఇలావుండగా అక్కడ పాదుషా మధుపానంలో నిమగ్నుడయ్యాడు. కొంతసేపటికి హైదరీని పిలిపించి ఆయన పాడమన్నాడు. హైదరీ గొంతు సవరించుకొంటూండగా 'నీ పాటలతో నన్ను సంతోషపెట్టకూడదు. ఏడిపించాలి. అలా చేయలేకపోతే నిన్ను కాళ్లూ చేతులు కట్టించి గోమతీనదిలో పారేయిస్తా తెలిసిందా?' అన్నాడు పాదుషా. అప్పటికికాని హైదరీ, పాదుషాను గుర్తించలేకపోయాడు. 'ప్రభూ, ప్రయత్నిస్తాను. ఇంక అల్లాయే నా రక్షకుడు' అని హైదరీ పూర్తిసామర్థ్యంతో పాడనారంభించాడు. కొద్దిసేపటికే పాదుషా ఏడవడం ప్రారంభించాడు. 'హైదరీఖాన్! కోరుకో! ఏంకావాలో వెంటనే చెప్పు' అన్నాడు రాజు. 'కావలసింది మాటతప్పకుండా నిజంగా ఇస్తారా?' అని హైదరీ రెట్టించి అడిగాడు. పాదుషా వాగ్దానం చేశాడు తప్పకుండా ఇస్తానని. 'మీరు నన్నింకెప్పుడూ పాడమని

అడగకూడదు. మీరెప్పుడూ ఇంక నా పాట వినకూడదు. ఇదే నా కోరిక!' అన్నాడు హైదరీ. 'ఎందువల్ల ఇలాంటికోరిక కోరుతున్నావు?' అన్నాడు పాదుషా ఆశ్చర్యపోతూ. 'మీకేం? మీకు నచ్చకపోతే నన్ను చల్లగా చంపించేస్తారు. మళ్లీ నాలాంటి హైదరీ సంగీతప్రపంచానికి దొరుకుతాడా? మీరు చచ్చినా ఏం ఫర్వా లేదు. అయోధ్య ఆస్థానానికి వెంటనే మరోపాదుషా మీరు లేనిలోటును పూరించి పరిపాలించేందుకు తయారవుతాడు' అన్నాడు హైదరీ. పాదుషాకు ఎంతో కోపం వచ్చి మొహం చిట్లించుకొని పక్కకు తిరిగాడు. ఈ అవకాశం చూసుకొని హైదరీ తనఇంటికి బయలు దేరి వెళ్లిపోయాడు.

గాజీ ఉద్దీన్ హైదర్‌కాలంలోనే లక్నోలో ఒక గొప్ప సంగీతకళావేత్త వుండే వాడు. నసీర్ ఉద్దీన్ హైదర్‌కాలంలో వేలకొద్దిగాయకు లుండేవారు. కాని వాళ్ళలో ఏ ఒక్కరూ అంత నిష్ణాతులుకారు. మహమ్మద్ అలీ పాదుషా, అమ్‌జద్ అలీషాల కాలం పెద్దలకాలం. మహమ్మద్ అలీషా ముసలితనంమూలంగా చైతన్యశూన్యుడులా వుండేవాడు. అమ్‌జద్ అలీషా తన తండ్రి అనుమతిలేనిదే ఏపని చేసేవాడు కాదు. అందువల్ల పట్టణంలోని ధనికులు, రసికులు చాటుమాటుగా సంగీత నృత్య కళలను ఆరాధిస్తూండేవారు. ఆరిపోయే దీపానికి వెలుగెక్కువన్న సామెతగా అదే విధంగా అయోధ్య ఆస్థానం పతనమయేముందు వాజిద్ అలీషా కాలంలో లలిత కళలన్నిటికీ లక్నోలో అమితమైనప్రోత్సాహం లభించింది. ఆయన యౌవనదశలో సంగీతకళ పరాకాష్ఠ నందుకోగలిగింది.

వాజిద్ అలీషా కాలంలో లక్నోలో సంగీతకళావేత్తల బృందం ఒకటి ఏర్పడింది. కాని ఆస్థాన సంగీతవిద్వాంసులలోను, బిరుదుపొందిన సంగీతజ్ఞులలోనూ అట్టే ఎక్కువప్రావీణ్యం ఉండేదికాదు. రామ్‌పూర్‌నివాసి 'కుతుబ్ ఉద్దౌలా' సితార్ వాయించడంలో గొప్ప ఘటికుడు. తన కళలో మంచిప్రావీణ్యాన్ని సంపాదించాడు. అజీజ్ ఉద్దౌలా, ముసాహబ్ ఉద్దౌలా, రజీ ఉద్దౌలా మంచి గాయకులే. కాని అంతగొప్ప సంగీతకళానిధులు మటుకు కాదు. ఆస్థానం దయకు పాత్రులు కాగలగడంవల్ల వారికి పేరు ప్రఖ్యాతు లేర్పడ్డాయి. ప్యారే ఖాన్, జాఫర్ ఖాన్, హైదర్ ఖాన్, బాసిత్ ఖాన్ మున్నగువారు సంగీతకళలో నిష్ణాతులు. తాన్‌సేన్ బాణీలో అద్భుతంగా పాడగలిగే గొప్ప గాయకులు. ఈ వంశమునకుచెందినవారిలో

రామ్‌పూర్ సంస్థానంలోని వజీర్ ఖాన్, పర్‌సండా సంస్థానంలోని ముహమ్మద్ అలీఖాన్‌కూడా చెప్పుకోదగిన గొప్ప గాయకులు. ముహమ్మద్ అలీఖాన్, బాసిత్ ఖాన్ పుత్రుడు. నా తండ్రి నేమత్ ఉల్లాహ్ ఖాన్ బాసిత్ ఖాన్‌గారిదగ్గరే సంగీతం నేర్చుకొన్నారు. ఆయన (నేమత్ ఉల్లా ఖాన్) సుమారు పదకొండుసంవత్సరాలు మటియా బుర్జ్‌లో వాజిద్ అలీషా ఛత్రచ్ఛాయలో నివసించారు. అనంతరం ముప్పై సంవత్సరాలపాటు నేపాల్‌ప్రభుత్వంలో ఆస్థానసంగీత విద్వాంసులుగా సంగీతకళకు సేవచేశారు. వాజిద్ అలీషాకాలంలో సంగీతానికి సముచితమైన ఆశ్రయం లభించింది. కాని సంగీతశాస్త్రం తన ఉన్నతస్థాయినుంచి పడిపోయింది. చిన్నవిషయాలవైపు వచ్చేసింది.

లక్నోలో కదర్‌పియా అనే ఆయన తుమ్రీలను వ్రాసివ్రాసి జనసామాన్యానికి అందించాడు. అందువల్ల సంగీతప్రవాహం తప్పుడుదారికి వళ్ళింది. ఫలితంగా సంగీతప్రియులలో అనేకులు శాస్త్రీయసంగీతాన్ని వదిలేసి కదర్‌పియా వ్రాసిన తుమ్రీలను పట్టుకొని పాకులాడడం జరిగింది. ముహమ్మద్ షా రంగేలీ కాలం నుంచే సంగీతస్థాయి దిగజారిపోవడం మొదలైంది. అనంతరం మియాఁ షోరంగ్ ఖయాల్ (కల్పన) ను రచించడంవల్ల సంగీతస్థాయి దిగజారిపోయింది. అయితే కదర్‌పియా తుమ్రీలవల్ల జరిగినంతహాని సంగీతానికి ఖయాల్‌వల్ల జరగలేదు. సాధారణప్రజలేమిటి, ధనికులేమిటి అంతా శాస్త్రీయసంగీతాన్ని వినేందుకు ఏమాత్రం అభిలషించడం లేదు. పైగా దాన్ని అవహేళన చేస్తున్నారు. గొప్ప సంగీతవిద్వాంసుడైన ప్యారేఖాన్‌వద్ద, వాజిద్ అలీ షా ఆస్థాన సంగీతవిద్వాంసులయిన అనీస్ ఉద్దౌలా, ముసాహిబ్ ఉద్దౌలా సంగీతవిద్యను నేర్చుకొన్నారు. వాళ్లు ఆయనదగ్గర నేర్చుకొన్నసంగీతం చాలా ఉచ్చశ్రేణికి చెందినదని చెప్పవచ్చు. అయితే ఏం లాభం? ఆస్థానాలకి ఆ రకం సంగీతం పనికిరాదు. కైసర్ బాగ్‌లో జరిగే రాసలీలకు ఈ సంగీతం ఎలా పనికివస్తుంది? కింది తరగతులవారికి, ముఖ్యంగా రసికులనూ, రసికురాళ్లనూ ఆకట్టుకోగలిగే చౌకబారుసంగీతం అక్కడ చెలామణి అవుతూండేది. అయినప్పటికీ వాజిద్ అలీషా కూడా బాసిత్‌ఖాన్‌వద్ద సంగీతాన్ని నేర్చుకోవడంవల్ల ఆయనకు సంగీతశాస్త్రంలోని లోతుపాతులు తెలుసు. అందువల్ల ఆయన సంగీతకళావేత్తలను, వారి సంగీతాన్ని ప్రజలు వినినా వినక

పోయినా లెక్క-చేయకుండా సన్మానించి ఆదరిస్తూండేవాడు. అధికార్ల చేత, ప్రజల చేతా కూడా వారికి ఆదరణ లభించేలా చూసేవాడు. వాజిద్ అలీషా తన సూక్ష్మబుద్ధి నుపయోగించి సంగీతంలో కొన్ని రాగాలను తయారుచేసి వాటికి జోగి. కన్నడ, (శ్యామ్) జూహీ. శాహ్ పసంద్ మొదలయిన పేర్లు పెట్టాడు. వాజిద్ అలీషా ఈ కళలో విద్వాంసుడుగా పేరు తెచ్చుకొన్నాడు. ఆయన సంగీత మర్మజ్ఞుడయినప్పటికీ ఆయనది తక్కు-వ కం అభిరుచి. అందువల్ల లక్నోలో సంగీతాన్ని తన అంతస్థు నుంచి దిగజార్చి క్రిందికి లాక్కు-నిపెట్టాడు. అందువల్ల మంచి భాషాజ్ఞానం, సంగీతజ్ఞానంగల రచయితలు శాస్త్రీయరాగాలను, రాగిణీలను వదిలేసి చిన్న చిన్న సామాన్యపదాలువేసి శ్రోతలమనస్సులను ఊరించే ఉద్దేశ్యంతో తేలిక సంగీతరచనలను కొనసాగించారు. ధృపద్, హోరీ మొదలైన కఠినరాగాలపట్ల మోజు తీరిపోయింది. గజల్, తుమ్రీలనే ప్రజలు ఆదరించసాగారు. ఖమ్మాచ్, ఝుంఝూటీ, భైరవి, సుసిద్రా, తిలక్ కామోద్, పీలూ మొదలైన చిన్నచిన్నరాగాలు సంగీత ప్రియుల ఆదరానికి పాత్రమయ్యాయి. రాజుకూ, తన స్వభావానికి అనువైనవై వుండడంవల్లా వీటిపైనే మోజు కలిగింది. లక్నోలోని తెల్ల ఖర్బూజాపండు భారత దేశం మొత్తంలో ప్రసిద్ధికెక్కి-నవిధంగానే లక్నోలో తయారైన 'భైరవి' కూడా దేశమంతా ప్రసిద్ధికెక్కి-ంది. 'భైరవి' లక్నో ప్రత్యేకత అనేది నిజం. ఇటువంటి భైరవి భారతదేశంలో మరే ఇతరభాగంలోనూ పాడబడేది కాదు. సోజ్ఖ్వాన్ (ముహర్రంలో సోజ్, ఒకరకం కవిత. చదివే వ్యక్తులు) లు జనాదరణపొందిన ఈ రాగ, రాగిణులనే ఎక్కు-వగా పాడ నారంభించారు. అందువల్ల మతంపేరిట ఇంట్లో కూర్చునే ఆడవాళ్ళ కంఠాలలోకికూడా ఈ రాగ రాగిణులే ప్రవేశించాయి. శోకగీతాలు (మర్సియా) విని గొప్పగొప్ప సంగీతకళావేత్తలకూడా చకితులై పోతూండేవారు. ఎందరో సోజ్ ఖ్వాన్లు, గాయకులు ప్యారేఖాన్, హైదర్ ఖాన్ గార్ల శిష్యులే.

'సంగీతానికి ముఖ్యమైన అంశం లయ. దీన్నే సమయం, లేక అవధి అనీ అనవచ్చు. లయ జ్ఞానం వాజిద్ అలీషాకు చాలా ఎక్కు-వగా వుండేవి. ఇది భగవత్ ప్రసాదితం. లయ జ్ఞానం ప్రతివ్యక్తిలో కొద్దిగానో గొప్పగానో వుంటుంది. కవుల ఛందస్సుకూడా లయకు సంబంధించేవుంటుంది. అంటే ఛందశ్శాస్త్రంకూడా

లయ జ్ఞానంపై ఆధారపడివుందన్నమాట ! ప్రకృతిసిద్ధంగా లయజ్ఞానం గలవ్యక్తి అవయవాలు సునాయాసంగా లయకు అనువుగా కదల్చగలుగుతాడు. ఈ విన్యాసం జనసాధారణందృష్టిలో నిరర్థకంగా అనిపించవచ్చు. కాని వాళ్లకు తెలియకుండానే, ఏమాత్రం ప్రయత్నం చేయకుండానే ఆ అవయవాలు లయ ననుసరించి నృత్యం చేస్తాయి. వాజిద్ అలీషా జరిపే ఈ విన్యాసాలనుచూసి ఆయన నాట్యం చేస్తున్నాడని ప్రజలు అనుకొనేవారు. కాని నిజానికి అది నాట్యంకాదు. ఆయన లయలో లీనమైపోవడంవల్ల ఆయన అవయవాలు అటువంటి విన్యాసాలను ఆయన తెలియకుండా జరుపుతూండేవి. సంగీతనియమాలు తెలియనివాళ్లు ఆయన నాట్యం చేస్తున్నాడని అనుకొనేవారు. కాని వాజిద్ అలీషా ఎప్పుడూ, ఎక్కడా నాట్యం చేయలేదు. ఆయన సమీపంలో కూర్చునే ప్రసిద్ధగాయకులు 'పాదుషా నిద్రపోతున్నప్పటికీ ఆయన బొటనవ్రేలు లయ ననుసరించి కదిలేది' అని అంటారు.

కదలికలు, భావభంగిమలు సంగీతభాగాలే అని చెప్పుకోవచ్చును. తమ అభిప్రాయాలను హావభావాలద్వారా, సంకేతాలద్వారా వ్యక్తీకరించడం నృత్యం ఉద్దేశ్యం. దీనినే ఇంగ్లీషులో 'మోషన్' అంటారు. గొప్పగొప్పవక్తలలో, ఉపన్యాసకులలో ఈ 'మోషన్' అనేది తప్పకుండా వుంటుంది. వారిని ఎవ్వరూ ఆక్షేపించరు. కాని పాపం వాజిద్ అలీషా లోని లయజ్ఞానాన్నిమాత్రం ఆనాటిప్రజలు ఎందుకు ఆక్షేపించేవారో తెలియదు' అని లక్నో సంగీతాన్నిగురించీ వాజిద్ అలీషా లయజ్ఞానాన్నిగురించి వివరిస్తూ 'కౌకబ్' గారు తన సంగీతగ్రంథంలో వ్రాశారు.

లక్నో, శాస్త్రీయసంగీతాన్ని ప్రోత్సాహపరచలేకపోయినా, దాన్ని సంస్కరించి జనసామాన్యానికి అందుబాటులోవుండేలా కృషి చేసిందనీ, ఈ విషయంలో భారత దేశపు లలితసంగీత కేంద్రంగా లక్నో పేరు తెచ్చుకోగలిగిందనీ మనం అంగీకరించవలసివుంటుంది.

గాజీ ఉద్దీన్ హైదర్ కాలంలోనే ఇక్కడి కవ్వాలీలు దేశప్రసిద్ధమయ్యాయి. ఛజ్జూఖాన్, గులామ్ రసూల్ ఖాన్ ఆనాటి సంగీత కళావేత్తలు. దర్వారీ అనే ఆయన సంగీతబాణీలను సృష్టించగల గొప్ప కళాకారుడు. బఖ్శూ, సలారీ, తబలా వాయించడంలో గొప్పపేరు తెచ్చుకొన్నారు. (చివరిరోజులలో సాదిక్ అలీ ఖాన్

మొత్తం భారతదేశంలోనే అగ్రగణ్యుడయిన సంగీతవేత్తగా పేరొందాడు. సంగీత కళా పిష్టాతులయిన బడే మున్నేఖాన్, ఛోటే మున్నేఖాన్ తమ మధురగానంతో పండిత పామరులనందరినీ రంజింపచేస్తూండేవాడు.

మటియా బుర్జ్‌లో వాజిద్ అలీషా దర్బారులోని సంగీతవాద్య నిపుణుల వివిధ వాద్యవాదనను గాయకులపాటలను నేను స్వయంగా విన్నాను. ఎహమద్ ఖాన్, తాజ్ ఖాన్, గులామ్ హుసైన్ ఖాన్ ఆ రోజులలో సంగీతవేత్తలగా పేరొందారు. కలకత్తానగరం మొత్తంలో తన శ్రావ్యమైన సంగీతంతో ఆబాలగోపాలాన్నీ ఆకర్షించుకొన్న 'దుల్లీ ఖాన్' లక్నో నివాసే. ఆయన లక్నో సంగీతకళాశాలలో సంగీతం నేర్చుకొన్నాడు. గాయకులుమాత్రమేకాక 'వేశ్యలు' కూడా అద్భుతమైన సంగీతజ్ఞానాన్ని ఆర్జించుకొని శ్రోతలను ముగ్ధులను చేస్తూండేవాళ్లు. జోహరా, ముశ్తరీ అనే యువతులు సంగీతంలోనూ, సాహిత్యంలోనూ గొప్ప ప్రావీణ్యాన్ని సంపాదించుకొని ప్రఖ్యాత కవయిత్రులగా, మధురగాయనులుగా పేరుప్రతిష్ఠలు నార్జించుకొన్నారు. 'చూనే వాలీ హైదరీ' అనే ఆమె విషాదగీతాలు పాడడంలో గొప్పపేరు తెచ్చుకొంది. ఆమె ఏడాదికొకసారి ముహర్రమ్ సమయంలో ఇమామ్ బాడాలో గంటలతరబడి శోకగీతాలను అత్యద్భుతంగా పాడి వినిపిస్తూండేది. వాటిని వినేందుకు లక్నోవాసులే కాక భారతదేశం నాలుగుమూలలనుంచీ సంగీతప్రియులు వచ్చి విని అబ్బురపడుతూ వుండేవారు.

అయోధ్య ఆస్థాన అంత్యకాలంలో 'ఉస్తాద్ ముహమ్మద్ జీ' తబలా వాయించడంలో అపారమైనకీర్తిని గడించాడు. ముప్పైఏళ్ళక్రితం చౌక్‌లో నాకొక సూటు బూటుధరించిన 'జెంటిల్‌మన్' కనిపించాడు. ఆయన మరాఠీవాడు. ఆంగ్లప్రభుత్వంలో ఏదో పెద్ద పదవిలోఉన్నట్లు ఆయన వాలకాన్నిబట్టి నాకు తోచింది. 'నేను ఇక్కడి సంగీతజ్ఞులప్రతిభను చూసేందుకు లక్నో బదలీ చేయించుకుని వచ్చాను' అన్నాడు ఆయన. 'నేను ఒక ప్రసిద్ధ గాయక కుటుంబానికిచెందిన వ్యక్తిని. మా తాతగారు, తండ్రిగారు ఛత్రపతి శివాజీవారి ఆస్థానంలో సంగీతవిద్వాంసులుగా వుండేవారు. అయితే ఆంగ్ల విద్యావ్యామోహంలోపడి ఇంగ్లీషుచదువు నేర్చుకున్నాను. ప్రభుత్వంలో పని దొరికింది. కాని మా పూర్వీకుల కళను ఇంకా మరచిపోకుండా భద్రపరచుకొన్నాను' అన్నాడు.

ఇంతలో అదృష్టవశాత్తూ నే నెరిగున్న పెద్దమనిషి ఒకాయన నాదగ్గిరికివచ్చాడు. ఆయన ప్రసిద్ధగాయని 'ముహమ్మదీ'ని బాగా ఎరుగున్నాయన. ఆయన సంగతి సందర్భాలు తెలుసుకొని మరాఠీ జెంటిల్‌మన్ నుద్దేశించి 'నాతో రండి. ముహమ్మదీ భవంతికి వెళ్దాం' అన్నాడు. ఆ మరాఠీ పెద్దమనిషి నన్నుకూడా బలవంతపెట్టి తనతో రమ్మని మారాం చేశాడు. మేమంతా ముహమ్మదీభవంతికి చేరుకొన్నాం. అక్కడ అల్లా దయకల్ల సాదిక్ అలీఖాన్‌కూడా వున్నాడు. వారుభయులూ తమ గాన సుధా సాగరంలో మమ్మల్ని ముంచెత్తేశారు. ఆ మరాఠీ పెద్దమనిషిచే కూడా పాడించాం. ఆయన బాగానే పాడాడు. లక్నోలో 'చౌథరాణీ' అనే గాయని భవనం సంగీతకళావేత్తలందరికీ క్లబ్‌లా వుండేది. అక్కడికి బడే మున్నే ఖాన్. ఛోటే మున్నే ఖాన్ ఇద్దరూ ఆహ్వానింపబడ్డారు. వారు శ్రావ్యంగా పాడి తమ సంగీత కౌశలాన్ని ప్రదర్శించారు. 'నేను ముహమ్మద్‌జీ తబలా వాయిస్తూండగా ఒక తరానా పాట పాడాలనే అభిలాషతో లక్నో వచ్చాను' అన్నాడు ఆ మరాఠీ పెద్ద మనిషి. ఆయన కోరికప్రకారం ముహమ్మద్‌జీని పిలిపించారు. మరాఠీ పెద్దమనిషి కోరిక తీరింది. ఆయన పాటా ముహమ్మద్‌జీ మృదంగవాద్యం అక్కడి శ్రోతల వీనులకు విందుచేశాయి.

'నేను అనేక ఆస్థానాలలో పాడాను. ఎంతోమంది తబలా వాద్యవేత్తల నిపుణతనుకూడా పరిశీలించాను. కాని ముహమ్మద్ జీ అంత గొప్ప తబలావేత్త నాకెక్కడా కనిపించలేదు' అని ఆ మరాఠీ పెద్దమనిషి అన్నాడు.)

లక్నోలో సంగీతకళ ఉచ్చస్థాయి నందుకొంది. ఇతరపట్టణాలలోని భాగ్యవంతులకంటే లక్నోలోని భాగ్యవంతులకు సంగీతాభిరుచి అధికంగా వుండడం మాత్రమే కాక, ఇక్కడివారికి స్వరాలనూ, రాగాలనూ, రాగిణులను గుర్తించే శక్తి సామర్థ్యాలు వుండేవి. ఒక్క ఆలాపన వినగానే దాన్ని ఆలాపించే గాయకుడు ఏ శ్రేణికి చెందుతాడో బేరీజువేసే ప్రతిభకూడా వారిలో వుండేది.

సాధారణంగా గాయకులను ఇక్కడి సంగీతసభలలో ఎవ్వరూ గుర్తించేవారు కాదు. బజారు పాటగాళ్లు, సాధారణయువకులు రోడ్లమీదా, ఘంటాపథాలలో పాడుతూ తిరుగుతూండేవారు. అయితే వాళ్ల సంగీతంకూడా స్వర, లయ నియమబద్ధంగానే వుండేది. తరుచు పట్టణాలలో 'షేర్' లనుకూడా సరిగా పాడలేని

వ్యక్తులు అధికంగా కనిపిస్తూవుంటారు. అయితే లక్నోలోమాత్రం 'షేర్' లను శ్రావ్యంగా పాడలేనివ్యక్తి అంటూ ఎక్కడా కనిపించేవాడు కాదు. లయ తప్పకుండా పాటలు పాడడం ఇక్కడి పిల్లి పాపల నరనరాలలో జీర్ణించుకుపోయినవా అనిపిస్తుంది. అప్పుడప్పుడు బజారుపిల్లలు భైరవీ, సోహినీ, బిహాగ్ లేక మరే రాగాన్నో అద్భుతంగా పాడుతూ కనిపించేవారు. వినేవారు ఎంతో ముగ్ధులవుతూండేవారు. గొప్పగొప్ప సంగీతవిద్వాంసులుకూడా వీళ్ళసంగీతం విని ఈర్ష్య చెందుతూండేవారు.

సంగీతాన్ని గురించి వివరించేప్పుడు వాద్యాలనుగురించి, వాద్యవేత్తలనుగురించి ఉదహరించడం అవసరంగా తోస్తోంది.

సంగీతంలో 'స్వరం', 'లయ' కలిసివుంటాయి. ఈ రెండింటిలోనూ దేనికి అన్యాయంచేసినా అది క్షంతవ్యం కాని దోషమనిపించుకొంటుంది. ఈ రెంటింటినీ సంరక్షించేందుకు రెండువాద్యాలను కనుగొనడం జరిగింది. స్వరంకోసం 'సారంగి' 'లయ' కోసం తబలా వినియోగించబడసాగాయి.

స్వరరక్షణ పూర్వకాలంలో 'వీణ' వల్ల జరిగేది. వీణాదండాన్ని కర్రతో చేసేవారు. ఒకవైపున పెద్ద సొరకాయబుర్రను, మరోవైపున చిన్న సొరకాయబుర్రను అతికించి మధ్యలో 'సరిగమపదని' సప్తస్వరాలనూ పలికించేందుకు ఏడు తీగెలను అమర్చేవారు. ముసల్మానులు తమతో రబాబ్, చంగ్, సరోద్ వాద్యాలను తీసుకువచ్చారు. రబాబ్ బహుశః అరేబియాదేశపు వాద్యం అయివుండవచ్చు. 'అబ్బాసియా' ల పరిపాలనాకాలంలో ఇది ఎక్కువ అభివృద్ధిలోకి వచ్చింది. చంగ్, సరోద్ ఈరానీ వాద్యాలు. ఇందులో 'చంగ్' చాలా ప్రాచీనవాద్యం. సిరియా, బాబుల్, ఈజిప్టు, రోమ్ మున్నగు వివిధదేశాలలో దీన్ని వాడేవారు. సరోద్ పూర్తిగా పార్సీ వాద్యం. దీన్ని అబ్బాసీకాలంలోని గాయకులు బాగా ఉపయోగంలోకి తెచ్చి అభివృద్ధి పరచారు. భారతదేశం వచ్చినతరువాత హిందూ, మహమ్మదీయ సంగీతాలు కలగలసిపోయాక ముందు 'తంబురా' నిర్మాణం జరిగింది. అసలు ఇది వీణయొక్క లఘురూపమనే అనవచ్చును. ఇది వాయించేందుకు ఉపయుక్తమయ్యే వాద్యం కాదు. కాని స్వరాన్ని సంరక్షించేందుకు వాడబడుతూ వుండేది. కొన్నాళ్ళతరువాత అమీర్ ఖుస్రో 'సితార్'ను కనిపెట్టాడు. అది నిజానికి వీణ.

తంబురాల మేలుకలయికతో తయారైన జంత్రమనేందుకు సందేహ మేమీలేదు. సితార్, సంగీత కళావేత్తలను, సంగీతప్రియులను ఎంతో ఆకర్షించుకోగలిగింది. కాని వీణ తంబురా, సితార్, కంఠస్వరాన్ని సరిగ్గా అనుసరించగలిగేశక్తి గలిగినవి మాత్రం కావు. ఈ లోటును దృష్టిలోపెట్టుకొనే ముహమ్మద్ షా రంగీలే దర్బారు లోని 'మియా సారంగ్' అనే సుప్రసిద్ధగాయకుడు 'సారంగీ' అనే జంత్రాన్ని నిర్మించాడు. అది ఆయన పేరుతోనే ప్రసిద్ధమైంది. 'సారంగి' వీణను, తంబురాను, సితార్‌ను వెనక్కునెట్టేసి, సంగీత, నాట్యసభలలో ఉన్నతస్థానాన్ని సంపాదించుకో గలిగింది. అంతేకాదు; దీనివల్ల పాతవాద్యాలను వాయించే కళాప్రవీణులు కూడా దెబ్బతినిపోయారు. ఈ పాతవాద్యాలలో 'కానూన్' అనేవాద్యం ఒకటి వుండేది. దాన్ని ముసల్మానులు సిరియా, ఈరాక్‌లనుంచి తెచ్చేరు. దీన్ని వాయించేవారు ఇప్పుడు ఒకరిద్దరు తప్ప మరెవ్వరూ లేరు. సితంగానే 'సారంగి' సంగీత నృత్య మండలులనుంచి పాతవాద్యాలన్నిటినీ గెంటిపారేసింది. అయితే ఎప్పుడైనా, ఎక్కడైనా గొప్పగొప్ప సంగీతకళావేత్తలు, వస్తాద్‌లు, వీణ, సరోద్, రబాబ్, కానూన్ మున్నగు పాతవాద్యాలను వాడుతూంటారు. ముఖ్యంగా సితార్ నవయువకుల ఆదరాభిమానాలను చూరగొనగలిగిన వాద్యం. పాటపాడుతూ కొందరు, పాట లేకుండా కొందరూ దీన్ని వాయిస్తూంటారు.

ఇంక తబలా విషయం తీసుకొంటే ఇది 'లయ'ను సంరక్షించేందుకు అత్యవసరమైన వాద్యంఅని చెప్పవలసివుంటుంది. కాని ప్రాచీనకాలంలో ఏ దేశీయులకూ కూడా ఈరకమైన వాద్యాన్ని గురించిన పరిజ్ఞానం లేదు. యుద్ధసమయాలలో 'దుందుభి', 'చంగ్' వాద్యాలు, ఉదయ సాయంత్రాలలో మంగళవాద్యంగా 'నక్కారా' వాద్యం వుపయోగపడేవి. కాని భారతదేశపు నృత్య సంగీతసభలలో ఉపయోగించే 'తబలా' వంటి వాద్యం ప్రాచీనకాలంలో మరెక్కడా లేదు. అరేబియా దేశంలోమాత్రం 'డప్పు' అనే వాద్యాన్ని పాట పాడేప్పుడు వాయించేవారు. ఇక్కడకూడా పాడేప్పుడు డప్పుతోబాటు వీణను లయస్వరం వగైరాలను రక్షించేందుకు వాడేవారు. అనంతరం 'మృదంగం' కనుగొనబడింది. బహుశః శ్రీకృష్ణుని మురళితో మృదంగరవంకూడా బృందావనం దరిదాపువరకూ వినిపించేదని భావించవచ్చు. మృదంగంతరువాత జరిగిన అభివృద్ధి యేమంటే 'పఖ్‌వాజ్' అనే వాద్యం

ఉన్నతశ్రేణి సంగీతాన్ని అనుసరించేందుకు కనుగొనబడింది. అనంతరం మృదంగం పఖ్‌వాజ్‌ల మేలుకలయికగా 'ఢోలు' తయారయింది. ఇది అన్నిరకాలవారిని ఆకర్షించుకోగలిగింది. అందరికీ అందుబాటుధరలలో లభ్యమయ్యేది. అందువల్ల ఇంట్లో కూర్చునే ఆడవాళ్ళుకూడా ఢోలు వాయించడం నేర్చుకోసాగారు. సంగీత సభల సౌకర్యంకోసం తబలా ప్రవేశపెట్టబడింది. 'పఖ్‌వాజ్'లోని రెండుప్రక్కలు విడిపోయి రెండువాద్యాలుగా కుడి ఎడమలలో అమర్చి 'తబలా'గా వాడుకలోకి తేవడం జరిగింది. నిస్సందేహంగా 'తబలా' ముసల్మానులు భారతదేశం వచ్చాకనే కనుగొనబడింది. కాని లయ కనువుగా తయారైన ఈ వాద్యాల అభివృద్ధి ఎవరెవరి మూలంగా ఎప్పుడెప్పుడు జరిగిందో నాకు తెలియదు.

# 20

సంగీతంతోపాటు నృత్యంకూడా లక్నోలో ఒక ప్రముఖ కళారూపంలో అభివృద్ధి పొందింది. నాట్యంచేయడం ప్రతిదేశంలోనూ అతి ప్రాచీనకాలంనుంచీ అమలులో వుండేది. ఈజిప్టు పిరమిడ్ల ఎదుట మంచి యవ్వనంలోవున్న రసికయువతులు సింగారించుకునివచ్చి నుంచుని నృత్యం చేస్తూండేవారు. ఏసుక్రీస్తుకాలంలో యోహాన్ శిరస్సును హిరోడియా నాట్యంచేస్తూ కోసేశాడు. కాని భారతదేశంలో సంగీతంలాగే నాట్యంకూడా దేవునియెడ భక్తిని వ్యక్తీకరించడానికే ఉద్భవించిందనీ, మతసంబంధం దీనికి మొట్టమొదటినుంచీ వుందనీ, మతమే నాట్యకళను అభివృద్ధిపరచిందనీ నిస్సందేహంగా చెప్పవచ్చును. అంతేకాక ఈ నాట్యకళను ఎరిగినవారు, నృత్యం చేసేవారు బ్రాహ్మణులే. దీనికేంద్రం అయోధ్య, కాశీలలోని కథకులు లేక మధుర, వ్రజ్‌లవద్దనున్న రహస్‌ధారీలు అనికూడా భావించబడుతోంది. భారతదేశంలోని అన్ని ప్రాచీనదేవాలయాలలో వందలు, వేలసంఖ్యల్లో యువతులు దేవతావిగ్రహాలముందు రోజూ నృత్యం చేస్తూండేవారు. గొప్పగొప్ప దేవాలయాలలో ప్రాచీనకాలంలో నర్తకీమణుల బృందం విడిగా వుండేది. కాని నృత్యకళకు గురువులుమాత్రం సదా పురుషులే అయివుండడం, వీరు యువతులకు ఈకళను నేర్పుతూవుండడం ఈ సందర్భంలో గమనించవలసిన విషయం.

నిజం చెప్పాలంటే అంగవిన్యాసాన్ని సంగీతనియమాలకనువుగా అభివ్యక్త పరచడాన్నే నాట్యమంటారు. అంగవిన్యాసాలను నియమాలననుసరించి సామూహికంగా జరపడాన్ని డ్రిల్ అనో, సైనిక కవాత్ అనో అనవచ్చు; లేదా పాశ్చాత్య దేశాలలోని బాల్ రూమ్ డ్యాన్స్ అని అనవచ్చు. ఈ నృత్యం ప్రస్తుతం మనదేశంలోని క్లబ్బులు లేదా థియేటర్లలో చూడవచ్చు. కాని సంగీతలయకు అనువుగా. సంగీతంలోని ఆరోహ అవరోహణలకు అనుగుణ్యంగా అంగాంగవిన్యాసాలను నియమబద్ధంగా జరపడాన్ని నృత్యమని అనవలసివుంటుంది. పాటలకూ, పేర్‌లకూ అనుగుణ్యంగా, అంటే వీటి ఆరోహణ అవరోహణలను అనుసరించి శరీరాంగాలను నియమబద్ధంగా కదలించడం భారతీయనృత్యానికి ప్రాతిపదిక. భారతదేశంలో గొప్పకళగా రూపొందించిన నృత్యమే పిసలైన నృత్యం. దానిలో వందలకొద్దీ గతులు, అనేక వైవిధ్యాలు, ప్రవేశపెట్టబడ్డాయి. అనంతరం సంకేతాల ద్వారా అభిప్రాయాలను, భావాలను, భంగిమలను అభివ్యక్తపరచడంకూడా నాట్యంలో ప్రవేశపెట్టబడింది. ఒకప్పుడు నాట్యానికి పాటలు వ్యాఖ్యానరూపాలుగా మారడం తటస్థించింది. అంతేకాక యవ్వనంలోవున్న అందమైన స్త్రీల నాట్యం అందరినీ, ముఖ్యంగా పురుషుల్ని ఆకర్షించుకోగలిగింది. ఈ స్త్రీలు ప్రియురాళ్ళలా తమ హావభావాలను చూపించడాన్నీ, రసికత ఉట్టిపడేలా భావాలను వ్యక్తపరచడాన్నీ, ఈ కళలో ఒక ప్రముఖ అంగంగా రూపొందించారు. ఈ విషయాలనుగుర్తించే లక్నోలో స్త్రీ పురుషులకు వేరువేరు నృత్యశాలలను ఏర్పాటుచేశారు. అంగాలనూ, ప్రత్యంగాలనూ నాజూకుగా కదల్చడం, ప్రేయసులలాగున అలకచూపుతూ హావభావాలను చూపడం, ప్రతికదలికలోనూ ప్రణయభావాలను వ్యక్తీకరించడం నర్తకీమణుల విశేషలక్షణాలుగా భావించబడ్డాయి. ఇవి లోపించినా. అతిగా ప్రదర్శించినా ప్రేక్షకులు అసహ్యించుకొనేవారు. ఇందుకు విరుద్ధంగా లయకనువుగా అంగవిన్యాసాలను, నడకలను చూపడం, కవులలాగ మనోభావాలను కదలికలద్వారా ఆకర్షణీయంగా వ్యక్తపరచడం పురుషనర్తకులు ఆచరించవలసివుండేది. సాధారణ ప్రజలకు రెండుపద్ధతులు ఒకలాగే కనిపించినా, రెండువిధానాలలోను భేదం స్పష్టంగా వుండేది.

అయోధ్య ఆస్థానంలోకి, లక్నోపట్టణానికి నర్తకీమణులు, నాట్యాలుచేసే వేశ్యలు వచ్చి స్థిరపడిపోవడం నవాబ్ షుజా ఉద్దౌలా కాలంనాటికే జరిగింది. వీరితోబాటు అయోధ్య, కాశీ కథకులు ఈ చుట్టుపట్లనే వుంటూండడంవల్ల నాట్యాలలో జరిగే మార్పునుచూపి వారుకూడా ఈ మార్పువైపు మొగ్గుచూపడం మూలంగా నవీన నృత్యపద్ధతలు కథక్కళీ బాణీలు కలగాపులగమై మొత్తంమీద నాట్యకళావికాసానికి ఆ కాలంలో చక్కని అవకాశమేర్పడింది.

పురుషనర్తకులలో రెండుబృందా లుండేవి. హిందూ కథక్ విహాస్థారీలు ఒక బృందంగాను, ముసల్మాన్ కాశ్మీర్ భాండ్‌లు ఒక బృందంగాను నృత్యకళను సాధన చేసేవారు. కాని సిసలైన నాట్యాచార్యులు కథక్‌కు సంబంధించినవారే అనేందుకు ఏం సందేహం లేదు. కాశ్మీరీ నాట్యబృందాలు తమనాట్యాలలో వింతను, విశేషాన్ని చూపేందుకు నాట్యం తెలిసిన యువకులకుకూడా తమబృందంలో తప్పకుండా స్థానమిచ్చేవారు. ఆ యువకులు ఆడవారిలాగే జుత్తుపెంచుకొని ముడివేసుకొని అద్భుతమైన తమ హావ భావాలతో, కదలికలతో, నడకలతో నాట్యసభలలో చైతన్యాన్ని, కొత్తదనాన్ని తీసుకువస్తూండేవాళ్లు.

హిందూ కథక్కులలో ఎవరో ఒక నాట్యాచార్యుడు సదా లక్నోలో వుంటూండేవాడు. ఈ నాట్యకళకు శివుడు, పార్వతి, కృష్ణుడు మూలవిరాట్టులని వారు అంటూండేవారు. షుజా ఉద్దౌలా, అసఫ్ ఉద్దౌలాల పరిపాలనాకాలంలో ఖుషీ మహరాజ్ అనే నాట్యాచార్యుడు గొప్పపేరు తెచ్చుకున్నాడు. నవాబ్ సఆదత్ అలీఖాన్, గాజీ ఉద్దీన్ హైదర్‌లకాలంలో హిలాల్ జీ, ప్రకాశ్ జీ, దయాల్ జీ ప్రఖ్యాత నర్తకులు. మహమ్మద్ అలీషా కాలంనుంచి వాజిద్ అలీషా కాలంవరకు ప్రకాశ్‌జీ పుత్రులు 'దుర్గాప్రసాద్' 'ఠాకూర్ ప్రసాద్' గొప్ప నర్తకులుగా కీర్తి నార్జించుకొన్నారు. దుర్గాప్రసాద్, వాజిద్ అలీషాకు నాట్యగురువు. అనంతరం దుర్గాప్రసాద్ పుత్రులు 'కాల్‌కా', 'బిందాదీన్' నాట్యకళలో ఆనాటి యావద్భారతదేశంలోను ఉత్తమోత్తమ నాట్యప్రవీణులుగా ఖ్యాతి పొందేరు. పాత వస్తాదులు ఏదో ఒక నాట్యశాఖలో ప్రవీణులయివుండేవారు. కాని ఈ సోదరద్వయం నాట్యకళలోని ప్రతి ఒక్కశాఖలోనూ ప్రవీణులు. ఇందువల్ల భారతదేశంలోని నాట్యాచార్యులందరిలో

పేరు అధిగమించి ప్రధాననర్తకులుగా స్థిరపడ్డారు. ఆ కాలంలోని గొప్పగొప్ప నర్తకులందరూ ఈ ఉభయుల శిష్యులే. ఇద్దరిలో బిందాదీన్ ఎక్కువ నిపుణుడు.

కొన్నాళ్ళకు కాల్కా స్వర్గస్థుడయ్యాడు. ఆయన మరణానంతరం బిందాదీన్ నాట్యం కొంత నీరసించింది. నేను పుస్తకం రచించేసమయానికి బిందాదీన్ వయస్సు డెబ్భైఏడేళ్ళు. ఇప్పటికీ ఆయన ప్రదర్శించే నాట్యం చూడడం తమ జీవితంలో మరుపురాని గొప్ప అదృష్టంగా భావించే ప్రేక్షకులు కోకొల్లలుగా వున్నారు. 'గతి' ననుసరించి నృత్యం చేయడం, పాత సంప్రదాయాలను అధిగమించి విన్యాసాలను ప్రదర్శించడం, గజ్జలు ప్రయోగించడంలో అనన్యసామాన్యమైన నైపుణ్యం చూపడం ఆయన నాట్యంలోని ప్రత్యేకతలని చెప్పవచ్చు. అవన్నీ ఆయనతోనే పోయాయి. ఆయన ప్రతి విన్యాసంలోను వందలకొద్దీ హావభావాలనూ, శైలులను, సౌకుమార్యాన్నీ మనోహరమైన సంకేతాలద్వారా ప్రకటించేవారు. ప్రేక్షకులస్థాయి పెగజారివుంటే ఈ సున్నితమైన నూతన హావభావాలను అర్థం చేసుకోగలగడం సాధ్యంకాదు. సాధారణంగా 'బిందాదీన్' నర్తించేటప్పుడు 'కాల్కా', రంగంమీద నుంచుని వ్యాఖ్యానించి ఆయన నాట్యంలోని విశేషాలను, అసాధారణప్రతిభను వివరిస్తూండడం పరిపాటి. ఆయన వ్యాఖ్యలవల్లనే ప్రేక్షకులు బిందాదీన్ నృత్యంలోని గొప్పతనాన్నీ చమత్కారాన్నీ గ్రహించగలుగుతూండేవారు. నృత్యం చేసేప్పుడు ఆయనపాదాలు నేలను ఎంతో సున్నితంగా తాకేవి. ఆయన అప్పుడప్పుడు కత్తి అంచుమీద నాట్యంచేసినా పాదాలు చెక్కు చెదరకుండా వుండేవని ప్రతీతి.

# 21

పురుషనర్తకుల్లో రెండవతెగకు చెందినవాళ్లు విదూషకులు. వారిలోని ప్రత్యేకత ఏమిటీ అంటే, యవ్వనంలోవున్న ఒక అందమైన కుర్రవాడు చక్కగా తళతళ మెరిసే రంగురంగులదుస్తులతో ముస్తాబై కాళ్ళకు గజ్జెలు కట్టుకుని నృత్యం చేస్తాడు.

అతడికి ఆడవాళ్ళకిమల్లే పెద్ద తలకట్టుగూడ ఉంటుంది. అతని అభినయానికి అనుగుణంగా వాయించే వాద్యబృందం లయ, అది వినేవాళ్ళహృదయాలకు ఆనందదాయకంగా ఉంటుంది. ఆ నటనలో అసాధారణమైన ఒక సొగసు, హావభావ ప్రకటన అందుకు తగినట్టి గానం అమరివుంటాయి.

ఈ వాద్యబృందమే కాకుండా మరొక ఏడెనిమిదిమందిదాకా విదూషకులు వెంట వుంటారు. వాళ్లు ఆ నాట్యప్రదర్శనచూసి మధ్యమధ్య ఆహా....ఓహో....అద్భుతం అంటూ కేకలేస్తూ, పరవశులై తాళంవేస్తూ, ఆ హావభావప్రకటనలకు ఆ నాట్యముద్రలకు అసభ్యమైన అర్థం చెబుతూ, తోటివారిని నవ్విస్తూవుండడమే వాళ్ళపని. అక్కడ పాటఅవగానే వీళ్ళంతా అతణ్ణి అనుకరించి నటించడం, హాస్యాలాడటం మొదలయిన చేష్టలుచేసి చూపిస్తారు.)

(లక్నోలో ఇలా అనుకరించి నవ్వించే హాస్యగాళ్లు రెండుతెగలుగా వున్నారు. ఒకరు కాశ్మీరునుంచివచ్చి చేరినవాళ్ళు. రెండో తెగవాళ్లు, మొదట ఏవేవో వృత్తుల్లోవుంటూ, క్రమంగా ఈ అనుకరణ కళకు అంకితమైపోయినారు.

(సంగీతము నాట్యము లాగానే ఈ అనుకరణకళగూడా ప్రాచీన భారతీయకళల్లో ఒకటి. ఈ కళ హజరత్ మసీహ్ కంటె పూర్వం, విక్రమాదిత్యుని ఆస్థానంలో అమల్లో వుండేది. ఆకాలంలో ఆకళతో అతి శ్రేష్ఠమయిననాటకాలు ప్రదర్శించేవారు. ఆనాటి ఆ కళ అతి పవిత్రమై సంప్రదాయసిద్ధమై వుండేది.

ఇప్పటికి భారతదేశంలో తక్కువ కులాలవారు జరిపే జాతర్లలో ఆటలని, పాటలని, పాటల కనుగుణంగా దరువులు చిందులువేయటం హంగుదారులుండటం పరిపాటే.)

(మహమ్మదీయులలో మొగల్ పరిపాలనకుపూర్వం ఈ రకం విదూషకులున్నట్లు ఆచూకీ ఏమీ తెలియదు. బహుశా ఆనాటిచరిత్రకారులు వీరికంతటికి ప్రాధాన్యం ఇచ్చి వుండకపోవచ్చు, కాని ముసల్మానుల పరిపాలనాకాలంలోమాత్రం ఈ విదూషకులనబడేవారు మిక్కిలి ప్రముఖస్థానం వహించారని చెప్పక తప్పదు. ఈ విషయం ఔరంగజేబు తర్వాతనే వెలుగులోకి వచ్చింది.

ఢిల్లీకి పాలకులైన సుల్తానులు పొరుగురాజ్యాలమీద దాడులు చేయడం, దురాక్రమణలు సాగించడం మొదలైన జంజాటాల్నుంచి విముక్తిచెంది, ఎవరికివారు

షోయిగా దర్బారులు తీర్చడం, సుఖభోగా లనుభవించడమే తమకు వారసత్వంగా వచ్చిన హక్కు అనుకున్న రోజులవి.

నిజంచెప్పాలంటే ఈ విదూషకులవల్లనే సంఘంలో చిత్రవిచిత్రాలైన మార్పులు చేర్పులు జరిగాయి. ఇంగ్లండులో 'స్పెక్టేటర్', 'టాయిట్లర్' లాగానే ఇక్కడ వీళ్ల 'నేషనల్ సెటైర్స్' అన్నమాట.

మహమ్మదుషా కాలంలో ఢిల్లీలో మిక్కిలి ప్రసిద్ధుడైన విదూషకుడు కరేలీ అని వుండేవాడు. ఏదోవిషయంగా మహమ్మదు షా క్రుద్ధుడయి విదూషకులందర్నీ తవ రాజ్యంలోంచి తరిమెయ్యవలసిందిగా శాసించాడు.

మర్నాడు పాదుషావారి వాహనం దారంటపోతూవుండగా ఎక్కడో పైనుంచి డోళ్ళమోత, ఆ మోతతోపాటు విదూషకులపాట వినవచ్చాయట. పాదుషా ఏమిటి దని ఆశ్చర్యచకితుడై తలపైకెత్తి చూడగా, అక్కడ ఖర్జూరపుచెట్టుమీద కరేలా అనే విదూషకుడు, ఇంకా మరికొందరు విదూషకులు కూర్చుని, డోలుకొట్టి పాటలు పాడుతున్నారట. 'ఏమిటి మీ ఆగడం? మా ఆజ్ఞనే ధిక్కరిస్తారా?' అని గద్దించాడు.

అప్పుడు కరేలా 'మహాప్రభో! ప్రపంచమంతా ప్రభువుల అధీనమైవుండగా ఎక్కడికని పోము? అందుకే ఈ చెట్టుమీద బస ఏర్పరచుకున్నాం. ఇది పైకి పోయేందుకు మొదటిమెట్టు' అన్నాడట. ఆ సమాధానంవిని పాదుషావారూ సహచరులూ ఫక్కున నవ్వారట. వారిని పాదుషా మన్నించాడట.

లక్నోలో విదూషకులకు ఒక ప్రత్యేకమైన ఆదరణ లభించడంతో వారక్కడే స్థిరపడటం, లక్నో విదూషకులస్థావరంగా తయారవడం జరిగింది. నాకు తెలిసి నంతవరకు ప్రస్తుతకాలంలో ఢిల్లీలో విదూషకులనేవారే లేరు. ఒకవేళ అక్కడక్కడా వున్నా, వారికో ఊరూ లేదు, పేరూ లేదు.

పూర్వం బరేలీలో ఈ విదూషకమండలులు వుండేవారు. లక్నోచేరిన డోం, ఢాడీ జాతులన్నీ బరేలీనుంచి తరలివచ్చినవే. దాన్నిబట్టి రుహేలుఖండంలోని పఠానులు గూడా సంగీతప్రియులని లలితకళలను ఆదరించేవారని, వారిఔదార్యంవల్లనే బరేలీ మురాదాబాదుల్లో ఈరకం జనాభా అభివృద్ధి చెందిందని తెలుస్తూంది. వారిలో ప్రవీణులైనవాళ్లు లక్నోలో స్థిరపడటం. అందువల్లనే లక్నో విదూషకుల ప్రముఖకేంద్రం కావడం తటస్థించిందని చెప్పవచ్చు.

(విదూషకుల చమత్కారసంభాషణకు, ఎత్తిపొడుపుమాటలకు, ఎద్దేవాలకు, అనుకరణలకు లక్నో ఆటపట్టయింది. నవాబు సఆదత్ అలీఖాన్ కనుసైగతో ఒక విదూషకుడు ఆ కొమ్ములుతిరిగిన మొనగాణ్ణి ఎలా దెబ్బకొట్టిందీ పాఠకులకు సువిదితమే. ఆకాలంలో జరిగినదే మరో మరువలేని సంఘటన వుంది.

ఒక శ్రీమంతుడు ఒకరికి దుశ్శాలువ లిచ్చాడు. అవి ఏనాటివో తాతలనాటి చింకి పాతలు. అది కనిపెట్టి ఒక విదూషకుడు ఆ శాలువను చేతిలోకిలాక్కొని, దానివంక ఎగాదిగా చూడటం మొదలెట్టాడు. రెండోవాడు 'ఏమిటలా దాన్ని పరీక్షిస్తున్నావ్?' అని అడిగాడు. 'అహఁ....ఏం లేదు....ఈ శాలువమీద ఏదో రాసి ఉన్నట్టుంటేను, చూస్తున్నా' అన్నాడు.

'ఏమని రాసి ఉందేఁ' అనడిగాడు అవతలివాడు. 'ఏమిటి ..చెప్మా' ..అంటూ కళ్ళజోడు తగిలించుకుని, పరికించిచూపి ...'లాయిలాహ్ ఇల్లల్లాహ్' (దేవునికన్న మరియొకడు లేడు) అని గుణించి గుణించి అతి కష్టంమీద చదివి చెప్పినట్టు చెప్పాడు. 'అంతేనా? ముహమ్మద్-ఉర్-రసూ లిల్లాహ్' మహమ్మదు అల్లా యొక్క దూత అని రాసిలేదా?' అని అవతలివా డడిగాడు. 'అదెల్లా రాసి వుంటుంది? ఈ దుశ్శాలువ మన హజరత్ ముహమ్మదువారికంటె పూర్వపుది గదా' అని ప్రత్యుత్తరమిచ్చాడు.)

(లక్నోలో ఒక నవాబుగా రుండేవాడు. ఆయన్ని 'గఢయ్యా వాలే నవాబ్' (కోటవారి నవాబు) అనేవాళ్ళు. ఎందుకంటే ఆయన భవంతికిచేరువలోనే ఒక కోట వుంది. అప్పుడప్పుడు నృత్యగాన వినోదప్రదర్శనలు ఆ నవాబుగారిసమక్షంలో జరుగుతూవుండేవి.

ఒకసారి ప్రదర్శనంలో ఒక విదూషకుడు కంగారుపడుతూ ముందుకు ఉరికి, సహచరులతో 'లేవండి, లేవండి ..తప్పుకోండి, సన్మానించండి ..బహూమానించండి' అని గావుకేకలు పెట్టాడు.

'ఎదట ఎవరూ లేందే....ఎవర్ని సన్మానించమంటావ్?' అంటూ అంతా ఒక్కుమ్మడిగా అడిగారు.

'ఎవరూ లేకపోవడమేమిటి? నవాబు సాహేబ్ వేంచేస్తున్నారంటే....' అని బోర్లించివున్న ఒక కుండనెత్తాడు. దానిక్రిందనుంచి ఓ కప్ప చెంగున ఎగిరి గెంతి

వచ్చి సభావేదికమీద తిష్ఠవేసింది. 'ఆఁ....లేవండి....లేవండి....మరి . .అరుగో వచ్చేశారు' అని హెచ్చరికలుచేసి-'అదేవిటర్రా అలా తెల్లమొహాలువేసుకు చూస్తారు. వారే వీరు, గుర్తించలేదా యేం?....వారే మన కోట నవాబుగారు' అన్నాడు.)

(ఈ విదూషకుల్లో ఓ గుణముంది. ఎవరసన్నిధిలో నాట్యం చేస్తారో వాళ్లను తప్పక అనుకరిస్తారు. వారి నటన అనుకరణవల్ల అవతలివారి మనస్సు నొచ్చినాసరే అనుకరించక మానరు. అయితే ఒక్కటిమాత్రం యథార్థం. వాళ్లు తమ నటనతోనే శ్రీమంతులకు పాలకులకు ఎంతో చక్కగా గుణపాఠం నేర్పగలరు. ఎవరి తప్పులు వారికి తెలియజెప్పడంలో ఎంతో నేటుజాణలు. అంత వాకచక్యం వాళ్ళకే చేత నవును.

అనుకరించడంలో వాళ్ళది అందెవేసినచేయి. గోరఖ్‌పూర్, చంపారన్ ప్రదేశాల్లో పశువులకాపర్లను బహరూప్ అంటారు. అచ్చంగా ఆ బహరూపుల్లా నటించి చూపరులకు అంతులేని ఆశ్చర్యాన్ని కల్గించేవాళ్లు.

వెనకటిరోజుల్లో కాయస్థులు మాట్లాడే పార్సీ కలసిన ఉర్దూను యెద్దేవా చేసినట్టే ఈ రోజుల్లో ఇంగ్లీషువారితో సంపర్కం ఏర్పడ్డాక, దొరల ఇంగ్లీషును ఎగతాళి చెయ్యడం మొదలెట్టారు.

వేవాస్త్రీపాత్ర అచ్చం అలానే నటించి అనుకరించేవాళ్లు. చూసినవాళ్లు విస్తుపోయేవాళ్లు. ఇక్కడ రెండవ కరేలా అనబడే విదూషకుడు నసీరుద్దీన్ హైదర్ వాటివరకు ఉన్నాడు. అతనితర్వాత సజన్, కాయమ్, దాయమ్, రజబీ నౌశాహ్, శీటీ, కద్ర్ మొదలైనవాళ్లంతా ప్రసిద్ధిలోకి వచ్చారు.

అలీ నకీ ఖాన్ అధ్వర్యం కొనసాగుతున్నరోజుల్లో. ఒకనాడు అలీ నకీ ఖాన్ భార్యాసమేతుడై కాయమ్ అనబడు విదూషకుడు పెట్టిన సబీల్ చూడటానికివెళ్లాడు. సబీలంటే ముసల్మానులు ముహర్రంలో పానీయాలిచ్చే పానశాల. కాయమ్ ఆ పానశాలను చక్కగా అలంకరించి, వచ్చినవారందరికి పానీయా లిస్తూండేవాడు. ముఖ్య అతిథుల్ని చూసినతోడనే కాయమ్ వారికి ఎదురువెళ్లి, చేతులు జోడించి, భగవంతుడు నవాబుగారిని క్షేమంగాను బేగంగారిని శాశ్వతంగాను కాపాడాలన్నాడు.

ఇంత కొంటెగా మాటలు విసిరికూడా నవాబుగారూ, బేగం ఇద్దరిదగ్గరా కానుకలు పుచ్చుకున్నాడు. 'కాయమ్' ప్రతిభ అంతా యింతా కాదు. ఒకసారి మూడున్నర గంటలసేపు విధివిరామం లేకుండా రకరకాల వేషాలు ప్రదర్శించాడు.

చివరికాలంలో ఘజ్‌లే హూసేను, ఖిలౌనా, బాద్షా పసంద్ మొదలైన విదూషక సంఘాలు ప్రసిద్ధికెక్కాయి. ఇప్పటికి అలీఖాన్ అనే బాగా పేరుగన్న సంఘం ఒకటి ఉంది. అప్పటినర్తకులుగూడ పేరుప్రతిష్ఠలో ఏమిటి, విద్యలో యేమిటి, వాళ్లకు వాళ్లే సాటి అనిపించుకున్నారు.

అయినప్పటికీ లక్నో సమాజంమీద వీరందరికంటెగూడ డోం జాతివారి ప్రభావం ఎక్కువుంది. పల్లెల్లో పట్టణాల్లో ఎక్కడ పెళ్ళయినాసరే ఈ డోం జాతి వారు, 'మీరాసనే' అనేవారు పాటలు పాడటం అనాదిగావస్తున్న ఆచారమైంది. డోం జాతివారు, 'మీరాసనే'లు డప్పులు వాయించేవిధానం అంతా ఒకటే. కానీ డోం జాతివారుమాత్రం లక్నోలో బాగా నిలదొక్కుకున్నారు. డోలు మానేసి పురుషగాయక బృందాలమాదిరిగానే, తబ్లా, సారంగి, తాళం పక్కవాద్యాలుగా ఉపయోగించసాగారు.

గాయకులుగా పేరు సంపాదించి మెల్లిగా నాట్యంగూడ ప్రారంభించారు. అంతటితో తృప్తిపొందకుండా, విదూషకుల్లాగా మహిళాసమావేశాల్లో అనుకరణలు చేస్తూండేవారు. ఎక్కడ పెళ్లిజరిగినా డోం జాతివారికి ప్రమేయం ఉండడమనేది సంప్రదాయంగా తయారైంది. శ్రీమంతులయింటి ఆడవాళ్ళకైతే ఈ డోం జాతీయులంటే చెప్పలేనంత వ్యామోహం. ఈ డోం జాతివారు ఎక్కని గడపగాని, వెళ్ళని తావుగాని లేదనుకోండి. పాటలు పాడడంలో, అభినయం చేయడంలో వాళ్ళనుమించినవాళ్లు లేరనే చెప్పాలి. వాళ్ళ కంఠస్వారస్యంవల్లనే పురుషుల కచ్చేరీల కంటె స్త్రీల కచ్చేరీలే ఎంతో ఆకర్షణీయం, ఆనందప్రదం కాగలిగాయి. ముఖ్యంగా వాళ్ల కచ్చేరీల్లో వారుచేసే చమకులు, విసిరే చెణుకులు, మనస్సు దోచుకుంటాయి. అందుకే పురుషులు ఎలాగైనా డోం జాతి స్త్రీల అభినయాలు చూడాలని సరదా పడతారు. కానీ డోం జాతిస్త్రీలు పురుషుల సమావేశాల్లో అభినయాలను ప్రదర్శించ డానికి ఏమాత్రం ఇష్టపడరు. ఇప్పటికి డోం జాతీయుల జనాభా చాలానే వుంది.

అంత బెట్టునరిగాను వుంటారు. అయితే ఇప్పటివాళ్ళలో వెనుకటితరం వాళ్ళ కున్నంత ప్రతిభలేదు, కళ లేదు. లక్నోలో అప్పట్లో ఉండే గాయకుల గాత్రమాధుర్యము, ఆ లయ ఆ తీరే వేరు. అటువంటివాళ్ళు న భూతో న భవిష్యతి.

# 22

విశేషంగా పురుషులే నాట్యాచార్యులుగా వుండేవారు. అయినా గాయనీమణులయిన వేశ్యలవల్లనే నాట్యకళ అంత అభివృద్ధిలోకి వచ్చింది. అది అచ్చంగా పురుషుల వల్లనే జరిగేపనిమాత్రం కాదు. అసలు నాట్యకళకు అన్నివిధాల తగినవాళ్లు ఆడవాళ్లే. ఈ కళ భారతదేశం మొత్తంమీద ఆయా నగరాల్లో అంతంతమాత్రంగా వ్యాప్తిచెందినప్పటికి లక్నోలోలాగా లేదు. లక్నోలో, పాడగలిగి అభినయం చేయగలిగినంతమంది వేశ్యలు మరి ఏ యితరనగరాల్లోను కానరారు. ఇప్పటికి నలభైయేళ్లనాడు, లక్నోలోవుండే 'ముంసరిం వాలీ గౌహర్' అనబడు వేశ్య కలకత్తా వెళ్ళి అక్కడ ఎంతగానో పేరుప్రతిష్ఠలు సంపాదించుకుంది. నేను ఒక కచ్చేరీలో ఆమె ప్రదర్శించిన ప్రతిభకు నిజంగా తన్మయుణ్ణయిపోయాను. నేనేకాదు ఆనాడు ఆ కచ్చేరికి వచ్చినవాళ్ళంతా అంతగా ముగ్ధులయినారు. పేరుమోసిన పెద్దలెందరో వచ్చారు. మూడున్నరగంటలసేపు ఆవిడ ఒక భావాన్ని ఎన్నోరకాలుగా ప్రదర్శించిన తీరుచూసి ఆ సభకువచ్చిన ప్రేక్షకులంతా ఆబాలగోపాలము మంత్రముగ్ధులయినారంటే అతిశయోక్తి ఏమాత్రము లేదు, జోహరా, ముశ్తరీ అనేవారు కవయిత్రులు, గాయనీమణులే కాదు, సుప్రసిద్ధ నాట్యకత్తెలు కూడాను. జద్దన్ తన నృత్యగానాలతో లోకాన్ని ఏలేసింది.

ఈ లక్నోలోవున్న వేశ్యల్లో ముఖ్యంగా మూడురకాలవాళ్లున్నారు. ఒక రకం వాళ్ళను కంచనియాఁ అంటారు. వాళ్లు సిసలైన వేశ్యలన్నమాట. దేహాన్ని అమ్ముకుని జీవించేవృత్తిగలవాళ్లు. ఢిల్లీ, పంజాబ్ వీరి ముఖ్యకేంద్రాలు. షుజా ఉద్దౌలా కాలంనుంచే లక్నోకు రాకపోకలు సాగించారు. నగరంలో పేరుగడించిన వేశ్య

లంతా ఈ తెగకు చెందినవాళ్ళే. రెండో రకం వాళ్ళని చూనేవాలియాఁ అంటారు. మొదట వాళ్లు సున్నం అమ్ముకుని జీవించేవాళ్ళట. క్రమంగా బజారుస్త్రీలముఠాతో చేరిపోయి తర్వాత బాగా పేరు మోశారనుకోండి. చూనేవాలీ హైదర్ అనే ఆవిడ కంఠం మహా ప్రసిద్ధికెక్కింది. అసలటువంటి మంచి కంఠస్వరమున్నవాళ్లు లేనే లేరనే చెప్పాలి.

ఆవిడ ఈ చూనేవాలియాఁ తెగకు చెందినదే అయినా, తర్వాత ఆవిడ తనతోటి వేశ్యలందరితో ఒక పెద్దసంఘం ఏర్పాటుచేసింది. మూడో రకం వాళ్లు వృత్తి చేసుకు జీవించే బజారుస్త్రీలే. ఎవరికివాళ్లు ముఠాలుగా ఏర్పడ్డారు. అయినా వాళ్ళలో వాళ్ళకి బంధుత్వం, ఆత్మీయత ఉన్నాయి. అంతేకాదు, ఎంతోమంది వివిధ జాతులస్త్రీలు పాడు తిరుగుళ్ళన్నీ తిరిగి చివరకు ఈ ముఠాల్లో చేరడంగూడ ఉంది. పరస్పరసహకారం లేకపోతే చేరనిస్తారా ?)

గాయకులు నటులుకాక మరొక తెగవాళ్లున్నారు. వాళ్ళని రహస్‌ధారీ అంటారు. వీరిని వీధిభాగవతులు అనవచ్చు. ఆ కళకు లక్నోయే ఆటపట్టయింది. అసలు రహస్ అనేది మధుర ప్రజవాసుల కళ. అక్కడా రహస్‌ధారులే లక్నోప్రజలకు ఈ రహస్ పట్ల ఆసక్తి కల్గించారు.

వాజిద్ ఆలీషాకు యీ కళ నచ్చి, తన అభిరుచికి తగినట్లు ఆయన ఒక యాత్రీ గానం రచించారు. అది చూసేసరికి ప్రజలకు చెప్పలేనంత ఆసక్తి పుట్టుకొచ్చింది. అప్సరసల అందచందాలు, ప్రేమకలాపాలు ప్రత్యక్షంగా చూడాలని తహతహ పడ్డారు. ప్రజల అపేక్షను కనిపెట్టి శబ్దాలంకార ప్రయోగానికి ప్రసిద్ధుడయిన మియాఁ అమానత్ అనే కవి 'ఇంద్రసభ' అనే యక్షగానాన్ని రచించాడు. హిందూ పౌరాణిక కథలో ముసల్మానుల పారసీ అభిరుచిని మిళితంచేసి ఈ రచన చేశాడు. ఈ తరహా రచనల్లో ఇదే మొట్టమొదటిది.

(ఈ 'ఇంద్రసభను' పట్టణంలో ప్రదర్శించినపుడు చూసిన ప్రతిఒక్కడు ముగ్ధులయిపోయారు. ఇక ఒకటివెంట ఒకటిగా ఎన్నో ప్రదర్శనలు జరిగాయి. చూస్తూ చూస్తుండగానే గాయకులు నాట్యకత్తెలయిన వేశ్యల గిరాకీ చప్పగా చల్లారిపోయింది. ఇక ఒక్క అమానత్ కవే కాకుండా ఎంతోమంది సరికొత్త తరహా రచయితలు ప్రదర్శనలు ప్రారంభించారు. ఆ రచనల్లోపడి ఉర్దూకవిత్వం ధ్వంసమైపోయినా మాట

ల్లోని సారళ్యాన్ని బట్టి ఆ బాణీ తూర్పునవున్న పల్లెల్లోను, కళాపిపాసులైన జనుల్లోను విపరీతంగా ప్రబలిపోయింది.

ప్రజలయొక్క ఈ అభిరుచే నాటకశాలలకు, థియేటర్లకు బలిష్ఠమైన పునాది అయింది. మరి కొంతకాలంవరకు ఆ ప్రభువుపాలన కొనసాగినట్లయితే, భారత దేశంలోని నాటకాలు ఒక ప్రత్యేకమైనవై భరిని, విశిష్ఠతని సంతరించుకునేవి.

ఉన్నట్టుండి పాతకాలపుసంగీతం పాడుకొనివున్న ఈ నవనాగరికసమాజానికి ఆ ప్రదర్శనల తీరుతెన్నుల్లో అసభ్యం గోచరించింది. సంగీతకళాప్రియులైన సహృదయులదృష్టి మళ్ళీ ఆ గాయకులు ఆ భోగంమేళాలవైపు మళ్ళింది. ఈ నాటక ప్రదర్శనల వినోదమంతా సామాన్యప్రజలవరకే పరిమితమై ఊరుకుంది

అయినా పాతకాలపు ఫక్కీకి కొత్తదనం కొంచెం పులిమి సామాన్యులనుగూడ రంజింపజేసేవిధానంలో కొత్తనటులు బయల్దేరారు. ఆనాడు ఈ కచ్చేరీలు ప్రదర్శన లన్నీ నాగరికసంఘాలకే పరిమితమైనాయి. క్రమంగా శిష్ట వ్యావహారికభాషకు స్వస్తి చెప్పి జనసామాన్యుల వ్యావహారికభాషతోనే లెక్కలేనన్ని ప్రదర్శనలు యిచ్చారు ఈ కొత్తనటులు.

ఈ పద్ధతిగూడ అసభ్యంగానే తయారవడానికి ముఖ్యమైనకారణం బొంబాయి లోని పారశీకులు ఇంగ్లీషువారిపద్ధతుల్లో థియేటర్లు నిర్మించడమే. వారిప్రదర్శనల్లో సంగీతం లేదు, సరైన నటనలేదు. కానీ ఆ రంగనిర్మాణపద్ధతి చిత్రమైనతీరును ప్రదర్శించడం ఆడంబరంగా కనబడేవిధానమే బాల్యదశలోవున్న మన జాతీయ నాటకాలను మొదలంటా తుంచిపారేసింది.

ఉన్నతవర్గాలవారుకూడ ఆ డాబుసరి నాటకాలప్రదర్శనంచూసి వ్యామోహంచెంది కళాఖండాలయిన నాటకాలను పూర్తిగా మరిచిపోయారు.

బొంబాయి థియేటర్లు భారతీయ నృత్యగానకళలకు తీరనినష్టం కలిగించాయనే చెప్పాలి. ఇది యథార్థము. మొట్టమొదట సంగీతాన్ని సర్వనాశనం చేశాయి. అశా స్త్రీయమైన అల్లాటపా పాటల్ని ఇష్టమొచ్చినట్టు వ్యాప్తం చేశాయి. తర్వాత అత్యు న్నతస్థాయిలో ఉండే మన భారతీయ నృత్యకళను నాశనం చెయ్యడానికి నడుం

క్కట్టాయి, రంగస్థలంమీద నాట్యమనేపేరుతో ఇంగ్లీషువారి డ్రిల్లుచేయించడం మొదలెట్టారు. దాన్నిచూసి ఇంకేం....బుద్ధాయిరకాలు. కుర్రకారు అదంటే చెవికోసుకుని, ఆ వేషాలే వెయ్యడం మొదలెట్టారు.

ఆమాటకొస్తే యక్షగానాల సంగీతము, నటనగూడ చాల తగ్గుస్థాయివే. అయితే వాటిలో ఒక జాతీయమైనభావం, దేశీయసంప్రదాయం కొంతవరకు ఇమిడి వుంది. అంతమాత్రంచేత వాటిని అణగద్రొక్కవలసిన అవసరమేం లేదు. కాని సంస్కరించడం చాల అవసరమని చెప్పాలి.

## 23

సంగీతచర్చ సందర్భంలో శోకగీతాలాపన (సోజ్‌ఖ్వానీ)గురించి చెప్పుకోడంగూడ అవసరం. ఈ శోకగీతాలాపన అన్నది ఒక సరికొత్త మతసంప్రదాయం. దాన్ని గూడ సంగీతకళగాభావించి, సంగీతనియమాలననుసరించి ఆ కళతో జోడించడం అనుచితమేమో ననిపించవచ్చు. అయితే అదిగూడ ఒక విశిష్టస్థాయికిచెందిన సంగీతమనే చెప్పాలి. మొహర్రంలో హజరత్ ఇమాం హుసేన్ స్మృతిచిహ్నంగా హిందూదేశమంతటా ముఖ్యంగా షియాతెగ ముసల్మానులు ఈ శోకగీతాలు కరుణామయంగా గానంచేసే సంప్రదాయాన్ని ప్రవేశపెట్టారు. అదిమొదలు ఇస్నా అశరీ మతం ఈరాన్‌లో జాతీయమతమైనప్పటినుంచి అక్కడివారు హిందూదేశంలోని రాజ్యాలతో సన్నిహితసంబంధం ఏర్పరచుకోసాగారు. నాటినుంచి ఈ శోకగీతాల సంప్రదాయం అమలులోకి వచ్చింది. ఢిల్లీలోని పాలకవర్గంవారు సున్నీతెగకు చెందిన ముసల్మానులు కావడంవల్ల అక్కడ షియాతెగకు చెందిన ముసల్మానుల సంస్కృతీ, కళలూ వ్యాప్తిచెందడానికి ఆస్కారం లేకపోయింది. అందువల్లనే షియావారి సంస్కృతి, కళలు లక్నో రాజదర్బారుని ఆశ్రయించాయి. నాటిషియా తెగవారైన పాలకులు ఆ కళలను, సంస్కృతిని ఆదరించి ఉద్ధరించారు.

శోకగీతాలు, లేక వేదనాగీతాలనే ఉర్దూలో మర్సియాలంటారు. మర్సియాలు కరుణ రసపూరితమైవుంటాయి. మరణించినవారి గుణగణాలు వర్ణించి చెప్పేవిగా వుంటాయి. మతంకోసం కర్బలామైదానంలో ఆత్మాహుతిగావించి వీరగతినందిన వీరులగురించి వర్ణించిచెప్పేటటువంటివి ఈ గీతాలు)

(ఈ శోకగీతాలకు మతంతోగూడ సంబంధం ఉన్నందువల్ల వీటిని కవితాగోష్ఠుల్లో కవితల్లాగా చదవడమూ వుంది. రాగయుక్తంగా పాడటమూ వుంది. ఈ శోకగీతాలు భావయుక్తంగా చదవడము. రాగయుక్తంగా పాడటము, రెండూ రెండుకళలుగా నిల్చిపోయాయి. అసలా రెండుకళలుగూడ ఆదినుంచి తుదివరకు లక్నోలోనే ఎక్కువగా రాణించాయి.

తహతుల్ లఫ్జ్‌ఖ్వానీ, అంటే పాడకుండా వచనంలాగా చదవడం. శోకగీతాలు భావయుక్తంగా చదవడంగూడ ఒక పద్ధతుంది. కవిసమ్మేళనాల్లో కవులు తాము రచించిన గజల్. (పారసీ, ఉర్దూ శృంగారపదం) భావయుక్తంగా చదివి వినిపించే తీరులోనే శోకగీతాల్నిగూడ (మర్సియా) గంభీరస్వరంతో భావయుక్తంగా స్ఫుటంగా చదువుతూ అందులోనివిషయాన్ని వివరించి చెపుతూండటం ఒకపద్ధతి. శోకగీతాన్ని కరుణామయంగా ఆలాపించడం మరోపద్ధతి. ఈపద్ధతిని సోజ్‌ఖ్వానీ అంటారు.)

అసలు పూర్వకాలంలో శోకగీతాలు చదవడమన్నారుగానీ, అదీ ఆలాపనే. ఈ శోకగీతాల్నే కచ్చేరీల్లో పాటలతోపాటు పాడేవారుగూడాను. అయితే ఒక్క ఢిల్లీలోనేకాదు. భారతదేశమంతటా షియాలున్న ప్రతిచోట. ప్రతిపట్టణంలోను ఈ శోకగీతాలు ఆలాపించే రివాజు ఉండేది. మద్రాసు, ఇంకా దక్షిణాది అంతటగూడ యీ శోకగీతాలాపన (మర్సియా ఖ్వానీ) జరిగేది. నూటయాభై సంవత్సరాలక్రితం రచించిన శోకగీతాలు ఇప్పటికి సుస్థిరంగా ఉన్నాయి. ఈ శోకగీతాల్ని షేర్ (ఉర్దూలో రెండు పాదాలుండే ఒక ఛందము) చదివినపద్ధతిగా చదవడం లక్నోవారి ప్రత్యేకత. శోకగీతాలాపనలో మీర్ అనీస్, మీర్జా దబీర్ మొదలైనవారు ఆరితేరారు. వారిని గురించి, కవుల్నీ కవితారీతుల్నీ గురించి చెప్పినప్పుడు ముచ్చటించక తప్పలేదు.

ఈ శోకగీతాలాపన (సోజ్‌ఖ్వానీ) పూర్వంనుంచీ ఉన్నదే. అంతట జరుగుతున్నదే. అయితే లక్నోలో ఈ శోకగీతాల్ని ఆలాపించేగాయకులు పరిపూర్ణమైన

ప్రజ్ఞకలవాళ్లు. అందువల్లనే ఈ కళ అక్కడ ఒక విశిష్టస్థానాన్ని ఏర్పరచుకుంది. ప్రాచీనసంప్రదాయంగా వస్తున్న ఈ శోకగీతాలాపన అన్నది హిందూదేశమంతటా వ్యాప్తిచెందడమేకాక, ఎంతో ప్రగతిని సాధించింది. కొమ్ములుతిరిగిన పెషావరు గాయకులంతటివారుగూడ ఈ శోకగీతాలు పాడేవారిఎదుట అగలేకపోయారు.

లక్నోలో ఈ శోకగీతాలుపాడే (సోజ్ ఖ్వాన్) గాయకులు మిగతా కళాకారులవలెనే నవాబు షుజా ఉద్దౌలాతోబాటే అంటే ఆయన పరిపాలనాకాలంలోనే రావడం తటస్థించింది. షుజా ఉద్దౌలా సతీమణి బహూబేగం సాహిబా అంతఃపురంలో సమావేశాలు, కచ్చేరీలు జరిగేవట. అక్కడ జవహర్ అలీఖాం అనే అంతఃపురపరిచారకుడుండేవాడు. అతను ఆ ఇలాకా అంతటికి రాజప్రతినిధిగూడాను. అతడు ఈ శోకగీతాలాపనలు వింటూండేవాడని ఫైజాబాద్ చరిత్రలో చెప్పబడింది. అప్పట్లో ఈ శోకగీతాలాపనలు అంతట జరుగుతున్నట్టే ఇక్కడ ఉండేవిగానీ, ప్రత్యేకతేం లేదుట.

ఖ్వాజా హసన్ మౌదూదీ తోనే అసలీ కళ ఆరంభమైనట్టు కొందరు చెబుతారు. ఆయన 'నగ్మాత్-ఉల్-అసఫియా' రచయితకు గురువుగారట. ఆయన పెషావరుకు చెందిన సంగీతవిద్వాంసుడు కాకపోయినా సంగీతకళలో ఆరితేరినవాడు. ఆయన్ని మించినవాళ్లు లేరనేచెప్పాలి. సంగీతంలో ఆయన గొప్పతనం తెలుసుకోడానికి ఈ ఒక్క సంఘటన చాలు. మరాఠీలు దేశంమీదబడి కొల్లగొడుతున్నకాలంలో ఈ ఖ్వాజా హసన్ మౌదూదీ పల్లకీలోఎక్కి లక్నోనుంచి ఇటావాకు వెడుతున్నాడట. దారిలో ఏదో ఊరిమీదుగా వెడుతుంటే, ఆ ఊరిని దోచుకునేందుకు మరాఠీలు వస్తున్నట్టు తెలిసింది. పల్లకీమోసే బోయీలు అప్పటికే ఎంతోదూరంనుంచి మోసుకొస్తున్నారేమో హఠాత్తుగా పల్లకీ దింపేసి ఇహ ముందుకుసాగడం మావల్లకాదు, మా కిక శక్తిలేదంటూ చదికిలబడ్డారట. మౌదూదీ వాళ్ల కనేకవిధాల చెప్పిచూశాడు. ఈ తరుణాన ఇక్కడుండటం అపాయం. మన మెట్లాగయినా ఈ ప్రదేశంనుంచి బయటపడాలని ఎంత పోరిచెప్పినా, అసలు వారు చెవిని వేసుకోనేలేదట. అప్పుడిక ఏం చేయడానికి తోచక మౌదూదీ నిరాశపడిపోయాడు. అప్పటికి నమాజుకి వేళైపోయింది. నమాజు చేసుకోవాలనిపోయి కాళ్లు చేతులు కడుక్కువివచ్చాడు. నమాజు చేశాడు. ఆతర్వాత దిక్కుతోచనివాడై ఏదో ఆలాపిస్తూ కూర్చుండి

పోయాడట. ఇంకేముంది? ఆయన పాడటంలో ఉన్న మహత్తే మోగానీ ఆ పాట వినేటప్పటికల్లా పల్లకీ బోయీలకు ఎక్కడలేని సత్తువవచ్చేసి, ఆయన్ని సురక్షిత మైనప్రదేశానికి చేర్చడం జరిగిందట.

మౌదూదీ సున్నీతెగకు చెందిన ముసల్మాను అయినప్పటికిగూడ సంగీతంలో కొత్తకొత్తరాగాలను సృష్టించి తన శిష్యకోటికి నేర్పాడు. ఆయనదొక ప్రత్యేక బాణీగా విలసిల్లింది. ఈ ఖ్వాజా మౌదూదీ తర్వాత సిడే హైదరీఖాన్ వచ్చాడు. ఆయనపద్ధతేమంటే మొహర్రమప్పుడు తన కిష్టమయినరాగాలలో శోకగీతాల్ని ఆలాపించేవాడు. ఆయన గొప్ప గాయకుడుగా పేరుమోసినవాడు. రాజాస్థానాల్లో సన్మానాలందినవాడూను. తన బాణీలో తాను కృతకృత్యుడైనాడు. అంతేకాదు; ఈ శోక గీతాలాపన (మర్శియా ఖ్వానీ) వృద్ధికి దోహదం చేసినట్లయితే అదొక ప్రత్యేక కళగా విరాజిల్లి విశేషఖ్యాతి నార్జించగలదనిగూడ భావించాడు. సంగీతంలో వేలాది రాగాల్లోంచి ఆయన శోకం, కరుణ, వేదనను అభివ్యక్తపరచడానికి అనువైన కొన్నిరాగాలను ఎన్నుకున్నాడు. ఆ రాగాలను అనేకపద్ధతుల్లో ప్రస్తరించి నియమబద్ధం చేశాడు. చివరికి హైదరీఖాన్ తన కళను, తన బాణీని సయ్యద్ మీర్ అలీ సాహెబ్‌కి అప్పగించాడు. సయ్యద్ అలీ ఒక పెద్దమనిషి. మతావేశపరుడు కావడంతో ఈ కళ ఆయనవల్ల ఎంతో వృద్ధిఅయింది. అప్పట్లో గొప్ప గాయకుడుగా ప్రసిద్ధిఉన్నవా డాయన. నవాబు సఆదత్ అలీఖాన్ కాలంలో ఒకసారెందుకో ఆయనమీద కోపంవచ్చి సయ్యద్ అలీ లక్నో విడిచిపెట్టి వెళ్ళిపోవడానికి సిద్ధపడ్డాడు. అప్పుడు ఇన్శా అల్లా ఖాన్ అనే ప్రతిభావంతుడైన కవి వ్యంగ్యార్థమొచ్చేటట్టు కవితల్లి సిఫారసుచెయ్యగా, నవాబు వెంటనే ఆ గాయకుణ్ణి బ్రతిమాలుకుని వెళ్ళకుండా ఆపుచేశాడు.

ఆ తర్వాత తాన్‌సేను వంశీయుల్లోనివాడైన నాసిర్ అలీ ఖాన్ అనే ఒకగాయకుడు లక్నోవచ్చి రాణించాడు. అక్కడివారు (సోజ్‌ఖ్వానీ) శోకగీతాలావనయందు చూపే అభిరుచినిబట్టే ఆయన శోకగీతాలు చదవడంలో తన నైపుణ్యాన్ని ప్రదర్శించి బహుజనాదరణ, ఖ్యాతి పొందాడు. ఈ నాసిర్ అలీ ఖాన్ ఇంటిపొరుగున సయ్యదు వంశానికిచెందిన ఒక విధవరాలు కాపురముంటూండేది. ఆమెకు మీర్ అలీ, మీర్ హసన్ అని ఇద్దరు కొడుకులుండేవాళ్ళు. ఆ కుటుంబంమీద జాలిపడి నాసిర్ అలీ

ఖాన్ ఆ పిల్లలిద్దరికి శోకగీతాలాపన నేర్పించాడు. ఆ కళలో వారిద్దరు ఆరితేరడమే గాదు వెనుకటి గాయక సార్వభౌముల్నిగూడ మించిపోయారనుకోండి.

శోకగీతాలాపనలో వారిని మించినవారు లేరనిపించుకున్నారు. వారు శోకగీతాలాపనలో ఒక అపూర్వరాగాన్ని సృష్టించారు. నిజం చెప్పాలంటే సంగీతకళలోని రాగప్రస్తావ లక్షణాలన్నీ చెబుతూ కూర్చుందుకు కొమ్ములుతిరిగిన గాయకులకే గుర్తుండదు. కానీ శోకగీతాలాపన చేసేవారికిమాత్రం రాగప్రస్తారము అంతా గుర్తుంకితీరుతుంది. రాగం ఎత్తుగడలోనే దాని జనకరాగమేదో, దాని ప్రస్తారము, అన్నీ స్పష్టంగా తెలిసిపోతాయి.)

ఇటువంటి పెద్దలు ఉండటంమూలానే లక్నోలోని శోకగీతాలాపన అనే కళ గాయకులు మొదలు కులీనులవరకు పాకింది. ఆ వరవడిలో శోకగీతాలుపాడటంలో గొప్ప ప్రతిభా సంపన్నులెందరో బయల్దేరారు. డోం, ఢాఢీ జాతివారేకాదు గొప్ప గాయకులుగూడ వారిముందు బలాదూరనిపించేటట్టు పాడగల్గిన పెద్దమనుషులెందరో ఉండేవారు.

ప్రస్తుతకాలంలో శోకగీతాలు పాడటంలో సమర్థులని చెప్పదగినవారు మంయూ సాహేబ్, ఇంకా ఒకరిద్దరు పెద్దలు వున్నారు. వారికి స్వాగతం పలకడానికి అత్యుత్సాహంతో దేశమంతా ఎప్పుడూ వెయ్యికళ్ళతో కనిపెట్టుకొని ఉంటుంది. దేశంలో నలుమూలలా వారిఖ్యాతి వ్యాపించింది. దేశంలోని మూలమూలప్రదేశాలనుంచీ వారి కాహ్వానాలు వస్తాయి. మొహర్రంనెల వచ్చిందీ అంటే చాలు. లక్నోలో వారిని ఉండనీయరుగదా! ఆహ్వానాల కంతూ పొంతూ వుండదు. వారికెంత గిరాకీయో చెప్పలేం.

(అసలు ఈ శోకగీతాలాపనంటే లక్నోలోని ఆడవారికి ఎక్కడలేనంత అభిరుచి. శోకగీతాలకు హృదయాన్ని హత్తుకునేటటువంటి రాగాలబాణీలు కుదిర్చి ఆలాపించేవారిలో మీర్ అలీ హసన్, మీర్ బందా హసన్ చెప్పుకోదగినవారు వారు ఆలాపించిన వరుసలపక్కీలోనే ఎంతోమంది కులీనులు ఆలాపించడం నేర్చుకున్నారు. వందలాదిమంది వారి బాణీయే అనుకరించారు. ఆ కులీనులైనవారినుంచి షియా తెగకు చెందిన ఎందరో స్త్రీలుగూడ తమ మధురమైన గాత్రస్వరంతో ఆలాపించడం నేర్చుకున్నారు. సహజంగా స్త్రీలకు ఆటపాటలంటే ఎక్కువ ఆసక్తి ఉండనే

వుంటుంది. దానికి తగ్గట్టు వారి కంఠంగూడ పాడటానికి అన్నివిధాలా తగి వుంటుంది.

స్త్రీలుగూడ శోకగీతాలు నియమబద్ధంగా పాడటం మొదలుపెట్టాక దాని ఆకర్షణ మరింత హెచ్చింది. మాధుర్యం ఇనుమడించింది. దాంతో స్వల్పకాలంలోనే షియా తెగవారే కాదు, సున్నీ తెగ ముసల్మానుస్త్రీలకు ఇంకా తక్కువజాతిస్త్రీలకు గూడ ఈ శోకగీతాలు పాడటంలో ఆసక్తి పెరిగిపోయింది. ఇది ఎంతవరకు వచ్చిందంటే, మొహర్రంవస్తే చాలు, మతపరమైన పూజలు పునస్కారాలు జరిగేటప్పుడు ప్రతియింటినుంచి ఈ శోకగీతాలు వినబడాల్సిందే. లక్నోలో ఎక్కడచూసినా సందులు గొందులు అంతటా ఈ గీతాలాపనలతో మార్మోగుతూండేవి. అవి మైమరపించే ఆలాపనలు. ఎంతసేపైనా అలా వింటూవుండాలనిపించేటట్టు ఉండేవి. ఒక్కసారి వింటే జన్మంతా మరిచేపోము. అక్కడక్కడ హిందువులయిళ్ళు, కొందరు సున్నీతెగవారి యిళ్ళుమాత్రం నిశ్శబ్దంగా ఉండేవన్నమాటగానీ, ఇక మిగతా అంతటా వినాలేగానీ, శోకగీతాలు ఎంతో ఆకర్షణీయంగా ఆలాపించడం వినవచ్చేది.)

మొహర్రంలో శోకం వ్యక్తపరచడాన్ని తాజియాదారీ అంటారు. శోకాన్ని ప్రకటించేందుకు సాధనంగా శోకగీతాలు ఆలాపించడమనే సంప్రదాయం బయల్దేరింది. అందువల్ల సున్నీ షియా తెగలవారిద్దరు శోకగీతాలు ఆలాపించడంద్వారా తమవిచారాన్ని వ్యక్తపరచడం మొదలైంది. క్రమంగా హిందువులుగూడా విషాద గీతాలాపన ప్రారంభించారు. మొహర్రంలో శోకప్రకటన అన్నది ఇంత విస్తృతంగా వృద్ధిచెందడానికి కారణం లక్నోవారు విషాదగీతాలాపనలోచూపిన ప్రత్యేకత అని చెప్పాలి.

లక్నోలోని కులీనులు, విద్యావంతులయిన స్త్రీలు శోకగీతాలాపన చేయడంలో జాణలు. అసలు తెరమరుగు అనే ఆచారం లేనట్టయితేనా స్త్రీలు పురుషుల్నిగూడా ఆ కళలో మించిపోయి వుండేవారనడంలో ఏమాత్రం సందేహంలేదు. చాలాకాలం మాట. ఒకయేడు 'చెహలుం' జరుగుతున్నప్పుడు (కర్బలా మైదానంలో ఆత్మాహుతి చేసిన వీరులనిమిత్తం నలభయ్యోరోజున జరిపే క్రతువు) నేను కొందరు స్నేహితుల్తోకలిసి తాల్ కటోరాలోని కర్బలాకు వెళ్ళాను. అక్కడో గుడారంలో ఆ రాత్రి

టిసచేశాను. అర్ధరాత్రి రెండుగంటలప్పుడు అకస్మాత్తుగా మెలకువ వచ్చింది. ఆవే ళప్పుడు ఒక మధురమైన గానం చెవులబడింది. దాంతో మిగతా మిత్రులంతాగూడ మేల్కొన్నారు. ఆ గానమెవరిదో ఏమిటో తెల్సుకోవాలని, వినాలనే కుతూహలంతో మేమంతా ఆ గుడారంలోంచి బయటకువచ్చాం. చూస్తే ఎటూగాని రాత్రి. అంతటా నిశ్శబ్దం. పిండారబోసినట్టున్న వెన్నెల్లో, జట్టుగా ఆడవాళ్ళంతా తాజియా మొహ ర్రంలో కాగితాలతోకట్టిన ఒక మండపం తీసుకుని వస్తున్నారు. వాళ్ళ తలలు విర బోసుకునివున్నారు. వారిలో ఒక ఆవిడ చేతిలో కాగడా పుచ్చుకుని నడుస్తూంది. ఆ కాగడా వెలుగులో ఒడ్డూ పొడుగువున్న ఒక అందమైనస్త్రీ ఒక పుస్తకంలో చూస్తూ విషాదగీతాలు ఆలాపిస్తూంది. మిగతాస్త్రీలంతా ఆమెతో గొంతుకలిపి పాడు తున్నారు. ఆ నిశ్శబ్దవాతావరణంలో ఆవేళప్పుడు వెన్నెల్లో తలలు విరబోసుకున్న అందమైన ఆడవాళ్ల వేదనాగీతాలు ఆలాపిస్తున్నప్పటి ఆ దృశ్యాన్నిగురించి వర్ణించి చెప్పడం నాతరంగాదు. నాజూకైన హావభావప్రదర్శనచేస్తూ ఆడవాళ్ల జట్టు కర్బలా సింహద్వారప్రవేశం చేసీ చెయ్యడంతోనే ఒడ్డూ పొడుగూవున్న ఆ అందమైన స్త్రీ వేదనాభరితమైనరాగంలో ఈ క్రింది విషాదగీతం పాడటం మొదలెట్టింది.

'జబ్ కారవాన్-ఎ-శహరె మదీనా లుటా హు ఆ,
పహుంచా కరీబ్ షామ్ కే కైదీ బనా హుఆ
నేజే పే సర్ హుసేన్ కా ఆగే ధరా హు ఆ
ఔర్ పీఛే పీఛే బీబియోం కా సర్ ఖులా హు ఆ'

'బల్లెం కొసకు హుసేను తల గ్రుచ్చివుండగా
వెనుక ఆయనభార్యలు తలలు విరబోసుకుని నడుస్తూవుండగా
దోచుకోబడిన మదీనా నగర ప్రయాణికుల బృందంవారు
సిరియా సమీపానికి బందీలుగా చేరుకున్నారు'

ఈ గీతం వినగానే ఆ గాయని ఆనాటి 'కర్బలా' ఉదంతాన్ని కన్నులకు కట్టేలా చిత్రిస్తున్నదా లేక తనబృందంలో 'కర్బలా'లో స్వయంగా ప్రవేశిస్తున్నదా అని పించింది. 'కర్బలా'లో హుసేన్‌ను దారుణంగా హత్యచేసిన ఉదంతం ఈ విషాద గీతంలోని ఇతివృత్తం.

లక్నోలోని స్త్రీ పురుషులందరికిగూడ విషాద గీతాలాపన అంటే చాలా శ్రద్ధా సక్తులు కలిగాయి. మరేవిషయంలోనైనా అంతశ్రద్ధ ఉందో లేదోగాని, ఈ విషయంలోమాత్రం మహానిష్టగా ఉంటారు. వీటికి మూలకారణం, ఆడవాళ్లు మంచి గాత్రమాధుర్యమున్నవాళ్లు కావడము, సంగీతనియమానుసారం శోకగీతాలాపన చేయగలగడం ఒకటి, రెండోది, నగరంలోని స్త్రీ పురుషులందరు సంగీతప్రియులు కావడమూను. తక్కువజాతి కుర్రకారు జనం వస్తూ పోతూగూడ ఏవో పాడుతూ వుండడం లక్నోలోని సందుల్లో గొందుల్లో అంతటా వినవచ్చు. ఎంత బాగా రాగంతీసి పాడతారంటే ఎంతటి కష్టమయినసంగతులనైనా సరే వాళ్ళకంఠాలు అవలీలగా పలుకుతాయి. వినేవాళ్ళు విస్తుపోవాల్సిందే. శోకగీతాలు ఆలాపించడం అంటే వారికున్న అభిరుచే అందుకు ప్రధానకారణం. అసలీ శోకగీతాలు పాడట మన్న సంప్రదాయం పామరజనంతోనే ఆరంభమైంది. రానురాను రాగాల్ని నియమబద్ధంచేసి సంగీతంలో తగినస్థానాన్ని దానికి కల్పించడం జరిగింది, నశించిపోకుండా నిలబెట్టడం జరిగింది. ఎందుకంటే ఏ విద్యనైనా సంస్కరించి, నియమబద్ధం చేస్తేనే అది కళగా రాణిస్తుంది.

(శోకగీతాలాపనను షియా తెగవారు పుణ్యకార్యంగా భావించినప్పటికీ, షియా తెగకు చెందిన విద్వాంసులుమాత్రం ఇప్పటికీ దాన్ని శాస్త్రసమ్మతమైందిగా ఒప్పుకోరు. వారంతా ధర్మశాస్త్రవిధులను తప్పక పాటించే నైష్ఠికులు. అందుకనే ఈనాటివిద్వాంసులు శిష్టులు జరిపే సమావేశాల్లో ఎంతసేపు మహమ్మదుసాహెబ్ బోధనలు, వారి ఘనకార్యాల్నిగురించి చెప్పడమూ సాగుతూంది. సర్వసామాన్య జనం జరుపుకునే సమావేశాల్లోగూడ ధర్మశాస్త్రజ్ఞులయినవారు కనుక పాల్గొన్నట్టయితే వారిముద్ద విషాదగీతాలు పాడటము నిషేధమే. అయితే విషాదగీతాలు పాడటమన్నది బహు జనాదరణ పొందడంచేత ఈ శాస్త్రిలు ఈ కళను ఏం చెయ్యలేకపోయాయి. విద్వాంసులు వాటిజోలికి రాలేకపోయారు. మొత్తంమీద జనంలో ఆ కళ స్థాయి నేర్పరచుకుంది. విజయం సాధించింది.

సున్నీతెగకు చెందినవారిలో మహమ్మదు బోధలుచెప్పే విద్వాంసులకు సాధువులకు సంగీతంలో ప్రవేశం ఉండవలసిందే కాని 'ఇస్నా అశరీ' మతంవారి ధర్మశాస్త్రదృష్ట్యా ఆ కళకు అంతటియోగం లభించలేదు. గుర్తింపు కలుగలేదు. ధర్మసమ్మతమైనట్టయితే ఈ ఇబ్బందే ఉండేదికాదు.)

# 24

నాటి కళలు, కళాకారులు, సంగీతశాస్త్రం వీటిగురించి చాలావరకు తెలుసుకున్నాం. ఈ క్రమంలోనే బాజా భజంత్రీలను గురించికూడా తెలుసుకోవడం అవసరం. ఈ బాజా భజంత్రీలప్రభావం లక్నోలో ఏమాత్రంగా ఉన్నదీ తెలుసుకుని ముగిం చుదాం. వివాహాది ఊరేగింపులకుపయోగించే మేళతాళాల్లో ముఖ్యమైనవి ఆరు రకాలు. అవి 1. డోలు తాషా, 2. రోషన్‌చౌకీ, 3. నౌబత్తు, 4. తూతూ - (శంఖం), 5. ఢంకా (బాకా), 6. బ్యాండుమేళం. ఈ బ్యాండుమేళాన్ని అర్గన్ బాజా అంటారు. రోజు రోజుకి దీని గిరాకీ హెచ్చుతూంది.

మొట్టమొదటివైన డోలు తాషా, భారతదేశపు ప్రాచీనమైన జాతీయవాద్యాలు. వాటిని ఇంగ్లీషువారు ఇండియన్ టాం టాం అనే పేరుపెట్టి, వెక్కిరించి తమ తెలివితక్కువతనాన్ని చాటుకున్నారు. క్రీ. శ. 1896 సంవత్సరంలో ఇంగ్లండు లోని ప్రదర్శనశాలయైన 'అర్ల్స్ కోర్టు'లో భారతీయసంస్కృతి, కళలు, శిల్పాల గురించి ఎన్నో నమూనాలు ప్రదర్శించారు. ఆ ప్రదర్శనంలో ఈ వాద్యాన్ని ప్రద ర్శించారు. కారు నలుపుగావున్న ఓ మనిషి మాసిపోయిన లంగోటీతప్ప మరేం లేదు. అంత నగ్నంగా జనం మధ్యలోకివచ్చి నిలబడ్డాడు. అతనిమెడకో డోలుంది. అతడెంతో అసభ్యంగా దానికో, తాళం, వరుస లయ లేకుండా పిచ్చివాడికిమల్లే తల ఆడించేస్తూ కర్రతో బాదుతూ, దీన్నే భారతీయవాద్యం టాం టాం అంటారని చెప్పడం నేను చెవులారా విన్నాను. కానీ, ఇలా ప్రదర్శించడమనేది వారి అజ్ఞా నము అవివేకమూను. ఈ డోలువాద్యం చాలా శ్రేష్ఠమయినవాద్యాల్లో ఒకటి. అది వాయించడమనేదో గొప్పకళ. దానికి శ్రుతిమధురమైన లయ వుంది.

లక్నోలో జరిగే ఊరేగింపులో ఒకటి. ఒక్కొక్కప్పుడు రెండు, మూడు, నాలుగు డోళ్లుగూడ వుపయోగిస్తారు. కనీసం ఒకరో లేక ఇద్దరు ముగ్గురైనా తాషా వాయించే వాళ్లుంటారు.

ఎంతలేదన్నా ఒక తాళముంటుంది. ఈ తాళమనేది ఈరాన్ మొదలైనచోట్ల ఎక్కువ ప్రచారంలో వుంది. తాషాను ఈజిప్టు మున్నగుదేశాలలో ఉపయోగిస్తారు. డోలుమాత్రం సిసలయిన భారతీయవాద్యము. ఈ వాద్యాన్ని సైనికులో, చీకు

చింతలులేని శ్రీమంతులలో ఢిల్లీనుంచి లక్నోకి తెచ్చివుండాలి. కాని ఢిల్లీలో డోలుతో తాళముమాత్రమే ఉంటుంది. దీనికి తాషామరఫాను లక్నోలో చేర్చారు. పక్క వాద్యాలుగా డోలు, తాళం ఉండటంతో తాషాలో ఒక జీవం ఏర్పడింది. ఆ వాద్యానికో విశిష్టత చేకూరింది. చాలవరకు ఊళ్లలో డోలు, తాళం ఉపయోగించడమే వుంది కానీ లక్నోలోమాత్రం వాటికితోడు 'తాషా' లేకుండా వుండనేవుండదు. డోలుకు తాషాతో అవినాభావ సంబంధముంది. 'తాషా' లేకుండా ఒక్క డోలు వాయించడమన్నది వారికి లేనేలేదు. దీనిబట్టిచూస్తే గొప్పతనంగానీ, నైపుణ్యంగానీ తాషామరఫా వాయించే వ్యక్తిదేనని అవగతం కాకమానదు.

లయ విన్యాసం అతడిదే. డోలువాద్యగాడు ఆ లయను అనురిస్తాడంతే. తాషా మరఫావాద్యంలోని సొగసంతా దరువెయ్యడంలోనే వుంది. దరువుకి దరువుకి విరామంలేకుండా, కమ్మకు రావడంలోనే వుందా నైపుణ్యం. హెచ్చుతగ్గుల స్థాయిల్లో విరామంలేకుండా వేసే ఆ దరువుల్లోంచి ఒక లయ, ఆలాపన వినబడతాయి. లక్నోలో ఈ వాద్యం వాయించేవాళ్ళలో ఎంతెంత ఘటికులున్నారంటే వారికి సమఉజ్జీలుగా నిలబడి, వారి లయ కనుగుణంగా డోలు వాయించాలీ అంటే ఎవరైనా అదిరిపోతారు.)

(మొహర్రం నలభయ్యోరోజున మతంకోసం కర్బలా మైదానంలో ప్రాణాలర్పించిన వీరులకు సద్గతి కలగాలనిచేసే ప్రార్థనా సమావేశాన్నే 'చెహలుం' అంటారు. ఆ చెహలుం అయినతర్వాత రంగురంగుల కాగితాలతో ఒక మండపంలా కట్టి ఊరేగిస్తారు. ఆ మండపాన్ని బక్‌షూ కా తాజియా అంటారు.

షియా తెగవారికి, సున్నీ తెగవారికి బొత్తిగా పడకపోవడంవల్ల ఈ ఊరేగింపువైఖరిలో మార్పు ఏర్పడి మరోవిధంగా తయారైంది. దాదాపు పది పన్నెండేళ్లక్రితంవరకు ఈ ఊరేగింపు ఎంతో వైభవంగా జరిగేది. ఇది రాజకుటుంబానికి చెందిన ఒక పూర్వీకుని జ్ఞాపకార్థం జరిపే వూరేగింపు. ఇప్పుడిది నిర్వహించేవారంతా నిరుపేదలే. అందుకనే వారు వీరనే భేదభావంలేకుండా, వాదన కళలో సాటిలేని మేటి ప్రతిభాసంపన్నులైన మేళగాళ్లంతాగూడ పుణ్యమన్నట్టు ఆ వూరేగింపులో పాల్గొంటారు. పుణ్యమనే మిషతో తమతమ కళను, విద్యానైపుణ్యాన్ని పురజనుల సమక్షంలో ప్రదర్శించడం, గుణగ్రహణ పారీణులంతా అచ్చట వారి

పట్టా గుమిగూడటం జరిగేది. ఆ వాద్యనిపుణులు మాకంటె గొప్పగా వాయింతే వారుంటే, మా యెదుటికి రమ్మని సవాల్ చేస్తున్నట్టు మజిలీ మజిలీకి గంటలు గంటలు నిలబడి వాయించేవారు. గొప్పగొప్ప విద్వాంసులు, గాయకులు వారివాదన కౌశలాన్ని మెచ్చుకున్నకొద్దీ, వారిలో ఉత్సాహం పెల్లుబికి, ఇంకా బ్రహ్మాండంగా వాయించేవారు. ముఖ్యంగా ఢాఢీ జాతివారిలో యీ తాషామరఫా వాయించే విద్వాంసులున్నారు. ఈ ఢాఢీ జాతివారు సహజంగా సంగీతంలో ప్రవీణులు. అందుకనే వారి లయ విన్యాసంలో కొత్తదనం గోచరించేది.

అయోధ్య నేలినవారిలో ఆఖరివాడైన వాజిద్ అలీషా గొప్ప సంగీతాచార్యుడు. మొహర్రం పండుగలో ఏడోతారీఖున కలకత్తాలోవి తన ఆకాశభవనంనుంచీ బయల్దేరే మెహందీ అనే వూరేగింపులో వాజిద్ అలీషా స్వయంగా మెళ్లో తాషా వేసుకుని వాయించడం నేను కళ్లారా చూశాను. డోలు తాషావాద్యాలు, ఎంత గొప్ప వాద్యాలో ఇంతకంటె గొప్ప దృష్టాంతమేం కావాలి? గొప్పగొప్ప వాద్యనిపుణులు పెద్దపెద్ద ఢోళ్లు మెళ్ళోవేసుకుని అద్భుతంగా వాయిస్తూంటే, రాజస్థానాల్లో వున్నవ లందినవారంతా, అటు ఇటు బారులుతీర్చి నిలిచి, వింటూ ముగ్ధులై మురిసిపోయేవారు, గాయకుల ప్రశంసలు మిన్నుముట్టేవి. వారంతా గొప్పగా డోలు వాయించడం నేను చాలాసార్లు చూడగలిగాను.

ప్రస్తుతకాలంలో లక్నోలో ఆ ప్రాచీన భారతీయవాద్యాల్లో కొన్ని మార్పులు వచ్చాయి. అలా మార్పులవల్ల వాటికి బహుజనాదరణ కలిగింది. అక్కడ తాషా వాయించేవారి వాదన కళాప్రావీణ్యాన్ని చూసినవారికి అందులో పరివర్తన తేవడం ఎంత అవసరమైందో బోధపడక మానదు. ఆ పరివర్తనవచ్చి డోలుకి తాళానికి ఎంతటి ప్రాముఖ్యాన్ని చేకూర్చిందోగూడ తెలుస్తుంది.

రోషన్ చౌకీ అని మరో వాయిద్యముంది. ఈ రోషన్‌చౌకీ అతి ప్రాచీన వాద్యాల్లో ఒకటి. శహనాయి రోషన్‌చౌకీకి ముఖ్యాంగము. ఇది మహమ్మదీయులు తమవెంట తెచ్చిన వాద్యం.

ఆ వాద్యం 'షేకుర్రయాస్ ఇబ్నేసీనా' సృష్టించాడని ప్రసిద్ధి. దాని నాదం కేవలం మనిషిగాత్రంలాగనే వుంటుంది. అంతటి శ్రుతిశుద్ధమై తాళ, లయబద్ధంగా శహనాయి పలికినంత బ్రహ్మాండంగా మరేవాద్యం పలకదు. రోషన్ చౌకీలో

కనీసం ఇద్దరు షహనాయి వాదకులుంటారు. ఒక తబ్లా వాయించేవాడుమ. ఆ తబ్లా వాద్యగాడు నడుముకి రెండు చిన్నచిన్న తబ్లాలను కట్టుకుంటాడు. తబ్లా అనేది లయని నియమబద్ధం చేసేవాద్యం. అసలు వాదకుడికి శ్రుతి తప్పకుండా ఉండటానికి ఒక షహనాయి వాదకుడు పక్కశ్రుతి వేస్తూంటాడు. ఏకబిగువున సంగతులు పలికిస్తూ, రాగభావ, తాళ గమకములొలికిస్తూ, గజల్, తుమ్రీలు వగైరాలు లోకోత్తరంగా హృదయాహ్లాదంగా ఆలాపించగలవాడే విద్వాంసుడనిపించుకుంటాడు.

ఈ 'రోషన్ చౌకీ' అనేది భారతదేశంలో ముఖ్యంగా రాజాస్థానాల్లో వాయించబడే వాద్యం. పాదుషాలు గొప్పగొప్ప అమీర్లు భోజనాలవేళ ఈ వాద్యం వాయించడం రివాజుంది. ఇంకా వారు విశ్రాంతి తీసుకునేవేళల్లో ఈ రోషన్ చౌకీని రాజమహల్ చుట్టుపట్ల తిరుగుతూ వాయిస్తారు. దూరంనుంచి ఎంతోమధురంగా వినబడుతూవుంటుంది. ముసల్మానుల పరిపాలనాకాలంలో ఈ వాద్యం ఎంతో మనోరంజకమైందిగా పేరు పొందింది. ఢిల్లీలో ఈవాద్యం ఏనాటినుంచీ వాడుకలోవుందో దేవుడికే ఎరుక. లక్నోలో రోషన్ చౌకీ వాయించేవాళ్ళు ఢిల్లీనుంచే వచ్చివుండాలి. అయితే ఈ వాద్యాన్ని వాయించడంలో నిపుణులైనవారెందరో లక్నో చుట్టుపట్ల వున్న జమీందారీల్లో ఏనాటినుంచో ఉన్నవారే.

వారణాసిలో ఈనాటికిగూడ దేవాలయాలన్నిటిలో ప్రభాతవేళల ఈ రోషన్ చౌకీ వాయిస్తారు. తెలతెలవారేవేళ మధురనాదం అల్లంతదూరాన్నుంచీ వినవస్తూంటే చెప్పలేనంత ఆనందంగా వుంటుంది.

లక్నోలో సాధారణంగా పెళ్లి ఊరేగింపుల్లో ఈ రోషన్ చౌకీ తప్పకుండా వుంటుంది. ఈ రోషన్ చౌకీ వాయించేవాళ్ళు పెళ్ళికొడుక్కి దగ్గరగా వుంటారు. ముఖ్యంగా హిందువులపెళ్ళి ఊరేగింపుల్లో దారిపొడుగునా, అడుగడుగునా వారికెన్నో కానుక లిస్తూవుంటారు. ఈకాలంలో రోషన్ చౌకీ వాయించేవారిలో లక్నోవార్ని మించిన వారెక్కడా లేరు, ఉండరు.

రోషన్ చౌకీ వాయించడంలో లక్నోవారి కున్నంత లయజ్ఞానం, శ్రుతితప్పక మనోహరంగా రాగాన్ని ఆలాపించడంలో వారిప్రజ్ఞా పాటవాలు ఇతరత్రా వాయించేవారెవరిలోను కనబడవు. ఆసక్తితో వినేవారు, మెచ్చుకోగలిగినవారు ఉన్నప్పుడే

చూడాలి వారి గానంలోని గొప్పతనము, కళానై పుణ్యమూను. 'బక్షి కే తాజియే' అని మొహర్రంలో నలభై యోరోజున జరిపే వూరేగింపులో రోషన్ చౌకీ వాయించే వారు తమతమ ప్రావీణ్యాన్ని ఎంత గొప్పగా ప్రదర్శిస్తారంటే, ఆ తరుణంలో షహనాయి విన్నవారికి, ఇక మరెవరివాదనం అంతటి ఆనందాన్నీ, సంతృప్తినీ ఇవ్వనే లేవు.)

వాద్యాల్లో మూడోరకం నౌబత్తు. ఈ నౌబత్తు అనేదిగూడ మన ప్రాచీన వాద్యాల్లో ఒకటి. గొప్ప బ్యాండుమేళంకింద లెక్క. ఈ నౌబత్తుఖానా జట్టులోను షహనాయి వాయించేవాళ్ళు యిద్దరు ముగ్గురికి తక్కువకాకుండా వుంటారు. నగారా వాయించేవా డొకడుంటాడు. మరో యిద్దరు, అందంగాఉండే, చాల పెద్దపెద్ద రెండునగారాల్ని తమముందు ఎడాపెడా కొంచెం వొంచి నిలబెట్టి, ఆరెంటినీ ఒకే సారి పుల్లలతో వాయిస్తూంటారు. ఈ నగారాలమోత విపరీతం. చెవులు చిల్లులు పడేటట్టుంటుంది. చుట్టుపట్ల ఎంతదూరానికో ప్రతిధ్వనిస్తూవుంటుంది. వీరితోపాటు తాళవాదకుడుగూడ వుంటాడు.

(ఈ నౌబత్తనేది చరిత్రాత్మకమైన వాద్యం. అలనాటి వైభవప్రాభవాన్ని ద్యోతకం చేసే ఆ వాద్యం అనాదిగా వాడుకలో వుంది.

మహమ్మదీయ చరిత్రనుబట్టిచూస్తే, దమిష్క్, బాగ్దాద్, ఈజిప్టులలో ఈ వాద్యం ఉండేదని మనకి తెలియవస్తుంది. బాగ్దాదునగరంలో అబ్బాసు పాలించే మధ్యకాలంలో, ప్రతి సామంతుడి దేవిడీముందు ఈ నౌబతు వాయించటమన్నది, గౌరవప్రతిష్ఠలకు ప్రతీకగా వుండేది. ఈ వాయిద్యం ముసల్మానులతోనే హిందూ దేశానికి వచ్చివుండాలి. లేదా హిందూదేశంలో అనాదిగానే ఉందో, ఏమో. షహనాయిమాత్రం లేదు. అంతవరకు ఒప్పుకోవాలిసిందే. షహనాయి లేకుండా అప్పట్లో పట్టి నగారాను, తాళాలనుమాత్రమే వాయించేవారు కాబోలు. దాని నేటిస్వరూపం ఈరాన్ ఇరాక్‌లలో మాదిరిదే.)

పాదుషాలు, గొప్పగొప్ప సామంతుల వూరేగింపుల్లోను, సైనిక దళంతోబాటు ఈ నౌబత్తువాయిద్యం తప్పనిసరిగా వుండేది. శౌర్యధనులైన చక్రవర్తుల వూరేగింపుల్లోను, ముందు ఏనుగులమీద ఈ నౌబత్తుఖానావాళ్ళు కూర్చుని వాయిస్తూ వుండేవాళ్ళు. యుద్ధాల్లో గెలుపొందినవారు, తమవిజయాన్ని ప్రకటించేసందర్భంలో

పెద్దగా ఈ నౌబత్తుమేళం వాయించడం జరిగేది. పాదుషా ఔరంగజేబు హైదరాబాదు జయించినట్లు ప్రకటించేనిమిత్తం, ఆ దగ్గర్లోఉన్న కొండమీదనుంచి నౌబత్తు వాయించారట. అందుకే అప్పటినుంచి ఆ కొండకు 'నౌబత్ పహాడ్' అని పేరు వచ్చింది. మొగలుచక్రవర్తుల పరిపాలనలో వారి ఆస్థానంలోని ఉచ్చస్థాయికిచెందిన శ్రీమంతులకు, అధికారులకు వారి దేవిడీల్లోను, వాహనాల్లోను నౌబత్తు వాయించుకోడానికి పాదుషావారు అనుమతించారు. నౌబత్తు వాయించేవా రెప్పుడూ ఎత్తయిన ప్రదేశాలు బురుజులు ఎన్నుకునేవారు. అందుకే రాజభవనాల్లో ముఖద్వారానికిపైన ఎత్తుగా నౌబత్తుఖానా నిర్మించేవారు. ఆమాదిరిలోనే రాజులు నివసించిన పెద్దపెద్ద పట్టణాలన్నిట ఈ నౌబత్తుఖానాలు కనబడతాయి.

అనాదిగావస్తున్న ఈ ఆచారాన్నిబట్టీ, ఇప్పటికి లక్నోలో గొప్పవారియింట వివాహాది శుభకార్యాలేవైనా జరిగేటప్పుడు వారి గుమ్మంముందు పొడుగుపాటి గడలు పాతి, వాటిచుట్టూ ఒక ఎఱ్ఱటి బట్టకట్టి, దానిని రేకులతో రకరకాలుగా సింగారించి, తాత్కాలికమైన నౌబత్తుఖానాను నిర్మిస్తూంటారు.

నౌబత్తువాద్యగాళ్లు రోజంతా ఆ నౌబత్ ఖానాలోనే కూర్చుని, ఆ యా వేళలకు తగినట్టుగా నౌబత్తు వాయిస్తూంటారు. ఇదేమాదిరిగా పెళ్ళి వూరేగింపుల్లోనూ, 'తాజియా' (మొహర్రంలో రంగుకాయితాలతో నిర్మించే మండపం) వూరేగింపులోను గూడ, ఒక నలు చదరపు పెద్ద పలకమీద తాత్కాలికనౌబత్తుఖానా నిర్మిస్తారు. దానిమీద నౌబత్తు వాద్యగాళ్లుకూర్చుని వాయిస్తూంటారు. ఆ బల్లని, పల్లకి బోయీలు బుజాలమీదపెట్టుకుని మోసుకెడుతూవుంటారు. దోవపొడుగునా యిలా వాయిస్తూ వెడుతూంటారు.

పూర్వకాలంలో ఈ నౌబత్తు వాయిద్యం ముఖ్యంగా లక్నో రాజదర్బారులో వేళ గుర్తింపుకోసం వాయించేవారు. ఆరోజుల్లో ఇంగ్లీషువారి గడియారాల కాలమానం ప్రకారం రోజుకు ఇరవైనాలుగు గంటలుగా విభజన ఉండేదికాదు. జాములలెక్కవుండేది. ఒకరోజుకి ఎనిమిది జాములని, పగలు నాలుగుజాములకాలం, రాత్రి నాలుగుజాముల కాలమని, ఒకజాముకు ఎనిమిది గడియలని లెక్కవుండేది. ప్రతి నౌబత్తుఖానాలోనూ, ఓ తొట్టినిండా నీళ్ళుపోసిపెట్టి ఉంచేవారు. అందులో ఓ చిన్న గిన్నె పడేసిపెట్టేవారు. ఆ గిన్నెకు మధ్యలో ఓ సన్ననిబెజ్జం ఉంటుంది. ఆ గిన్నెను

ఆ తొట్టిలోనో, నీళ్ల గిన్నెలోనో పడేసిపెడితే, అది ఆ నీటిమీద తేలుతూంటే. ఆ సన్నని బెజ్జంగుండా మెల్లి మెల్లిగా దాంట్లోకి నీళ్లు ఎక్కుతూవుంటాయి. అలా మెల్లి మెల్లిగా నీళ్లు పీల్చుకుంటూ ఆ గడియసేపట్లో ఆ గిన్నెనిండి మునిగిపోతుంది. గిన్నెకా బెజ్జం పెట్టడంలోనే వుంది గొప్పతనమంతా. ఆ గిన్నె మునిగిపోగానే. ఒక గడియకాలమైనట్లు తెలిపేందుకో గంట కొట్టేవారు. రెండోసారి మునిగి నట్లయితే, రెండుగడియలు కాలమైనట్లు రెండు గంటలు కొట్టేవారు. ఆవిధంగా ఎనిమిదిగడియలు కనకైతే, ఒకజాము గడిచినట్లు జేగంట మోగించేవారు. అంటే మొదట గడియగడియకు గంటకొడుతూ ఎనిమిదిగంటలు కొట్టడంకాగానే, గణ గణ గణ జేగంట వాయించేసేవారు. ఆలా వాయించడం ఒకజాము పూర్తయి, రెండోజాముకు ప్రారంభసూచక మన్నమాట.

(దేవిడీల్లో అయితే, జాము జాముకు వో గడియసేపు నౌబత్తు మోగుతూ వుండేది. ఈపద్ధతిగాఅయితే, రాత్రింబగళ్లకు మొత్తం ఎనిమిదిజాములకు, ఎనిమిది సార్లు నౌబత్తు మోగేది.

అయితే ఎనిమిదికిబదులు ఏడు నౌబత్తులే మోగేవి. మొట్టమొదటిసారి, తెల్లవారు జామున నమాజువేళకు మొదటిజాము నౌబత్తు మోగడం ప్రారంభమయ్యేది. దాన్నే ప్రభాతభేరీ అంటారు. రెండోసారి జాము పొద్దెక్కినతరువాత మోగేది. కనుక, జాముపొద్దెక్కిన నౌబత్తనేవారు. మూడోసారి మధ్యాహ్నం పన్నెండుగంటలప్పుడు మోగితే రెండుజాముల నౌబత్తు అనేవారు. ఆతర్వాత ఎనిమిదిగడియలు కాగానే మూడోజాము నౌబత్తు మోగేది. దాన్ని మూడుజాముల నౌబత్తనేవారు. ఆతర్వాత నాల్గోజాము అయ్యేటప్పటికి సూర్యాస్తమయకాల మవుతుంది కనుక దాన్ని సాయంకాలపు నౌబత్తనేవారు. ఇక అయిదోజామైనపిదప అయిదో నౌబత్తు. దాన్నే జామురాత్రి నౌబత్తనేవారు. ఆరోది అర్ధరాత్రి నౌబత్తు. ఏడోజాము గడవగానే రాత్రి మూడుజాములు గడిచాక అప్పుడిక నౌబత్తు వాయించడం నిద్రాభంగ మవు తుందని, ఇక అప్పుడు జేగంట వాయించేవారు. ఆ తర్వాత ఎనిమిదోజాము గడిచి నట్టు ప్రభాతభేరీ నౌబత్తే మోగించేవారు.)

మొగలాయిదర్బారు కొనసాగినంతవరకు లక్నోలో రాజ్యపాలన ముగిసేవరకూ కూడ ఈ విధానమే అమలుజరిగింది. అంటే కలకత్తాలో వాజిద్ ఆలీషా జీవించి

వున్నంతవరకూను ఈ జాముజాముకి గంటలు కొట్టేపద్ధతి నడుస్తూనేవుంది. జాములు, గడియలపద్ధతిలో వేళ గుర్తింపు ప్రజలకి బాగా వంటబట్టిపోయింది. ఈనాడు గంటలు నిముషాలలెక్క ఉన్నప్పటికీ, ఇంకా జనం ఈనాటికీ ఆ పాత పక్కీలో మాట్లాడుకుంటూండటం మనం చూస్తూనేవున్నాం. ఉదాహరణకు 'గడియ సేపట్లో వస్తా' ననడం, 'రెండుజాములవేళ పడుకుంటా' మనడం, 'జాము ప్రొద్దెక్కాక తింటా' మనడం వింటూనేవుంటాం. అయితే ఈ జాముసేపు, గడియసేపు అంటే ఎంతప్రొద్దు అనేదిమాత్రం చెప్పలేం. సాధారణంగా పహరా ఉందనడం, 'పహరా సిపాయిలనడం' వాడుకలో వుంది. అయితే ఈ పహరా (కాపలా) అనే పదం 'పహర్' జాము అనే పదంనుంచీ పుట్టిందనిగానీ ఆరోజుల్లో జాము జాముకో ఉద్యోగమంటూ ఉండేదని వింటూంటే మనకెంతో విడ్డూరంగా వుంటుంది.

ఈ జాములు గడియల కాలమానము ప్రాచీన హిందూసంప్రదాయము. అయితే ఈరాన్‌లోగూడ ఆనాడు ఈ కాలమానమే అమల్లో వుండేది. ఈ కాలమానం ప్రకారమే నౌబత్తు వాయిస్తూవుండేవారు. ఇప్పటి మన కాలమానంప్రకారమైతే ఒక జాము అంటే మూడుగంటల పొద్దన్నమాట.

ఈ నౌబత్తు వాదకుల్లోకూడ మిగతాచోట్లకంటె లక్నోలో గొప్పగొప్ప ప్రవీణులున్నారు. ఎక్కడైనా మిగతాప్రదేశాల్లో నౌబత్తు వాదకులు కావాలంటే, లక్నోలో వున్న నౌబత్తువాద్య విద్వాంసుల శిష్యులే వెళుతూండేవారు. అయితే కాలక్రమాన నౌబత్తులోవచ్చిన మార్పులు చేర్పులుగూడ ఏమీ లేవు. విద్వాంసులు ఏమంత ఎక్కువ మంది లేరు. వాద్యమూ అదే. వాయించేవిధానము నాటిదే. అయితే లక్నోలో ఉన్న సంగీత కళాశాలవారు ప్రత్యేకంగా ఎన్నికచేసిన కొన్నిరాగాలు లయలు ప్రజామోదాన్ని పొందగలిగాయి. వాటినే నగారా వాదకులుగూడ అనుకరించి వినిపించడం జరుగుతూంది. దీనివల్ల నౌబతువాదనంలో ఆ పాతకాలపు సంప్రదాయాలు కొనసాగడం జరుగుతూంది. అమీర్ ఖుస్రో అనే కవి, నాటి నౌబత్తు వాదనాన్నిగురించి తన కవితల్లో వర్ణించి చెప్పినదాన్నిబట్టిమాస్తే ఆనాటి నౌబత్తువాదన తీరుతెన్నులు ఎంత గొప్పగా వుండేవోగదా అని అనిపిస్తుంది. కొద్దిపాటిమార్పులతో ఈనాటికి ఆ పోకడలే ఉన్నాయనుకోండి. షహనాయిలో ఆలాపించేరాగాలు, కీర్తనలమీద మాత్రం లక్నోవారి సంగీతప్రభావం బాగా ఉంది. అది చెబితేకాదు, వింటేగానీ బోధపడదు.

తూతూ అని, శంఖమని చాలా ప్రాచీన జాతీయవాయిద్యాలున్నాయి. వాటిని ముఖ్యంగా సైనికదళాల్లోనే వాడతారు. తూతూ వైఖరినిబట్టిచూస్తే అది ఇంగ్లీషు వారిదే. హిందూదేశానికి సంక్రమించిందేమో ననిపిస్తుంది. అది హిందూదేశానికి ఇంగ్లీషువారి రాకకు తర్వాతనే వాడుకలోకి వచ్చింది. శంఖమనేది పిసలైన పారసీ వాద్యం. దానినాదం శౌర్యాన్ని సూచిస్తూ గంభీరంగా ఉంటుంది. యుద్ధరంగాల్లో ప్రతాపసూచకంగా ఆ వాయిద్యాన్ని వాడతారు. ఈ రెండువాయిద్యాల్ని లక్నోలో జరిగే వూరేగింపులకు వాడుతూవుంటారు. అయితే అవి మిగతావాయిద్యాలవలేకాక, సైనిక విన్యాసాలకు, పటాలంతోపాటు ఒక తూతూ వాద్యగాడు, ఒక శంఖవాద్య గాడు తప్పక వుంటారు. ఆ యా దళాలు వచ్చిచేరినట్లు సూచనచేస్తున్నట్టు ఆ తరు ణానికి మోగిస్తారు. ఈ రెండువాయిద్యాలకు దీటైనవాద్యం హిందువులు వాడే ప్రాచీనవాద్య మొకటుంది. దాన్నే కొమ్ము లేక బాకా అంటారు. ఈ బాకాలు ఎక్కువగా హిందూమతపరమైన వూరేగింపులకే వాడతారు. ఆ వూరేగింపుల్లో మధ్య మధ్య బాకా ఊదుతూవుంటారు. దాన్నే బాకాపట్టడ మంటారు. ఈ వాయిద్యం గూడ ఢిల్లీనుంచి ఇక్కడికి వచ్చిచేరిందే. ఈ వాద్యం అప్పుడెలావుందో ఇప్పుడూ అంతేగానీ, వచ్చిన మార్పుగానీ, రాబోయేమార్పుగానీ ఏమీ లేదనే చెప్పాలి.

బిగుల్ ఢంకా, అని మరో రెండువాయిద్యా లున్నాయి. అవి లక్నోలో పెళ్ళి వూరేగింపుల్లో వాడుతూంటారు. అసలవి పాత కొత్త వాయిద్యాలు సంకర సమ న్వయమన్నమాట. ఢంకా అంటే పాతకాలపు ఆ నగారాయే. సేనతోను, విజయాన్ని సూచించేందుకు వాడే నగారా. ఆ నగారాదరువు వినపడేసరికల్లా ఎక్కడెక్కడి పెద్దలకు ఒక్కసారి గుండెలు కంపించాలిసిందే. బిగుల్ లేక బ్యూగల్ ఇంగ్లీషు వారి సైనికసంచలనానికి, ఇంకా తదితరమైనపనులకు సూచకంగా ఈ వాద్యాన్ని వాడటం వుంది. ఇప్పుడు ఢంకాతో బిగుల్‌ను కలిపి ఒక కొత్తపోకడ మొదలు పెట్టారు. ఈపద్ధతి పెళ్ళి వూరేగింపుల్లో తరుచు ఎదురౌతూవుంటుంది. ఈ వాయించే వాళ్లు కిరాయికి ఒప్పుకునే అలగారకం వాళ్లయ్యుంటారు. వాళ్లు ధరించేదుస్తులు, వాళ్ళపై ఖర్లు, వాళ్లెక్కేగుర్రాలు కళాకాంతులనేవి లేకుండా రోతగా వుంటాయి. ఆ వాద్యాల్లో ఓ యింపూ సొంపూ అనరాదు వినరాదు. చెప్పలేనంత అసహ్య కరంగా వుంటుంది.

ఇక వాద్యాల్లో చివరివాద్యం, ఇంగ్లీషువారి బ్యాండు. బ్యాండనేది ఇంగ్లీషు వారితో భారతదేశానికి వచ్చింది. అంతకుమునుపు ఈ బ్యాండు లేదు. లక్నోలో ఈ మేళాన్ని ముఖ్యంగా పాకీవాళ్లే వాయిస్తారు. మరి అదెందుచేతనో తెలీదు. అటు వాళ్ళు దొడ్లు వూడుస్తారు. ఇటు బ్యాండు వాయిస్తారు. మొదట్లో హిందువులకు, మహమ్మదీయులకుగూడ ఇంగ్లీషువారంటే గిట్టలేదు. వాళ్లొకవేళ ఏ గిన్నో చెంబో ముట్టుకుంటే, దాన్ని శాశ్వతంగా అంటరానిదానికింద విసర్జిస్తూండేవారు. బహుశా ఆ కారణంచేతనే పాకీవాళ్లు ఆ వాయిద్యం నేర్చుకోడం జరిగివుండవచ్చు. ఇంగ్లీషు వారిదగ్గర ఆ వాయిద్యం నేర్చుకునేందుకు ఆ వాయిద్యాన్ని ఆదరించేందుకు పాకీ వాళ్ళే ఏ అభ్యంతరం చెప్పకుండా ముందంజ వేసివుంటారు. అందువల్ల అప్పటి నుంచి ఆ వాయిద్యం పాకీవాళ్ళకే పరిమితమైపోవడమేకాకుండా, వాళ్ల కదే వృత్తిగా కూడ అయింది.

ఈ దేశంలో ఈ బ్యాండుమేళాన్ని వాయించే తెగవారు అసలు సంగీతమంటే ఎలా వుంటుందో తెలీనివాళ్లు. వాళ్లకు ఆ కళకూ ఆమడదూరమనే చెప్పాలి. అటు వంటివారిచేతిలో పడింది కాబట్టి ఆ మేళంలో మార్పులు చేర్పులకోసం ఎదురు చూడాల్సినపనే లేదుకదా! అనడానికి వీల్లేదు. ఆ పాకీవాళ్ళకే ఆ మేళంలో యింకా యింకా కొత్త కొత్త పోకడలు అలవర్చుకోవాలనే ఆసక్తి కలిగింది. పట్టణ వాతా వరణాలలో సంగీతంలో వినబడే కొత్తకొత్త గీతాలు అంటే వారికి అభిరుచి పెరి గింది. వాటిని ఈ బ్యాండుమేళాల్లో వాయించడం మొదలెట్టారు. వాళ్ళు ఇంగ్లీషు వారిదగ్గర అంటే ఇంగ్లీషుసైనికుల్లోని బ్యాండువారిదగ్గర రెండుమూడుకాల వర సలు, పాటలుమాత్రం వాయించేవిధానం నేర్చుకుని ఇవతలికి వచ్చేవాళ్ళు. ఆ తర్వాత స్వదేశీయమైన రాగాలను పాటలను వాయించడం మొదలుపెట్టాకనే రోజు రోజుకూ వాళ్ళ కళ వృద్ధిచెందుతూ వచ్చింది.

(ఈ ఇంగ్లీషువారి బ్యాండుమేళాన్ని ఎన్నోచోట్ల విన్నాను. వాళ్ళు ఆ మేళంలో తమ బ్యాండుమేస్టరు నేర్పిన, ఇంగ్లీషువరుసల పాటలు వాయించడమేగానీ, ఆ వాదకులు భారతీయసంగీతాన్నిగూడ మేళవించి వాయించడం వినలేదు. అయితే లక్నోలోమాత్రం ఆపద్ధతి మనకు బాగా కనబడుతుంది. రోషన్ చౌకీలో షహ నాయిమీద వాయించే తుమ్రీలు, గజల్‌లు ఈ బ్యాండు మేళగాళ్ళుగూడ, తమ

బ్యాండుమేళంలో వాయించడముంది. ఎంతో చక్కగా, మళ్ళీ మళ్ళీ వినాలన్నంత సొంపుగా వాయిస్తారు.

లక్నోలో ఈ బ్యాండుమేళం వాయించే పాకీవాళ్లు వందలకొద్దీ ఉన్నారు. వారిలో చాల జట్లున్నాయి. పాతికేసిమంది ఓ జట్టుగాను, ముప్పైయేసిమందో జట్టుగాను ఉంటారు. కొన్నిజట్లలో ఆరుగురో, ఏడుగురో ఉంటారు. మరికొన్నింటిలో నలుగురు- అయిదుగురే వుంటారు. వాళ్లంతా ఇంగ్లీషువారిదుస్తులనే భారతీయపద్ధతిగా మార్పుచేసి, తమకోసమని ఒకేరకమైన యూనిఫారందుస్తులు వేసుకుంటారు. శుభ్రమైన కొత్తదుస్తుల్లో అందరూ ఒకేరకమైనదుస్తులుధరించి పెళ్ళి వూరేగింపుల్లో బ్యాండువాయిస్తూ వెడుతూంటే. చూడటానికి ఎంత అందంగా ఎంత వైభవంగానో వుంటుంది.

ఒకేరకమైనదుస్తులు ధరించడమన్నది ఈ బ్యాండుమేళగాళ్ళలోనే వుంది. మిగతా వాయిద్యగాళ్ళెన్నడూ ఈ దుస్తులపట్ల అంత శ్రద్ధతీసుకున్నట్టు కనబడదు. అందుకే వాళ్ళబట్టలు మురికిగా ఎంతో అసహ్యంగా వుంటాయి.

ఇంగ్లీషుబ్యాండు వాయించే పాకీవాళ్ళుమాత్రం రకరకాలదుస్తులు వేసుకుంటూ, ఒక అందాన్ని ప్రత్యేకతని ఆకట్టుకున్నారు. అంతేకాదు; భారతీయసంగీతాన్నిగూడ ఆకళింపుచేసుకుని, బ్యాండుమేళంలో వాయిస్తూ ఎంతో ప్రజాదరణ గౌరవాన్ని సంపాదించుకున్నారు.

# 25

మానవసమాజంలో అన్నిటికంటే అవసరమైనవీ, ముఖ్యమైనవీ ఆహారపానీయాలు. ఏ వర్గంవారుగానీ, ఏ జాతివారుగానీ ఉన్నతిని పొందుతున్నప్పుడు అన్నిటికంటే ముందు తమ అభిరుచినీ, ఆచారాన్నీ, నవ్యతనీ తమ భోజనశాలలో అభివ్యక్తం చేస్తారు. అందుచేత పూర్వపు లక్నో ఆస్థానం వంటశాల, భోజనశాల

విషయంలో కనపరచిన ప్రత్యేకతలు ఏమిటో - ఈ కళలో అక్కడి ప్రజలు ఏ రక మైన అభివృద్ధిని సాధించారో చెప్పవలసివుంది.

(అయోధ్య ప్రజల సంస్కృతిచరిత్ర అనేది షుజా ఉద్దౌలాతోనే, అంటే అతని పాలనలో చరమదశనుంచే ఆరంభమైంది. అంటే, అప్పట్లో షుజా ఉద్దౌలా, బక్సరు యుద్ధంలో ఓడిపోయి ఇంగ్లీషువారితో కొత్తఒడంబడిక ఒకటి చేసుకుని మెదల కుండా కూర్చున్నరోజులన్నమాట. సైనికవిషయాలలో శ్రద్ధచూపడం తగ్గిం చేశాడు. 'మిర్జా హసనూ' అనబడే హసన్ రజా ఖాన్, షుజా ఉద్దౌలావద్ద వంటశాల అధికారిగా వుండేవాడు. ఆయన ఢిల్లీలోని పేరుప్రతిష్టలున్న కుటుంబానికి చెందిన వాడు.

ఉన్నావ్ జిల్లాలోని సఫీర్‌పూర్ రాకుమారుడు మౌల్వీ ఫజ్లే అజీమ్ చదువు సంధెలనిమిత్తం లక్నోకు వచ్చినప్పుడు అదృష్టంకొద్దీ, మీర్జా హసనూ ఇంటికి రావడం తటస్థించింది. నాటినుంచీ అక్కడే వుండిపోయాడు. ఇద్దరు ఎంతో స్నేహంగావుండి ఆడుతూ, పాడుతూ పెరిగి పెద్దవాళ్ళయ్యారు. పెద్దవారయ్యాక అజీమ్, మిర్జా హసనూను, నవాబు వంటశాలకు సహాయఅధికారిగా నియమింప జేశాడు. హసనూ చెయ్యాల్సినపనేమంటే, రాజభోజనాన్ని పళ్ళాల్లో చక్కగా అమర్చుకుని ఆ పళ్లాలమీద ముద్రవేసి, దేవిడీకి తీసుకువెళ్ళడం, బహూబేగం సాహిబా అంతఃపురదాసీలైన ధనియా, పనియా, మీనాలకి ఆ భోజనాన్ని అప్ప జెప్పి రావడమన్నమాట. ఆ దాసీలు తమవిరుద్ధంగా ఎవరైనా ఎత్తులువేసి వ్యవ హారాలు సాగించకుండా ఉండటానికీ ఈ ఏర్పాటు. వాళ్ళతో చాలా మర్యాదగా తోడబుట్టినవాడల్లేనే మెలిగేవాడు. అందువల్ల దాసీలు అతనెంతచెబితే, అంతగా ఎంతో వేదోడు వాదోడుగా వుండేవాళ్లు. ఎన్నోసార్లు క్లిష్టపరిస్థితులు వచ్చినప్పుడు ఉపకారం చేశారు.)

నవాబు షుజా ఉద్దౌలా, ఎప్పుడూ ధర్మపత్నితోకలసి మహల్లోనే భోజనం చేసే అలవాటుండేది. పనిమనుషులు, భోజనం అమర్చివున్న ఆ పళ్ళాలు బహూబేగం సాహిబా ఎదుటికితెచ్చి ఆ పళ్లాలమూతలు తెరిచిపెట్టి పోయేవాళ్ళు.

రాజదంపతులకోసం రోజూ ఆరు వంటశాలలనుంచి భోజనం వచ్చేది. మొదట నవాబుగారి వంటశాలనుంచి, ఆ వంటశాల అధికారి మిర్జాహసనూ, మౌల్వీ ఫజ్లే

అజీమ్, పాదుషావారి భోజనం పళ్ళెంలో చక్కగా అమర్చి స్వయంగా దేవిడీకి తెచ్చియిచ్చి వెళ్ళేవాడు. ఆ వంటశాలలో రోజుకు రెండువేలరూపాయల వంటకాలు వండేవారు. అంటే వంటవాళ్ళు, ఇతరపనివాళ్ళ జీతాలుకాక నెలకు అరవై వేల రూపాయలు, ఏడాదికి ఏడులక్షల ఇరవై వేలరూపాయలు కేవలం భోజనసామగ్రుల నిమిత్తం, ఆహారపానీయాలకోసం ఖర్చుయ్యేవి. రెండోది, ప్రభుత్వంవారి చిన్న వంటశాల. దాని అధికారి మిర్జా హసన్ అలీ. అతను మొదట్లో వస్త్రాభరణ భాండా రానికి అధికారిగా వుండేవాడు. ఆతర్వాత దానికి అంబరలీఖాన్ ఖ్వాజాసరా అధికారి అయినాడు. మిర్జా హసన్ అలీ వంటశాలకు అధికారి అయ్యాడు. చిన్న వంట శాలలో రోజుకు మూడువందలరూపాయలు అంటే ఏడాదికి లక్షా ఎనిమిదివేల రూపాయలు భోజనసామగ్రులకోసం ఖర్చయ్యేది. మూడోది బహూబేగం సాహిబా గారి మహల్లోని వంటశాల. దానిఅధికారి బహారలీఖాన్ ఖ్వాజాసరా. నాలుగోది పెద్ద నవాబుగారి వంటశాల. అంటే షుజా ఉద్దౌలా తండ్రిగారి వంటశాల. అయిదోది మిర్జా అలీ ఖాను వంటశాల. ఆరోది నవాబు సాలార్‌జంగ్ వంటశాల. ఈ ఆరు వంటశాలలనుంచి భోజనాలు వచ్చేవి. చివరచెప్పిన యిద్దరు బహూబేగం సాహిబా వారి సోదరులు, షుజా ఉద్దౌలా బహద్దూరువారి బావమరదులు.

ఈ ఆరు వంటశాలలలో రోజూ పాదుషావారికోసం ఎంతో శ్రేష్ఠమూ రుచికరము అయిన పదార్థాల్ని తయారుచేసేవాళ్ళు. ఒకనాడు నవాబుగారి వంటశాలనుంచి భోజనం వచ్చింది. ఆ భోజనం నవాబుగారిఎదుట పెట్టారోలేదో అందులోనుంచి ఓ ఈగ ఎగిరి బయటికివచ్చింది. దానితో నవాబుగారికి ఎక్కడలేనికోపం వచ్చేసింది. ఈ భోజనం ఏ వంటశాలనుంచి వచ్చిందని గద్దించారు. నవాబుగారి వంటశాలనుంచి అని చెప్పేశామో, మౌలానాభాయి పీకమీదికొస్తుందని, 'ధనియా' ఆలోచించి, ఇది నవాబు సాలార్‌జంగ్ బహద్దరువారి వంటశాలనుంచి వచ్చిందనిచెప్పి అసలు విషయం కప్పిపుచ్చేసింది.

నవాబు షుజా ఉద్దౌలా తర్వాత, దర్బారు ఫైజాబాదునుంచి లక్నోకి మారింది. అక్కడ నవాబు ఆసపుద్దౌలా, మిర్జాహసన్ రజాఖానుకి 'సర్‌ఫరాజ్ ఉద్దౌలా' అను బిరుదుతోపాటు మంత్రిపదవినికూడ యిచ్చి సన్మానించాడు. ఇక అప్పుడు మిర్జా హసన్ రజాఖాన్, వంటశాల అధికారిపదవి తనకీపికి తగదని మౌల్వీఫజ్లే అజీమ్ సాహెబ్‌ను నవాబువారి వంటశాలకు శాశ్వత నిర్వాహకుడుగా నియ

మించాడు. మౌల్వీ ఫజ్లే అజీమ్‌సాహేబ్ మునుపు పాదుషావారి భోజనపదార్థాలన్నీ పళ్ళెంలో చక్కగా అమర్చి ఆ పళ్లెం పుచ్చుకుని బహూబేగం సాహిబావారి దేవిడీ ముందు హాజరయినట్టే, లక్నోలో నవాబు అసపుద్దౌలావారి దేవిడీకి వెళ్లేవాడు. ఆ రివాజు మానెయ్యలేదు. పైగా తన బంధుకోటినే తనపనిలో సాయానికి వేసుకున్నాడు. అంటే వారిలో మౌల్వీ అజీమ్ సోదరుడు మౌల్వీ ఫాయక్‌అలీ ఉండేవాడు. ఆయన పినతండ్రికొడుకులు గులాం అజీమ్, గులాం మఖ్దూమ్ అని ఉండేవాళ్ళు. వీరంతా వంతులవారీగా దేవిడీకి పాదుషావారిభోజనం తీసుకు వెడుతూండేవాళ్లు.

అసపుద్దౌలా బహద్దూర్ తర్వాత వజీర్ అలీఖాన్ కొద్దికాలం పరిపాలించాడు. ఆయన పరిపాలనాకాలంలో తఫజ్జుల్ హుసేనుఖాన్ మంత్రిగా వుండేవాడు. ఆయన నఫీపూర్‌లోవున్న సోదరులను తొలగించి, గులాంమహమ్మద్ అనబడే బడేమిర్జాని వంటకాల నిర్వాహకుడుగా నియమించాడు.

ఈ సంఘటనలబట్టిచూస్తే లక్నోలో ప్రారంభదశలో ఎంతెంత గొప్పగొప్ప చెయితెరిగిన వంటమనుషులుండేవాళ్ళో తెలుస్తుంది. అటువంటివాళ్ళు ఉండేవాళ్ళు కనుకనే అంతంత శ్రేష్ఠమైనవంటకాలన్నీ తయారయ్యేవి. పాచకుల్లో ప్రావీణ్యమున్నవాళ్లు ఢిల్లీ, ఇంకా ఇతరత్రా ప్రదేశాలనుంచీ లక్నో వచ్చిచేరాక పాకకళలో వారు మరింత రాటుతేలేవారు. ఇంకా ఎన్నో కొత్తకొత్తరుచులతో కొత్తరకాల పిండివంటలు తయారుచేయగలిగారు.

(ఎవరిపనిలో వాళ్ళు కొంత కాకపోతే కొంతైనా అభివృద్ధిసాధించడం, ఆసక్తి కనబరచడమన్నది సాధారణంగా జరుగుతూనేవుంటుంది. అంతటి పాకకళాప్రవీణులుండటానికీ, అన్నిరకాల తినుబండారాలు తయారవడానికి లక్నోలోని ప్రజల భోజనప్రియత్వమే కారణం. అక్కడున్నగొప్పవారు చాలావరకు భోజనప్రియులే.

సర్‌ఫరాజ్ ఉద్దౌలా అనే బిరుదుగల హసన్ రజాఖాన్‌యొక్క 'దస్తరఖాన్' (భోజనం చేయడానికి పరిచే జంపఖానా) ఎంతో పెద్దదని చెప్పారు. ఆయనకు ఒకరి భోజనం పెట్టడమంటే మహాయిష్టం. ఆయన అభిరుచికి తగినట్టుగా రాజభోజనశాల పెత్తనం ఆయన కప్పజెప్పడంతో, అప్పుడిక పదార్థాల్లోగాని, తినుబండారాల్లోగానీ, ఎన్ని కొత్తకొత్తరకాలు బయల్దేరివుంటాయో ఎంత కొత్తసృష్టి జరిగివుంటుందో!)

అందువల్ల లోకంలోని గొప్పవాళ్ళు ఎక్కువభాగం భోజనప్రియులుగా, తిండి పోతులుగా తయారైనారు. నవాబు సాలార్‌జంగ్ వంశీయుల్లో చిట్టచివరివరకు వంటశాల కొక ప్రత్యేకత ఉండేది.

వారి వంటశాల వ్యవస్థనుబట్టి తెలిపిందేమంటే, సాలార్‌జంగ్‌కు ప్రత్యేకంగా ఒక వంటమనిషి వుండేవాడు. అతను నవాబుగారి భోజనంనిమిత్తం ప్రత్యేక శ్రద్ధతో శాకపాకాలన్నీ తయారుచేసేవాడన్నమాట. అందుకుగాను అతనికి పన్నెండు వందలరూపాయలు జీతం యిచ్చేవాడట. భారతదేశం మొత్తంమీద ఏ రాజాగారి వంటమనిషికి ఉండనంతజీతం సాలార్‌జంగ్ తన వంటమనిషికి ఇచ్చేవాడని తెలుస్తోంది. అతను ప్రభువుకోసమని పులావ్ చేసేవాడట. ఆ పులావ్ సాలార్‌జంగ్ తిని హరాయించుకోవాల్సిందేగాని, ఆ బరువుపదార్థాన్ని మరొకళ్లు తిని తట్టుకోలేకపోయేవారు. ఒకసారి నవాబు షుజా ఉద్దౌలా, సాలార్‌జంగ్‌తో, 'మీకోసంమాత్రం అంత మంచి పులావ్ చేయించుకుంటారే మాకుగూడ రుచి చూపించరాదా' అని అడిగాడు. 'ఓ తప్పకుండాను, దానికేం భాగ్యం' అన్నాడు. 'ఇవాళ రోజూ వండే పులావ్‌కి రెట్టింపు చెయ్యమని' వంటమనిషికి ఉత్తర్వు జారీచేశాడు. అప్పుడు వంటవాడు 'అయ్యా, నేను తమరికిమాత్రం భోజనం తయారుచేస్తాగానీ, మిగిలినవారికోసం నేను చెయ్య'నని ఠక్కున సమాధానమిచ్చాడు. 'అదేంమాట? నవాబుగారు పులావ్ కావాలని కోరారు. కోరినప్పుడు చేయించిపంపకపోతే మర్యాదగా ఉంటుందా?' 'అయ్యా, ఎవరైనా కానీండి. నేను తమకోసంతప్ప ఇతరులనిమిత్తం ఆ పులావ్ చెయ్యను' అని తిరిగి బదులు పలికాడట ఆ వంటవాడు. చివరికి సాలార్‌జంగ్ ఎంతో బలవంతంచేసినందువల్ల వంటమనిషి పులావ్ చెయ్యడానికి ఒప్పుకున్నాడు. కానీ ఒక షరతుపెట్టాడు. ఏమనంటే, 'తమరు ఎదురుగుండావుండి మరీ తినిపించండి. ఎక్కువ తినకుండా చూడండి. దగ్గర మంచినీటివసతి బాగా ఉండేటట్టుచూసి మరీ పులావ్ పట్టుకువెళ్ళండి' అన్నాడుట. సరే, సాలార్‌జంగ్ పులావ్ తీసుకుపోయి 'దస్తరఖాన్'మీద పెట్టాడు. షుజా ఉద్దౌలా ఆ పులావ్‌ను చాలామెచ్చుకుంటూ బహు రుచిగాఉందంటూ చాలా ఇష్టంగా తినడం మొదలుపెట్టాడు. అయితే రెండు మూడుముద్దలు తినేసరికల్లా సాలార్‌జంగ్ అమాంతం ఆయన చెయ్యిపట్టుకుని తిననీలేదట. 'తిన్నది చాల్లెండి. ఎక్కువ తినవద్ద'ని అడ్డగించాడు. దాంతో, ఏమిటీ ఆగడమన్నట్టు షుజా ఉద్దౌలా హైరానాపడిపోయి నాలుగుముద్దలు తిన్నంతమాత్రాన

ఏమైపోతుందని అంటూ బలవంతాన చెయ్యివిడిపించుకుని, మరో రెండుముద్దలు తిన్నాడు. తినేసరికి ఇక దాహం పట్టుకుంది. ఆ దాహం దాహం ఎంతో చెప్పలేనంత దాహమైపోయి ఎన్నినీళ్ళుతాగి, నీళ్ళతో పొట్ట బరువెక్కిపోయి....చావుతప్పి కన్ను లొట్టపోయినంత పనైంది. ఎంతోసేపు ఆరాటపడినతర్వాత, దాహం తీరిందిట.... ఆతర్వాత సాలార్‌జంగ్ ఇల్లు చేరుకున్నాడట.

మునుపటి పదార్థాలమోస్తరు రుచిగాని, సత్తువగానీ, ఈనాటిపదార్థాల్లో ఏమీ లేదు. పూర్వం వాళ్లు తినేపదార్థాల్లో రుచికి రుచి ఉండేది. సత్తువ ఉండేది. అప్పటి వారికి ఆహారపుష్టి ఎక్కువ. ఆ పదార్థాలు అలానే వుండేది. సర్వసామాన్యులకే ఆ పదార్థాలు తిని హరాయించుకోడం కష్టమయ్యేది.

మరో గొప్పవిషయమేమంటే, అక్కడ ఒకేపదార్థంతో ఎన్నోరకాల పిండి వంటలు చెయ్యడం వారిప్రత్యేకత. 'దస్తరిఖాన్' మీద ఉంచినపుడు చూపులకు ఎన్నోరకాల వంటకాలుగా కనబడతాయన్నమాటేగానీ, తినిచూస్తే అన్నిటిరుచి ఒక తీరుగానే వుంటుంది. మరి ఒకేపదార్థానికి వేరువేరు రూపాలేగదా. ఉదాహరణకి మిర్జా ఖుర్రమ్ బఖ్త్ కుమారుడు ఢిల్లీ రాజకుమారుడైన మిర్జా అస్మాన్‌కద్ర్, లక్నో వచ్చి షియాతెగకు మారి, కొన్నాళ్ళపాటు లక్నోలోవుండి, ఆతర్వాత అక్కడి నుండి వారణాసి చేరుకుని, అక్కడే నివాసం ఏర్పరచుకున్నాడు. ఆయన లక్నోలో వున్నప్పుడు వాజిద్ అలీషాహ్, మిర్జాఅస్మాన్ కద్ర్‌కోసం ఒక విందు ఏర్పాటు చేశాడు. ఆ విందులో దస్తరఖాన్‌మీద మురబ్బా (జెల్లీ) ఒకటి పెట్టాడు. ఆ మురబ్బా చూడగానే ఎంత రుచిగా వుంటుందోనన్నంత బావుంది. మిర్జా ఆస్మాన్ కద్ర్ ఆ మురబ్బానితీసి నోట్లో వేసుకున్నాడు. తీరా తినిచూస్తే అసలు మురబ్బాయే కాదు. ఉప్పగావున్న మాంసపుకుర్మా. దాన్నిచూస్తే అచ్చంగా మురబ్బా అనుకునేటట్టు తయారుచేశా డా వంటమినిషి. ఢిల్లీకిచెందిన గొప్ప రాజకుమారుడే ఒకదాన్నిచూపి ఒకటనుకుని మోసపోయి చిన్నబుచ్చుకున్నందుకు వాజిద్‌అలీ షాహ్‌కు ఎంతో సంతోషం కలిగింది.

ఒకటిరెండు రోజులైనతర్వాత మిర్జా ఆస్మాన్‌కద్ర్ వాజిద్ అలీషాహ్‌కు విందుచేశాడు. తనను మోసం చెయ్యాలనే మళ్లీ యీ విందు చెయ్య తలపెట్టా డని వాజిద్ అలీషాకో అభిప్రాయ మేర్పడిపోయింది. ముందు జాగ్రత్తగా వుండి

గూడా ప్రయోజనమేం లేకపోయింది. ఆస్మాన్ కద్ర్ వంటమనిషి షేక్ హుసేన్ అలీ దస్తరఖాన్‌మీద కొన్నివందలరకాల వంటరకాలు తయారుచేసి పెట్టేశాడు. ఆ రకాల్లో పులావుంది. చక్కెరపొంగలి వుంది, బిర్యానీ వుంది, కుర్మా, మాంసపు వేపుడుకూరలు, ఇంకా వేరే శాకాలు, ఊరగాయలు, పచ్చళ్లు, రొట్టెలు, పరోటాలు, పాలపూరీలు, ఒకటేమిటి....ఎన్నో—భోజనపదార్థాల్లో ఎన్నిరకాలున్నాయో అన్నీ అక్కడున్నాయి. ఆ పదార్థాల్లో ఏది రుచిచూసినా పంచదారమయంగా వుంది. మాంసపుకూరలో చక్కెర, అన్నంలో చక్కెర, వూరగాయలో చక్కెర, రొట్టెల్లో చక్కెర. అంతేకాదు, అక్కడున్న ప్రతివస్తువు చక్కెరమయమే. ఆఖరికి నీళ్లుతాగే చెంబు, భోజనపదార్థాలు పెట్టేందుకు పరచినజంపఖానా దస్తర ఖ్వాను, కాళ్లు చేతులు కడుక్కోడానికి నీళ్లుపెట్టే దేగిచా, లోటా సమస్తం చక్కెర తోనే తయారుచేశాడు. దాంతో వాజిద్ అలీషాకు ఎక్కడలేని గాబరా అయి పోయింది. ఏం చెయ్యడం? ఏవస్తువునితాకితే అదే చక్కెరమయంగా వుంది. తానొకటనుకుని తినబోవడం. అది మరోటి కావడం. ఇలా బాగా మోసపోయాడు. ఎందుకు చెప్తున్నానంటే అప్పటి వంటమనుషుల, వాళ్ళ పాకకళానైపుణ్యం. ఆ వంటకాలు తయారుచేసే తీరుతెన్నులు ఎంతో గొప్పగా, చిత్రంగా వుండేది.

నవాబు షుజా ఉద్దౌలా బహద్దుర్‌కు రోజు ఆరుచోట్లనుంచి భోజనాలు వచ్చేవని చెప్పానుకదా! ఈ పద్ధతిగా భోజనాలు రావడమన్నది ఆయనొక్కడివరకే పరిమితం కాలేదు. ఆయనతర్వాతకూడ ఈవిధానం కొనసాగుతూనే వుంది. గొప్పవాళ్ళు, అమీర్లు రాజకుటుంబాలవారికి, తమరు ఏరోజు ఏ కొత్తరకం చేసుకుంటే అది వారికి పంపుతూండటం మర్యాదైంది.

అందుకు ఒక ఉదాహరణ ఇది. మా మిత్రులు నవాబ్ ముహమ్మద్ షఫీఖాన్ సాహేబ్ బహద్దుర్ నైశాపురీ తాతగారైన (మాతామహుడు) నవాబు ఆగా అలీ హసన్‌ఖాన్ సాహేబు, నైశాపురీవంశంవారిలో గొప్ప పేరుప్రతిష్ఠలున్నవారు. వారింటినుండి ప్రతినిత్యం పాదుషావారికోసం అట్లు పంపబడుతూవుండేవి. ఆ అట్లు ఎంత పలుచగా, ఎంత చక్కగా వుండేవంటే, కేవలం తెల్లని ఉలిపిరికాయితా లేమో నన్నట్లుండేవి. వాటిమీద చిన్న మచ్చకూడా కనిపించేదికాదు. అట్టంతా సమ పాళంగా కాలి ఎక్కడా పచ్చిలేకుండా వుండేది. మీఠా షీ (అని మరో పదార్థం) అదిగూడ అంతే. అతి జాగ్రత్తగా తయారుచేసేవారు.

ఢిల్లీవారిలో బిరియానీ అంటే ఎక్కువ ఇష్టం. లక్నోవారు పులావ్‌కు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు. వారికి బిరియానీ అంటే చిన్నచూపు. నిజానికి బిరియాని, పులావ్ రెండూ ఒక్కటే. అయితే బిరియానీలో మసాలాదినుసులు, మాంసపు ముక్కలు, బియ్యం ఎక్కువగావేసి చేస్తారు. బిరియానీకంటే పులావ్ చూడటానికి బావుంటుంది. రుచికి రుచీ ఎక్కువే. బిరియానీ దానిముందు దిగదుడుపనే చెప్పాలి. అయితే ఒక్కటి. మామూలు పులావుకంటె బిరియానీయే బావుంటుందనడంలో సందేహంలేదు. మామూలు పులావంటే కేవలం అన్నంమోస్తరే బిరుసుగా ఉంటుంది అంతే. పద్ధతిప్రకారంచేసిన పులావ్‌ముందు, బిరియానీకి అసలు విలువేలేదు. అదో మోటుతరహా తిండికింద జమ అవుతుంది. మంచి పులావ్ తినే నాజూకు మనుషులూ, నాగరికులెవరూ బిరియానీకి అస లాశపడరు. బిరియానికి, పులావ్‌కి ఉన్నతేడా యిది. పులావ్‌లో నాజూకుతనమెంతో. బిరియానిలో అంత మోటుదనముంది. అందువల్లనే లక్నోలో పులావ్‌కే ఎక్కువ పరపతి వుంది.

లక్నోలో ఏడురకాలైన పులావ్‌లు చాలప్రసిద్ధి. అందులో - గుల్జార్ పులావ్, నూర్ పులావ్, కోకో పులావ్, మోతీ పులావ్, చంబేలీ పులావ్, ఇంకా ఏవో వున్నాయి. ఇప్పుడు నాకు గుర్తున్నదింతే. అయితే ఇక్కడున్న గొప్పవారి భోజనశాలలో మనకు ఏడురకాల పులావ్‌లే కాదు. డెభ్భైరకాల పులావులు కనబడతాయి. మహమ్మద్ అలీషా పుత్రుడు మిర్జా అజీముష్షాన్ ఒక పెళ్ళిసందర్భంలో వియ్యాల వారికి విందుచేశాడు. ఆ విందుకు నవాబ్ వాజిద్ అలీషాగూడ వెళ్ళడం జరిగింది. ఆ విందుకు - ఉప్పనివి, తియ్యనివిమాత్రం డెబ్బైరకాల పులావ్‌లు చేశారు.

గాజీఉద్దీన్ హైదర్ పరిపాలనాకాలంలో నవాబు హుసేన్ అలీ ఖానని వుండేవాడు. ఆయన సాలార్‌జంగ్ వంశీయుల్లో గొప్పవాడన్నమాట. ఆయన మంచి భోజనప్రియుడు. ముఖ్యంగా పులావంటే ఆయనకి పంచప్రాణాలన్నమాట. ఆయనకి రోజూ ఎన్నోరకాల పులావ్‌లు భోజనంలో వుండాల్సించేనట. పులావంటే ఆయనకుండే ఇష్టం ఇంతా అంతా కాదు. ఆవిషయంలో ఆయన్ని మించిన వాళ్లు లేరనేచెప్పాలి. ఆయన్నిచూస్తే పాదుషా అంతటివాడికే ఎంతో ఈర్ష్యకలిగేది. భోజనప్రియుడుగా ఆయనెంతో పేరుపొందాడు. ఆయన్ని 'చావల్‌వాలే' అనేవారు.

నసీరుద్దీన్ హైదరు కాలంలో ఒక పాచకుడుండేవాడు. అతడు పిస్తా బాదం కిచడీ (పులగం) చేసేవాడు. బాదంపప్పుతో బియ్యపుగింజల్లాచేసి, పిస్తాని పప్పుబద్దల్లా

చేసేవాడు. ఎంతటి నైపుణ్యమంటే, అది నిజంగా చాయమినప్పప్పుతో చేసిన పులగమని చెప్తే నమ్మేటట్టుండేది. అయితే తింటే దానిరుచి యింతా అని చెప్పలేం. దానిరుచే రుచి. ఒక్కసారి రుచిచూస్తే చాలు జీవితాంతం మరిచిపోము.

(నవాబ్ సఆదత్ అలీ ఖాన్ కాలంలో ఒక గొప్ప పాచకుడుండేవాడు. అతడు కేవలం ఒకరకమైన బియ్యపు జావ కాచడంలో ఎంతటినిపుణుడో చెప్పలేం. ఆ రోజుల్లో అతడు కాచే బియ్యపుజావ ప్రత్యేకంగా గణనకెక్కింది. రాజుల భోజనంలో అదిలేకుండా ఉండేదిగాదు. ఆ బియ్యపుజావంటే ఆనాటి నవాబుగారికి అమిత ఇష్టం. నవాబుగారేకాదు, ఊళ్ళోవున్న శ్రీమంతులందరికీ అతడు కాచిన జావంటే ఇష్టంగా వుండేది. దొరికితే చాలన్నట్టుండేవారు. ఆ జావకి చెప్పలేనంత గిరాకిగా వుండేది.

ఒకసారి నవాబు ఆసఫుద్దౌలాదగ్గరికి ఒక వంటమనిషి వచ్చాడు. నవాబుగారు అతణ్ణి 'నువ్వు ఏమేమి వండగలవు' అని అడిగాడట. అందుకతడు 'నేను పప్పు బాగా వండుతా'నన్నాడట. అప్పుడు నవాబుగారు 'నీకు జీత మేమాత్రం కావాలి' అన్నారట. 'అయిదొంద లిప్పించండి' అన్నాడు వంటవాడు. నవాబుగారు 'సరే' నన్నారట. 'అయ్యా! నాకు కొన్ని షరతులున్నా'యన్నాడట.

'ఏమిటా షరతులు' అని అడిగాడు నవాబుగారు.

'ప్రభువువారికి నే వండినపప్పు తినాలని అనిపించినప్పుడు, నా కొకరోజుముందనగా చెప్పాలి. నేను పప్పు తయారైందనిచెప్పగానే ప్రభువులు తక్షణమే తినెయ్యాలి' అన్నాడట. నవాబుగారు అందుకు సరేనన్నారు. కొన్నిమాసాలైన తర్వాత ఒకనాడు నవాబుగారు అతణ్ణి పప్పు వండవలసిందిగా ఆజ్ఞాపించారు. సరే అతడు చేశాడు. వెంటనే తయారైందనిచెప్పి నవాబుగారికి కబురుపంపాడు. నవాబుగారు ఆఁ, ఆఁ, అయితే సరే, దస్తరఖాన్ పరచండి, వస్తున్నాం అన్నారు. కానీ, అక్కడ నవాబుగారు ఏవేవో కబుర్లలో పడిపోయి రాలేదు. పాచకుడు మళ్లీ కబురుచేశాడు. భోజనం సిద్ధంగావుందని, తక్షణం రమ్మనీను. అప్పటికి నవాబుగారు రావడానికి కాలేదు. మూడోసారి మళ్ళీ కబురు పంపాడు. నవాబుగారు రానేలేదు. రాకపోయేసరికి అతడు ఆ పప్పుగిన్నె గిన్నే తీసుకుపోయి అక్కడ ఎండిపోయివున్న చెట్టుకుదుట్లో కుమ్మరించేసి తన ఉద్యోగానికి రాజీనామాఇచ్చి చక్కా

పోయాడు. అతడు వెళ్ళిపోయినందుకు నవాబుగారికి చాల విచారం కలిగింది. అతనికోసం ఎంతో వెదికించారు. లాభం లేకపోయింది. ఆచూకీ తెలీనేలేదు.

కొన్నిరోజు లయ్యేసరికి ఆ వంటవాడు పప్పువేసిన ఆ ఎండిపోయినచెట్టుకు చేవ పుట్టి చిక్కగా చిగురించింది. ఈ సంఘటనవింటూంటే అలా నిజంగా జరిగిందా లేదా? అతిశయోక్తేమో అనిపించినా, మొత్తంమీద దీన్నిబట్టిచూస్తే ఆ రోజుల్లో పాకకళలో ఆరితేరిన ఘటికులెందరో ఉండేవాళ్ళని, వాళ్ళకు తగినంత ఆదరణ గౌరవం లభించేవనిమాత్రం సుస్పష్టమవుతుంది.

గొప్పగొప్పవారి అభిరుచుల్ని ఆకళింపుచేసుకుని పాచకులుగూడా కొత్తకొత్త పదార్థాలు వండటం మొదలెట్టారు. ఒక పాచకుడు అనార్‌దానా పులావ్ చేసేవాడు. ఆ పులావ్‌లో ప్రతిమెతుకు సగం కెంపువన్నె మిగతాసగం తెలుపుగానువుండి అద్దంలా మిలమిల మెరిసిపోతూవుండేది. ఆ పులావ్‌ను పళ్ళెంలోతెచ్చి పెట్టినప్పుడు చూడాలి. ఆ అన్నం చిత్రవిచిత్రాలయినరంగుల్తో కేవలం రత్నమాణిక్యాలన్నీ పోసిపెట్టినట్టుండేది.

మరోపాచకుడు నౌరత్న పులావు చేసేవాడు. నవరత్నాలని ప్రసిద్ధిచెందిన తొమ్మిదిరంగుల రత్నాలమాదిరిగా, తొమ్మిదిరంగుల బియ్యంకలిపి పులావ్ చేసే వాడు. రంగురంగులుగా వుండటంవల్ల ఎంత అందంగా కనబడేదో కంటికి ఎంత ఇంపుగా వుండేదో చెప్పలేం. ఇటువంటి వెన్నోరకాలు, కొత్తకొత్తరకాలన్నీ సృష్టి అయ్యాయి. క్రమక్రమంగా ఇళ్ళలోవాళ్ళుకూడా వంటశాలల్లోని వంటవాళ్ళ వద్ద నేర్చుకొని వండుకోసాగారు.)

పూర్వకాలపు శ్రీమంతుల్లో భోజనప్రియులైన వాళ్ళనిగురించి చెప్పుకునే టప్పుడు మొదట నవాబు మిర్జాఖాన్‌నైశాపురీని చెప్పితీరాలి. ఆయనకు నెలకు పధ్నాలుగువేల రూపాయలు ఆదాయంవచ్చే వసతి వుండేది. దానికితగ్గట్టు తిండిపుష్టి వుంది. భోజనప్రియత్వమూ వుంది. అందుకని ఆయన మంచిమంచి పాచకులను ఏరికోరి పెట్టుకునేవాడు. ఆయన భోజనంలోని ప్రత్యేకతమగురించి ఊరంతా అప్పట్లో చెప్పుకునేవారన్నమాట. ఆయనతర్వాత మిర్జా హైదరు గూడ అంతటి వాడే. ప్రఖ్యాతిగాంచిన శ్రీమంతుడు. నైశాపురీ వంశస్థులకు మకుటాయమానమైన వాడు. వారందరూగూడ ఆయన్ని ఎంతో గౌరవించేవారు. ఆ మిర్జా హైదరు ఘన

తేమిటంటే, ఆయన ఏ విందుకు వెళ్ళినాసరే, వెంట తాగడానికి నీళ్లు, నీళ్ళందించే మనిషి, తమలపాకు బీడాలకు కావలసిన దినుసులు వగైరాలు, ఇంకా వంద, వంద యాభై హుక్కా-గొట్టాలు తీసుకువెళ్ళేవాడు. ఆయనకుండే ఈ ఆసక్తివల్ల ఇవన్నీ వెంట తీసుకువెళ్ళడంవల్ల మధ్యతరగతివాళ్ళకి ఎంతోమందికి ఎంతో ఉపకారంగా వుండేది. ఏదోవిధంగా ఆయన్ని ముఖస్తుతిచేసి, విందుకి వచ్చేటట్టు ఒప్పించేసే వాళ్ళు. ఆయన రావడానికి ఒప్పుకున్నాడూ అంటే, అక్కడివాళ్ళకు హుక్కాలు, తమలపాకు బీడాలు ఇంకా మంచినీళ్ళ అందింపులు వాటన్నిటికీ ఆయన జవాబుదారీ అన్నమాట. అప్పుడా విందు నిజంగా ఎంత బ్రహ్మాండంగా జరిగేదంటే ఎంతటి శ్రీమంతుడికిగూడ అంత చక్కగా విపుల్యంగా ఏర్పాటుచెయ్యడం సాధ్యంకాదేమో.

వంటకాలన్నీ తయారుచేసేవాళ్లు మూడుజట్లుగా వుండేవాళ్లు. ఒకజట్టువాళ్లు కళాయీలు గుండిగలు మొదలయిన పాత్రసామాన్లు తోమేవాళ్లు. వాళ్ళు వంటమనుషులు చెప్పినట్టు చెయ్యాలన్నమాట. ఏది కావాలంటే అదల్లా తోమి కడిగి సిద్ధంగా ఇస్తూ వుండాలి. రెండోజట్టువాళ్ళు వంటవాహ్పా చేసేవాళ్ళు. వాళ్ళు పెద్దపెద్ద గుండిగలు, కళాయిలు పొయ్యిమీదికి ఎక్కిస్తూ, దించుతూ వుంటారు. ఇక మూడోజట్టువాళ్ళు పాకకళలో గొప్ప ప్రవీణులన్నమాట. వాళ్ళు చిన్నచిన్నపాత్రలతోనే వండుతారు. పెద్దపెద్దగుండిగల్లో వండి వార్చడమంటే వాళ్లు సాధారణంగా ఏదో న్యూనతగా భావిస్తారు. వాళ్ళవంటలు అంతవరకే పరిమితమన్నమాట. వండ్లుఫలాలు, అందమైన పువ్వులా తరిగిపెట్టడము, వడ్డన చెయ్యడము, చేసినపదార్థాలన్నీ ఎంతో అందంగా, తీరుగా, పొంకంగా, కంటికింపుగా అమర్చడమూ వాళ్ళపని. పెద్దపెద్దపళ్లాల్లోకి, చేటల్లోకి పులావ్ తోడి, దానిమీద పండ్లముక్కలతోను ఇంకా రకరకాలుగా తీగెలు లతలు చిత్రించేవాళ్లు. ఇంతేకాకుండా మురబ్బా చేసేవాళ్ళు, ఊరగాయలు వేసేవాళ్లు. వేటికవే ఎంతో రుచిగా చేసేవాళ్లు, వారివారి అభిరుచినిబట్టి ఎన్నో కొత్తకొత్త రకాలవంటకాలు తయారుచేసేవారు.

అయోధ్యకు మొదట పాదుషాగావుండే గాజీ ఉద్దీన్ హైదరుకు పరోటాలంటే చాలయిష్టము. ఆయనకోసం పాచకుడు రోజూ ఆరు పరోటాలు చేసేవాడు. ఒక్కొక్క పరోటాకు అయిదుశేర్ల నెయ్యిచొప్పున, ఆరు పరోటాలు చేసేందుకు ఆరైదుల ముప్పైశేర్ల నెయ్యి తీసుకుంటూండేవాడట ఆ వంటమనిషి. ఇది కనిపెట్టి

ప్రధానమంత్రి మోతమద్ ఉద్దౌలా ఆగామీర్, పాదుషావారి వంటమనిషినిపిలిచి 'ఇదుగో అబ్బాయి ముప్పై శేర్ల నెయ్యితీసుకుని ఏం చేస్తున్నావ్ ?' అని అడిగాడు. 'అయ్యా ! పరోటాలు చేస్తున్నానండీ' అన్నాడా వంటమనిషి. 'చూడు, ఇకమీద పరోటాలు నాయెదుట చేస్తూండాలి తెలిసిందా' అన్నాడు మంత్రిగారు. అతగాడు సరేనన్నాడు. పరోటాలు చేశాడు. వాటికి సరిపడినంత నెయ్యివాడి మిగతాది పార బోసేశాడు. అదిచూసి మోతమద్ ఉద్దౌలా ఆగామీర్ విస్తుపోయి 'అదేవిటి ? తీసుకున్న నెయ్యంతా ఖర్చుకాలేదే' అనడుగగా, 'అదింక దేనికి వాడడానికి పనికిరాదు. ఆ నెయ్యంతా చమురుకింద మారిపోయిందిగదా' అన్నాడు వంటమనిషి. మంత్రి గారికిక ఏమనాలో తెలీలేదు. కానీ ఒక పరోటాకు ఒక్కశేరు నెయ్యే అనవసరమని తోస్తూందనిచెప్పి, ఇకమీద ఆరు పరోటాలకు అయిదుశేర్లుమాత్రం యివ్వబడుతుందని హుకుం జారీచేశాడు. 'సరే అలానే గానివ్వండి, ఇచ్చినంతలోనే సరిపెడతా' నన్నాడు వంటమనిషి. మంత్రిగారు తనమీద తనిఖీకిరావడం, దుబారా చేస్తున్నట్టు సతాయించినందుకు ఆ వంటమనిషికి రోషంవచ్చి, మామూలు సాదా పరోటాలే చేసి పాదుషావారి భోజనానికి పంపించాడు. చాలారోజులు ఇదేవిధంగా చేసిపంపుతూ వుండేవాడు. ఒకనాడు పాదుషావారు 'ఏమిటీ పరోటాలు ఇప్పుడిలా వుంటున్నాయి?' అనడిగాడు. 'పరోటాలు ఇలా చెయ్యమనే నవాబు మోతమద్ ఉద్దౌలా బహాదుర్ వారి ఆజ్ఞయింది ప్రభూ ! అప్పటినుంచి ఈ పద్ధతినే చేస్తున్నాను' అని వంటమనిషి విన్నవించుకున్నాడు. అప్పుడు పాదుషావారు కారణమేమిటో వివరంగా చెప్పమని అడగ్గా, ఆ పాచకుడంతా జరిగింది జరిగినట్లు ఏకరువుపెట్టాడు. తక్షణమే పాదుషావారు మోతమద్ ఉద్దౌలాను పిలిపించారు. మోతమద్ ఉద్దౌలా వచ్చి, 'మహాప్రభూ, వీళ్లు ఇష్టమొచ్చినట్టు దోచుకోడంగా ఉందనే నే నావిధంగా కట్టడిచేశా' నన్నాడు. ఆమాట మంత్రి అనీ అనంగానే, పాదుషా మంత్రికి పది పదిహేను గుద్దులు, చెంపదెబ్బలు తగిలించాడు. బాగా వాయించి 'ఏం నువ్వు దోచుకోవడం లేదా? నువ్వు దేశాన్ని దోచుకుంటున్నావ్. రాజ్యాన్ని నిలువుదోపిడీయే చేస్తున్నావే. నువ్వు చేసేదోపిడిని ఇదేం మించిపోలేదే. ఏదో కొంత నెయ్యేగదా కావాలన్నాడు. అదీ నాకోసం. నా భోజనం తయారుచేసేందుకే నాయె. ఓహో, నీ కామాత్రంగూడ ఇవ్వ బుద్ధి పుట్టలేదన్నమాట' అని రెట్టించి అడిగేసరికి మంత్రి బుద్ధి తక్కువైందని చెంపలేసుకుని, ఇక ఎప్పుడు చెయ్యనని ప్రమాణం చేశాడు. ఆనాడు పాదుషా

నాలుగువాయించి చెప్పబట్టి తను చేస్తున్నతప్పు తెలుసుకోగలిగాడు. తర్వాత పాదుషా వారి ఆదరణకు పాత్రుడైనాడు. ఇంటికి తిరిగి చాక్కాపోయాడు. ఆతర్వాత ఎప్పుడు ఆ వంటమనిషిని అభ్యంతరం పెట్టలేదు. అతడు ముప్పైశేర్ల నెయ్యి చొప్పున రోజూ తీసుకుంటూనే వుండేవాడు.

# 26

నవాబు అబుల్ కాసిమ్ ఖాన్ రసికుడు, శ్రీమంతుడు. ఆయన తనఇంట్లో మంచి పులావ్ వండించేవాడు. 34 శేర్ల మాంసంకూరవేయించి విడిగాపెట్టి, అందులో అన్నంవేసి పదను చేయించేవాడు. ఆ పులావ్ ఎంతరుచిగా వుండేదంటే, అలా ఒకముద్దతీసి నోట్లో వేసుకుంటే చాలు. గుట్టు చప్పుడుగాకుండా గొంతులోంచి దిగి పోవాలిసిందే. గుటకేసిన చప్పుడుగూడ వుండేది కాదన్నమాట. ఇది ఎంత పసందుగా వుండేదంటే తింటున్నప్పుడు బరువుపదార్థమే అనే ధ్యాసే రానిచ్చేది కాదనుకోండి. ఇంతకంటె శ్రేష్ఠంగా వాజిద్ అలీషా ఆయన సతీమణికోసం ప్రతిరోజూ పులావ్ చేయించేవాడు.

అయోధ్య రాజ్యపాలననుంచి పదచ్యుతులైన నవాబు వాజిద్ అలీషాతోపాటు మటియా బుర్జ్‌లో ఒక శ్రీమంతు డుండేవాడు. ఆయనకు 'మున్షీ ఉస్సుల్తాన్ బహాదుర్' అని బిరుదు. మంచి స్థితిమంతుడు. దానికితగ్గట్టు ఉత్తమమైన అభిరుచులు ఆసక్తులు వున్నవాడు. భోజనప్రియుడు. ఆయనదగ్గర ఎంతో చెయితిరిగిన వంటవాళ్ళెందరో ఉండేవాళ్లు. ఉన్నప్పటికీ ఒకటి రెండు పదార్థాలు స్వయంగా చేసుకుంటేగానీ, ఆయనకి భోజనం రుచించేదికాదు. ఆయన కదో అలవాటు. అందులో ఆయన సుష్టుగా భోజనం చేస్తాడన్నది మహాప్రసిద్ధి. ఒకసారి వాజిద్ అలీషాయే 'నా భోజన మేమంత చెప్పుకోతగ్గ భోజనం? మన సుల్తాన్ భోజనంముందు నాదో భోజనమా' అని అన్నాడట. చిన్నప్పుడు ఆరేడుసంవత్సరా లొచ్చేవరకు మటియా బుర్జ్‌లో వాజిద్ అలీషాతోనే ఉండేవాడు. రోజూ ఆయనతోబాటే భోజ

సానికి కూర్చునేవాడు. ఆయన భోజనానికి ముప్పై నలభై రకాల పులావ్‌లు. అధమపక్షం ఇరవై రకాలయినా మాంసపుకూరలు వుండటం నేను కళ్లారాచూశాను. ఎన్నిరకాల పదార్థాలంటే కొన్నయితే అసలు మనం ఎన్నడూ తినేవుండము. పేర్లు గూడా వినివుండం. ఆయనకి హల్వా సోహన్ అంటేగూడ చాలా యిష్టం. దాన్ని గురించి తర్వాత ముచ్చటించుకుందాం.

(గదర్ విప్లవం జరిగిన తర్వాత రోజులమాట. లక్నోలోని హకీంబందా మెహదీ మర్‌హూమ్‌కు భోజనప్రియత్వమే కాకుండా వేషభాషలంటేగూడ ఎక్కువ మోజుం దేది. అందుకుతగ్గట్టు ఆయన కట్టనిబట్టగానీ, తినని పదార్థంగానీ లేదంటే అతిశ యోక్తి లేదు.

అన్నివిధాలా అంతటి అదృష్టం మాటికో కోటికో ఒక్కరుగానీ, అంతా అలా పెట్టిపుట్టరని పెద్దపెద్ద స్థితిమంతులే ఆయన్నిగురించి అంటూండేవాళ్లు. మా మిత్రు లొకరు ఒక సంఘటనగురించి చెప్పారు. ఒకనాడు ఆ హకీంసాహేబ్ తమయింట ఒక ఉస్తాదుకి విందు చేస్తున్నా కాబట్టి ఇక్కడికి దయచేసి విందులో పాల్గొనవల సిందిగా కోరుతున్నానని మా మిత్రుని తండ్రిగారికి, వారి పినతండ్రిగారికి కబురు చేశారుట. సరే ఆయన తండ్రిగారు వాళ్లు బయల్దేరివెళ్లారు. వాళ్ళతోబాటు మా మిత్రుడుగూడ అక్కడికి వెళ్ళాడట. అక్కడికివెళ్ళాక ఆ ఉస్తాదునిగురించి తెలిసిం దేమంటే ఆయన రోజూ ప్రొద్దున ఇరవై శేర్లపాలు తాగుతాడట. తర్వాత రెండు న్నర లేక మూడుశేర్ల బాదం, పిస్తాపప్పులు తింటాడట. ఆ తర్వాత మధ్యాహ్నం సాయంత్రం రెండున్నరశేర్ల పిండితో రొట్టెలు చేయించుకుతింటాడు. మళ్ళీ ఆ మధ్యకాలంలో మంచి మేకపోతు నోదాన్ని వండించుకు తింటాడట. అంత తిండికి తగినట్టి వుందా శరీరమూను. తినడానికి నాస్తా తెప్పించమని విలవిల్లాడిపోతూ ఒకటే తొందరపెట్టడం మొదలెట్టాడు. అప్పుడు హకీం సాహేబ్ కావాలనే నాస్తా తెప్పించడానికి ఆలస్యంచేశాడు. ఆ ఉస్తాదుకు ఆకలి మండిపోయి ఆ ఆకలికి తాళ లేకపోయి, కోపంతో విరుచుకుపడ్డాడుట. అంతట హకీంసాహేబ్ 'ఇదుగో ఇప్పుడే భోజనం పంపుతున్నా'నని నమ్మించి లోపలికిపోయాడుట. మరికొంతసేపు భోజనం పంపడానికి ఆలస్యం చేయించాడట. ఇక ఉస్తాదు ఆకలికి తట్టుకునేస్థితిలో లేక పోవడం కనిపెట్టి పనిమనిషిచేత ఒక పళ్ళెం యిచ్చిపంపాడుట. అది చూసేసరికి

ఉస్తాదుకి ప్రాణం లేచివచ్చినట్టయి అమాంతం ఆ పళ్ళెంమీద మూతతీసి చూసేసరికి అందులో కాస్తంత పులావ్‌మాత్రం వుంది. కనీసం ఓ చెటాకుగూడ వుంటుందో లేదో. ఆ తిండిపోతురాయుడికి ఆ కాస్తంత ఏమూలకు సరిపోయేను? ఒక్క ముద్దంతైనా లేదే అని, ఎక్కడలేనంత ఆవేశం వచ్చిందిట. తినకుండా లేచిపోయి నాడుట. అయితే అక్కడున్నవాళ్ళంతా కాదు కూడదని బ్రతిమాలి చెప్పి ఒప్పించి పోనీకుండా ఆపారుట. ఇక ఎటూ వీల్లేక సరే ఆ పళ్ళెంలోని పులావ్ ఎత్తి ఒక్కసారి నోట్లోవేసుకుని మింగేశాడు. అయిదునిమిషాలు గడిచాక దాహంగా వుంది మంచినీళ్ళు ఇప్పించమని అడిగాడుట. ఆతర్వాత షరో అయిదునిమిషాలకు మళ్ళీ మంచినీళ్ళు అడిగి తాగి. త్రేన్చాడుట. అప్పుడు లోపలనుంచి పళ్ళాల్లో అమర్చిన భోజనపదార్థాలన్నీ వచ్చాయిట. దస్తర్‌ఖాను పరిచారుట. హకీం సాహెబ్ గూడ అక్కడికి వచ్చాడుట. భోజనపదార్థాలపళ్ళాలన్నీ ఆ జంపఖానామీద పెట్టారుట. ఒక పళ్ళెంలో పులావ్ వుంది. అందులోంచే మొదట ఓ ముద్దతీసి పంపారు. ఇక ఉన్నదెంతని: కాస్తంత ఉంది. ఇది మీ ఇందాకతిన్న పులావేనా - లేక మరొకటా రుచిచూడండి' అన్నారుట. ఇందాక తిన్నదేలెమ్మన్నాడు ఉస్తాదు. 'అయితే ఇంకేం ఈ కాస్తగూడ తినండి. ఈ పులావ్ తయారుకావడంలో ఆలస్యమైపోయింది. అందుకే మీకు ఆకలివేళకు అందించలేకపోయాననే నాకు విచారం' అన్నాడుట హకీంసాహెబ్. 'క్షమించండి. ఇప్పుడు నేనిక ఒక్క మెతుకు తిన మన్నా తినలేను. ఇందాక తిన్న ఒక్కముద్ద నాకు సరిగ్గా సరిపోయింది. ఆకలి తీరిపోయిం' దన్నాడుట ఉస్తాదు. తినమని ఎంత బలవంతంచేసినా వద్దంటే వద్దని వారించాడుట. 'ఎట్లా తినను: కడుపులో సకోశానా చోటులేందే' అనేసరికి సరే చివరకు హకీంసాహెబే ఆ అన్నం అంతాతీనేసి 'చూడండి బాబూ. ఇరవైయ్యేపి శేర్లు, ముప్పైయ్యేపి శేర్ల తిండి తినడం మనిషికి మంచిదికాదు. పశువులైతేనే అలా తింటాయి. అది గొడ్డుతిండి. మనిషెప్పుడు నాలుగుముద్దలు తింటే చాలు. పట్టెడంత తింటేచాలు. అదే ఇరవై ముప్పైశేర్ల తిండి యిచ్చేటంత సత్తువనూ పుష్టినీ యిస్తుంది. మీరైతే ఒక్కముద్దకే కడుపునిండింది తృప్తిగా ఉందంటున్నారు కాబట్టి రేపుగూడ మీ రిక్కడికి విందుభోజనానికి రావలసిందని' ఆహ్వానించాడుట హకీం. రేపు మీరు తినే ఒక్క ముద్దవల్ల మీకు ఇరవై ముప్పైశేర్ల పాలు, పండ్లు, మాంసం అన్నం తిన్నందువల్ల కలిగేటంత పుష్టి, సత్తువ కలిగిందా లేదా

అనేది చెప్పాలిసుమా' అన్నాడు. మా మిత్రుని తండ్రిని, పినతండ్రినిగూడ మర్నాడు జరగబోయేవిందుకు రమ్మని ఆహ్వానించాడట.

సరే, మర్నాడు ఉస్తాదు వచ్చాడుట. యథాప్రకారం విందు జరిగిందిట. ఆ తర్వాత వస్తాదు, 'అయ్యా, చూస్తున్నాను. నిన్న ఇవాళ నాకున్నసత్తువ, చురుకుదనం జీవితంలో నాకెన్నడూ ఇంతవరకూ కలగలేదనే అనిపిస్తుంద'న్నాడుట. అదీ సంగతి. ఆ పదార్థం మరి ఎలా చేయించారో, ఆ పాచకుడి నైపుణ్యమేమో చిత్రంగా లేదూ?

రాజ వంశీయుల్లోనివారైన నవాబు మోహసిన్ ఉద్దౌలా, నవాబు ముంతాజ్ ఉద్దౌలావారి భోజనము, ఆ పదార్థాలు, వారి వంటమనిషి నైపుణ్యం చాలా ప్రసిద్ధి. పాకకళలో అతనికతనే సాటి. హకీం మెహదీసాహెబ్ కోసం పులావు చేసిపెట్టింది అతగాడే. అవి మల్కా జమానియావారి ప్రభుత్వం ఏర్పడినరోజులు. వారి వంటశాల ఎంతో ప్రసిద్ధికెక్కింది. అక్కడ రోజుకు మూడువందలరూపాయల వంటకాలు తయారయ్యేవట. యాహియా అలీ పాలన జరుగుతున్నకాలంలో ఆలం అలీ అనే వంటమనిషి వుండేవాడు. అతడు కేవలం చేపలు వండటంలో ఎంతో ఘటికుడు. ఎంతో పేరుపొందాడు. ఆతడు చేసినతీరుగా చెయ్యాలని ఎందరో వంటమనుషులు ప్రయత్నించిగూడ విఫలులయ్యారు.

(నసీరుద్దీన్ హైదరు పరిపాలనాకాలంలో మహమూద్ అనే ఒక విదేశీయుడు వచ్చి ఫిరంగిమహల్లో దుకాణం పెట్టుకున్నాడు. అక్కడ అతడు 'నహరీ' అని మాంసపదార్థం ఒకటి తయారుచేసేవాడు. దానికోసం గొప్పగొప్ప శ్రీమంతులు, రాజకుమారులుసైతం మొహం వాచిపోయేవాళ్ళనుకోండి. అంతగొప్పగా చేసేవాడన్నమాట. తను చేసినపదార్థానికి అంత గిరాకి హెచ్చడంతో అతనికెంతో ఉత్సాహం పుట్టుకొచ్చింది. (శీర్‌మాల్) పాలపూరీ తయారుచెయ్యసాగాడు. ఇప్పటికీ లక్నోలో పాలపూరీలంటే జనానికి పంచప్రాణాలే.

ఈరాన్‌లోని ముసల్మానులు పులుపురొట్టెలు (ఖమీరీ రోటియా) తినేవాళ్లు భారతదేశానికివచ్చి స్థిరపడిపోయాక హిందువులు పూరీలు చెయ్యడంవిధానం చూసిన తర్వాతనే, పెనంమీద నెయ్యిరాచి రొట్టెలు చెయ్యడం మొదలుపెట్టారు. మొట్టమొదట పరోటాలుచెయ్యడం కనుక్కున్నారు. క్రమక్రమంగా పొరలుపొరలు వచ్చే

ఉట్టు మడిచిమడిచి ఒత్తి పరోటాలుచేయడం నేర్చుకున్నారు. ఆతర్వాత తీపి పరోటాలు చెయ్యడం మొదలెట్టారు. పాలు పంచదార మైదాపిండితోను చేస్తారు. వాటిని 'బాకర్‌ఖానీ' అంటారు. శ్రీమంతులయిళ్లల్లో వాటిగిరాకీ ఇంతా అంతాకాదు. వారి భోజనపదార్థాల్లో ఆ తీపిపరోటాలకో విశిష్టస్థానముం దనుకోండి.

లక్నోలోని మహమూద్ ఈ బాకిర్‌ఖానీ అనే తీపి పరోటాల ఆధారంతోనే పాలపూరీలు చెయ్యడం కనిపెట్టాడు. ఆ పాలపూరీలు వాడుకలోకి వచ్చాక తీపి పరోటాలు వెనకబడిపోయాయి. ఎందుకంటే పాలపూరీ సువాసన, రుచికలిగి కంటి కింపుగా ఉండటంతో అందరికీ పాలపూరీలంటే మోజు పుట్టింది. ఈ (శీర్‌మాల్) పాలపూరీ అన్నిప్రాంతాల్లో చేసుకున్నప్పటికి లక్నోలో చేసినంతరుచిగా చెయ్యలేరన్నది వాస్తవము. లక్నోలో పాలపూరీ పొందినంత జనాదరణ మరే పిండివంట గూడ పొందలేదనే చెప్పాలి. పైగా అది నేషనల్ రోటీ (జాతీయమైన పిండివంట) కింద జమైపోయింది. లక్నోలో ఏ శుభకార్యం జరిగినాసరే పాలపూరీ చెయ్యాల్సిందే తప్పదు. ఆ పిండివంట చెయ్యకపోతే ఆ విందుకు విందేలేనట్టు వారు భావిస్తారు.

ఈ పాలపూరీని కనిపెట్టిన మహమూద్ గొప్పతనమే గొప్పతనమనుకోండి. దానికి ఏమి గిరాకీయో చెప్పలేంగదా. రాజాలభవనాల్లో జరిగేఉత్సవాలు వేడుకల నిమిత్తం ఒక్కొక్కప్పుడు ఒక లక్ష పాలపూరీలు కావాలంటూ ఆర్డరు ఇవ్వడం జరిగేది. ఒక్కరోజు వుందనగా చెబితేచాలు. అతడు ఆ లక్ష పాలపూరీలను తయారుచేసి పంపించేసేవాడు. అంతటి భారీయెత్తున చేసేవాడు. అంతటి పెద్దపెద్ద గిరాకీలు ఉండేవి. దానికితగ్గట్టు చేసేవాడు. మహమూద్‌తర్వాత ఈ పాలపూరీ చేసే వాళ్లలో అంతటినిపుణుడు ఆరోజుల్లో అలీ హుసేనని వుండేవాడు. ఇప్పుడు అతడు చనిపోయి చాలాకాలమైందిలెంకి. అప్పట్లో అతనికొట్లో ఎటువంటి పాల పూరీలు దొరికేవని? అంత రుచిగలవి ఇంకెక్కడ దొరికేవికావు.

పాలపూరీ తర్వాత అంతటి పేరుపొందింది నాన్‌జిలేబి అనే పిండివంట. ఆ నాన్ జిలేబీని ఎంతో జాగ్రత్తగా నేర్పుగా చెయ్యాలి. దాన్ని తయారుచెయ్యడం అందరికీ సాధ్యంకాదు. అది చెయ్యడం తెలిసినవాళ్లు ప్రత్యేకంగా కొందరే వున్నారు. లక్నోలో చేసేటంత బాగా నాన్‌జిలేబీ మరెవ్వరూ ఎక్కడా చెయ్యలేరని అక్కడి పాచకులు సవాలుచేసి మరీ చెబుతారు.

పరోటాలు చెయ్యడంలోమాత్రం లక్నో మిగతాపట్టణాలకు మల్లేనే వుందను కోండి. ప్రత్యేకతేం లేదు. అయితే ఢిల్లీలో రొట్టెలు తయారుచేసేవాళ్ళలో మంచి మంచి వాళ్ళున్నారు. వాళ్ళుచేసే పరోటాలు అందరు చేసేవాటికంటె చాలా శ్రేష్ఠంగా ఉంటాయి. వాళ్లు ఆ పరోటాలు చేసేటప్పుడు శేరుపిండికి శేరునెయ్యి చొప్పునవోసి చేస్తారు. నేను ఢిల్లీలో వుండేరోజుల్లో అక్కడ రొట్టెలుచెయ్యడంలో సిద్ధహస్తు లైనవాళ్లు చేసినపరోటాలు తినిచూశాను. వాళ్ళు నెయ్యయితే ఎక్కువ ఖర్చు పెట్టారుగానీ, నెయ్యవేసి మర్దనచేసినట్టుగా నాకెక్కడా వాటిల్లో కనబడలేదు. అందు వల్ల అవి చేసినవెంటనే నిలవవుంచకుండా తిన్నట్టయితే రుచిగా వుంటాయన్న మాటేగానీ, చల్లారితేమాత్రం రుచీపచీపోయి కేవలం తోళ్ళయిపోతాయి. (రొట్టె తుంచి అందులో నెయ్యి పంచదారవేసుకుని తినడమన్నది సర్వసాధారణమైన విధానం. శ్రాద్ధక్రియల్లో తరుచుగా ఆ పదార్థం పెట్టడం రివాజైంది. అయితే రాజు గారి వంటశాలల్లోని పాచకులు ఆ పదార్థాన్ని హల్వా అంత రుచికరంగా తయారు చేసేవాళ్లు. నోట్లో వేసుకుంటేనే కరిగిపోయేటంత బాగా గొప్పగా చేసేవాళ్లు. అసలు దాన్ని నమిలి మింగాల్సినపనే వుండేది కాదన్నమాట. అందుకే కొందరు రాజులు అదంటే చాలా యిష్టపడేవారు, ఎంతో మెచ్చుకొనేవారు.)

ఈపద్ధతిలోనే మరొకరకం పాలపూరీ చేసేవాళ్ళు. ఆ పాలపూరీలో చిత్ర మేమంటే, అసలు మీకు పిండిఅనేదే కనబడదు. పాలతో జున్నుచేసి, ఆ జున్ను తోనే మైదాపిండి వేరే వెయ్యకుండా పూరీ చేసేవాళ్ళన్నమాట. చాలా నేర్పరి తనంతో చేసేవాళ్లు. ఆతర్వాత పాల పునుకులని చేసేవాళ్లు. ఇంకా ఏవేవో రకరకాల పదార్థాలు చేసేవాళ్లు. ఈ పద్ధతిగా కేవలం పాలతోనే రకరకాల పిండివంటలెన్నో భోజనానికి తయారుచేస్తూండేవాళ్లు. ఆ పిండివంటలంటే శ్రీమంతులు తెగ ఆశపడే వాళ్ళు.

ఇవన్నీ యిలావుండగా, ముసల్మానుల (నేషనల్ డిష్) జాతీయభోజనం ఒక టుంది. అది పులావ్ కుర్మా. అన్నీ ఓ యెత్తు. దీని రుచి, దీని తీరు మరో యెత్తు. పులావ్‌నిగురించి చాలావరకు చెప్పడమైపోయింది. ఇంకా స్వల్పంగా చెప్పవల సింది మిగిలింది. ధనవంతులు, ఇంకా రసికులైన శ్రీమంతులు ఒక కోడిపుంజుకు బాగా కస్తూరి, కుంకుమపువ్వు మాత్రలుగాచేసి తినిపిస్తారు. ఈ రెండు సుగంధ ద్రవ్యాల సువాసన దానిఒంట్లో నరనరాలకు పట్టిపోతుంది. దానిశరీరంలో అణు

వణువున ఈ పరిమళం వ్యాపించిపోతుంది. అలా వంటపట్టేటట్టు నేపి, దాని మాంసంతో కూర చేసుకుంటారు. ఆ కూరలో అన్నంవేసి పదనుచేస్తారు. అదో ప్రత్యేకత.

(మోతీ పులావని మరో పులావ్ వుంది. అదేవిటంటే, బియ్యంలో తళతళ మెరిసే ముత్యాలు కొన్ని కలిపారా అనిపిస్తుందిగానీ, అవి అసలు నిజం ముత్యాలు కానే కావు. ఆ ముత్యాల్ని వాళ్ళు ఎంత ఉపాయంగా తయారుచేస్తారో చెబుతా వినండి. ఒక తులంవర్కు కాయితం, అయిదు గురిగింజలయెత్తు బంగారువర్కు కాయితం తెచ్చి గుడ్డులోనిసొనలో బాగా కలిపేస్తారు. అలా కలిపేసినతర్వాత దాన్ని కోడి కంఠనాళాల్లోపోసి నింపుతారు. ప్రతి కీలుదగ్గర సన్నని దారం గట్టిగా బిగించి కడ తారు. ఆ నాళాన్ని కొంచెంగా ఉడికిస్తారు. ఉడికినతర్వాత చాకుతో ఆ నాళపు పొరని కత్తిరించి ఒలుస్తారు. అప్పు డందులో మెరుస్తున్న గుండ్రపాటిముత్యాలు తయా రవుతాయి. ఆ ముత్యాల్నితీసి పులావ్‌లో మాంసంతోపాటు వాటి నివేసి కలుపుతారు. కొందరు వంటవాళ్ళు పాలజున్నుతో ముత్యాలుచేసివేస్తారు. వాటికి వెండివర్కు కాయితాలుగూడ చుడతారు. ఇంకా ఇంకా ఊహకు అందనవన్ని, మామూలువాళ్ళసలు ఊహించలేనవన్ని చిత్రవిచిత్రాలు ఆ పాచకులు చేసేవాళ్ళు. కొందరు పాచకులైతే మాంసంతో చిన్నచిన్న పిట్టల్లాగాను, వాటిరూపం చెడకుండా వండి, పులావ్ చేసే వాళ్ళు. పులావ్‌లోవేసి బియ్యాన్ని పప్పుబద్దల్లా చేసేవాళ్ళు. ఆ పులావ్‌కనుక పళ్లాల్లో అతిథులముందు తెచ్చి పెట్టినప్పుడు నిజంగా ప్రతిపళ్ళెంలోను ఒక పిట్ట కూర్చుని గింజలేరుకుతిన్నట్టే అనిపించేది. అంతచిత్రంగా చేసేవాళ్ళు.

ఇంకోరకం పిండివంట వుండేది. అది సమోసా. ఆ సమోసా తుంచామో ఎర్రనికెంపులు దాంట్లోంచి ఎగిరిపోతాయి. అదో తమాషా. ఆ సమోసాని లక్నోలోని పాచకుడు పీర్అలీ తయారుచేసేవాడు. హైదరాబాద్ దక్కనులో గూడ ఆ సమోసా చేసేవాళ్ళు. ప్రభుత్వపువిందుల్లో ఆ సమోసా తప్పకుండా పెట్టేవాళ్ళు. అప్పటి ఇంగ్లీషు దొరసాన్లకు ఆ సమోసా అంటే మహాప్రీతిగా వుండేది. ఈ సమోసా అసలు మొట్టమొదట నసీరుద్దీన్ హైదర్‌కోసం అనాటి పాచకులు తయారుచేసేవాళ్ళు. ఇదీ, ఆ పిట్టల పులావ్‌గూడా అప్పటివే.)

ఒక పాచకుడు పెద్దపెద్ద గుడ్లు ఉడికించి వేయించిపెట్టాడు. ఆ గుడ్డు ఒక్కొక్కటి ఒక్కొక్క శేరు బరువుంటుందన్నమాట. అంత పెద్దది. దాంట్లో పైన ఆ గుడ్డుసైజుకి తగినంతమోతాదులోనూ వుంది. ఆ పైన తెలుపుగావుండటం అంతా అచ్చంగా గుడ్డులాగానే తయారుచేశాడు. చూపరులకు నిజం గుడ్డేమో అన్నంతభ్రమ కలిగించేట్టు తయారుచేశాడు. మరికొందరు పాచకులు బాదంపప్పులతో ఒకరకం మాంసపుకూర తయారుచేశారు. ఆ కూర చూడటానికి చిక్కుడు గింజల కూరేమోనన్నట్టు అంత రుచిగాను ఇంకా చెప్పాలంటే అంతకంటేగూడ ఎక్కువ రుచిగా తయారుచేశాడు. ప్రధానమంత్రిఅయిన రోషన్‌ఉద్దౌలాకు ఒక వంటమనిషి వుండేవాడు. అతను పచ్చి మొక్కజొన్నలతో పెరుగుపచ్చడి ఎంతో బాగా చేసేవాడు. అది తిన్నవాడిదే జన్మ అన్నంత బాగా చేసేవాడు.

మున్షీ శాకిర్ అలీ సాహెబ్ అని గొప్ప వ్రాయసకాడుండేవాడు. ఆయన బియ్యపు గింజలమీద కురానులోని నాలుగు చిన్నవాక్యాలువ్రాసి తన అపూర్వమైన చాకచక్యాన్ని ప్రదర్శించాడు.

ఇక్కడే రాచ వంటశాలలోని మరో పాచకుడు గసగసాలతో నల్లులేమో అన బడేట్టుచేసి జాగ్రత్తగా వండి, నవాబుగారి భోజనంలో పెట్టాడుట.

పీర్‌అలీ అని లక్నోలో చాలా పేరుగడించిన పాచకుడుండేవాడు. అతడు హుజూర్ నిజాం పాకశాలలో పనిచేసేవాడు. అతడు ముద్దపప్పు, (కందిపప్పు) వండటంలో మహాఘటికుడు. చాలా రుచిగా వండేవాడు. ఆ పప్పునే పూర్వం పాదుషాలవంటశాలల్లో చేస్తూండేవాళ్ళు. అది అప్పట్లో 'సుల్తానీ దాల్'గా చాలా ప్రసిద్ధికెందింది.

కొందరు వంటవాళ్ళు కాకరకాయలు కాయలుగానే కూర వండేవాళ్లు. ఎంత బాగా వండేవాళ్ళంటే అసలా కాకరకాయ పచ్చిదేనేమో! ఉడికించారా లేదా అన్నంత యిదిగా ఉండేది. అంత పచ్చి పచ్చిగా వున్నట్టుండేది. కానీ, తింటే మాత్రం బహురుచిగా వుండేది. ఈ మధ్యకాలంలో మా మిత్రుడు సయ్యద్ అలీ 'జౌసత్' సాహెబ్‌కు ఇటువంటి సంఘటనేదో తటస్థించిందిట. అదే చెప్పాడు.

లక్నోలోవున్న శ్రీమంతుల్లో ఒకడైన నవాబు అలీ నకీ ఖాన్ ఒకరోజురాత్రి భోజనానికి చేయించిన ప్రత్యేకపదార్థ మేదో పంపదలిచాడు కాబట్టి, ఆ పదార్థం చేసే

దాకా, భోజనం చెయ్యకుండా ఆగవలసిందిగా కోరాడుట. ఈయన సరేనన్నాడు. రాత్రి సరిగ్గా భోజనంవేళకు వారిసేవకుడు ఓ పళ్ళెంలో మూతపెట్టి ఏదో పట్టు కొచ్చాడుట. సరే ఆయనెంతో ఆసక్తితో ఆ పళ్ళెమందుకుని తెరిచిచూశాడట. ఏముంది, ఆ పళ్ళెంలో ఓ చిన్నపళ్ళెం, దానిమీద ఒక పచ్చిగుమ్మడికాయ పెట్టి ఉందిట. అది చూసేసరికి ఎక్కడలేనంత చికాకు రోషం వచ్చాయిట. ఆ వంటమని షిని పిలిచి, 'చూడబ్బాయి, ఇది పట్టుకుపోయి రేపు వండుకోండన్నాడట. అప్పుడా రాజసేవకుడు పకాలున నవ్వి, ఇది కోసితినండి. వండాల్సిన అవసరమేం లేదు. అన్నాడుట. అనేసరికి ఆయన కోసితిన్నాడు. 'నిజమే ! ఎంత రుచిగా ఎంత బావుం దనిచెప్పను. అంత రుచిగలపదార్థం ఎన్నడూ తినలేదేమో అనిపించింది' అని ఏకరువు పెట్టాడు. ఆ రోజుల్లో అటువంటి ఘనులుండేవాళ్ళు.

ఈవిధంగా ఆకాలపు పాచకులు చిత్రవిచిత్రాలైన వంటకాలెన్నో తయారు చేసే వారు. పీర్ అలీ అనే పాచకుడు మిఠాయితో అచ్చంగా దానిమ్మపండు చేసేవాడు. ఆ దానిమ్మపండు పైన తోలు, లోపల గింజలు, వరుసగా వాటి అమరిక, ఆ గింజల దొంతర్లమధ్య ఉలిపిరి పొర, అంత అలానే నిజమైన దానిమ్మేనేమో అన్నంత పసందుగా చేసేవాడు. ఎలా చేసేవాడంటే గింజలమధ్యలో గట్టిగా వుండేభాగం బాదంపప్పుతో చేసేవాడు. గింజల పైభాగం రసముండేభాగమేమో సీతాఫలం గుజ్జుతో చేసేవాడు. గింజకి గింజకి మధ్య పొర, పైన తోలు పంచదారపాకంతో చేసేవాడు.

ఇవేకాకుండా ఆ పాచకులు మురబ్బా, ఊరగాయలు ఇంకా రకరకాల మిఠా యిలు తయారుచేసేవారు. ఒకరకం కాదు, వందలాది రకాలు. చిత్రవిచిత్రాలుగా చేసేవారు. మామిడికాయ మురబ్బా అందరికి తెల్సిందేననుకోండి. అయితే ఇక్కడి పాచకులు మామిడిపిందెల్తో మురబ్బా చేసేవాళ్ళు. ఆ మామిడిపిందెలు, ఆ పైతోలు పచ్చిగా అలానే వుండేవి. చూసినవాళ్ళకు అది మురబ్బా అని చెబితేగానీ తెలీదు. ఎందుకంటే ఏదో అప్పుడే కోసితెచ్చిన మామిడిపిందెలు పాకంలో వేసిపెట్టారేమో అనిపించేది. వాటిరూపం చెడకుండా అంత చక్కగా చేసేవాళ్లు.

# 27

విందులప్పుడు పార్టీలప్పుడు చేసే భక్ష్యభోజ్యాలని కొన్ని ప్రత్యేకంగా ఉంటాయి గదా! ఈ భక్ష్యభోజ్యాల సముదాయాన్నే 'తోరా' అంటారు. వాటిల్లో-1. పులావ్. 2. తీపి పులావ్, 3. పీలా పులావని పుల్లని పులావ్, 4. పాలపూరీ, 5. తీపి అన్నం (మిఠాయిరంగు వేయనిది), 6. వంకాయ పెరుగుపచ్చడి, 7. అన్నం పాయసం, 8. కుర్మా, 9. వేయించిన మాంసం, 10. ఒకరకమైన మాంసపు వేపుడుకూర, 11. మురబ్బా, 12. ఊరగాయ లేక పచ్చడి. ఇవన్నీ ముఖ్యమైనవి. ఈ రకాల్లో కొన్ని తరచు చేసుకునేవి వున్నాయి. అరుదుగా చేసుకునేవి ఉన్నాయి.

ఏది ఏమైనా లక్నోలో సాధారణంగా ఈ భక్ష్యభోజ్యాలకే ప్రాముఖ్యం ఎక్కువగా వుంది. ఇవిలేని విందుగాని, పార్టీగాని వుండనేవుండదు. విందుల్లో ఈ పదార్థాలన్నిటిని చక్కగా వేరువేరు పళ్లాల్లోఅమర్చి ప్రతిమనిషికి ఎదురుగా దస్తర్‌ఖాన్ మీద పెడతారు.

ఇలాకాక ఎవరికైనా పంపాలీ అంటే ఈ తినుబండారాలన్నిటిని ఒక కొయ్య పళ్ళెంలో అమర్చిపెట్టి మరీ పంపుతారు. ఇంగ్లీషువారికి బల్లలమీద పూలకుండీలు పెట్టడం, పూలతో సింగారించడం అలవాటు. వారిలాగానే వీరుకూడ ధనికులకు, నవాబులకు, రాజకుమారులకు విందులు చేసేటప్పుడు పళ్లాలమధ్య కాగితం పూల కుండీలు పెట్టడం పరిపాటి. అయితే సామాన్యజనులంతా ఈ అలంకారాలన్నీ శుద్ధ దండుగని వాటిజోలికే పోరు.

ఉన్నతోద్యోగులకు, గొప్పవారి లోగిళ్ళకు ఈ తినుబండారాలు పంపేటప్పుడు అవతలవారి అంతస్తునిబట్టి ఎక్కువరకాలు చేయించి పంపడమనే ఆచారంగూడ వుంది.

మాటవరుసకు పాదుషావారి మహల్లోకిగానీ, లేక ప్రత్యేకంగా పాదుషా వారి కోసమే పంపేటప్పుడు వందరకాల పిండివంటలుచేసి పంపాల్సిందే. అవేం ఊరికే తయారుగావుగా! అయిదువందలరూపాయలు ఖర్చుచేస్తే తయారవుతాయి.

అయోధ్య నేలిన వాజిద్ అలీషాహ్, తండ్రియైన అమ్జద్ అలీషాహ్ చాల సహృదయులు, ధర్మపరాయణులైన ప్రభువులు. వారికి అధికవ్యయమంటే గిట్టేది కాదు. ధర్మబద్ధులయి రాజ్యపాలన చేసేవారు. ఏపనిచేసినా రాజపురోహితుల అనుమతిలేకుండా చేసేవారుకాదు. వారు సుజనులు కాబట్టే ప్రజలధనాన్ని తమకోసం వినియోగించుకోవడం పాపంగా భావించేవారు. అందుకనే రాజ్యంలోని తమ మిత్రులందర్నీ తమకోసం విందు చెయ్యదల్చుకున్నవారు తినుబండారాలు పంపేబదులు వాటికోసం వ్యయం చేయదల్చుకున్న మొత్తాన్ని, ధనరూపంగానే పంపవలసిందిగా కోరారు. అందువల్ల ప్రజలు వంద పళ్ళాలనిండా వందరకాల పిండివంటలు పంపడమన్నది మానేసి, వాటికిబదులు అయిదువందలరూపాయల రొక్కం, ఏవో కాసిని భక్ష్యాలు పంపసాగారు.)

మిఠాయిలుపంపే పళ్ళాల సొగసునుగురించి చెప్పుకుతీరాల్సిందే. అవి కావడానికి కొయ్యపళ్ళాలే అనుకోండి. పళ్లెంలో బద్దలతోచేసిన గోపురంలాటి ఓ బుట్ట, అందులో ఈ మిఠాయిలుపెట్టి, ఆ బుట్టను మధ్యలో ఎవరు తెరిచిచూడకుండా, ఆ బుట్టకు నడినెత్తిన ఒక తెల్లని గుడ్డ పేలికకట్టి సీలు వేసేసేవాళ్లు. అది ఆనాటి ధనికులపద్ధతి. ఆ బుట్టమీద అందమైన పట్టుగుడ్డ కప్పేవాళ్లు. పళ్ళెంమీద కప్పేగుడ్డ పట్టుదిగానీ, జరీ పువ్వులదిగానీ, లేకపోతే జరీ నేసినదిగానీ కావచ్చు. అంతేకాదు. ఒక్కొక్కప్పుడు ఆ బుట్టకు నక్కి చమ్కీదారాలు వేలాడేసేవారు. లేదా ఆ బుట్టమీద రంగులతో పువ్వులు, లతలు చిత్రించేవారు.

(ఈ పద్ధతులన్నీ మొగలాయి దర్బారుల్లో ఎక్కువగా అమలు జరుగుతూండేది. తర్వాత ఆవిధానం లక్నోలో అమల్లోకి వచ్చింది. శిష్టాచారాలు లక్నోప్రజలు పాటించినంతగా ఢిల్లీలోగూడ కనబడదు. భోజనపానీయాలు మొదలయిన ప్రతి చిన్నవిషయంలోను శిష్టాచారాలు పాటించడమన్నది అప్పటివారికి నైజగుణమైపోయింది.

ఎవరైనా మామూలుమనిషివచ్చి మంచినీళ్ళిప్పించమని అడిగితే చాలు, వెంటనే పనివాడు పరిశుభ్రమైనగ్లాసుతో, ఆ గ్లాసును ఓ చిన్నపళ్లెంలోపెట్టి దానిమీద మూత పెట్టి ఎంతో ఆదరభావంతో మరీ తెచ్చియిస్తాడు.)

ఈ మంచిమంచి కట్టుబాట్లు శిష్టాచారాలవల్లనే నూరేళ్ళ ఈ మధ్యకాలంలో లక్నోలో ఘటికులయిన పాచకులెందరో సమకూడారు. భారతదేశంలో ఏమూల

తిరిగినా వాళ్ళకు తగినంతగౌరవము వుంది. అంతకుమించిన ఆదరణ వుంది. భారతదేశంలోని మహమ్మదీయరాజ్యాల్లోను, ఎస్టేట్లల్లోను నేను చూసినంతవరకు లక్నోకుచెందిన వంటమనుషులే కనిపించారు, అక్కడుండే ధనికవర్గంవారికి నవాబులకీ వాళ్ళమీద వల్లమాలిన సదభిప్రాయం, గౌరవభావమూను. ఆ మాటకొస్తే హైదరాబాదు దక్కను, భోపాల్, రాంపూర్లలో చెయితిరిగిన వంటవాళ్లు లేరని కాదు. ఉన్నారు. వాళ్ళంతా నిసలయిన లక్నోవాళ్ళుమాత్రం కారని. అయినా వారి పాకకళానైపుణ్యానికి కారకులు లక్నోవారేనని, వారంతా లక్నోకిచెందిన పాచకుల శిష్య ప్రశిష్యులని వారి భోగట్టాఅంతా తిరిగేస్తే తెలిసినవిషయం.

ఇక పాచకులవిషయం కట్టిపెట్టి, తినుబండారాల్నిగురించి ముచ్చటించుకుందాం. తినుబండారాలు చెయ్యడంలో హిందూ పాచకులది అందెవేసినచెయ్యి. వారుచేసే తినుబండారాలకు లోకంలో ఎనలేని ప్రసిద్ధి వుంది. అయితే మహమ్మదీయ పాచకులు హిందూపాచకులకేం తీసిపోరు. ప్రజలకు నచ్చేవిధంగా చేయడం వారికి మాత్రం తెలీదనా ! అదేం లేదు. వారూ వారూ సమఉజ్జీలే. మహమ్మదీయ పాచకులయితే కేవలం గొప్పింటివారికోసం వారి అభిరుచుల్నిబట్టి తినుబండారాలు చెయ్యడానికి అలవాటుపడ్డారు. వారుచేసే తినుబండారాల రుచి అమోఘం.

లక్నోలో ఈ పాచకుల్లోనే రెండురకాలవా రున్నారు. ఒకరు హిందువులు, రెండోవారు మహమ్మదీయులు.

అయితే మహమ్మదీయుల మిఠాయి దుకాణాల్లో అమ్మే తినుబండారాలు హిందూ పాచకులు చేసినంతరుచిగా వుండవు. కానీ మాకు ఫలానాది కావాలని కనుక ఆర్డరు చేస్తేమాత్రం బ్రహ్మాండంగా తయారుచేసి యివ్వగలరు.

ఈ తినుబండారాల్లో హిందువుల పిండివంటలేవో, ముసల్మానుల పిండివంటలేవో నిర్ధారణచేయడం కష్టసాధ్యమైనపని. కాని వాటిపేర్లనుబట్టి, వాటివాటి రుచుల్నిబట్టి మనం కనిపెట్టడానికి కొంతవరకు అవకాశముందనుకోండి. హల్వా అనేది ముఖ్యంగా అరబ్బుల పిండివంట. ఆ మాటకొస్తే ఈవిషయంలో అభిప్రాయభేదా లనేకం వున్నాయి. అది అరబ్, ఈరాన్‌నుంచి హిందూదేశానికివచ్చి స్థిరపడినా పేరు మార్చుకోలేదు. ఖ్యాతి పోగొట్టుకోలేదు. తర్ హల్వా అని మరో రకం హల్వా వుంది. దాన్ని పూరీలతోబాటు నంజుకుంటూ తింటారు. అది

ముఖ్యంగా హిందువుల హల్వా అట. దాన్నే వారు మోహన్‌భోగ్ అనికూడ అంటారు. హల్వా సోహన్‌లో పపడీ, జూజీ, హబ్షీ, దూధియా అని నాలుగు రకాలున్నాయి. వీటిని చేసే నేర్పరితనమంతా ముసల్మానులదనే చెప్పాలి. ప్రస్తుత దక్షిణభారతదేశంలో ముఖ్యంగా మద్రాసుప్రాంతంలో వాడుకలోవున్న అరబ్బీ హల్వా వుందే, ఆ రకం మనలు ఏ దేశానికిచెందిందో నికరంగా చెప్పలేం.

బాలూషాహీ, ఖుర్మేను క్తియాన్, గులాబ్ జామున్, ధరేబిహి శ్త్ మొదలైన పిండివంటలన్నీ మనకు మహమ్మదీయులపుణ్యాన దక్కినవే.

(జిలేబీని అరబ్బీలో జలేబియా అంటారు. ఆ జలేబియాయే ఆ నోట ఆ నోటపడి జలేబీ, జిలేబీగా తయారై కూర్చుంది. ఈ జలేబి అనేది అరబ్బుల పిండివంట. పేడా, ఇమరతీయా అనేవి నిసలైన హిందువుల పిండివంటలు. ఇమరతీ అనే తీపి పిండివంట మొదట్లో లక్నోవారే చేసేవారని వినికిడి.

ఈ తినుబండారాలవిషయంలో లక్నోలో చెప్పుకోతగినంత విశేషమేం లేదు. భారతదేశంలోని యితరప్రాంతాల్లో చేసే నానురొట్టే లక్నోలో చిత్రంగా చేస్తారు. లక్నోలో ఆగ్రా, పంజాబ్‌నుంచీవచ్చిన పాచకులంటే చాలగొప్ప. ఒక్క లక్నో లోనేకాదు. ఆ చుట్టుపట్లగూడ ఈ పాచకులకు అంత ప్రసిద్ధి.

ఈ పేరు ప్రతిష్ఠలనేవి వారి మిఠాయి దుకాణాల్లోని సరకు అమ్మకాన్నిబట్టి వాళ్ళకు దక్కింది. అమ్మకం పెరిగినకొద్దీ కొత్తతరహా మిఠాయిలు చేసేందుకు వారికో అదను చిక్కింది.)

(మిఠాయిలుచేసే పాచకుల్లో అగ్రస్థానం హిందువులదే. తినుబండారాలంటే హిందువులకున్నంత అపేక్ష మహమ్మదీయుల్లో కనిపించదు. బహుశా మహమ్మదీయులు మాంసాహారులు కనుక వాళ్ళకు సాధారణంగా ఉప్పనైన పదార్థాలంటేనే ఇష్టం కావచ్చు. వాళ్ళకు పూర్తి వ్యతిరేకం హిందువులు. చిరుతిండ్లంటే ఎక్కడ లేని అపేక్ష. అవి ఉంటే అన్నంగూడ అక్కర్లేదు. వాటిలోనే కడుపు నింపు కుంటారు. ఆపని ముసల్మానులవల్ల కానేకాదు.

హిందువులకు చిఱుతిండ్లంటే ఇష్టం కాబట్టే, అందుకుఫలితంగా మధుర, కాశీ, అయోధ్య మొదలయిన హిందూ తీర్థయాత్రాస్థలాలు క్షేత్రాలుగానే కాకుండా.

రుచికరమైన రకరకాల మిఠాయలకి మిగతాప్రదేశాలకంటే ఎక్కువ ప్రశస్తి గడించాయి.)

హల్వా సోహన్ చేయగల్గినవాళ్ళలో ఒక్క ముసల్మాను పాచకులేకాకుండా ఎందరో పేరు గడించినవాళ్లున్నారు. గొప్ప వ్రాయసకాడుగా ప్రసిద్ధిచెందిన లక్నో నివాసి మున్షీ హాదీ అలీ చివరికాలంలో పపడీహల్వా సోహన్ (సోహన్ పపడీ) చెయ్యడంలో సిద్ధహస్తుడని గొప్ప పేరు సంపాదించుకున్నాడు. ఆ సోహన్ పపడీ మీద చిత్రవిచిత్రాలయిన లతలు చిత్రించేవాడు. హల్వా సోహన్ చెయ్యడంతో బాటు అతని గొప్ప లేఖనకళ, నగిషీ పనితనం విశదమైనాయి.

పటియా బుర్జ్‌లో లక్నోకిచెందిన 'మున్షీ సుల్తాన్ బహాదుర్' అనే గొప్ప యింటి ఆసామి ఒకరు ఈ సోహన్ పపడీ చెయ్యడంలో మహా ఘటికుడు. ఆయన తయారుచేసిన సోహన్ పపడీ లేత పసుపుపచ్చని వర్ణంలో మిలమిల్లాడుతూ పట్టు కుచ్చుల్లే వుండేది.

# 28

వంటలు వార్పులు, వాటిలో వచ్చిన మార్పులు చేర్పులగురించి, వంటమనుషుల గురించి వీలయినంతవరకు చెప్పడమైంది. ఇకపోతే వంటకాలరుచి, వాటి అమరికనుగురించి ముచ్చటించుకోవాల్సి వుంది. ఆసియా దేశాలన్నిట్లోను భోజనపదార్థాల శుచికి రుచికి పెట్టిందిపేరు. కంటికింపైతేగాని కడుపు కింపుకాదన్న సామెతగా వారికి భోజ్యపదార్థాలన్నీ చూపులకు సుందరంగా కనబడాలి. తింటే రుచిగాను వుండాలన్నమాట. అందువల్లనే భారతదేశంలో ఏ ప్రాంతీయులయినాసరే, భోజనప్రియులు కనుకైతే వారు ఈ విషయాలపట్ల మిక్కుటమైన శ్రద్ధచూపడం ఉండనే వుంది. అయితే అందరూ వోయెత్తు, లక్నోవారొక్కరూ వోయెత్తూను. ప్రతి పనిలోను, ప్రతివిషయంలోను, వారు మిగతాప్రదేశాలవారికంటే అగ్రగాములై వుంటారన్నది అక్షరాలా నిజం. 'జిహ్వాకో రుచి, పుణ్జెకో బుద్ధి' అన్న నానుడి లక్నో

వారికే చెల్లింది. ఇక్కడెంతో మంచి వంటమనుషులు దొరుకుతారు. వడ్డించే మనుషులు దొరుకుతారు. కానీ, సాంప్రదాయకమైన కుటుంబాల్లో సదాచారపరులైన వారియిళ్లలోని స్త్రీలు, వంటలో, వడ్డనలో ప్రతిపనీ పౌందికగా చెయ్యడంలో చెయితిరిగిన వంటమనుషులకంటె గొప్పగా చెయ్యగలరు. గొప్పయింటిస్త్రీలలో వంట చేతగానివారంటూ ఉండనేవుండరు. పైగా అందరికంటె ఎక్కువగా రకరకాల వంటకాలు చెయ్యడంలో ఆరితేరినవారై వుంటారు.

వంట చెయ్యడంకంటెగూడ ముఖ్యమైంది వండినతర్వాత ఆ వండినపదార్థాలన్నిటిని పొంకంగాపెట్టి అందంగా అమర్చడంలోనే వుంది గొప్పతనమంతా. యూరప్‌లో ఇప్పటి పద్ధతేమిటంటే అందమైన బల్ల ఒకటి వేస్తారు. దానిమీద అక్కడక్కడ పూలకుండీలు పెడతారు. కొన్నిచోట్ల కొందరు, బియ్యపుగింజలు రకరకాలరంగుల్లో కలిపి, వాటితో ఆ బల్లమీద అందంగా తీగెలు లతలు చిత్రించడం, లేకపోతే అతిథులపేరు రాసిపెట్టడమనే పద్ధతి వుంది. వంటనపదార్థాలు పెట్టే పాత్రలన్నీ ఎంతో విలువైనవై ఉంటాయి. సామాన్యంగా వాళ్లు వెండిపాత్రలనే ఎక్కువగా ఉపయోగిస్తారు. ఇంగ్లీషువారి వంటమనుషులూ, వడ్డించేవారూ పదార్థాల అమరికవిషయం అంతగా పట్టించుకోరు. వారల్లా పెళ్లిళ్ళప్పుడు 'కేకు' అమర్చడంలోనే ఘటికులు. గొప్ప ప్రభువులయిళ్ళలోను, శ్రీమంతులయిళ్ళలోను పెళ్ళిళ్ళు జరిగితే, అక్కడ గోపురాలమోస్తరుగా, అందమైన భవనాల ఆకారంలోను కేకులు తయారుచేసి డిన్నర్ టేబిల్‌మీద గొప్పగా అమర్చిపెడతారు.

భారతదేశంలో భోజనపదార్థాలు అమర్చిపెట్టే దస్తర్‌ఖాన్ అనే దంపఖానా పరిశుభ్రతవిషయం పట్టించుకోనే పట్టించుకోరు. ఎంతసేపు భోజనపదార్థాల శుచి రుచి అమరికే చూస్తారు. ఆ పదార్థాలకు వెండి, బంగారురంగుల వర్కుకాగితాలు చుడతారు. పిస్తాపప్పులు, చిత్రవిచిత్రాలయిన లతలు పువ్వులు తీర్చి దిద్దుతారు. ఇంకా కొబ్బరిముక్కలు రకరకాలుగా కత్తిరించి అందంగా అమరుస్తారు. ఈ అలంకరణ చెయ్యడంలో వడ్డనచేసే మనుషులసమర్థతే సమర్థత. భోజ్యపదార్థాలన్నీ ఎంత గొప్పగా పచనంచేస్తారో అంతటి నేర్పరితనంగాను, ఆ పదార్థాలన్నిటిని పళ్ళాల్లో సొగసుగా అమర్చి, ఒక్కొక్కపళ్ళాన్నీ ఒక్కో పూలకుండీలా తయారుచెయ్యడంలో అచటి వడ్డనచేసేవాళ్లు చాలా ఘటికులు.

పెషావరులోని వంటమనుషులు, వడ్డనచేసేవారు ఈపద్ధతుల్ని లక్నోలో ప్రవేశ పెట్టారు. ఈపద్ధతిగా భోజ్యపదార్థాలు పళ్ళాల్లో అమర్చుకోడమంటే, ముఖ్యంగా గొప్పయింటిస్త్రీలకే చెప్పలేనంత అభిరుచి ఏర్పడింది. ఇక ఆ అమరికలో చెయి తిరిగిన వడ్డనవాళ్ళనిగూడ మించిపోయి, ఆ కళను వారు తమ సొంతం చేసేసుకున్నారు. లలితకళల్లో నిజంగా స్త్రీలకే ఎక్కువ అభినివేశముంటుందని యూరప్ లోని పరిశోధకవర్గంవారు నిర్ణయించారు. ఏ వస్తువునైనాసరే, ఎంతో పొంకంగా తీర్చిదిద్ది, అమర్చడంలోను, అభిరుచిలోనుగూడ స్వాభావికంగా పురుషులకంటె స్త్రీలదే పైచేయనాలి. భోజ్యపదార్థాల్ని అందంగా అమర్చేకళలో లక్నో స్త్రీలే భారత దేశానికి ఆదర్శప్రాయులు.

భారతదేశంలో పెళ్ళిళ్ళప్పుడు పెట్టే కేకునుగురించిన ప్రస్తావన ఇంతకుముందే వచ్చిందిగదా. సాధారణంగా సంప్రదాయాన్నిబట్టి పెళ్ళిళ్ళలో పెళ్లికొడుకు, పెళ్లి కూతురుముందు పెట్టేకేకుని ఆ యింటి ఆడవాళ్ళే తయారుచేస్తారుగాని, ఎవ్వరిచేత చేయించరు. వాళ్లు ఆ కేకుని ఎంత చక్కగా ఎంత నేర్పరితనంగా చేస్తారో చెప్పలేం. ఆ అమరిక అదీ చూసినకొద్దీ చూడబుద్ధిగా వుంటుంది.

భోజ్యపదార్థాల అమరికనుగురించి ఇలాగా ముచ్చటించుకున్నాం కనుక, ఇక్కడ మంచినీటి సదుపాయంలోవచ్చిన మార్పులగురించిగూడ చెప్పుకోవడం అవసరమే కాదు ఆసక్తి జనకంగాను ఉంటుంది. మంచినీటి సదుపాయమంటే పాదుషాలకు, అమీర్లకు మంచినీళ్ళందించేందుకు ప్రత్యేకంగా మనుషులుంటారు. కొన్నిఋతువుల్లో చల్లనినీళ్ల అవసరం ముఖ్యంగా వుంటుంది. ఆ కాలంలో మంచుగడ్డ దొరికేదికాదు. అందుకని ఆ రోజుల్లో వాళ్లు నీళ్ల చల్లబడేయడానికి కొన్ని ప్రత్యేకమైనపద్ధతులు ఏర్పరచుకున్నారు. నీళ్లు మామూలుకుండల్లో పోసి పెట్టుకునేవాళ్లు. నీళ్లు ముంచుకు తాగడానికని, మట్టితోచేసిందే మరో గిన్నె, చెంబో పెట్టుకునేవాళ్లు. ఆ కుండమీద చెంబుమీద ఎర్రనిబట్ట ఒకటి తడిపి, ఆ తడిబట్ట కప్పేవాళ్లు. తడిబట్టకు గాలితగిలితే కుండలోనినీరు బాగా చల్లబడిపోతుంది. ఎంత వేడిగాలిగాని, వడగాడ్పుగాని, తడిబట్టతగిలితే వేడిపోయి చల్లబడి పోతుంది. అటువంటి తడిబట్ట చుట్టినందువల్ల ఆ కుండలో నీళ్ళుగూడ చల్లబడతాయి. అంతేగాదు, ఘుంయురియా అనే కూజాల్లోను, కుండల్లోను, నీళ్ళుపోసి,

వాటిమూతులు గట్టిగా బిగించి వాపినగట్టి ఏ చెట్టుకొమ్మకో వాటిని తలక్రిందుగా వేలాడదీసేవాళ్ళు. వాటిలోపలికి గాలి చొరదుకాబట్టి, నీళ్ళు ఒలికిపోకుండా వుంటాయి. బాగా చల్లబడతాయి. వర్షాకాలంలో అయితే, ఒకవేళ ఈ ఉపాయం వల్ల ప్రయోజనం కనబడకపోతే, నీళ్ళు చల్లబడటంకోసం తరుచుగా కుండలు నీటితోనింపి వాటిని నూతిలోకి వేలాడదీసేవారు.

ఇంతేకాదు, ఇంకా చాలవాల ఉపాయాలు చేసేవారు. అదివరకురోజుల్లో నాజూకైన సత్తుకూజా లుండేవి. ఆ కూజాలో పెట్లుప్పు (సురేకారం) వేసి ఆ పైన నీళ్ళు పోసి కలయతిప్పేవాళ్ళు. అలా చేసినందువల్ల కొద్దిసేపయ్యేసరికి నీళ్ళు చల్లగా వడగళ్ళల్లే తయారై ఎంతో హాయినిచ్చేవి. ఈ విధానాన్ని 'కూజాల గలబరింపు' అంటారు.

ఆ తర్వాతకాలంలో మంచు తయారుచేసేందుకో మంచిమార్గం కనిపెట్టారు. అదేమిటంటే, గడగడలాడించే చలిరోజుల్లో, పొలాల్లోను, ఆరుబయట ప్రదేశాల్లోను రాత్రిళ్ళు మట్టిచిప్పల్లోగానీ, గిన్నెల్లోగానీ వేడివేడినీళ్ళు పోసిపెట్టేవారు. తెల్లవారేసరికి నీళ్ళన్నీ చలికి పేరుకుపోయి గడ్డకట్టివుండేవి. ఆ మంచుగడ్డను వెంటనే దాంట్లోంచి తీసి, ఆ పక్కనే తీసివుంచిన గోతిలోవేసి మట్టి కప్పేసేవాళ్ళు. అలా కప్పి వుంచినట్లయితే అది కరిగిపోకుండా యథాప్రకారం ఉంటుందన్నమాట. ఈ ఉపాయంవచ్చాక సంవత్సరానికి సరిపడ మంచు ఒక్కసారి తయారుచేసుకుని, దాచిపెట్టి ఉంచుకోడం మొదలెట్టారు. ఏ రోజుకి కావలసినంత ఆరోజు అందులో నుంచే తీసుకుంటూండేవాళ్ళు. అయితే ఇలా నిలవచేసివుంచి వాడుకునే మంచుగడ్డ ఏమంత శుభ్రంగా వుండేదికాదు. నిలవ ఉంచకుండా వెంటనే వాడినా, లేకపోతే, పెట్లుప్పు వేసుకుంటే ఆ చల్లదనమే ఎంతో బావుండేది.

అయితే ఈపద్ధతి కేవలం పాదుషాలకి, లేక గొప్ప స్థితిమంతులయినవారికీ మాత్రమే పరిమితమైంది. పేదవాళ్ళకీపద్ధతి లాభసాటి కాలేదు. పేదవాళ్ళు, మధ్యతరగతివాళ్ళు, నీళ్ళచల్లదనంకోసం మిగతావిధానాల్నే అమలుజరుపుకునేవాళ్ళు. ప్రతియింట కాపినో కూపినో చల్లటినీళ్ళు నిలవబెట్టుకునేవాళ్ళు. ఈపద్ధతి వారికి సర్వసాధారణమైపోయింది.

లక్నోలో వెనకటిరోజుల్లో పైన చెప్పినవిధానాలన్నీ అమల్లో వుండేవి. తర్వాత ఆ సత్తుకూజాలకి, మట్టికూజాలకి, అందంగా లేసువేసిన గోనెగుడ్డ (టూల్‌కా

కపడా) కప్పిఉంచడం మొదలెట్టారు. అదో తరహా అందంగా కనబడేది. నీళ్ళు తాగడంమాట అలావుంచి, ఆ పాత్రచూస్తేనే ప్రాణం లేచివచ్చినట్టుండేది.

ఈమాదిరి చల్లటి నీటిసదుపాయం ఢిల్లీలోగూడ ఉండేదో లేదో నాకంత బాగా తెలీదు. అక్కడా వుండేవుండవచ్చు. అక్కడినుంచే లక్నోకి వచ్చిందేమో. ఈ పెట్లుప్పు వాడటం లక్నోలో చూశాను. ఢిల్లీలో నాకెక్కడా కనబడలేదు. కానీ, లేదు అని నిర్ధారణచేసి చెప్పడానికి వీలుకాదు. లక్నోలో మట్టిపాత్రలు ఎంతెంత అందమైనవి, సొంకమైనవి తయారయ్యేవో చెప్పలేం. అక్కడి మట్టి మంచిదే కావడంగూడ వో సుగుణమైంది. అందుకే అంత చక్కనిపాత్ర సామగ్రులక్కడ తయారుచేయగలిగారు. అంత పలితనమున్నపాత్రలు మరెక్కడా దొరకవు. ఢిల్లీలో అంతమంచి సత్తుకూజాలు కావాలంటే దొరుకుతాయిగానీ, మట్టికూజాల అందం చూడాలంటే లక్నోలోనే చూడాలి. అంతటిభాగ్యం ఢిల్లీవారికి దక్కలేదు. మట్టిపాత్రలగురించి ముందుముందు ప్రసక్తి వచ్చినప్పుడు ముచ్చటించుకోవచ్చు.

పాదుషాలు వెళ్ళినచోటికల్లా వెంట ఒక వంటమనిషిని, నీళ్ళమనిషిని తీసుకు వెళ్ళేవారు. రానురాను శ్రీమంతులంతాకూడ నీళ్ళమనుషుల్ని నీళ్ళందించేందుకు పెట్టుకోడం అలవాటు చేసుకున్నారు. వాళ్ళెప్పుడూ గొప్పవారివెంట ఉండాల్సిందే. మిర్జా హైదరలీ ఖాన్‌వెంట ఎప్పుడూ నీళ్ళమనిషి, హుక్కా అందించేమనిషి ఎక్కడికివెళ్ళినా వుండాల్సిందే. వెళ్ళినచోటల్లా అక్కడకు వచ్చినజనాభాకి వాళ్ళుచేసే ఉపచారాలు ఇంతా అంతా కావు. పెళ్ళిళ్ళకి వెళ్ళినా సమావేశాలకి వెళ్ళినా మంచి నీళ్ళు, హుక్కా వాళ్ళఅధీనంలో వుండేవి. జనం అడక్కుండా, కనుక్కుని అందించేవాళ్ళు. అటువంటివాళ్ళు ఒకచోట ఒనగూడటం అదృష్టమే.

# 29

ఇప్పుడిక లక్నోవారి వస్త్రాలంకరణగురించి ముచ్చటించుకుందాం. అది చాలా ఆసక్తిజనకంగా వుంటుంది.

మొదట అరబ్బునుంచి ఇక్కడికివచ్చిన ముసల్మానులు పొట్టిచేతులు చొక్కా, లుంగీ, లాల్చీగాని ధరించేవాళ్ళు. దుస్తులవిషయంలో వారు ఇక్కడివారినేం మించి పోయింది లేదులెండి. అయితే సాసానీ అనే పారసీ రాజవంశీయుల సంస్కృతి బాగ్దాదులోని అరబ్బు రాజదర్బారులో ప్రవేశించాక అక్కడుండే పెద్ద మనుషులంతాకూడ పైజామాలు, లాల్చీలు తొడగడం, అందమైన పగడీలు ధరించడం ఆరంభించారు. అప్పటినుంచే అసలు వారిదుస్తుల్లో మార్పు ప్రారంభమైందని చెప్పాలి. వారుధరించే దుస్తులవిధానమంతా సాసానీ రాజవంశీయులు, వారి సర్దార్లు ధరించేదుస్తులకు నకలేగాని మరొకటికాదు. అప్పట్లో ముసల్మానులంతా ఆ రకందుస్తులే ధరించేవారు. ఆ వస్త్రాలంకరణ ఈజిప్టునుంచి సింధునదీతీరం వరకు పాకిపోయింది. ఆ వేషభాషలతోనే వారు మనదేశానికి వచ్చారు. ఆనాటి చిత్రపటాలుచూస్తే అప్పటి పాలకుల వస్త్రాలంకరణ స్పష్టమౌతుంది. దాదాపు ఆనాటి ఈరానీలు, అబ్బాసీ అమీర్లు, పాలకుల దుస్తులవంటిదుస్తులే ధరించేవారు. ఏమంత పెద్దతేడాకూడ లేదు. ఇక్కడి సుల్తానులు రాజుల్ని అనుకరిస్తూ రత్న మాణిక్యాలన్నీ ఎక్కువ సింగారించుకునేవారు.

ఢిల్లీలోని మొగలాయి దర్బారు చివరిదశలో వారు తలకు పగిడీ, ఒంటిన ఓ బురఖా, పాదాల్ని తాకుతూ పీలమండవరకు ఉండే పైజామా, కాళ్ళకు ఎత్తుమడమల చెప్పులు ధరించేవారు. ఆ బురఖామీద నడుముకి పట్కా పెట్టుకునేవారు. పూర్వకాలంలో ఢిల్లీలోని పెద్దమనుషుల వేషాలంకరణ అంతే. మహమ్మదుషా రంగీలే కాలంవరకు ఈ దుస్తుల్లో ఏవిధమైనమార్పు రాలేదు.

( ఈ దుస్తుల్లో బురఖానే వారు 'సీమాజమా' అంటారు. ఆ సీమాకి మోచెయ్యి దాకా ఆ చొక్కా చేతులుంటాయి. ఛాతీవేపున విచ్చుకుని వుంటుంది. గుండీలు పెట్టుకుంటారు. పైజామా కట్టుకుంటారు. ఆ చొక్కా పైజామా లోపలికి వేసుకుంటారు. దానిపైన బురఖా వేసుకుంటారు. ఈరానీల బురఖా కొంచెం మార్చి వీళ్ళో తరహా చొక్కా తయారుచేసుకున్నారు. దీనికి మెడపట్టీ వుండదు. అయితే ఆ చొక్కాకు రెండుపక్కలవుండే కొంగులు అయిమూలగా కత్తిరించబడే వుంటాయి. ఆ రెండుకొంగుల్ని ఒకదానిమీద ఒకటివేసి తెరుచుకోకుండా గుండెలవేపు కప్పేస్తారు. ఛాతీ పైభాగం గొంతుకిందభాగం ఇంగ్లీషువారి కోటుమోస్తరుగా తెరుచుకునే వుంటుంది.

సీమా అనే చొక్కా అయితే కప్పుచేతుల చొక్కాలాగా, ఛాతినిమూసి నిండుగా వుంటుంది. ఈ రకంచొక్కాలో ఎడమవైపునుండే కొంగు కిందగా వుంటుంది. కుడివైపునవుండే కొంగుతెచ్చి దానితోజోడించి, చిన్నచిన్న బొందులతో కట్టేసు కుంటారు. నడుముచుట్టూ గౌను కుచ్చెళ్ళుమాదిరిగా పెట్టివుంటాయి. ఆ సీమా అనే బురఖా చీలమండదాకా వేలాడుతూవుంటుంది. చాలా కుచ్చెళ్ళుంటాయి. అది చాల వెడల్పుగాను వుంటుంది. ఆ బురఖా చేతులుమాత్రం మోచేతిదాకానే వుంటాయి. అవీ కుట్టకుండానే వుంటాయి. రెండువేపుల వేలాడుతున్నట్టుంటాయి. ఆ బురఖా కింద, వాళ్లు ఇరుకుకాళ్ళున్న పైజామా ధరిస్తారు. గొప్పవాళ్లు కనుకైతే పట్టుదిగాని, నూలు పట్టు కలనేతదిగానీ పైజామా తొడుక్కుంటాడు. ఆ బురఖామీద నడుముకు పట్కా పెట్టుకుంటాడు.

రెండుమూడు శతాబ్దాలకుపూర్వం ఈ దేశంలోని గొప్పవాళ్లు, పెద్దమనుషులు అంతా ఈ రకందుస్తులే ధరిస్తూండేవాళ్ళు. ఈ టోపీల్లోను, పగిడీల్లోను, పైజామా ల్లోను వచ్చినమార్పులగురించి, దిద్దుబాట్లనిగురించి తర్వాత వివరంగా చెప్పు కుందాము. ప్రస్తుతం ఉడుపుల్నిగురించిమాత్రం మాట్లాడుకుందాం. ఆనాడు వారు ధరించినదుస్తులే చరిత్రాత్మకమైన దుస్తులు. అవే పరిపాలకుల దుస్తులు. నవాబు బుర్హాన్ ముల్క్ మంసూర్‌జంగ్, షుజా ఉద్దౌలా అయోధ్యకు ప్రభువులై వచ్చి నపుడు ఆ దుస్తులే ధరించారు. జామా అనబడు బురఖా ముఖ్‌మల్‌తో కుడతారు. హిందూదేశంలో అన్ని మహానగరాల్లోను నాణెమైన, నాజూకైన, సున్నితమైన ముఖ్‌మల్‌బట్ట దొరుకుతుందని ప్రపంచప్రఖ్యాతి వుంది. ఢాకా ముఖ్‌మల్, తర్వాత కలంకారీ పనితనమున్న బట్టలు. ఉన్నతవర్గాలవారు, శ్రీమంతులు, పాదుషాలు ధరించేవారు.

తర్వాత ఈరానీలచొక్కాకు నకలుగా ఒకరకమైన అంగరఖా తయారయింది. దానిమెడ, మెడపట్టీ లేకుండా పూర్తిగా తెరుచుకునివుంటుంది. దానికింద సీమా అనే చొక్కా వేసుకుంటారు. అది ఛాతీ కనబడకుండా కప్పుతుంది. ఈ పైన తొడుక్కున్న అంగరఖా తెరుచుకునే వుంటుంది. ఆ అంగరఖా కుచ్చెళ్లులేకుండా సాదాగా వుంటుంది.

గౌనులాగా అది తెరుచుకోకుండా మూసుకునేవుండాలనే కుచ్చెళ్లు అన్నీ తగ్గించేశారు. ఆ అంగరఖాకు కుడివేపునున్న కొంగుకు ముక్కోణంగా ఒక బట్ట అతుకు వేస్తారు. దాన్ని 'కలీ' అంటారు. ఆధునికపద్ధతుల్లో తొడుక్కునే ఆ చొక్కానే షేర్వానీ అంటారు. షేర్వానీ అనేదిగూడ ఒకరకం బొందులచొక్కాయే. ఇప్పుడవన్నీ తీసేసి కొక్కాలు పెట్టుకుంటున్నారు. బాలాబర్ అని మరోరకం అంగరఖా వుంది. దాన్ని ఢిల్లీవారు సృష్టించారు.)

ఈ అంగరఖారూపంగూడ మారి ఢిల్లీలో మరోరకం అంగరఖా తయారైంది. పూర్వపు జామా అనబడే బురఖా, బాలాబర్ అనే అంగరఖా రెండింటియొక్క సమ్మేళనమే ఢిల్లీవారి అంగరఖా. దాని పైభాగమేమో బురఖా మాదిరిగావుండి. ముందువేపు మెడ తెరుచుకుని, గుండ్రని పెద్ద మెడపట్టీ వుంటుంది. మెడ, కంటె మెడగా వుంటుంది. మెడదగ్గర ఎడమవేపున పట్టీకి గుండీ పెట్టుకుంటారు. ఆ అంగరఖాకి ఇరువైపులఉండే కొంగులు కలిపి ఛాతీకి కొంచెం దిగువను, మధ్య మధ్య తాళ్ళతో ముళ్లు వేసుకుంటారు. ఎడమవైపునమాత్రం గుండెలదగ్గర కొంచెం తెరుచుకునివుంటుంది. పూర్వపు బురఖామోస్తరే వుంటుంది. దానికి నడుముకి ఇటు అటు కుచ్చెళ్లుంటాయి.

అదే ఢిల్లీలో చివరిదశలో వాడుకలోవున్న పూర్వకాలపు అంగరఖా. అది హిందూదేశమంతటా ఎంతో వ్యాప్తిచెందింది. లక్నోవచ్చినతర్వాత ఈ అంగరఖా వదులుగావుండకుండా ఇరుకుగాను, కత్తిరింపుకూడ కొంచెం మారింది. అంగరఖా పైభాగం వృత్తాకారంగా వుండి, బిగుతుగా వంటికి పట్టివుండేది. పక్కనుండే కుచ్చెళ్లు తీసేశారు. అంగరఖాకుండే రెండుకొంగులు మడిచికుట్టడానికిబదులు. గోటు వేసి కుట్టివుండేది. నవాబు సంతతివాళ్లు అంగరఖాలంటే మోజుపడేవాళ్లు. నడుము దగ్గర ఒక పట్టీకాకుండా అర్ధచంద్రాకారంగా మూడు మూడు పట్టీలు వేయించుకునే వాళ్ళు. అడుగడుగున గోట్లు, కత్తిరింపులు వుండేవి.

(ఢిల్లీలో అంగరఖా వచ్చాక బురఖాలువేసుకోవడం తగ్గించేశారు. ఆ అంగరఖా ఛాతీదగ్గిర ఎడమవైపు తెరుచుకునివుండటంగూడ ఒక ఫాషన్‌కింద తయారైంది. లక్నోలో అంగరఖాకింద సీమా బదులు శలూకా అనే పొట్టిచేతులచొక్కా తొడుక్కునేవాళ్లు. శలూకా అనేది ఇప్పటి టీ షర్టువంటిదై వుండాలి. దానికి ముందు గుండీ పెట్టుకుంటారు. ఈ గుండీలు యూరప్‌నుంచి ఇక్కడికి వచ్చాయి.

'శలూకా' అనబడే చొక్కాలుగూడ ఫాషన్‌గా వుండేవి. నాజూకుమనుషులు దోమతెరగుడ్డలాటి చిల్లులబట్టతో బిగుతైన శలూకాలు తొడుక్కునేవాళ్లు. వాటిమీద దారాలతో అందమైన లతలు పూలు కుట్టించుకునేవారు. కొందరు రంగురంగుల శలూకాలు తొడిగేవారు. వానిమీదచేసిన పనితనము ఆ తెల్లని అంగరఖాలోపలనుంచి అందంగా కనబడుతూ ఎంతో ఆకర్షణీయంగా వుండేది.)

బాలాబర్ అనే బరఖా లక్నో దర్బారుకి వచ్చినతర్వాత రూపం మారింది. పువ్వులబట్టతోకుట్టిన లాల్చీమాదిరిగా తయారైంది. దానికికూడ గుండ్రటి మెడపట్టీ వుండేది. దానికి అంగరఖావలెనే ఛాతీమీదనుంచి కిందవరకూ పరదాలాగా పొడుగ్గా వుంటుంది. ఆ పరదా కుడివైపుకి అర్ధ వృత్తాకారపద్ధతిగావుండి అక్కడ గుండీలుంటాయి. కుడివైపున మెడదగ్గరనుంచి ధనురాకారంలో గుండీలు వరుసగా నడుంవరకు వుంటాయి. దానికి రెండోవేపున అర్ధ వృత్తాకారంగా గుండీలు కుట్టి వుంటాయి. వాటికి పెట్టి అనబు గుండీలు నొక్కుతారన్నమాట. దానికిగూడ బాలాబర్ అనే బరఖామోస్తరుగానే వెడల్పయిన కలీ (పక్కతునక) జోడిస్తారు. దానికి గుండీ పెట్టుకుంటారు. చలికాలానికిగూడ పనికివస్తుందని ఈ పువ్వుల చొక్కా బాగా మందపాటిబట్టతోనే కుట్టిస్తారు. ఒకానొకకాలంలో ఇక్కడ రాజోద్యోగులు మొదలయినవారంతా ఈ ఉడుపులే గొప్పగా ధరించేవారు. ఇంగ్లీషువారికి గూడ ఈ దుస్తులెంతో నచ్చాయి. వారి పనివారంతాగూడ చాలాకాలంవరకు ఈ రకందుస్తులే ధరించేవారు.

(ఇవన్నీ అయినతర్వాత చివరిదశలో లక్నోలో మరో కొత్తతరహా చొక్కా బయలుదేరింది. అదీ ఒకమోస్తరు అంగరఖాయే. దానికి అంగరఖాకి ఉన్నట్టు మెడ పట్టీ వుంటుంది, స్లాక్‌మాదిరిగా మధ్యను తెరచుకునివుంటుంది. రెండువైపుల అంచులకు గోటువేసివుంటుంది. ఆ గోటువేసేబట్టతోనే గుండ్రనిమెడపట్టీ వుంటుంది. ఆ పొడుగుపొడుగు వరుసగా గుండీలు పెట్టుకుంటారు. అంటే మెడ దగ్గర్నుంచి నడుంవరకు గుండీలుంటాయి. పైభాగంలో జోడించే పక్కతునక (కలీ) ఈ అంగరఖాకి అడుగునుంచీ పైకి వేసివుంటుంది. అప్పుడైతే అది తెరచు కోకుండా వదులుగా వుంటుంది. పక్కతునక పైభాగంలోవేస్తే దానిఆకారం రోతగా తయారవుతుందని, అది లేకుండావుండటానికి అలా చేసేవారు. ఈమాదిరి

చొక్కాను వారు అచ్కన్ అంటారు. ఈ అచ్కన్ కిందభాగము అంగరఖాలాగానే వుంటుంది.

ఇష్టమున్నవాళ్లు ఆ చొక్కాకుకూడ గోటు వేయించుకోడం, నడుముదగ్గర పిల్లలు వేయించుకోడం అక్కడక్కడ చింపులు పెట్టించుకోడమూ వుంది.

ఈ అచ్కన్ అంటే జనానికి అప్పట్లో చాలా మోజుగావుండేది. ఇదసలు మొట్ట మొదట పట్టణాల్లోంచి బయల్దేరి పల్లెలవరకు పాకింది. అంతేకాదు, హిందూదేశ మంతటా ఎక్కడచూపినా ఈ అచ్కన్ చొక్కాలే. ఎవరిఒంటిమీదచూపినా అవే నన్నమాట. తీరా ఈ అచ్కన్ హైద్రాబాదువెళ్లి షేర్వానీగా మారికూర్చుంది. ఈ షేర్వానీ చేతులు ఇంగ్లీషువారు తొడిగే కోటుచేతులమాదిరివి. మెడపట్టీచుట్టూ గోటు, ఆ గోటు ఛాతీవరకు దిగివుంటుంది. ఆ ఘాషనంతా తీసేశారు. ఆ కత్తిరింపుగూడ ఇంగ్లీషువారి కోటు చెంగులకులాగానే కత్తిరించడం జరిగింది. మనదేశంలోని హిందువులు, ముసల్మానులు అందరు ఈ షేర్వానీ ధరించడానికి అలవాటు పడి పోయారు. దీన్ని జాతీయమైన వస్త్రాలంకరణ అని చెప్పవచ్చు. లక్నోవారుకూడ తాము కనిపెట్టిన (అచ్కన్) చొక్కా హైద్రాబాదువెళ్లి, ఆమాదిరిగా మారడం చూపి ఆనందించారు. ఆ మార్పు సముచితమనే భావించారు. చాల యిష్టపడ్డారు గూడాను. అనతికాలంలోనే అందరితోబాటు లక్నోలోనివారుకూడ షేర్వానీ తొడగడం మామూలై పోయింది.

అంగరఖాలోపల 'శలూకా' అని పొట్టిచేతులచొక్కా ఒకటి తొడుక్కునే వారు. దానికిబదులు అంతకుమునుపు పొదులుపాటి ఓ చొక్కా, మెడదూర్చి తొడుక్కునే చొక్కా తొడిగేవారు. కొంతకాలంపోయాక పాశ్చాత్యనాగరికతా ప్రభావం సోకినందువల్ల ఆ చొక్కాతొడగడం మానేసి, ఇంగ్లీషువారి షర్టు (కమీస్) కప్పు, కాలరువుండే చొక్కా తొడగడం ఆరంభించారు. షర్టుకుండే కాలరుచూశాక, షేర్వానీపై ఖరిలో మరో కొత్తతరహా ప్రారంభమైంది. షర్టుకుండే కాలరు షేర్వానీ పైకి కనబడేట్టు వేసుకునేవారు. చేతులేమో కప్పుకంటే కొంచెం కిందకే వుండేవి. విద్యావంతులు, మధ్యతరగతివారు మిగతాప్రదేశాల్లోవలెనే లక్నోలోను షేర్వానీ ధరిస్తారు. అయితే ఈ షేర్వానీ లక్నోవారి సృష్టికాదుకదా: వారిసృష్టి అచ్కన్ అనే చొక్కా వరకే. దాంతోనే ముగిసిపోయింది.

# 30

దుస్తుల్నిగురించి చెప్పడమైంది. ఇప్పుడిక తలకి చుట్టుకునే పగిడీలు, పాగాలు, పెట్టుకునే టోపీల్నిగురించి చెప్పుకోడం ఎంతైనా అవసరం. ఎందుకంటే శరీరావయవాల్లోకెల్ల తలని ఉత్తమాంగమంటారు. కాబట్టి తలకి ధరించే టోపీలు వగైరాల్నిగురించి చెప్పుకోడం ముఖ్యంకదా మరి. ఈదేశంలో వీటికి గౌరవం హెచ్చు.

ప్రాచీనకాలంలో భారతదేశంలో పగిడీ ధరించే ఆచారం వుండేది. అరబ్, ఈరాన్‌లనుంచి ఇక్కడికివచ్చి స్థిరపడి పరిపాలనచేసిన ప్రభువులుగూడ తలకి పగిడీలు, పాగాలు ధరించేవాళ్ళే. ఇక్కడికి వచ్చినతర్వాత, ఏవేవో మార్పులు వచ్చాయనుకోండి. అయితే, ముసల్మానులు భారతదేశం రాకపూర్వం, ఇక్కడ ఈ పాగాలు ధరించేఆచారం ఉండేదికాదా? ఈ పగిడీలు లేవా? అంటే లేవని చెప్పడానికి మాత్రం వీలులేదు.

ప్రారంభదశలో మహమ్మదీయప్రభువులు పెద్దపెద్ద తలపాగాలు ధరించేవాళ్ళు. అందువల్ల అప్పట్లో అక్కడుండే పేరుగల పెద్దలు, సామంతులు, శ్రీమంతులు కూడ పెద్దపెద్ద పాగాలు చుట్టుకోడం రివాజయింది. ఆ పాగాకింద టర్కీవారి మొన తేలిన టోపీ (దాన్నే కుల్లాయంటాము) గానీ, లేకపోతే శంఖాకారంగావుండే టోపీలు గానీ పెట్టుకునేవాళ్ళు. ఆ టోపీలు ఇప్పటికి అఫ్ఘనిస్తానంలో ఎక్కువ వాడుకలో వున్నాయి. మన భారతీయసైనికులు ధరిస్తూంది ఆ టోపీలే.

మహమ్మదీయుల పరిపాలనాకాలంలో పాగాలు, పగిడీలు ఓ రోజుకంటే ఓరోజు క్రమంగా చిన్నవికావడం మొదలెట్టాయి. కారణమేమిటో, శీతలప్రదేశాల్లో ఆ చలికి తట్టుకోడానికని, మందపాటివి, బరువైనబట్టలు ధరించాల్సివుంటుంది. అదే వేడి ప్రదేశాల్లోకనుకైతే పల్చనివి, తేలికైనఉడుపులే కట్టుకోవాల్సివుంటుంది. పూర్వం మహమ్మదీయులు విజేతలుగా ఇక్కడికి వచ్చినప్పుడు ఎంత మొద్దుబట్టలు కట్టుకుని ఉన్నారో చెప్పడం కష్టం. ఊహించుకోవాల్సిందే. ఇక్కడికివచ్చాక మరి ఈ శీతోష్ణస్థితికి అనుకూలమైన దుస్తులు ధరించాల్సిందేకదా.

P—17

ఇంగ్లీషువారిలో ఆడా మగాగూడ, చిన్నచిన్నదుస్తులు ధరించడం, తేలికైన పల్చని బట్టలుకట్టడం, మనం కళ్ళారా చూస్తూనేవున్నాం. ఓ రోజుకంటె ఓరోజు వారిదుస్తులు మారిపోతున్నాయి.)

ఈవిధంగానే ఇక్కడ పాగాలు పగిడీలుగూడ రోజురోజుకి తేలికవి, చిన్నవి కావడం మొదలెట్టాయి. చిన్నచిన్నపాగాలు పగిడీలు పెట్టుకోడమనేదో పెద్ద ఫాషనైంది. ఈ ఫాషను రానురాను రాజదర్బారుకిగూడ ఎక్కింది. మొగలాయి దర్బారు చివరిదశలోవుండగా అమీర్లు, మన్సబుదార్లు అంతా తేలికైన పగిడీలే ధరించేవాళ్ళు. ఈ చిన్నరకం పగిడీలు రావడం మొదలెట్టాక పగిడీలఫాషన్ మితిమీరి పోయి రకరకాల పగిడీలు బయల్దేరాయి.

అమీర్లు కొత్తపద్ధతిగా చుట్టివున్న చిన్నచిన్న పగిడీలు సృష్టించుకున్నారు)

పగిడీలు చిన్నవికావడం మొదలయ్యాక టర్కీ టోపీలు వెనుకబడ్డాయి. జనం పగిడీలకింద టోపీలు పెట్టుకోడం మానేశారు. కొంచరు పగిడీలకింద టోపీలు పెట్టు కునేవాళ్లగానీ, అయితే వాళ్ల పెట్టుకునేటోపీ పచ్చనిబట్టతో చేసిన చిన్నటోపీ అన్న మాట. ఉఫ్ అంటే ఎగిరిపోతుందేమో అన్నట్లుండేది. అలాటి ఉలిపిరిటోపీ పెట్టు కునేవారు. అయితే ఈ టోపీల్లో రకాలు, వాటి వైఖరులగురించి ఇదమిద్ధమని చెప్పడం కష్టం. ఆ టోపీల ఉనికి బహుశా ఈ నైష్ఠికులైనవారు, ఫకీర్లు పెట్టుకునే జానెడు బెత్తెడు టోపీలవలె వుండేవేమో. అంటే వాళ్ళుపెట్టుకునే టోపీలు ఎలా వుంటాయంటే తలచుట్టూ అయిదారువేళ్ళ వెడల్పు పట్టీగా వుండి, పైన నడినెత్తిన కుచ్చుమాదిరిగా వుంటుంది. (మనం దాన్ని కోతి కుళ్ళాయంటాము.)

కొంతకాలంపోయాక ఇంట బయటగూడ ఈ టోపీలు పెట్టుకోడం మానేయ వలసినఅగత్యం ఏర్పడిందికానీ, అసలు టోపీ పెట్టుకోకుండా, ఉండటమన్నది మర్యాద, సంప్రదాయం కాదుకాబట్టి, ఏదో పేరుకి ఓ చిన్నటోపీ తగిలించుకునే వాళ్ళు. ఆ కారణంచేతనే ఢిల్లీలోనూ ఓ చిన్నరకంటోపీ తయారుచేసుకున్నారు. అది నడినెత్తిన కిరీటం పెట్టినట్టుండే టోపీ. దాన్ని వాళ్ళు కంరఖీ టోపీ అనేవాళ్ళు. అది గుండ్రనిటోపీ. తలమీదపెట్టుకుని నాలుగుపక్కలలాగి సర్దుకుంటారు. ఈరకం టోపీలు ఢిల్లీలో ఇప్పటికి కొందరు అమీర్లు, రాజవంశీయులు ధరిస్తూవున్నారు. నిజానికి అది చేగోషియా టోపీయే. నాలుగు ముక్కోణపు ముక్కల్తోచేసిన

టోపీలు. మరికొంతకాలమయ్యాక ఆ టోపీలోగూడ మార్పు ప్రారంభమైంది. ఢిల్లీలోనివారు ధరించే నడినెత్తిన గోపురంలా కోసు తేలివుండే క్రమఖీ టోపి మాదిరి కాకుండా, గుండ్రని కుళ్ళాయిగా మారింది. దాన్ని కబానుమా టోపి అంటారు. (పంపరపనస డిప్పలా వుంటుంది.) ఆ టోపి నాలుగుముక్కలు అందంగా కత్తిరించి అంటేసి కుడతారు.

ఢిల్లీనుంచి లక్నో వచ్చేవాళ్ళంతా ఈ టోపీయే పెట్టుకువచ్చేవాళ్ళు. ఈ టోపీ లక్నోవెళ్ళాక, లక్నోలోని రాజదర్బారు గాలి దానికి సోకింది. మార్పు ప్రారంభమైంది. గుడ్డ అతుకు ఉన్నచోట టోపీమీద కూజాలమోస్తరు మధ్య చంద్రవంకల మోస్తరు కత్తిరించి కుట్టేవాళ్ళు. అంటే మంచి మెత్తని గుడ్డముక్కల్తో కూజాలు చంద్రవంకలు కత్తిరించి ఆ టోపీకి అంటేసేవాళ్ళు. పైకి చూడటానికి ఆ టోపీ ఎంతో చక్కగా, సాదాగాను కనబడేది. ఈ టోపీ ఇక్కడివారందరికి నచ్చింది. ఇక జనమంతా పగిడీలు చుట్టుకోడం మానేసి, ఈ టోపీలు ధరించడం మొదలెట్టారు. నాగరికులు కానీండి, శిష్టజనులు కానీండి ఎవరితలమీదచూసినా ఈ టోపీయే తయారైంది. బహుజనాదరణ పొందడంవల్ల దాని ఆకృతిలో మరింతమార్పు వచ్చింది. టోపీ మరీ పొడుగులేకుండా, తగినంతగుండ్రంగా తయారైంది. టోపీ సరిచేసుకోడానికని కొయ్యవి, రాగివి మూసలు బయల్దేరాయి. ఆ మూసలకు తొడిగి ఆ చౌగోషియా టోపీలను. నలిగి వంకరలేకుండా, గుండ్రంగా చేసుకుంటారన్న మాట.

అంతలో నసీరుద్దీన్ హైదరు పరిపాలన ఏర్పడింది. అప్పటికి లక్నోలో షియాల మతం మంచి ఉన్నతదశలో వుంది. షియాలు మత విషయికంగాను, నైతికంగాను, సమాజవ్యవస్థలోను, ఇంకా తదితరవిషయాల్లోను తమ అభిరుచులనే ప్రవేశపెట్టారు. అరబ్‌కి చెందిన ఖలీఫాలంటే గిట్టనందువల్ల, పంచతనులంటే (అయిదు గురు వ్యక్తులు) హజరత్ మహమ్మదు, హజరత్ అలీ, హజరత్ ఫాతిమా (అలీ భార్య), తర్వాత వారి ఇరువురు కుమారులు, ఇమాం హసన్, ఇమాం హుసేను ఇష్టం కావడంవల్లను. లక్నోలోని సమాజవ్యవస్థలో నాలుగుసంఖ్యకి అనాదరణ, అయిదుసంఖ్యకి మన్నన కలిగాయి. ఆ ప్రభావం వారు ధరించేటోపీమీద పడింది.

కొన్ని ప్రామాణికమైన సిద్ధాంతాలరీత్యా హైదరుప్రభువు చౌగోషియా టోపీలో నాలుగుముక్కలబదులు అయిదుముక్కలు, అయిదుకూజాలుపెట్టి కుట్టవలసిందిగా

నిర్దేశించాడు. అప్పటినుంచి అయిదుముక్కలు అంటేసి టోపీ కుట్టడం మొద లెట్టారు. చౌగోషియా టోపీలు మాయమైపోయాయి. వాటిని అంతా మర్చే పోయారు. అంటే ఆ టోపీలో నాలుగేముక్కలు అంటేసి వుండేవన్నసంగతి మర్చి పోయారేగానీ, చౌగోషియా అనే దానిపేరుమాత్రం అలానే వుండిపోయింది. ఇప్పటికీ అయిదుముక్కలు అంటేసి కుట్టిన ఆ టోపీని చౌగోషియా అనే అంటారు. అక్కడివారు ఎవరినోటైనా అదే వినబడుతుంది.)

అయోధ్యకు పాలకుడైన నసీరుద్దీన్ హైదరు ఈ అయిదుగుడ్డముక్కలు అంటేసి కుట్టిన టోపీని తనకోసం ప్రత్యేకంగా మొదట్లో తయారుచేయించుకున్నాడు. ఆయన బ్రతికున్నంతవరకు ఆ టోపీ పెట్టుకోడానికి ఎవరికి గుండెలుండేవికావు. అయితే ఊళ్ళో అందరికిగూడ ఆ టోపీమీద బలేమోజుగా వుండేది. అందుకే ఆ హైదరుప్రభువు కన్ను మూశాడో లేదో, పిన్నా పెద్దా, అంతా అటువంటి టోపీ కుట్టించి పెట్టేసుకున్నారు. లక్నోలోని నాగరికజనులు, వారు వీరనేదిలేదు, ఎవరి తలమీదచూసినా, ఈ గుండ్రపాటి కటానుమా టోపీయే కనబడేది.

మరి కొంతకాలానికి చలికాలంలో ఉపయోగించుకునేందుకు వీలుగావుండే టోపీలు తయారయ్యాయి. అవి చాలా అందంగాను, ఎంతో పనితనంతోనువున్న అయిదుముక్కలు అంటేసిన టోపీలు. అయిదు గుడ్డముక్కలు మంచి జరీ పువ్వు లుండే పట్టుగుడ్డతోగానీ, జరీపనిచేసిన రంగురంగుల గుడ్డలమీద దారాలతో కూజాలు, చంద్రవంకలు కుట్టి రకరకాలుగా ఉండేవి ఆ టోపీలు. నాగరీకులంతా చలికాలంలో ఆ టోపీతప్ప మరోటోపీ పెట్టేవాళ్ళుకాదు. దీనితర్వాత పువ్వుల టోపీలు వచ్చాయి. అంటే అద్దకం పువ్వులగుడ్డతోకుట్టిన టోపీలన్నమాట. వేసవి కాలమొస్తే చాలు. అందంగా, ఆకర్షణీయంగా చక్కగావుండే ఆ చౌగోషియా టోపీలే పెట్టుకునేవారు. వాటిల్లో మంచిమంచిరకాల టోపీలు తయారుకావడం మొదలైంది. ఒక్కొక్కటోపి పది పన్నెండు రూపాయలదాకా వెల పలికింది.

(ఆ కాలంలోనే ఢిల్లీనుంచి ఒక రాజకుమారుడు లక్నోరావడం తటస్థించింది. ఆయన్ని లక్నో రాజస్థానం, అక్కడి ప్రజావళిగూడ చాల గౌరవించింది. ఆయన రెండేముక్కలు అంటేసి కుట్టినటోపీ పెట్టుకునేవాడు. దాన్ని 'దుపలడీ' అంటారు. తలయొక్క చుట్టుకొలత వైశల్యాన్నిబట్టి తగినంత పొడుగాటి రెండుగుడ్డల్ని

అండాకారంగా కత్తిరించి ఆ రెండిటిని కలిపికుడితే 'దుపలడీ' టోపీ తయారౌతుం దన్నమాట.

అతి సాదాగాఉన్న ఆ టోపీ అంటే జనానికెంతో ఇష్టమైంది. అది మిగతా టోపీలన్నిటికంటే ఎంతో సాదాగా వుండడంతోపాటు, దాన్ని తయారుచెయ్యడం గూడ చాల తేలికకావడంతో ఆ టోపీమీద జనానికి చెప్పలేనంత మోజుకలిగింది. చాలావరకు జనం ఆ దుపలడీ టోపీయే పెట్టుకోడం మొదలెట్టారు. ఆ టోపీ విరివిగా ప్రచారంలోకి వచ్చేసింది. ఈ టోపీమూలంగా ఆ దుపలడీ రాజకుమారుడి పేరు చిరస్థాయిగా నిల్చిపోయింది. ఈనాడు కోట్లకొద్దీ జనం ఈమాదిరి కత్తిరింపు ఉన్న టోపీలు ధరించడమే చూస్తున్నాం. ఇక్కడ రాజ్యపాలన చివరిదశలో ఉండగా ఈ దుపలడీ టోపీకంటేగూడ చాల చిన్నతరహా పల్చని టోపీఒకటి తయారైంది. ఆ టోపీకి ముందువెనుక రెండుకొనలు తేలివుంటాయి. దీన్ని కొనలున్న టోపీ (నుక్కేదార్ టోపీ) అనేవాళ్లు. ఈమాదిరి పనితనమున్న టోపీలను ముఖ్యంగా, రాజకుమారులు, శ్రీమంతులు, రాజబంధువులు ఇంకా ఉన్నతవర్గాల వారు వాడుతూండేవారు.

సిపాయి తిరుగుబాటు జరిగేవరకు లక్నోవారిలో రెండేరెండురకాల టోపీలు పెట్టుకోవడం రివాజు. ఒకటేమో చౌగోషియా. ఆ చౌగోషియాటోపీని నాగరికులు, విద్వాంసులు పెట్టుకునేవారు రెండోది దుపలడీ. దాన్ని రాజవంశీయులు, కింది వర్గాలకు చెందినవారు, కొన్నిమార్పులుచేసుకుని పెట్టుకోవడం ఇప్పటికీ ఆచారం.

గాజీ ఉద్దీన్ హైదరు లేక నసీరుద్దీన్హైదరు కాలంనుంచీ పురప్రముఖులు కొందరు గుండ్రని టోపీ ఒకటి పెట్టుకోడం రివాజైంది. దాన్ని 'మిందీల్' అనేవాళ్ళు. దానిఆకారం చిన్న డప్పులాగా గుండ్రంగా వుంటుంది. దానిమీదంతా అందంగా జరీపని చేసివుంటుంది. శ్రీమంతులైనవాళ్లు నవాబులసంతతివాళ్ళు దాన్ని ఘనమైనటోపీగా భావిస్తారు. ఆ టోపీ పెట్టుకుంటే గొప్పన్నమాట. అయితే పాదుషాల ఎదటికీ రాకుమారుల ఎదటికీ వెళ్ళేటప్పుడు ఎవరూ పగిడీ పెట్టుకోకుండాను వెళ్ళరాదు. అలాగని ఈ జరీపనిచేసిన మిందీల్టోపీ పెట్టుకుని వెళ్ళరాదు. ఆ టోపీ రాజాస్థానంలో వారిమట్టుకే పరిమితం చేయబడింది.

ఈ మిందీల్ మాదిరిలోనే మరో గుండ్రటిటోపీ తయారయింది. ఆ టోపీ మొనలు కొంచెం గుండ్రంగా తేలివుంటాయి. దాన్ని వారు 'జజీలీ టోపీ' అనే వాళ్ళు. ఇది సాధారణంగా నల్లని మఖ్‌మల్‌గుడ్డతో కుట్టబడి బంగారువన్నెగల చెమ్కీతో చక్కని పనితనం చేసివుండేది. అసలీ టోపీ ఇంగ్లీషువారి పాలనా కాలంలో వాడుకలో వుండేది. తెల్లవారి సైన్యం ఈ టోపీయే ధరించేది. ఈ టోపీ కొక ప్రత్యేకమైన సొగసుండేది. మనదేశీయులు ఇంగ్లీషువారిని అనుకరించడం బహుశా ఈ టోపీతోనే ప్రారంభమైయుండాలి. ఆంగ్లేయులసైన్యం ధరించే ఈ జజీలీటోపీకి ఎంతటిదశ పట్టిందంటే అది పోయిపోయి రాజకుమారుల దుస్తుల్లోను, ఆగర్భశ్రీమంతుల దుస్తుల్లోనుగూడ చోటు చేసుకోగల్గింది. అప్పట్లో జనానికి ఆ జజీలీ టోపీ అంటే అంతటివ్యామోహం ఏర్పడింది.

అయోధ్యను పరిపాలించినవారిలో చివరిపాలకుడైన వాజిద్ అలీషా తన కొలువులో సన్మానించి బిరుదు ప్రదానంచేసిన సభ్యులనిమిత్తం అద్భుతమైన టోపీ ఒకటి తయారుచేయించాడు. అది లోపల కాగితంపెట్టి, పైన పట్టుబట్టతోచేసిన గుండ్రని టోపీ. దానిమీద జరీపని చేసివుండేది. నొసటివేపున ఎత్తుగా లేచివుండేది. ఆ టోపీకి పట్టుగుడ్డతోగానీ, లేకపోతే దోమతెరబట్టలా చిల్లులుగావుండే బట్టతోగానీ, జోలెలా చేసి జోడించేవారు. ఆ టోపీని పెట్టుకున్నప్పుడది తలవెనుక మెడవరకు జూలు లాగా వేలాడుతూ విలక్షణమైనశోభను చేకూర్చేది. ఈ దర్బారీ టోపీపేరు 'అలం పసంద్' అని పెట్టారు. సాధారణంగా జనమంతా దాన్ని కుచ్చుటోపీ అనేవాళ్ళు. అయితే జనానికి ఆ టోపీ ఏమాత్రం నచ్చలేదు. అందువల్లనే అది వాజిద్ అలీషా జీవితకాలంలోనే ఆయన తన కొలువులోని సదస్యులకు ఆ టోపీని ఎంతో గొప్పగా భావించి ప్రదానం చెయ్యడం, వారు కొలువునుంచి బయటకురాగానే దాన్ని తీసే యడంగూడ జరిగింది. తప్పనిసరై కొలువులోవున్న కాసేపు ఏం పెట్టుకునేవారో ఏమో అంతే. మళ్ళీ ఇవతలికివచ్చాక చూద్దామన్నా కనబడేదికాదు. తర్వాత తర్వాత అదసలు పోనేపోయింది. ఇప్పుడామాదిరి టోపీ వెతికినా దొరకదు. ఆ టోపీ మధ్యలోవచ్చి మధ్యలోనే మాయమైంది.

సిపాయి తిరుగుబాటువచ్చి వెలిశాక లక్నోలో టోపీలప్రపంచంలో ఒక పెద్ద విప్లవం చెలరేగింది. కొంతకాలం యీ చౌగోషియా, దుపలడీ, మిందీల్‌టోపీలు

ఇంకా పాగాలుతప్ప కనబడేవేకావు. ఉన్నట్టేవుండి చౌగోషియా టోపీ వాడకం తగ్గిపోవడం మొదలయింది. క్రమంగా అది మరుగునబడిపోసాగింది. అయితే కొందరు పూర్వకాలంవాళ్ళు ఇంకా అదంటే మోజుపడి పెట్టుకుంటున్నప్పటికీ వాడకంమాత్రం సన్నగిల్లిందనే చెప్పాలి. ఈ చౌగోషియావాడకం తగ్గించిన తర్వాత దుపలీ టోపీ వాడకం వృద్ధయింది. ఆ దుపలీనిగూడ ఉన్నమాదిరిలో వుండనీయక ఏవో కొత్తమెరుగులు దిద్దడం ఆరంభించారు. కొంతకాలమేమో మీరట్‌నుంచి కుట్టివచ్చిన మిందీల్ టోపీమాదిరి టోపీలు ధరించేవారు. ఆతర్వాత ఇంగ్లీషువారు పెట్టుకునే నైట్‌కేప్ కొన్నాళ్ళు, కాశ్మీరీల ఉన్ని టోపీలు మరికొన్నాళ్ళు వాడుకలో వుండేవి. పొడుగాటి ఈకల టోపీలు ఆతరువాత వాడుకలోకి వచ్చాయి. వీటన్నిటితర్వాత శాటిన్‌గుడ్డతో చేసిన సున్నితమైన పల్చని టోపీలు వెలిశాయి. అవి దాదాపు దుపలీ టోపీ అంత చిన్నవిగావుండేవి. ఇక పోనుపోను ఇంగ్లీషు వారి హయాములో వారిఫేషన్లు వంటబట్టాయి. వేసుకున్నదుస్తులకి తగ్గట్టు టోపీ పెట్టుకోడం ఒక ఫేషన్. ఏరకంవస్తులు ధరిస్తే ఆరకంటోపీయే పెట్టేవాళ్ళు. అయితే కొందరు పెద్దలుమాత్రం ఇంతటిఫాషన్లకిపోక అన్నిదుస్తులకి ఒకేరకం టోపీ పెట్టుకునేవాళ్ళు. ఇంగ్లీషువాడుధరించే పొరటోపీగానీ, లేకపోతే నైట్‌కేప్ గానీ పెట్టుకునేవాళ్ళు. ఫాషన్లలో మునిగి తేలుతున్నప్రజలు తమవేషాన్నిచూసి ఏమనుకుంటారో అనే వెంగ వారికేకోశానా వుండేదికాదు.

(ఇక టర్కీటోపీ వాడుక పెరిగింది. సర్ సయ్యద్ అహమద్ ఖాన్ ఈ టర్కీటోపీయే వాడేవారు. ఆ రోజుల్లో కోటు, పాంటు వేసుకొని టర్కీటోపీ పెట్టుకున్నవాడు ముసల్మానుల్లో పెద్దమనిషికింద జమన్నమాట. అయితే ఈ టోపీ ఎవ్వరికీ గిట్టలేదు. దాన్ని నేచరియోంకీ టోపీ, (భౌతికవాదుల టోపీ) అనేవారు. ఎందుకంటే సర్ సయ్యద్ అహమద్‌ఖాన్ విప్లవాత్మక భావాలున్నవాడు. ఆయన ఉద్దేశ్యాలు గిట్టని మౌల్వీలు సర్ ఖానుని నాస్తికుడని, భౌతికవాది అని అనేవాళ్ళు.

వార్తాపత్రికల్లో ఆ టోపీమీద వ్యంగ్యంగా అనేకవ్యాఖ్యానాలు ప్రచురించడం గూడ జరిగింది. ఆ టోపీ అన్నివ్యాఖ్యానాలకు గురైనా సర్ సయ్యద్‌మాత్రం ఆ టోపీని విడవలేదు సరికదా దాన్ని తగినంత వ్యాప్తిచేశాడు. లక్షలాదిజనులు ఆ టర్కీటోపీ ధరించడం సర్ సయ్యద్ తన జీవితకాలంలోనే చూడగల్గాడు. అంత

కంటే ఏం కావాలి? ఆ టోపీ అక్కడితో పరిమితంకాకుండా లక్నోకిగూడ వచ్చింది. చాలమంది పోటీపడి సయ్యదుగారి ఈ టోపీయే ధరించేవాళ్లు. ఏమైనా లోలోపల జనానికసలు ఈ టోపీ అంటే చెప్పలేనంత వ్యామోహం కలిగింది. హిందూ దేశమంతటా చదువుకున్నవాళ్ళు, నాగరికులు అయిన ముసల్మానులు ఈ టోపీయే వాడటం మొదలుపెట్టారు.

లక్నోలో షియాతెగ ముసల్మానులు ఎక్కువమంది వున్నారు. హిందూదేశంలోని మిగతా ఏ పట్టణాల్లోను అంతమంది షియాలు లేరు. వారికి సున్నీ తెగవారంటే బొత్తిగా గిట్టదు. ప్రతివిషయంలోను సున్నీలంటే విభేదం చూపిస్తారు. ఆచారవ్యవహారాల్లోగూడ షియావారికి సున్నీలకు హస్తిమశకాంతరం వుంది. సున్నీలకు పడమటి టర్కీవారి పాలనఅంటే ప్రియమైతే షియాలకు ఈరాన్‌లోని కాచర్‌వంశీయుల పరిపాలనంటే పంచప్రాణాలూను. పైగా వీరు వారి అనుచరులుగూడాను. లక్నోలో టర్కీటోపీకి వాడుక పెరగడం మొదలుకావడంతో ఫాషన్ లకుపోయే షియావారి కేమనిపించేదంటే ఇదేమో టర్కీటోపీ కనుక దీనికిబదులు ఈరానీ కొలువులోవాడే నల్లటోపీ తాము వాడుక చేసుకోవాలనుకున్నారు. అందువల్ల టోపీల్లో మళ్ళీ రెండురకాలు తయారయ్యాయి. సున్నీతెగకుచెందిన ముసల్మానులయితే, టర్కీటోపీ పెట్టుకునేవారు. అయితే ఈ రెండుతెగల్లోకూడ ఉన్నతాశయాలుగలవారు లేకపోలేదు. వారు పరస్పరమున్న విభేదాలు పోగొట్టాలని, ఐకమత్యంగాఉండాలని అభిలషిస్తూ సున్నీతెగవారైనా ఈరానీ టోపీ పెట్టుకునేవాళ్ళు. షియాలైనాగూడ టర్కీటోపీ పెట్టుకునేవారు. కాని అటువంటివారు నూటికో పదిమందివుంటే ఎక్కువ. చాల అరుదన్నమాట. ఏమైనా ఆధునికపద్ధతినిబట్టిచూస్తే, షియావారు ఈరానీటోపీ, సున్నీవారు టర్కీటోపీ ధరించడమే మామూలైపోయింది.

ముసల్మానుల్లోని ఈ పరస్పరవిరోధం ప్రారంభమవడంతో హిందువుల్లో విద్యావంతులైనవారు సాధారణంగా గుండ్రని పెట్టికేప్ పెట్టుకోడం ఆరంభించారు. వారినిచూసి ముసల్మానుల్లోగూడ కొందరు ఆ టోపీ పెట్టుకోసాగారు. ఆ టోపీ హిందువులకు, ఇంగ్లీషువారికిగూడ ఫేషన్ కావడంవల్ల ఇంగ్లీషువారు దానిపేరు "బాబూజీ టోపీ' అని పెట్టారు. అయితే మొత్తంమీద సర్వసాధారణంగా హిందు

వులుగానీ, మహమ్మదీయులుగానీ, వారు షియాలుగానీ, సున్నీలుగానీ, దుపలడీ (అండాకారంగా కత్తిరించిన రెండు గుడ్డముక్కలు అంటేసి తయారుచేసిన) టోపీయే ఎక్కువగా వాడటముంది.

సిపాయి తిరుగుబాటుజరిగిన తరువాతికాలంలో లక్నోసమాజంలో ఉపద్రవం వచ్చిపడింది. జనుల ఆచారవ్యవహారాల్లోను, ఉనికిలోను, నడవడిలోను, వస్త్రాలంకరణలోను అన్నింట్లోను మార్పు రాసాగింది. ముఖ్యంగా సుశిక్షితులైన జన సమాజంలో తమ సంప్రదాయకమైన వస్త్రాలంకరణను వదిలేసిన వాళ్లెందరో బయల్దేరారు. వారికి పరిపాటిగావస్తున్న ఈ పైజామాలు, అంగరఖాలు, చెప్పులు, టోపీలు, పగిడీలు ఏవీ పనికిరాలేదు. వాళ్ళు హిందూదేశంనుంచి సప్తసముద్రాల అవతలవున్న ఇంగ్లండుకి ఒక్క అంగవేశారు; అక్కడివారిమోస్తరుగా కోటు, పాంటు, బూటు, హేటు ధరించడం మొదలుపెట్టేశారు. అందరూ అలా మారిపో లేదు. తమ సాంప్రదాయికమైన వేషభాషల్ని వదల్లేదు. అయితే క్రమంగా అంగ రఖామాత్రం, షేర్వానీగా మారిపోయింది. షేర్వానీయే జాతీయమైకూర్చుంది. అయితే టోపీసమస్యమాత్రం తేలకుండానేవుండిపోయింది. ఎవరు, ఏ తెగవారు, ఏ టోపీ ధరించాలి అనేది గుంజాటనలో పడింది.

ఈ పోట్లాటలు, తగాదాలు, ఈ మార్పులు చేర్పులు వచ్చినతర్వాత లక్నోలో రకరకాలటోపీలు వెలిశాయి. ఆ రకాలన్నీ ఇక్కడ తయారైనవి కానీండి, లేక మరెక్కడినింపైనా వచ్చినవే కానీండిగానీ, చెప్పలేనన్ని రకాలటోపీలు బయల్దే రాయి. వాటిల్లో కొన్నిరకాలైతే ఏవో కొద్దిరోజులపాటు నిలవదొక్కుకునివున్నాయి. ఆ ఉన్నవాటిల్లోగూడ లక్నోవారు తమ అభిరుచుల్నిబట్టి బోలెడన్నిమార్పులు తెచ్చి పెట్టారు. ఏ మార్పులుతెచ్చినా ఎక్కువకాలం వుండలేదు. క్రమంగా మరుగునబడి పోయాయి. లక్నోవారికేమంటే ఏ వస్తువైనాసరే, నాజూగ్గాను, నాణెంగాను, చిన్నది గాను, ఎగుతుగాను, తేలిగ్గానూ వుండాలి. అలాఉంటేనే వారికి నచ్చుతుంది. అది వారిప్రవృత్తి. వారు ప్రతివిషయంలోను ముఖ్యంగా వస్త్రాలంకరణ విషయంలోను ఈమాదిరి మార్పులే చేశారు. టోపీల్లోనే మరీ ఎక్కువమార్పులు తెచ్చారు. అయితే టర్కీ టోపీ, ఈరానీ టోపీ వారలటోపీల వైఖరుల్లో ఏమంత పెద్దమార్పులేం చెయ్యలేకపోయారు. ఇందుకు కారణమేమంటే, ఆ టోపీలన్నీ ఇతరులెవరో చేసి,

చేయించి తెచ్చినవి. బయటిప్రదేశాలనుంచి వచ్చినవి. మార్పులు చెయ్యడానికి వీలు కాకనో మొత్తానికి వాటిలో టోపీ సాంప్రదాయకమైనదిగా నిలబడలేదు. టోపీ ధరించడమనే రివాజైతే లక్నోలో ఏర్పడిందిగానీ, వారి అభిరుచికి తగినటోపీ తయారుకాలేదు. ఆ కారణంచేతనే టోపీలచరిత్ర పశేషంగానే వుండిపోయింది.

# 31

భారతదేశంలో ముఖ్యంగా లక్నోలో టోపీ ధరించనివారంటూ ఉండరు. పగిడీలు పెట్టుకునేవారు చాల తక్కువ. వారిదృష్టిలో పగిడీ, టోపీ అంత నాజూకు కాదు. అయితే రాజాస్థానాల్లోమాత్రం సాధారణంగా పగిడీలు ధరించడమే రివాజుగా వుండేది. ఢిల్లీవారి తాజోచితమైన పగిడీలుమాత్రం ఇక్కడ వుండేవికావుగాని. రాజ్యపాలన కొనసాగినంతకాలం చివరిగడియవరకు పగిడీలవాడకంమాత్రం అమల్లో వుంది. ముఖ్యంగా పనివాళ్ళంతా తలపాగపెట్టుకు తీరాల్సిందే. తలగుడ్డలేకుండా యజమాని కంటపడటం అపచారమన్నమాట. అప్పుడేకాదు, ఇప్పటికి సాధారణంగా పనివాళ్ళు తలగుడ్డ మానరు, చూశారో లేదో.

ఈ పగిడీలు ధరించడమనేది పూర్వాచారంగా వస్తూంది. పాలకులయినప్రభువులు పాతకాలంనాటి పగిడీలు ధరించడమనే ఆచారం నవాబు సఆదత్ అలీఖాను కాలం వరకు కొనసాగింది. నవాబు బుర్హాన్ ఉల్ ముల్క్, నవాబు షుజా ఉద్దౌలా, ఇంకా నవాబు ఆసపుద్దౌలా ఢిల్లీప్రభుత్వపు ఉన్నతాధికారులు ధరించే ఆ తెల్లని పగిడీయే పెట్టుకునేవారు. కొలువుతీర్చేవేళలో, ఆభరణాలతో అలంకరించబడిన ముంగుపాగాలు, తురాయిపాగాలు ధరించేవారు. నవాబు సఆదత్ఆలీఖాన్మాత్రం ఒక కొత్తరకం పగిడీ ధరించేవారు. దాన్ని లక్నోవారు 'శమ్లా' అంటారు. ఆ శమ్లా అనేది ఎలా వుంటుందంటే, ఒక పెద్దబట్ట తీసుకుంటారు, దాన్ని కావలసినంత వెడల్పు చూసుకుని, సన్నగామడిచి తలకి తగినంతకొలతతో గుండ్రంగా చుట్టి పెడతారు. దానిమధ్యంతా ఖాళీగానే వుంటుంది. మంచిబట్టగానీ, పల్చని శాలువాగాని

తీసుకుని, పొడుగ్గా కర్రలా బాగా మెలితిప్పుతారు. ఆ మెలితిప్పినబట్టని తలకి కొత్తలుతీసుకున్న ఆ బట్టచుట్టు ఎన్నో చుట్లుచుట్లుగా లోపలినుంచి పైకి కిందకి చుడతారు. అలా వొరలు వొరలుగాచుట్టిన పాగాలోపలినుంచి పైకి ఒక పట్టంచు గానీ, శాలువా గుడ్డగానీ, ఆ పాగా వరవడిపోకుండా వుండేందుకు కడతారు. ఆ పాగాకి నడినెత్తిమీద ఖాళీగానేవుంటుంది గాబట్టి, ఆ శమ్లా ధరించేటప్పుడు లోపల మామూలుదిగాని, లేక టోపీగాని తప్పక పెట్టుకుని ఇది పైన ధరిస్తారు. ఇది లక్నో వారి పిసలయిన శమ్లా. దాన్ని మొట్టమొదట నవాబు సఆదత్ అలీఖానే ధరించాడు. బహుశా శమ్లా మధ్య భారతదేశంలోని హిందూ మహమ్మదీయుల రాజాస్థానాల్లోని పగిడీల్ని చూపి తయారుచేసుకున్నదై యుండాలి. ఆకాలంలో, అక్కడ కొన్ని వందలగజాల పల్చని రంగుబట్టని బాగా మెలితిప్పి, ఒకపద్ధతిలో ఆ మెలితిప్పిన బట్టనిచుట్టి వారు పెట్టుకునే పగిడీలు తయారుచేసుకునేవారు. ఈ శమ్లా అనే పగిడీని నవాబు సఆదత్ అలీఖానేకాదు, ఆనాడు రాజదర్బారుల్లోని ప్రముఖులైన సదస్యులు, మంత్రులుగూడ ధరించేవారు.

గాజీ ఉద్దీన్ హైదర్ని ఇంగ్లీషువారు పాదుషాచేసి కిరీటం పెట్టారు. అది అసలు హిందూదేశపు కిరీటం కాదు. ఆసియాఖండంలోనే అటువంటికిరీటం వాడకంలో లేదు. అది కేవలం యూరప్‌వారిది. ఆ కిరీటం మనదేశానికివచ్చాక ఇక లక్నో పాలకులు, శమ్లా ధరించడం పూర్తిగా మానేశారు. పాలకులేకాదు, రాజకుమారులు, ప్రముఖులందరుగూడ పగిడీకి స్వస్తి చెప్పేశారు. రాజకుమారులు ప్రత్యేక తరుణాల్లో కిరీటం ధరించేవారు. మిగతా అప్పుడంతా మంచిపనితనంతోచేసిన అంద మైన టోపీలు పెట్టుకునేవారు. అటువంటిటోపీలనే రాజ్యంలోని పెద్దమనుషులంతా గూడ వాడేవారు. అయితే రాజ్యంలోని ఉన్నతాధికారులు, మంత్రులు, ఇంకా ఇతర ఉద్యోగులంతా శమ్లాధరించే దర్బారుకు రావలసిందిగా కట్టడిచేశారు. గాజీ ఉద్దీన్ హైదరుకాలంనుంచి అమ్జద్ అలీషా కాలంవరకు ఉద్యోగులంతా శమ్లాయే ధరిస్తూ వుండేవారని, పాఠకులకు తెలియజేయడం జరిగింది.

వాజిద్ అలీషా ఒక ప్రత్యేకమైన టోపీని కనిపెట్టాడు. ఆలంపసంద్ (జన ప్రీతి) అని దానిపేరు.

రాజాస్థానంతో సన్నిహితసంబంధం వున్నవారికి 'దౌలా' అని బిరుదు ఇచ్చే వారు. 'ఆలం పసంద్' అనబడే టోపీగూడ సమర్పించేవారు. 'ఆలం పసంద్'

పుచ్చుకున్నతర్వాత దర్బారుకి వచ్చేటప్పుడు ఆ టోపీని తప్పనిసరిగా పెట్టుకునే రావా అన్నమాట. దర్బారీ సన్నిహితులకంటె తక్కువస్థాయికి చెందినవారికి, అంటే కర్మాగారాల్లోనో లేక ప్రత్యేకవిభాగాల్లో పర్యవేక్షకులుగా వుండేవారికి 'దరోగా' అనే బిరుదూ ఇచ్చేవారు. తలకు ధరించడానికి 'శమ్లా' ఇచ్చేవారు.

అందువల్ల ఆ పర్యవేక్షకులు తప్పకుండా 'శమ్లా' అనే తలపాగాధరించి దర్బారుకి హాజరయ్యేవారు. అసలా శమ్లా అనే పాగాని మొట్టమొదట నవాబు సఆదత్ అలీఖాను ధరించేవాడట. తర్వాత మిగతావారంతాగూడ ఏదో ఒకరకానికిచెందిన పగిడీ ధరించే దర్బారుకిరావాలని నిబంధన పెట్టాడు. పగిడీ పెట్టుకొనేప్పుడు దాన్ని లోపలపెట్టుకునే టోపీగూడ తీసెయ్యమన్నారు. ఉద్యోగులుధరించే శమ్లా అనే పాగావంటిదే, ముర్షిదాబాద్‌లో రాజాస్థాన సభ్యులుగూడ వాడుతూండేవారు. అందుకుఫలితమే ఇప్పటికి ఏభై యేళ్ళకుముందు కలకత్తాలో, కోర్టుకు వెళ్లేటప్పుడు వకీళ్ళంతా ఆమాదిరి 'శమ్లా' అనే పాగాయేధరించి వెడుతూండేవారు. అయితే కలకత్తాలోని వకీళ్ళు ధరించే శమ్లా అయోధ్యలోని శమ్లాలకంటే లేలిగ్గాను, నా దృష్టిలో నాజెం లేనిదిగాను కనుపించేది.)

ఈనాడు 'పగిడీ' అనేది అనరాదు, వినరాదు. ఉద్యోగస్తులు పెట్టుకోడం మానేశారు. ఊళ్ళోవున్న పెద్దమనుషులు, అందరు మానేశారు. అదివరకు పగిడీ అంటే మోజు చూపెట్టేవారంతాగూడ క్రమంగా పగిడీధరించడం మానేశారు. అయితే మామూలు జనంమాత్రం తలగుడ్డని ఈనాటికి గౌరవిస్తూనేవున్నారు. టోపీ పెట్టుకుంటూవున్నారు. నిమ్నజాతులవారి పెళ్ళిళ్ళలో పెళ్లికొడుక్కి నెత్తిన పాగా తప్పనిసరిగా పెడతారు. ఇప్పటికి లక్నోలో ఈ శమ్లా ధరించేఆచారం వుంది. సాధారణంగా పెద్దలంతా, మంచి పనితనంతోవున్న పట్టు శమ్లా ధరిస్తారు.

(ఇక్కడిపాలకులు పైన పేర్కొన్న పగిడీ రకాలేకాకుండా, ఉద్యోగులకు వేరువేరుతరహా పగిడీలు నిర్ణయించారు.

గుమాస్తాగిరీ చేసుకునేవాళ్ళు తెల్లని మఖ్‌మల్ శమ్లా మట్టుకునేవాళ్ళు. అటువంటి తెల్ల మఖ్‌మల్‌దే రాజ్యంలోని వార్తాహరులు, ఇంకా ద్వారపాలకులయిన రాజసేవకులుగూడ ధరించేవాళ్ళు. అయితే వాళ్ళు ధరించేవి శమ్లాలుగాకాకుండా, టోపీలకు వలె వుండేవి. వార్తాహరుల టోపీలు ఎర్రగాను, ద్వారపాలకులయిన రాజసేవకుల

(చోబ్‌దారు) టోపీలు తెల్లగా మెరిసిపోతూండేవి. ఆ టోపీకి మొహంమీదికి వచ్చే టట్టుగా ఒక జల్తారుతో చేసిన కుచ్చులాటి పువ్వు తగిలించి వుండేది. అంతే తేడా.

ఇంచుమించు వార్తాహరుల పగిడీలవంటివి పల్లకిమోసే బోయీలు ధరించే పగిడీలూను. బోయీలు చుట్టుకునే తలగుడ్డలకు కుడివైపు అంచుకి వెండిచేపలు రెండు వేలాడుతూండేవి. పొంటికి వదులుపాటి ఎర్రని ఉన్నిచొక్కాలు తొడుక్కునేవాళ్లు.)

ఇంతేకాకుండా సైనికులు, పేరు ప్రతిష్ఠలున్న పెద్ద మనుషులంతాగూడ తప్పని సరిగా పగిడీలుపెట్టుకునే ఆచారముండేది. అవన్నీ వేరువేరు రకాలుగా వుండేవి.

ఈ రకరకాల తలపాగాలకంటెగూడ గౌరవనీయులయిన విద్వాంసులుధరించే తలపాగా చాలా హుందాగా వుండేదనిపిస్తుంది. ఆ తలపాగానిగురించి ముచ్చటించుకోవడమూ అవసరమే.

లక్నోలోవున్న ముసల్మానుపండితుల్లో రెండుశాఖ లున్నాయి. ఒకరు సున్నీ తెగకుచెందిన విద్వాంసులు. రెండోవారు షియా సంప్రదాయానికిచెందిన మతాచార్యులు. ఈ రెండుతెగలవారి ఆచారవ్యవహారాల్లోను ఎంతో తేడావుంది. సున్నీ తెగవారిలో ఎంతసేపు అరబ్బుల వస్త్రాలంకరణ, ధార్మికాచారాలు కట్టొచ్చినట్లే కనబడతాయి. షియాల్లో పారసీ పండితుల వేషభాషలు, అభిరుచులు, ఆచారాలే కనబడతాయి. అయితే రెండు సంప్రదాయాల్లోవి విద్వాంసుల దుస్తులు ఆయా సంప్రదాయాలకు తగినట్టె ఉంటాయి.

(హజరత్ మహమ్మదుకాలంలో అరబ్బులు పేరుకుమాత్రమే అన్నట్లు తలకు జానెడంత తలగుడ్డ చుట్టుకునేవారు. ఆ గుడ్డకు, ఓ కత్తిరింపు, కుట్టు వుండేదికాదు. అందమనేది అసలే వుండేదికాదు.

తర్వాత అబ్బాసీ ఖలీఫాలకాలంలో, ఇరాక్ ఖలీఫాలకు ముఖ్యకేంద్రమైనప్పుడు ఈరానీ, మరియు సాసానీ అనే రాజవంశాలవారి వేషభాషలనే అరబ్ నాయకులు మరి వేరే గొప్పవారందరూగూడ వాడుకునేవారు. ఆతర్వాత పెద్దపెద్ద అందమైన పగిడీలు పెట్టుకోడం, ఉత్తరీయాలు కప్పుకోవడం అరబ్‌లో ఖలీఫాలకాలంలో విద్వాంసులకు రివాజైంది. దాన్నే అరబ్బుల వస్త్రధారణగా పరిగణించేవాళ్లు. హిందూదేశంలోవుండే సున్నీతెగకుచెందిన విద్వాంసులుమాత్రం అరబ్బీవారి

దుస్తులు ధరించేవారుకాదు. వాళ్లు ఢిల్లీ రాజదర్బారీ దుస్తుల్నే ధరించేవాళ్లు. ఆ దుస్తులు యెంతో అమరికగా వుండేవి. అందువల్లనే హిందూదేశం మొత్తంజనాభా ఆ మాదిరి దుస్తులు ధరించడానికే ఇష్టపడేవారు. ఆ పద్ధతినే అవలంబించారు. మధ్యలో వచ్చిన రకాలన్నీ మధ్యలోనే పోయినాయి. ఆనాటివస్త్రాలంకరణ అల్లే నిలిచిపోయింది.

అందువల్లనే నేటికి ఫరంగీమహల్ పండితులుధరించే తలపాగా గుండ్రంగా వుంటుంది. కొన్నిపాగాలను నుదుటిమీద అర్చీలుగా వచ్చేటట్టు చుడతారు. ఈ పాగాకు అదేం వుండదు. వొంటిమీద పురాతనపద్ధతికిచెందిన బురఖాయే వుంటుంది. ఆ బురఖా ఈనాడు ఎక్కడ చూద్దామనుకున్నా కనబడదు. కాళ్ళదగ్గర వెడల్పు పట్టీవేసి చీలమండవరకు వుండే పైజామా తొడుక్కుంటారు. మెళ్లో సన్నని ఉత్తరీయం వేసుకుంటారు. మన ఫిరంగిమహల్‌కు చెందిన ఒకరిద్దరుపెద్దలు ఈనాటికి శుక్రవారం నమాజు చెప్పించడానికి ఈమాదిరిదుస్తుల్లోనే వస్తారు. ఇంట్లో వున్నప్పుడయితే వాళ్లు మామూలు దుపల్లీ లేక చౌగోషియా టోపీ పెట్టుకుని పొడుగుపాటి చొక్కా వేసుకుంటారు. ఆ చొక్కాకు మెడపట్టి వుంటుంది. అది లేకపోతే అంగరఖా, పెద్దపట్టీగల పైజామా వేసుకుంటారు. ప్రస్తుతకాలంలో ఫిరంగీమహల్‌కి చెందిన పండితులు ఈ రకం వేషభాషలు మానేశారు. పండితులు సిరియా, ఈజిప్టుల లోని నాయకులు ధరించేదుస్తుల్ని అనుకరించడం మొదలెట్టారు. చివరకు మౌలానా శిబ్లీ సోమానీ ఆ దుస్తుల్నే జాతీయం చేయడం జరిగింది. ఆ దుస్తులే రాజదర్బారు దుస్తులకింద చలామణీ అయినాయి. ఆ కాలంలోని పెద్దలు కిర్రుచెప్పులు తొడుక్కునేవారు. అవన్నీపోయి యిప్పుడు ఆకు చెప్పులుగానీ, లక్నో, ఢిల్లీ ఛడావ్‌లు తొడగడం ఆరంభించారు.

షియాతెగకు చెందిన పండితులదుస్తుల తీరు వేరుగా వుంటుంది. వాళ్ళ తలకు మొదట నలుచదరపు టోపీ పెట్టుకుంటారు. మామూలువాళ్ళు పెట్టుకునేమాదిరి టోపీ కాకుండా, దానికుట్టు వెనుకవైపు వుంటుంది. ఆ కుట్టు ఈ చెవినుంచీ ఆ చెవిదాకా వుంటుంది. అటు ఇటు బొడిపెలుతేలి ఎత్తుగా వుంటుందా టోపీ. అది చూడటానికి ఈరానీ పాగాలమోస్తరే చుట్టివుంటుంది. ఒంటిన చొక్కా తొడుక్కుంటారు. ఆ చొక్కాకి మెడపట్టీ వుంటుంది. పక్కమెడచొక్కాలే వేసుకుంటారుగానీ మధ్య మెడవి కావు. ఎడంవైపు తెరుచుకునివుంటుంది. పూర్వకాలంలో షియాతెగకు

చెందినపండితులు వేసుకునే చొక్కాలకు రెండువేపుల మెడ పెట్టించుకునేవాళ్లు. తర్వాత ఆ ఫాషన్ మరుగున బడిపోయింది. ఈరాను, కర్బలా వెళ్ళివచ్చిన పండితులయితే వారు తొడిగిన చొక్కామీద ఒక పెద్ద వదులుపాటిగౌను వేసుకుంటారు. వెడల్పు పట్టీవేసిన పైజామా తొడుక్కుంటారు. సాధారణమైన చెప్పులే వేసుకుంటారు. చెప్పుల్నిగురించి ప్రస్తావన వచ్చినప్పుడు ఆ విషయం ముచ్చటిస్తాను.

# 32

టోపీల్నిగురించి, దుస్తులగురించి చాలా వివరంగా చెప్పాను. ఇప్పుడిక శరీరం కిందిభాగంలో ధరించే దుస్తులగురించి వివరిస్తాను. ఆతరువాత వివిధవస్త్రాలు, వివిధవర్గాలవారి దుస్తులనుగురించి, ఆ పిమ్మట స్త్రీల దుస్తులనుగురించీ ముచ్చటిస్తాను.

అరబ్బులు ఒక్క లుంగీతప్ప కట్టరు. హిందువులు కట్టుకునే ధోవతిమోస్తరే అరబ్బులు కట్టుకునేలుంగీ కుట్టివుండదు. ఒకచుట్టు పంచమాదిరిగా వుంటుంది. దాన్ని నడుముదగ్గరలాగి మెలేసి కట్టి దోపుకుంటారు. హిందువులు ఒక్కొక్క ప్రాంతంలోనివారు ఒక్కొక్కమాదిరిగా ధోవతి కట్టుకుంటారు. కొందరు గోచీ పోసి పంచె కడతారు. అంటే పంచెకూడా రెండుకొంగుల్లో ఒకకొంగు కాళ్ళమధ్య నుంచి వెనక్కితీసి నడుముమధ్యన లోపలికి దోపుతారు. మరోకొంగుతీసి నడుము చుట్టూ చుట్టేసుకుంటారు కొందరు. మరికొంతకాలమైనతర్వాత అరబ్బులు లుంగీ అంచులు రెండూ కలిపి అంటకుట్టించి కట్టుకోడమారంభించారు. అంచులు కలిపి కుట్టిన ఆ లుంగీలోకి కాళ్లుదూర్చి పైకి తొడుక్కుని, నడుముదగ్గర లాగి మెలితిప్పి దోపేసుకుంటారు.

మహమ్మదీయ మత ప్రాదుర్భావకాలంలోను, అంతకుమునుపునుంచీగూడ ఇదే జాతీయమైన వస్త్రధారణగా ఏర్పడింది. గొప్ప, బీద, పాదుషాలు, మంత్రులు అందరు ఈ లుంగీలే కట్టేవారు. అయితే కట్టుకోడంలో కొంచెం తేడావుండేది.

అరేబియా గొప్పవాళ్ళు, పెద్దమనుషులు నేలను జీరాడుతూండేట్టుగా లుంగీ కట్టుకునేవాళ్లు. అలా పాదాలు కనబడకుండా, నేలనూడుస్తూ, ఈడుస్తూ వుండేటట్టు కట్టుకోడం అన్నది వాళ్ల దర్జాకింద, ఏదో ఘనతకింద భావించేవాళ్లు. అలాగే కింద వరకు జీరాడుతూ కట్టుకునేవాళ్లు, కొంచెం పైకి కట్టుకునేవాళ్ళని, తమకంటె తక్కువగాను, నీచంగాను చూసేవాళ్ళు. అందువల్ల ఇలా జీరాడుతూ కట్టుకునే విధానాన్ని మహమ్మదీయమతము నిషేధించింది. లుంగీ కట్టుకునేవాళ్ళు దాన్ని చీలమండ దాటనియ్యరాదని నియమం పెట్టింది. ఈ ఆదేశాన్ననుసరించి మహమ్మదీయపండితులు, ప్రస్తుతకాలంలో జనం ధరించే పైజామాలు చీలమండదాటి కిందకి దిగరాదని కట్టడిచేశారు. వెనకటిరోజుల్లో పైజామాలు లేవు కాబట్టి జీరాడుతూ కట్టరాదని లుంగీలవరకే చెప్పడం జరిగింది. తర్వాతికాలంలో పైజామాలు వాడుకలోకి వచ్చాయి. ఆ పైజామాలుగూడ చీలమండదాటి జీరాడుతూ దొడుకుకోడం మొదలుపెడతారేమో. అలాకనుకచేస్తే అప్పటి అరబ్బుల్లోమాదిరిగా ఇప్పుడు గొప్ప, బీద తారతమ్యభావం బయల్దేరుతుందేమోననే ఉద్దేశంతోనే పైజామాలవిషయంలోగూడ ఆ పాతకాలపునియమాన్నే అమలుజరపడం జరిగింది. ఆ కారణంచేతనే భారతదేశంలో ఎవ్వరూ పైజామాలనేవి జీరాడుతూతొడగడం జరగలేదు.)

(హజరత్ మహమ్మదు సాహేబ్ కాలంలోనే, ఈ పైజామాలనేవి ఇతరదేశాల నుంచీ, అరేబియాలో ప్రవేశించాయి. తర్వాత తర్వాత అవి బాగ్దాదునగర దర్బారుని చేరాయి. అక్కడినుంచి మిగతాదేశాల్లోగూక వాడుకై చివరికి జాతీయదుస్తుల కింద స్థిరపడిపోయాయి.

హిందూదేశానికి మహమ్మదీయులు రాకముసుపు, ఇక్కడ ధోవతులేగానీ, పైజామా లుండేవికావు. విజేతలైన ముసల్మానులు తమతోబాటు భారతదేశానికి పైజామాలనుగూడ పట్టుకువచ్చారు. సిస్థాపరులు, భక్తులు, ధార్మికులు నాయకులైన వారెవరు ఈ పైజామాలు ధరించేవారుకారు. వారంతా హజరత్ మహమ్మదు ఆదేశానుసారం లుంగీయే ధరించేవారు. లుంగీయే కట్టుకోవాలని మహమ్మదు ఆదేశం. అందువల్ల అది ప్రత్యేకంగా జాతీయవస్త్రధారణయింది. అది స్వార్థపరులు కానివారికోసం, ధర్మపరాయణులైన ముసల్మానులకోసం విద్యార్థులకోసం, నిర్ణయింపబడిందిట. అయితే సంఘంలో పైజామా ప్రాముఖ్యం ఎంత హెచ్చిం

దంటే, ముసల్మానులేకాదు, హిందువులు, ఇంకా తక్కినజాతులవారంతాగూడ పైజామా తొడుక్కోవడం రివాజై పోయింది.

అయితే మొదట్లో మహమ్మదీయులు తొడుక్కునే పైజామా స్వరూపం ఎలా వుండేదో పరిశీలించాల్సివుంది.

అప్పట్లో వాళ్లు తొడుక్కునే పైజామా కాలిదగ్గర గట్టిగా పట్టుకునుండేది. చీల మండదాకానే వుండేది. దాన్ని వాళ్లు 'షరయీ పైజామా' అనేవాళ్లు. అంటే చీల మండదాకా ఉండే పైజామా అన్నమాట.

ఈ పైజామాలకు బాగ్దాదులో ప్రాచుర్యం ఏర్పడింది. ఇదే ఈరాన్‌లోను టర్కీలోగూడ ప్రచారంలోకి వచ్చింది. ముసల్మానులు భారతదేశానికి వచ్చేటప్పుడు ఈ పైజామాలే ధరించారు.

భారతదేశానికి వచ్చినతర్వాత క్రమంగా ఈ పైజామాలస్వరూపంలో ఎంతో మార్పు వచ్చింది.

ఈ పైజామాలు కాళ్ళదగ్గర అంటే పాదాలనుంచీ పిక్కలదాకా ఇరుకుగా కాలి నంటిపట్టి వుండేవి. ఆ పైభాగంమాత్రం పూర్వపు షరయీపైజామాలవలె తగినంత వదులుగావుండేవి. కొన్నాళ్ళుపోయాక కాళ్ళదగ్గర కొంచెం వదులుపెట్టించడం మొదలెట్టారు. అయితే అవి చీలమండదాకానే గానీ, కిందకి దిగనీయలేదు. ఢిల్లీలో రాజ్యపాలన కొనసాగినంతవరకు భారతదేశంలోఉన్న ముసల్మానులంతా ఈమాదిరి పైజామాల్నే ధరిస్తూవచ్చారు. అయితే కిందివర్గానికిచెందిన ముసల్మానులుమాత్రం హిందువుల సాంగత్య ప్రభావంవల్ల ధోవతులు కడుతూండేవారు. అప్పటి హిందువులుగూడ ఇంట్లో వున్నప్పుడుమాత్రం ధోవతులు కట్టుకునేవారు. బయట మర్యాదగలచోట్లకి వెళ్ళవలసివచ్చినపుడు తప్పనిసరిగా పైజామాయే తొడుక్కుని వెళ్ళేవారు.

ఆ రోజుల్లో కాబూల్, కందహార్లల్లో మరో రెండురకాల పైజామాలు వాడుకలో వుండేవి. అవేమిటంటే, కాబూలువాళ్ళ పైజామాకు కాలిదగ్గర ఇరుగ్గా వుంటుంది. పైభాగమంతా విపరీతమైన వదులుంటుంది. తొడుక్కుంటే కుచ్చెళ్లు కుచ్చెళ్లుగావుండి బుస్సున పెద్ద గాలిబుడగల్లే తయారవుతుంది. వాళ్ళ ఒక్కొక్క పైజామాకి ఒక తానో, రెండుతాన్ల బట్టో పడుతుందనుకోండి. అఫ్ఘనులు ధరించే

పైజామా ఇదే. అయితే కందహారువాళ్లు తొడిగే పైజామా అదో తరహాగా వుంటుంది. దానికి పైభాగం కాబూలువారి పైజామాకున్నంత వదులు వుండదుగానీ, కాళ్ళదగ్గరమాత్రం చెప్పలేనంతవదులు కుచ్చెళ్లు పెట్టుకుంటారు. అందుకని ఓ చేత్తో సవరించకపోతే కాళ్ళకు బందాలుపడి నడక సాగనీయదు.

కందహారునుంచి తండోపతండాలుగా జనం ఢిల్లీవచ్చి ఇక్కడ సైన్యంలోచేరి ఉద్యోగాలు చేస్తూండేవాళ్ళు. వాళ్లు చాల బలశాలులని, పరాక్రమవంతులని పేరు గడించారు. క్రమంగా సైనికుల్లో వాళ్ళ ఆచారవ్యవహారాలు, వాళ్ళదుస్తులు, అలవాట్లు వగైరాలన్నీ చోటు చేసుకోడం మొదలెట్టాయి. కందహారుసైనికుల చలవవల్ల వారి సాంగత్యంవల్ల, ఢిల్లీలోగూడ వారి పైజామాలవంటి అందమైన పైజామాలు, కుచ్చెళ్ళు కుచ్చెళ్ళుగా వుండే కాళ్ళుగల పైజామాలు తొడగడం ఆరంభించారు. ఢిల్లీవారికి ఆ కందహారువాళ్ళన్నా, వాళ్ళశౌర్యము, శౌర్యముతోపాటు వాళ్లతొడిగే దుస్తులంటే ప్రాణమైపోయింది. ఎక్కడెక్కడివాళ్ళుగూడ వేషభాషల్లో వాళ్ళని అనుకరించడం మొదలెట్టారు. వాళ్లమాదిరి దుస్తులు ధరించడం పెద్ద ఫాషన్‌గా తయారైపోయింది. అంటే అంతవరకు పూర్వాచారంప్రకారం వున్న వాళ్లగూడ, ఈ ఫాషన్‌కి గురైపోయారు. ఈ ఫాషన్‌కు అలవాటుపడినవాళ్లెందరో ఢిల్లీనుంచి, లక్నో వచ్చిచేరారు. వాళ్ళు రావడంతో లక్నోలోనూ ఈ కాళ్ళదగ్గర వదులుగావుండే ఈ పైజామాలు బయల్దేరాయి. అయితే షుజా ఉద్దౌలా, ఆసఫుద్దౌలా, సఆదత్ అలీఖాన్ కాలంవరకూ అక్కడికి ఈమాదిరి పైజామాలు రాలేదు. కానీ గాజీఉద్దీన్ హైదర్ లేక ఆయన కుమారుడైన నసీరుద్దీన్ హైదర్ కాలంలోనో, ఇచ్చటి వస్త్రాలంకరణ, ఆచారవ్యవహారాల్లోను మార్పు వచ్చివుండాలి. అయితే అప్పటివాళ్లు ధరించే కుచ్చుల పైజామా అంత వదులుకాకుండా ఇరుకుగాకాకుండ వుండేది. మరీ తాన్లకి తాన్లు గుడ్డపెట్టి కుట్టించేవాళ్లు కారు. కాళ్ళుమార్చి తొడుక్కోడానికి వీలుగా, తగు మోస్తరుగానే కుట్టించుకునేవాళ్ళు. మరి అంత ఇరుగ్గా, వొంటికి పట్టినట్టుగా కుట్టించుకునేవాళ్లు కారు. ఈ కొత్తరకం పైజామా, భారతదేశంలో ఎండాకాలంలో తొడుక్కుంటే ప్రాణానికి ఎంతో హాయినిచ్చేది. ఈ పైజామా చాల కొద్దిరోజుల్లోనే, బహు జనాదరణ పొందింది. గొప్పవారేమిటి, నాగరికులేమిటి, అందరికి ఎంతో యిష్టమైపోయింది. ఫాషన్లు కోరేవారుగూడ ఈ పైజామామీద మోజుపడిపోయేవారు. విద్వాంసులు, నిష్ఠాపరులు, సదాచారసంపన్నులు, కులీనులు,

సామంతులు ఒకరేమిటి, సర్వే సర్వత్ర ఈ పైజామాలు తొడగడం మొదలు పెట్టారు.

ఇప్పుడు లక్నోలో రెండురకాల పైజామాలు వాడుకలో వున్నాయి. ఫాషనుగా కుచ్చెళ్లు కుచ్చెళ్లుగావుండే పైజామా ఒకటి. కాళ్ళదగ్గర పట్టీవేసికుట్టిన పైజామా ఒకటి; ఇవీ అక్కడి నాగరికులు తొడిగే పైజామాలు.

ఇవే ఇంకా గొప్పగా కనబడాలనుకున్న నాగరీకులు పట్టుచీరలతో వీటిని కుట్టించుకుంటారు. ఆ పైజామా కాళ్లముందు వెడల్పుగా గోటువేసివుంటుంది. కుచ్చెళ్ళు కుచ్చెళ్ళుగావుండే అందమైన పైజామానే నసీరుద్దీన్‌హైదరు ధరించేవారు. ఆయనకు ఇంగ్లీషువారి వేషభాషలంటేకూడా చాల యిష్టం. అందుకని ఒక్కొక్కప్పుడు కోటు, పాంటు తొడుక్కునేవాడు. కుచ్చెళ్ళ పైజామానే పంజాబీవారు గరారేదార్ పైజామా అంటారు. అంటే చాలా వదులుపాటి కాళ్లుగల పైజామా అని అర్థం. నసీరుద్దీన్ హైదరుకు ఈరకం పైజామాలంటే చెప్పలేనంత యిష్టమైంది. ఇంగ్లీషువారు తొడిగే గౌన్లంత అందంగా వున్నాయనిపించి తమ అంతఃపురస్త్రీ లందరిచేత ఈ పైజామాలే తొడిగించేవాడు. దానితో అవి రాజాంతఃపుర స్త్రీల దుస్తులుగా మారిపోయాయి. క్రమంగా అక్కడి స్త్రీ జనమంతాకూడ ఆ పైజామాలే ధరించడం వాడుక చేసుకున్నారు. ఆడవారిదుస్తుల్ని గురించి చెప్పుకునేటప్పుడు, దీన్నిగురించి ముచ్చటించుకుందాం.

అయోధ్యలోని రాజసైన్యం పంజాబుని జయించడానికని ఇంగ్లీషువారితో కలిసి సిక్కులతో పోరాడింది. అప్పట్లో సిక్కులు ఒక కొత్తరకం పైజామా తొడుక్కునేవాళ్ళు. అది ఇరుకైన వంకర పైజామా. దాన్ని వాళ్ళు 'ఘుటన్నా' అనేవాళ్ళు. పంజాబ్ వెళ్ళేవాళ్ళందరూ ఆ రకం కత్తిరింపు పైజామాలంటే చాల యిష్టపడేవాళ్లు. అక్కడికోసారి వెళ్ళివచ్చారో ఇక అదే పైజామాలు తొడిగేవాళ్ళు. ఇక్కడివారికికూడ ఆ పైజామాలంటే చాల మోజుంది. మోజంటే మోజా వాళ్ళదేనని చెప్పాలి. పీరు వారనిలేదు, లక్నోలో ఎవర్ని చూసినా అవే పైజామాలు. ఇరుగ్గా, బిగుతుగా చొంటినిపట్టివుండే ఆ పైజామాలే తొడగడం మొదలెట్టారు. శ్రీమంతులబిడ్డలు ఆ వంకర పైజామాలుతప్ప తొడగేవారుకాదు. ఆ పైజామాకి మడమదగ్గర గుండ్రని పట్టీ వుంటుంది. ఆ పట్టీ మడమకి తగిలించుకుంటారు. అలా

పెట్టినట్టయితే పైజామా కాలు పైకి పీక్కు పోతుందా, సాఫీగా విలిచివుంటుందన్న మాట.

లక్నోలో ఈ మూడురకాల పైజామాలు వాడుకలో వుండేవి. తర్వాత ఆంగ్లేయులపరిపాలన వచ్చేసింది. వదులు కుచ్చెళ్ళ పైజామాను, వంకరకత్తిరింపు పైజామాను యుద్ధసామగ్రి వాడకానికి అనువుగా వుండకపోవడంవల్ల పురుషులు వాటికి పూర్తిగా స్వస్తి చెప్పేశారు. నసీరుద్దీన్ హైదరు చలువతో, ఆడవారు మాత్రమే ఆ పైజామాలు ధరించడం వుండేది. పురుషులు ధరించేవి రెండే రెండు రకాలయిన పైజామాలు. అడుగున పెద్ద పట్టీవేసికుట్టిన పైజామా ఒకరకము. రెండోది ఘుటన్నా లేక సున్నీ తెగలోని కొందరు ధార్మికులుధరించే పాతకాలపు షరయీ పైజామా అంటే పొట్టిగా చీలమండదాకావుండే పైజామా అన్నమాట. ఆంగ్లేయులరాకతో జరిగిన మార్పేమిటి అంటే, పైజామాల కత్తిరింపు ఎప్పటి లాగానే వుండేదిగానీ, రకరకాలపట్టువి, రంగురంగులనూలు పైజామాలన్నీ పురుషులు ధరించడం మానేశారు. అవన్నీ వెనుకబడ్డాయి. తర్వాత కొద్దిరోజులకల్లా క్రమంగా అలీగడ్ కాలేజి సోషల్ స్కూలునుంచీ ఇంగ్లీషువారు తొడిగే పాంటు లాటి పైజామాలు సృష్టయినాయి. అవి అంత బిగుతుగానూ వుండవు. వదులుగాను వుండవు, ఇరుకులేకుండా, తేలిగ్గా తొడుక్కోడానికి వీలుగావుండేవి. ఇంగ్లీషు చదువులు చదివేవారంతా. హిందూదేశం మొత్తంమీద, ముఖ్యంగా గొప్ప యింటి కుర్రకారంతాగూడ, ఇంగ్లీషువారుధరించే పాంటుమాదిరి పైజామాలే తొడగడం రివాజై పోవడమేగాక, అవి ధరించేవారిసంఖ్య రోజురోజుకి వృద్ధికాసాగింది. అందువల్ల చదువుకున్నవారిలో చాలామంది, ఆధునిక నాగరికతావిధానంలో అగ్రేసరులయినవారంతా, తమ సాంప్రదాయికమైన వేషభాషలకు ఉద్వాసనచెప్పి, ఇంగ్లీషువారి కోటు పాంటు ధరించడం మొదలెట్టారు. అయితే లక్నోలో యిప్పటికి ఆ పాత సంప్రదాయాల్ని పట్టుకువేలాడే పెద్దలు లేకపోలేదులెండి. ఇంకా కొందరున్నారు. వాళ్లు ఆ పాతకాలపు పెద్దపట్టీవేసివుండే పైజామాలే ధరిస్తారు. వారు తమ పూర్వపు ఆచారవ్యవహారాలు మార్చుకోలేదు.

# 33

పూర్వం జనం అంగరఖా మొదలయినవాటిమీద శాలువ వేసుకోడమన్న రివాజు వుండేది. ఈ శాలువలను రాజాస్థానాల్లో బహూకరించేవారు. ఆ శాలువతోబాటు, ఘనమైన రుమాలు కప్పుకోడం లేక మీద వేసుకోడమనేదికూడ కొంతవరకు ఆచారంగా పాటించేవారు. ఈ రెండువస్తువులు ఢిల్లీనుంచే లక్నోకి వచ్చాయన్న విషయం మర్చిపోరాదు. అయితే లక్నోలో రుమాలు వేసుకోడమే ఎక్కువ వాడుక. చలికాలంలో శాలువతోచేసిన రుమాలు పైన వేసుకుంటారు. చలివేసినప్పుడు శాలువలు కప్పుకుంటారు. ఇది లక్నోలో రాజదర్బారు వెలసినతర్వాత మాట. జనం వేసవికాలంలో దుస్తులు శుభ్రమైనవి, హాయినిచ్చేవిగాను, తేలికైనవి అంటే చాల ఇష్టపడేవాళ్ళు. అందుకని ప్రత్యేకంగా బాబిన్‌నెట్ లేక లింకన్‌తో (వలల్లాటిబట్టలు) రుమాళ్ళు ఏర్పరచుకున్నారు. పెద్దమనుషులంతాకూడ తెల్లనిదుస్తులు ధరించేవాళ్ళు. తలకేమో చౌగోషియా టోపీ (నాలుగు లేక అయిదు ముక్కోణపుముక్కల్తో కుట్టిన టోపీ) వొంటిన అంగరఖా, పెద్ద పట్టీవేసిన పైజామా, మెళ్లో వల్లని వలలాటి తేలికైన రుమాలు ధరించేవాళ్ళు. సాధారణంగా అక్కడిపెద్దలంతా వేసుకునే దుస్తులివే. మీర్ అనీస్ వంశీయులు ఇప్పటికీ సాంప్రదాయికమైన ఈ దుస్తుల్నే ధరిస్తారు.

దుస్తులవిషయం వచ్చినప్పుడు పాదరక్షలు వాటి ప్రత్యేకతనిగురించి చెప్పుకోడంగూడ అవశ్యకమే. ముసల్మానులు భారతదేశానికి రాకపూర్వం, భారతదేశంలో చెప్పులుతొడిగే ఆచారం లేనేలేదు. ఎందుకంటే చర్మంతోచేసిన చెప్పులు తొడగడం, మతదృష్ట్యా వారికి నిషేధం. అందుకని వారు ఈ చెప్పులకుబదులు, కొయ్యతోచేసిన పావుకోళ్లు ధరించేవాళ్ళు. ఇప్పటికి కొందరు సన్యాసులు, బైరాగులే కాకుండా, కొందరు రాజులు, జమీందార్లుకూడ పావుకోళ్ళు తొడుక్కోవడం రివాజు వుంది. ముసల్మానులరాకతో భారతదేశానికి ఈ తోలుతో కుట్టినచెప్పులు వచ్చాయి.

(ముసల్మానులు, అరబ్బులు మొట్టమొదట్లో తొడిగేచెప్పు లెలావుండేవంటే అడుగుభాగానమాత్రం తోలువుండేది. ఆ పైనేమో నవారుబద్దతో పట్టీలు వేసి

వుండేవి. అవే తొడుక్కునేవాళ్లు. ఇరానీలు. రోమ్ వాసులు తోలుమేజోళ్ళు ధరించే వాళ్ళు. తోలు చెప్పులకంటె ముందు అరబ్‌కి తోలుమేజోళ్ళే వచ్చాయి.

అరబ్ రాజదర్బారు సిరియా, ఇరాక్‌ల ఛత్రచ్ఛాయలో నిలవడంవల్ల అక్కడ తోలుచెప్పులు తొడగడం రివాజైంది. మొదట్లోవచ్చిన చెప్పులు ఎంతో సాదాగా వుండేవి. ముసల్మానులు భారతదేశానికి వచ్చినప్పట్లో ఆ చెప్పులే ధరించేవారు.

పూర్వం ఢిల్లీ అమీర్లు పాదుషాల చిత్రపటాలుచూస్తే వారు ఎత్తుమడమల చెప్పులు వేసుకువుండటం కనబడుతుంది. ఢిల్లీపాలన చివరిదశలో వున్నప్పుడు ఛడావులనే చెప్పులు తయారైనాయి. వాటినిర్మాణం ఎలా వుండేదంటే, ఆ చెప్పుల్లో మడమమినహా మిగతా పాదమంతా మూయబడివుండేది. చివర వెడల్పు కొనతేలి, వెనక్కి పాదంమీదికి వంగివుండేది. ఇది మొట్టమొదట ఢిల్లీవారు సృష్టించిన చెప్పుల నమూనా. యాభైఏళ్ళక్రితం ఈ చెప్పులు చాలా వాడుకలో వుండేవి.

ఆతర్వాత సలీంశాహీ చెప్పులని మరోరకంచెప్పులు వచ్చాయి. అవి బహూశా జహంగీరు చక్రవర్తికాలంలోని సృష్టికావచ్చు. ఆ చెప్పులకు చివర భాగా మొన తేలివుంటుంది. ఆ మొనతేలినభాగం కొంచెం పైకి లేచినట్టుంటుంది. ఆ మొనలో బాగా కోసుతేలినభాగం కొంచెంగా వెనక్కి వంపుతిరిగి వుంటుందన్నమాట. ఈ మాదిరిగా చెప్పులు తయారుచేసినతర్వాత వాటిమీద మంచి జరీపని చేసేవారు. దాంతో ఎంతో ఘనంగా కనబడేవి. అందుకుతగ్గట్టు వాటి ధరకూడ చాల హెచ్చుగానే వుండేది. మొత్తంమీద ఆరోజుల్లో ఢిల్లీవాల్, సలీం శాహీ అనే చెప్పులజతలే ఎక్కువ వాడకంలో వుండేవి. వాటిమీదే జరీపని చెయ్యడం జరిగేది. అయితే ఢిల్లీ వాల్ చెప్పులకంటె సలీం శాహీ చెప్పులకే ఎక్కువగిరాకీ పలికింది. వాటివాడకమే పెరిగిపోవడంతో చివరికి ఢిల్లీవాల్ అనే మొదటవచ్చిన చెప్పులవాడకం చప్పపడి పోయింది. సలీం శాహీ చెప్పులఘనతే చెప్పుకోవాలి. ఇంగ్లీషువారి ఫాషనులవల్ల మన దుస్తుల్లోను, చెప్పుల్లోను, మిగతా వాడే వస్తువుల్లోను ఎన్నో మార్పులు చేర్పులు జరిగాయి. ఆ ఫాషన్లు మన సాంప్రదాయికమైన వస్త్రాలంకరణలు తుడిచి పెట్టేసినా, సలీం శాహీ చెప్పులుమాత్రం ఎప్పటిలాగానే జనాదరణపొంది ఉండడ మన్నది ఎక్కువవిషయమనే చెప్పాలి. ఈనాటికి ఆ చెప్పులంటే జనానికెంతో ఇష్టం. భారతీయఫాషనంటే మోజుపడేవాళ్ళు గొప్పగొప్ప దుస్తులుధరించి ఈ

సలీం శాహీ చెప్పులే తొడుగుతారు. ఇప్పటికీ లక్నోలో ఎంతోమంది ఈ చెప్పులే వాడుతున్నారు.

అయితే లక్నోలో రాజ్యపరిపాలనాకాలంలో, చిన్న మొనతేరిన మరో కొత్త రకం చెప్పులు తయారైనాయి. మొదట్లో ఆ చెప్పులు వచ్చినకొత్తలో జనానికి అవంటే విపరీతమైన మోజువుండేవి. ఢిల్లీవాల్, సలీం శాహీ చెప్పుల్లో అయితే మొన పైకిలేచి, వెనక్కి మడిచినట్టుంటే, ఈ కొత్తతరహాచెప్పులకి మొనవెనక తిప్పి మడిచి కుట్టేసివుండేది. ఆ మొనతేలినచోట కొంచెం ఎత్తుగా కనబడేది. అంతే. ఈ చెప్పుల్ని వాళ్ళు ఎర్రని మేకతోలుతో కుట్టేవారు. అవి చాలా తేలిగ్గా చక్కగా వుండేవి. కొందరు, చెప్పులు కుట్టేవాళ్ళచేత యింకా తేలిగ్గా వుండాలని చెప్పి కుట్టించుకునేవాళ్ళు. ఒక జత చెప్పులఖరీదు నాలుగో, అయిదో పైసాలుండే దంతే. అయితే సామాన్యులూ పల్లెటూరివారైతే ఈ నాజూకుచెప్పులు తొడిగేవారు కాదు. వాళ్ళు శేరు శేరున్నర బరువుండే మోటుతరహా కిర్రుచెప్పులే తొడిగేవాళ్ళు. వాటికిపైగా ఆవనూనె పట్టించి, పట్టించి మరికాస్త బరువెక్కించేవాళ్ళు.

కొంతకాలంపోయాక లక్నోలో చిన్న మొనతేలినచెప్పులకు ఇంకా కొత్తకొత్త మెరుగులుదిద్దడం మొదలెట్టారు. మొదట చలికాలంలోను, వేసవికాలంలోను వేసుకోడానికన్నట్టు మెత్తని (కాశానీ) మఖ్మల్‌చెప్పులు తయారుచేసేవారు. వర్షాకాలంలో వాడకానికని గుర్రపు తోలుతోనూ, గాడిద చర్మంతోగాని చెప్పులు చేసేవారు. అయితే మెత్తని మఖ్మల్‌చెప్పులమట్టుకు ఎంతో శ్రేష్ఠంగాను, సాదాగాను, తేలిగ్గాను, అందంగాను ఉండేవిగానీ, ఆకుపచ్చని రంగువేసిన గుర్రం, గాడిద చర్మంతో తయారుచేసిన చెప్పులుమాత్రం పనసకాయవలె బొడిపెలు తేలివుండేవి. అయితే వర్షంలో ఎంత తడిసి ముద్దయినా చెక్కుచెదిరేవే కావు. అదే వాటిలో విశేషం. గాడిద, గుర్రం తోలుతోచేసే చెప్పులతయారీవిధానం బయటిదేశాలనుంచే లక్నోకి చేరింది. లక్నోవారికి వంటబట్టినకళ కాకపోయినప్పటికీ, లక్నోలో యీ చెప్పులు తయారుచేసే ఎన్నోకార్ఖానాలు బయల్దేరాయి. ఎన్నోరకాలు ఎంతో మంచి మంచి చెప్పులు తయారుచేయడం జరుగుతూంది.

మరో కొంతకాలానికి వాటి పనితనంలో మరింతవృద్ధి జరిగింది. చెమ్కీబిళ్లలు పెట్టి చెమ్కీతో లతలుగాకుట్టి పనితనంచేసిన చెప్పులు తయారుకాసాగాయి. వాటికి

జరీతో కుచ్చులుతగిలించి ఎంతో విలక్షణంగా వుండేటట్టు, దాబుసరిగా వుండేటట్టు తయారుచేశారు. చెమ్కీ పనితనం చెయ్యడం మొదలయ్యాక, వాటిమోస్తరే నకిలీవి కల్తీ జరీతో చెప్పులు తయారుచేసి చౌకగా అమ్మేవాళ్ళు. అవి కల్తీవే అయినా పైకి చూపులకిమాత్రం భలే షోగ్గా వుండేటట్టు చేసేవాళ్ళు.

అయితే ఛడావులతోబాటు ఘీతలే చెప్పులుకూడ ప్రచారంలోకి వచ్చాయి. పెద్ద పెద్ద అమీర్లు, ఉన్నతవర్గాలకు చెందినవారు తొడుక్కోడంకోసం ఈ చెప్పులు తయారుచేయబడ్డాయి. పూర్వం హిందూదేశపు జాతీయమైనచెప్పులు అవే. వాటి జ్ఞాపకార్థమన్నట్టే హైదరాబాదులో చేస్తున్నచెప్పులు, మిగతాప్రదేశాల్లో తయారవు తున్న దేశవాళీ రకాలును ఈ చెప్పుల్నే పూర్వం రాజాస్థానాల్లోని పెద్దలు ధరిస్తూండే వారు. రానురాను ఈ ఘీతలే చెప్పుల్లో ఎంతమార్పు వచ్చిందంటే ఆ సన్నవి మొన బదులు పెద్ద ఏనుగుతొండంమోస్తరుగా పొడుగ్గాచేసి వెనక్కి మడమని తాకేటట్టు చుట్టిచుట్టి మడిచి తయారుచేశారు. ఈ చెప్పుల్నే పూర్వం అయోధ్యలోని పాదు షాలు, మంత్రులు, అమీర్లు అందరూ ధరించేవాళ్లు. ఛడావులనే చెప్పులు వచ్చిన వీటిస్థానాన్ని అవి ఆక్రమించేశాయి. సిపాయి తిరుగుబాటు తర్వాతకాలంలో అంతకు ముందున్న ఘీతలా చెప్పులు ఆడవాళ్లుమాత్రం ధరించడం జరిగింది. నాజూకైన పాదాలకు ఆ చెప్పులెంతో అందమిచ్చాయి. పురుషులు ఆ చెప్పుల్ని ధరించడం పొంతం మానేశారు. స్త్రీలు ధరించేచెప్పుల్ని జూతీలంటారు. ఈ రోజువరకు ఏ మార్పులేకుండా, రాకుండా వున్నవల్లా ఆ చెప్పులే. అయితే షియాల మతగురు వులు, పండితులుగూడ ఈనాటికీ ఆ చెప్పుల్నే (జూతీ) ధరించడం వుంది.

ఘీతలేచెప్పులు స్త్రీలు ధరించే (జూతీ) చెప్పులూ వాటిమీదచేసే పనితనాన్నిబట్టి లక్నోలోని ముసల్మానుల్లో రెండురకాల వృత్తిపనివారు బయల్దేరారు. ఎంతోమందికి అదే బ్రతుకుతెరువు అయిపోయింది. ముసల్మానుల్లోని చెప్పులు కుట్టేవారు పరం పరగా అదేవృత్తిగా పెట్టుకున్నవాళ్లు వుండేవాళ్లు. వాళ్లు ఘీతలే చెప్పులుతప్ప మరో రకంచెప్పులు కుట్టేవారుకారు. మరోరకంచెప్పులు కుట్టడమంటే ఏదో తమకు తగని పనిలా భావించేవాళ్లు. లక్నోలో ఆ చెప్పులుకుట్టేవాళ్లవెన్నో కుటుంబాలుండేవి. అందరు పిసలైన ముసల్మానులే. తెల్లని బట్టలుధరించి, కిందిజాతులవారికంటె ఎంతోఘనంగా వుండేవాళ్ళు. కులాసాగా, చీకు చింతా లేకుండా జీవితాలు గడుపు

కునేవాళ్లు. కాలం మారింది. ఆ పాతకాలపు దుస్తులకు ఆదరణ తగ్గిపోయింది. పూర్వకాలపు చెప్పు లెవరికి పనికిరాలేదు. ఘీతలే చెప్పుల్ని పురుషులు ధరించడం మానుకున్నాక, స్త్రీలు ధరించడం మొదలుపెట్టి, వాళ్లూ మానేశారు. ఒకానొకప్పుడు బజార్లో ఏ కొట్టుచూసినా మంచిమంచి ఘీతలేచెప్పుల్తో నిండివుండేవి. అటువంటిది ఇప్పుడువెళ్లి ఆ చెప్పులు కావాలని అడిగితే ఒకటో రెండో జతలుంటాయి. అవీ, ఏనాటివో పాతసరుకై వుంటోంది. దుమ్ము ధూళితో నిండిపోయివుంటుంది. అటువంటిదుర్దశ పట్టింది. జనంలో ఆ రకం చెప్పులవాడకం తగ్గిపోయినందువల్ల, ఆ పనిచేసుకుని ఆ వృత్తితో బతికేవారి కుటుంబాలందరిజీవనం పడిపోయింది. వారి కొంపలన్నీ కూలిపోయాయి. ఆ పరిశ్రమే దెబ్బతిన్నది. ఇంకా దాన్ని నమ్ముకుని ఉన్న కొద్దిమంది జీవనమూకూడ పోవడానికి సిద్ధంగావుంది. అయితే ఒక్కటి. వాళ్ళపట్టుదలమాత్రం ఎంతైనా మెచ్చుకోవాలి. సర్వనాశనమవడానికైనా ఒప్పుకున్నారు. కానీ ఘీతలే చెప్పులబదులు మరోరకం స్లిప్పర్సు జోళ్లు చెయ్యడానికి గాని, కాలంతోపాటు మారి, ఏదో నాలుగుడబ్బులు సంపాయించుకు బాగుపడదామని గాని వారు భావించలేదు. ఘీతలా చెప్పులుతప్ప మరోరకం కుట్టదల్చుకోందే! కష్టాలయినా భరించడానికి సిద్ధమయ్యారుకానీ పట్టుదలమాత్రం విడిచిపెట్టలేదు.

ఇకపోతే రెండోరకంవారని చెప్పుకున్నామే, వాళ్ళు చెప్పుల పట్టీలమీద రకరకాల జరీపనులుచేసే చిత్రకారులన్నమాట. పురుషులు వేసుకునేచెప్పులకో పద్ధతిగాను, స్త్రీలుధరించేచెప్పులకో పద్ధతిగాను, ఆ పట్టీలమీద ఎంతో చక్కగా చెమ్కీపని, జరీపని చేసేవారు. అప్పుడా చెప్పులజతలు అందంగా, డాబుగా, మిలమిల్లాడుతూ, ఎంతోఘనంగా కనబడేవి. అంత చక్కనిపనితనం మనకు మరెంకెక్కడ కనబడదు. ఒకప్పుడు ఆ రకంచెప్పులగిరాకీ ఇంతా అంతా కాదు. కేవలం ఆ వృత్తి మీద ఎంతమందో బ్రతికేవారు. ఎందరికో అది జీవిక అయింది.

అయితే 'ఘీతలే' చెప్పులవాడకం పడిపోవడంతో ఈ చిత్రకారుల బ్రతుకు తెరువూ పోయింది. అటు చెప్పులు కుట్టేవారికి, ఇటు వాటిమీద చక్కని పనితనం చేసేవారికికూడ తిప్పలు వచ్చిపడ్డాయి.

ఈ చెప్పులు తొడగటం మానేశాక స్త్రీలు స్లిప్పర్స్ వాడకం మొదలెట్టారు. గొప్పయింటి ఆడవాళ్ళు, కులీనులైనవారు కొన్ని ప్రత్యేకసమయాల్లో ఉత్తమమైన

పంప్‌షూస్ వేసుకునే ఆచారం వుండి. శ్రీమంతులయిళ్ళల్లో ఫీతలేచెప్పులు మానే సినతర్వాత పువ్వులు, తీగెలుకుట్టి కిత్తనారగుడ్డతో చేసిన బూట్లు తొడుక్కునేవాళ్ళు. ఆతర్వాత కొద్దిరోజులకల్లా తోలుబూట్లు తయారై వచ్చాయి. వానిలో సునాయాసంగా కాలుదూర్చి తొడుక్కోనూవచ్చు. విడవనూవచ్చు. ఏ తాళ్ళూ, బెల్టులు కట్టిపెట్టక్క ర్లేదు.)

(ఇంగ్లీషువారి పద్ధతుల్ని అనుకరించేవారు ఈ పంప్‌షూస్ వేసుకోడం మొదలు పెట్టారు. వారి శ్రీమతులేమో రకరకాల లేడీస్ షూస్ తొడగడం ఆరంభించారు.

ఈ వరుసలోనే స్త్రీల వస్త్రాలంకరణవిషయంగూడ ముచ్చటించుకోవడం అవసరం.)

(పూర్వం హిందూదేశంలోని స్త్రీలంతా చీరెలే కట్టేవారు. చీరె అనేది ఒక కుట్టని బట్టన్నమాట. దాని రెండుకొంగుల్లో ఒకకొంగు నడుముదగ్గర దోపి, చుట్టుతిప్పి కుచ్చెళ్లుపెట్టి, కట్టి, పమిటచెంగుకు కావలసినంత కొంగుమిగిల్చి భుజంమీదుగా తల పైకితెచ్చి మేలిముసుగు వేసుకోడం, కుంటిన రవిక తొడుక్కోవడం హిందువు లకు పూర్వాచారంగా వస్తూవుండి.

ఉత్తర హిందూదేశంలో రవిక అనేదాన్నే దక్షిణదేశంలో చోలీ అని వాడ తారు. రవికకి చోలీకి వున్నతేడా యేమిటంటే, దక్షిణదేశంలో వాడే చోలీకి నడుము దగ్గర వదులుగా పట్టీ వుంటుండి. రెండుకొంగులుకలిపి ఛాతీదగ్గర ముందు కుబుకు సట్లుగా గట్టిగాబిగించి ముడివేసుకుంటారు. లేకపోతే ముడివేసుకోడంబదులు గుండీలు పెట్టుకుంటారు.

ఉత్తరదేశంలో స్త్రీలు తొడిగే రవికని కటోరీచోలీ అంటారు. దానికి రొమ్ము, భుజము, చెయ్యి పూర్తి పిడుపులకొలతలు తీసుకుని, రెండు గోళాకారాల కటోరీ లను కత్తిరించి, అవి రెండుమూడు అంగుళాలమేరకు కుట్టి, ఆ రెంటినీ అంటేపి హమ్మింగు చేస్తారు. భుజము కుట్లనుకుట్టి, పొట్టిపొట్టిచేతులను కుడతారు. రెండు చేతులకింద రెండురెండుకుచ్చులు వేలాడదీస్తారు. అటువంటిచోలీలు వాళ్లు తొడు క్కుంటారు. దానికి వెనకమెడ వుంటుండి. చోలీ తొడుక్కుని వెనుక తాళ్ళతో లాగి పైన, అడుగున ముడివేసుకుంటారు) (ఇవన్నీ హిందువుల పూర్వపుదుస్తులు. మరీ ఇటీవల వీటిల్లో వచ్చిన మార్పులగురించి అంతగా తెలియదుగానీ, రవిక

మాత్రం అప్పటికి ఇప్పటికి ఎక్కువ వాడకంలోవుందనే చెప్పాలి. హిందూస్త్రీల వేషభాషల్నిగురించి ఇంతకుమించి ఏం తెలీదు. అయితే ముసల్మానులరాకతో చొక్కాలు పైజామాలు వచ్చాయి. మహమ్మదీయస్త్రీలు ఈరాన్‌దేశీయుల పద్ధతిన పట్టీవేసి కుట్టిన పొడులుపాటి కాళ్లుగల పైజామాలు ధరించేవాళ్ళు. ఆ పైజామాలకు అడుగున చీలమండదగ్గర జాలుపోసి వుండేది. మరికొన్నిరోజులుపోయాక పైజామాలు మోకాలువరకు ఇరుగ్గా ఉండేవి. దిగువభాగం చీలమండవరకు పైభాగం కంటె చాలా పొడులుగా వుండేది. రానురాను చీలమండవరకు మొత్తం పైజామా విపరీతమైన ఇరుగ్గాను, బిగుతుగాను తొడుక్కోడం మొదలుపెట్టారు. ఎంత బిగుతుగానంటే, అదసలు వొంటినపెట్టి కుట్టారేమో అన్నంత ఇరుకుగా వుండేది. ఇక ఆ పైజామా విప్పడమంటే పెద్ద యజ్ఞమే. ఇరికించుకుపోయిన కాళ్ళు తియ్యడానికి సాధ్యపడక, ఆ పైజామా కాళ్లు చింపవలసినఅగత్యంగూడ వుండేదేమో మరి. అటువంటి బిగుతు పైజామాలు ఇప్పటికి కొన్నికొన్నిచోట్ల వాడుకలోవున్నాయి.

లక్నోలో ముసల్మానుస్త్రీల దుస్తులు మొదట్లో ఈవిధంగానే చాలా ఇరుగ్గానే వుండేవి. వాళ్లు వొంటిని పట్టినట్టుండే బిగుతైన పైజామా, ఇరుకుగా పొట్టిపొట్టి చేతులున్న రవిక తొడుక్కునేవాళ్లు. వీపు, కడుపు కనబడకుండా వుండేందుకవి ఒక విచిత్రమైనచొక్కా తొడిగేవాళ్ళు. ఆ చొక్కా కత్తిరింపు తమాషాగావుంటుంది. ఛాతీవేపు, జాకెట్టు లేక రవిక ఉన్నంతమేర చొక్కా ఏం వుండదు. కానీ లోపల నుంచి రవిక కనబడేటట్టు కత్తిరించేవుంటుంది. దానికి చేతులు వుండవు. అదో తరహా రెండు పొడుగాటి పట్టీలు భుజంమీదుగా కడుపుదాకా వస్తాయి. ఆ చొక్కా వీపుకి కడుపుకి అడ్డంగా, కనుపించనీయకుండా వుంటుంది. ఆ చొక్కాపైన మంచి ఉల్లిపొరలాంటి సన్నని బట్ట తలపై మేలిముసుగుగా వేసుకుంటారు. శాస్త్రార్థం తల మీద వేసుకుంటారేగానీ మేలిముసుగెప్పుడూ భుజాలమీదనే పడివుంటుంది.

హిందూదేశపు శీతోష్ణస్థితినిబట్టి అక్కడివారి నాజూకుదనాన్నిబట్టి రవికలు, వోణీలు ఓ రోజుకంటె ఓ రోజు తేలిక తేలికవి బయల్దేరాయి. ఫాషన్లుగల శ్రీమంతులయిన స్త్రీలు కొందరు గరికెతో రవికలు, క్రేప్‌వోణీలు వేసుకునేవాళ్లు.

నసీరుద్దీన్ హైదరు పాదుషాకాలంలో ఘుటన్నాలనబడే ఇరుకు పైజామాలకు స్వస్తిచెప్పి, వదులయినకాళ్లుగల, కుచ్చెళ్లువుండే పైజామాలు బయల్దేరాయి. అవి

పైన నడుందగ్గర సన్నగా పట్టినట్టుంటాయి. ఇది ఆడవారికోసం, ప్రత్యేకంగా ఆడ వారుధరించే పైజామాలకోసం ఏర్పరచినపద్ధతి. పైజామా కాళ్ళు బాగా పొడుగ్గా కిందగా వుంటాయికాబట్టి నడిచేటప్పుడు వీలుగా వుండేందుకని అంచులు పట్టీదగ్గర నేలరాసుకుని మాయకుండా ఉండేందుకుగాను బొడ్డుదగ్గర పైకి కొంచెంగా దోపు తారు.

సిపాయి తిరుగుబాటుకు దరిదాపుకాలంలోనో, లేక పాదుషాల పరిపాలన చివరి దశలో వుండగానో, మరీ ఉలిపిరికాగితాలవంటి బట్టలుకట్టడం మొదలుపెట్టారు. ఇరుగ్గా, పల్చగా పొట్టిచేతులచొక్కాలు తొడిగేవారు. మొదట్లో రవికలమీద చొక్కాలు తొడగడం మానేశారు. రవికలు తొడగడంగూడ మానేసి, పొట్టిపొట్టి చేతులుండి, బిగుతుగావుండే పల్చని శలూకాలు తొడగడం మొదలెట్టారు. తర్వాత తర్వాత ఆ పొట్టిచేతులుగూడ తీసిపారేసి అసలు చేతులులేనివి తొడిగేవారు. అవి విపరీతమైన పల్చని శలూకాలు కావడంవల్ల వొళ్ళంతా కనబడుతూనే వుండేది. దాంతో శలూకాలు తొడగడంమానేసి కొంచెం వదులుగావుండే చొక్కాలు (కుర్తా) ఆరంభించారు. ఉన్నట్టుండి ఆ చొక్కాలుపోయి వాటిస్థానంలో ఇంగ్లీషు వారి జాకెట్లు, బాడీలు తయారయ్యాయి.)

(ఇప్పుడు ప్రతిరాష్ట్రంలోను, ప్రతిచోట గూడ వేషభాషలన్నీ వ్యత్యాసం లేకుండా ఒకేమోస్తరుగా వుంటున్నాయి. ముసల్మానుస్త్రీలలో కొందరిక్కి చీరెకట్టు చాలా నచ్చింది. అందువల్ల లక్నోలోవి మహిళలంతా దాదాపు సగంమందికిపైగా చీరెలు కట్టడం మొదలుపెట్టారు. చీరెకట్టు చాలా సాదా అని వారు అభిప్రాయ పడ్డారు. అయితే నేనుమాత్రం అందుకు వ్యతిరేకినే. ఎందుకంటే స్త్రీలు ఇంటా వంటాలేని కొత్తకొత్త సింగారాలన్నీ సింగారించుకోడం, రకరకాలుగా వస్త్రధారణ చేయడం, అలా చేసినందువల్ల ఏదో తమలో సరికొత్త అందం వచ్చి పడినట్టు భావించడం అనవసరమని నా అభిప్రాయం. తమ జాతి సంస్కృతిని, సభ్యతని కాదని, తమ ఆచారవ్యవహారాలను విడిచి, తమ సంప్రదాయానికి భిన్నంగా వస్త్రాలంకరణ చేయడమన్నది నాకు సమ్మతం కాదు. అందుకు నేను పూర్తివిరుద్ధమే. ప్రతివారు తమజాతి సంస్కృతి, సంప్రదాయాన్నిబట్టే దుస్తులు ధరించడం ఉత్తమ మంటాను. ఇంతాచేస్తే, ఆ చీరె అనేదేమిటి? కేవలం ఒక కుట్టనిబట్ట. ఆ చీరె

అన్నది మానవనాగరికత ప్రారంభదశలో ఉన్నప్పటిదానికి చిహ్నము. వాంట్లో నాడు నేడు వచ్చిన మార్పేమీలేదు. నిరాడంబరత అనేది చాల ఆకర్షణీయమైందే కావచ్చు. అందుకూ ఒక హద్దంటూవుంది. ప్రత్యేకతవుండాలి. అలా కానప్పుడు, ఆ నిరాడంబరతకు అందం వుండదు. ప్రతిమనిషిగూడ తన అభిరుచికి తగిన దుస్తులు ధరిస్తారనుకోండి. అయితే ముసల్మానుస్త్రీలు చీరెలమోజులో పడటం చూస్తేమట్టుకు ఆ చీరె ధరించడంలోవున్న ప్రత్యేకమైన అందచందాలేవిటో నాకు మాత్రం బోధపడలేదు.

పొరుగింటి పుల్లకూర రుచి అన్నట్టేవుంది. పురుషులు విధివిహితంగా వివాహమై రూపవతి అయిన తన ఇల్లాలినికాదని, యౌవనంలోవున్న పరస్త్రీనిచూసి మోహపడటం ఏమంత సబబుగావుంటుందో చెప్పండి. అది చపలచిత్తంకాదూ? ఇప్పటి యువకులు చాలవరకు తమభార్యల వేషభాషలతో విసుగెత్తిపోయి, పరజాతి స్త్రీల దుస్తులపైన మోజులో మునిగిపోతున్నారు. అది కూడనిపని అని నా మతం. ఒక్క విషయం గుర్తుపెట్టుకోవాలి. మనజాతి యువకులు పరజాతిస్త్రీల దుస్తుల్ని చూసి, మోజుపడ్డట్టే పరజాతియువకులు మనస్త్రీల అలంకారాలు, వేషభాషల్నిచూసి మోహపడటానికి అవకాశముంది. అది సరైన పద్ధతికాదు. సంప్రదాయంకాదు. అది కేవలం కామవాసన అనిపించుకుంటుంది కాబట్టి, ముసల్మానుస్త్రీల వస్త్రాలంకరణ యేమిటి? వారిదుస్తు తెలావుండాలి, వారి సంప్రదాయమేమిటి? వారి వేషధారణ సంప్రదాయబద్ధమైందా, కాదా, అన్నవిషయాలు సావధానచిత్తంతో పరిశీలించాల్సిన అగత్యమెంతైనా వుంది. సభ్యత, సంస్కృతి అనేది కలుషితం కారాదంటాను.

స్త్రీలు వస్త్రాలంకరణ అనేవిషయం చర్చనీయాంశమైన కారణమేమంటే, వారు నైతికంగా పతనం చెందరాదని, నైతికవిలువ పెరగాలని, సమాజోద్ధరణ జరగాలనే ఆశయమే అందుకు మూలము. చపలచిత్తులు కారాదు. అది అనర్థాలకు దారితీస్తుంది. ఎన్నిచెప్పి ఏం లాభం? నేటి యువతరంవారంతా కోటు, పాంటు ధరించి పాశ్చాత్యనాగరికతలో మునిగిపోయి, తమ సంప్రదాయానుగుణమైన వస్త్రాలంకరణకు పూర్తిగా స్వస్తిచెప్పారు.

పురుషుల్లాగానే స్త్రీలంతాగూడ ఎక్కడ తమ సంప్రదాయాన్నివిడిచి ఇంగ్లీషువారి వేషాలంకరణకి లోనౌతారేమోననే అనుమానంతో తమ నాగరికతను, సభ్యతను,

సంప్రదాయాన్ని కోలుపోవద్దని పదేపదే హెచ్చరిక చేస్తున్నాను. ఎందుకంటే ఫాషన్ల మోజుల్లోపడి కొట్టుకుపోయేవారికి తమ స్త్రీలచేతగూడ పాశ్చాత్యుల స్కర్టులు, జాకెట్లు తొడిగించేదాకా తృప్తి కలగకపోవచ్చు. తలుచుకుంటే అంతవరకూగూడ రాగలరు. అందుకే ఈ హెచ్చరికలన్నీను. అయితే చెప్పిచెప్పి, రాసిరాసి, ప్రయోజనమేమైనా వుంటుందో లేదో చెప్పలేను. దండగేనేమో మరి. ఎవరికి వారికి, తమ సంప్రదాయాన్నిబట్టి స్వయంగా తెలియాలి. (దాన్ని అనుసరించి నడుచుకోవాలనే వివేకం వుండాలి. పత్రికల్లో రాసి, అచ్చు వేయించినంతమాత్రాన ప్రయోజనముంటుందనుకోను.)

# 34

దుస్తులవిషయంలో లక్నోలో బట్టలు కత్తిరింపుల్లోను, కుట్టడంలోను, ఫాషన్లలోను రోజురోజుకు వింతవింతమార్పు లెన్నో వస్తున్నాయి. భారతదేశం ఉష్ణప్రదేశం కాబట్టి తక్కువజాతివారంతా వాళ్ళ నిండైనబట్టలు కట్టుకోరు, అర్ధ నగ్నంగానే వుంటారు. అలా అర్ధనగ్నంగా బట్టలు ధరించడమన్నదానికి కారణం, వాళ్ళ పేదరికము కాదు, దారిద్ర్యంవల్ల కాదు. దేశంయొక్క శీతోష్ణపరిస్థితులు, ఋతువులే కారణాలు. అందుకే ఢిల్లీలోకూడ, మందపాటిబట్టలు కట్టకుండా, పల్చని, నాజూకైనబట్టలే ధరించడం మొదలుపెట్టారు. రానురాను యుద్ధాలు, సైనికవృత్తులు వెనకబడడంతో ప్రభువులకు భోగలాలసత మితిమీరింది. స్త్రీజనసాంగత్యం పెరిగిపోయింది. అందువల్ల స్త్రీల దుస్తులప్రభావం పురుషులకు సోకింది. స్త్రీలు సహజంగా తమ దుస్తులకెంతో సింగారాలు చెయ్యడం అనాదిగానేవుంది. ఆ మోస్తరువి పురుషులుకూడ అనుకరించడం మొదలుపెట్టారు.

ముఖ్యంగా ఆ వెనకటిరోజుల్లో పరిపాలకులు, 'నవాబు' శబ్దాన్నివిడిచి, పాదుషా పదవి స్వీకరించినప్పటి మాట. నైశాపురీ, సాలార్‌జంగ్ వంశీయులంతా ఉపకార వేతనాలు పుచ్చుకుంటున్నరోజుల్లో ఏవిధమైన కాలక్షేపములేక, ఏ వ్యాపకములేక

స్త్రీజనసాంగత్యం చేసేవారు. ఇందుకు ఫలితమేమైందంటే, వారుండే ఉనికిలో మని కిలో, వేసుకునేదుస్తుల్లో, మాట్లాడేమాటలో, ఆడతనం వచ్చి, ఆడంగిరేకులుగా తయారై కూర్చున్నారు. అటువంటివారే ఊళ్ళో గొప్పవారుగా, శ్రీమంతులుగా చలామణీ అవుతూండేవారు. దానితో జనంగూడ వారినే అనుకరించడం మొదలు పెట్టారు. మిగతాప్రదేశాల్లో వుండేవారి ఫక్కీలోకాకుండా, లక్నోవారి పురుషు లంతా సాధారణంగా తల పాపటతీసుకునే దువ్వుకునేవారు. తలమీద ముందుభాగాన మాత్రం, అంటే నొసటివేపున అమరేటట్లు చక్కని అందమైనటోపీ పెట్టుకునే వారు. చెవులదాకా గిరజాలజుట్టు, మధ్యగా పాపటతీసుకుని జుట్టును చెరిసగంగా రెండువేపుల నున్నగా క్రిందికి దువ్వుకునేవారు. నోట్లో తాంబూలం, పెదవులకు లత్తుక, నడుముదగ్గర గోటువేసికుట్టిన బిగుతుగావుండే అంగరఖా, పట్టులాగూ, అదీ మోకాళ్ళవరకే, చేతులకు గోరింటాకు, కాళ్ళకు మంచిబూట్లు వేసుకునేవారు. అదే చలికాలంకనుకైతే అంగరఖాబదులు, నీలంగానీ, పసుపుపచ్చగాని, ఎరుపు లేక ఆకుపచ్చనిదిగానీ, ఫ్లానెల్‌బట్టలో దూదికూరిచేసిన చొక్కా తొడుక్కునేవారు, చలికాలంలో ఇక్కడుండే గొప్పవారు సామాన్యంగా ఉన్నిబట్టతో తయారుచేసిన పొడలుపాటి దుస్తుల్నే ధరిస్తారు. పైన శాలువ కప్పుకుంటారు. ఆఖరికి చేతి రుమాలుకూడ ఉన్నిగుడ్డ వాడటం వారికిష్టం. ఔనుమరి! లక్నోలో తయారయ్యే టంత అందమైన శాలువలు, ఉన్నిబట్టలు కాశ్మీరులోకూడ దొరకవు సరికదా భారత దేశంలో మరింకెక్కడా దొరకవు.

లక్నోవారికి శాలువలంటే మహాయిష్టం. శాలువలు నేసేవాళ్ళు, పోగులు తీసే వాళ్లు, వాటిని ఉతికేవాళ్లు ఎందరో ఒకప్పుడు కాశ్మీరీలు తమ మాతృభూమి వదిలి పెట్టి లక్నోకివెళ్ళి స్థిరపడిపోయారు. కానీ, గడచిన యాభై ఏళ్ళలోగా వారంతా ఏమైపోయారో, వాళ్ళకో ఊరూ పేరూ అంటూ లేకుండా పోయారు. వాళ్ళలో యిప్పుడు ఎందరున్నారో, ఎందరు పోయారో ఉన్నవాళ్ళయినా ఏ వృత్తులుచేసుకుని బ్రతుకుతున్నారో మరి!

మొహర్రంపండుగకు లక్నోలో అతి ప్రాముఖ్యమిచ్చి చేస్తారు. అయితే అది శోకదాయకమైంది కదా. దాన్ని దృష్టిలోపెట్టుకునే, వారు మొహర్రం పండుగకోస మని ప్రత్యేకమైనదుస్తులు, నగలు ఎన్నిక చేశారు. నీలంరంగు, నలుపురంగు శోక

సూచకమైనవిగా పెట్టుకున్నారు. అబ్బాసీలకాలంలో నల్లరంగుకుబదులు వారు ఆకు పచ్చరంగును 'ఫాతిమా రంగని' చెప్పి వాడేవారు. ఫాతిమా, (ముహమ్మదు కుమార్తె, అలీ భార్య, హసన్-హుసేన్‌ల తల్లి). అందువల్ల ఇప్పటికి ఈరాన్ లోను, హిందూదేశంలోను కొందరు ఫాతిమా సంప్రదాయంవారు ఆకుపచ్చని తలపాగాలుధరించి తమ నాయకులకు శ్రద్ధాంజలులర్పించడం పరిపాటైంది.

మొహర్రంలో ఎరుపురంగు వాడకం నిషేధం. ఆకుపచ్చ, నలుపు, నీలం వీటితోబాటు పసుపుపచ్చగూడ ఆ ఋతువునుబట్టి ఆ తరుణాన్నిబట్టి సరైనవని ఎన్నుకున్నారు. అందుకనే ఇక్కడ జరిగే మొహర్రంపండుగలో ఆడవారి దుస్తులన్నీ పైనచెప్పినరంగుల్లోనే వుంటాయి. ఆ సమయంలో వొంటినున్నసొమ్మంతా తీసేస్తారు. గాజులు దూసేసి, వాటికిబదులు చేతులకు పట్టుతోచేసిన నలుపు, ఆకు పచ్చని పోచీలు పెట్టుకుంటారు. చెవులకు పెట్టుకోడానికి నల్లనివి, పసుపుపచ్చని రంగుల పట్టుతోచేసిన కర్ణపుష్పాలు ఏర్పరచుకున్నారు. అందంలో, ఆ పనితనంలో వెండి, బంగారు సొమ్ముల్నిగూడ మించివుంటాయి ఈ పోచీలూ, కర్ణపుష్పాలూ.

ముసల్మానుల కొత్తసంవత్సరంలో మొదటినెలకు మొహర్రం అని పేరు. ఆ నెల వారికెంతో విశిష్టమైనది. అక్కడిస్త్రీలు ఆ యా ఋతువులకు, కాలాలకు అనుగుణమైన దుస్తుల్ని వేసుకుంటారు. వారిదుస్తుల్లో రోజుకో వింతమార్పుతో కొత్తకొత్తరకాలు సృష్టిస్తున్నారు. వారి వస్త్రాలంకరణచూస్తే యావద్భారతదేశం విస్తుపోవలసిందే. ఆమాటకొస్తే, ఇప్పటికి యాభైసంవత్సరాలక్రితం లక్నోలో స్త్రీలదుస్తులు, ఆ రకరకాల కత్తిరింపులు కుట్టడమేకాకుండా, ఇంకాఇంకా రోజు రోజుకి వస్తున్నమార్పులు, ఆ కొత్తతరహాలు చూసినట్లయితే ఫ్రాంసు, లండన్‌ల లోని ఫాషన్‌లసంగతే మర్చిపోతారు. అందుకనే చాలామంది లక్నోను తూర్పు దేశపు పారిస్ పట్టణమన్నారు.

ఈనాడు నిరాడంబరతని కాంక్షించేవారు, ప్రగతిశీలురు నేటి సామాజికవ్యవస్థ పట్ల విముఖత చూపేవారు. ఈ అనవసరమైన వృధాపోషకులంటే అభ్యంతరం చెబుతారుగానీ, ఒకానొకప్పుడు రాజ్యాలు వెలసినచోట, దర్బార్లు నడిచినచోట, సంస్కృతికి సభ్యతకి ఆటపట్టనిపించుకొన్నచోట ఉన్న జనాభా ఆడంబరంగా వున్నారనా, ఆడంబరాలకోసం ప్రాకులాడారన్నా అర్థముందిగడా! ఏదో తాత్విక

దృష్టితో పరిశీలించేవారి కవన్నీ వ్యర్థంగానే కనబడతాయనుకోండి. కానీ, గొప్ప గొప్పవారితో ఇష్టాగోష్ఠులు సాగించేటప్పుడు, నాగరికప్రజల సముదాయంలోను, సమావేశాల్లోను, ఈ ఆడంబరాలన్నీ అతి ముఖ్యమైనవిగా భావించడం కద్దు.

ఆకాలంలో పురుషులంతా స్త్రీల దుస్తులమీద మోజుపడేవారు. పురుషుల వస్త్ర ధారణలో స్త్రీల దుస్తుల ప్రభావం బాగా వుండేది. స్త్రీలు ధరించేటటువంటి, వాడే టటువంటి అందచందాలు, రంగులు, మిలమిల మెరిసే బట్టలు వాడినట్టయితే, పోనీ అంతవరకు నయమే అనుకుందాం. అదికాదే: కుట్టడంలో పనితనంలో కూడ ఆడ మగ దుస్తులకు తేడాలేకపోయె: భార్యాభర్తలు వేసుకునే దూదిచొక్కాలు, పైన వేసుకునే వల్లెవాట్లు, పత్తితోనింపిన పచ్చడాలు, రజాయిలు, యింకా పైజామాలు, వగైరాల్లో తేడా అనేది లేనేలేదు. అయితే స్త్రీలు పెట్టుకునే ఆభరణాలుమాత్రం పురుషులు ధరించేవారుకారు. పట్టుబట్టలే కట్టినా, గోటులేకుండామాత్రం కట్టేవారు. సాధారణంగా కొట్టొచ్చేరంగులు ఏరుకునేవారు. సిపాయీల తిరుగుబాటు జరిగిన తర్వాత క్రమంగా వారి అభిరుచుల్లో మార్పువచ్చింది. వారి వస్త్రధారణమీద ఇంగ్లీషు వారిప్రభావం పడింది. ఇంకా ఆ పూర్వపుపద్ధతుల్లో నడుచుకునేవారిలో ఒకరో యిద్దరో అన్నట్టు మిగిలారంతే.

విభిన్నవర్గాలకుచెందిన పురుషుల వస్త్రధారణలాగానే, విభిన్నవర్గాలకుచెందిన స్త్రీల వస్త్రధారణకూడ ప్రత్యేకత కలిగివుండేది. ఇంగ్లీషువారిలో వంటమనుషులకు, బండితోలేవాళ్ళకు, అశ్వరక్షకులకు, రకరకాల వేరువేరుదుస్తులు ఏర్పరిచారు. ఆ దుస్తులు వారు చేసేపనికోసం వేసుకోవలసినవిగానీ, మామూలుప్రకారం యింట్లో వేసుకోడానికి కుదరదు. అదేపద్ధతిగా లక్నోవారుకూడ ఆడ మగ పనివాళ్ళకు, ఇంటాబయట వుండే మిగిలిన పరివారానికంతటికీ, ప్రత్యేకమైన దుస్తులు ఏర్పాటు చేశారు. వాళ్ళవే ధరించాలన్నమాట. ఉదాహరణకు దేవిడీ ముందుండే భటులకి, రాజసేవకులకు (చోబ్దార్), వార్తాహరులకి, వారివారి ప్రత్యేకమైన దుస్తులున్నాయి. అదేమాదిరిగా అంతఃపురదాసీలకు, కుట్టు, అల్లికపనులు చేసేస్త్రీలకు, అట్లుకోమే పనిమనుష్యులకు వేరువేరు దుస్తులున్నాయి. వారివారి దుస్తుల్లోని వైవిధ్యంవల్ల దూరంనుంచీ చూసీచూడగానే, వారిని ఇట్టే గుర్తుపట్టడానికి వీలయ్యేది. ఫలానా మనిషి, అంతఃపురం దాసీ అని, ఫలానామనిషి పెద్దదాసీ అని, ఫలానామనిషి అల్లికలు కుట్టుకుట్టే స్త్రీ అని, ఫలానామనిషి పనిగత్తె అని కనుక్కోడానికి ఎంతోసేపు

పట్టదు. వారు వేసుకునే దుస్తులేమంత దాబుసరిగానూ వుండవు. చూపులకు ఇంపు గానూ వుండవు.

(పరిచారకులు, సేవకులుమాత్రం యజమానులు విడిచిపారేసినదుస్తులే తొడుక్కుం టారు. అందుకని ఆ రెండుతెగలవారికని ప్రత్యేకమైన దుస్తులయేర్పాటే వుండదు.) దుస్తులవిషయమైనతర్వాత, ఆడవారికి అతి ప్రియమైన భూషణాలగురించి చెప్పు కోవాలి. ఆడవాళ్లు తమఆస్తిని, డబ్బుని తమ సొమ్ముకింద భావిస్తారు. దాని పరి ణామమే, భారతదేశంలో చాలాచోట్ల స్త్రీల సొమ్ములు పరమ అసహ్యంగాను, మోటుతరహాగాను వుంటూంటాయి. వారు ఆ సొమ్ములవిలువ చూస్తారేగానీ, వాటి అందం చందం గమనించరు. సాధారణంగా సొమ్ములంటే అయోధ్యప్రాంతం లోని పల్లెప్రజల కున్నంతఆసక్తి ఇంతా అంతా అని చెప్పలేం. అయితే భారత దేశంలో ప్రతిచోటకూడ నగలంటే వ్యామోహంలేని ఆడవాళ్ళంటూ వుండరను కోండి. వారివ్యామోహం రోజురోజుకు పెరిగిపోతోందిగానీ, తరగడంలేదు. లక్నోలో ఢిల్లీనుంచి ఎంతోమంది గొప్పకుటుంబాలస్త్రీలు వచ్చిచేరారు. వారంతా ఆకాలంలో భారతదేశంలోను, ముఖ్యంగా ఢిల్లీలోను వాడుకలోవుండే సొమ్ము లెన్నో పెట్టుకునివుండేవాళ్లు. తర్వాత కొద్దికాలానికి ప్రజల్లో నాగరికత పెరిగి పోతూవుండడంవల్ల, క్రమంగా సొమ్ముల్లో నాజూకుతనం రావడం మొదలైంది. జనం మోటునగలు ధరించడం తగ్గించేశారు. తేలిగ్గావుండే, అందమైన నాజూకైన నగలే పెట్టుకోసాగారు. ఆభరణమన్నది అలంకారంకోసం పెట్టుకునేదన్నవిషయం గుర్తింపుకు వచ్చింది. సొమ్ములచేతలో అందం, నాజూకైన పనితనం వచ్చింది. రానురాను శ్రీమంతులయిన స్త్రీలవస్త్రధారణలోకూడ చెప్పలేనంత మార్పువచ్చింది. అడ్డదిడ్డంగా గోట్లు అవీ వేయించుకోడం మానేశారు. అతి సాదాగా కట్టేవారు. నాజూకైన సొమ్ములు పెట్టుకునేవారు. లక్నోలో తయారయ్యేటంత నాజూకైన నగలు, బరువనేది లేకుండా తేలికయిన నగలు మరెక్కడా దొరికేవికావు.

(హిందువులు ముక్కుకి నత్తు పెట్టుకోవడమన్నది అనాదిగా వస్తూన్న ఆచారం. ఆ నగను వారు మంగళచిహ్నంగా భావిస్తారు.

హిందూ ముస్లిం సమైక్యత వుండటంవల్ల, హిందూస్త్రీలమాదిరిగా ముస్లిం స్త్రీలుగూడ మాంగల్యచిహ్నమైన నత్తు ధరించడం మొదలెట్టారు. ఇప్పటికి పల్లెల్లో

వుండే ముస్లింస్త్రీలు నాలుగేసి, ఐదేసి తులాలబరువైన నత్తులు పెట్టుకుంటూ వుంటారు. ఆ నత్తుబరువుకు ఆగలేక ముక్కుకుట్టు జారిజారి తెగిపోతే, మళ్లీ పక్కనో కుట్టువేయించుకుని పెట్టుకుంటారేగానీ మానరు. సుమంగళులైనవారు ముక్కుకు నత్తు పెట్టుకోకుండా ఉండరాదన్నమాట. లక్నోనగరంలోవుండే స్త్రీలు మాత్రం ఈ నత్తు పెట్టుకోడం మోటని దానికి స్వస్తిచెప్పి, ముక్కుపుడక పెట్టుకోడం మొదలెట్టారు. ముక్కుపుడక అనేది ఎంతో చక్కని ఆభరణము. ఆ ముక్కుపుడకగూడ నాజూకు మనుషులు కనుకైతే, మరీ కనపడీ కనపడనంత చిన్నదిగా పెట్టుకునేవారు. అంత చిన్నముక్కుపుడకలు అంత పొంకంగా సొగసుగా చెయ్యడమన్నది లక్నోలోని స్వర్ణకారులకుతప్ప ఇతరచోట్లవారికి చేతకాదేమో.

ఇప్పుడిక్కడ దాదాపు పాతిక ముప్పైయేళ్ళబట్టి ముక్కుకి 'బులాకి' అనే నగ పెట్టుకోడం ఆచారమైంది. మనకి ఆ బులాకి పెట్టుకోని ఆడవాళ్ళంటూ కనబడరు. అయితే బులాకి అనేది ఏమంత పెద్ద అందమైనసొమ్ములో జమకాదు. అందరికి నచ్చి యిష్టపడే సొమ్ముకాదు. కానీ సామాన్యంగా అందరు పెట్టుకుంటారు.

ప్రస్తుతకాలంలో ఒకచోటనుంచి ఒకచోటికి రాకపోకలు ఎక్కువకావడం, ఎక్కడెక్కడి ప్రజలు పరస్పరం కలుసుకుంటూ వుండడంవల్ల, ఎన్నెన్నో కొత్తకొత్తరకాల ఆభరణాలు తయారవుతున్నాయి. నగలు చెయ్యడమనే కళ ఎంతో వృద్ధిచెందింది. కొన్నికొన్నినగరాలు, కొన్నికొన్నిరకాల నగలకు ప్రసిద్ధికెక్కాయి. పూర్వం లక్నోలో ఎంతో పనితనంగల స్వర్ణకారులు వుండేవారు. అదెప్పుడంటే ఈ సిపాయిల తిరుగుబాటు కాకపూర్వమన్నమాట. ఆ తర్వాత భారతదేశంలో రైళ్లు ప్రవేశపెట్టారు. ఒక పట్టణానికి ఇంకొకపట్టణం కడు చేరువైపోయింది, ప్రజల్లో పరస్పరం స్నేహసౌహార్దాలు పెంపొందాయి. దాంతో ఆభరణాల్లో ఎన్నో కొత్త రకాలు బయల్దేరాయి.

అయితే ఈనాడు ఈకళలో ఎన్నోనగరాలు లక్నోను మించిపోయాయి, మించిపోతున్నాయి. ముఖ్యంగా కత్తీ వెండితో చవకబారునగలు తయారుచెయ్యడంలో భారతదేశం మొత్తంమీద ఢిల్లీదే ముందడుగు. అయినా నాజూకైనసొమ్ములు కోరుకునే ఎక్కడెక్కడివారు లక్నోలో చేసే వెండి బంగారునగలకే ఆశపడతారు. లక్నోలో చేసిన వెండిపాత్రలంటేనే మోజుపడతారు. అదే లక్నోవారి పనితనంలోని ప్రత్యేకత.

# 35

ఆహారపానీయాలగురించి, వేషభాషలగురించి ఇంతవరకు వివరించాను. మానవుని నాగరికతావిధానాల్లో వచ్చిన మార్పులు, లక్నో అవలంబించినమార్గాలు ఇప్పుడు చర్చనీయాంశాలు.

ప్రపంచంలో ప్రతిదేశానికి ఐకమత్యము, ఆచార వ్యవహారాదుల కొక పద్ధతంటూ ఏర్పాటై యుంది. దానినే నాగరికత అంటున్నాము. ఆచారవ్యవహారాలు, కట్టుబాటు, ఉనికి, స్వభావము, మాటా మర్యాద, శిష్టాచారాలు, అభిరుచులు, ఇళ్ళు, గృహోపకరణములు (ఫర్నిచర్) ఇవన్నీ కలిసే ఆ జాతి నాగరికత అనిపించుకుంటాయి. మానవుని నిత్యజీవితానికి కావలసిన యీ అత్యవసరసామగ్రులన్నీ, వారివారి నాగరికతననుసరించి, ఆ యా ప్రాంతాల్లో, ప్రదేశాల్లో ఉత్పత్తిచేయబడుతూనేవున్నాయి. ప్రపంచమంతా ఎక్కడికివెళ్ళినా ఆ యా సాంఘికజీవనవిధానాలు, వాని విశిష్టతే మనకు ప్రతిచోటా గోచరిస్తుంది. రాజ్యాలు కుదురుకొన్నచోట విద్యలు వర్ధిల్లినచోట వెలసిన నాగరికసంఘం, దేశంలోని పెద్ద భూభాగాన్ని తనవశం చేసుకుంటుంది. ప్రతిపల్లెను పట్టణాన్ని తన సంస్కృతి సభ్యతలకు స్థావరంగా ఏర్పరచుకుంటుంది. ఆ ప్రదేశాలమీద తనప్రభావం వేస్తుంది.

భారతదేశంలో సభ్యతకు సంస్కృతికి, సాంఘికాచారలకు ఢిల్లీ సుస్థిరమైన మూలకేంద్రంగా ఏర్పడింది. అందువల్ల ఆ ఢిల్లీ అనేకశతాబ్దాలవరకు భారతదేశానికి రాజధానిగాను, పరిపాలకులకు పీఠంగాను వుండేది. భారతదేశమంతా వారి పరిపాలనకు లోబడివుండేది. దేశపరిపాలకులు, శిష్టాచారాలునేర్పే పెద్దలు ఆ వాతావరణంలో పుట్టిపెరిగినవారై యుండేవారు. ఆవిషయంలో లక్నోకు ఢిల్లీని ఎదిరించేస్తోమతు లేదు. ఢిల్లీకివున్న ప్రత్యేకతగాని, ప్రతిష్ఠగాని లక్నోకు లేదనే చెప్పాలి. అయితే గడచినశతాబ్దంలో ఢిల్లీ సంతరించుకున్న సంస్కృతి లక్నోకువచ్చి చేరింది. ఎలాగంటే, ఢిల్లీలోని శ్రీమంతులు, పెద్దలు, విద్వాంసులు, కవులు, ధర్మనిష్ఠాపరులు, సంస్కర్తలు మొత్తం అందరు లక్నోవచ్చి చేరారు. ఇంతేకాదు, ఢిల్లీదర్బారులో ఆదరణకు నోచుకోని ప్రతికళ వచ్చి లక్నోను ఆశ్రయించి తరించింది.

ఈవిధంగా పేరుమోసిన పెద్దలంతా ఒక్కొక్కరు లక్నో చేరి, సుఖశాంతులతో వుండి, తమ సంస్కృతిని ఇంకా ఇంకా ఇనుమడింపజేశారు. అయోధ్యలో పాదు కున్న ఢిల్లీవారి నాగరికతని అయోధ్యాపురవాసులెవరూ ఆదరించలేదంటే ఆశ్చ ర్యంగాలేదూ ? ఇంతేకాదు లక్నోలోని పూర్వకాలపువారుగూడ ఈ కొత్త సంస్కృ తిలో తలమార్చలేదు.

ఆమాటకొస్తే ఉన్నతస్థాయినందుకున్న మానవసమాజంయొక్క చరమదశకు ప్రతిబింబమే లక్నోవారి సంస్కృతి.

గడచినశతాబ్దంలోని ప్రాచీన ఢిల్లీసంస్కృతిలో రెండు విభాగాలైనాయి. ఒక భాగం ఢిల్లీలోనే వుండిపోయింది. రెండోభాగం లక్నో చేరుకుంది. అది మహమ్మ దీయ సామ్రాజ్యపతనానికి చివరిదశ. రాజ్యం బలహీనమైపోయింది. ఆధిక్యత తగ్గి పోవడంతో అభ్యుదయం చెందడానికి అవకాశం కరువైంది. అప్పుడే అక్కడి సంస్కృతి రెండుగా చీలిపోయింది. అభ్యుదయాన్ని వాంఛించినశాఖ లక్నోకు వలసపోయింది. మరొకశాఖ ఢిల్లీనే నమ్ముకుని వుండిపోయింది. లక్నోకు వలస పోయినశాఖ ప్రగతిపథాన ముందుకుసాగింది. ఢిల్లీశాఖ వున్నచోటే వుండి పోయింది. లక్నోయొక్క గొప్పతన మిందులోనేవుంది చూశారా ? ఢిల్లీలో వికసించిన సంస్కృతికి రాజపోషణ బాగా తగ్గింది. అయితే కాలక్రమేణా వ్యాపా రులసంఖ్యగూడ పెరిగిపోవడంతో, మూర్ఖంగా కొందరు వ్యాపారులు, కులీనులు కొందరు ఢిల్లీ విడిచిపెట్టి వేరేవేరే ప్రదేశాలకే వెళ్ళారో, లేకపోతే తలుపేసుకుని యింటనే మగ్గిపోయారోగానీ, వాళ్ళకున్న నాగరికతంతా నాశనమైపోయింది. అయో ధ్యలో రాజ్యపతనానంతరం, బయటజనం రాకపోకలు సాగించడంవల్లను, వారి యొక్క పురాతనపుపద్ధతులూ, నాగరికతా నట్టేట గలసిపోయి లక్నోలో మరో క్రొత్తతరహా నాగరికత ప్రారంభమై, అదీ రోజురోజుకీ దినదినాభివృద్ధి... 

సిపాయిల తిరుగుబాటు తర్వాత లక్నోలో విజృంభించి వృద్ధిచెందుతూన్న ఆ దిక్కుమాలినసమాజం విద్రోహకరమైన ఆచారవ్యవహారాల ప్రమేయం మనకు అక్కర్లేదు. ఢిల్లీ రాజులపోషణలోపెరిగి లక్నో చేరుకుని, వర్ధిల్లి, లక్నో ప్రజా జీవనంలో మిళితమైపోయిన సంస్కృతినిగురించి చెప్పడమే కర్తవ్యము. ఇక్కడ

వర్ధిల్లిన సంస్కృతిలో ముఖ్యంగా పేర్కొనదగినది—(1) ఇల్లు, (2) ఫర్నిచర్, (3) వేషము-ఆభరణాలు, (4) శిష్టాచారాలు, (5) సభామర్యాదలు, (6) అభివాదన విధానము, (7) యోగక్షేమాలు విచారించడము, (8) హాస్యధోరణి, (9) వివాహాది వేడుకలు, (10) సమావేశాలు, (11) మౌలూద్ శరీఫ్ కీ మహఫిలే (హజరత్ మహమ్మద్‌వారి జీవితవిశేషాల నుగ్గడిస్తూ చేసుకునే ఉత్సవాలు) ఇత్యాదులు.

## 1. కట్టడాలు

ఢిల్లీ, లక్నోలోని పూర్వకాలపు ఇళ్ళనిగురించి అందమైన కట్టడాల్నిగురించి చెప్పాలి అంటే అందచందాలు, వైభవం అంతా రాజభవనాలవరకే పరిమితమై పోయింది అనుకోవాలి. వ్యాపారస్థులు, ధనికులు కట్టుకునే యిళ్ళు, లోపల విశాలంగా ఎంత గొప్పగా, డాబుగా వున్నప్పటికి బయటికిమాత్రం అతి సామాన్యమైనవిగా వుంటాయి. అలా కనబడేటట్టు కట్టుకోడానికి కారణం లేకపోలేదు. ఒక అందమైన ఇల్లుంటే, అది పాదుషావారి కంటపడిందో, ఇక ఆ యిల్లు కట్టుకున్న యజమానులకు ఆ యింటవుండే అదృష్టం లేనట్టే. పైగా ఇంకొకటి. ప్రజలు తమ యిళ్ళు రాజభవనాలవలె సుందరంగా కట్టుకోడం ద్రోహంగా భావింపబడేది. ఇక వాళ్ళకు సుఖశాంతులతో జీవితం గడపడం దుర్భరమైపోయేది.

అందుకనే ఢిల్లీలో చూడండి, పెద్దపెద్దగోరీలు తప్ప పూర్వకాలపుభవంతులు, చెప్పుకోతగినంత అందమైనకట్టడాలు కనబడనే కనబడవు. ప్రజల్లో ధనికులయిన వ్యాపారస్తులు లేకనా? సామంతులు లేకనా? వారికి అన్నీవున్నా వారు అందమైన కట్టడాలు కట్టుకునేహక్కు పెట్టిపుట్టలేదు. లక్నోలోగూడ మొట్టమొదట్లో ఇదే పరిస్థితి వుండేది. నవాబు అసఫుద్దౌలా, నవాబు సఆదత్ అలీఖాన్‌ల పరిపాలనా కాలంలో ఫ్రాంసు దేశీయుడైన ఒక ధనికుడైన వ్యాపారి మోసియో మార్టిన్ అనే అతడు ఒకటి రెండు గొప్పభవనాలు నిర్మించాడు. ఒకవేళ ప్రభువుకు కనుక ఆ భవనాలు నచ్చినపక్షంలో ఆయనకు అమ్మేయాలనే తలంపుతోనే కట్టాడు. ఇప్పుడు ఈ భవనాల్లోనే లా మార్టిన్ కాలేజి వుంది. నవాబు సఆదత్ అలీఖాన్ దురాశాఫలితంగా ఆ భవనాలు ప్రభుత్వానికి స్వాధీనం కాజాలకపోయాయి. ఇప్పుడివి మార్టిన్ సాహెబ్ కోఠీ అని పిలువబడుతున్నాయి.

ఆతర్వాత ఇక్కడ రోషనుద్దౌలా అనే మంత్రి తను వుండటానికని ఒక అంద మైనభవనం నిర్మించుకున్నాడు. అలా నిర్మించుకున్నందుకు ఫలితమేమైందంటే రాజ్యాధికారులు ఆ భవనాన్ని జప్తు చేయించేరు. రాజ్యపాలన ముగిసేటప్పుడు ఆ భవనాన్నిగూడ రాజభవనంకిందనే జమచేసేశారు. దాంతో ఇంగ్లీషువారి పాలనా కాలంలో, ఆ భవనం పాలకులకు చెందింది కాబట్టి ప్రభుత్వంవారికే స్వాధీనమై పోయింది. చివరికి రోషనుద్దౌలా వారసులకుగూడ దక్కకుండా అయింది. అయితే నేటికీ ఆ భవనం రోషనుద్దౌలా కోఠీగానే వాడుకలో వుంది. ఇప్పుడది డిప్టీ కమీష నర్, వారి సహాయకుల కార్యాలయంగా మారింది.

ఇక్కడ సామాన్యప్రజల ఇళ్ళు వాకిళ్ళు యూరప్‌లోని ఎత్తయిన ఇళ్ళ మోస్తరుగాకాకుండా వేరుమాదిరిగా వుంటాయి. కారణమేమంటే యూరప్‌లోని స్త్రీజన మంతాకూడ పురుషుల్లాగానే స్వేచ్ఛగా బయట వాతావరణంలో తిరగడానికి అల వాటుపడినవాళ్ళు గనుక వాళ్ళు యిళ్ళలో ఉండాలన్నఅగత్యం లేకపోయింది.

మనకిక్కడ ఆ పద్ధతిలేదు. ఇక్కడిస్త్రీలకి ఘోషా. వారు బయటికిపోరు. కాబట్టి ఇళ్ళలోనేవుంటూ, స్వేచ్ఛగా గాలి పీల్చుకోడానికివీలుగా వుండాలని ఇంటికి ముంగి లంటూవుండటం ఇక్కడ అవసరమైంది. ఇక్కడ ముంగిలిలేని ఇల్లంటూ వుండదు.

ఇటువంటిపరిస్థితులు, ఆచారవ్యవహారాలనుబట్టే ఇక్కడ నిర్మించబడే భవనాలు, ఇళ్లు ఒక ప్రత్యేకవిధానాన్ని పుణికిపుచ్చుకున్నాయి. ఇంటిమధ్య ఖాళీస్థలంవుంటుంది. దానికి పెడగా ఇల్లుంటుంది. ఆ ఇళ్ళనిర్మాణంలో ఒక క్రమం వుంది. ఇటుక సున్నంతో కట్టిన స్తంభాలుంటాయి. ఆ స్తంభాలమీదుగా మూడు, మూడుకంటె ఎక్కువ ఆర్చీ ద్వారాలు వుంటాయి. ఆ ఆర్చీలు షాజహానుకాలంనాటి ఆర్చీల నమూనాలోనే వుంటాయి. అంటే ధనురాకారంగా కొన్ని ఆర్చీలుకలిపి ఒక పెద్ద ఆర్చీక్రింద వుంటుంది.

ఒక్కొక్క ఆర్చీకి రెండురెట్లు, మూడురెట్లు పెద్దవైన వలయాకారంలో హాళ్ళు వుంటాయి. హాలుకి హాలుకిమధ్య ద్వారంపెట్టి, ఏకంగా పెద్దచావిడికింద చేసు కోడమూ వుంది. లేకపోతే బాగా ఎత్తుపెంచి చప్టాగాను చేసుకోవచ్చు.

వృత్తాకారంలో వుండే ఈ పెద్దహాళ్ళకు ఇటు అటు గదులుంటాయి. ఈ హాలు పైకప్పు ఎంతో ఎత్తుగా వుంటుంది. ఆ కప్పుకు లోపలగా పక్కలకుగాని, ఎదురు బదురుగాని మరి రెండుగదులు వేసుకోడానికి వీలుగా వుంటుంది.

ప్రాంగణానికి ఇరువైపుల దాని వైశాల్యాన్నిబట్టి వసారా, గదులు, కొట్లు సంభారాలగది, మెట్లు, బావి, శౌచశాల, పనివాళ్ళుండేందుకు గదులు నిర్మిస్తారు. వసారాకు ఎదురుగా ముఖ్యంగా అవసరమనితోస్తే, చోటుంటే అందంగా పోర్టికో ఒకటి కడతారు. ద్వారబంధానికి పెడగా వంటయిల్లు, పనివాళ్ళబసలు వుంటాయి. ఇంటిలోపలిదృశ్యం బయటకు కనబడకుండా మరుగుపరచేందుకన్నట్టు, ఎదురుగా నిలువెత్తుగోడ ఒకటి పెడతారు.

పేదవాళ్ళ సామాన్యుల ఇళ్ళకయితే ఇటుక సున్నంవేసికట్టిన ఆర్చీలుండవు. కొయ్య ఆర్చీలే వుంటాయి. ఒక్కొక్కవరండాకు కనీసం మూడేసి వాకిళ్లు పెట్టు కుంటారు. ఎడాపెడా వసారాలు వుంటాయి. కొందరికైతే, పెడవాకిళ్లు పెట్టు కోడం, ఇంటిచుట్టూ వసారాలు దింపుకోడం ఆచారం. ఆ వసారాలకు పక్కగా ఒంటిరెక్క తలుపున్న చిన్నచిన్న కొట్లుంటాయి. అడపా దడపా వచ్చిపడే అవస రాలకు అవి వాడుకుంటూంటారు.

ఈపద్ధతిగా ఇక్కడి ఇళ్లుంటాయి. కాస్తంతజాగాలో ఎంతో ఉపాయంగా, ఎన్నో గదులు, కొట్లు, రకరకాలుగా ఎంతో అందంగా వాళ్లు కట్టుకునే తీరు చూస్తూంటే, ఇంత చిన్నచోట్లో, అంతపెద్దయిల్లు ఎలా కట్టారా అని ఆశ్చర్యం కలగకపోదు.

అసలు గృహనిర్మాణమనేదో కళ. దాని పుట్టుపూర్వోత్తరాలు తిరగేస్తే మొట్ట మొదట ఇళ్లు నేలబారుగా వుండేవని తెలుస్తూంది. తర్వాతనే ఎత్తుగా బలిష్ఠంగా, సాదాగావుండే భవంతులనిర్మాణం జరిగింది. ఆతర్వాత చిత్రాలు చిత్రించిన, శిల్పాలు చెక్కిన, చిత్రవిచిత్రాలయిన, రంగురంగుల అందమైనకట్టడాలు తయా రయ్యాయి. వనితసంమాట అలావుంచి అప్పట్లో పెద్దపెద్ద వెడల్పాటిగోడలు, పెద్దపెద్ద సావిళ్లు, హాళ్ళు కట్టుకోవడం సంప్రదాయంగా పెట్టుకున్నారు.

(జానెడు గుడ్డపీలికను దర్జీపనివాడు కత్తిరించి కుట్టి దానికో స్వరూపం ఏర్పరచి నట్టే, భారతదేశపు భవననిర్మాణం చూస్తేనూ అదే అనిపిస్తుంది. జానెడంత

మేరలో బ్రహ్మాండమైనభవనాలు నిర్మితమైనాయి అంటే మాటలా? ఎంత పని తనం కావాలి?

ఈ భవననిర్మాణ కౌశలమన్నది ఢిల్లీవారి సంపద. అక్కడ ఆ కళ అభివృద్ధి చెంది, మిగతాప్రదేశాలకి పాకింది. అన్నిటికంటె ఆ కళ లక్నోలో ఎక్కువగా రాణించింది.

ఈనాడు గొప్పగొప్పభవనాలు నిర్మించిన కొమ్ములుతిరిగిన ఇంజినీర్లెందరో వున్నారు. పైకి భవనం అందంగా ఆకర్షణీయంగా కనబడేటట్టు రూపం దిద్దగలరు. కానీ నూరు చెప్పండి, వెయ్యి చెప్పండి పనితనమంటే పూర్వకాలపు శిల్పులదే. వారికి వారే సాటి. జానెడుహాలులో అతి రమణీయంగా భవనం నిర్మించడం వారికే చేతనవును. అందులో వారి వాస్తుకళానైపుణ్యమంతా కనబడాల్సిందే. కాస్తంత చోట్లో ఎన్ని వసారాలు, ఎన్ని గదులు, ఎన్ని కొట్లు, ఎన్ని ముంగిళ్ళు! చూస్తూంటే కళ్లు తిరిగిపోతాయి. వాళ్ళు ఇంట్లో పరదాగోడ అని కట్టించుకుంటారు. ఆ గోడ ఇటుక సున్నంతో కట్టిందే అయినా, ఆ గోడ కట్టడంలో వారిపనితనం ఇంతా అంతా కాదు. గోడలో ఆ పల్చదనం, నాజూకుదనం. మళ్లీ అంతకంత దార్ఢ్యం! చూడటానికి కొయ్య తెరేమో అన్నంత యిదిగా వుంటుంది.

గృహనిర్మాణంలోని ఈ పనితనం క్రమేణా సన్నగిల్లిపోతూంది. నాటి ఆ పని తనానికి కళకు లోకంలో ఆదరణ వెనకబడింది. అనాటి శిల్పులవంటి వాళ్ళిప్పుడు లేనేలేరు. అంతటి ప్రతిభ ఉన్నవాళ్ళు ఒకరిద్దరయినా వున్నా, ఆ కళకు ఆనాడుండే ఆదరణ ఇప్పుడు కరువైంది.

పూర్వంనుంచీ నేటివరకు హిందూ మహమ్మదీయుల గృహనిర్మాణవిధానంలో వైవిధ్యం వుంటూనేవుంది. హిందువులు తమ ఇళ్ళలో ఖాళీప్రదేశం అట్టే వుంచు కోరు. ఏదో చిన్నదిగా ఇరుకుగా వుంటుందంతే. ఇంట్లోకి తగినంతగాలి, వెలుతురు వస్తున్నాయా లేదా అని వారు గమనించకుండా, ఇళ్ళుమాత్రం ఎంతైనా పెంచి ముయ్యి కట్టేస్తారు.

ఇందుకు పూర్తి విరుద్ధం మహమ్మదీయులు. ఉన్నంతలో గాలి, వెలుతురు సమృద్ధిగావచ్చేటట్టు కట్టుకోడం వారిమతం. పూర్వకాలపు శిల్పులు కట్టిన ఆ యిళ్లూ వాకిళ్లూ వారి అభిరుచికి నిదర్శనాలే.

ఇవికాకుండా ఆకాలంలోని కళాకారులయిన మేస్త్రీలు ఇంటిగదుల్లోను, ఆర్చీలకు, వసారాల్లోను, గది గోడలమీద రంగుల్తో రకరకాల లతలు, చిత్రాలు వేసేవారు. ఈనాటివారిలో అంతటి పనితనం అరుదుగా కనబడుతుంది. ప్రస్తుతకాలంలో చిత్రకళ ఎంతో అభివృద్ధిచెందినమాట వాస్తవమే. కాని గోడలమీద, ద్వార బంధాల మీద ఆనాటి తాపీపనివారు ఎంతటి చిత్రాలు చిత్రించేవారో, అంతటి కళానైపుణ్యం ఈనాడు చూద్దామన్నా కనబడదు. ఆధునికకాలంలో ఆడంబరాలకు తావులేదు కనుక రోజురోజుకు ఆ కళ అడుగంటిపోతూంది. ఏది ఏమైనా లక్నోలోని తాపీపనివారి కున్నంత పనితనం, వారంతటి ఘటికులు ఏ యితరప్రాంతాల్లోను లేరని ఢంకా బజాయించి చెప్పవచ్చు.

ఇండ్ల కప్పులమీద, గోడలమీద వారు అపురూపమైనచిత్రాలు చిత్రించారు.

ఈ కళంతా ఒక్క తాపీపనివారి సొత్తే అనడానికి వీల్లేదు. ఆ కాలంలోని వడ్రంగిపనివారుగూడ అంతటి ప్రతిభాసంపన్నులే. వాళ్లు ఉన్నతస్థాయికిచెందిన మేజాబల్లలు, కుర్చీలు, అల్మారాలు, షైలుపెట్టెలు, బండ్లు చెయ్యకపోవచ్చునేమోగానీ, స్తంభాలమీద, ఆర్చీలమీద, ద్వారబంధాలమీద, తలుపురెక్కలమీద వారు చెక్కిన చిత్రాల చక్కదనం చూపితీరాలి. అవి అమూల్యమైన కళాఖండాలు. ఈనాడు అవి దుర్లభం.

# 36

## 2. ఫర్నిచర్

ఇంటిని అందంగా అలంకరించుకునేందుకు ఉపయోగించే సామాన్లనే ఫర్నిచరంటారు. మన నాగరికతలో దీనిది రెండవస్థానం. వెనకటిరోజుల్లో ఇప్పటిలాగా బల్లలు, కుర్చీలు లేకపోయినా, హిందువులు, మహమ్మదీయులుగూడ తమతమ అభిరుచులకు తగినటువంటి సామగ్రులను వాడుకునేవారు. ఇళ్ళలో కూర్చునేందుకు నలుచదరపు బల్లలుండేవి. మంచాలుండేవి. ఆ బల్లలమీద, మంచాలమీదవేసేందుకు

అందమైన వాజూకైన జంపఖానా లుండేవి. పేదవాళ్ళకి, మధ్యతరగతి కుటుంబాల్లో కనకైతే నులకమంచాలుండేవి. గొప్పవారిళ్ళలో నవారుమంచాలే ఎక్కువగా వుండేవి.

ఇల్లు అందంగా పరిశుభ్రంగా పెట్టుకోదలచినవాళ్ళు ఇంటివి అద్దంలా ఊడి పించుకునేవాళ్ళు. గోడలకు సున్నం కొట్టించేవాళ్లు. ఇంటి కప్పుకింద తెల్లవి చాందినీ కట్టేవాళ్లు. ఆ చాందినీ చుట్టూరా జూలు జాలర్లు వేలాడుతూండేవి. వసారా లోను, గదుల్లోను, ముంగిట్లోను కూర్చునేందుకు ఆసనాలు, బల్లలువేసి పెట్టేవాళ్లు. నేలమీద జంపఖానావేసి, జంపఖానామీద తెల్లని తివాసీ ఎక్కడా మడతపడకుండా, సరిగ్గా లాగిపరచి గాలికొడితే అది ఎగిరిపోకుండా, చుట్టుకుపోకుండా వుండేందుకు తివాసీ నాలుగుచివర్లను నాలుగు చలవరాతి గోపురాలవంటి బరువులుపెట్టి వుంచే వారు.

పైన గుడ్డపంఖా వుండేది. ఈ గుడ్డపంఖాలు రాకపూర్వం అప్పటివాళ్లు యిళ్ళలో చేతివిసనకర్రలే వాడుకునేవాళ్లు. ఆ చేతివిసనకర్రలుగూడ వారివారి ఐశ్వర్యానికి, అంతస్తుకుతగ్గట్టు ఎంతో అందంగా, అతి శ్రేష్ఠంగా వుండేవి. వాటివి గురించి మరోచోట ముచ్చటించుకుందాం.

కలిగినవాళ్ళ ఇళ్ళలో, ఇంటగాని బయటగావి, గచ్చునేలగావి, మట్టినేలగాని, అనువైనచోట అందమైన నవారుమంచం వాల్చివుంటుంది. వేసవికాలమైతే ఆ మంచంమీద జంపఖానా వేసుకుంటారు. అది చలికాలమైతే పరుపు వేసుకుంటారు. ఆ పరుపుమీద మంచి దుప్పటి పరుస్తారు.

రాజాంతఃపురాల్లోనో లేక అంత స్తోమతఉన్న శ్రీమంతుల ఇళ్ళలోనైతే మంచం, పరుపు, దుప్పటియేకాకుండా, ఆ మంచానికి చుట్టూరా నేలకు ఆనేటట్టుగా కుచ్చెళ్లు కుచ్చెళ్లుగావున్న జాలరు దిగేసుకుంటారు. అప్పుడా పానుపు చూడ ముచ్చటగా వుంటుంది. పరుపుమీద పడుకుని అటు ఇటు వొత్తిగిలేటప్పుడు ఆ పక్క కదల కుండా, జరిగిపోకుండా వుండటానికి ఆ పరుపు చివర్లవుండే నాలుగు పట్టుతాళ్ళని మంచం నాలుగుకోళ్ళకి వేసి బిగిస్తారు.

మంచం వెడల్పునిబట్టి మంచానికి తలాపుదిక్కున పల్చగా మెత్తగా నలు చద రంగావుండే నాలుగుదిండ్లు వేసివుంటాయి. ఆ దిండ్లు బూరుగుదూదివై యుంటాయి.

అవి తెల్లని మఖ్ మల్ గుడ్డతో కుట్టబడిన దిండ్లు. వాటిచుట్టూ వేసికుట్టిన ఎర్రటిపీలిక కొట్టవచ్చినట్టు కనబడుతూంటుంది. అవి చూపులకు పరోటా రొట్టెల పళ్ళాలల్లే వుంటాయి. ఆ దిండ్లమీద మఖ్ మల్ బట్టతోకుట్టిన బుల్లి బుల్లి దిండ్లు, వొత్తిగిలినప్పుడు ఒత్తుకోకుండ మెత్తగా వుండటానికి మెడకు ఇటు అటు పెట్టుకుంటారు. ఇంతాచేసి ఆ దిండ్లు అరచేతంత వెడల్పుంటాయి అంతే. (మంచానికి ఇటు అటు పట్టీలమీద రెండు గుండ్రపాటి దిళ్లుంటాయి. ఆ దిండ్లెందుకంటే వొత్తిగిలినప్పుడు తొడలక్రింద పెట్టుకుంటారు. హాయిగా వుంటుందని పత్తితోనింపిన పచ్చడమో, రజాయో, లేకపోతే మామూలు దుప్పటో ఆ యా ఋతువుల్నిబట్టి కప్పుకునేందుకు వాడుకుంటారు. పక్కమీద ఎవరూ పడుకోనప్పుడు, ఇవేం వెయ్యరు. వట్టి దుప్పటి ఒకటిమాత్రంవేసి అట్టే పెడతారు. నేలమీద మంచానికి అవతల తివాసీ వేస్తారు. తివాసీమీద ఆనుకుని కూర్చునేందుకు వీలుగా వుండేటట్టు ఒక పెద్ద బాలీసువేసి వుంచుతారు. నిత్యకృత్యంలో వాడుకునేది కనుక ఆ బాలీసుకుగూడ మాయకుండా వుండటానికి తెల్లని గలీబు తొడుగుతారు. ఉత్సవాలు వేడుకలరోజులలో అయితే దానికే మంచి కలంకారీ పనిచేసిన పట్టుగలీబు వేస్తారు.)

ఒకవేళ మంచం లేకపోతే ఏదో ఒకవైపున తగినచోటుగాచూసి తివాసీ వేస్తారు. దానిపైన మెత్త వేసిపెడతారు.

గోడలకు పటాలు తగిలించడమనేది ఆరోజుల్లో ఇప్పుడంత విరివిగా వుండేది కాదు. చాల అరుదన్నమాట. అయితే పటాలకుబదులు సూక్తులురాయించి, దాని చుట్టూ చిత్రాలువేయించి, దాన్ని ఫ్రేం చేయించి తగిలించేవారు. అది వారిముచ్చట. ఆరోజుల్లో శ్రీమంతులందరికి ఇదో వెర్రిగామారి కూర్చుంది. వారి ఈ ఆసక్తే ఎందరో అందంగా రాసే వ్రాయసకాళ్ళకు జీవనోపాధి కల్గించింది. లేఖనకళలో శ్రీమంతులకున్న నాటి ఆసక్తివల్లనే సాటిలేని మేటి వ్రాయసగాండ్రెందరో అవతరించారు. నకలుచేసి రాయడమంటే అది విద్యార్థులు చెయ్యాల్సినపనిగా, తమకెంతో అవమానంగా, న్యూనతగా భావించేవారు వ్రాయసగాండ్రు.

బల్లలు, ఆసనాలే కాకుండా ముంగిట్లోను, వసారాలోను, వాకిట్లోను వేసుకు కూర్చొందుకు మూఢా అనే దిమ్మెలవంటి ఆసనాలు వాడేవారు. ఇప్పటికి ఈ దిమ్మెలు మన కక్కడక్కడ కనిపిస్తాయి. ఆ రోజుల్లో యీ దిమ్మెలులేని యిల్లంటూ

వుండేదికాదు. సాంప్రదాయికమైన యిళ్ళలో యివి తప్పనిసరిగా వుండాల్సిందే. ఈ దిమ్మెలు రెల్లుగడ్డితోగాని, నులకతోగాని నేసివుంటాయి. వీటిమీద, మోజు ఎక్కువ వున్నవాళ్ళయితే నూగునూగ్గా వెంట్రుకలున్న మేకతోలు వేసు కుంటారు. లేకపోతే ఆ నూగునూగ్గావున్న తోలు ఆ దిమ్మె అంచులకువేసి కుడ తారు. ఎలావున్నా ఈ దిమ్మెలుమాత్రం చాల ఉపయోగకరమైనవనే చెప్పాలి.

ధనికులయిళ్ళలో స్త్రీలకు పురుషులకు ప్రత్యేకంగా ఎవరిగదులు వారికి విడివిడిగా వుంటాయిగాని, సామాన్యులకు, మధ్యతరగతివాళ్ళకు అదేం కుదరదు. అంతా ఒకయింట ఒకచోటనే రోజులు వెళ్ళబుచ్చుకోవాల్సిందే.

ప్రతియింట వాకిలినానుకుని ఒక గది వుండటం ఇప్పటి రివాజు. ఆ రోజుల్లో అదేం లేదు. వచ్చినమిత్రుల్ని కూర్చోబెట్టడానికి ముంగిట్లో వీలుకాకపోతే, గుమ్మం అవతల ఈ దిమ్మెవేసుకు కూర్చుని కబుర్లు చెప్పుకునేవారు. వాకిట్లో కూర్చోబెట్టి నందుకేం తప్పు పట్టుకునేవారు కాదు.

గదుల్లోను, వరండాల్లోను, గూళ్ళలోను అందమని అలంకారమని కాగితం పూలగుత్తులు అమర్చుకునేవారు. వరండాల ఆర్చీలకు సాధారణంగా తెరలు దించు కునేవారు. ఇప్పుడైతే రెల్లుచాపలు, వట్టివేళ్ళ తడికలు, గోనెపట్టాలు కట్టడం ఆచారమైందిగాని, ఆరోజుల్లో ఈమాదిరిపరదాలంటే వాళ్ళకు రోత. గిట్టేవికావు. వాటిబదులు దూది, లేక పత్తికూరి కుట్టిన ఒకరకమైన జంపఖానాల్నే తెరలుగా వాడు కునేవాళ్లు. అవసరం లేనపుడు ఆ తెరనుచుట్టి కట్టిపెట్టివుంచేవాళ్లు. అవసరమొచ్చి నపుడు విప్పి తెర దించేవాళ్లు. స్త్రీల అంతఃపురాల్లో అయితే తలవాకిలికి ఇటువంటి తెరే వేసిఉంచుతారు. అక్కడ పనిమనుషులో, బోయీలో ఎవరో ఒకరు ఎప్పుడూ కావలిగా నిలబడివుండటం కద్దు.

## జనుల కట్టుబాట్లు

ఆ కాలంలోవాళ్లు నిండుగా దుస్తులు ధరించడమనేది అరుదు. ఇంట్లోవున్నా బయటకువెళ్లినా వొంటినిండా బట్ట కట్టుకోవాలి అనేపట్టింపు వాళ్ళకు లేనేలేదు. కలిగినవాళ్లుగూడ ఏదో ఓ చిన్నలుంగీ, అదీ మోకాళ్ళమీదికి చుట్టుకుంటాడు. అలా అర్ధనగ్నంగా ధరించడం వాళ్ళేం తప్పుగా భావించేవాళ్ళు కారు. ఇప్పటికాలంలో,

ఉన్న పెద్దమనుషులు ఇంట్లోవున్నా బయటకువెళ్ళినా బనీను, చొక్కా, పైజామా తప్పనిసరిగా వేసుకునివుంటారు. నేను చెప్తున్న ఆకాలంలో దుస్తులు ధరించడం పట్ల అంత వ్యామోహం కనబరచడం నాటిఆచారాల్లో నిషేధంగా వుండేది. అప్పట్లో చాలమంది ఎక్కడికైనా బయటకు వెళ్ళవలసివచ్చినప్పుడుమాత్రమే అంగరఖా అనే పొడుగుపాటి చొక్కా, పైజామా ధరించేవాళ్లు. ప్రతిమనిషి ఒక్క జతకు మించి బట్టలు పెట్టుకునేవాళ్ళు కారు. ఆ ఒక్కజతతోనే నెలలకు నెలలు గడిపే వాళ్లు. అవైనా అప్పుడప్పుడు కుట్టేవాళ్ళు కాబట్టి, ఆ దుస్తులు ఎన్నినెలలైె చూసినా ఎప్పటికప్పుడు చలవచేసిన మడతలవలె ఏమాత్రం నలగకుండా కనబడేవి. చాకలి తెచ్చిన బట్టయితే చొక్కాచేతులు, అంచులు చొక్కా క్రిందభాగంమడతలు ఏ మాత్రం నలగనే నలగవుగదా. ఆ బట్టల్ని వారంతజాగ్రత్తగా వాడేవాళ్ళన్నమాట.

అయితే స్త్రీల వస్త్రాలంకరణలో ఇంట్లో వున్నప్పుడని బయటకు వెళ్ళినప్పుడని వైవిధ్యమేం లేదు. ఎప్పుడూ ఒకమోస్తరే. ఇంట్లో కాస్త సాధారణమైన బట్టలు ధరించడం, ఎవరింటికైనా వెళ్ళేటప్పుడుమాత్రం మంచి విలువైనదుస్తులు ధరించడం మామూలు. ఎవరింటికైనా ఆతిథ్యానికి వెళ్ళేటప్పుడు స్త్రీలు, పురుషులు గూడ అందమైనవి, శుభ్రమైనవి, శ్రేష్ఠమైనదుస్తులే ధరించడంవల్ల వారు వెళ్ళిన ప్రదేశానికే ఎంతో అందం చేకూరేది.

# 37

పురుషుల వేషాలంకరణలో పూర్వంనుంచి క్రాపులూ, కత్తిరించిన మీసకట్టూ, గుండ్రమైన నిడుపాటి గడ్డం పరిపాటి అయింది. పండితులు, నిష్ఠాపరులు, మొదలయినవారు హజరత్ మహమ్మదు ఆదేశానుసారం గడ్డంపెంచి మీసం తీయించేసేవారు. శ్రీమంతులకు, పెద్దమనుషులకు అయితే గడ్డం గొంతుక్రింద, పైన చెంపల దగ్గర ఎంతవరకువుండాలో, అందుకు హద్దులు నియమించారు. గడ్డం బాగా పెరిగితే దాన్ని కత్తిరించడం, ఆ గడ్డాన్ని గుండ్రంగా మలచడం, ఎంత పొడుగాటి గడ్డం

ఉండాలనేందుకు కొలతలుకూడ నిర్ణయించారు. అయితే గడ్డం తీయించుకున్న వాళ్ళలో అక్బరు చక్రవర్తి మొట్టమొదటివాడు. ఆతర్వాత షాజహాను గడ్డం తీయించుకున్నాడు. వారి అనుచరులమీదకూడ ఈ ప్రభావం కొంతవరకు పడింది.

కానీ శ్రీమంతులయిన ముసల్మానులుమాత్రం పాతపద్ధతినే కొనసాగించారు.

లక్నోలో రాజసభ వెలసినతర్వాత జనం గడ్డాలు పెంచడం తగ్గించారు. ఆ తగ్గడం తగ్గడంతో క్రమంగా గడ్డాలనేవే అదృశ్యమైపోయాయి. మహమ్మదీయ మత ప్రాదుర్భావాన్నుంచి గడ్డానికున్న ప్రాముఖ్యం సఫవియా వంశానికిచెందిన పాదుషాలకాలంలో మటుమాయమైపోయింది. వారంతా ఒకేమతస్తులు కావడంవల్ల, ఆ సభికులమీద ఈరానీల ప్రభావం పడటంవల్ల అలా జరిగిందేమో!

ముసల్మానుల్లో గడ్డం తీయించేయడమంటే అవతలవాణ్ణి శిక్షించడమని, అవమానించడమనే అర్థంలో వాడబడుతుంది. ఈరానీల్లో అయితే గడ్డం పెట్టుకోకపోవడం గొప్పవాళ్ళలక్షణమైంది. లక్నోకుచెందిన నైశాపురీ వంశస్థాపకుల్లో మొట్టమొదటివాడైన నవాబు బురహాను-ఉల్-ముల్క్‌కి పెద్ద గడ్డం వుండేది. షుజా ఉద్దౌలా అయితే అసలు గడ్డమే తీయించేసుకున్నాడు.

తర్వాతివారైన అమీర్లు పాదుషాలుగూడ గడ్డం పెట్టుకోలేదు. ఇందుకు ఫలితంగా షియాతెగ ముసల్మానుల్లో గడ్డాలరివాజే తుడిచిపెట్టుకుపోయింది. ఆ తర్వాతి కాలంలో క్రమంగా సున్నీతెగ ముసల్మానులుకూడ గడ్డాలు తీయించేసుకోడం జరిగింది. ఈ గడ్డాలనేవి మానేశాక ప్రజలకు ఎక్కడెక్కడి ఫాషన్లు మొదలైనాయి. 'శీకే' అని కొందరు బుగ్గమీసాలు పెట్టుకునేవారు. కొందరు మొగచెంపలు పెంచుకునేవారు.

లక్నో చుట్టుపట్లవున్న గ్రామీణుల్లో ముఖ్యంగా పట్టణాల్లోవుండే సున్నీతెగకు చెందిన ముసల్మానులుకూడ ఈ ఫాషన్లు మరిగారు. వారిలో కొందరు రాజపుత్రులు వతాన్లమోస్తరు చుబుకందగ్గర మధ్యలో గడ్డాన్ని రెండుపాయలుగా విడదీసి ఆ పాయలను చెవులమీదుగా మలచడం, ఆపైన మీసం దువ్వి మెలేస్తూ, ఆ మీసాన్ని బుగ్గలమీదుగా గడ్డంతో జోడించి కట్టడం ఫాషను. అందుకు గంటలకొలది కాలాన్ని వినియోగించేవాళ్లు. అనాడు భారతదేశం మొత్తంమీద యీ ఫాషను శౌర్యానికీ, పఠాపానికీ చిహ్నంగా గణనకెక్కింది.

హజరత్ మహమ్మదుకాలంలో అయితే మునల్మానులు మక్కాయాత్రకు (హజ్) వెళ్ళినప్పుడే తలనీలాలిచ్చే ఆచారం వుండేది.

కానీ అరబ్‌లో మహమ్మదీయమతం వ్యాప్తిచెందిన కొద్దికాలానికే తల క్షవరం చేయించుకోడం ముఖ్యమైన రివాజై కూర్చుంది. ఇదేపద్ధతి ఈరాన్‌లోను అమల్లోకి వచ్చింది. భారతదేశానికి వచ్చినమొదట్లో ముసల్మానులందరికి బోడితలలే. వాటిపైన టోపీలు ధరించేవాళ్ళు. నాటి వారి ఆచారమది.

ముసల్మానులు వచ్చేనాటికి భారతీయులు జులపాలు గిరజాలు పెట్టుకునేవారు. ముసల్మానులకు ఆపద్ధతిగా జుట్టు పెంచుకోడం బాగా నచ్చింది. అందుకు ఫలితమే ఆనాటి ముసల్మానుల్లో విద్వాంసులు, ధర్మనిష్ఠాపరులు, వృద్ధులు, ఫకీర్లుతప్ప ఢిల్లీలోని కులీనులు శ్రీమంతులు సకలజనులు రకరకాలుగా గిరజాలు పెంచడం మొదలెట్టారు.

ఈ పద్ధతి ముస్తాబుల్తో ఢిల్లీనుంచి లక్నోవచ్చిన పెద్దమనుషుల నాజూకుతనం ఇంకా ఇంకా చిలవలు పలవలై పెరిగింది. వారికి అలంకరణలో ఆసక్తి పెరిగింది. సుకుమారం ఎక్కువైంది. అందంగా తల దువ్వుకోవడమేకాకుండా ఆడవాళ్ళకివలె ముంగురులు సింగారించేవాళ్ళు. ఈ పురుషులసింగారం ఎంతదాకా వచ్చిందంటే వాళ్లు ఆడవాళ్ళను మించిపోయారు. ఇక కుర్రకారైతే చెప్పనే అక్కర్లేదు.

కొన్నాళ్లు చౌరసానులుమాదిరిగా స్త్రీలు నుదుటిమీద వెంట్రుకలుపడకుండా ఉంగరాలుగా తిప్పడం మొదలెట్టారు. కొంతమంది పురుషులుగూడ ఆ పద్ధతినే అనుకరించసాగారు.)

సిపాయి తిరుగుబాటు తరువాత భారతీయులుకూడ ఇంగ్లీషువారిపద్ధతులకు, ఫాషన్లకు దాసులై జుట్టు కత్తిరింపులు మొదలెట్టారు. అప్పటినుంచి, ఇంకా అక్కడక్కడ చెదురుమదురుగా గడ్డాలు పెట్టుకునేవాళ్ళుగూడ తమగడ్డాలకు శాశ్వతంగా వీడ్కోలిచ్చేశారు.

ఢిల్లీ స్త్రీల మాదిరిగానే లక్నో స్త్రీల కేశాలంకరణ వుంటుంది. అయితే అక్కడ సింగారించుకోదలచిన స్త్రీల కేశాలంకరణలకు ఎన్నెన్నో కృత్రిమమైన సాధనాలు అమల్లో వున్నాయి. వాళ్ళు వాటిని ఉపయోగించేవారు. వాళ్ళు జుట్టు పురిలా మెలితిప్పి, తలనుంచి నడుంవరకు జడ వేలాడేసుకుంటారు. ఇంకా అందంగా వుండా

లంటే వెడల్పాటి నక్కి ఆ జడచుట్టూ చుడతారు. దాంతో తలదగ్గరనుంచీ పాదాల వరకు జారెడంత పెద్ద విడుపాటి వెండినక్కి జడలా తయారవుతుంది.

నొసట ధనురాకారంలో గీతలుగీసి, మధ్యలో చంద్రవంకతీర్చి దాని కిటు అటు బంగారు వెండి వన్నెల సిందూరంతో నక్షత్రాలవలె నగిషీలుగా చుక్కలు పెడతారు. చేతులకు, కాళ్ళకు గోరింటాకుపెట్టుకోడం ఆడవాళ్ళకు అలంకారం. రసికులయిన చాలమంది మగవాళ్లుకూడ ఈ గోరింటాకు పెట్టుకోడం మొదలెట్టారు. కాపీ, అటు వంటివాళ్ళని మిగతావాళ్లు ఆడంగిరేకులక్రింద జమకడతారు.

శిష్టాచారాలు

సంస్కృతిలో నాలుగోవిషయం శిష్టాచారాలు. ఈ శిష్టాచారాలవిషయంలో లక్నోవాడు పెట్టింది పేరు. లక్నోలో ఆసియాఖండపు నాగరికత ఎంతగానో వికసించింది. నాగరికతాసిద్ధాంతాల్ని లక్నోప్రజలు పాటించినంతగా ఇతరప్రాంతీయు లెవరూ పాటించలేదు.

సభ్యత, లేక సంస్కృతి అనేదో సంప్రదాయానికి పేరు. ఆ సంప్రదాయమనేది ఆయా జాతుల ఔన్నత్యాన్ని ద్యోతకం చేస్తుంది. ఈ కలుపుగోలుతనాలు, మర్యాదలు, నాగరికత అనేపేరుతో కేవలం పనికిమాలిన ఆడంబరం, డాబుసరి అని నేటి కాలంలో అందరూ అంటూంటటం మనం వింటూనేవున్నాం. అలా అనడం పొరబాటు. ఆ మాటంటే, మంచి కట్టూ బొట్టు, ఉనికి మనికిమే అనవసరమైన ఆడంబరంక్రింద జమ అయితే, పశువుల్లాగా జీవించడంమాని, మనిషిగా బ్రతికేందుకు అవలంబించినమార్గాలన్నీ ఆడంబరాలు కావా? సంస్కారంలేనిమనిషి, సభ్యతగల వ్యక్తులతో సక్రమంగా వ్యవహరించ లేడు. ఆమాట తెలుసుకోరు. బస్తీవారివలె మేం నాగరికులం కాము. మాకు ఆ డాబులు దర్పాలు తెలియవు. ఆ మెరమెచ్చు మాటలు మాట్లాడటం మాకు చేతకాదంటూ, తమ అసమర్థతను కప్పిపుచ్చుకోవ డానికి ఈరకంగా మాటలు పేనుతారు. ఆమాటకొస్తే అంతా ఆడంబరమే. ఆడంబరం కానిదేది? మానవత్వమే ఆడంబరం. అందమైనవస్త్రధారణ, చక్కని నిత్యావసరవస్తువులు, మృష్టాన్నభోజనము, ప్రతి పనిలోను పరిశుభ్రత కలిగివుండటము, ఇవన్నీగూడ ఆడంబరాలకిందే జమ అవుతాయి మరి.

ఇతరులతో కలుపుగోలుగా ఉండటమన్నది శిష్టాచారాల్లోని మొట్టమొదటి సిద్ధాంతం. ఇతరులతో కలుపుగోలుగా వుండటం, వారి కష్టసుఖాలు కనుక్కోడం, సదుపాయాలు కల్పించడం, ప్రతిఒక్కరు తమవిధిగా భావించాలి. తమకు తాము ప్రాముఖ్యమిచ్చుకోకుండా ఇతరులకు ప్రాముఖ్యమివ్వడంలోనే గొప్పతనముంది. తనేదో ఇతరులకంటె తక్కువన్నట్టు, తనకంటె ఇతరులు గొప్పవారనుకోడం, ఇతరులగౌరవార్థం లేచినిలబడటం, వారికోసం ప్రత్యేకమైన ఆసనం అమర్చడం, ఆ వ్యక్తిని అక్కడకుతీసుకువెళ్ళి కూర్చోబెట్టడం, అతడియెదట బాసిగ పట్టేసుకు కూర్చోడం, అతడు చెప్పేమాటలు శ్రద్ధగా ఆలకించడం నమ్రతగా సమాధానం చెప్పడం, ఇవన్నీగూడ ఇతరులను తనకంటె గొప్పవారని అనుకున్నప్పుడే ఆచరించడం సాధ్యపడుతుంది. ఈ ఆచారాలన్నీ యింతటి కట్టుదిట్టంగా పాటించడం లక్నోవారికే చేతనవును. ఇది లక్నోచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన అంశం.

కలుపుగోలుతనం అన్నిటికంటె ముఖ్యమైంది. ఇది అందరికి వుండితీరవలసిందే. శిష్టాచారాలు నేర్చుకుని పాటించడం వేరు. అవి వొంటబట్టినవారి విషయం వేరు. సదాచారసంపన్నులైనవారికి ఉపకారగుణం, త్యాగబుద్ధి వాటంతటవే అబ్బుతాయి. మిత్రులకు వారి సహాయసంపద లెప్పుడూ వుంటాయి. మిత్రులు వారిని ఏ విషయంలో, ఎప్పుడు ఏ సాయంకోరినా చెయ్యడానికి నడుంబిగించి సిద్ధంగా వుంటారు. మిత్రులపట్ల స్నేహభావంతో వుంటారు. సానుభూతి చూపిస్తారు. ఈ విషయంలోనూ లక్నో వారిదే అగ్రస్థానం. వారి ఔదార్యమే ఔదార్యం. లక్నోలో రాజ్యపాలన కొనసాగుతుండేకాలంలో, మిత్రులపట్ల వారుచూపే ఉదారగుణం ఇంతా అంతా కాదు. వారు చేసిన సత్రదానాలకు అంతూ పంతూ లేదు. ఎందరినో పోషించారు. ఏ జీవికలేనివారుగూడ హాయిగా బ్రతికేవారు అంటే కేవలం మిత్రుల పోషణవల్లనే కానీ మరోరకంగా కాదు. ఇందుకు ఫలితం ఏమైందంటే, పరభాగ్యోపజీవులసంఖ్య పెరిగిపోయింది. లోకంలో నలుగురిలాగానే వాళ్ళూ ఎన్నడూ వొళ్ళు మాయకుండా, కట్టినబట్ట మాయకుండా, స్థితిమంతులకేం తీసిపోమన్నట్టుగా వుండేవాళ్ళు. తగుదుమంటూ గొప్పగొప్పవారి గోష్ఠికార్యక్రమాల్లో వారూ పాల్గొనేవారు. మళ్లీ మాట్లాడితే మాపాటివారు లేరన్నట్టుండేవారు. అయితే పరభాగ్యోపజీవులని,

ఎవర్నీ ఎవరూ చిన్నచూపు చూపిందీలేదు. ఆ దానధర్మాలు అంత గుట్టుచప్పుడు గాకుండా జరిగిపోయేవి. ఇలా వుంటూండగా లక్నోలో రాజ్యవ్యవస్థ తల్లకిందులై పోయింది. ఆ పోవడంతో, ఎంతోమందికి బ్రతుకుతెరువు పోయింది.

(గొప్పవారి దానగుణమే అనండి, లేక పరమార్థమనండి గానీ, వారి ఆ ఉదార స్వభావమే వారిఘనతకు కొలతబద్ద అయింది.

ఇతరులపట్ల వారుచూపిన మర్యాదలకు, అతిథి సత్కారాలవిషయంలో వారు చూపిన ఔదార్యానికి ఋణపడనివాళ్ళంటూ వుండరని నిస్సందేహంగా చెప్పవచ్చు. ప్రపంచంలోని పెద్దపెద్దనగరాల్లోవుండే గొప్పగొప్పవ్యాపారస్థులు, ధనికులు అవసర మొచ్చి పడినవారికి లక్షల రూపాయలిచ్చి ఆదుకుంటారనుకోండి. ఆదుకున్నారంటే నిస్వార్థభావంతో కాదు.

స్వార్థంలేకపోతే పైసాకూడ ఖర్చుపెట్టరుసుమా: అదీగాక ఆ వ్యవహారాలే గుట్టుమట్టుగా జరిగేవికావే.

ఆమాటకొస్తే లక్నోవారి మిత్రపోషణ, పెద్దలయెడ వారు చూపించిన ఔదార్యం చాల గుట్టుగా వుండేదిగానీ, లోకానికి ఇచ్చేవారెవరో, పుచ్చుకొనేవారెవరో తెలిసే టట్టుండేది కాదు. తెలియనిచ్చేవారుకారు.)

లక్నోలో రాజ్యపరిపాలన అంతమైపోయినతర్వాత గొప్పగొప్ప ధనవంతు లందరు నిరుపేదలైపోయారు. గుప్తధనాలతో హాయిగా కాలం గడుపుకుంటున్న వారికి జీవనం పడిపోయి పస్తులుండవలసినస్థితి పట్టింది. స్వార్థంవిడిచి దాన ధర్మాలు చేద్దామనుకున్నవారికి స్తోమత లేకుండాపోయింది. అయినా ఈ అనువాయతీ లన్నీ వంటబట్టిపోయి, ఆచరించడానికి చేతకానివాళ్ళయిపోయినాకూడ, గొప్పగా అతిథిసత్కారాలు చేసేస్తామని కబుర్లు చెప్పడంతో, ఆశించివచ్చినవారికి ఆశాభంగం చేయడం, కోసినకోతలన్నీ అమలుజరపలేకపోవడంవల్ల, చాలామంది వారిని వట్టి కోతలరాయళ్ళకింద, శిష్టాచారాలనేవి డాంబికంకింద జమకట్టిపారేయడం శోచనీయ మైందే. వారిది డాంబికముకాదు, ఆడంబరముకాదు, ఎంతో చెయ్యాలనే ఉత్సాహం, ఉత్కంఠ వున్నవారే. అయితే, అవకాశం లోపించింది గనుక వారిస్థితినిచూసి జాలిపడాలి. వారిమీద అపోహ పడరాదు.

(సిరిసంపదలతో తులతూగుతున్నకాలంలో ఆ నగరంలోని శ్రీమంతులైన వారంతా చాలవరకు పెద్దలకు, మిత్రులకు గుప్తదానాలు చేస్తూండటంవల్ల, లక్నో ప్రజల్లో కష్టపడి పనిచేయడం, శ్రమించడంపోయింది. కాలంవిలువ తెలుసుకునే ఇంగితజ్ఞానం శూన్యమైంది.

వారి అలవాట్లు, వారవలంబించినమార్గాలే, జాతీయప్రగతిపథాన్నుంచి రోజు రోజుకి వారిని వెనక్కి-వెనక్కి నెట్టేశాయి. భోగలాలసత ఒక్కటే వారి కభిమత మైంది. జీవనోపాధికై దిగులు, టీకు, చింతా లేకపోయేసరికి, విశ్రాంతగా కోడి పందాలు, పావురాళ్ళ పందాలు, పాచికలాటలు, పేకాట, చదరంగం ఒకటేమిటి సమస్తవ్యసనాలు వారికి పంటబట్టిపోయాయి. దాంతో, ఉన్న ఆస్తిపాస్తులన్నీ ఆ వ్యసనాలనిమిత్తం హారతికర్పూరం చేసేయడం మొదలెట్టేశారు. రేపటిచింత వారికి లేనేలేదు. పోనీ కడుపునిండిన బేరాలు, అగర్భశ్రీమంతులా అంటే అదేంకాదు. కాకపోగా, యీ పాడువ్యసనాలంటే యిష్టంలేనివాళ్ళు ఏ ఒక్కరైనావుంటే వాళ్లనీ ఉసిగొల్పి, ఈ రంగంలోకి దింపేప్రబుద్ధులు వుండేవాళ్లు.)

లోకంలో ప్రతిచోట ఈ విషయాసక్తులు వుండనే ఉన్నారనుకోండి. అయితే ముఖ్యంగా యూరప్‌లోవంటి అసభ్యపు విషయలంపటం దేవుడు మేలుచేస్తే, మనదేశానికి వద్దేవద్దు. లక్నోలోమాత్రం షుజా ఉద్దౌలా కాలంలో భోగపుసానుల వ్యసనానికి పునాదిపడింది. రోజురోజుకు ఆ పునాది మరింత గట్టిపడుతూవచ్చింది. ఐశ్వర్యవంతులకు, తమవాంఛల్ని తీర్చుకోడానికో, తమకున్న గొప్పదనం చాటి చెప్పుకోడానికో, ప్రతివారికి ఒక్కొక్క భోగపుసాని ఉండితీరేది. అదేదో పరు వన్నట్టు ఈ వ్యసనం వారిలో పరిపాటైపోయింది.

హకీం మెహదీ మర్యాదస్తుడు, యోగ్యుడు, తెలివితేటలున్నవాడు, సభ్యత తెలిసినవాడైయుండికూడ ప్రధానమంత్రిపదవి పొందడానికి ఆయనకు 'ప్యారా' అనే వేశ్య సహకారం కావలసివచ్చిందంటే వింతగాలేదూ? ఆ వేశ్య అతడికోసం తనదగ్గరున్న సొమ్ముతో ధరావత్తుచెల్లించి, అతడికి ఒకప్రాంతానికి రాజప్రతినిధి పదవి నిప్పించింది. ఈ తప్పుడువిధానం రానురాను ఎలా తయారైందంటే, అసలు సాని సంపర్కం లేనివాడు మనిషే కాడనేంతవరకు వచ్చింది. అందువల్ల ప్రజల్లో నైతికపతనం ఏర్పడింది. నీతి నిజాయితీలకు నిలువనీడలేకుండాపోయింది. మా

కాలంవరకుగూడ లక్నోలో భోగపుసాను ఉంటూండేవాళ్ళు. వాళ్ళయిళ్ళకు జనం నిరాటంకంగా, నిర్భయంగా రాకపోకలు జరుపుతూండేవాళ్ళు. అదేం తప్పుగా భావించేవాళ్ళు కారు. అయితే కాలక్రమేణా వారి అభిరుచుల్లో మార్పు వచ్చేసింది. వారిప్రవర్తనలో పరివర్తన కల్గింది.

(ఇకపోతే ప్రత్యేకంగా ఆడవారి ఆచారవ్యవహారాలు, స్వభావాదులగురించి పరిశీలిస్తే వ్యభిచారులయినవారి భార్యలుకూడ అంత సచ్ఛరిత్రలు, శీలవతులు కారన్నది విశదమైంది. అంతమాత్రంచేత, లక్నోలోని అందరి ఆడవాళ్ళప్రవర్తన సరైంది కాదని కాదుగానీ, పురుషులంతగా వారు దిగజారిపోనూ లేదు.

కలుపుగోలుతనంగా ఉండటమన్నది ఆడవాళ్లలోనూ వున్నది. ఎదుటివారిని ఆదరించడం, మర్యాద చేయడం పురుషులకెంత బాగా తెలుసో, స్త్రీలకు అంత బాగాను తెలుసు. ఆవిషయంలో వారు పురుషులకేమాత్రం తీసిపోరు.

ఒకానొకకాలంలో గొప్పయింటి స్త్రీలంతా రాట్నంమీద నూలు వడికేవారు. అలా నూలుతీయడం శ్రీమంతులయినవారికి వినోదకాలక్షేపమన్నమాట. నూలుతీసే యంత్రాలు సృష్టయినతర్వాత వీరి వినోదం కాస్త వెనకబడింది. అదీగాక అంతకు మునుపుగూడ భాగ్యభోగ్యాలున్నవారూ, వారిభార్యలూ నూలు వడకడానికి యిష్టపడక మాన్పించెయ్యడం జరిగింది. దానిబదులు అల్లికపనులు, కుట్టడాలు బయలుదేరాయి. గృహిణులు యింటి పారిశుద్ధ్యమువిషయంలో శ్రద్ధచూపడం, ఇంట్లో పనివాళ్ళను, వంటమనుషుల్ని, సేవకుల్ని పెట్టుకోడం, వారికిచెప్పి పనులు చేయించడం, యిళ్ళువాకిళ్ళు సర్దించడం బాగుచేయించడంలో ఆసక్తి చూపించడం మొదలుపెట్టారు. ఇంతేకాదు, ఇల్లాళ్ళు భర్తబట్టలు, పిల్లలబట్టలు అన్నీ పదిలంచేసేవారు. కొందరుస్త్రీలు పురుషులమోస్తరే తామూ విలాసాలకు లోనై చెడుమార్గాలు తొక్కేవాళ్ళు. అసలు అప్పట్లో పరిస్థితి ఎలా వుండేదంటే, పురుషులు ఇంట్లో కూర్చుని చదరంగం పేకాట ఆడుకుంటూండేవారు. ఇంటివ్యవహారాలు, కథా కమామిషంతా స్త్రీల అధ్వర్యంలో సాగుతూండేవి. ఇంట్లో ఆడపెత్తనమే చలామణీ అవుతూండేది.

తర్వాత శ్రీమంతులయిళ్ళలో యింటిపనులకని వంటమనుషులు, పనివాళ్ళు, సేవకులు, దాదులు వెలిశాక దొరసానమ్మలు తమ వినోదకాలక్షేపంకోసం, డోం

జాతిస్త్రీల జట్టునిగూడ నియమించుకునేవాళ్ళు. కొందరిళ్ళలో వికరంగా పెట్టుకోక పోతే, అప్పటికప్పుడు వస్తూపోతూండేవాళ్ళు. డోం జాతివారికి గిరాకి హెచ్చింది. వాళ్ళజట్లు ఎన్నో ఏర్పడ్డాయి. ఇంటింటికి తబలా, సారంగీ పుచ్చుకుని తయారయ్యే వాళ్లు. ఎవరు ఎప్పుడు పిలిస్తే అప్పుడు వచ్చేందుకు సిద్ధంగా వుండేవాళ్లు. నాకు తెలిసినంతవరకు డోం జాతివారి ఆటపాటల్లో అసభ్యత, మోటుతరహాయే ఎక్కువగా కనబడేది. వారి సాంగత్యదోషంవల్ల మామూలు స్త్రీలస్వభావం కలుషితమైంది. పురుషుల నైతికపతనానికి భోగపుసానులు కారకులైనట్టే, స్త్రీల నడవడి పాడు కావడానికి కారకులు డోం జాతి స్త్రీలైనారు.

అయితే వీలయినంతవరకు కులీనులు, అభిజాత్యంవున్నవారు, డోం జాతివారిని తమకు చాలాదూరంగానే వుంచుతూవచ్చారు. అందువల్ల కులీనులయిన స్త్రీల ప్రవర్తన కలుషితంకాలేదు. ఈ బెడద తప్పించుకున్నారు. వారి మంచినడవడి, వారి ఆచారవ్యవహారాలు, ఎంతో ఆదర్శప్రాయంగా నిలిచాయి. వారు గుణవంతులు, శీలవంతులు. తమ భర్తలకోసం ఎంతటి త్యాగం చెయ్యడానికయినా వెనుకాడనివారు. వారిలో వారికి అన్యోన్యమెక్కువ. దాపరికం లేదు. వారి తనువులు వేరయినా, వారిరువురి మనసు ఒక్కటే. గృహనిర్వహణవిషయంలో లక్నో స్త్రీ భర్తకు సహధర్మిణిగా బాధ్యతనెరిగి నడుచుకునేది. మిగిలినచోట్ల వుండేవారిలాగా కాదు. కొందరుస్త్రీలు 'తనడబ్బు వేరు, భర్తడబ్బు వేర'ని తనడబ్బు భర్తకంట పడకుండా దాచుకోడం, భర్తకు జబ్బుచేసినప్పుడయినా తనదగ్గర దాచినడబ్బుతీసి ఖర్చుపెట్టడానికి వెనుకాడటం అనే సంకుచితత్వం లక్నోస్త్రీలలో లేనేలేదు. లక్నోస్త్రీలకు మిగతావారంతటి జాణతనం లేదు. ఇల్లు వాకిలి సమర్థించుకోవడంలో వారిని మించిన వారు లేరు. మితంగా డబ్బు ఖర్చుపెట్టుకుంటారు. వారు స్వార్థపరులే కానీ, భర్తకు చేదోడువాదోడుగా వుంటారు. భర్తకోసం ప్రాణాలివ్వడానికయినా సంసిద్ధంగా వుంటారు. త్యాగంలో వారికే అగ్రతాంబూలం. సందేహం లేదు.

# 38

## సభా మర్యాదలు

నాగరికతావిధానంలో చెప్పుకోదగిన ఆయిదోవిషయం సభామర్యాదలు పాటించడం లోని వివిధరీతులు. నాగరికతగల ప్రతిజాతిలోను సభలు, సమావేశాల్లో పాటించ వలసిన కొన్ని ముఖ్యవిధులని వుంటాయి. ఆ విధులూ కట్టుబాట్లనుబట్టే ఆ యా జాతులయొక్క సంస్కృతి, నభ్యత, ఆ జాతి పురోభివృద్ధినిగురించి విశదమవుతుంది. నాగరికతకు పేరుమోసిన క్రైస్తవమహానగరాలు - పారిస్, లండన్, బెర్లిన్, మహమ్మదీయసంస్కృతికి ఆటపట్టయిన కుస్తుంతునియా, తెహరాన్, పిరాజ్, మొదలయినప్రదేశాలకువెళ్ళి అక్కడజరిగే నాగరికుల గోష్ఠికార్యక్రమాలలో పాల్గొన్నట్లయితే శిష్టాచారాలను, మర్యాదలను వారెంత కట్టుదిట్టంగా ఆచరిస్తారు, అలా ఆచరించడం ఎంత ముఖ్యమూ అన్నది మనకు సుస్పష్టమవుతుంది. ఆదే హిందూ దేశంలో వాణిజ్యకేంద్రాలయిన ప్రముఖనగరాలకువెళ్ళి అక్కడున్న శ్రీమంతుల్ని, ప్రముఖుల్ని కలుసుకున్నప్పుడు యీ శిష్టాచారాలు, మర్యాదలు వారిలో మీకు మచ్చు కయినా కనబడవు. అయితే రాజ్యాలకు ముఖ్యపట్టణాలయినచోట్లను, దేశీయసంస్థానాలు వెలసిన హైదరాబాద్ దక్కను, భోపాల్, రాంపూర్ మొదలయిన ప్రదేశాల్లోని సామాన్యప్రజల్లోనూ, పురప్రముఖుల్లోనూ, పెద్దల్లోనూ, పిన్నల్లోనూ సర్వే సర్వత్రా యీ శిష్టాచారాలనునవి చెక్కుచెదరనట్టు కనబడతాయి. వాణిజ్యకేంద్రాల్లో మాత్రం విచక్షణాజ్ఞానం, ఆదరణ, చిన్నా పెద్దా అనే తారతమ్యం పూర్తిగా లోపించిందనిపిస్తుంది.

ప్రాచీనకాలంనుండే ఢిల్లీ, మహాసామ్రాజ్యాధిపీఠమై శతాబ్దాలపర్యంతం సుస్థిరంగా నిలబడింది. అందుకనే ఆ నగరం శిష్టాచారాలు, నియమాలు పాటించడంలో మిగతాప్రదేశాలన్నిటికంటే ఎంతో ముందడుగువేసింది. అయితే వ్యాపారుల సంఖ్య పెరిగిపెరిగి సొసైటీలో వారంతా చోటుచేసుకోవడంతో ఢిల్లీలోని వెనకటి సంస్కృతి అంతా నాశనమైపోయింది. సభా మర్యాదలనేవాటికి కులీనులు, పాలకులు, శ్రీమంతులవల్లనే అసలు పునాది ఏర్పడింది. పిన్నల్ని పెద్దలూ, పెద్దల్ని

పిన్నలూ కలుసుకున్నప్పుడు వారివారిపట్ల ఎలా నడుచుకోవాలీ అనేది ఆనాటి రాజ్యాలు, ప్రభుత్వాలే ప్రజలకు బోధించాయి. కానీ వ్యాపారస్తులకు పెద్దలు నియమించిన ఆచారవ్యవహారాలన్నా, వారి పోకడలన్నా పరమ శత్రుత్వం. ఆచారవ్యవహారాలు పాటిస్తూకూర్చుంటే ఎన్నోచిక్కు లెదురవుతాయని వారి వుద్దేశం. వ్యాపారంలో యిచ్చిపుచ్చుకోవడాలనేవి వుంటాయి. అసలు వ్యాపారానికి వూతనిచ్చేది స్వార్థపరత్వం. స్వార్థం లేకపోతే వ్యాపారం దెబ్బతింటుంది. స్వార్థపరత్వమున్నప్పుడే వ్యాపారం కుదురుకుంటుంది. తన కాలాన్ని, తన డబ్బుని, తన తెలివితేటల్ని, తన సంపదని అనవసరంగా పరులకోసం వినియోగించడం మూర్ఖత్వమూ, తెలివిమాలినతనమూ అంటుంది వ్యాపారధర్మం. పెద్దలసిద్ధాంతం యిందుకు పూర్తి వ్యతిరేకం. ఆ సిద్ధాంతరీత్యా ప్రతిఒక్కరూ నిస్వార్థభావంతో ప్రజలకు సేవ చెయ్యాలి. వారి కష్టసుఖాలు కనుక్కోవాలి. వారికి కావలసిన సదుపాయాలు కల్పించాలి. ఆభిజాత్యం అడుగంటనీరాదు. నీతి నిజాయతీలను, స్వార్థంకోసం బలిపెట్టరాదు. స్వార్థపరత్వం అన్నది మహాబలవత్తరమైనది కనుకే మనసంస్కృతికి దాని గాలి ఏమాత్రం సోకరాదంటుంది ఆ సిద్ధాంతం. అయినా యీ స్వార్థపరత్వమే ఢిల్లీ ప్రాచీనవైభవాన్నంతా తుడిచిపెట్టేసింది. ఈ వచ్చిపడిన ఒడుదుడుకుల్లో ఢిల్లీ తన చారిత్రకప్రఖ్యాతినిమాత్రమే పదిలం చేసుకోగలిగింది.

ఢిల్లీ సంస్కృతిని ధనికవర్గంవారే నాశనంచేశారు. అందుకనే ఆ సంస్కృతి, తన ప్రాచీన జన్మభూమిని వదిలి పారిపోయి లక్నోవంటి చిన్న ఆస్థానాన్ని శరణు వేడుకుంది. అచ్చటి ఆస్థానం చిన్నదే అయినా, ఢిల్లీసంస్కృతి ఆ పరగణాను చేరుకున్నాక, దాని దశ మార్చేసింది. ప్రపంచంలో ఇంతకంటె గొప్ప ఆస్థానం ఉన్నదా అన్నట్టు తయారుచేసింది. ఢిల్లీలోని పెద్దలంతా ఈ ఆస్థానం చేరాకనే, స్వేచ్ఛావాయువులు పీల్చుకున్నారు. వారివారి శిష్టాచారాలను నియమం తప్పకుండా పాటించసాగారు. అందువల్లనే అతి స్వల్పవ్యవధిలో లక్నో యావద్భారతీయ సంస్కృతికి, సభ్యతకూ, శిష్టాచారాలకు, మర్యాదలకు స్థావరమై నిలిచింది. మిగతా పట్టణాల్లోని నాగరికప్రజలందరూ లక్నోవారినే అనుకరించడం ఆరంభించారు. ఎటువంటివారిని గుమ్మందాకావెళ్ళి ఆహ్వానించాలి, కేవలం లేచినిలబడితేనే చాలనే దెవరికో, లేచినట్టే నటిస్తూ కూర్చున్నచోటే కూర్చుని 'రండి దయచేయండ'ని

అంటే సరిపోయేదెవర్నో ఇవన్నీ ఒకరు నూరిపోయడంకాదు. తమకు తాముగా, స్వయం నిర్ణయముచేసుకోవాలి. స్వయంనిర్ణయం చేసుకోవడమన్నది వారివారి వివేకాన్నిబట్టి వుంటుంది. ఆ మాటకొస్తే లక్నోవారంతటి వివేకవంతులు, మేధావంతులు, నాగరికులు, శిష్టజనులు మరెక్కడావుండరు. (సమానస్థాయీవారెవరైనా వస్తే లేచి సత్కరించడం ఇక్కడివారి ఆచారం. వచ్చినవారికోసం మంచి ఆసనమిస్తారు. వాళ్లు కూర్చునేవరకు తాము కూర్చోరు. వాళ్లు కూర్చున్నాక తమ ఆసనం మీద వారిఎదుట ఎంతో మర్యాదగా, కుదురుగా కూర్చుంటారు. అవతలవాళ్ళు అన్యథా భావించకుండా చిరునవ్వుముఖంతో వుంటారు. వచ్చినవా రేవస్తువైనా యిచ్చినట్లయితే, ఎంతో గౌరవభావంచూపుతూ స్వీకరిస్తారు. వచ్చినవారికి తమ వల్ల, తమ చేష్టలవల్ల ఏమాత్రం విసుగుకలిగించకుండా వుండేందుకు తగినంత జాగ్రత్తగా మసులుకుంటారు. ఒకవేళ మాటలమధ్యలో ఏదైనా అవసరమైనపని చేయవలసివచ్చినా గమనించవలసివచ్చినా, క్షమించమని అడిగి మరీ ఆపని చెయ్యాలి. అక్కడనుంచి వెళ్ళాల్సినపని పడితే, 'వెళ్లిరానా' అన్నట్టు అనుమతి తీసుకుని మరీ కదలాలి. వచ్చినవ్యక్తిని సాగనంపేటప్పుడు ఆ వ్యక్తికి వెనక వెనకనే నడవాలి. ఆయన, ముందు నడవాలి.)

మర్యాదకోసం అవతలివ్యక్తి 'తమరు ముందు దయచేయండి' అని పట్టుబట్టడం, 'అబ్బెబ్బె, తమరే ముందు దయచేయండి. నేనేపాటివాడిని' అని మాటిమాటికి అంటూండటం రివాజు. ఎంతచెప్పినా ఎదుటివారు వొప్పుకోకపోతే, బలవంతపెట్టడము, ఆతర్వాత కృతజ్ఞతలు తెల్పుకోడము, వంగి సలాములు చెయ్యడము, ఇక తప్పనిసరై ముందు అడుగుల్లో అడుగులువేసుకుంటూ నడవడమూ, ఆ నడిచేటప్పుడు అవతలవారికి వెన్ను చూపించకుండా అతి జాగ్రత్తగా నడవడం వారి సంప్రదాయం.

ఇంత మరీ మర్యాదలకుపోతేనే తరుచుగా లోకులు హేళనచేస్తూంటారు. ఇందుకో సామెతగూడ బయలుదేరింది. వెనకటికి లక్నో వారిద్దరు-రైలువచ్చింది, ఇక కదలబోతూంది, మొదట మీరెక్కండి, అంటే మీరెక్కండి అని మర్యాదలకు పోయారుట. ఆ రైలు కాస్తకదిలి చక్కాపోయిందట. అందువల్ల ఆ పెద్దలు ఆ స్టేషనులోనే పడివుండాల్సి వచ్చిందిట. మర్యాదలు పాటించడంలోగూడ ఒక

హద్దూ పద్దూ వుండాలి. హద్దుమీరినమర్యాదలు అవకతవకలుగాను, అవస్థపెట్టేవి గానే తయారవుతాయి. అయినప్పటికీ లక్నోవారుమాత్రం ఎంత అవస్థలు రానీండి గానీ, ఆచారాలు, మర్యాదలు పాటించకుండావుండరవి. ఆ విషయంలో వారికెంత పట్టుదలవున్నది, వారి సభ్యతవల్ల విశదమవుతుంది. సదాచారమూ, సభ్యతా లేని వాళ్ళకు అన్నీ అభ్యంతరాలుగాను వుండవచ్చు. వారు ఈ సదాచారాలనేవానిని దుర్గుణాలుగా భావించనూవచ్చు. కానీ, శిష్టులు నాగరికులైనవారికి సదాచారాలు సుగుణాల కిందే లెక్క.

ఇప్పుడు యిక్కడకూడ మిగతాప్రదేశాల్లోమాదిరిగానే, బల్లలు, కుర్చీలు మొదలయిన ఇంగ్లీషువారి ఫర్నీచరంతా వచ్చిపడింది. దాన్ని వాడటం రివాజైంది. మొదట్లో అందరూ ఇళ్ళలో నేలమీదనే కూర్చునేవారు. వారివారి తాహతునుబట్టి, స్తోమతనుబట్టి మంచి గచ్చు చేయించుకునేవారు. ఎవరయినా సమానహోదాయాలోవారో ఎరగనివారో లేక పెద్దలుగానీ, ప్రముఖులెవరైనాగానీ వచ్చినట్లయితే, వారిని సగౌరవంగా ఆహ్వానించేవారు. అనుదుదిందుక్కుఆమకుని ఆయన కూర్చున్నతర్వాత, అంతా ఆయనచుట్టూచేరి బాసిగపట్టేసుకుని, ఎంతో గౌరవభావంతో కూర్చునేవారు. అవతలివ్యక్తి పలకరించినప్పుడు, చేతులు జోడించి, ఎంతో నమ్రతగా సమాధానం చెప్పాలి. అతిగా మాట్లాడటం, అవతలివ్యక్తికంటె స్థాయిపెంచి మాట్లాడటం అపచారంగా భావించేవారు.

(అందరూ సరిసమాన హోదావాళ్ళు, మిత్రులు, సమానమైన అభిరుచులున్నవాళ్లు కనుకయితే ఆ సమావేశంలో సదాచారాల బెడద అంతగా వుండదు. అందరూ చొరవగా, సరదాగా మాట్లాడుకుంటారు. అయితే సమానవయస్కులు, సమాన హోదాగలవాళ్ళు, స్వేచ్ఛగా మాట్లాడుకుంటున్నా హద్దుమీరరు. అమర్యాదగా ప్రవర్తించరు. ఎవరిని చిన్నచూపు చూడరు. ఎవరిని నొప్పించనివిధంగా నడచుకోడం వారికే చేతనవును.

ఆ మిత్రమండలి సమావేశమైనప్పుడు, వాళ్ళ పనివాళ్ళుగాని, సేవకులుగాని అక్కడ అడుగుమోపడానికి వీల్లేదని కట్టడిచేస్తారు. వాళ్ళు ఎదురుగుండా వారి ఆజ్ఞకోసం ఎదురుచూస్తూ అల్లంతదూరంగా చేతులుకట్టుకుని నిలబడివుండాల్సిందే. ఎదురుగా కాకపోతే, వీరి పిలుపందేటంతదూరాన చాటుగావెళ్ళినా ఫర్వాలేదు.

అయితే ఎప్పుడూ నిలబడినా, అతిగా మాట్లాడినా, వెర్రి వెంగళాయిక్రింద చూస్తారు.)

నౌకర్లు ఖాస్దాన్ (తమలపాకు బీడాలు చుట్టిపెట్టుకునే పాత్ర) హుక్కా తెచ్చి అందివ్వగానే, సమావేశకర్త అయిన ఆ యింటియజమాని వాటిని మిత్రులందరి యెదుట పెడతాడు. అప్పుడు ఒక్కొక్కరే లేచి 'తస్లీం' నమస్కారమనిచెప్పి అవి తీసుకుంటారు. ఇటువంటి ఇష్టాగోష్ఠి కార్యక్రమాలకు పిల్లలు రానేరారాదు. ఒక వేళ ఏదైనా అత్యవసరవిషయంగా రావాల్సినఅగత్యం పడితే, వస్తూనే తండ్రి యెదుట, అక్కడ సమావేశమైన తండ్రిగారి మిత్రులందరికి ఎంతో వినయంగా వంగి నమస్కారం చేయాలి. పిల్లకారు సభలోకిరాగానే పెద్దలంతా అంతవరకు స్వేచ్ఛగా కబుర్లు చెప్పుకుంటున్నవారంతా సర్దుకుని, పెద్దతరహాగా, సదాచారాలు, మర్యాదలు పాటించడం ఆరంభిస్తారు. పిల్లలు పెద్దలకు పెద్దరికమిచ్చి గౌరవించి నట్లే, పెద్దలు పిల్లల్ని దృష్టిలోపెట్టుకుని మరీ నడుచుకుంటారు. ఎందుకంటే ప్రతి విషయంలోను పిల్లలు పెద్దల్ని అనుకరిస్తారుగదా! పెద్దలే ఆచారాలను అవతలకు నెట్టి, హద్దుమీరి ప్రవర్తిస్తే వారినిచూసి పిల్లలు చెడిపోతారనే వారిభయం. అందుకే వారెప్పుడు తగుపాటి జాగ్రత్తలోనే వుంటారు.

రోజూ చూస్తూండే మిత్రుల్నీ, రోజూ కలుసుకునే మిత్రుల్ని చూడగానే వారితో చేతులు కలపడం, ఆలింగనం చేసుకోడమనేపద్ధతి వారికి లేదు. చేతులు కలపడ మంటే, ఏ దేశనాయకులో, పెద్దలో కనుకైతే, గౌరవసూచకంగా వారిచేతిని ముద్దుపెట్టుకోవడం సంప్రదాయం. తర్వాత ఎంతోకాలానికి తిరిగి కలుసుకున్న మిత్రులో లేకపోతే తీర్థయాత్రలు చేసివచ్చినమిత్రులో కనుకైతే, వారిని చూడగానే ఆలింగనంచేసుకోడం ఆచారం.

పురుషులు జనానాకు (ఇంట్లోనే ఆడవాళ్ళు వుండటానికని ప్రత్యేకించబడిన భాగం) వెళ్ళినప్పుడు ఎంతోమర్యాద కనబరుస్తారు. అనవసరమైన సరససల్లాపాలు చెయ్యరు; హద్దుమీరి ప్రవర్తించరు. భార్యాభర్తలయితే బిడియపడవక్కరలేదు. సరదాగా మాటాపలుకూ ఆడుకోవచ్చు. అయినా హద్దుల్లోనే వుంటారు. ఆ యింట్లో ముసలమ్మలువుంటే వాళ్ళయెదుట అవ్వన్నీ కట్టిపెట్టేస్తారు.

పల్లెప్రాంతాల్లో ఇంకా ఎన్నో వింతఆచారాలు, పట్టింపులూ వున్నాయి.

ఇంటికొచ్చిన కోడలు నలుగురయిదుగురు బిడ్డలతల్లి అయ్యేవరకు ఎంత ఘోషాలోనో వుండాలి. ఇంటోని ఆడవాళ్ళంతా చూస్తున్నప్పుడు భర్త కంటబడ రాదు. ఆవిడ మేలిముసుగులోనే వుండాలి. అంత పట్టింపు. ఢిల్లీల్లో వారికంత పట్టింపు లేదులెండి. పెళ్ళయినప్పటినుంచీ భార్య భర్త ఒక దస్తర్‌ఖాన్ (భోజనం చేసేందుకు పరిచే జంపఖానా) మీదనే పళ్ళాలుపెట్టుకుని భోజనం చేస్తారు. ఎంత భార్యాభర్తలయినా వంటమనుషులు, పనివాళ్ళముందు సరసాలాడుకోడం అసభ్యం గానే భావిస్తారు.

సాధారణంగా ఆడవాళ్ళు, ఆడవాళ్ళు కలిసినప్పుడు చెప్పుకోతగినంత భేషజాలేం వుండవు. అయితే గొప్పయింటి స్త్రీలవిషయం వేరుగా వుండవచ్చు. ఇంటికి అతిథు లుగా పేరంటాళ్ళుగా వచ్చినస్త్రీలకు ఎంతవరకో అంతవరకూ మర్యాదలు చేస్తారు. నిజంగా వారుచేసే మర్యాదలు ఒకరకమైన ఆత్మీయత, కలుపుగోలుతనంతో నిండి వుంటాయి.

# 39

సభా మర్యాదలనుగురించి చెప్పేటప్పుడు ఈ ప్రసక్తిగూడ అవసరమనే తోస్తుంది. యూరప్, అరబ్, ఈరానుల్లోలాగా భారతదేశంలో ఒకర్నొకరు కలుసుకోడానికి, స్నేహితులుగా కులాసాగా గడపడానికి అనువైన క్లబ్బులు సొసైటీల అనువాయితే లేదు. యూరప్‌లో అయితే లెక్కలేనన్ని క్లబ్బులున్నాయి. సొసైటీలున్నాయి. అక్కడికి జనం స్వేచ్ఛగా వెడతారు. వారివారికి నచ్చినవార్ని కలుసుకుంటారు. హాయిగా, ఆనందంగా గడుపుతారు. అరబ్, ఈరాన్, టర్కీల్లో కాఫీహోటళ్ళలో అచ్చటివారు కులాసాగా కలుసుకుని ముచ్చట్లాడుకునేవారు. ఇద్దరు ముగ్గురు ఇంగ్లీషు వారు ఒకచోట చేరారో, ఓ క్లబ్బు పెట్టేస్తారు. తీరికవేళల్లో అక్కడికివెళ్ళి కాసేపు పత్రిక చదువుతారు. కాసేపు స్నేహితుల్నికలుసుకుని ఆమాట ఈమాట మాట్లాడు

కుంటారు. అదేవిధంగా ఈరానీలు, అరబ్బులు ఉన్నచోట్ల కాఫీహోటళ్ళు ఏర్పడా ల్సిందే. ఇహ అక్కడ చూడండి ఎప్పుడుచూసినా కొంతమంది గుంపుగా వుంటూనే వుంటారు. అక్కడ వాళ్ళు టీ కావాల్సినవాళ్ళు టీ తాగుతారు. హుక్కా కావాలను కున్నవాళ్ల హుక్కా పీలుస్తారు. కొందరు అక్కడే ఫలహారంగానీ, భోజనంగానీ తీసుకుంటారు. కొందరు కూర్చుని ఎక్కడలేనికబుర్లు చెప్పుకుంటూంటారు.

ఇందుకు పూర్తివిరుద్ధం భారతదేశం. ఈరకమైన హోటళ్ళు క్లబ్బుల ఆచారం నాడు నేడుగూడ లేదు. ఇంగ్లీషుప్రభువులు ప్రజల్లో వీటిపట్ల అభిరుచి కలిగించ డానికి ఎంతో ప్రయత్నించారు. భారీయెత్తున ఖర్చుపెట్టి అడుగడుగునా ఈహోటళ్ల పెట్టించారు. కానీ ఫలితం శూన్యం. ఇప్పటికి ముప్పై, ముప్పైఅయిదేళ్ళక్రితం కృషి, వాణిజ్యశాఖల డైరెక్టరయిన మీర్ మహమ్మదు హుసేనుసాహేబు హైద్రా బాదు వెళ్ళకమునుపు లక్నోబజార్లో ప్రభుత్వసహాయంతో ఒక హోటలు పెట్టిం చారు. ఆ హోటల్లో ఫర్నీచరుగూడ చెప్పుకోతగ్గదే. పనికిమాలినవస్తువులేం పెట్ట కుండా ఆశాలలో అన్నిరకాల పానీయాలు దొరకేటట్లు చేశారు. కానీ ఏంవుంది ఏం లాభం। ఎవరికీ ఆ ధ్యాసే లేకపోవడంతో మీర్‌సాహెబ్‌గారు నష్టంభరించి ఆ హోటలు మూయించేశారు.

(ఇక్కడ పాతకాలంగావున్న ఆచారమేమంటే ప్రతిపేటలోను క్రిక్కిరిసిన జనాభాగలచోట్ల శ్రీమంతులుగానీ, కలిగినవారెవరైనావుంటే, వాళ్ళు తమ ఇంట్లోనే వచ్చేపోయేజనానికి తగినన్ని సౌకర్యాలు, అంటే వుండేందుకు, భోజనాదివసతులన్నీ ఏర్పరచేవాళ్ళు. వచ్చినమిత్రులకు హుక్కా, తాంబూలాదులకియ్యే ఖర్చంతాకూడ తామే భరించేవాళ్లు. వచ్చినవారి అనుచరులకు దినబత్తా లిచ్చేవాళ్ళు. ఎంతోసేపు గోష్ఠి జరిపేవారు. పరిహాసప్రసంగాలు చేసేవారు. ఎత్తిపొడుపు మాటలాడుకునే వారు. ఉన్నంతసేపు హుక్కాలు తాంబూలాలకు అంతులేదు. వచ్చిన మిత్రబృందాన్ని బట్టి, కవితాగోష్ఠి అని, సాహిత్యచర్చలని, రకరకాలుగా జరుగుతూండేవి. వచ్చిన వారంతా పండితులేఅయితే శాస్త్రచర్చ కొనసాగేది. గోష్ఠిలో నాగరికులు, ధన వంతులు, జమీందార్లుకనకైతే, ఆహార వేషభాషాద్యలంకారాల్ని గురించి, వారివారి స్తోమత, అభిరుచులు, ఆచారాలగురించిన వారివారి విచక్షణాజ్ఞానాన్ని ప్రకటించే ప్రస్తావనలు జరిగేవి. ఆ సమావేశాలు రసికులూ సరసులవే. అయితే ఆ సమావేశా

లలో బాజారీ సుందరాంగుల్నికూడ ప్రవేశపెట్టేవారు. వాళ్ళు వొయ్యారాలు వొలికిస్తూ హావభావప్రదర్శనలు చేసేవాళ్లు.

యూరప్‌లోలాగా వచ్చినట్టు ఇక్కడి సమావేశాలకు అయినింటి స్త్రీలెవరూ రారు. ఇక్కడ జరిగే సమావేశాల్లో స్త్రీ ఎవరైనా ఉందా అంటే ఆవిడ తప్పక వేశ్య అయ్యుంటుంది.

యూరప్‌లో జరిపే గోష్ఠికార్యక్రమాల్లో పాల్గొనేవారంతా కులకాంతలే కావడం ఫలితంగా అక్కడ వేశ్యలస్థితి సొసైటీలో పూర్తిగా దిగజారిపోయింది. మంచివాళ్ళున్నచోట, పెద్దమనుషులువెళ్ళే క్లబ్బుల్లో సొసైటీల్లో వాళ్ళు కాలుపెట్టడానికి వీల్లేదు. అందుకు భిన్నంగా యావద్భారతదేశంలోనూ, అదేవిధంగా లక్నోలోను ఈ భోగపుసానులు సభ్యతగల పెద్దమనుషుల సమావేశాల్లో పాల్గొని, వారిపక్కనే కూర్చొగలిగిన అంతస్తును పొందగలిగారు. పేరుప్రఖ్యాతులుగన్న వేశ్యలు, ఈ గోష్ఠులమీదవున్న అపేక్షతో కొందరు స్వయంగా తమ యిళ్ళలోనే గోష్ఠి, సమావేశాలు ఏర్పాటుచేశారు. మర్యాదస్తులు, కులీనులుగూడ అటువంటివాళ్లయిళ్ళకు వెళ్ళడానికి ఏమాత్రం బిడియపడరు. లక్నోలో చౌధరాయిన్ బీ హైదర్‌ఖాన్, ఇంకా ఆ కోవకుచెందిన కొందరు వేశ్యలయిళ్ళల్లో ఏర్పాటైనగోష్ఠికి పెద్దమనుషులంతాగూడ వస్తూపోతూనేవుంటారు. అక్కడికి వచ్చినవారికి బీసాహిబా హుక్కా తాంబూలాదులిచ్చి మర్యాదలుచేయడం కద్దు. దేశంలో ఇంగ్లీషు భాషాభ్యాసం వచ్చినతర్వాత ఎంతో సంస్కృతిపెరిగినా యీ వేశ్యలయిళ్ళకు స్వేచ్ఛగావెళ్ళడం, వాళ్ళతో సాంగత్యమన్నది అమర్యాదగానే భావించబడుతూంది.)

లక్నోలోవున్న క్లబ్బులన్నీ వినోదప్రియులు, శ్రీమంతులు ఏర్పాటుచేసినవే. ఆ క్లబ్బుల్లోని సభ్యులంతా చందావేసుకుని హుక్కాలు, ఫలాహారాలు, పానీయాలు సేవించడమనేది, ఈ చందాలతో చేసుకునే డిన్నర్లు, అమర్యాదగా నామోషిగా తలుస్తారు. అక్కడ జరిగేవిందులు, ఏవైనా ఒక సందర్భాన్ని పురస్కరించుకునిచేసినా, లేక కేవలం మిత్రులకు ఆతిథ్యంగా కానీండి అందుకయ్యే ఖర్చుఅంతా ఒకేవ్యక్తి భరిస్తాడు. ఇంకా సమర్థులంటే వారు మరోసారి ఏర్పాటు చేసుకుంటారు. నా వాటా అయిదురూపాయలిస్తాను, విందులో నన్నుకూడ చేర్చుకోండనేమాట లేదు.

ఢిల్లీలోని వ్యాపారస్తుల్లో 'పత్తీపడా' అనే ఆచారంవుంది. 'పత్తీపడా' అంటే ఎంతోమంది వ్యాపారులుకలపి చందావేసుకుని ఆ డబ్బంతాపెట్టి విందులో, లేకపోతే

పాట కచ్చేరియో, నాట్యప్రదర్శనమో ఏర్పాటుచేసుకోడం. ఆ గోష్ఠి ఇళ్ళలోనో, లేక బహిరంగప్రదేశాల్లోనో జరిగేది. బహూశా ఈ పద్ధతి అక్కడప్రభుత్వం పడి పోయినతర్వాత, డబ్బుగలవాళ్ళు ఏర్పాటుచేసినదై యుండాలి. అంతేగాని అక్కడి పెద్దమనుషులు ఎప్పుడూ ఈవిధంగా చెయ్యరు. అక్కడున్న పెద్దలే ఇలా చేపే టట్టుంటే లక్నోలోకూడ ఆ యేర్పాటు వుండివుండేది. ఎందుకు చెప్తున్నానంటే లక్నో, ఢిల్లీ సంస్కృతికి శిష్యపరమాణువేగదా!

## 6. అభివాదనము

నాగరికతావిధానంలో ఆరోవిషయం అభివాదనము. దీనికెంతో ప్రాముఖ్య ముంది. పరిచయస్తుల్ని, బంధుమిత్రుల్ని కలిసినప్పుడు నమస్కారంపెట్టడం, యోగక్షేమాలు విచారించడం, ఇలా ఒకర్నొకరు పలకరించుకోడం మర్యాద. మహమ్మదీయ మతసంప్రదాయం ప్రకారం, అవతలవాళ్లు ఒక్కరే కనుకైతే 'అస్సలాం అలైక్' అనడం, ఒకరికంటె ఎక్కువమంది వున్నప్పుడు 'అస్సలాం అలైకుం' అనడం రివాజు. తమకు సలాం పెట్టినవారితో అవతలివారు, అది ఉదయ కాలం అయితే 'సుబ్హ్‌కుం అల్లా బిల్‌ఖైర్' (అల్లా మీ ఉదయకాలాన్ని సలక్షణ ముగా గడుపుగాక) అని, సాయంత్రమైతే 'మస్సాకుం అల్లా బిల్‌ఖైర్' (అల్లా మీ సాయంసమయాన్ని సలక్షణంగా గడుపుగాక) అని తిరిగిచెప్పడం సంప్ర దాయం. ఈ 'సలాం'లు యోగక్షేమాలు విచారించడమన్నవి అరబ్బుల ఆచారాలు. ఈ ఆచారం పోయిపోయి అటు పశ్చిమాన స్పెయిన్‌వరకు పాకింది. ఇటు తూర్పున హిందూదేశానికి సోకింది. యూరప్‌లో ఆంగ్లేయులు, తూర్పున ఈరానీలు, తూరా నీలు హిందువులందరుగూడ అభివాదనంచేసే ఈ పద్ధతినే అనుకరించి ఆచరిస్తు న్నారు. యూరప్‌లో అభివాదనం ఎలా తయారైందంటే, మహమ్మదీయ మతా చారంప్రకారం మొదటచెప్పే 'సలాం' అనడంలేకుండా, తిరిగి సలాం పెట్టిన వారితో అనే 'ఆశీస్సులు, 'సుబ్హ్‌కుం అల్లా బిల్‌ఖైర్' (అల్లా మీ ఉదయకాలాన్ని సలక్షణంగా గడుపుగాక), 'మస్సాకుం అల్లా బిల్‌ఖైర్' (అల్లా మీ సాయంసమ యాన్ని సలక్షణంగా గడుపుగాక) అనేవిమాత్రం మిగిలాయి. వాటికి సరైన అను వాదంగా 'గుడ్ మార్నింగ్', 'గుడీవినింగ్', అవి ఇంగ్లీషువారినోట మనం నేటికీ

వింటూనేవున్నాం. ఫ్రెంచిభాషలో 'బాం మతిఏన్'. 'బాం జూర్'. 'బాం స్వార్' అంటే మీ ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము వక్రమంగా గడుమగాక అని. పాశ్చాత్యజాతులకు ఈమాదిరిగా అభివాదనం చెయ్యడమన్నది స్పెయిన్‌లోని అరబ్ విజేతలనుండి సంక్రమించినదనడంలో సందేహంలేదు.

హిందూదేశంలోనూ, ఈరాన్‌లోనుగూడ పెద్దల్ని పూజించడమనేది ఆచార ముంది. తూర్పుదేశపుప్రజలకు ఇది ఎంతో ముఖ్యమైంది. అందుకనే మిగతా వారంతా వ్యర్థపుమాటనుకున్న 'అస్సలాం అలైకుం' ని. వారంతా యింకా సమిష్టిగా పట్టుకు పాకులాడుతున్నారు. ధనవంతులు ధనగర్వంతో, గొప్పవారమనే దురహంకారంతో తమ పాయాకు దర్జాకు తగవన్నట్టు, వారు ముఖ్యంగా ఇక్కడ రాజ్యాలేర్పడినప్పటినుంచి, పాదుషాలు తమ గౌరవమర్యాదలకోసమని, మహమ్మదీయమతపరమైన శిష్టాచారాలన్నిటిని అణగద్రొక్కారు. భగవంతుడిముందట చేతులుకట్టుకుని తలవంచి నిలబడి ప్రార్థనచేసే సేవకుడిమోస్తరుగా పాదుషాలు తమ సభికుల్ని తమయందలి గౌరవభావం సూచిస్తూ చేతులుకట్టుకుని తలలొంచి నిలబడవలసిందిగా ఆజ్ఞాపించారు. ఈ పాదుషాలపద్ధతుల్నే అనుకరించడం మొదలెట్టారు అప్పటి శ్రీమంతులూను. వారు 'సలాం', 'అస్సలాం అలైకుం' అభివాదన పరంగా ఏర్పడిన ఈ మాటల్ని వాడటం మానేశారు. అంతేకాదు; ఆత్మస్తుతి పరాయణులు, భగవంతుణ్ణికూడ లెక్కచేయని దనవంతులయిన ముసల్మానుల ప్రయత్న ఫలితంగా 'తస్లీం', 'కోర్నిష్' 'ఆదాబ్', 'బందగీ' మొదలైన పదాలన్నీ 'సలాం'కు బదులుగా వాడుకలోకి వచ్చాయి. అరబ్బీలో 'అస్సలామ్ అలైకుమ్' అని చిరునవ్వు ముఖంతో చెప్పవలసిందేగానీ ఇంకేం చెయ్యరాదు. సలామన్నతరువాత ఒకరి చెయ్యి నొకరు పట్టుకొని ఊపుతూ 'సుబ్హకుం అల్లా బిల్ ఖైర్' (అల్లా నీ ఉదయ కాలాన్ని సలక్షణంగా గడుపుగాక) అనిగాని, 'మస్సాకుం అల్లా బిల్ ఖైర్' (అల్లా నీ సాయంసమయాన్ని సలక్షణంగా గడుపుగాక) అనిగాని చెప్పాలి. ఈ అరబ్బీ అభివాదనపద్ధతిని అనుసరించే ఇప్పటికి యూరప్‌లో 'గుడ్ మార్నింగ్' అనేటప్పుడు తలకొంచెం వోమాదిరిగా ఆడిస్తారు. చెయ్యిపట్టుకుని ఊపుతారు. ఇందుకు పూర్తివ్యతిరేకంగా వుంటుంది హిందువులపద్ధతి. రెండుచేతులు జోడించి తలమీద గాని, నొసటగాని పెట్టుకుని తలవంచి నమస్కారం చేస్తారు.

ఇంతేకాదు, పాదుషాలు, అమీర్ల కొలువుల్లో ఇన్నిసార్లు సలాం పెట్టాలనిగూడ నియమముంది. ఏడు సలాములని మూడుసలాములని వాటికేదో లెక్కవుంది. మామూలు పెద్దల్ని, మిత్రుల్ని కలిసినప్పుడు ఒక్కసారి సలాంచేస్తే చాలు. లక్నో వారు సదాచారాల్ని, మర్యాదల్ని ఎక్కువగా పాటిస్తారు. కనుక వారిలో చిన్నవాళ్ళు పెద్దవాళ్ళకు, మధ్యతరగతివాళ్లు గొప్పవారికి నమస్కరించేటప్పుడు పైన చెప్పిన (తస్లీం, కోర్నిశ్, ఆదాబ్, బందగీ) మాటల్లో ఏదో ఒకటి అంటూ, కుడిచేతిని గుండెలవరకు, మొహంవరకుగాని ఎత్తి కళ్ళకద్దుకుంటున్నట్లు ఆడించడం ఆచారం. అలా చెయ్యడంలో ఆంతర్యమేమంటే, పిన్నలు పెద్దలఆజ్ఞ శిరోధార్యమన్నట్లు చేసే అభివాదనమన్నమాట. ఈనాటికి యిది యింకా ఆచరణలోవుంది. చెయ్యి అనేకసార్లు కదిలించడమనేది అనేక నమస్కారాలన్నట్లు భావం. 'తస్లీం', 'కోర్నిశ్' అనేపదాల్ని తరుచుగా ప్రజలు బహువచనంలో 'తస్లీమాత్','కోర్నిశాత్' అని వాడుతూంటారు. బహుశా నమస్కారాలను లెక్కకోసం చెప్పడం కాబోలు.

(ఇప్పుడికపైనచెప్పిన అభివాదనసూచక శబ్దాల అర్థం, వ్యుత్పత్తి, వికాసాల గురించి విడివిడిగా విమర్శగా చెప్తాను. 'తస్లీం' అనేపదానికి అరబ్బీలో 'సలాం' నమస్కారమని అర్థం. ప్రసిద్ధమైన 'అస్సలాం అలైకుమ్' అనేదాన్ని విడిచిపెట్టి, క్రియాపదాన్నిమాత్రం వాడుకోడం కొంచెం అనుచితంగా కనబడుతుంది. కానీ ఇక్కడి సమాజం, సలాం పెట్టడానికిబదులు 'నేను సలాం పెడుతున్నాను' అని చెప్పడంలో మర్యాద పాలెక్కువన్నట్లు అభిప్రాయమేర్పడింది.

'కోర్నిశ్' టర్కీ భాషాపదము. ఆపదాన్ని టర్కీప్రభువులు పట్టుకొచ్చివుండాలి. కోర్నిశ్ అనేపదానికి అర్థం 'వంగి నమస్కరిస్తున్నాము' అని. అందువల్ల, ఈ పదంలోగూడ నేలనంటి నమస్కరిస్తున్నట్లు, పాదాలుతాకి ప్రణమిల్లుతున్నట్లు భావం స్ఫురిస్తూంది.

'ఆదాబ్' అనేది 'అదబ్' అనేపదానికి బహువచనరూపం. 'అదబ్' అంటే వినయము, మర్యాద అని అర్థం. సలాం (నమస్కారం) పెట్టేటప్పుడు ఈ 'ఆదాబ్' వాడటంలో ఉద్దేశ్యమేమంటే, పెద్దలపట్ల ఎన్నిరకాలు మర్యాదలు పాటించాలో అన్నీ పాటిస్తున్నాను అని చెప్పినట్టన్నమాట.

'బందగీ' అని మరో పదముంది. అభివాదనంకోసం వాడే సమానార్థకపదాలన్నిటిలోకి, ఇది చాల నీచత్వాన్ని, నాస్తికతని సూచించేపదం. 'బందగీ' అంటే

దాసోహమన్నమాట. 'బందగీ' అని నమస్కారం పెట్టడంలో అంతరార్థమేమంటే, నేను నిన్ను పూజిస్తున్నాను అని. అసలు ముసల్మానుల సిద్ధాంతరీత్యాఅయితే వాళ్లు అల్లానితప్ప ఎవరిపట్ల పూజిస్తున్నామనే పదం వాడనే వాడరు. అలా అనడం నైచ్యంకింద భావిస్తారు.

హిందూదేశపు అభివాదనలకు పూర్తివిరుద్ధంగా ఉంటుంది. అరబ్బులోని "అస్సలాం అలైకుం' అనే పదం. 'అస్సలాం అలైకుం' అనేపదానికి అర్థమేమంటే 'నీకు క్షేమమగుగాక', అంటే మామూలుభాషగానైతే, 'నీవు క్షేమంగా ఉందువుగాక' అని. సలాం పెట్టడమంటే ఎదుటివారి క్షేమాన్ని ఆశించడమని తాత్పర్యం. మహమ్మదీయ సంప్రదాయం ఈ విషయానికి ఎంతటివివరణ యిచ్చిందో చూడండి. 'సలాం' అంటే భగవంతుడిచ్చిన సందేశము. భగవంతుడు, మహాదూత అయిన మహమ్మదు సాహేబ్ ద్వారా ముసల్మానులందరికి అందించిన సందేశమిది. కయామత్ (భగవంతునియెదట కర్మ విచారణజరిపే రోజు) వరకు తాము ఇచ్చిన ఈ సందేశాన్ని ప్రతి ముసల్మాను తన సాటి ముసల్మానుకు అందజేస్తూనే వుంటాడని ప్రతిజ్ఞచేస్తున్నట్టు చెప్పడమన్నమాటే సలాం. 'అస్సలాం అలైకుమ్' ఇందులో సలాంకు ముందు (అ) (ల) అనే అక్షరాలు ఎక్కువ కలిశాయి. దాని అర్థమేమంటే, హజరత్ మహమ్మదు అందించిన ఈ 'సలాం' అనే సందేశాన్ని నీకు అందజేస్తున్నాను అని చెప్పడం.

(మహమ్మదీయమతానుసారం ఈ సలాం అని చెప్పడంలో ఆశయమేమో, ప్రతి మనిషి ఊహించి తెలుసుకోవచ్చు. అసలీ 'సలాం' అనేపదంలో జాతీయ సమైక్యతాభావన యిమిడివుంది. ఈ సమైక్యతాభావనను ఐకమత్యగుణాన్ని మహమ్మదీయ మతానుయాయులందరిలోను, వ్యాపింపజేయడానికి ఇది సాధనంవంటిది. శోచనీయమేమంటే, ముసల్మానులందరు నిగూఢంగా దాగివున్న ఈ రహస్యాన్ని గమనించారో లేదో మరి. స్థితిమంతుడుకాని ఒక మామూలు ముసల్మాను మనకు కలిసినప్పుడు అతడికి 'అస్సలాం అలైకుం' చెప్పరాదని, అలా చెప్పడం తమ కవమానకరమని తలంచడం ఎంతవరకు భావ్యమో? అని మన అంతరాత్మే మనల్ని ప్రశ్నించదా?

ఎందుకు చెప్తున్నానంటే, మహమ్మదీయ మతం ప్రపంచప్రజలంతా సమానమేనని, సోదరులేనన్న సందేశాన్ని చాటి చెప్పింది. మామూలు ముసల్మానులని,

మరొకరని హెచ్చుతగ్గులు చూడమని చెప్పలేదే? ఆ మతానికిచెందిన వారెవరైనా సరే, అందరిపట్ల ఒకతీరుగా, వ్యత్యాసం పాటించకుండా, ఉదారబుద్ధితో ప్రసన్న చిత్తంతో వ్యవహరించవలసిందిగా బోధించింది.

క్షేమం విచారించడమంటే ఒకర్నొకరు పలకరించుకోడం, అందులో ఇరువురి క్షేమం ఇమిడివుంది. 'అస్సలాం అలైకుం' (నీకు క్షేమమగుగాక) అని అన్నప్పుడు అందుకు సంతోషించి, ఎంతో వినయంగా, తిరిగి 'వాలైకుం స్సలాం' (నీకును క్షేమమగుగాక) అని తిరిగి సమాధానంగా అంటాడు. ప్రపంచంలోని ఏ మతం లోను, ఏ మతసభ్యత, సంస్కృతిలోను మహమ్మదీయమతంలోవున్న ఇంతమంచి సాంప్రదాయంలేదని నా దృఢవిశ్వాసం.)

శ్రీమంతులు, స్థితిమంతులయినవారి సమాజాల్లో 'ఆదాబ్', 'తస్లీం' అని చెప్పు కోడం రివాజు. 'బందగీ' అనేపదాన్ని ఎక్కువగా ఆడవాళ్ళే వాడటం ఆచారం.

(చిన్నలు పెద్దలకు, పేదవారు గొప్పవారికి ప్రణామం చేసేటప్పుడు, బాగావంగి, 'తస్లీం' అనిగాని 'ఆదాబ్' అనిగాని చెప్పాలి. ఇది లక్నోవారిపద్ధతి. వారి ప్రాచీన సంప్రదాయాన్ననుసరించి వినమ్రులై చేసే అభివాదన విధానమిది. దానికి సమాధానంగా, పెద్దలు పిన్నల్ని 'దీర్ఘాయుష్మాన్ భవ' అనిగాని, 'చల్లగా వర్ధిల్లు' అని గాని, 'ఐశ్వర్య సిద్ధిరస్తు' అంటారు. గొప్పవాళ్ళు వంగకుండా చెయ్యెత్తి 'తస్లీం' 'ఆదాబ్' లేక 'బందగీ' అని పేదవాళ్ళకు ప్రత్యుత్తరమిస్తారు. సరిసమానులు దారిన పోతున్నప్పుడు అభివందనంచేస్తే, అవతలవాళ్లు కొంచెంవంగి 'తస్లీం' అని గాని, 'ఆదాబ్' అనిగాని చెప్పాలి. అదే సభలు సమావేశాల్లోకనుకైతే, పూర్తిగా లేచినిలబడి, వంగివంగి సమాధానం చెప్పాలి.) (అభివందనాలయినతర్వాత యోగ క్షేమాలు విచారించే ఆచారం వుంది. సలాంచేసి 'మిజాజ్ శరీఫ్' 'మిజాజ్ అక్దస్', 'మీజాజే ఆలీ?' 'మిజాజే ముఅల్లా', 'మీజాజే ముబారక్' (క్షేమమేనా) అని అన్నప్పుడు అతని ఎడమచేతినిపట్టుకుని 'దుఆ కర్తాహుఁ' (దేవుణ్ణి ప్రార్థిస్తాను) అని చెప్పాలి.

యావద్భారతదేశంలో ఎటుచూసినా శిష్టజనుల అభివందనాదిపద్ధతులు ఈరీతిగానే వుంటాయి. అయితే లక్నోలోను, ఇంకా మరికొన్నినగరాల్లోను, హిందూరాజులు రాజ్యాలేలినచోట్లను ఈ సంప్రదాయాలు పాటించడంలో బహుశ్రద్ధచూపిస్తారు. ఏమాత్రం లోపంజరిగినా, అమర్యాదగా భావిస్తారు.)

వెనుకటి ఆ ప్రాచీనరాజ్యాలు, ఆ సదాచారాలు అన్నీ నశించిపోయాయి. ఈ మధ్యనే కొద్దికాలంనుంచీ, ముఖ్యంగా లక్నోలో సామాన్యప్రజలు, శిల్పులు, నిమ్న జాతులవారిలో 'అస్సలాం ఆలేకుం' అనుకోడం బాగా వాడుకై పోయింది. దేవుడు మేలుచేసి, గొప్పవాళ్లుకూడ వాళ్ళను అనుకరించి, పెద్దా చిన్నా, గొప్ప బీదా అనే భేదభావం పెట్టుకోకుండా, ప్రాచీనసంప్రదాయం వర్ధిల్లేటట్టుచేస్తే అదే పదివేలు.

# 40

## 7. పలకరింపులు; యోగక్షేమాలు విచారించుట

భారతీయసంస్కృతిలో ఏడవవిషయం - మాటామంతీ, సంభాషించే విధానము. ప్రపంచంలోని ప్రతిమనిషియొక్క సభ్యత, అతని విద్వత్తు అతడు మాట్లాడేతీరు, అతడు వాడే మాటలసొగసునుబట్టీ బోధపడుతుంది. ప్రపంచంలోని శక్తివంతమైన ప్రతిజాతి మొట్టమొదట తనభాషను బాగుచేసుకుని, తర్వాత దాని వికాసానికై పాటు పడుతుంది.

అసహ్యము, అశ్లీలంకాని మాటలు మాట్లాడడమే సభ్యత అనిపించుకుంటుంది. ఔనా ? నీ మాటలు, నీ ఆలోచనలు ఎదుటివాడికి మోటు అనిపిస్తాయని తోస్తే మాత్రం అతడిముందు నోరెత్తకు. ఒకవేళ మోటుతరహాగా మాట్లాడినా ఎదటి వార్ని నొప్పించకుండా నీ ధోరణిమీద వెగటు పుట్టించకుండావుండేటట్టు మసులు కోవాలి, మాట్లాడటంలోగూడ స్వారస్యముండాలి. ఎదుటివారికి రసజ్ఞత ఉండాలి. ఈ విషయంలోమట్టుకు లక్నో ప్రజలకున్నంత సంస్కారం, మాటసొగసు హిందూ దేశంలో ఎక్కడా, ఏ ప్రాంతలోనూ కనబడదు. అయితే ప్రస్తుతకాలంలో ఈ చదువులంటూ వచ్చాకనే సభ్యత పెరిగింది. చదువు సంస్కారం ఉన్నందువల్లనే మాట సొగసు అబ్బింది. కానీ, లక్నోవారి కలాకాదు. ఇంగ్లీషువారిప్రభావం పడక ముందే లక్నోప్రజల్లో ఎంతటి నాగరికత, నమ్రత, మాట సొగసువుండేదో వారు మాట్లాడేతీరునిబట్టి వ్యక్తమవుతుంది.

(ఏ ప్రాంతీయులయినాసరే, మాట నేర్పరితనంలో లక్నోవారికి సాటిరారు. వారికి వారేసాటి. లక్నోవారిముందు మాట్లాడటానికి బయటవాళ్ళకు చెప్పలేనంత జంకు, బిడియమూను. ఆ జంకువల్ల వారిలో కాస్తో కూస్తోఉన్న సభ్యతకూడ మాయమైపోతుంది. సభలు సమావేశాల్లో కలుసుకున్నప్పుడుకూడ, మిగతావాళ్లు మేమేదో మోటువాళ్ళం. ఉన్నదున్నట్లు మాట్లాడడమే మాకు చేతనవునుగానీ, లక్నోవారిమోస్తరు అంత తూచితూచి మాట్లాడటం మావల్లకాదు. అని తమ బల హీనతను తమరే వెల్లడిచేసుకోడంకూడ కద్దు. నిజానికి అలా అనడం అవతల వారిని దూషణకాదు, భూషణే అనిపిస్తుంది.

వాగ్ధాటి అంటే చెప్తున్నా. లక్నోవారియెదుట పారసీవారు హిందూస్తానీ మాట్లా డటం మర్చేపోవడం నేను కళ్ళారాచూశాను. పరాసువారితో మాట్లాడాలంటే ఇంగ్లీషువారికి నోట మాటపెగలదు. అరబ్బుల వాగ్ధాటిచూస్తే విదేశీయులుగూడ నోరు వెళ్లబెట్టాల్సిందే. అరబ్బులదృష్టిలో తాముతప్ప లోకమంతా మూగదాని కిందే జమ. ఆవిషయంలో వారికెంత ధీమా అంటే, భగవంతుడు తమకొక్కరికే మాట నేర్పరితనం ఇచ్చినట్లు, నోట్లో నాలుకవున్నవాళ్ళు తమరొక్కరే అయినట్టు లోకమంతా మూగదన్నట్టు వారి భావన.

సరిగ్గా అలాటిభావనే లక్నోవారికీను. నిజమే. హిందూదేశమంతా గాలించి చూసినా, ధారాళమైనభాషలోను, వాగ్ధోరణిలోను, వినోదప్రవృత్తిలోను లక్నో వార్ని మించినవారు మనకంటికి కనుపించరు. సభలు సమావేశాల్లో వారిదే అగ్ర స్థానం. వారిముందు అంతా బలాదూరే. చూస్తూచూస్తూ వారున్నచోట ఎవరు నోరెత్తలేరు.)

ఇక భాషావిషయకమైన సభ్యతలో, ఎదుటివారిని సంబోధించేటప్పుడు వాడ తగిన సర్వనామాల్నిగురించి మొట్టమొదట గమనించాల్సివుంది. అన్నిభాషల్లోను సంబోధనపరంగా వాడే సర్వనామాలున్నాయి. అవి ఏకవచనం, బహువచనం అని రెండురకాలుగా వుంటాయి. సంబోధించాల్సినవ్యక్తి గౌరవనీయుడైనట్లయితే అతనిని సంబోధించేందుకు ఏకవచన సర్వనామప్రయోగం చేయరాదు. బహువచన సర్వనామాన్నే వాడాలి. పారసీలో ఏకవచనసంబోధన సర్వనామం 'తూ' (నీవు) బహువచనం 'శుమా' (మీరు-తమరు). అరబ్బీలో ఏకవచనసర్వనామం 'క'

మరియు 'అంత్'. బహువచనంలో 'కుమ్' మరియు 'అంతుమ్'. ఇంగ్లీషులో 'యు' అనే సర్వనామాన్నే ఏక, బహువచనాలకుగూడ వాడతారు. ఈ భాషలన్నిటికి పూర్తివిరుద్ధంగా వుంటుంది ఉర్దూ. ఉర్దూలో ఏకవచన సర్వనామం 'తూ'. బహు వచనంలోమాత్రం 'తుమ్' అని 'ఆప్' అని రెండు సర్వనామాలున్నాయి.

సంబోధించబడేవ్యక్తి స్థితిగతుల్నిబట్టి ఆ మూడు సర్వనామాలవాడకం నిర్ధారించబడివుంది. అంటే, మనకంటే చాల తక్కువస్థితిలోవున్నవాణ్ణి సంబోధించడానికి 'తూ' (నీవు) నీచార్థకంలో వాడతారు. తక్కువస్థితే అయినా కాస్త గుడ్డిలో మెల్లగా ఉంటేను, మనకంటే చిన్నవాళ్ళని సంబోధించేందుకు 'తుమ్' (నీవు) అను సర్వనామం వాడతారు. సరిసమానహోదాలో, ఫాయాల్లోవున్నవారికి, చదువుకున్నవారికి, 'ఆప్' (తమరు) అను సర్వనామం వాడతారు. మిత్రులు, సమాన వయస్కులకనుకైతే పెద్దవాళ్ళుగూడ పరస్పరం 'తుమ్' (నీవు) అనే పిల్చుకుంటారు. అయితే ఏమాత్రం సంకోచించకుండా ఎదుటివారిని తుమ్ (నీవు) అని సంబోధించడాన్ని ముఖ్యంగా లక్నోవారెంతో అపచారంగా భావిస్తారు.)

(ఉర్దూభాషలో, అందులోను ముఖ్యంగా లక్నోవారికి సంబోధించేపదాలు, తరతమభేదాలు కొల్లలుగావున్నాయి. గొప్పవారిని, మర్యాదస్తుల్ని సంబోధించేటప్పుడు, జనాబ్, 'జనాబే-వాలా' జనాబే ఆలీ (మహాశయా అన్నట్టు) 'హజరత్', 'హజరతే-వాలా', (ఆర్యా అన్నట్టు), 'హుజూర్' 'హుజూరే ఆలీ' (అయ్యా), 'కిబ్లా'-కిబ్లా వో కాబా', సర్కార్ (ప్రభూ) ఇలా వివిధరీతులుగా వారివారి అంతస్థునిబట్టి సంబోధించడం ఉర్దూలో సంప్రదాయంగా వుంది. ఈ సంబోధనాశబ్దాలన్నీ లక్నోవారి వంటబట్టిపోయినాయి. ఈ పదజాలాన్ని వారు వాడేటంతసొంపుగా ఏ ప్రాంతీయులు వాడలేరు. వారియొక్క విచక్షణాజ్ఞానం లోకోత్తరమైంది.

ఇన్నిరకాల సంబోధనలు, ఆదరసూచకంగా వాడే ఇంతటిపదజాలం ఉర్దూ భాషలో వున్నంతగా ప్రపంచంలోని మరి యేభాషలోగానీ లేవని బల్లగుద్ది చెప్పగలను.)

(ఒకప్పుడు హిందూదేశంలో ఉర్దూభాష, ఉర్దూసాహిత్యము, అన్నిభాషల్లోకి మిన్నగా వుండేది. ఇప్పుడాకాలం గడిచిపోయింది. ఇప్పుడు ఉర్దూ సాహిత్యపు శిష్యత్వంనుండి విముక్తిపొంది అన్నిభాషలూ తమతమ గొప్పదనాన్ని చాటి చెప్పు

కుంటున్నాయి. బెంగాలీ, పంజాబీ, గుజరాతీ, మరాఠీ, హిందీ, కన్నడము, తెలుగు మొదలైనభాషలన్నీ సాహిత్యంలో ప్రగతిని సాధించామని చెప్పుకుంటున్నాయి. కానీ, పైన ఉదహరించిన భారతీయభాషల్లోను, ఇంకా ప్రపంచంలో ప్రముఖభాష లుగా చలామణీ అవుతున్న అరబ్బీ, పారసీ, ఇంగ్లీషు, ఫ్రెంచిభాషల్లోగానీ, ఉర్దూ భాషలో ఉన్నంత సంబోధనాత్మక పదజాలంలేదని, ఏ భాషాపదకోశంలోను అన్ని రకాలపదాలు లభ్యంకావని సవాలుచేసి చెప్పగలను. అల్పవ్యవధిలో పరిమితమైన ప్రయోగక్షేత్రంలో ఉర్దూభాష సభ్యత, సరసత, సదాచారాలు, కట్టుబాట్లవిషయంలో సాధించినంత ప్రగతి ప్రపంచంలోని మరి ఏ ఇతరభాషగూడ సాధించలేదంటే అతిశయోక్తి కాదు. వాస్తవానికి ఉర్దూభాష ఏ దేశానికి, ఏ ప్రాంతానికి, ఏ తెగకి, ఏ మతానికి చెందిందికాదు. అది రాజాస్థానాల్లో పుట్టి పెరిగింది. అక్కడినుంచి బయలుదేరి హిందూదేశంలోని, సభ్యత సంస్కృతిగల ప్రతిపౌరుని, ప్రతిష్ఠగల వ్యక్తిని, సారస్వతప్రియుణ్ణి, రచయితను, కవిని ఇట్టే ఆకట్టేసింది.

అసలా భాషకు సభ్యత సంస్కృతిగలవారి చేతుల్లోనే పునాది యేర్పడింది. సభ్యత సంస్కృతియే ఉర్దూభాషకు పునాది రాళ్ళు. అందుకనే అది ఉదాత్తమైన భావా లున్నవారి పరమైంది. సాహితీప్రియులభాషగా స్థాయి ఏర్పరచుకుంది. ఆ భాష మాట్లాడేవారి మెజారిటీ ఏ రాష్ట్రంలోను అంతగా లేకపోవడానికి ముఖ్యమైన కారణం అదే. అయితే ఒక్కవిషయం. ప్రతి ప్రాంతంలోను సభ్యత నాగరికత ఉన్నవారుమాత్రం ఉర్దూ తప్పక మాట్లాడతారు. ప్రపంచంలో కంతటికి భారత దేశంలో అత్యున్నతస్థాయికి చెందిన సభ్యత, సంస్కృతికల మానవసమాజ నిర్మా ణాన్ని ఆశయంగా పెట్టుకుని పుట్టినభాష ఉర్దూభాష. కానీ దురదృష్టవశాత్తు ఇంగ్లీషు వారిరాకతో పాశ్చాత్య నాగరికత యావద్భారతదేశాన్ని ఆవరించేసుకుంది.

ముసల్మానులకు భాషాభిమానం, ధీమా ఎక్కువగా వుండేవి. వారి అధ్వర్యంలో హిందువులకు తీరనికోరికలు వుండిపోవడంవల్ల, ఆంగ్లేయులరాక, పాశ్చాత్యనాగరి కతాప్రభావంతో హిందువులంతా కూడబలుక్కుని తలలెత్తారు.

ఉర్దూ అనేది మనభాషకాదు, ఇది మహమ్మదీయులభాష, ఆ భాషలో వారిని ఎదిరించడం మనవల్ల ఎలాగూ కాదని అనిపించి, వారిభాషను వారినెత్తినేకొట్టి, తమరు కొంగు దులుపుకుని వేరైపోయారు. దాంతో ఉర్దూ దెబ్బతిన్నది. ఇంకా

ఇంకా రోజురోజుకు చిక్కలపాలైంది. అంతమాత్రంచేత దానిలోని స్వారస్యము. సొంపు. సాహితీసృష్టికి కావలసిన భాషాపరిపుష్టి ఎక్కడికి పోతుంది? అది మనం ఒప్పుకుతీరాల్సిందే. అన్నిసుగుణాలు. తర్వాత కొత్తగా బయల్దేరిన హిందీభాషలో గానీ, హిందూదేశంలోని మరి యే యితరభాషలోగానీ లేవు.)

ఇంగ్లీషువారుకానీ, అరబ్బులుకానీ, ఆఫ్ఘన్‌లుగానీ, పారసీలుకానీ, ఉర్దూ మాట్లాడారా అంటే వారినోట సంబోధనగా 'తుమ్' (నీవు) అని తప్ప మరోశబ్దం రానేరాదు. ఎందుకంటే వారిభాషల్లో మర్యాదగా, మన్ననగా సంబోధించేందుకు 'తుమ్' అనే పదంతప్ప మరొకటి లేందే।

ఇంగ్లీషులో అయితే, 'యువరానర్', 'యువర్ ఎక్సెలెన్సీ', 'యువర్ హైనెస్' 'యువర్ మెజెస్టీ' ఇత్యాదిపదాలెన్నో ఉన్నతస్థాయివారికోసం, అంటే సామంతులు, చక్రవర్తులు మొదలయినవారిపట్ల ప్రయోగించడానికి ఏర్పడ్డాయి. ఈ పదాల్ని అటు వంటివారికోసంతప్ప సర్వసాధారణంగా వాడడానికి వీలుపడదు. ఈరీతిగా ప్రముఖ వ్యక్తులకోసం వారి సంబోధననిమిత్తం వాడేందుకని ఉర్దూలో ఉదాహరణకు, 'జహాఁపనాహ్', 'సాహబే ఆలమ్', 'ముర్షిద్ జాదా', 'నవాబ్ సాహేబ్', 'నవాబ్ జాదా', 'సాహబ్ జాదా' ముఖ్యమైన పదాలున్నాయి. ఈపదాలు ముఖ్యంగా ఉచ్ఛ వర్గాలవారిని సంబోధిస్తూ వాడే మహాశయా (జానాబ్), ప్రభూ (హుజూర్) పదా లతో జోడించి వాడుకోవచ్చు. ఈవిధానం ఇంచుమించుగా అన్నిభాషల్లోను వుంటుంది. అయితేగూడ పైన పేర్కొన్న గౌరవసూచకమైనపదాలు ఉర్దూభాషలో శిష్టులు, వంద్యులయిన ప్రతివారిపట్ల వాడతారు. ఆమాదిరిపదాలు మిగతా భాషాసంప్ర దాయాల్లో కనబడవు. (యోగక్షేమాలు విచారించేందుకు, (కుశలమడిగేందుకని ప్రతి భాషలోను ఏవో పదాలు వుండనేవుంటాయి. అయితే ఉర్దూలో గౌరవపురస్సరంగా అడిగేటప్పుడు (మిజాజే ఆలీ) బాగున్నారా? (మిజాజే ముఅల్లా) (మిజాజే ముబా రక్) క్షేమమా? (మిజాజే అక్దస్) (మిజాజే ముకద్దస్) ఇత్యాదిపదాలు వాడతారు. ఈ పదాలన్నీ ఇప్పుడు ప్రగతి చెందుతున్న ఉర్దూతోబాటు అన్నిచోట్ల వాడబడు తున్నాయి. అయితే ఆ పదాల సొగసంతా లక్నోలోని శిష్టజనుల వ్యావహారికంలోనే ఇమిడివుంది. మిగతావారు అందుకు నోచుకోలేదని చెప్పాలి.)

లక్నోకుచెందిన కులీనుల ఉచ్చారణ పరిశుద్ధమైందిగా వుంటుంది. అది వారి లోని ప్రత్యేకత. అరబ్బీ అక్షరాల్ని వీలయినంతవరకు స్పష్టంగా ఉచ్చరిస్తారు.

పారసీపదాలలోని విభక్తి ప్రత్యయాల్నిగూడ అతిస్పష్టంగా పలుకుతారు. పండితులయినవారు మాట్లాడేటప్పుడు అరబ్బీ పారసీపదాలు ఎక్కువగా వుపయోగిస్తారు. ప్రతిపదము ఎంతో చక్కగా ఉచ్చరిస్తారు. వైద్యులు మాట్లాడేటప్పుడు అరబ్బీలోని వైద్యశాస్త్రపరిభాషనే వాడుతారు. సామాన్యప్రజలు, పనివాళ్లకనుకైతే, అరబ్బీ పదాలే మాట్లాడరు. ఆడవాళ్ళు మాట్లాడేటప్పుడు ఎక్కడలేనిసామెతలు, లోకోక్తులు సంభాషణల్లో గుప్పించేస్తారు.

పిన్నలు పెద్దలతోను, తక్కువవాడు గొప్పవాడితోను, చదువురానివాడు చదువుకున్నవాడితోను, పామరుడు పండితుడితోను మాట్లాడేటప్పుడు, ఎదుటివ్యక్తికి మర్యాదయిచ్చి మాట్లాడటంలో ఎంతో మెలకువతో వుంటాడు. మాట్లాడేటప్పుడు తగుమాత్రపు స్థాయిలోనే మాట్లాడుకుంటారుగానీ, గొంతు చించుకోరు. అదే విధంగా పెద్దలు పిన్నలతోను, గొప్పవారు తక్కువవారితోను, విద్వాంసులయిన వారు జనసామాన్యులతోను మాట్లాడేటప్పుడు మాట్లాడేతీరు, మాటలసొంపు, మాటల్లో స్నేహం వాత్సల్యం ఉట్టిపడుతూవుంటుంది.

పై విషయాల్ని దృష్టిలోవుంచుకుని మర్యాదను వ్యక్తంచేసేపదాల, సర్వనామాల వాడకంవల్లనే, లక్నోవాసులభాష నియమబద్ధమై, సుబోధకమై ధారాశుద్ధిని పొందింది. లక్నోలోవుండే సర్వసామాన్యులందరు, అక్షరుకు చదువుసందెలు రానివారు సైతము ఇతరప్రదేశాల్లోని కవులు రచయితలకంటెగూడ మంచి ఉర్దూ మాట్లాడతారు.

అంతేకాదు; వారికున్నంత నాగరికత, సభ్యత మిగతాప్రాంతాల్లోవుండే చదువుకున్నవారిలో కనబడవు. శోచనీయమైన విషయమేమంటే రానురాను లక్నోగూడ పాడైపోతూంది. బయటనుంచి వచ్చిపడిన జనాభాయొక్క అసభ్యపు ప్రవర్తనల వల్ల అక్కడఉన్న సభ్యులు, శిష్టజనులు ఎందుకూ కొరగానివారివలె ఒకమూల కూర్చోవలసినగతి యేర్పడిపోయింది.

చట్టం ఇచ్చిన హక్కులవల్ల చదువుసందెలు రానివాళ్ళంతా పేట్రేగిపోయారు. వారి అసభ్యప్రవర్తనలు మిక్కుటమైపోయాయి. అందువల్ల లక్నోలో సదాచారాలకి సంబంధించిన సుగుణాలన్నీ మంటగలిసిపోతున్నాయి. కొంతకాలానికి సొంతం పోవచ్చు. ఏం చెప్తాం.

# 41

## 8. హాస్యధోరణి

అరబ్బుల్లో వెనకటికో మాటవుంది. ఆమాట నిజంగా హజరత్ మహమ్మదుగారన్నారో లేదో గాని అన్నట్టు ప్రసిద్ధయితే వుంది.

ఆమాట యేమిటంటే ఉప్పులేనిభోజనం, వినోదంలేని సంభాషణ రుచిగా వుండవని. నిజమే. మాటల్లో చమత్కారము, హాస్యధోరణి లేకపోతే ఆ సంభాషణలో మజా యేముంటుంది? సభలకు జీవమేం వుంటుంది? అయితే ఆ వినోదప్రసంగాల్లో కనుక ప్రమత్తత యేర్పడిందో, శిఖపట్లగోత్రంవరకు రావాల్సిందేగదా. ఈ వినోదాలు పరిహాసాలే ముదిరితే, ధోరణి బెడిస్తే, కత్తులు విసురుకునేప్రమాదం తటస్థపడవచ్చు. వెనుక ప్రాణమిత్రులిద్దరికి మాటా మాటావచ్చి క్షణంలో శత్రువులయిపోయారు. జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ అనర్థాలకు కారణం హాస్యప్రసంగాలేమాత్రం కావు, ప్రసంగంలో హాస్యంపోయి హద్దుమీరి అతి అవడమే కారణమని స్పష్టంగా తెలుస్తుంది.

భాషావికాసంతోబాటు, ఆ భాషలో వెక్కిరింతలు వేళాకోళాలు, వ్యంగ్యార్థాలు, హాస్యాలు, యెద్దేవాలు అన్నీ ఆ మోతాదులోనే పెరుగుతాయి. మాటల్లో స్ఫురించే అర్థానికి హద్దులు ఏర్పాటుచేయడం సులభంకాదు. మాట్లాడేతీరుల్లో ఒకేమాటకు అనేకార్థాలు స్ఫురిస్తాయి. ఆ తీరు భాషావేత్తలకే తెలుసు. ఆ విషయంమీద చర్చ సాగిస్తూకూర్చుంటే గ్రంథం పెరిగిపోతుంది. ఎదుటివాళ్తో హాస్యాలాడటానికి వాడేపదజాలం ఎన్నో అర్థాలు పలుకుతుంది. అందులో వ్యంగ్యం వుంటుంది, వినోదమూ వుంటుంది. ఒకమనిషిని ఒక పనికిమాలిన వస్తువుతోపోల్చి అందులో అలంకారానికి మురిసిపోవడం, అదేపద్ధతిగా తననుగురించిగాని, ఇతరులగురించిగానీ, గొప్పగానో లేకపోతే మరీ తక్కువగానో చెప్పుకోడం అసహజంగాను వుంటుంది. వినోదప్రసంగాలు చేయడానికి వివేకమెంతో కావాలి. మంచి వివేకం ఉన్నవాడయితే చుర్రునతగిలేటట్టు మాటలన్నా, అప్రియమైనవాటితో పోల్చిచెప్పినా, ఎవరిమనసు నొచ్చుకోకుండా, ఎవరికి కోపంరానట్లుగా సమర్థించుకోగలడు.

అదేకనుక వివేకంలేని మూర్ఖుడు మాట్లాడాడంటే అందరు విరుచుకుపడతారు. విరోధిస్తారు. ఈవిషయంలో లక్నోప్రజలకున్నంత మెలకువ, వివేకం మిగతా ఎక్కడా ఎవరిలోను కనబడవు.)

ఒక బెంగాలీపండితుడు డాక్టర్ అఘోరనాథ్ అనే గొప్పవిద్వాంసుడు తత్త్వ వేత్త, సాహిత్యంలో పిహెచ్. డి. ఇంకా ఉర్దూ బాగా తెలిసినవాడు. ఉర్దూని గురించి మాట్లాడుతూ 'అయ్యా, ఇదెక్కడి భాష, ఇదెక్కడి లోకం? ఒకసారి ఒకసభలో మాట్లాడుతూ, 'మనం ఈరోజుల్లో పాలు తాగుతున్నాం' అన్నాను. అనేసరికి సభలోవారంతా ఒక్కసారి గొల్లున నవ్వారు' అని చెప్పాడు.

('ఉర్దూభాషలో ఉన్న సొగసదే' అన్నాను నేను. 'ఉర్దూలో మీదింకా మిడిమిడి జ్ఞానమే. అందుకే మీకు మీరు మాట్లాడినమాటలో తప్పుతెలియక, భాషకు దోషాన్ని అంటగడుతున్నారు. భాషలో రెండర్థాలునచ్చే ద్వ్యర్థిశబ్దాలని ఉంటాయిగదా. భాషా వేత్తలు నిందద్యోతకం కాకుండా శబ్దప్రయోగం చెయ్యడంలో సిద్ధహస్తులై వుంటారు.'

ఇంగ్లీషులో 'కన్‌సీవ్' అనేపదానికి 'ఆలోచించుట', మరియు 'గర్భధారణ' అని రెండర్థాలు. ప్రసిద్ధుడయిన ఒక దొరవారు పార్లమెంటులో మూడుసార్లు 'ఐ కన్‌సీవ్' అనేసరికి విని, ఒకతను, 'అయ్యా, ముమ్మారు గర్భధారణజరిగినా ఏం పుట్టనేలేదే' అని బిగ్గరగా అన్నాడట. అందరు పకాలుమన్నారట. ఆ దొరవారు కాస్త సిగ్గుపడిపోయారట. ఎందుకు చెప్తున్నానంటే ఇదేమాదిరిగా ఉర్దూబాషలో గూడ అనేకార్థాలిచ్చే వేలాది శబ్దాలున్నాయి. మాట్లాడేవాడు పదప్రయోగం తెలీ కుండాచేశాడో, ప్రతిమాటకు కడుపుబ్బ నవ్వుకోవాల్సిందే.)

పైనచెప్పిన 'పాలు తాగడం' అనేమాటవిషయం. పిల్లలు పాలుతాగుతారు. పాలు తాగడమనేది పిల్లలు చేసేపని. చదువుకుని తెలివైనవాళ్ల పెద్దలు 'మనం పాలు తాగుతున్నాం' అనడం తప్పుమాట. పైగా ఆ మాటనడంలో మేము వట్టి అజ్ఞా నులం, తెలివితక్కువవాళ్ళం అనేభావం వినబడుతుంది. ఈ బెడదనుంచి తప్పించు కోడానికే లక్నోవాళ్లు 'నేను పాలు తాగుతాను' అనేదాన్నే, ఆ తప్పుడు అర్థం రాకుండాఉండేందుకు 'నేను పాలు ఉపయోగిస్తున్నాను' అనో, 'ప్రస్తుతం పాలే నా కాహారం' అనో, 'పాలు తింటున్నాననో' అని నింద స్ఫురించకుండా తప్పించు కుంటారు. పాలు తినడంగాని, తాగడంకాదన్న లక్నోవారిప్రయోగాన్నివిని।ఆగ్రాకు

చెందిన ఒక కవి అనుమానం వెలిబుచ్చాడు. అప్పుడిలా చెప్పవలసివచ్చింది. పాలు తాగేపదార్థమే. తినుట అనుపదం పాలవిషయంలో వాడటానికి వీల్లేదన్నది వాస్తవమే. అయితే అందులో నిందాద్యోతకం కాకుండా ఉండటానికే లక్నోవాసులు పాలు తినడంగా తమమటుకు ప్రయోగించుకుంటున్నారన్నారు.

ఈ ఒక్కటే కాదు. ఉర్దూలో వందలపదాలు వ్యంగ్యార్థాలు ఇచ్చేవి ఉన్నాయి. భాషావిదులు నిందావాచకంగా కాకుండా, సరదాగా ఎగతాళికి వినియోగించుకుంటే ఇబ్బందిలేదు. వాడకం తెలీనప్పుడు తెలియజెప్పవలసిన అగత్యమూ ఏర్పడుతుంది గదా ?

లక్నోవాసులకు చమత్కారంగా మాట్లాడుకోడం, హాస్యాలాడుకోడం చాలా యిష్టం. వాళ్లు మాట్లాడే ప్రతిమాట ఎంతో హాస్యంగా వుంటుంది. హాస్యసంభాషణ ప్రవీణులే సాహిత్యసమావేశాల్లో రాణిస్తారు. సన్మానాలందుకుంటారు. మిగతా ప్రదేశాల్లో ఉన్నవారికి ఇంతటిప్రతిభ లేదనను. ఉంటుందనుకోండి. దేశమంతా ఉర్దూభాష వ్యాప్తిచెందుతూంది. ఉర్దూభాషతోబాటు ఔచిత్యమైన హాస్యం పెంపొందుతూంది. జనానికి ఉర్దూకావ్యాలు చదివి అవగాహన చేసుకునేశక్తి పెరుగుతూంది. లక్నోవాసులకు ఈ కళ వెన్నతోపెట్టిన విద్య. సరసంగా మాట్లాడటం, చెణుకులు విసరడం, వారికి చేతనైనంతగా మరి యెవరికి కాదేమో.

## 9. లక్నో ప్రజాజీవనవిధానంలో వివాహాది వేడుకలు

(ముసల్మానుస్త్రీల ముచ్చటలు వేడుకలుగూడ వారి ఐశ్వర్యము ఆధిపత్యంతో పాటే పెరిగిపోయాయి. బిడ్డ పుట్టిందిమొదలు పెళ్ళివరకు అడుగడుగునా వారు చేసే వేడుకలు అన్నీ ఇన్నీ కావు. బిడ్డపుట్టిన ఆరో రోజే వేడుక మొదలుపెడతారు.

ఆరోరోజు (ఛటీ) అని, నలభైయోరోజు (చిల్లా) అని పురిటిసీళ్ళు (అకీకా) అని పుట్టువెంట్రుకలు తీసేవేడుక. (ఖీర్ చటాయీ) అన్నప్రాశన. (దూధ్ బఢాయి) పాలు మాన్పించడం, అందుకో వేడుక. (బిస్మిల్లాహ్) అక్షరాభ్యాసం, తర్వాత (ఖత్నా) అని ముసల్మానుల సాంప్రదాయికమైన ఒక సంస్కారం. వీటన్నిటికంటె గొప్పగా (నికాహ్) పెళ్లి నిశ్చితార్థం మొదలయినవేడుకలన్నీ చెయ్యడమేకాకుండా, ఆరోగ్యస్నానమని అదో వేడుక. ఇంకా తలవనితలంపుగా ఏదైనా కలసివస్తే అందుకో వేడుక. ఇవన్నీ తరుణం తప్పకుండా యథావిధిగా జరపాల్సిందే.)

ఈ శుభకార్యాలకు ఇరుగుపొరుగువారిని, బంధుమిత్రుల్ని పిలుచుకుంటారు. పేరంటాలు చేస్తారు. ముఖ్యంగా వీటిలో స్త్రీలప్రమేయమే ఎక్కువ. వచ్చిన పేరంటాళ్లు కూర్చోడానికి సామాన్యులయితే, బల్లలో లేకపోతే నేలమీద తెల్లని జంపఖానా పరుస్తారు. అదే శ్రీమంతులయితేకనక విలువైన తివాసీలు పరుస్తారు. రకరకాల కొవ్వొత్తిదీపాలు వెలిగించి అలంకరిస్తారు. ఆరోజున డోం జాతి స్త్రీలమేళం ఏర్పాటు చేయిస్తారు. నాట్యకత్తె కాళ్లకు గజ్జెలుకట్టుకుని నాట్యంచేస్తూ అభినయిస్తుంది. ఈ గానాభినయాలతోబాటు మధ్యమధ్య అనుకరించి హాస్యాలాడుతూ నవ్వు పుట్టించేటట్టు నటిస్తుంది. దాంతో ఇల్లంతా కలకలంతో నిండిపోతుంది. అయితే ఆ హాస్యనటనలు హద్దుమీరి వెకిలిగా తయారయ్యేపరిస్థితి ఏర్పడటంగూడ కద్దు. వారికో చిన్నా పెద్దా తారతమ్యంగాని, ఎవరయినా ఏమైనా అనుకునిపోతారేమోననే ధ్యాసగాని ఉండదు. వారు జరిపే ప్రతివేడుకకు లక్షతొంభై ఆచారాలు. అన్నీ తు. చ. తప్పక ఆచరించాల్సిందే.

ఈ తతంగమంతా జరిపించడానికి వృద్ధవనితలు కొందరు, వారికి సాయంగా డోంజాతి స్త్రీలు బాధ్యతతో చేస్తారు. వారి కిదేపని. వాళ్ళకు తృణమో పణమో దక్కేది ఇటువంటి తరుణాల్లోనే.

ఈ సందర్భాల్లో రాత్రంతా జాగరణచేయడం వారి ఆచారం. భారతీయవనితలకు భగవంతుడిమీద నమ్మకము మిక్కుటముగదా? దేవుడిమీద ఎన్నో పాటలు పాడుతారు. రాత్రంతా మేల్కొని పూజలు చేస్తారనికాదు. ఆటలతో పాటలతో చిందులతో తందనాలతో తెల్లవార్లు జాగరణచేసి, తెల్లవారేసరికి మసీదుకువెళ్లి అల్లాకు మొక్కులు చెల్లించుకుని బూరెలవంటి పిండివంట నివేదనచేసి వస్తారు. ఈ ఆచారాలన్నీ బస్తీల్లోను పల్లెల్లోను ఒకతీరుగానే వుంటాయి. అయితే పల్లెల్లో బస్తీల్లో అంత తీరుబాటుగా ఆచరించరు. ఆచరించేవిధానంలో అసభ్యం కనబడుతుంది. బస్తీల్లో అయితే ఈ కార్యక్రమాలు ఒక సక్రమమైనపద్ధతుల్లో శుచిగా, శుభ్రంగా హుందాగా వుంటాయి.

# 42

## పురిటి నీళ్ళు

ప్రసవించిన ఆరోరోజే తల్లికి పిల్లకి నీళ్ళుపోయడం వారి ఆనవాయితీ. దాన్నే 'ఛటీ' అని వేడుకగా చేస్తారు. వైద్యశాస్త్రరీత్యా బాలెంతకు వేడివేడినీళ్ళు పోస్తారు. ఆ బాలెంతస్నానానికి ఎంతోజాగ్రత్త తీసుకుంటారు. బిడ్డకుగూడ అలానే నీళ్ళు పోస్తారు. తర్వాత ఇరుగుపొరుగునఉన్న ఆడవాళ్ళందరు తమతమ ఇళ్ళలో నీళ్లు కాచి, తలో చెంబెడో, బిందెడో తెచ్చి పొయ్యడం వారి ఆచారం. ఆ పైన తమ తాహతకు తగినట్లు బట్టా పాతా పెడతారు. వారంతా ముస్తాబవుతారు. ఈ పురిటి నీళ్ళకుకూడ తతంగముంది. పట్టణాల్లోగాని, పల్లెల్లోగాని, వాళ్ళవాళ్ళ వంశాచారాన్ని బట్టి ఇంచుమించుగా ఒకేతీరుగా జరుపుకుంటారు.

ఆ శుభసమయానికి ఆ బాలెంత పుట్టింటివాళ్ళుగాని, బంధుమిత్రులుగాని, తల్లీ పిల్లకు కొత్తబట్టలని (తౌక్, హస్లీ, కదే) సొమ్ములని, పిల్లకు ప్రత్యేకంగా ఆట బొమ్మలు, గిలక్కాయలు, పాలపీకలు, కోడిపెట్టలు వగయిరా ఎన్నో చెప్పలేనన్ని వస్తువులు బ్రహ్మాండంగా మేళతాళాలతో పెద్ద సారెతెచ్చినట్టు తెస్తారు. పాటలు, నృత్యాలు, ఒకటిగాదు, ఎంతో వేడుకచేస్తారు. అదే సామాన్యులయితే ఇంత ఆర్భాటం ఉండదు. ఆడంబరం వుండదు. ఇంటనున్న ఆడవాళ్లే డోలు వాయిస్తూ పాటలు పాడతారు.

ఇరవైయోరోజున, నలభైయోరోజునగూడ మళ్లీ యింతవేడుక చెయ్యాల్సిందే. దేవుడు మేలుచేస్తే రెండుసార్లూ యింతపెద్దసంబరమూ చేసుకుంటారు. లేకపోతే ఇరవైయోరోజు సాదాగా కానిచ్చి, నలభైయోరోజునమాత్రం భారీయెత్తున హడావిడిగా వేడుక చేస్తారు.

## పుట్టు వెంట్రుకలు తీయించడం

(పుట్టువెంట్రుకలు తీయించడం, దీనినే 'అకీకా' అంటారు. ఈ అకీకా అనేది ముసల్మానుల మతపరమైన ఆచారం. అది ఇస్రాయిల్‌కాలంనుంచి ఆలే ఇబ్రహీం అనే మతప్రవక్త నాటివరకు కొనసాగుతూనేవచ్చింది.

యూదులు బిడ్డ పుట్టిన ఎనిమిదోనాడే, ఆ శిశువును యరుసలేమ్‌లో ప్రసిద్ధమైన మసీదు 'మస్‌జిదే అక్సా'కి తీసుకువెడతారు. అక్కడ ఆ శిశువుకు పుట్టువెంట్రుకలు తీయిస్తారు. శిశువు క్షేమంకోరి బలులిప్పించడం వారి ఆచారం. ఆవిధానమే ముసల్మానుల్లోగూడ (రస్మీ ఇబ్రహీమ్) మతప్రవక్తఅయిన ఇబ్రహీంవారి సంప్రదాయమని, (సున్నతే-ముహమ్మద్) అనే సిద్ధాంతంగా ఈనాటివరకు కొనసాగుతూనే వుంది. అయితే పిల్ల పుట్టిన ఎనిమిదోరోజే పుట్టువెంట్రుకలు తీయించాలనే ఆచారంగా కాకుండా, పిల్లకు ఏడాది వెళ్లేలోపల వెంట్రుకలు తీయించడంగా ఈ ఆచారం స్థిరపడిపోయింది.

ఆనాడు బిడ్డకు తలంటి నీళ్లుపోసి క్రొత్తబట్టలు తొడుగుతారు. వచ్చిన బంధుమిత్రులసమక్షంలో మంగలి ఆ బిడ్డకు ముండనం చేస్తాడు. మంగలి, తలమీద కత్తి పెట్టగానే మగపిల్లవాడికైతే రెండు మేకపోతుల్ని, ఆడపిల్లకైతే ఒక మేకపోతుని బలిపెడతారు. ముండనమైనతర్వాత తలకు మంచిగంధం పులుముతారు. వచ్చిన బంధుమిత్రులు తమతమ యధాశక్తిగా పిల్లకు కానుకలు ముట్టచెబుతారు. బలియిచ్చిన మేకపోతులమాంసాన్ని పేదసాదలకు, చుట్టపక్కాలకు పంచిపెడతారు. ఇంట్లో గొప్పగా వేడుక చేసుకుంటారు.

## అన్నప్రాశన

శిశువుకు నాలుగైదుమాసాలు నిండగానే అన్నప్రాశనచేయడం రివాజు. అంతవరకు కేవలం పాలమీదనే ఆధారపడిఉన్న బిడ్డకు అన్నం తినిపించేవేడుకే అన్నప్రాశన. అన్నప్రాశన గనుక అన్నం పెట్టరు. అన్నం తినిపించడానికి నాంది కనుక పాయసంచేసి పెట్టడం శుభంగా భావిస్తారు. ఆనాడు చుట్టపక్కాల్ని పిలుచుకుంటారు. పిల్లవాడికి కొత్తచొక్కా తొడుగుతారు. వచ్చిన బంధుమిత్రులయెదుట వాడికి పాయసం నాకిస్తారు. తర్వాత వచ్చిన ఆ పేరంటాళ్ళంతా పిల్లవాణ్ణి దీవించి తోచినడబ్బు వాడిచేతిలో పెడతారు. అదీ అన్నప్రాశన వేడుకచేసే విధానం. ఈ అన్నప్రాశనను వారు 'ఖీర్ చటాయి' అంటారు.

## పాలు మాన్పించడం

పిల్లవాడిచేత పాలు మాన్పించేసందర్భంలో ఈ 'దూద్ బధాయి' అనే వేడుక చేస్తారు. ఆ వేడుకరోజున ముఖ్యంగా ఖర్జూరాలు వండుతారు. అయినవాళ్ళందరికి

ఇచ్చుకోడానికి చాల ఎక్కువగానే వండుతారు. పిల్లవాడు పాలకోసం మారాంచేస్తే వాడిచేతిలో ఓ ఖర్జూరపుపండు పెట్టి నిద్రపుచ్చాలనేవుద్దేశంతో అలా చేస్తారు. ముఖ్యఉద్దేశం యిదేఅయినా పంచిపెట్టడానికి వీలయినన్ని ఖర్జూరాలు వండించడం నాటి ఆచారం.

అసలు పాలు మాన్పించడానికి ముఖ్యంగా వాళ్లు పాటించేవిధానం తల్లిగాని, పాలిచ్చే దాదిగాని, నీళ్ళలో అరగదీసిగాని, లేక చేదుగావుండే వస్తువేదైనాగాని రొమ్మున పూసుకుంటారు. ఈ చేదుకు జడిసి పిల్లవాడు పాలుతాగడం మానేస్తారు. చెపితే వినక పాలు తాగుతానని మారాం చేసినప్పుడల్లా అదే ప్రక్రియ చేస్తారు. ఒకటి రెండుసార్లు అలా చేసేసరికి వాడికి పాలంటే అసహ్యం ఏర్పడిపోతుంది. మానేస్తాడు. పాలు మాన్పించడమన్నది పిల్లవాడికి రెండేళ్లు వచ్చినతర్వాతన్నమాట. 'హన్‌ఫియోం' అనే ముసల్మానుల సంప్రదాయం రీత్యా పిల్లవాడికి రెండున్నర సంవత్సరాలొస్తేగాని పాలు మాన్పించరు. అప్పుడిక తప్పనిసరిగా మాన్పించాల్సిందే. నిజానికి యింకా త్వరగానే మాన్పించాలి. కానీ, కొందరు తల్లులు పిల్లవాడికి మూడు నాలుగు ఏళ్లు వచ్చినా పాలిస్తారు. ఇది చాల రోత. ప్రకృతి విరుద్ధమైన పద్ధతి. సంపన్నులయితే ఈ వేడుకకుగూడ పేరంటాలుచేసి, ఆట పాటల కచ్చేరీలు ఏర్పాటుచేసి వైభవంగా జరుపుకుంటాను.

## అక్షరాభ్యాసము

పిల్లవాడికి నాలుగుసంవత్సరాల, నాలుగుమాసాల, నాలుగురోజులుకాగానే అక్షరాభ్యాసం చెయ్యడం ముసల్మానుల సంప్రదాయం. ఈ అక్షరాభ్యాసాన్నే వారు 'బిస్మిల్లాహ్' అంటారు. కొందరయితే నాలుగేళ్ళ, నాలుగునెలల నాలుగురోజుల, నాలుగు గంటల, నాలుగు నిమిషాలుగూడ చూస్తారు. వారికంత పట్టింపన్నమాట. ఆ ముహూర్తంవేళకు గొప్ప పండితుడిచేతనో లేకపోతే, కుటుంబంలోని పెద్దచేతనో పిల్లవాడికి అక్షరాభ్యాసం చేయిస్తారు. ఆనాడు పిల్లవాడికి తలంటి స్నానం చేయించి క్రొత్తబట్టలు తొడిగి పెళ్ళికొడుకుని చేస్తారు. బాలశిక్ష పిల్లవాడిముందుంచి బిస్మిల్లాహ్ అనిపించి, తర్వాత అరబ్బీలో, 'రబ్బై యసర్‌వలా త అస్సిర్ - వతమ్మిమే బిల్‌ఖైర్' (పరమేశ్వరా! మా పనులన్నీ సులభం చెయ్. దుర్లభం చెయ్యకు. ఏ వొడిదుడుకులులేకుండా పనులన్నీ పరిసమాప్తి చేయించు) అని

ప్రార్థన చేయిస్తారు. ఆతర్వాత (అలీఫ్, బే) ఓనమాలు దిద్దిస్తారు. మిఠాయిలు పంచిపెడతారు. వచ్చిన బంధుమిత్రులు పిల్లవాడికి తోచింది ముట్టచెబుతారు. ఆనాటి నుంచి పిల్లవాడు చదువు ప్రారంభిస్తాడన్నమాట.

## ఖత్నా

హజరత్ ఇబ్రహీం పంథాననుసరించి, ఆయన సంతతివారికి ఆనాటినుంచి వస్తున్న ఆచారమే 'ఖత్నా'. ఈ ఆచారం ముసల్మానులకుమాత్రమే వుంది. ఈ 'ఖత్నా' అయినతర్వాతనే పిల్లవాడు నిజమైన ముసల్మానుగా పరిగణింపబడతాడు. ఇది వారి మతపరమైన సంస్కారక్రియ. ఈ సంస్కారక్రియను సాధారణంగా 'ముసల్మానీ' అనిగూడ అంటారు. అదేమిటంటే, పిల్లవాడి శిశ్నము కొన తోలు కత్తిరించబడుతుంది. కొన్నివ్యాధులు బాధలు రాకుండా వాటి నివారణార్థమే ఆవిధంగా కత్తిరించబడుతుందని వైద్యశాస్త్రం బోధిస్తూంది. ఇది ఒకవిధమైన శస్త్రచికిత్స అని చెప్పాలి. ఈపనిని పూర్వకాలంలో సర్జనులనబడే మంగళ్ళు అవలీలగా చేసేసే వాళ్ళు. శ్రమకుతగిన బహుమానం పొందేవాళ్ళు. ఈ సంస్కారం జరిపేటప్పుడు పురుషులంతా ఒకచోట చేరుతారు. ఆడవాళ్ళంతా వేరొకచోట కూడుతారు. ఖత్నా అనే సంస్కారం అయినవెంటనే మిఠాయిలు పంచిపెడతారు. సంపన్నులయితే విందులు వేడుకలు చేసుకుంటారు. పిల్లవాడికి గాయం మానినతర్వాత ఆరోగ్యస్నానం చేయిస్తారు. వంశాచారాన్నిబట్టి మొక్కులుకనకవుంటే ఆరోజు పిల్లవాణ్ణి పెళ్ళికొడుకునిచేసి, గుర్రంమీద కూర్చోపెట్టి ఊరేగిస్తూ 'దర్గా'కు తీసుకువెడతారు. అక్కడ నూతనవస్త్రం, మిఠాయీ అర్పించుకుని మళ్ళీ యథాప్రకారం ఊరేగిస్తూనే పిల్లవాణ్ణి ఇంటికి తీసుకువస్తారు. ఇవన్నీ వినోదంకోసం చేసేవేడుకలు. అసలు ఈ 'ఖత్నా' పిల్లవాడుపుట్టిన ఆరోరోజుగాని, నలభైయ్యోరోజునగాని చెయ్యడం ఆచారమయితే, రానురాను పిల్లవాడికి ఆరేడేళ్ళువచ్చాక చెయ్యడం మామూలైపోయింది.

ఉపవానవిరమణ అని మరో ఆచారం వుంది. మగపిల్లలుగాని, ఆడపిల్లలుగాని తొమ్మిది పదేళ్ళవాళ్ళయినప్పుడు మొదటిసారిగా వారితో ఉపవాసవ్రతం ఆచరింపచేసి, ఆ ఉపవానం విరమించేటప్పుడు విందుచేయడం జరుగుతుంది. ఉపవాస విరమణచేసేటప్పుడు ఎన్నోరకాల పిండివంటలు చేసుకుంటారు. (ఈ పిండివంటలు

'రంజాన్'లో ఉపవాస విరమణసమయంలో చేసే పిండివంటలవంటివే) మగ పిల్లలు మగవారితోను ఆడపిల్లలు ఆడవారితోనూ కలిపి ఉపవాసవిరమణ చేస్తారు. ఉపవాసవిరమణ చేయడమంటే పగలంతా ఉపవాసముండి, రాత్రికి భోజనం చేయడమన్నమాట. దాన్నే ముసల్మానులు ఇలా వేడుకగా చేసుకుంటారు. ఈ వేడుకలో గానా బజానాల కంత ప్రాముఖ్యం లేదుగానీ, వినోదప్రియులు, రసికులుకనుకైతే కొందరు నృత్యగాన వినోదాలుగూడ ఆ తరుణాన ఏర్పాటు చేయిస్తారు.

ఈ ప్రకారంగానే ఆరోగ్యస్నాన మాచరించినపుడు మొక్కుబడులు చెల్లించుకునేటప్పుడు మిగిలిన శుభకార్యాలుమాదిరిగానే వేడుకలు చేసుకుంటారు. అంతకు మించి ప్రత్యేకతేం ఉండదు.

(అన్నిటికంటె పెద్దమహోత్సవము వివాహము. దీన్నే 'నికాహ్' అంటారు. పెద్దలు ఆ విధానా లెందుకు ఏర్పరచారో అనేవిషయాన్ని విస్మరించి, సంతోషాతిరేకంతో, ప్రియురాలి కౌగిలికోసం ఉత్కంఠపడి, తన స్థితిగతులుమరచి, దాని పరిణామాన్ని గుర్తించక తప్పటడుగులు వేస్తున్నందువల్లనే వందలాది కుటుంబాలు అధోగతిపాలవడం జరుగుతూంది.

అప్పులుచేసి, ఆస్తులమ్మి, బంధుమిత్రులదగ్గర చేబదుళ్ళు పుచ్చుకుని డబ్బు పోగు చేసికొని, ఉరకలువేస్తున్నకోరికలు తీర్చుకోడం, తీరా పెళ్లంటూ అయినతర్వాత తమ చేతగానితనంవల్ల కుటుంబాలు కుటుంబాలు పస్తులుండి కాలం గడపవలసి రావడం సంప్రదాయవిరుద్ధంగా చేసుకొన్నపెళ్ళిళ్ళకి పరిణామం.)

(పెళ్ళి అనేది ఒక పవిత్రమైనబంధము. అది మానవజీవితాలకు సంబంధించిన దైవఘటన. అందువల్ల దాన్నిగురించి విపులంగా వివరించడం ఎంతైనా అవసరం.

పెళ్ళిళ్ళ పేరయ్యలు, పెళ్ళిళ్ళ పేరమ్మలు మధ్యవర్తులయి సంబంధాలు కుదిర్చి ఈ పెళ్ళితతంగాలు జరిపించడం మనకు అనాదిగా వస్తూవున్న ఆచారమే. మన ప్రాచీన భారతీయ సంస్కృతినిబట్టిచూస్తే, ఈ వివాహాదివిషయాల్లో స్త్రీల ప్రమేయమే ఎక్కువగా కనబడుతుంది. పూర్వం శ్రీమంతులకు, రాణివాసపు స్త్రీలకు తల దువ్వి, చక్కగా ముస్తాబు చెయ్యడానికి 'ప్రసాధిక'లుగా స్త్రీలు వుండేవారని కవులు తమ కావ్యాల్లో వర్ణించారు.

కాని ఈ మానవసమాజంలో ప్రసాధికలు అంటే పెళ్ళిళ్ళ పేరమ్మలు అని నామాంతరం. వాళ్ళు పెళ్ళిసంబంధాలు కుదురుస్తారు. పెళ్ళిళ్ళు జరిపిస్తారు. పెళ్ళిడు

వచ్చి, వయసులోవున్న అందమైనకన్నెలకు అలంకరించడానికి ప్రసాధికలుగా వుండే రోజులే వారి ఈ వృత్తికి నాంది అనాలి. రానురాను అలనాటి ఆ ప్రసాధికలే పెళ్ళిళ్ళ పేరమ్మలై కూర్చున్నారు. వాళ్ళ నేర్పరితనం, తీర్పరితనం లోకోత్తరం. ఆడపిల్ల గలవాళ్ళతో, ఫలానావారింట పెళ్ళికీడయిన పిల్లవాడున్నాడని చెప్పడమే కాక, వాళ్ళ ఆస్తిపాస్తులు, సంప్రదాయం, పిల్లవాడి చదువుసంధెలు, అందచందాలు, గుణగణాలు అన్నీ ఏకరువుపెడతారు. ఈవిధంగానే పిల్లవాడితరఫువారితో పిల్ల అందం చందం ఆకారవైభవాదులు, గుణం సంప్రదాయం అన్నీ పూసగుచ్చినట్టు చెబుతారు. వాళ్ళ మాటలబట్టిచూస్తే ఆ పిల్ల మానవమాత్రురాలుకాదు. ఎక్కడో దేవలోకంనుంచి దిగిన అప్సరసో అంతకుమించిందో అన్నట్టుంటుంది.

పెళ్ళిళ్ళ పేరమ్మలంతా చెప్పినతర్వాత ఆ యింటివారువెళ్ళి అవతలివాళ్ళని గురించి ఛోగట్టా అంతా సేకరిస్తారు. పిల్లలతరఫున పిల్లవాడితరఫున ముఖ్యంగా ఆడవాళ్ళకు సంబంధం సమ్మతమైతే, మగవాళ్ళను ఎలాగైనా ఒప్పించి పెళ్ళి జరిపించేస్తారు.

అదే అయినవాళ్ళల్లోనూ, తెలిసినచోట్ల కలసినసంబంధమేకనకైతే పెళ్ళిళ్ళ పేరమ్మలప్రమేయం లేకుండా, సునాయాసంగా నిక్షేపంలాంటి పిల్లలు దొరుకుతారు. పెళ్ళికిపూర్వపు తతంగాలన్నీ జరపవలసినఅగత్యం ఉండదు. పిల్లలు పుట్టగానే పెద్దలు వాళ్ళకు ఫలానాపిల్లవాడితో రాసిపెట్టుందని నిర్ణయంచేయడంతో నిశ్చితార్థం జరిగిపోయిందన్నమాట.

అదే పరాయిసంబంధం అయితే పెళ్ళిచూపులకు వెళ్ళడం ఆచారం. పెళ్ళికొడుకు స్నేహితులు, దగ్గరబంధువులుకలసి పెళ్ళికుమార్తెను చూడటానికి వెడతారు. అప్పుడు పిల్లతరఫుమగవారు వాళ్ళ అంతస్తుకుతగినట్టు వచ్చినవారికి మర్యాదలు చేస్తారు.

ఆడవాళ్ళకు ఘోషా కాబట్టి ఎదుటబడక చాటుమాటుగా పెళ్ళికుమారుణ్ణి చూస్తారు. తర్వాత ఫలానా అప్పుడు పిల్లను చూడటానికి వస్తున్నామని చెప్పకుండానే పెళ్ళికొడుకుతల్లి, తోబుట్టువులు వస్తారు. ఘోషాలోవున్న పెళ్ళికూతుర్ని మిఠాయిపెట్టేనెపంతో చూస్తారు. అసలు పెద్దయింటివాళ్ళకు ఈ పెళ్ళిచూపులు చూడటమనే సంప్రదాయం లేదు. ఇంటిపెద్దలే అటూ ఇటూగూడ మంచిచెడులు కనుక్కుంటారు.

పిల్లకు పిల్లవాడికి పరస్పరంనచ్చినా, అందచందాలు, ఆస్తిపాస్తులు, ఉద్యోగాలు హోదాలు, విచారించడమేకాకుండా వంశమర్యాదనుగురించి ముఖ్యంగా కనుక్కొని ఇరుపక్షాలవారికి సమ్మతమైతేనే నిశ్చితార్థానికి ఒప్పుకుంటారుగాని లేకపోతే లేదు. నిశ్చితార్థానికి మొగపెళ్ళివారితరఫునుంచి మిఠాయిలు, పూలమాలలు, బంగారు ఉంగరమొకటి పెళ్ళికుమారుడి బంధుమిత్రుల్లో ఆడవారంతా కలిసివెళ్ళి పిల్లకు ఇచ్చివస్తారు.

దాంతో ఇక పెళ్ళి ఖరారయినట్టే. అప్పటినుంచి ఇరువైపులవారికి ఏ పండగ వచ్చినా, పబ్బంవచ్చినా, వియ్యాలవారి మర్యాదలన్నీ పాటిస్తూ, ఇచ్చిపుచ్చుకోడాలు, ముఖ్యంగా పిల్లకూ, పిల్లవాడికి ఘనమైనకానుకలు పంపడం జరుగుతూంటుంది. మాటవరసకు ముహూర్తం వచ్చిందంటే ఇటువారు అటువారుగూడ పరస్పరం వక్కపొడి, ఏలకులు, వక్కలు విడిగా, ఇంకా అందంగా కలంకారీపనిచేసిన ఒక పట్టు సంచీ వగైరాలన్నీ వియ్యాలవారికి పంపుకుంటారు.

(పెళ్ళికింకా కొన్ని రోజులున్నదనగా, పెళ్ళిపిల్లకు రోజూ నలుగులు పెడతారు. పసుపురంగుబట్టలే కట్టిస్తారు. వీలయినంతవరకు ఘోషాలోనే వుంచుతారు. పసుపుబట్టలు కట్టించేరోజున, అంటే పెళ్ళికూతుర్ని చేసేరోజున. వారి ఆచారమేమంటే, పెళ్ళికూతురుకు వాడిన నలుగుపిండి, గోరింటాకు, కలకండపోసిన ఒక మట్టిపిడత, పీండియా అనే పిండివంట, ఇవన్నీ మేళతాళాలతో ఊరేగింపుగా మొగపెళ్ళివారింటికి పంపుతారు. పీండియా అనే భక్ష్యాలు ప్రత్యేకంగా పెళ్ళికొడుకుకి విడిగా పళ్ళాల్లో అమర్చిపెడతారు. వాటితోబాటు పెళ్ళికొడుక్కు పసుపుబట్టలు, (మధుపర్కాలు) మంచి పనితనంతోఉన్న రంగురంగుల ఆసనమొకటి, గిన్నె, చెంబు గూడ పంపుతారు. ఆ గిన్నె, చెంబు అతనికిపంపే ఆసనానికిపెట్టి తాడుతో కడతారు. ఆ ఊరేగింపులో మొట్టమొదట భజంత్రీలు, వారివెనక పెళ్లికుమారుడికి పంపే ఆసనము (చౌకీ) తర్వాత మామూలుపళ్ళాల్లో మిగిలినవస్తువులు, అవిగాక అందమైన పెద్దపెద్దపళ్ళాల్లో ప్రత్యేకంగా పిండివంటలుపెట్టి పంపుతారు.

ఆ వెనక పల్లకీల్లో, డోలీల్లో పెళ్ళికూతురి చెల్లెళ్ళు, డోంజాతిస్త్రీలు వెడతారు. పెళ్లివారి యిల్లుచేరాక, ఏడు భక్ష్యాలు, ఏడు కలకండముక్కలు పెళ్లికొడుకును బలవంతంచేసి, వేధించి తినిపిస్తారు. పసుపుబట్టలు కట్టబెట్టడము, కంకణాలు తొడ

గడమువంటి ఈ ఆచారం అరబ్‌లో లేదు. ఇరానులోనూ లేదు. కేవలం భారత దేశంలోవున్న ముసల్మానులు పాటిస్తున్నఆచారమే ననిపిస్తుంది.)

'మాంఝె' అనబడు పెళ్లికూతుర్నిచేసే వేడుక అయిన పది పన్నెండురోజులకు మొగపెళ్లివారు పెళ్లికూతురికి 'సాంచక్' అని సారె పంపుతారు. ఇది టర్కీవారి సంప్రదాయం. బహుశా ఈ ఆచారాన్ని టర్కీవారు ముసల్మానులు కలిసే భారత దేశానికి తెచ్చివుండాలి. ఈ సారెలో పెళ్ళికూతురుకు చక్కని చెమ్కీపనిచేసిన పాదరక్షలు, బంగారుతీగెల బాసికము, వెండిఉంగరము, బంగారుఉంగరము ఇంకా ఒకటి రెండు వస్తువులు, ఇవిగాక మరికొన్ని సొమ్ములు, పువ్వులు పంపుతారు. వీటన్నిటితోబాటు (శకర్ కే నుక్ల్, శకర్ కే కుర్స్) కొన్ని తీపి పిండివంటలు, పండ్లు ఫలాలు పంపుతారు. ఈ సారెకు పువ్వులు, లతలుచిత్రించిన రంగురంగుల పిడతలు, వాటిని అమర్చేందుకు వెదురుతో రంగుకాగితాలు అంటించిచేసిన చద రులు, ఒక్కొక్కచదరుమీద నాలుగేసి చొప్పున పిడతలు అమరుస్తారు. ఆ పిడతల్లో చక్కెర, మిఠాయిలుతప్ప ఏం పెయ్యరు. భాగ్యవంతులుకనకైతే వాళ్ళభాగ్యానికి దర్జాకు తగినట్లుగా పిడతలసంఖ్య పెరుగుతుంది. కొందరు వంద రెండువందల దాకాగూడ పెడతారు. ఆ పిడతలమూతులకు ఎరుపురంగుగుడ్డతో వాపిన కడతారు. ఊరేగింపులో ఈ పిడతలకుముందు పెరుగుతోనింపిన వెండిబిందె వుంటుంది. ఆ బిందెకుగూడ ఎరుపుగుడ్డ వాపిన కడతారు. పైగా ఆ బిందెకు శుభసూచకానికన్నట్లు రెండుచేపల్ని వేలాడదీస్తారు. ఈ సారెంతా ఆడపెళ్ళివారింటికి చేరాక అక్కడ ఈ పిండివంటలు మిఠాయిలు అన్నీ, వచ్చిన బంధుమిత్రులందరికీ పంచిపెడతారు. ఈవిధంగా ఈ సారె పెట్టడమనేవేడుక చేస్తారు.

## 43

'సాంచక్' అంటే సారె. ఇది టర్కీభాషా పదం. మగపెళ్ళివారు సారెపంపిన మరునటిరోజురాత్రి, ఆడపెళ్ళివారు పెద్ద ఊరేగింపుతో వైభవంగా పెళ్ళికొడుక్కి గోరింటాకు పంపుతారు. ఈ గోరింటాకు పంపడమనేవేడుక అరబ్బులది. ఆడపెళ్ళి

వారు పెళ్ళికొడుక్కు బట్టలు పంపుతారు. పెళ్ళికొడుకు పెళ్ళికి తరలివచ్చేటప్పుడు ఆ బట్టలే కట్టుకురావాలన్నమాట. పూర్వం మొగలాయిదర్బారుల్లో వాడకంలోవున్న దాబుసరిగావుండే దుస్తులు, పైనవేసుకునే ఉత్తరీయం, తలపాగ, తురాయి, అందమైన చుంగుపాగా (కల్గీ) వాటన్నిటితోబాటు ఓ ముత్యాలహారం, పట్టుపైజామా, పాదరక్షలు ఇంకా తదితర వస్తుసామగ్రులు, వెండి ఉంగరమొకటి పంపుతారు. రుబ్బిన గోరింటాకును ఎన్నో పళ్లాల్లోపెట్టి, ప్రతిపళ్ళెంలోను ఎర్రని, ఆకుపచ్చని కొవ్వొత్తి దీపాలు వెలిగించి, ఆ పళ్ళాలన్నీ దీపకాంతుల్తో తళతళలాడుతూండగా, ఆ గోరింటాకుపళ్ళాల వూరేగింపు అతివైభవంగా బయలుదేరుతుంది. మెరిసిపోతున్న ఆ గోరింటాకుపళ్లాలతోబాటు వందో, యాభయ్యో భక్ష్యాలతో నింపిన పళ్లాలు, ఇంకా ఖర్జూరకాయలముక్కలు అవీ, ఇవీ, వారివారిశక్త్యానుసారం చేయించి పంపుతారు.

గోరింటాకుపంపిన మరుసటిరోజు మొగపెళ్ళివారు పెళ్ళికి తరలివెళతారు. పూర్వకాలంలో రాత్రి మూడుగంటలవేళ, ఇంకా తెల్లవారడానికి జాముప్రొద్దుందనగా పెళ్ళికి తరలివెళ్ళడం ఆచారం. కాని ఇప్పుడా ఆచారం వెనకబట్టింది. ఉదయం బాగా ప్రొద్దెక్కినతర్వాత, అంటే తొమ్మిది పది గంటలవేళకు మొగపెళ్ళివారు లగ్నానికి రావడం జరుగుతోంది. ఈ మార్పు అయోధ్యనేలిన పాదుషాల్లో కడపటివాడయిన వాజిద్ అలీషా కాలంనుంచే ఆరంభమైంది. దైవవశాత్తు ఆయన పెళ్ళికి ఆలస్యంగా తరలివెళ్ళడం తటస్థించడంతో అందరికీ అదే మామూలయింది. అదీగాక దీపాలఖర్చు హంగామా అంతా తగ్గుతుందనేఉద్దేశ్యంతో అంతా ఈపద్ధతినే అవలంబించారు. అందువల్ల సామాన్యంగా ఉదయాన పెళ్లివారు తరలివస్తారు, మధ్యాహ్నానికి పెళ్ళి జరిగిపోతుంది.

సాధ్యమైనంతవరకు పెళ్ళివారి ఊరేగింపు చాల పెద్దదిగానే వుంటుంది. ప్రసిద్ధమైన మూడురకాల మేళాలు, అంటే పూర్వకాలపు డోలు, తాళామరఫా, ఝూంఝు, రోశన్‌చౌకీ ఇంకా బ్యాండుమేళం (ఆర్గన్ బాజా) తప్పక వుండాలిసిందే. ఇవి కాక గుర్రాలమీద నౌబత్, నగారాలు, ఏనుగులు, ఒంటెలు, గుర్రాలతో జట్లు జట్లుగా వెళ్ళుతారు. పెళ్ళికొడుకు ఆడపెళ్ళివారుపంపిన ఆ బట్టలే కట్టుకుని, నొసట బాసిగము కట్టుకొని గుర్రంమీద వస్తాడు. భాగ్యవంతులుకనకైతే ఏనుగుమీదెక్కి ఊరేగుతూవస్తాడు. ఆవాళ పెళ్ళికొడుకును 'నౌశా' కొత్తపాదుషా అంటారు. ఆ

ఒక్క రోజుకు అతిసామాన్యుడయినా, పెళ్ళికొడుకైతే పాదుషాకిందే జమ. అంటే అంత గొప్పన్నమాట. అయితే ఒక్క విషయం ఆలోచించాల్సిందే. పెళ్ళికొడుకు పాదుషాయేకనక్కైతే తలమీద కిరీటం ధరించాలిగావి, పాగా (శమ్లా) ధరిస్తాదేమో అని. భారతదేశంలోని ముసల్మానులు కిరీటం ధరించరు. దాన్నిబట్టి వాళ్లు చుంగు పాగాయే ధరిస్తారని తెలుస్తోంది. ఇంగ్లీషువారు గాజీ ఉద్దీన్ హైదర్ కాలంలో అయోధ్యనేలిన పాదుషాలకు కిరీటాలు పెట్టాడట. కానీ జనం అందుకు ఒప్పుకో లేదట. పాదుషాలవేషభాషలన్నీ పూర్వపు ఫక్కీనే ఉండాలని కోరారట. నాటి పాదు షాలమాదిరిగానే ఈ కొత్తపాదుషావేషమూ వుంటుంది. పెళ్ళికొడుకువెంట పల్లకీ ల్లోను, డోలీల్లోనూ పెళ్ళికుమారుడి తల్లే కాకుండా వారి బంధుమిత్రులతాలూకు ఆడవాళ్ళు ఇంకా దోంజాతిస్త్రీలు వుంటారు. పెళ్ళికి తరలేటప్పుడు పాటించే ఆచా రాలకు లెక్కేలేదు. ఎన్నో చెప్పలేనన్ని: అయితే వాటినిగురించి చెప్పవలసినంత ప్రత్యేకతేం లేదు. వైభవంగా మొగపెళ్ళివారు పెళ్ళికూతురుయింటికి తరలివెళతారు. పెళ్ళివారు వచ్చేవేళకు పెళ్ళికూతురుకు మంగళస్నానం చేయిస్తారు. ఆమె స్నానం చెయ్యగా మిగిలిననీళ్ళుతెచ్చి బయట, పెళ్ళికొడుకు ఎక్కివచ్చిన గుర్రమో, ఏనుగో దానికాళ్ళక్రింద పోస్తారు. ఏడురోజులనాటి పాచినీళ్లతో పెళ్ళికూతురుకు స్నానం చేయించడం వారిఆచారం. ఆ నీటిని కలశజలం (కలశ్ కా పానీ) అంటారు. ఆ నీళ్లు చల్లగా వడగళ్ళవలె వుంటాయి. చలికాలంలో గడ్డగట్టుకుపోయే ఆ చన్నీటి స్నానం పెళ్ళికూతురుకు ప్రాణాంతకంగానే వుంటుంది. ఒక బల్లవేసి, దానిమీద తమలపాకులు పరచి, ఆ ఆకులమీద పెళ్ళికూతుర్ని కూర్చోబెట్టి మంగళస్నానం చేయించడం వాళ్ళ రివాజు. ఆతర్వాత ఆ తమలపాకులుతీసి భద్రంగా దాచి, పెళ్లి పిల్ల అత్తవారింటికి వెళ్లినప్పుడు ఇచ్చే ఇరవై యొక్క ఆకులబీడాలోచేర్చి తిని పిస్తారు. అత్తవారింటికి కొత్తగా కాపురానికి వచ్చినకోడలు ఆ బీడా వేసుకోవాలన్న మాట.

పెళ్లికొడుకు గుర్రందిగి స్త్రీలవిడిదిలోకి వస్తాడు. ఇక్కడ 'రస్సీ బంధాయి' అని ఒకవేడుక చేస్తారు. ఇంకా కూడ ఏవేవో మర్యాదలు, ఆచారాలన్నీపాటిస్తారు. వాళ్ళవాళ్ళ కులాచారాల్నిబట్టి వంశమర్యాదల్నిబట్టి వాళ్ళఆచారాలు వివిధరీతులుగా చిత్రవిచిత్రాలుగా వుంటాయి. పెళ్లికొడుకు విడిదిలోకి వచ్చేసరికి అక్కడ పెళ్లి కూతురు స్నానంచేసి, చిన్నబట్ట చుట్టుకునివుంటుంది. ఆ పెళ్లికూతురుచేతిలో కల

కండపెట్టి పెళ్లికొడుకుచేత తినిపిస్తారు. అప్పుడు అక్కడచేరిన స్నేహితురాళ్ళు, ఇంకా సరదావున్న ఆడవాళ్ళు, డోంజాతి స్త్రీలు పెళ్లికొడుకు తప్పించుకుపోకుండా అడ్డం నిలుచుని రకరకాలయిబ్బందులు పెడతారు.

(పెళ్ళివేడుకల్లో కఠినమైన ఈ మెట్టు దాటినతర్వాత పెళ్ళికొడుకు పెళ్ళిపందిట్లోకి వస్తాడు.

ఆ పందిట్లో వచ్చిన చుట్టపక్కాలు బంధుమిత్రులందరు చక్కనిదుస్తులుధరించి అక్కడ శుభ్రంగా పరిచివున్న తివాసీమీద కూర్చుంటారు. ఎదురుగా నాట్యప్రదర్శనలు జరుగుతూంటాయి. ఆ పెళ్ళిపందిరిమధ్యలో కొంచెం ఎత్తుగా పెళ్ళికొడుకుకోసం బంగారపురంగు గలిగి, ఆనుకుని కూర్చుందుకు వీలయినసోఫావంటి ఆసనం అమరుస్తారు. పెళ్ళికొడుకు సమవయస్కులుకూడావచ్చి పెళ్ళికొడుకును ఆ ఆసనంమీద కూర్చోబెడతారు. హాయిగా కబుర్లు చెప్పుకోడానికి వీలుగా ఉంటుందని వారంతా అక్కడే అతని కటు ఇటు చేరతారు.)

పెళ్ళికాలంలో పెళ్ళికొడుకు ప్రతివానికి భయపడుతున్నట్టు ఉండటం తప్పనిసరి. పెద్దగా విచ్చలవిడిగా మాట్లాడటానికిగాని, స్వేచ్ఛగావెళ్ళి బంధుమిత్రుల్ని కలుసుకోడానికి వీలుండదు. నొసట బాసిగం కడతారు. ఆ బంగారు బాసిగంమీద పూల బాసిగం కడతారు. పూలబాసిగం కట్టడమంటే మొత్తం మొహంచుట్టూ పూలచేర్లు దిగేస్తారన్నమాట. అందువల్ల అతనిమొహం అతి ప్రయత్నంచేసి చూస్తేగాని ఎవరికీ కనబడదు. పెళ్ళికొడుకు దెట్టుసరిమీద వుంటాడు. ఎవరికి అంతతేలిగ్గా తన మొహం చూపించడు. పందిట్లోకి వచ్చినతర్వాత, లేకపోతే పెళ్ళితతంగం కాగానే ఆ బాసిగంతీసి పాగాతోచేర్చి చుట్టేస్తారు. అప్పటికి ఒక రుమాలుతో తనమొహం కప్పుకునేవుంటాడు పెళ్ళికొడుకు. అదో ఆచారం.

(పెళ్ళిముహూర్తానికి ఇంకా కొద్దిసేపుందనగా పెళ్ళికొడుకువచ్చి నలుగుర్లో కూర్చున్నప్పుడే ఈ గొడవంతా చేస్తారు. షియావంశీయులపెళ్ళిళ్ళకి ఇద్దరు పురోహితులు వస్తారు. ఒకరు వధువుపక్షాన, రెండోవారు వరునిపక్షాన వకీళ్లుగా వుంటారు.

ఆడపెళ్ళివారు తెరలోంచి సాక్షులనబడే పెళ్ళికివచ్చిన పెద్దలసమక్షంలో పెళ్ళికుమార్తె ధర్మబద్ధమైన అంగీకారాన్ని సూచిస్తారు.

ఆ తర్వాత పురోహితులిద్దరు పెళ్ళికొడుకు ఎదుటకూర్చుని కురాన్ చదువుతూ (ఈజాబ్ ఓ కుబూల్) పెళ్ళిసమయంలో వధూవరులు చెయ్యాల్సినప్రమాణాలు చేయిస్తారు.

సున్నీతెగవారు కనకైతే గొప్పపండితుణ్ణి (మౌల్వీ సాహెబ్) పురోహితుడుగా పిలుస్తారు. గ్రామాల్లోఅయితే కులపురోహితుడుగా ఒక కాజీ (మహమ్మదీయ న్యాయాధిపతి) వుంటాడు. అయనవచ్చి పెళ్ళిప్రమాణాలు చేయిస్తాడు. ఆ విధానం ఎలా వుంటుందంటే పిల్లవైపు బంధువుల్లోంచి ఒకర్ని పిల్లతరపువకీలుగా నియమిస్తారు. ఆ వకీలు ఫలానావారిపిల్ల ఈ వివాహానికి తను అంగీకరించింది అని ఇరువైపులవారిఎదుట వెల్లడిస్తారు. అప్పుడు పురోహితుడుగానున్న 'కాజీ' సాక్షు లందరిసమ్మతిమీద పెళ్ళికాలంలో వరునిపక్షంవారు వధువుకిచ్చే కల్యాం ఎంతో (మెహర్) వకీలునడిగి కనుక్కొని (శహదత్ కల్మా - భగవంతుడు స్రష్ట అని. దేవదూత అయినవాడే ప్రవక్త కాగలడని ఋజువుచేసే) కురాను వచనం పెళ్ళికొడుక్కిచెప్పి అనిపిస్తాడు. తర్వాత ముసల్మాను పాటించాల్సినవిధుల్నిగురించి అరబ్బీలో ప్రతిజ్ఞ చేయిస్తారు. ఫలానావారిపిల్లను 'ఇంత కల్యమిచ్చి పెళ్ళిచేసుకునేందుకు ఒప్పుకుంటున్నాను' అని పెళ్ళికొడుకుచేత ముమ్మారు చెప్పించి ప్రమాణం చేయిస్తాడు. ఆతర్వాత ఆశీర్వచనంచేసి (ముబారక్) శుభమస్తు అంటాడు. కాజీ శుభం పలకగానే పందిట్లో ఉన్నవారంతా శుభమస్తు (ముబారక్ సలామత్) అని వధూవరుల నభినందిస్తారు. పళ్ళాల్లో పోసిపెట్టినచక్కెర, మిఠాయిలు, ఖర్జూరపుపలుకులు అందరికీ పంచిపెడతారు.

సరిగ్గా పురోహితుడు వచ్చేవేళకు పందిట్లో జరుగుతున్న పాటలు, కచ్చేరీలు ఆపిస్తారు. పెళ్ళి జరిపించగానే పురోహితుడు వెళ్ళిపోతాడు. ఆయన అటు వెళ్ళగానే మళ్ళీ యథాప్రకారం పాటకచ్చేరీలు, నాట్యప్రదర్శనలు ముమ్మరంగా అందుకుంటాయి.

తర్వాత పెళ్ళికొడుకును ఆడవాళ్ళవిడిదికి తీసుకువెళతారు. వేడుకలుచేసినా, అచ్చట ముచ్చట తీర్చుకున్నా లాంఛనాలు జరిపించినా ఈ పెళ్ళిపేరంటాలవంటి తరుణాల్లోనేగదా!

విడిదిలో పెళ్ళికొడుకును రకరకాలుగా ఎగతాళీ ఎద్దేవాచేస్తూ వరసలాడుతూ ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువులనీళ్లు తాగిస్తారు. ఈ వేడుకల్లో డోం జాతి స్త్రీలు,

మరదలు వరసైనవాళ్ళ ప్రముఖపాత్ర ధరిస్తారు. నిజానికి వయసొచ్చిన కుర్రకారు పెళ్ళిమాటెత్తితే బిడియపడతారుగదా. అదీగాక పెళ్ళంటే ఊహించలేనన్ని సమస్యల్ని ఎదుర్కోవాల్సి వస్తుందాయె.

పెళ్ళికూతుర్ని బట్టలతోచుట్టి మూటలాతెచ్చి పెళ్ళికొడుకుముందు వుంచుతారు. అప్పటికింకా పెళ్ళికూతురు పెళ్ళికి కట్టిన మధుపర్కాల్లోనే వుంటుంది. ఆ మూట ఏమిటా ? అని పెళ్ళికొడుకు చేత్తో పట్టిచూస్తాడు. అలా తట్టినందుకు పెళ్ళికొడుకు పెళ్ళికూతుర్ని కొట్టినట్లు నేరమారోపిస్తూ, దెప్పుతూ పాటలు పాడతారు. అంతటితో ఊరుకోరు. పెళ్ళిపిల్లను ఒక్క మాటననని, ఆవిడమాట కాదననని, అడుగులకు మడుగులొత్తుతానని, ఆవిడగారు కూర్చోమంటే కూర్చుంటూ, లేవమంటే లేస్తానని పెళ్ళికొడుకుచేత ఒట్టుపెట్టించి ప్రమాణాలు చేయిస్తారు.

దీనితర్వాత అద్దంలో మొహం చూడడమనేవేడుక చేస్తారు. వధూవరులదగ్గర వ్యాసపీఠంలాటి పీటమీద కురాన్ శరీఫ్ పెడతారు. దానిమీద ఓ అద్దం పెడతారు. ఆ అద్దంలో మొట్టమొదటిసారిగా పెళ్ళికొడుకు పెళ్ళికూతురి ముఖసౌందర్యాన్ని తిలకిస్తాడన్నమాట. అయితే పెళ్ళికూతురిమొహం చూసేలోపల పెళ్ళికొడుకు కురాన్ లోని (సూర్ ఎ ఇఖ్‌లాస్) అనే అధ్యాయాన్ని చదివేసెయ్యాలి. ఆ వేడుక చేసేటప్పుడు పెళ్ళికూతురు కళ్లు గట్టిగా మూసుకునివుంటుంది. పెళ్ళికొడుకే పెళ్ళికూతురు కళ్ళు తెరిపించాలన్నమాట. అందుకు అతడు పడేపాట్లు అన్నీ ఇన్నీ కావు. సకలోపచారాలుచేస్తానని పెళ్ళికొడుకు మాట యిచ్చాకనే పెళ్ళికూతురు కళ్ళు తెరిచినట్టే తెరిచి మళ్ళీ మూసుకుంటుంది. ఈతీరుగా ఈ వేడుక జరుగుతుంది.)

ఇక పెళ్ళికొడుకును ఆ విడిదిలోంచి బయటకు పంపుతారు. తర్వాత పెళ్ళికూతురుకు వేరే బట్టలుతొడిగి, సొమ్ములుపెట్టి బాగా సింగారించి అత్తవారింటికి పంపే సన్నాహాలు చేస్తారు. పిల్లను అత్తవారింటికి పంపేటప్పుడు డోం జాతి స్త్రీలు అప్పగింతలపాట పాడుతూంటే అందరికి ఎక్కడలేని దుఃఖం ముంచుకువస్తుంది. కలకల్లాడుతున్న యిల్లు శోకంతో నిండిపోతుంది. పెళ్ళిపిల్ల వెళ్లేటప్పుడు పిల్లవైపున బంధుమిత్రులంతావచ్చి తమకు తోచినకానుకలు డబ్బుగానో, వస్తురూపంగానో ముట్టజెప్పి, విచారంగా వీడ్కోలిస్తారు.

# 44

పెళ్ళికూతురును అత్తవారింటికి పంపేటప్పుడు, ఆ పిల్లకు యిచ్చే పాత్రసామాను అంతా ఒక పట్టికగా వివరంగారాసి మొగపెళ్ళివారికి ఇస్తారు. ఆ పట్టికలో పిల్లకు పెట్టిన సొమ్ములువగయిరా, బట్టపాత, పాత్రసామాన్లు, మంచాలు బల్లలు ఒక టేమిటి ఇచ్చిన ప్రతివస్తువును ఆ జాబితాలో రాసి అప్పగిస్తారు. అత్తవారింటికి పంపేటప్పుడు పిల్లకు అతి సాధారణమైనబట్టలు కడతారు. ఎర్రనిచొక్కా కనీసం లేసైనా లేని సాదా పట్టు పైజామా తొడుక్కుంటుంది. పెళ్ళిపిల్లను ముస్తాబు చేస్తున్నప్పుడు, ఆమె పుట్టిల్లువిడిచి అత్తవారింటికి వెళ్లుసందర్భం కనుక దోం జాతి స్త్రీలు అప్పగింతలపాట పాడుతారు. ఆ పాట ఎంతో హృదయవిదారకంగా వుంటుంది. అప్పుడా పెళ్ళియింట ఒక విచారకరమైన సన్నివేశం తయారవుతుంది. ఎవర్నిచూపినా దుఃఖంతో కుమిలిపోతూనే కనబడతారు. వచ్చిన బంధుమిత్రులంతా పెళ్ళికూతురు చుట్టూచేరి పలకరించి బాధగా సాగనంపుతారు. ఆ అమ్మాయి ఒక పక్క వెక్కి-వెక్కి ఏడుస్తూవుంటుంది. పల్లకీని గడపదగ్గరకు తెప్పిస్తారు. పెళ్ళి కూతుర్ని తీసుకువెళ్ళడానికి పెళ్ళికొడుకును లోపలికి పిలుస్తారు. పెళ్ళికొడుకువచ్చి ఆ పెళ్ళికూతుర్ని ఎత్తి తీసుకువెళ్ళి పల్లకీలో కూర్చోబెడతాడు.

వీడ్కోలిచ్చేముందు స్త్రీలవిడిదిలో పెళ్ళికొడుకు నిమిత్తం 'సలాం కరాయి' అని చేస్తారు. అదే వీడ్కోలు ఉత్సవమన్నమాట. అప్పుడు బంధుమిత్రులంతా వచ్చి తమకు తోచినతీరున పెళ్ళికొడుక్కు కానుకలిస్తారు. ఆతర్వాత వెంటనే బయట 'షర్బత్ పిలాయి' అని మరోవేడుక చేస్తారు. షర్బత్పాత్ర, గ్లాసుల్లో షర్బత్పోసి పళ్ళెంలోపెట్టి మనిషిమనిషిదగ్గరకు తెస్తారు. ఆ సమయంలో ఎవ్వరూ తాగరుగానీ, అందరూ ఆ పళ్లెంలో ఇష్టమొచ్చినంతడబ్బు వేస్తారు. 'సలాం కరాయి'కి 'షర్బత్ పిలాయి'కి పోగయినసొమ్ము పెళ్ళికొడుక్కు వీడ్కోలు సంద ర్భంగా యిచ్చిపంపుతారు.

ఇక పెళ్ళివారి ఊరేగింపు హడావిడిగా అతి వైభవంగా పెళ్ళికొడుకు యింటికి బయలుదేరుతుంది.

ఈ ఊరేగింపులో మొట్టమొదట పల్లకీలో పెళ్ళికూతురు, ఆ పల్లకీ వెనక గుర్రం మీద పెళ్ళికొడుకు వుంటారు. పల్లకీకి అందమైన తెర వేసివుంటుంది. పల్లకీకి ముందువెనక చేతిలో ఊతకర్రపట్టుకుని పల్లకీమోస్తున్న బోయీలుంటారు. ఇరు వైపుల పెళ్ళికొడుకుతాలూకు పరిజనం, ఇంకా ముఖ్యులయినవాళ్ల కొందరు గుంపుగా నడుస్తూంటారు. మొగపెళ్ళివారితాలూకు ఆడవాళ్ళంతా ఆ పెళ్ళికొడుకు వెనక పల్లకీల్లో వస్తూంటారు.

ఈ ఊరేగింపులో చెప్పుకోతగిందేమంటే, పెళ్ళికూతురు తెచ్చేసారె ఈ సామాన్లన్నీ మేళగాళ్ళకు వెనకగా, పెళ్ళికూతురెక్కిన పల్లకీకిముందుగా ఒక క్రమపద్ధతిలో ఏర్పాటై వుంటుంది. రాగిపాత్రలన్నీ ఒక్కొక్కటే ఒక్కొక్క జంగిట్లో పెట్టుకుని కూలీలు మోసుకొస్తూంటారు. పింగాణీవస్తువులు, గాజుసామాన్లు కొయ్య పళ్లాల్లో అమర్చి తెస్తూంటారు. ఆతర్వాత పెట్టెలు వగయిరాలు. ఆ పెట్టెల్లో పెళ్ళికూతురు బట్టలుంటాయి. దానివెనక మంచాలు, దానితోపాటు పట్టుపరుపు, రజాయి, తలగడలు, దుప్పట్లు మొదలయినవి ఉంటాయి. ఆ పరుపుని పట్టుతాళ్ళతో బిగించి ఆ మంచంకోళ్ళకు కడతారు. ఆ పట్టుతాళ్ళచివర్ల వెండిగంటల్లాటివి వుంటాయి. అమ్మాయి క్రొత్తకాపురానికి కావలసిన సరంజామా అంతా యిస్తారన్నమాట. ఇవి కాకుండా అద్దం, దువ్వెన, నూనె, టాయిలెట్ సామాన్లు, అత్తరు, గొప్పవాళ్ళ కనుకైతే వెండి పాన్‌దాను, వెండిగిన్నె, వెండిచెంబు, ఇంకా ఏవేవో వస్తువులన్నీ ఇచ్చిపంపుతారు. ఈ సామగ్రిఅంతా ఊరేగింపులో భజంత్రీలకు పెళ్ళికొడుక్కి మధ్యలో వుంటుందన్నమాట. అన్నింటివెనకాల డోలీల్లో పిండివంటకాలతోనింపిన కళాయిలు వుంటాయి. వీటిని 'బహోడే కా ఖానా' అంటారు. ఇవి ఆడపెళ్ళివారు పెళ్ళికొడుక్కి ఇస్తారు.

ఇంతవైభవంగా ఈ ఊరేగింపు పెళ్ళికొడుకు యిల్లు చేరుతుంది. భజంత్రీలు మంగళకరమైనగీతం ఆలాపిస్తారు. డోం జాతి స్త్రీలు ముందుగానే అక్కడికి చేరి, 'బనదే' అనేరాగంలో ఒక శుభసూచకమైన పాట పాడతారు. ప్రత్యేకంగా పెళ్ళిళ్ళలో పాడేపాట అది. ఇంతటి సుస్వాగతం పలుకుతూండగా పెళ్ళికూతుర్ని పెళ్ళికొడుకు ఎత్తుకుని పల్లకీలోంచి దింపడం కొందరి వంశాచారం. కొందరిళ్ళలో పెళ్ళికొడుకు తల్లి, తోబుట్టువులువచ్చి దింపుతారు. కొత్త పెళ్ళికూతుర్ని లోపలికి

తీసుకువెళ్ళి కూర్చోబెడతారు. కూర్చోబెట్టాక పెళ్ళికొడుకు పెళ్ళికూతురు కొంగు పట్టుకుని భగవంతునికి కృతజ్ఞతలు తెలుపుతూ (నమాజ్) ప్రార్థన చేస్తారు. పెళ్ళికూతురుకాళ్లు కడిగిననీళ్ళు తీసుకుపోయి ఇంట నలువైపుల పోసివస్తారు. తర్వాత (ముహ్‌దిఖాయి) మొహంచూడటం అనేవేడుక చేస్తారు. పెళ్ళికివచ్చినవారి బంధుమిత్రులు ఆడ మగ అందాకలిసి పెళ్ళికూతురు మేలిముసుగుతీసి మొహంచూసి, డబ్బుగానో, వస్తువుగానో ఎవరికి తోచినంత వారు అమ్మాయికి కానుక ఇస్తారు.

ఆ క్రొత్తయింట ఆ రాత్రి పెళ్ళికూతురు ఎంతో బిడియంగాను, ఎక్కడలేని కట్టుబాట్లతోను గడపాల్సి వస్తుంది. ఎవరితో మాట్లాడరాదు. ఎవర్ని కన్నెత్తి చూడరాదు. ఇంక తనవెంటవచ్చిన తన పుట్టింటిరాలూకు వారితోతప్ప, ఎవరినీ ఏ మడగడానికి లేదు. ఈ ఇక్కట్టునుంచి కాపాడడానికే తెల్లవారేసరికల్లా పెళ్ళికూతురు సోదరుడు, కొందరుమిత్రులువచ్చి పిల్లని పిల్లవాణ్ణి మనుగుడుపులకు తీసుకువెడరారు. (పెళ్ళయిన నాలుగోనాడు కన్యాగృహంనుంచి మిఠాయిలుతెచ్చి పంచి మనుగుడుపులకి తీసుకువెళ్ళడం వారి ఆచారం). ఈసారి వెళ్ళేటప్పుడు బాజా భజంత్రీలేం లేకుండా గుప్‌చుప్‌గా వెళ్లుతారు. వెళ్ళేటప్పుడు పెళ్ళికొడుకు ఏడురకాల కూరగాయలూ, ఏడురకాల పిండివంటలు వెంట తీసుకువెడతాడు.

పగలంతాగడిచాక రాత్రి పెళ్ళికూతురుయింట 'చౌథీ' అని వేడుకచేస్తారు. చౌథీకి పుట్టింటికి వచ్చేటప్పుడు పెళ్ళికూతురు అత్తవారింటపెట్టిన దుస్తులుధరించి వస్తుంది. పుట్టింటికిరాగానే ఆ దుస్తులువిడిచి పుట్టింటివారు పెట్టినదుస్తులు ధరించడం రివాజు. ఆపైన పెళ్ళికూతుర్ని చక్కగా ముస్తాబు చేస్తారు.

ఆ 'చౌథీ' వేడుకలో ఆడపెళ్ళివారి తాలూకు, మొగపెళ్ళివారి తాలూకు ఆడవాళ్లు కొందరు పాల్గొంటారు. పెళ్ళికూతురు పెళ్ళికొడుకు ఒకరిమీద ఒకరు మిఠాయిలు విసురుకుంటూంటే, పిల్లవైపు, పిల్లవాడివైపువారంతా కూరగాయలు, పువ్వులు, బెత్తాలు రువ్వుకోడం కయ్యాలాడుకోడం వారికి వేడుక. ఇదొకరకం మేజువాణీ అన్నమాట.

ఈ మిఠాయిలు కూరగాయలు రువ్వుకునేటప్పుడు బెత్తాలతో విసురుకునేటప్పుడు అటువారికి ఇటువారికి దెబ్బలు తగలడంగూడ కద్దు. ఈ సరదాలు సరసాలు ముదిరి ముదిరి విరసాలక్రింద మారినపరిస్థితులు లేకపోలేదు.

'చౌఢీ' అయిన నాలుగురోజులతర్వాత, పెళ్ళికూతురు అత్తవారింటికి వెళ్ళు తుంది. కాపురానికి తరలి వెళ్ళడమన్నమాట. ఈ వెళ్ళడాన్ని 'చార్‌చాలె' అంటారు. 'చాలె' అంటే నడత అని అర్థం. అత్తవారింటికి వెళ్ళబోయేముందు ఆ అమ్మాయిని మేనత్తలు, పినతల్లులు, మేనమామభార్య మొదలయినవారంతా ఆ కొత్త పెళ్ళి కూతుర్ని పెళ్ళికొడుకుని తమతమయిళ్ళకు పట్టుబట్టిపిల్చి తీసుకువెళ్ళి, వాళ్ళకు విందుఏర్పాటు చేస్తారు. వధూవరులిద్దరు ఒక్కొక్కయింట ఒక్కొక్కరోజు చొప్పున ఉండి వెళతారు. వెళ్ళేటప్పుడు వాళ్ళకు బట్టలు పెడతారు. వీడ్కోలు సందర్భం కనుక వారివారి తాహతు అంతస్తునిబట్టి వస్తురూపంలోగూడ ముట్ట జెప్తారు.

(లక్నోవారి వివాహవిధానము ఆచారాల్నిగురించి చెప్పవలసిందెంతో ఉన్నా కొంతే చెప్పాను.

పల్లెటూళ్ళలోని వివాహకలాపాల్లో కొన్నిపద్ధతులు వేరువిధంగానే వుంటాయి. అక్కడ 'మాంయూ' అనే వేడుక జరుపుతారు. పెళ్ళికొడుక్కు మధుపర్కాలు అతని తోబుట్టువులు, బంధుమిత్రుల తాలూకు ఆడవాళ్ళు తెస్తారు. అంతేగానీ పెళ్ళి కూతురు ఇంటినించి మేళతాళాలతో ఊరేగిస్తూ మధుపర్కాలు తెచ్చేపద్ధతి లేదు. మళ్ళీ పెళ్ళికొడుకు యింటినుంచి పిల్లకు సారె వెడుతుందిగానీ, పిల్లవేపువాళ్ళు పెళ్ళి కొడుకునిమిత్తం (మెహందీ) గోరింటాకు పంచే ఆచారం పెళ్ళిరోజే వేరుతీరుగా వుంటుంది. అదేమిటంటే మొగపెళ్ళివారు పెళ్ళికి తరలివెళ్ళినప్పుడు ఆడపెళ్ళివా రింటికి కొంతదూరంలో విడిదిచేస్తారు. అక్కడినుంచి సారె పెళ్ళిబట్టలు అవే కాకుండా పెళ్ళికూతురుకు పెట్టేబట్టలతోబాటు మరికొన్నిబట్టలు ఇంకా మంగళవస్తు సామగ్రులు, పంపబడటం ముఖ్యం. కొంచెం పంచదార, పేలాలు పళ్ళాల్లోపోసి పెళ్ళికూతురుయింటికి పంపుతారు. ఇవ్వన్నీ పెళ్ళికొడుకువేపు చుట్టపక్కాలద్వారా పంపుతారన్నమాట. ఆ వస్తువులన్నీ పెళ్ళికూతురు తరఫువారికి నిస్సంకోచంగా చూపించి అప్పగిస్తారు. ఈ సామగ్రులు తెచ్చినవారందరికి ఆడపెళ్ళివారు పానీయా లిస్తారు. పానీయాలు పుచ్చుకున్నతర్వాత తిరిగి వారు విడిదిచేరుతారు.)

(అప్పైన కొంచెంసేపటికల్లా ఆడపెళ్ళివారినుంచి పెళ్ళికొడుక్కు 'బరీ' మధు పర్కాలు పంపబడతాయి. ఈ 'బరీ' అనేదే పల్లెవాసులు గోరింటాకు పంచడమనే

ఆచారానికిబదులుగా పాటిస్తారు. ఈ బరీలో పెళ్ళికొడుక్కు చొక్కా. పంచ, టోపీ (పగడీ) బాసిగము పూవులచేర్లు, పాదరక్షలు ఇంకా ఫలహారాలు వగైరాలన్నీ పంపుతారు. పెళ్ళికొడుకు, వారుపంపిన దుస్తులుధరించి పెళ్ళికి తరలివెడతాడు. పెళ్ళివారంతా పెళ్ళిపందిట్లో చేరుతారు. అక్కడ రాత్రంతా పాటకచేరీలు నాట్యాలతో హడావిడిగా వుంటుంది. కాజీసాహెబ్ (మహమ్మదీయుల న్యాయాధిపతి) పురోహితుడుగా వచ్చేవరకు ఆ హడావిడంతా అలానే జరుగుతూవుంటుంది.

అక్కడ పెళ్ళితతంగమంతా పట్టణాల్లోమాదిరిగానే వుంటుంది. పెళ్ళయిన తర్వాత ఆడపెళ్ళివారు పెళ్ళివారందరికి విందుచేస్తారు. విందు చెయ్యాలనే పట్టింపేం లేదు. పెళ్ళికొడుక్కుమాత్రం భోజనం పెట్టడం వాళ్లు తమవిధిగా భావిస్తారు. అయితే పల్లెటూళ్ళో అలాకాదు. పెళ్ళివారందరికి విందులు చెయ్యడమనేది ముఖ్యమైన బాధ్యత. ఆ విందుల్లో ఏమాత్రం లోటుపాట్లు జరక్కుండాచూసుకోడం గొప్ప విషయమన్నమాట. ఏ కాస్తలోపం జరిగినా అయినవాళ్ళలో తల కొట్టేసినంతయిదిగా భావిస్తారు.)

ఈ విందు (తోరా) ఫలహారంలోనే వుంటుంది. ఇందులో పులావ్, జర్దా (చక్కెరపొంగలి వంటిది), కుర్మా. ఖమీరీ రోటియాఁ (పులుపు రొట్టెలు) శీర్ మాల్ (పాలపూరీ) తప్పక వుంటాయి. పెద్ద, చిన్న అనే-భేదంలేకుండా అందరికి సమానంగా ఈ ఫలహారాలు పెడ్తారు. విందారగించేటప్పుడు మొగపెళ్ళివారు మొహమాటమన్నది లేకుండా కొసరి కొసరి అడిగడిగి పెట్టించుకుని మరీ తింటారు. ఇది కాకుండా గుర్రాలకు, ఎడ్లకు, మేత అడిగిపుచ్చుకుంటారు. మొగపెళ్ళివా రేమడిగినా ఆడపెళ్ళివారు మావల్ల కాదనకుండా, అడిగినవన్నీ ఇవ్వాల్సిందే. ఇవ్వకపోయారో పరువు పోయిందన్నమాటే. చేసిన చేతంతాగూడ వ్యర్థమైపోతుంది.

తర్వాత పీడోక్కలు మనుగుడుపులు ఇవ్వన్నీ ఇంచుమించు పల్లెటూళ్ళలోను, బస్తీలోను ఒకేతీరుగా వుంటాయి. అయితే ఒక్కటిమాత్రం వ్యత్యాసముంది. పల్లెటూళ్ళలో పిల్లను అత్తవారింటికి పంపేటప్పుడు వెంట ఆడవాళ్లెవ్వరూ వెళ్ళరు. అక్కడ పెళ్ళికూతురికేం ఇబ్బందివుండదు. తిరిగి మనుగుడుపులకు వచ్చేవరకు పెళ్ళికూతురు తినరాదు, తాగరాదు. అవతలికి ఇవతలికి వెళ్ళరాదు, ఉలకరాదు. పలుకరాదు. మొహంమీదనుంచి చేతులు తియ్యరాదు. కళ్ళు తెరవరాదు. ఇవన్నీ చచ్చి

నట్టు పాటించాల్సిందే. ఎందుకంటే అవన్నీ సిగ్గుమాలినపనులట. అటువంటి పనులు చేయకుండావుండటానికే ముఖ్యంగా అత్తవారింట అవతలికి, ఇవతలికి వెళ్ళి రావలసినఅగత్యం లేకుండా వుండటానికే పెళ్ళికూతురుకు రెండురోజులు ముందునుంచే ఆహారపానీయాలివ్వడం మానేస్తారు. చాలా కష్టమైనపరిస్థితనే చెప్పాలి. పల్లెటూరిపడుచులకు పొరుగూరిసంబంధాలు చెయ్యడంవల్ల ఆ వూరు చేర డానికి మధ్యమధ్య రెండుమూడు మజిలీలుచేస్తూ వెళ్ళవలసివుంటుంది. అందుకనే పెళ్ళికూతురిపట్ల అంతటి కఠోరనియమాలు పెట్టారు.

పల్లెటూరివాళ్లు పొరుగూరిసంబంధాలు చెయ్యడంవల్లనే సారె పంపటాలు 'మెహందీ' అనేవేడుకలు వెనకబట్టాయేమో, ఎందుకంటే ఓ వూరినుంచి మరో వూరికి వూరేగింపుగా పంపడమంటే సాధ్యపడేపనిగాదుగదా. పెళ్ళికొడుకువారు సారె పంపడం, ఆడపెళ్ళివారు అటునుంచి గోరింటాకు పంపడం, ఆపైన మొగ పెళ్ళివారు మూడోరోజు పెళ్ళికి తరలివెళ్ళడమనేవన్నీ సంక్షేపించి వూరుకున్నారు. అందుకే పెళ్ళికి తరలివెళ్ళేటప్పుడే పెళ్ళివారంతా పెళ్ళికొడుకుతోసహా భోజనంచేసే మరీ బయలుదేరుతారు. లేకపోతే, వీరంతా ఆడపెళ్ళివారింటికి చేరేప్పటికే ఆకలితో నకనకలాడి మొహాలు వేలాదేసుకుని కళకాంతులులేకుండా పోరూ?

# 45

ఇంతవరకు శుభకార్యాల్నిగురించి ముచ్చటించడమైంది. ఇప్పుడిక అశుభాల్నిగురించి చెప్పవలసివుంది. ఇందుకు లక్నోలోఉన్న ప్రత్యేకతేం లేదు. హిందూదేశమంతటా ఒకతీరుగానే వుంటాయి. అశుభమంటే, ఎవరయినా చనిపోయినప్పుడు చేసే కర్మ కాండలు వగైరాలు. ప్రాణి గుటగుట్లాడుతుండగానే కావలసినవాళ్ళందరికి కబురు చేస్తారు. ఏమాత్రం వీల్లేకపోతేతప్ప, వీలునుబట్టి అంతా చక్కావస్తారు. అటువంటి తరుణాల్లో వచ్చిన బండ్లకు వాటికి బాడుగ తామే యిచ్చేస్తారు. ఇదే పెళ్ళి పేరంటా లకు రాకైతే, వచ్చే బంధుమిత్రులందరికీ పెళ్ళివారే ఇస్తారు. వచ్చినవాళ్ళను ఇవ్వ వీయరు. చావులకు వచ్చినప్పుడు యింటివాళ్లివ్వరాదు.

తర్వాత, చనిపోయినవ్యక్తికి స్నానం చేయిస్తారు. షియాల్లో అయితే శవపేటిక స్నానాలగదిలోకి మోసుకుపోయి అక్కడ శవానికి స్నానంచేయించి 'కఫన్' కప్పుతారు. శవానికిపైన కప్పే వస్త్రాన్ని కఫన్ అంటారు. అదే సున్నీలుకనకయితే శవానికి ఇంట్లోనే స్నానం చేయిస్తారు. బంధువులు మిత్రులు నిలబడి స్నానం చేయిస్తారు. ఎంతైనా కాస్త గుండెనిబ్బరం సామర్థ్యంవున్న మగా, ఆడా ఆ వేళకి అక్కడ నిలబడగలరు. బాగా సంప్రదాయం తెలిసిన మౌల్వీసాహెబ్, లేకపోతే చదువుకున్నపెద్దలో అక్కడవుండి శవానికి స్నానంచేయించేవిధానం చెప్తుతు పోతూంటే ఆ ప్రకారం స్నానంచేయించడం సున్నీ తెగవారి ఆచారం.

స్నానంచేయించి పైన బట్టకప్పుతారు. ఆ కప్పేబట్టే కొంత పైజామాగాకట్టి మిగతాది చొక్కా అని తొడుగుతారు. ఆ పైన రెండు ఉత్తరీయాలు చుట్టేస్తారు. తల దగ్గర కాళ్ళదగ్గర నడుందగ్గర ఆ బట్టలు తెరుచుకోకుండా గుడ్డపీలికలు చింపి కడతారు.

షియాతెగకు చెందిన శవమైతే పెట్టెలోపెట్టి, ఆ పెట్టెమీద శాలువకప్పి ఆ పేటికను ఒక పాకలో నీడచోట పెడతారు. అక్కడ దగ్గరుండి ఎవరయినా ఒకరు సరి అయిన ఉచ్చారణతో (సూర్-ఎ-రహమాన్) భగవంతుని శరణు గోరుతున్నట్టు కురాన్‌లోని ఒక అధ్యాయం చదువుతారు.

ఆ పెట్టెమోసే శవవాహకుల్ని 'శుహదే' అంటారు. అనాదిగా వాళ్ళకదే వృత్తి అన్నమాట. ఈ శవవాహకుల అవకతవక ప్రవర్తనలవల్ల దుర్బుద్ధులవల్ల షియా తెగవారు కమిటీలుగా ఏర్పడి, ఎవరిప్రమేయంలేకుండా శవాన్ని సొంతవాళ్ళే మొయ్యాలనే నిర్ణయానికి వచ్చారు. జాత్యభిమానం, భావోద్రేకం ఉన్నవాడు, ఎక్కడయినాసరే ఎవరయినా చనిపోయాడు అంటే అక్కడికి హాజరై, సంప్రదాయానుసారం ఆ కార్యకలాపాలన్నీ జరిపించడానికి నడుం కట్టుకుని నిలబడాల్సిందే.)

సున్నీ తెగవారయితే శవాన్ని ఒక తేలికయిన మంచంమీదపడుకోబెట్టి పైన బట్ట కప్పుతారు. అదే ఆడమనిషిపోతే ఆ మంచానికి వెదురుబద్దలు వంచికట్టి, పైనుంచి ఒకబట్ట కప్పుతారు. దాన్ని 'గహ్వారా' ఉయ్యాలతొట్టెలా చెయ్యడమంటారు. వాళ్ళకు ఘోషా కాబట్టి ఈపద్ధతిగా చేస్తారు. సున్నీతెగవారిలో అయినవాళ్ళు కావలసిన బంధుమిత్రులే శవపేటిక భుజాలమీదపెట్టుకు మోస్తూ మెల్లమెల్లగా నడుస్తూ

(కల్మా) మంత్రాలు చదువుతూ తీసుకువెడతారు. అప్పుడు శవయాత్రకు సంబం ధించిన నమాజు చదువుతారు.

(శవపేటిక పట్టేటంత గొయ్యి తవ్వుతారు. మనిషి నిలబడితే గుండెల్లోతుండే వెడల్పాటిగుంత (గోరీ) తవ్వుతారన్నమాట. ఆ గుంతకు రెండువేపుల అంచు అట్టే పెట్టి నడుం లోతుండే మరో చిన్నగొయ్యి తీస్తారు. ఆ గోరీగుంతను శుభ్రంచేసిన తర్వాత శవాన్ని ఆ గోతిలోకి చాల జాగ్రత్తగా చెయ్యిజారి పడకుండా, ఏ దెబ్బా తగలకుండా భద్రంగా దింపుతారు. సాధారణంగా గోరీలో శవానికిఉత్తరాన తలాపు దిక్కు చేస్తారు. శవంయొక్క మొహం బిడ్డలు మొదలయినవాటితోమూసి తూర్పు దిశవేపు తిప్పుతారు. ఆతర్వాత పెట్టెమూత తెరుస్తారు. అప్పుడే ఆశవంతాలూకు బంధుజనమంతా ఆ చనిపోయిన వ్యక్తిమొహం కడసారిగా చూపివస్తారు. ఆ సమ యంలో షియా తెగవారు సూక్తులు కొన్ని చదువుతూంటారు. అప్పుడు సదాచార సంపన్నుడో లేక విష్ఠాపరుడైన వృద్ధుడు గోరీలోకి దిగి ఆ ప్రేతాత్మ ఆ చదువు తున్నవి విని తల తిప్పుతన్నట్టు మెడపట్టి ఆడిస్తూంటాడు.

తర్వాత అరబ్బీలోఉన్న ఒక వుత్తరం చదివి వినిపిస్తారు. ఆ ఉత్తరంలో ప్రేతాత్మను సంబోధిస్తూ, నకిరైన్ (మున్కర్, నకిర్ అనే ఇద్దరు దేవదూతలు గోరీలోకివచ్చి మరణించినవ్యక్తిని ప్రశ్న లడుగుతారని వారి నమ్మకం) ప్రశ్నించి నపుడు చెప్పవలసినసమాధానాలన్నీ చదువుతారు. ఆ తర్వాత గోరీలో పలకలు పరు స్తారు. ఆ పలకల్లో సందులు చిల్లులు కనకవుంటే లోపలికి మట్టిపడకుండా వుండా లని చిన్నచిన్నరాళ్ళతో ఆ చిల్లులు మూసేస్తారు. ఆ గోరీలో కర్పూరం, ఇంకా పరిమళద్రవ్యాలు శవంపై బట్ట కప్పేటప్పుడే చల్లుతారు. కొందరయితే సీసాలకొద్దీ మొగలిఅత్తరు కుమ్మరించేస్తారు. అదంతా అయినాక పైన మట్టికప్పి గోరీ పైభాగ మంతా పూడ్చి గోరీ ఆకారంగా నిర్మిస్తారు.)

ఆ మట్టికప్పేపనిని వారు చాల పవిత్రమైందిగా అతి ముఖ్యమైందిగా భావిస్తారు. గోరీలో మట్టి పోసేటప్పుడు అక్కడున్నవారు మూడుమూడు గుప్పెళ్ళ మట్టి ఆ గోరీలో పోస్తారు. అప్పుడు కురాన్‌లోని మూడువాక్యాలు చదువుతారు. ఆ మూడు వాక్యాల్లోని సారమేమంటే మేము నిన్ను ఈ మట్టినుంచే పుట్టించాము. మేము నిన్ను ఈ మట్టిలోనే చేర్చేశాము. మేము నిన్ను (కయామత్ కే దిన్-మహమ్మ

దీయ మతప్రకారము భగవంతునియెదుట కర్మవిచారణ జరిగే అంతిమదినము) ఆనాడు ఈ మట్టిలోనుంచే వెలికితీసి నిలబెడతాము, అని.

గోరీకట్టడం పూర్తికాగానే దానిమీద శవంపై కప్పినబట్టో లేకపోతే, పువ్వుల గుడ్డ ఏదైనా వదేసి 'ఫాతిహా' చదివి ఇంటికి తిరిగివస్తారు. మరణించినవ్యక్తికి సద్గతి కలగాలనికోరుతూ చదివేమంత్రాన్ని ఫాతిహా అంటారు.

(చనిపోయిన వ్యక్తియింట అతడు పోయిననాడు పొయ్యి రాజేయరు. ఇంట్లోంచి శవం అవతలికి వెళ్ళినతర్వాత బంధువులయింటినుంచి వండిన వంటకాలు పంపిస్తారు. శవాన్ని పూడ్చివచ్చినతర్వాత అంతాకలిసి ఆ వంటకాలతో కడుపు నింపుకుంటారు. మూడురోజులవరకు పొయ్యి అంటించరు. అన్నం వండరు.

ఈ పద్ధతి అసలు మహమ్మదీయ మతప్రారంభదశలో హజరత్ మహమ్మదు వారే స్వయంగా ఆరంభించారు.

హజరత్ జాఫరే తైయార్ ధర్మయుద్ధంలో మరణించాడన్న వార్తవిని, ఆ యింటివాళ్ళు ఏడుపులు పెడబొబ్బలు పెడుతున్నప్పుడు, మహమ్మదుసాహేబు వంటలుచేయించి కష్టంలోవున్న ఆ యింటివాళ్ళకు పంపించారట. ఆ ఆచారం ఇప్పటివారి ఆచరణలో అర్థవిహీనంగాను, లజ్జాకరంగాను తయారై కూర్చుంది.

ఎవరయినా మరణించినవెంటనే, యింట వండుకుని పెట్టుకున్నవంటకాలన్నీ నేలమీద పారబోస్తారు. బిందెలకొద్దీ నీళ్ళు దిమ్మరిస్తారు. పిల్లలు వాళ్లు అదేం పనని అడిగితే అందుకు వారు మృత్యుదేవత ప్రాణాలుతీసే తన కత్తి మన ఆహారపానీయాల్లో కడుక్కుంటుందని అలా చేశామని చెప్తారు.)

వ్యక్తి మరణించిన మూడోరోజు ఒక్కొక్కప్పుడు నాలుగోరోజు 'సోం' అనే కర్మ జరుపుతారు. అసలీ కర్మ ఎందుకు ప్రారంభమైందంటే ఆ చనిపోయినవ్యక్తి కుటుంబసభ్యుల్ని బంధువులు మిత్రులు అంతావచ్చి పలకరించి, సానుభూతి చూపించి ఓదార్చేందుకన్నట్టు ఆ కర్మ ప్రారంభమైంది. వచ్చినవాళ్ళు ఊరికే కూర్చుంటే బావుండదు కనుక, వాళ్ళు కాసేపు ఖురాన్‌లోని ఒకటి రెండుభాగాలు చదవడం, ఆ చదివినందుకు వచ్చేపుణ్యాన్ని ప్రేతాత్మకు ధారపోయడం అనేవిధానం ప్రారంభించారు. కొంతకాలానికి, ఏడుపులు మొత్తుకోడాలు అటుంచి, ఆ మూడో నాడు 'సోం' కర్మకు ఎంతమంది హాజరైనారు, ఎంతమంది ఖురాన్ చదివి ఆ

పుణ్యాన్ని మరణించినవ్యక్తికి ధారపోశారు అనేలెక్కల్లో పద్దారు. ఆ 'సోం' క్రియ పూర్తయ్యేలోపల వచ్చినవారిలో చాలవరకు జనం 'రుకువా' (అంటే మోకాళ్ళమీద చేతులానించి వంగి నమాజుచేసి) కురానులోని కొన్నిప్రకరణాలు చదివి చనిపోయిన వ్యక్తికి సద్గతి కలగాలని చేతులెత్తి భగవంతుని వేడుకుంటారు. వీటిలో మరొక కొరగానిపద్ధతొకటి ప్రారంభమైంది. కొంచెం గంధం, ఒకగిన్నెలో నూనె, కాసిని పువ్వులు కూర్చున్నవారందరిదగ్గరికి తీసుకువస్తారు. ప్రతిఒక్కరు ఒకపువ్వుతీసి నూనెలో వదేస్తారు. చివరకు ఆ పువ్వులు, చందనం తీసుకుపోయి చనిపోయినవ్యక్తి గోరీమీద పోసివస్తారు.

ఆరోజు సాయంకాలం ప్రార్థనకలాపాలన్నీ జరిగినతర్వాత మొదటిసారిగా పొయ్యివెలిగించి అన్నం వండుకుంటారు. పేదరికమనేది ఈ సానుభూతి మర్యాదలకు అడ్డుతగిలి, చనిపోయిన వ్యక్తియింటివారికి అన్నపానాదులు పంపడమనే ఆచారాన్ని తొలగించింది. పేదవాళ్ళయితే కష్టమో నిష్ఠురమో భరించి ఎవరి తిండి తిప్పలకు వారు జాగ్రత్తపడవల్సిందేగానీ గత్యంతరం లేదు. మూడోరోజు 'సోం' క్రియ అయ్యేవరకు భోజనం బయటవాళ్లు పంపాలనే ఆచారమైతే వుండనుకోండి. అమలు జరగాలిగా!

ఈ 'సోం' అనేదికాకుండా 'చెహలుం' అని మనిషి చనిపోయిన నలభైయ్యోరోజున చేసే శ్రాద్ధక్రియ. మృతజీవికి పుణ్యం చేకూరాలని చేసేప్రార్థన క్రియాదులు ఇవన్నీ ప్రజల్లో ఒకరకమైన నమ్మకాన్ని రేకెత్తించాయి. ఆ రోజుల్లో పేదసాదలకు అన్నదానం కనుక చేసినట్లయితే, ఆ పుణ్యమంతా ప్రేతాత్మకి చెందుతుందని ఒక అభిప్రాయమేర్పడింది. ముసల్మానులు అసలీ విధానాన్ని భారతీయుల నుంచే నేర్చుకున్నారనిపిస్తుంది. ఎందుకంటే భారతదేశంలో భారతీయులంతా మనిషి మరణించిన పదమూడోరోజున, సంవత్సరమైతే సంవత్సరీకాలని, ఏటా తద్దినాలని శ్రాద్ధకర్మ లాచరిస్తారు. వారిలాగా మనమూ గొప్పగా చెయ్యాలని ముసల్మానులకు అనిపించి, మూడోరోజు తీజే అని, ఏడోరోజు, ఇరవైయోరోజు, నలభైయోరోజు, తర్వాత సంవత్సరీకాలు చెయ్యడం ఆచారంగా పెట్టుకుని అయినవాళ్ళందర్నీ పిల్చుకుని గొప్పగా భోజనాలు పెడతారు. చిత్రమేమైందంటే, ప్రేతాత్మ నిమిత్తంచేసే కర్మకాండల్లో ఎంతెంత దానాలుచేస్తే భగవదాజ్ఞచొప్పున అంతకంత పుణ్యం ఆ ప్రేతాత్మకు దక్కుతుందని జనులకో మూఢవిశ్వాసం ఏర్పడింది. ఈ

నమ్మకంతోనే శ్రాద్ధక్రియలు జరిపేనాడు ఆ మరణించినవ్యక్తికే విందు చేస్తున్నట్టు భావించి, అతనికిష్టమయిన పదార్థాలన్నీ ఎంతో జాగ్రత్తగా, శ్రద్ధగా చేయించి పెడతారు.

ప్రేతాత్మకు పుణ్యం దక్కాలనేఉద్దేశంతోనే పేదసాదలకు తృప్తిగా అన్నదానం చేస్తారు. ఇంతేకాదు; నాలుగైదుజతల వడ్డించినవిస్తళ్ళు ఒక మంచి శుభ్రమయిన గదిలో వరుసగా పెడతారు. మట్టిముంతతో నీళ్లు పెడతారు. ఎందుకంటే ఆ చని పోయినవ్యక్తివచ్చి తింటాడని ఆ భోజనం, అతనికి దాహమేస్తే తాగడానికి నీళ్లూను. వాటితోబాటు విలువైన మంచి కొత్తబట్టలు, కప్పుకుందుకు దుప్పటి, పరుపు, నమాజు చదివేటప్పుడు వేసుకుకూర్చునే ఆసనము, కళాయిచేసిన కొత్త రాగిపాత్ర, చెంబు, గిన్నె, పెడల్పాటి మరోగిన్నె మొదలయినసామగ్రులన్నీ పెడ తారు. ఇవ్వన్నీ అక్కడ అమర్చిపెట్టినతర్వాత ముల్లా (మహమ్మదీయ పండితుడు) వచ్చి ప్రార్థనక్రియ లాచరిస్తాడు. అంటే కురాన్‌లోనుంచి కొన్ని ముఖ్యమయిన భాగాలు చదివి, 'పరమేశ్వరా! ఈ వస్తువులన్నీ దానమిచ్చిన సత్కార్మకు ఫలం ఆ లోకంలో ఫలానావ్యక్తికి లభించేటట్టు చెయ్యమని వేడుకుంటాడు. ఇలా చెయ్యడం వల్ల ఈ సామగ్రులన్నీ ఆ మృతజీవికి దక్కినట్టే అనుకువి, ఆ వడ్డించినభోజనాలు, ఆ వస్తుసామగ్రులన్నీ పేదసాదలయిన ముసల్మానులకు దానమిస్తారు.

ప్రజలమనస్సుల్లో ఈ నమ్మకాలనేవి ఇంతగా నాటుకుపోవడంవల్ల కొందరు తక్కువతరగతి జనాభాలోని మూర్ఖపుస్త్రీలు ఈ శ్రాద్ధకర్మలరోజున ప్రేతాత్మకోసం పెట్టిన వస్తుసామగ్రులదగ్గర సింగారించుకుని తమరుగూడ కూర్చుంటారు. ఎందుకు అంటే చనిపోయిన తమ భర్తలకు దానధర్మాలఫలితం దక్కినట్లే, తమ అంద చందాల ఆనందంగూడ లభించాలనట. అదో మూర్ఖత్వం.

శ్రాద్ధక్రియలప్పుడు భారీయెత్తున వండిస్తారు. వాళ్ళవాళ్ళ తాహతునుబట్టి బంధు మిత్రులకు పెట్టుకుంటారు. ఇంకా ఇంటి చాకలికి, మంగలికి, పాకీవాళ్ళకి మొద లయిన అందరికి పెడతారు. శ్రాద్ధక్రియలికవి పెద్దయెత్తున చేస్తారుగాబట్టి వీరందరికి గూడ విధిగాపెట్టడం జరుగుతూంది.

ఇంతవరకు కేవలం 'సోం' (మూడోనాటి క్రియ), ప్రేతాత్మకు సద్గతి కలగాలని చేసే 'ఫాతిహా'ను గురించే చెప్పడమైంది. ఇకపోతే వీటన్నిటిని మించి నలభైయో

రోజున 'చెహలుమ్' అని చేస్తారు. నలభై యోరోజుకంటే ముందుగాకూడ కావచ్చు. 'ఫాతిహా' అనేది పదోరోజు. ఇరవై యోరోజుకూడ ప్రత్యేకంగా జరుపుతారు. ప్రతిగురువారంనాడు వంశంలో పెద్దలయినవాళ్ళను ఆ ప్రార్థనలకు నియమిస్తారు. సాధారణంగా సోం (మూడోరోజున) చెహలుమ్ (నలభై యోరోజున) ఫాతిహాలు (ప్రార్థనక్రియలు) చాల విశేషంగా జరుపుతారు.

అశుభసమయాల్లో పాటించే ఆచారవ్యవహారాల్నిగురించి వివరించడమయింది. అక్కడికి వచ్చినవాళ్ళు ఉండేటనికి అదంతా మామూలుగానేవుంటుంది. ఈ శుభాశుభసమయాల్లో జరిపే ఆచారవ్యవహారాదులన్నీ నైతిక సామాజికమూల్యాలపై ఆధారపడివున్న వే.

మతపరమైన సమావేశాలేర్పరచే మర్యాదల్నిగురించి తరువాతిప్రకరణంలో ముచ్చటించుకుందాం.

# 46

సదాచారాల్లోని పదవవిషయం మతపరమైన సభలు. సమావేశాలు అనగా సంతాపసభలు, మహమ్మదు జయంత్యుత్సవాదులు మొదలయినవి మతపరమైనవిగానే భావించబడతాయి. ఈవిధమైనసమావేశాలు జరపడమన్నది షియాతెగ ముసల్మానులలో ప్రత్యేకమైన ఆచారం. మహమ్మదు జయంత్యుత్సవాలు జరపడం సున్నీ తెగవారి సంప్రదాయమైంది. అయితే ఇటు సమావేశాల్లోనూ, అటు జయంతుత్సవాదుల్లోను ఇరుతెగల ముసల్మానులు పాల్గొనడం వుండనేవుందనుకోండి. ఒక్కొక్కప్పుడు సున్నీ తెగవారిలో కొందరు సంతాపసభలు జరపడం. షియా తెగవారిలో కొందరు జయంత్యుత్సవాలు జరిపించడము జరుగుతూంటుంది. అయితే లక్నోలో జరిగే ఈ సభలు, సమావేశాలకు ఒక ప్రత్యేకత యెప్పుడూ వుంది. జయంత్యుత్సవాలవిషయంలోమాత్రం అటువంటి ప్రత్యేకతేం కనబడదు. హిందూదేశమంతటా జరిపినట్లే ఇక్కడా జరుపుతారు. అయితే కొందరు శ్రీమంతులు పూనుకుని జయం

త్యుత్సవాలు జరిపేటప్పుడుగూడ, షియాతెగవారు సంప్రదాయబద్ధంగా జరిపే సమావేశాలమాదిరిగానే, అంతటి సభ్యత సౌజన్యము మనకు కనబడుతుంది.

(సంతాపసభలనేవి చాలా విరివిగా జరుగుతూనేవుంటాయి. కావాలనుకుంటే ఒక మనిషి ఏడాదిపొడుగునా ఏ వుద్యోగం సద్యోగం చెయ్యకుండా, ఈ సంతాపసభలు జరగబోయేప్రదేశం తెలుసుకుని, హాజరై, నిశ్చింతగా పొట్టపోసుకోడానికిగూడ వీలుంది. ఎందుకు చెబుతున్నానంటే, మతాభిమానులయిన షియాతెగవారిలో పెద్దదాతలున్నారు, ఉదారులున్నారు. వారికి గొప్ప దానగుణముంది. అటువంటి దాతల ఔదార్యంవల్ల బ్రతకడానికి వీలుంటుంది. ఈ సమావేశాలబాహుళ్యంవల్ల ఇక్కడ మతంకోసం ఆత్మార్పణముగావించిన హజరత్ ఇమామ్‌నుగురించి వర్ణించి చెప్పే ప్రవచనకర్తలు బయల్దేరారు. ఎవరిశైలి వారిది. వారంతా సయ్యద్ ఉశ్శుహదా అలైహిస్సలామ్ పడినబాధలన్నీ వర్ణించి ఏడుస్తూ చెబుతుంటారు. అవి వినేవారికి గూడ ఎంతో ఏడుపొస్తుంది.

వారిలో ముఖ్యంగా పేర్కొనదగినవారు ముసల్మానుపండితులు; మతాచార్యులు; తరువాత మహమ్మదు ప్రవచనాలు, ఆయనచేసిన ఘనకార్యాలు వర్ణించిచెప్పే హదీస్‌ఖాన్‌లు. వాళ్లు మహమ్మదు ప్రవచనాలుచదివే ఇమామ్ హసను, హుస్సేన్‌ల గొప్పతనము, ఆ మహమ్మదుసంతతి అనుభవించినకష్టాలు విషాదంతో హృదయ విదారకంగా వర్ణించిచెబుతుంటే వినేవారికి దుఃఖం పొంగివస్తుంది. ఎంతటి రాతి గుండెగలవాడైనా కంట తడిపెట్టకుండా ఉండలేడు.

సంఘటనలు వర్ణించిచెప్పే మరొకరకం వాళ్లున్నారు. వాళ్ళను వాకియాఖ్వాం అంటారు. వాళ్ళు హజరత్ ఇమామ్ హసన్, హుసేన్ల జీవితచరిత్రలోని కొన్ని సంఘటనలు వర్ణించిచెబుతారు. ఆ చెప్పేటప్పుడు చక్కనిశైలిలో అలంకారాలు గుప్పిస్తూంటారు. వారి పదగుంభనము వినితీరాల్సిందే. ఎంతసేపువిన్నా వింటూనే వుండాలనిపిస్తుంది. వింటున్నంతసేపు చెప్పలేనంత ఆర్ద్రత కలుగుతుంది.

ఇలా సంఘటనలు ప్రత్యేకంగా వర్ణించిచెప్పడంలో ఉన్నంతస్వారస్యం, కథంతా ఏకరువుపెడుతున్నా ఉండదనిపిస్తుంది. తరువాత పేర్కొనాల్సినవాళ్లు, మర్సియా ఖ్వాం. మర్సియా అన్నది ఉర్దూభాషలోని ఒక ఛందము. ఆ ఛందాన్ని శోకగీతాలకే వాడతారు. ఆ గీతాలలో, చనిపోయినవ్యక్తి గుణగణాలు వర్ణించబడ

తాయి. ఈ శోకగీతాల్ని ఆలాపించేవారిని 'మర్సియాఖ్వాఁ' అంటారు. మర్సియాల్ని గద్యంమో స్తరుగా కవితాగోష్ఠిలో చదివినట్లు చదివి వినిపించేవాళ్ళని 'తహత్ ఉల్ లఫ్జ్‌ఖ్వాఁ' అంటారు. అయితే వాళ్ళు రాగయుక్తంగా కాకుండా అంత సాదాగా చదువుతున్నప్పటికీ, హావభావయుక్తంగా చదివేతీరునిబట్టి ఆ సంఘటనలన్నిటిని కళ్ళకుకట్టినట్లు చిత్రిస్తారు. వినేవారికి విచారం కలుగుతున్నప్పటికి వారు చదివేతీరుని మెచ్చుకోకుండా ఉండలేరు.

ఈవిధంగా శోకగీతాలు ఆలాపించడమన్న రివాజు ప్రవేశపెట్టి ఆదరణపొందిన వారిలో మీర్ అనీస్, మీర్ దబీర్ ముఖ్యులు. వారిరువురు గొప్ప కవులుగా ప్రసిద్ధి కెక్కినవారు. వెనుకటికో సామెత ఉంది. 'కవిగా చెడినవాడు శోకగీత రచయితగా రాణిస్తాడు' అని.

లక్నోవారి 'మర్సియా' చదివేవిధానం చాలా గొప్పది. హిందూదేశమంతటా ఆ పద్ధతే వ్యాప్తిచెందింది. కవితాప్రపంచంలో శోకగీతాల రచన అన్ని కావ్యాంగాల్లోకి శ్రేష్ఠమయినదిగా ఖ్యాతి నార్జించుకుంది. బహుజనాదరణ లభించడంవల్లనే ఎంతోమంది 'మర్సియా'లు రచించేవారు, మర్సియాలు చదివేవారు బయలుదేరారు.

ముహర్రం పండుగలప్పుడు, లేదా ఎవరైనా మరణించిన మర్నాడు లక్నో మొదలు హిందూదేశంలోకి దూరదూరాల పల్లెల్లో, బస్తీల్లోగూడా ఈ సంతాపసభలను జరపడం శోకగీతాలు ఆలాపించడం రివాజైంది.

మర్సియా చదివేవారితర్వాత సోజఖ్వాఁలనుగురించి చెప్పవలసివుంది. సోజఖ్వాఁ అంటే మర్సియా అనే శోకగీతాన్ని శోకిస్తూ ఆలాపించేవాళ్ళన్నమాట. ఈ సోజఖ్వాఁలు గుండెలు బాదుకుంటూ ఈ శోకగీతాల్ని రాగభావయుక్తంగా శోకిస్తూ చదువుతారు. ఈ చదివేవారు సామాన్యంగా ముగ్గురు ముగ్గురు ఒక్కొక్కజట్టుగా ఏర్పడతారు. ఇటు అటు ఇద్దరు వంతపాడుతూ శోకిస్తూఉంటారు. మధ్యమందేవాడు కరుణరసగాథ చెబుతుంటాడు; వారు ఆ శోకగీతాల్ని పాడేటప్పుడు సంగీత సంప్రదాయబద్ధంగా, రాగము లయ తప్పకుండా పాడతారు. వాళ్ళు సంగీతంలోగూడ పండితులన్నమాట. వాళ్ళముందు గాయకులుగూడ ఆగలేరు. లక్నోలో సంగీత సాహిత్యాల్లో ఎంతో ప్రవేశమున్న 'సోజఖ్వాను'లు ఉండేవారు. మహావిద్వాంసులయిన గాయకులుగూడ వారిముందు గొంతెత్తలేకపోయేవారు. శోకగీతాలు రచించే

వారికి కవనంలో ప్రతిభ వున్నట్టే, శోకగీతాలు ఆలాపించేవారు సంగీతంలో ప్రతిభ గడించుకున్నారు.)

ఈ కళలన్నీ సంతాపసభలు, సమావేశాలవల్ల బయల్దేరినటువంటివి. వీటికి ఆట పట్టు లక్నోయే. ఈ కళలన్నీకూడ ఉర్దూ సాహిత్యప్రగతికెంతో దోహదమిచ్చా యనే చెప్పాలి. ఉర్దూ గద్య పద్య సాహిత్యాల్లో ప్రత్యేకఖ్యాతిని సంతరించు కున్నాయి. మానవభావప్రకటన అనేదో ప్రత్యేకవిధానాన్ని ఏర్పరచుకుంది. ఏ భావం వ్యక్తపరచడానికైనా స్వేచ్ఛాపథాన్ని ఉర్దూసాహిత్యం సృష్టించుకుంది. అయితే ఈ కళ యింతగా వికసించడానికి కారకులు గ్రీకులు. ఎదుటివారిమనస్సుకు విచారం కలిగించాలీ అన్నా, ఆనందం కలిగించాలన్నా, జాలిపుట్టించాలన్నా, ఉద్రేకం తెప్పించాలన్నా, ఏమాట ఎలా మాట్లాడాలో, ఎటువంటిపదాలు వాడితే తాము అను కున్నభావం ప్రస్ఫుటమౌతుందో, అందుకు కావల్సిన హావ భావప్రకటన, ఆ మాట ఎంతస్థాయిలో పలకాలో, అందుకు ఎటువంటి కంఠస్వరముండాలో, అన్నీ వారికి తెలిసినంతగా మరెవ్వరికీ తెలియవు. ఎదుటివారి మనోభావాల్ని రెచ్చగొట్టడానికి కావాల్సినహంగులన్నీ వారికి తెలిసినంతగా, మరే జాతివారిలోను లేదనేచెప్పాలి. యూరప్‌లోని వక్తలుకూడ ఈ కళను మరి కొత్త ఉజ్జీవింపజేయడానికి పూను కున్నారు. అయితే ఈ ఉపన్యాసకళ అన్నది లక్నోలో ఎంతగా అభివృద్ధిచెందిం దంటే యూరప్‌లోనివారుగూడ ఇందులో అగ్రగాములు కాలేదనేచెప్పాలి.

సమావేశం ముగిసేముందు, వచ్చినవారికి షర్బత్ యివ్వడంగానీ, మిఠాయిలు పెట్టడంగాని రివాజు వుండేది. క్రమంగా ఆ రివాజు మారింది. నాగరికులయినవారు, ధనికవర్గానికి చెందినవారు సమావేశానికి రావలసిందిగాకోరుతూ పెద్దలకు ఆహ్వాన పత్రికలతోపాటు మిఠాయిలుగూడ అప్పుడే పంపడం ఆచారంగా పెట్టుకున్నారు. ఎందుకంటే సభ ముగిశాక వారికి ఈ మిఠాయిలుకనుక ఇస్తే, అవి చేతుల్లో పుచ్చు కునివెళ్ళడానికి, నాగరీకులు, స్థితిమంతులు నామోషీగాను, అమర్యాదగాను భావిం చడం, ఆ పొట్లం పట్టుకోడానికికూడా పనివాడులేకపోతే ఇబ్బంది పడటం, ఇహ ఏమీ చెయ్యలేక ఆ పొట్లాన్ని ఎదురుపడిన మిత్రుడికో లేకపోతే ఏ పేదవాడికైనా ముట్టజెప్పడం మొదలెట్టారు. మామూలు జనాభాకైతే ఈ పట్టింపు లేం వుండవను కోండి. కానీ, నాగరికులయినవారికి, శ్రీమంతులకు ఇదేదో పెద్ద నామర్దాగావుండేది.

ఇటువంటిబెడదలేం లేకుండావుండాలనే ఏకంగా ఆహ్వానపత్రికలతోపాటే మిఠాయి పంపించెయ్యడం ఆరంభించారు.

(ఇప్పుడిక సమావేశాల్లో వచ్చినవారు కూర్చునేవిధానాన్నిగురించి తెలుసుకుందాం. ఆ విధానమేమిటంటే, చెక్కతో ఒక వేదిక ఏర్పాటుచేస్తారు. ఆ వేదికకు ఏ దెనిమిది మెట్లుగూడ వుంటాయి. అంటే వేదిక కొంచెం ఎత్తుగా వుంటుందన్నమాట. ఆ వేదికను ఇంట్లోగాపీ, వరాండాలోగాపీ, సమావేశం ఎక్కడ నిర్ణయిస్తే అక్కడ, ఒకవైపున అమరుస్తారు. వచ్చినజనం గోడకుఆనుకుని వేదికమీదనే కూర్చుంటారు. అప్పుడు మధ్యంతా ఖాళీగానే వుంటుంది. జనం ఎక్కువకమకవస్తే, ఆ మధ్యనున్న ఖాళీజాగాలోగూడ కూర్చుంటారు. రావలసినవారంతా వచ్చి, పదిమంది చేరినతర్వాత ప్రవచనకర్తవచ్చి వేదికమీద కూర్చుంటాడు. కూర్చుని ఇప్పుడు 'ప్రార్థన' అని చెయ్యెత్తి జనానికి హెచ్చరికచేస్తాడు. అలాచేయగానే అందరుకలసి చేతులెత్తి మౌనంగా మనసులో 'సూర్-ఎ-ఫాతిహా' చదువుకుంటారు. ప్రార్థనానంతరం వేదికమీదున్నవ్యక్తి మహమ్మదువారి వచనాలు, వారి ఘనకార్యాలుచెప్పే హదీస్ఖ్వాంగాపీ, లేక సంఘటన వర్ణించిచెప్పే వాకయాఖ్వాంగాపీ కనుకైతే గ్రంథం తెరిచి చదివిచెప్పడం మొదలెడతాడు. శోకగీతాలు (మర్సియా) చదివేవారయితే ఆ శోకగీతాలు వ్రాసివున్నకాయితాలు చేతిలోపుచ్చుకుని శోకగీతాలు ఆలాపించి వినిపిస్తారు. మతాచార్యులు, మహమ్మదువారి వచనాలు, వారి ఘనకార్యాలగురించి ప్రసంగించేటప్పుడు అందరూ ఎంతో నిశ్శబ్దంగావుండి భక్తిభావంతో వింటారు. విచారకరమైన సన్నివేశాలు చెప్తున్నపుడు వెక్కివెక్కి విలపిస్తారు. అయితే శోకగీతాలు వింటున్నప్పుడుమాత్రం శ్రోతలు ఆ గీతంలో వినిపించిన కరుణరసపూరిత భావాన్ని పదేపదే మెచ్చుకుంటారేగానీ విచారించరు.

శోకగీతాలు ఆలాపించే విషాదగాయకులు (సోజఖ్వాం) వేదికమీద కూర్చోరు. జనం మధ్యలోనేకూర్చుని, గుండెలు బాదుకుంటూ శోకగీతాలు పాడి వినిపిస్తారు. అయితే ఎంతో మెప్పు పొందుతారులెండి. అలా పాడటమన్నది అందరికి సాధ్యమైంది కాదుగదా!

సభల్లో ఎందరో ప్రవచనకర్తలు పాల్గొంటూంటారు. వారు ఒకరితర్వాత ఒకరు చదివి చెబుతుంటారు. సామాన్యంగా మహమ్మదు సాహెబ్ ప్రవచనాలు, వారి

మనకార్యాలు చెప్పడమైనతర్వాత శోకగీతాలపఠనం. ఆ తర్వాత శోకగీతాల విషాద గానం ఉంటూంటుంది. ఈ సోజ్ ఖ్వానీ అనేది ఒక లక్నోలోనేకాదు హిందూదేశ మంతట చాలవ్యాప్తిలో వుంది. అయితే మతాచార్యులు, మతారాధకులయిన పెద్ద లున్న సమావేశాల్లో ఈ శోకగీతాలవిషాదగానం (సోజఖ్వానీ) ఉండదు. మతా చార్యులుండే సమావేశాల్లో మతపరమైన విషయాలగురించే ఎక్కువ ప్రసక్తి వుంటుంది. ముఖ్యంగా యిక్కడ ఇమాంబాడాలో మొహర్రంలో తొమ్మిదో తారీఖున (మొహర్రం మహమ్మదీయులకి సంవత్సరంలో మొదటి నెల) జరిగే సమా వేశానికి ఒక ప్రత్యేకత వుంది. ఆ సమావేశంలో పాల్గొనాలనే ఉత్సాహంతో జనం ఎక్కడెక్కడినుంచో వస్తారు. మతంకోసం ఆత్మార్పణచేసిన హజరత్ ఇమాం హసన్-హుస్సేన్‌లచరిత్రలో వర్ణించినట్లే ప్రేక్షకుల ఎదటికి నిజమైన ఒంటెను తీసుకువస్తారు. దానిమీద పీఠంగూడ వేసివుంటుంది. ఆ పీఠంమీద నల్లటిబట్ట పరిచి వుంటుంది. అది చూసేసరికి ఆస్తికులయినవారందరికి కర్బలామైదానంలో హజరత్ ఇమామ్ హసన్-హుసేను, వారి పరిజనం ఎన్నికష్టాలకు, ఎటువంటి హింసలకు గురైందీ, చివరకు సిరియావైపుకి ప్రయాణమైపోతున్నట్లు, ఒక్కసారి ఆ వెనుకటి చరిత్రంతా కళ్ళకుకట్టినట్లై, ఆ కరుణదృశ్యాన్ని చూస్తున్న వేలాదిజనంలో కొంత మంది స్పృహతప్పి పడిపోవడం కద్దు. తర్వాత నెమ్మదిగా వాళ్ళను ఇళ్ళకి చేర్చడం జరుగుతుంది.

అయితే రానురాను ఎలా తయారయిందంటే మతాచార్యులవంశీయులు జరిపే సమావేశాల్లో నాటకీయత ఎక్కువైపోయింది. దానికి తగినట్లు మతాభిమానులయిన శ్రీమంతులు వాటిలో ఇంకా ఇంకా కొత్తపోకడలకు పోవడం మొదలెట్టారు. కొందరు పెద్దలయితే ఈ సమావేశాల్ని కేవలం నాటకాలకింద మార్చేశారనే చెప్పాలి. ఎందుకు చెబుతున్నానంటే మౌల్వి మెహదీ హుసేన్ సాహేబ్ ఏర్పాటు చేసే సమావేశాల్లో అయితే రంగస్థలంమీదమోస్తరే, మాటిమాటికీ తెర ఎత్తడం, తెర దించడాలుగూడ వుండేవి. అక్కడ ఆ కర్బలాలో జరిగిన సంఘటనలన్నిటిని దృశ్యాలుగా ప్రదర్శించేవారు. అవి చూస్తున్నంతసేపు ప్రేక్షకులు ఎంతగానో విల పించేవారు. ఇదికాకుండా వారు స్త్రీలకని ప్రత్యేకంగా సమావేశాలు జరిపించేవారు. ఆ సమావేశాలకి వూళ్ళోవున్న వేలాదిస్త్రీజనం గుమిగూడేవారు. అందులో మహ-

మ్మదు ప్రవచనాలు. అవేకాకుండా కర్బలామైదానంలో జరిగినసంఘటనలన్నీ నటీ నటులు ప్రదర్శించిచూపడం ఉండేది.

నాకు తెలిసినంతవరకు మతాచార్యులు మహమ్మదు నిర్దేశించినబాటనే నడిచేవారు. వారు చెప్పినవిధానాన్నే అమలు జరిపేవారుగాని లేనిపోని వాటిజోలికి పోయేవారు కారు. అయితే జనసామాన్యపు అభిరుచులు రోజురోజుకు పెరిగిపోతూండటంవల్ల ఎన్నోమార్పులు రావడానికి అవకాశం కలిగింది. మొహర్రంలో పదో తారీఖునుంచి గఫరాన్ మఆబ్‌లోని ఇమాంబాడాలో ఒక సమావేశం జరుగుతుంది. దాన్ని 'శామే గరీబాఁ' (కరుణసంధ్య) అనేపేరున స్మరిస్తారు. అంటే మొహర్రం పదోరోజున (ఇమాం హసన్ హుసేన్‌లు ఆత్మార్పణ గావించినరోజు) తాజియా (కాగితాలతో కట్టిన ఒక మంటపం) మొదలయినవన్నీ భూస్థాపితంచేయడం అయిపోయినతర్వాత షియా తెగలోని పెద్దమనుషులంతా ఆ ఇమాంబాడాలో సమావేశమవుతారు. పగ లంతా మండుటెండను తిరగడం, శోకగీతపఠనం ఇత్యాదులవల్ల అందరిపై ఖరి ఏదోలా తయారవుతుంది. తల చెరిగిపోయి, వాళ్ళ బట్టలు దుమ్ముకొట్టుకుపోయి వుంటాయి. ఈ స్థితిలో అంతా ఆ సమావేశానికి హాజరవుతారు. అప్పుడొక మతా చార్యుడు వేదికమీదికివచ్చి కర్బలా మైదానంలో జరిగిన సంఘటనలను ఏకరువు పెడతాడు. అంతా కళ్ళకుకట్టినట్టు వర్ణించి చెబుతూచెబుతూ ఆ భావనలో లీనమై పోయి ఆపుకోలేనంత దుఃఖంవచ్చి పెద్దపెట్టున గొల్లుమంటాడు. ఆ తరుణంలో కంట తడిపెట్టని శ్రోతంటూ వుండడు.

ఈ సమావేశంలోని ముఖ్యవిషయ మొకటుంది. ఈ సమావేశానికి వచ్చినవారు కూర్చునేందుకని ఒక జంపఖానా వెయ్యడంగానీ, ఒక్కదీపం వెలిగించడమన్నది గానీ వుండదు. అప్పుడు ఆ వాతావరణంలో ఏదో చెప్పలేనంత నిశ్శబ్దం, శోకం ఆవరించినట్టుంటుంది. అందుకనే దాన్ని 'శామే గరీబాఁ' (కరుణసంధ్య) అని సరిగ్గా అన్నారు.

అసలు సంగతేమంటే, షియా తెగవారి సమావేశాలప్రభావం లక్నో సమాజం మీద చాలావరకు పడింది. అందువల్ల సదాచారాలు, నాగరికత ఎక్కువగా పెరిగాయి. శోకగీతాలంటే వుండే ఆసక్తి, కవిత్వాన్ని సంగీతాన్ని ఉజ్జీవింపజేయడమేకాకుండా ఆ కళలంటే పురుషులలోనేకాకుండా, తెరమరుగునవుండే స్త్రీలలోకూడ బలమైన

అభిమానం, ఆపేక్ష అంకురింపజేపింది. అయితే నేనెరిగివున్నంతవరకు యూరప్ లోనిస్త్రీ ఆడపిల్లలకు చదువుతోబాటు సంగీతనాట్యాలు చెప్పించడముండేదిగానీ. ఆసియాలో ఎక్కడా ఏ నగరంలోను, వీటికంత ప్రాముఖ్యమివ్వబడలేదు.

ఈ సమావేశాలేకాకుండా, ఇంకా అనేకరకాలయిన సభలుగూడ షియా తెగ వారు జరుపుకుంటూండేవారు. వాటిని 'సమ్మేళనాలు' అనేవారు. ఆ సమ్మేళనాలు ఈద్ పండుగ రోజునుంచి ప్రారంభమై, కొన్నిరోజులపాటు కొనసాగేవి. సంతాప సభల్లో హజరత్ ఇమాం హసన్-హుసేన్‌ల బాధల గాథవివి ఏడ్చి కళ్లనీళ్ళు పెట్టు కున్నట్టే, ఈ సమ్మేళనాల్లో నాటకంగా ఆ హజరత్ ఇమాం హసన్-హుసేన్‌ల శత్రువుల్ని అవమానించి, తిట్టితిట్టి, దుమ్మెత్తిపోయడం ప్రదర్శించేవాళ్ళు. ఇందు లోని అంతర్యమేమంటే షియాల ఉద్దేశ్యరీత్యా ఉమ్ముల్ మోమినీన్ ఆయిషా సిద్దీకా, హజరత్ ఫారూక్ అనే వాళ్ళిద్దరు హజరత్ ఇమాంహసన్-హుసేన్‌ల గర్భ శత్రువులు. కాబట్టి వాళ్ళను అవమానించాలని, వారిమీది కసి తీర్చుకోవాలని వాళ్ళ బొమ్మలుచేసి తగలబెట్టేవాళ్ళు. ఈ పనులు చెయ్యడమే సమ్మేళనంలో లక్ష్యంగా పెట్టుకున్నారు. అయితే ఈ సమావేశానికి సున్నీతెగ ముసల్మానులు వెళ్ళవచ్చుగానీ, తమ ప్రభువులకు జరుగుతున్న అవమానం జరక్కుండా అడ్డుపడడానికిమాత్రం వీలుపడదు. ఏం జరిగినా చూస్తూ వూరుకోవాల్సిందే.

అయితే ఈ సమావేశాల్లో చాలా అసభ్యతా, అశ్లీలం పాలెక్కువని వినికిడి. ఇవి ఎంతవరకు దిగజారిపోయాయంటే, సభ్యతవున్న ఏ షియాకైనాసరే బాధని పించకుండా వుండదన్నమాట. అయితే యీ సమ్మేళనాలంటే షియాతెగ ముస ల్మానులకెంతో యిష్టమేర్పడింది. అందుకు ఫలితమే, చీటికి మాటికి ప్రతి చిన్న విషయానికి షియాతెగవారికి సున్నీతెగవారికి పోట్లాటలు, తగాదాలు జరుగు తూండేవి.

షియా తెగవారి ఈ సమావేశాలు, సమ్మేళనాలతర్వాత పేర్కొనదగినవి సున్నీ తెగవారి హజరత్ మహమ్మదు జయంత్యుత్సవ సమావేశాలు. ఈ సమావేశాలు గూడ మిగతావాటిమోస్తరుగా జరుపుతారు. అయితే షియాలవలె వేదిక అనేది ఎత్తుగా ప్రత్యేకంగా ఏర్పాటు చెయ్యరుగానీ. ఒకచోట బల్లవేస్తారు. దానిమీద శుభ్రమైన జంపఖానా పరుస్తారు. ధర్మోపదేశకులు, హజరత్ మహమ్మదు జీవన

చరిత్ర చెప్పేకథకులు ఆ బల్లమీదకూర్చుని చెబుతారు. ఆ ఉత్సవాల్లో మొట్టమొదట పండితులొకరు హజరత్ మహమ్మదు జననవృత్తాంతము వర్ణించిచెప్తారు. జనన వృత్తాంతం వర్ణించి చెపుతున్నప్పుడు సభలోనివారంతా లేచి నిలబడతారు. కథకులు సంతోషాతిశయంతో పద్యపఠనం చేస్తారు. అప్పుడు అందరిమీద పన్నీరు చల్లు తారు. ఒకవేళ ధర్మోపదేశకులెవ్వరు దొరక్కపోతే, వచ్చినవారిలో విద్వాంసులైన వారే మతంకోసం బలిఅయిన గులాం అహమద్ శహీద్ జీవనచరిత్రాదివిశేషాలన్నీ చదివి చెప్తారు. అయితే జనానికి శోకగీతాల ఆలాపనంతగా, ఈ కథాకాలక్షేపం నచ్చలేదు. ఎందుకంటే ఆ శోకగీతాలాపన ధోరవడిలోనే ఈ కథాకాలక్షేపం బయలు దేరింది. దాంట్లోమాదిరిగానే, దీంట్లోను కథకులతో పంతపాటకు లిద్దరుంటారు.

కథకులు మధ్యలోకూర్చుని రాగయుక్తమైనధోరణిలో జన్మకథలోని ఘట్టాలన్నీ వర్ణించిచెబుతూంటే, ఇటు అటు వుండే పంతపాటకులు పంత పాడుతూంటారు. కథలో మధ్యమధ్య పద్యాలు, వర్ణనాత్మకమైన కవితలు గుప్పిస్తూంటారు. పంత పాటకులు అందుకుని ఆలాపిస్తూంటారు. ఎంతైనా శోకగీతాలాపకులవల్ల సంగీతానికి నవచైతన్యం కలిగితే, ఈ కథాకాలక్షేపాలు చేసేవారు, సంగీతం గొంతు పిసికేశా రనే చెప్పాలి.

ఈమాదిరి కథాకాలక్షేపాలవిషయంలో లక్నోలో చెప్పుకోదగినంత విశేషమేం లేదు. హిందూదేశమంతట సున్నీతెగవారు ప్రచారంచేసిన ఈ కథాకాలక్షేపాల పైఖరి, శైలి వరుస అంతా ఒకేతీరుగా వుంటుందనేచెప్పాలి. ఈ పద్ధతిలోనే (సున్నీ సూఫీలు) సున్నీతెగలోని సాధువుల సభలు, సమ్మేళనాలు వుంటూంటాయి. అంతట జరుగుతూంటాయి. మహమ్మదీయులు భారతదేశంలో అడుగుపెట్టినప్పటి నుంచీ ఈ సమ్మేళనాలకి పునాది పడింది. ఇవేకాకుండా (కవ్వాలీ) సంకీర్తన లేక భజనపరుల జట్లుగూడ వెలిశాయి. ఈ కవ్వాలీలు ధాఢీ జాతివారిదృష్టిలోను పాటకుల దృష్టిలోనుగూడ సంగీతపరంగా కావలసినంత ఉన్నతి లభించలేదనే చెప్పాలి. ఈ కవ్వాలీలవల్ల సంగీతకళకు ఏమంతలాభమూ కలగలేదు. శోకగీతాలాపనైతే ఒక శతాబ్దంలోపల సంగీతంలో ఒకస్థాయిని ఏర్పరచుకుంది. కాలక్రమేణ అందులో అవసరమైనంతవరకు పరివర్తన, పరివర్ధనగూడ జరుగుతూండటం గమనిస్తూనే వున్నాం. కవ్వాలీలు ఇంకా అంతటిస్థాయికి రాలేదు.

# 47

సభలు సమావేశాలనుగురించి వివరించాను. ఇప్పుడిక వాటిలో వాడే వస్తుసామ గ్రుల్నిగురించి వివరించాల్సిన అగత్యమెంతైనా వుంది. సభలు సమావేశాలు జరిగే టప్పుడు ఆహ్వానించిన అతిథులకోసం వినియోగించేవస్తువులు ఒకటి రెండు కావు. అనేకముంటాయి. నాటి సాంఘికాచారాలు మర్యాదలు తెలియాలీ అంటే ఆ వస్తు వుల్నిగురించి ప్రస్తావించడం ఎంతైనా అవసరం. ఆ వస్తువులేమిటంటే హుక్కా. ఖాన్‌దాన్ (తమలపాకు బీడాలు వేసుకునేపెట్టె) గుండుచెంబు. ఉమ్మివేసే పాత్ర. ఇవి ధనికులైన ప్రతివారివెంట వుండాల్సిందే. వీటిని పట్టుకునేందుకు. వీటిని అందించేందుకు ప్రత్యేకంగా నౌకర్లను పెట్టుకునేవారు. కొంతకాలంక్రితంవరకు. డబ్బున్న మోతుబర్లందరికీ హుక్కా పట్టేందుకో మనిషి ప్రత్యేకంగా వుండటం రివాజైంది. ఇప్పుడిప్పుడా పద్ధతులన్నీ వెనకబడ్డవి.

ఈ హుక్కా అనేది అసలు ఢిల్లీలో ఆవిర్భవించింది. అక్కడ ప్రభుత్వంవారి తాలూకు బట్టీల్లో రకరకాలయిన హుక్కాలు తయారవుతూండేవి. కొత్తకొత్త రకాల హుక్కాగొట్టాలు తయారుచేయడంలోమాత్రం లక్నో బాగా ముందంజ వేసింది.

ఢిల్లీవారి హుక్కాగొట్టాలఆకారం చూపులకు రోతగావుండేది. అవే హుక్కా గొట్టాలు లక్నోలో ఎంతో చక్కగా తయారయేవి. రాగి. కంచు. ఇత్తడి. వత్తు మొదలయిన లోహాలతోనేకాకుండా, మట్టితోకూడ చాల అందమైన హుక్కా గొట్టాలు లక్నోలో తయారుచేసేవారు. అందం చందం, సుగంధం కలిగి, విలువైన హుక్కాగొట్టా లెన్నోవుండగా, వాటిని వొదిలిపెట్టి సున్నితంగా, సుకుమారంగా వుండే మట్టి హుక్కాలంటేనే జనానికి చెప్ప లేనంత మోజు వుండేది.

హుక్కాగొట్టాల పై ఖరులు మార్పుచెందినతర్వాత పొగాకులోను కసీవిసీ ఎరగ వన్నిమార్పులు వచ్చాయి. పొగాకులో పాలు, బెల్లంవేసి దంపడమనేది మొట్టమొదట ఢిల్లీలోనే ఆరంభమైంది. ఆమాటకొస్తే ధూమపానంలో భారతదేశం ప్రపంచదేశా లన్నిటిలోకి పైస్థాయిని చేరిందనే చెప్పాలి. ధూమపానం లోకమంతటా వున్నది.

యూరప్‌లో చుట్ట, సిగరెట్టు, పైపుల్లోవాడే పొగాకునుగురించి కొత్తకొత్త విధానాలెన్నో కనిపెట్టబడ్డాయి. అయితే పొగాకులో పాలు, బెల్లం వెయ్యాలని ఎందరికి తెలుసు ? పొగ పీల్చినవారికి చెప్పలేని హాయి, సంతృప్తికలగాలంటే పొగాకులో పాలు, బెల్లం వెయ్యాలి. పాలు బెల్లంగమక పొగాకులోవేసి దంచినట్టయితే, ఆ పొగాకులోవుండే వగరు, గొంతుపట్టేగుణం పోతాయన్నమాట.

పొగాకులో వికారంపుట్టించే ఆ దుర్వాసన పోగొట్టడానికి పంచదారపాకం, పరిమళద్రవ్యాలు వేస్తారు. అప్పుడా పొగాకు ఘుమఘుమ లాడుతూంటుంది. పొగాకులాటిదానికి ఘుమాయింపు చేకూర్చిన ఘనత లక్నోది. ఆ పొగాకును చిలంలో వేసేటప్పటికి ఒక్కసారి గదిసాంతం ఘుమాయింపుతో నిండిపోవాల్సిందే. ఆ ఘుమాయింపుంది చూశారూ, చిలం తాగడం అలవాటులేనివారికిగూడ, రెండుదమ్ములు లాగుదామా అనిపించేటట్టు చేస్తుంది.

భారతదేశంలో కొన్నిప్రాంతాల్లో మంచి పొగాకు పండుతుంది. ఫలానా వూరి పొగాకు అంటే చాలు అంతప్రసిద్ధి. అది కేవలం మానవప్రయత్నానికి ఫలితమేనని చెప్పడానికి వీల్లేదు. ప్రయత్నానికి తోడు ఉపాయంగూడ ఉన్నందువల్లనే, లక్నో పొగాకులాటి పొగాకు ఎక్కడ దొరకదనేటంత శ్రేష్ఠమైనదిగా పేరు తెచ్చుకుంది.

కుర్మా తేలిగ్గా జీర్ణం కాదేమోనని భయంవల్ల ఇంగ్లీషువారు కుర్మా తినడానికి యిష్టపడనట్లే పట్టణాల్లో వుండేవాళ్లుగూడ కొందరు పంచదారపాకం వేసిన పొగాకు వాడరు. వాళ్లకు అదెక్కడ జలుబు చేస్తుందోనని పెద్దభయం. నాళ్ళకు ఈమాదిరి పొగాకు అలవాటులేక అలా అనుకుంటా రంతే.

పొగాకుతోబాటు హుక్కాలు, ఇంకా ఇతరవస్తువులవాడకం చాల పెరిగింది. చిలం గొట్టంగూడ మునుపటికంటె ఎక్కువ నాజూగ్గా అందంగా తయారయింది. హుక్కాగొట్టానికి వేసే స్వస్తిక్ ఆకారంగల చిహ్నాలలో ఎంతో మార్పువచ్చింది. ఆ హుక్కా గొట్టం అందం ఇనుమడింపజేయడానికని మూడుపేటల వెండిగొలుసు తగిలించేవారు కొందరు. ఇంతేకాదు, హుక్కాగొట్టాల మూతుల్లో రకరకాలు బయ ల్దేరాయి. కంచుతో చేయబడిన హుక్కాగొట్టాలు ఎంతో అందంగా వుండేవి. మొత్తంమీద చెప్పాలంటే అనాటి 'సమాజం' హుక్కాగొట్టాల్ని ఎంతగానో తీర్చిదిద్దింది.

హుక్కా తర్వాత అంతటిప్రాముఖ్యం వహించింది. తాంబూలపేటిక. (పాన్దాన్ లేక ఖాస్‌దాన్). జనానికి దానితో అడపా దడపా అవసరం కలుగుతూనేవుంటుంది. ఇంటవున్నా బయటకువెళ్ళినా ఎప్పుడూ అది వెంట వుండాలిసిందే. అదే ప్రభువు లకు. శ్రీమంతులకు అయితే ఆకు మడుపులుమడిచి యిచ్చేందుకవి ప్రత్యేకంగా సేవకులుంటారు. వీరంతరం వాళ్ళు 'పాన్‌దాను' వెంట వుంచుకుంటారు. ఈ పెట్టెలో తమలపాకు చిలకలుచుట్టి అట్టే పెట్టుకుంటారు. తాంబూలం వేసుకోడ మనేది భారతదేశంలో అనాదినుంచీ వున్నదే. హిందూ సంప్రదాయంలో ఈ తాంబూలానికి ఎక్కువ ప్రాధాన్యముంది. పూర్వకాలం రాజులుగానీ, పాదుషాలు గానీ, ఏ రాజ్యంమీదికైనా దండయాత్రకు బయల్దేరాలన్నా, లేక ఏదైనా బాధ్యతతో కూడినపనిని నిర్వహించవలెనన్నా, ఒక తమలపాకు బీడాతీసి పళ్ళెంలోపెట్టి ఫలానా పనిని సాధించుకువచ్చేవా రెవరు? దండయాత్రకు నడుంకట్టి బయల్దేరేవారెవరు? అని అడిగేవారు. అప్పుడు ప్రభుత్వోద్యోగులో, సేనాధిపతులో లేక సభలోని సభ్యులలోనుంచి ఒకరు లేచి, ముందుకువచ్చి ఆ తాంబూలం తీసుకుంటే ఫలానా కార్యం నేను సాధించుకువస్తాననిగానీ, దండయాత్రకు వెళ్ళడానికి నేను సిద్ధమని గాని ప్రతిజ్ఞ చేసినట్టు.

చివరికి రానురాను ఈ ఆచారం కాస్త నన్నగిల్లిపోయింది. ఒక సామెత రూపంలో లోకంలో చలామణి అవుతోంది. ఫలానావాడు ఈపనిని నిర్వహిస్తానని తాంబూలం తీసుకున్నాడు అంటే 'మాట యిచ్చాడు' అనే అర్థంలో వాడుకలో నిల్చిపోయింది.

పూర్వం రాజాస్థానాల్లో అతిథులకు కానుకలతోపాటు తాంబూలంగూడ యిచ్చి పంపడం ఆచారంగా వుండేది. ఈవిషయాన్ని 'ఇబ్నెబతూతా' తన పర్యటనాను భవాల్నిగురించి వ్రాసినగ్రంథంలో పేర్కొన్నారు. దాన్నిబట్టి ఈ తాంబూలానికి చారిత్రకంగాగూడ ప్రాధాన్యత కలిగివుందని మనకు తెలుస్తూంది. అందువల్ల ఆది నుంచి తమలపాకుతోబాటు, తాంబూలానికి వాడబడే దినుసులన్నీగూడ చాల ప్రసిద్ధి చెందాయి. అయితే ఈ తాంబూలమన్నది ఢిల్లీలో ఎంతకాలంవరకు వాడుకలో వున్నదో దాని స్థితిగతులగురించి మనకంతగా తెలియరావడంలేదు. అంతేకాదు తాంబూలానికి వాడే దినుసులుగూడ పూర్వంలో వాడేవే వాడుకగా ఉండిపోయాయి

గానీ, వాటి వాడకంలోగాని, ఆ దినుసుల్లోగానీ కొత్తగా వచ్చినమార్పులేం లేవనే చెప్పాలి.

తాంబూలానికి వాడే దినుసుల్లో ముఖ్యమైనవి కాచు, సున్నం, వక్క, ఏలకులు. ఇవి అనాదినుంచి ఉన్నవే. లక్నోకు పొగాకు రాకమునుపునుంచీకూడ ఈ దినుసులుమాత్రం వుండేవి. శతాబ్దాలపూర్వంనుంచీ పందలాదిరాజాస్థానాల్లోను, రాజ్యాల్లోను వాడుకలో వుండివున్న ఈ తాంబూలం ఏమేమి ప్రత్యేకతల్ని సంతరించుకుందో దాని పుట్టుపూర్వోత్తరాల్నిగురించి ఏమీ తెలియదు.

లక్నోలోమాత్రం తాంబూలానికి ఢిల్లీలోకంటెగూడ వాడుక ఎక్కువే. అందువల్లనే ఈ తాంబూలాలు పెట్టుకునేందుకు రకరకాల పేటికలను సృష్టించుకున్నారు. అంతేకాదు, ఏ దినుసు కా దినుసుని ఎంతో బాగుచేసుకున్నారు. మొట్టమొదట తమలపాకుపంట బాగుచేసుకున్నారు. భారతదేశంలోని కొన్నిప్రదేశాల్లో శ్రేష్ఠమైన దేశవాళీ తమలపాకులు దొరుకుతాయి. లక్నోలోగూడ ఆ చుట్టుపట్ల తమలపాకులు పెద్దయెత్తున దొరుకుతాయిగానీ వాటిలో చెప్పుకోతగినంత ప్రత్యేకత కనబడదు. అయితే వ్యాపారదృష్టితో తమలపాకుపంట అభివృద్ధి చెయ్యాలనుకున్న ధనికుల ప్రయత్నాలవల్ల పంట, పంటతోబాటు వ్యాపారం వృద్ధయి, ఉన్నతస్థాయి చేరుకుంది. మిగతా ప్రదేశాల్లోకంటె ఇక్కడ తమలపాకుపంట చాల ఎక్కువైంది. వాళ్లు తమలపాకులోని ఆ పసరుదనం, ఆకుపచ్చదనంపోయి, ఆకులోని ఈనెలు మెత్తగా నాజూకై, రంగు తెలుపుతిరిగి పండబారిన ఆకుగా తయారయ్యేవరకు నెలలతరబడి భూమిలో పాతరేసి వుంచుతారు. ఎందుకంటే పండుతమలపాకు శ్రేష్ఠమని వారి అభిప్రాయం. అలా చేసినందువల్ల పచ్చితమలపాకులో వుండేకారం చస్తుంది. అప్పుడా తమలపాకులో ఒక ప్రత్యేకమైనమృదుత్వము రుచి పుంజుకుంటాయి. అంతటి రుచిగల ఆకులు మనకిక ఎక్కడా దొరకవు. ఇటువంటి పండబారిన తమలపాకుల జాతిని 'బేగమీ' అంటారు. ఈ ఆకులు ఎంతో దూరప్రదేశాలకుకూడ అమ్మకానికి పంపుతారు. అక్కడ వాళ్ళెంతో ఆపేక్షతో ఇవి కొనుక్కుంటారు.

తమలపాకులతర్వాత సున్నంగురించి తెలుసుకుందాం. సున్నం వాడకంలేని చోటంటూలేదు. ఈ సున్నం చాల ఘాటైనవస్తువు. దాన్ని వడకట్టి, శుభ్రంచేసి వాడుకోవాలి. తాజాసున్నంతనుకై తే, తాంబూలంలో ఓ పిసరంత ఎక్కువైనా

నోరు పొక్కిపోతుంది. ఈ బాధ లేకుండావుండటానికే ఉపాయమొకటి చేశారు. ఈ సున్నాన్ని కరిగించి, వడగట్టి, శుభ్రం చేసినతర్వాత, కాస్త మీగడ, కమ్మని పెరుగు వడగట్టిన తేటనీళ్ళు ఆ సున్నంలోపోసి కలిపేసెయ్యాలి. అప్పుడిక అది అంత ఘాటూ వుండదు; అంతగా పొక్కదు. ఇటువంటి శ్రేష్ఠమయిన సున్నం లక్నోలోతప్ప మరెక్కడా దొరకదు. చౌకబారు రకానికి ఆశించనివాళ్ళందరూ ఈ సున్నాన్నే తాంబూలానికి వినియోగిస్తారు. ఈ సున్నం ప్రతివారి తాంబూలపేటిక లోను చోటు చేసుకుంది.

తాంబూలందినుసుల్లో కాచుగూడ వుంది. ఈ కాచనేది వగరు, చేదు, అరుచిగా వుంటుంది. కాని తాంబూలంలో సున్నపుఘాటు తగ్గించడానికి, నోరు బాగా పండించడానికి ఇదెంతో సాయపడుతుంది. కాని దాని వగరుదనం భరించరానిది గానే వుంటుంది. అయితే దానికి అలవాటుపడితేమాత్రం దాన్ని వదలిపెట్టలేం. రుచి లేదంటేగూడ ఒప్పుకోలేం. ఈ కాచు తయారుచేసేవిధానం సామాన్యంగా అంతటా ఒక్కటే. దాన్ని చిన్నచిన్న ముక్కలుగా చితకొట్టి నీళ్ళలో వుడికించాలి. అది ఉడికినట్టు గుర్తు యేమిటీ అంటే, ఆ నీళ్లన్నీ ఎర్రగా షర్బత్తులా అవుతాయన్న మాట. అప్పుడిక దాన్నిదించి, బట్టవేసి ఆ నీళ్ళన్నీ వడగట్టాలి. ఆతర్వాత ఒక పళ్ళెంలో బూడిదపోసి, దానిమీదో బట్టవేసి. ఆ బట్టమీద ఈ ఉడకబెట్టిన కాచు ముక్కల్ని పరవాలి. పరిచినతర్వాత వాటిమీద నీళ్లు చిలకరిస్తూవుండాలి. అలా నీళ్ళు చల్లడంవలన ఆ కాచులోవుండే వగరంతా జేగురులా ఆ బూడిదలోకి దిగి పోతుంది. ఈవిధంగా శుద్ధిచేసినకాచు ఆ వగరుదనమంతాపోయి, రుచిగలవస్తువుగా తయారౌతుంది. ఆ జేగురంతా కడిగేసినట్టుపోయి తెల్లగా స్వచ్ఛంగా వుంటుంది. అప్పుడిక దాంట్లో కాస్తంత మొగలిఅత్తరు వేస్తారు. లేకపోతే దాన్ని మొగలి పట్టాలోవేసి ఎండబెడతారు.

ఇప్పుడు కొన్నికొన్నిప్రాంతాల్లో ఈ విధానాన్నే ఆచరిస్తున్నారనుకోండి. అయితే అసలు ఈ పద్ధతంటూ కనుక్కున్నది లక్నోలోనే. ఇంతటి నియమబద్ధంగా మిగతా చోట్ల ఎంతవరకు ఆచరిస్తారో మరి అనుమానమే. ఈపద్ధతిగా శుద్ధిచేసి తయారు చేసిన కాచును లక్నోలోని వ్యాపారస్థులు అమ్మకంగూడ మొదలెట్టారు. వారిలో కాజీ మహమూద్ యూసుప్ సాహేబ్ మాకు చాల ముఖ్యులు. వారసలు మహ

మూదవగర కాపురస్థులు. లక్నోలోవుండి వ్యాపారంచేసి. గొప్ప పేరు ప్రతిష్ఠలు గడించారు. మంచిసరకుకు యిష్టపడే కొందరు శ్రీమంతులుకూడ తమతమ యిళ్ళ లోనే తెల్లవి కాచు తయారుచేసుకోసాగారు. ఇంట్లో శుద్ధిగా తయారుచేసుకున్న కాచైతే, బజార్లో అమ్మేకాచుకంటే ఎన్నోరెట్లు ఉత్తమంగా వుంటుంది.

పూనా మొదలయిన దక్షిణాదిపట్టణాల్లో ఒకరకమైన ఎండుగావున్న కాచు బజార్లో దొరుకుతుంది. అదే వారు తాంబూలానికి వినియోగించుకుంటారు. అక్కడి వారు ఆ కాచంటే ఎంతో యిష్టపడతారు. కానీ, అందులోవున్న రుచేమిటో మనకు అర్థంకాదు. దాన్నిచూస్తేనే ఏదో మట్టిబెడ్డలాగా వుండటమొకటి, వగరు పాలుగూడ వండి చేసుకునే కాచుకంటే ఎక్కువే వుంటుందని తోస్తుంది.)

తాంబూలం దినుసుల్లో మూడోది వక్క లేక పోకచెక్క. ఆ వక్కల్ని అడ కత్తెరతో సన్నసన్న ముక్కలుగా కత్తిరించి తాంబూలంలో వేసుకుంటారు. వక్కలు కత్తిరించడమనేది మామూలుపనే. అయితే లక్నోలో ఈ వక్కల కత్తి రింపుఅనేదిగూడ ఒక వృత్తిగా ఏర్పడిపోయింది. ఇదేవృత్తిగా పెట్టుకున్నవారిలో పప్పుబద్దలంత వక్క పలుకులు, హెచ్చుతగ్గులులేకుండా అన్నీ ఒకేతీరుగా, ఎక్కువ నుసికాకుండా, వ్యర్థంకాకుండా వుండేటట్టు కత్తిరించగల స్త్రీలెందరో వున్నారు. ఆకు, వక్క, సున్నం, కాచు మోస్తరు ఏలక్కాయలకేం బాగుబోగులక్కర్లేదు. తెచ్చినవి తెచ్చినట్టు వాడుకోవచ్చు. అయితే పండుగలు పర్వాలప్పుడు ఉత్సవాలు వేడుకలప్పుడుమాత్రం వాటిమీద వెండివర్క కాయితం చుట్టడం మర్యాదైంది. వెండివరకు కాయితాలు చుట్టి ఏలక్కాయలు పాన్దానులోగానీ, పళ్లెంలోగాని పోసి పెడితే వెండిగుళ్ళల్లే అందంగా కనబడతాయని అలా చేస్తారు.)

(వీటన్నిటితర్వాత స్థానం పొగాకుది. పొగాకును ధూమపానంగా ప్రపంచ మంతటా వాడుతూనే వున్నారనుకోండి. తినడానికికూడ విరివిగా వాడకం సాగు తోంది. ఇంగ్లండులో ఎండిన పొగాకును నలిచి పొడిచేసి నోట్లో వేసుకునే ఇంగ్లీషు వారి నెందర్నో చూశాను. భారతదేశంలోగూడ ఎండుపొగాకు నమిలే ఆచారం అనాదిగావుంటున్నదే. ఢిల్లీలో ఈ తినే పొగాకును జర్దా అంటారు. ఆ జర్దా పొగాకు బంగారువన్నెలో వుంటుంది.

ఆదిలో శుద్ధిచెయ్యని పొగాకునే తాంబూలంలో వేసుకుంటూండేవాళ్ళు. ఆ కాలంలోనే కొందరు పొగాకుకాడలుమాత్రం వొలిచి, ఆ కాడల్ని నీళ్లలో ఉడికించి

కానికషాయంలో ఘాటు పోయేందుకని, ఏవేవో సుగంధద్రవ్యాలువేసి, చిరు చేదుగా గానీ, లేకపోతే వాళ్ళవాళ్ల అభిరుచికి అనుగుణంగా చేసికొని, మొత్తంమీద అందులో ఘుమాయింపు, మజా పోకుండా, వాటితోబాటు సుగంధంకూడ మిళితం చేసేవాళ్ళు.

అయితే ఈ సొగసులన్నీ కొందరే, కొన్నియిళ్ళలోనే చేసేవారు. సామాన్యంగా అందరూ పొగాకు శుద్ధిచేయకుండా తినేవాళ్ళే. శుద్ధిచెయ్యని ఆ పొగాకునే తాంబూల పేటికలోను పెట్టి వుంచుకునేవాళ్లు. కాని ఇప్పటికి ఇరవై ఏళ్ళక్రిందట మున్షీ సైయద్ అహమద్ హుసేన్‌సాహేబ్ పొగాకులో ఒక ప్రత్యేకమైనజాతిని సృష్టించాడు. ఆ పొగాకు కత్తుల్లాటి పొడుగుపాటి ఆకులతో వుంటుంది. అటువంటి పొగాకును పండించి లోకానికి అందించాడు. ఆ పొగాకు విపరీతంగా జనాదరణపొందింది. క్రమంగా శుద్ధిచెయ్యని పొగాకు తినడమనే ఆచారం మటుమాయమైంది.

# 48

పూజ్యమిత్రులు మున్షీ సయ్యద్ అహమద్ హుసేన్‌సాహేబ్ కొత్తరకపు పొగాకు పండించడమేకాకుండా, ఆ పొగాకుతోనే మరో కొత్తసృష్టి చేయడంలోనూ కృతార్థుడయినాడు. అదేమిటంటే పొగాకు దానికాడలు నీళ్ళలోవేసి బాగా ఉడికించడం, దాని సారమంతా దిగినతర్వాత ఆకూ కాడలూ తీసిపారేసి, ఆ సారాన్ని మరికొంతసేపు, అది బాగా చిక్కబడేదాకా ఉడికించడం. అప్పటికా సారం చూడటానికి లేహ్యమువలె, తాజా నల్లమందువలె వుంటుందన్నమాట. అప్పుడు దాంట్లో కాస్త కస్తూరి, మొగలిఅత్తరు, ఇంకా కావలసిన పరిమళద్రవ్యాలువేసి కలిపితే, ఘుమఘుమలాడిపోతుంది. అటువంటి ఆ పొగాకుసారాన్ని ఒక ఆవగింజంత తీసి తాంబూలంలో వేసుకున్నట్టయితే, వేసుకున్నవారికి, పొగాకు వేసుకున్నంతతృప్తి కలగడమేకాకుండా, నోటికి సువాసనపట్టి రోజంతా అలానే వుంటుంది. కొందరు రసికులు ఈ పొగాకుసారపుమాత్రలకు ఎన్నో సొగసులు చెయ్యడంకూడా మొద

లెట్టారు. ఈ చిన్నచిన్నమాత్రలకు వెండి బంగారువర్కు కాయితాలుచుట్టి తళతళలాడే ముత్యాలవలె చెప్పలేనంత అందంగా ఆకర్షణీయంగా తయారుచేసేవారు. ముఫ్తీ గంజ్‌లోని బేగంసాహిబా యీ పొగాకుసారపుమాత్రలు తయారుచేస్తూండేది. నిజంగా వాటికవే సాటి. ముఖ్యంగా లక్నోప్రజలకు బేగంసాహిబా చేసిన మాత్రలంటే ప్రాణప్రదం. ఇక ఏ కార్ఖానాలో తయారయినవన్నా అంతగా యిష్టపడేవారు కాదు. వాళ్ళకసలు రుచించేవేకావు. ఆ కాలంలోనే ఆసగరలీ ముహమ్మదాలీ అనే వారు తమ స్వంతకార్ఖానాలో యీ పొగాకుమాత్రలను తయారుచేసి యావద్భారత దేశానికి అందచేసేవారు. బేగంసాహిబా మరణించినతరువాత వీరేకాకుండా యీ మాత్రలు తయారుచేసేవారు ఎందరెంతరో బయల్దేరారు. ఎన్నెన్నికార్ఖానాలో వెలిశాయి. పలువురి అధ్వర్యంలో యీ మాత్రలు తయారయ్యేవి. అయితే కొత్తకొత్త కార్ఖానా లెన్నివచ్చిపడినా అసగరలీ కార్ఖానాకేం దెబ్బతగల్లేదు. ఒక విషయం. ఇలా తయారుచేస్తున్న పొగాకుసారపు మాత్రలలోవున్న దుర్గుణమేమిటంటే అవి సువాసనగావున్నప్పటికీ పొగాకువేసుకున్న మజా, దాని చిరుచేదుతనం వేసుకున్నవారికి ఒక్క గుటకతోనే అయిపోతుంది కానీ అట్టేసేపు నిలవుండవు. అందువల్లనే ముస్షీ సయ్యద్ అహమద్ హుసేన్‌సాహేబ్ ఓ కొత్తతరహాపొగాకు కనిపెట్టాడు. ఆ ఆకు కనుక తాంబూలంలో వేసుకుంటే దాని చేదు గుణం, సుగంధం తాంబూలం చివరిదాకా వుండాల్సిందేకానీ అయిపోవడమంటూ వుండదు. ఈ సుగుణాలు వుండబట్టే హుసేన్ సాహెబ్ పొగాకు వస్తూనే లోకంలో పెద్దదుమారం లేపేసింది. దాంతో పొగాకుసారం, పొగాకుమాత్రలు విరివిగా తయారై వస్తున్నా జనంలో వాటివాడకం సన్నగిల్లిపోయింది. సాహెబ్‌గారి పొగాకుకే గిరాకి పెరిగింది. ఈ వద్దతేగనుక కొనసాగిందో యిక కొంతకాలంపోతే ఆ మాత్రలుచేసేపరిశ్రమ పూర్తిగా పడుకుంటుంది.

తాంబూలవిధానంలో కొత్తకొత్తవిషయాలు కనిపెట్టారు. కొత్తతరహా ఏలక్కాయల్ని సృష్టిచేశారు. ఆ ఏలక్కాయ ఒక్కటి కనుక వేసుకుంటే తాంబూలం వేసుకున్నదానికంటే ఎక్కువగా నోరంతా పండుతుంది. ఆ కిటుకేమంటే ఆ ఏలక్కాయల్లో తాంబూలానికి వాడే దినుసులేవోవేసి తయారుచేస్తారు. ఏలక్కాయ తొక్కల్లో ఏదో రంగువేసిపెట్టినందువల్లే అది నోట్లో వేసుకోగానే నాలుక పండు

తుందన్నమాటేగాని అంతమాత్రంచేత తాంబూలం వేసుకున్నతృప్తి ఎక్కడ్నుంచి వస్తుంది? ఆ కృత్రిమమైన ఏలక్కాయలకూ తాంబూలానికీ సాపత్యమా?

ఇంకొకరకం ఏలకులున్నాయి. వాటిల్లో మునల్మానుస్త్రీలు పళ్ళకు కప్పు అని వేసుకునే దంతచూర్ణంపోసి తయారుచేస్తారు. మునల్మానుస్త్రీలు కప్పువేసుకోడానికి ప్రత్యేకసమయం వినియోగించనవసరంలేకుండా తాంబూలంతోబాటు యీ ఏలక్కాయి ఒక్కటి వేసుకున్నారో పళ్ళకు కప్పు దానంతటదే పడుతుంది. పంటికీ పంటికినడుమ నల్లటిగీతలు దిట్టంగా పడతాయి. (గట్టిదనంకోసం మునల్మానుస్త్రీలు పళ్ళకు కప్పు వేసుకుంటారు).

అయితే యీ రెండురకాల ఏలక్కాయలవల్లా ప్రజలకు ఆశించినంతతృప్తేం కనబడలేదు. తాంబూలమిచ్చేతృప్తిని ఎర్ర ఏలక్కాయలు యివ్వలేకపోయాయి. నల్లఏలక్కాయలున్నాయీ అంటే వాటిల్లో కప్పు అనే దంత చూర్ణానికివుండే ఆ పరిమళం లోపించింది. అందుకే సామాన్యప్రజలకు అవంటే అంతగా గిట్టలేదు. పైగా వాటివిచూస్తే అందరికి హేళనా యద్దేవాగా వుండితప్పు. వభలూ సమావేశాలకు అవి వుపయోగపడిందీ లేదు.)

ఈ క్రమంలోనే వక్కను గురించికూడా చెప్పవలసివుంది. వక్కకీ ఆకుకీ అవినాభావసంబంధం వుంది. వక్క విడిగా వాడుకుంటున్నా తాంబూలమన్నప్పుడు ఆ వక్క తమలపాకుతో చేరాల్సిందేకదా! కొందరు తాంబూలంలోతప్ప విడిగా వక్క వేసుకోరు. మరికొందరు తాంబూలంగా కాకుండా వట్టి వక్కా, దానికితోడు ఓ ఏలక్కాయ నోట్లో వేసుకుంటారు. వక్కా, వక్కకితోడు ఏలక్కాయ వేసుకుంటే మంచిరుచిగా వుంటుంది. ముఖ్యంగా హిందూ మిత్రులకోసం మునల్మాన్లు పెట్టుకొన్న రివాజు యిది. హిందువులు, మహమ్మదీయులు చుట్టియిచ్చిన 'బీడా' తీనుకోరు; వేసుకోరు. అటువంటివారికి ఆతిథ్యం యిచ్చేటప్పుడు ముడివక్కలు, ఏలక్కాయలు యివ్వడం వారు ఆచారంగా పెట్టుకున్నారు. అందువల్లనే సంఘంలో వాటి గిరాకీ హెచ్చింది.

వక్కల్లో పచ్చివక్కనీ, పీటీలనీ రెండురకాలు. పీటీలంటే వుడకబెట్టిన పోకన్నమాట. తాంబూలంలోవేసుకునే వక్కని పీటీలంటారు. ఇది వండి శుద్ధిచేసిన వక్కన్నమాట. ఈ వక్క లక్నో, ఢిల్లీ, హైదరాబాద్ మొదలయిన పెద్ద పట్ట

ల్లో తయారవుతుందని అపోహపడేరు సుమా ! కాదు. వక్కపంటవున్న చోటు మంచే వక్కలు శుద్ధిచేయబడివస్తాయి. వక్కను శుద్ధిచేయడమంటే పచ్చివక్కను పాలలోవేసి వుడికిస్తారట. అలా వుడికించినందువల్ల ఆ వక్కకున్న బెరడుపోయి ఎగురుగా కాస్త నునుపుగా తయారవుతుంది. ఒక్కొక్కప్పుడు పచ్చివక్క ఎక్కువగాతింటే దెక్కపడుతుంది. ఆ దెక్కపట్టేగుణం పీటీలలో వుండనేవుండదు. పీటీవక్క పచ్చివక్కకంటే చాలా రుచిగానూ వుంటుంది. శ్రేష్ఠమయిందికూడా.

నాకు తెలిసినంతవరకు యీ వక్క వాడకానికి, హైదరాబాదు, ఢిల్లీ, యింకా మిగతా పట్టణాలనుబట్టిచూస్తే లక్నోయే వెయ్యిరెట్లు నయం. ఆ ప్రదేశాల్లోని వక్కవాడకం ముందు లక్నో వెనుకబడింది. అక్కడివారు వక్కంటే ఆపేక్షపడేవారు. తమతమ అభిరుచులకుతగినట్టు వక్కపొడులు తయారుచేసుకుంటారు. నిజానికి వక్కపైన బెరడు వుంటుంది కాబట్టి కాస్త వగరుగావున్నా లోపల రుచిగా వుంటుంది. అయితే ముఖ్యంగా బాగుండనివి అడుగులు. పోకకాయ అడుగుభాగం వక్కల్నే అడుగులంటారు. వక్కల్లోవుండేవగరు పోగొట్టాలనే తలంపుతోనే లక్నోవారు వక్కలు చితక్కొట్టి రకరకాల వక్కపొడులు తయారుచేసుకుంటారు.

వాటిలో మొదటిరకం 'దోరుఖీ' అంటారు. వక్కకు పైన అడుగున, కొంచెం కొంచెంగా అంచులు, చుట్టుపట్ల కత్తిరించేసి, ఒక చక్కని అందమైన దొన్నెల్లా తయారుచేస్తారు. అలా కత్తిరించేసినందువల్ల వక్కలోవుండే వగరు భాగమంతా పోయి, రుచికరమైనభాగమే మిగులుతుందన్నమాట.

'యక్రుఖీ' అని రెండోరకం వుంది. వక్కను నలువైపుల తగినంత కత్తిరిస్తారు. అయితే అడుగున పైన వగరుగావుండేభాగాల్లో ఒకభాగంమాత్రం వుంచి, ఒకభాగం పూర్తిగా తీసేస్తారు. ఇకపోతే మూడోరకముంది. దాన్ని ఎనిమిది కోణాలు తేలేటట్టు కత్తిరించి చక్కని బేలా చేస్తారు.

ఈ కత్తిరింపుల్లో నలిగిపడిన చూర్ణాన్ని విడిగాతీసి అమ్ముతారు. అసలది లక్నోలో తయారుచేయబడే వక్కపొడులలో అయిదోరకం. ఆ చూర్ణంలోగూడ మరి రెండురకాలు చేశారు. దోరుఖీ యక్రుఖీ వక్కలరుచిలోను, వైఖరిలోను ఎంత తేడావుందో, వాటి వెలల్లోగూడ భూమ్యాకాశాలకున్నంత తేడావుంది.

ఈ వక్కంటే లక్నోవారికి ఎంత యిష్టమంటే అసలు అక్కడ తయారైనన్ని వక్కపొడులరకాలు యింకెక్కడా వుండివుండవు.

ఇంతవరకు తాంబూలం, దావితాలూకు దినుసుల్నిగురించి చెప్పడం అయింది. ఇప్పుడిక తాంబూలాదులుపెట్టుకునే పేటికలగురించి ముచ్చటించుకుందాం. తాంబూలపు దినుసులన్నీ పెట్టుకోడానికనీ చుట్టిన బీడాలు పెట్టుకోడానికనీ బ్రెట్ పాన్‌దాన్లు వుండేవి. వాటి అందం ఆకర్షణ చెప్పతరంగాదు. అప్పట్లో జనానికి అవంటే వల్లమాలిన మోజుండేది. పూర్వం ఢిల్లీలో గుండ్రపాటి బుట్ట పాన్‌దాన్లు వాడేవారు. ఆ బుట్టల్లోగూడా నలుచదరపుబుట్టలు కొన్ని యింకా ఏవేవో ఆకారాల్లోను చేసేవారు. ఈ బుట్ట పాన్‌దాన్లు హైదరాబాదుకి మొట్టమొదట్లో ఢిల్లీనుంచే వచ్చాయి. అవిచూసి అక్కడివారు వాటిని నమూనాగాపెట్టుకొని రేకుతోను, గాజుతోను నలుచదరమైన పాన్‌దాన్లు చేసుకోడం మొదలెట్టారు. పెళ్ళి పేరంటాల్లో గొప్పగా ఆ పాన్‌దాన్లలో ఆకు, వక్క, పచ్చివక్క, సున్నం, కాచు, లవంగాలు, ఏలక్కాయలు పోసి, వచ్చిన అతిథులకు వేసుకోడానికని పెట్టివుంచేవారు.

పూర్వకాలంలో యీ బుట్ట పాన్‌దానులకే ఎక్కువ వాడకం వుండేది. ఈ బుట్ట పాన్‌దాన్లు ఢిల్లీనుంచి లక్నోకువచ్చి దాదాపు రెండు రెండున్నర శతాబ్దాలయింది. అప్పట్లో యీ పాన్‌దాన్లను ఆడవాళ్ళే ఎక్కువగా వాడేవాళ్లు. ఢిల్లీని అనుకరించినంతవరకూ లక్నోగూడా యీ బుట్ట పాన్‌దాన్లనే వాడుక చేసుకుంది. ఆతరువాత లక్నో తన వునికినీ ఆచారవ్యవహారాలనూ, భాషను తన యిష్టంవచ్చినట్టు మార్చుకోడం మొదలుపెట్టినప్పటినుంచీ పాన్‌దాన్లపై ఖరిగూడా మారడం ప్రారంభమైంది. మొదట్లో వక్కకు పెట్టుకునేందుకు కళాయిపూసిన గుండ్రని రాగిపెట్టెలుండేవి. ఆ పెట్టెలకు కంచంవంటి గుండ్రని మూతలుండేవి. మరి కొద్దిరోజులకల్లా వెడల్పయిన వెండిగిన్నెలవలె పాన్‌దాన్లు తయారయినాయి. అవి పట్టుకోడానికి వంపు తిరిగిన గుండ్రని కడ్డీ తగిలించివుండేవి. ఆ పాన్దానులో సున్నానికనీ, కాచుకనీ చిన్నచిన్న దొన్నెలవంటి రెండు అరలుండేవి. ఈ అరలున్నవరుసలోనే ఒకేరకమైన మూడు భరిణెలుకూడా వుండేవి. వాటిల్లో ఒకటి ప్రత్యేకించి పచ్చివక్కకు వాడేవారు. ఈ మూడు భరిణెలుకూడా వలయాకారమైన ఆ పెట్టెలో దిగేసివుండేవి. వాటిమధ్యలో మిగిలిన ఖాళీస్థలంలో మరో బుల్లిభరిణె దిగేసివుంటుంది. సాధారణంగా ఏలక్కాయలు పోసుకునేందుకు ఆ భరణె వాడేవారు. భరణెలమూతలు సులభంగా తియ్యడానికి వచ్చేవిగావు. బాగా బిగుతుగావుండేవి. ఆ చిన్నదొన్నెల

వంటి అరలు మయ్యెడానికి వాటికి పరిపడిన మూతలుండేవి. సున్నం, కాచు వేసుకునేఅరల్లో అవి తీసుకునేందుకు చిన్నచిన్న చెమ్చాలుండేవి. ఆ చెమ్చాలు కొన్ని సాదాగాను, కొన్ని నెమలిబొమ్మ చెక్కివుండేవి. మొత్తం యీ అరలన్నిటినీ మూసేందుకు కంచంలాంటి మరొక అర వుండేది. అందులో తమలపాకులు గుడ్డలో చుట్టి పెట్టుకునేవారు.

ఆతరువాత మరోరకం పాన్దాను వెలసింది. దాన్ని నాగర్దాన్ అనేవారు. అందులోనే వక్కా ఆకులు పెట్టుకొనేవారు. ఆ నాగర్దాన్ అనేది తమలపాకు ఆకారంలోనే వుండే ఒక మూతపెట్టె అన్నమాట. ఆ నాగర్దాను వాడుకోవడానికి అంత అనువుగా వుండేదికాదు. దాన్నిమూస్తే అందులోకి గాలి దూరదు. గాలిలేకపోతే అందులో పెట్టిన ఆకులన్నీ పాడైపోతాయిగదా మరి! అందుకనే నాగర్దానవే పాన్దాను ఒక కాలంలో వుండేదని చెప్పుకునేందుకు మిగిలిపోయింది. ఇంకా పాతసామాన్లలో అక్కడక్కడ చూడ్డానికిమాత్రం కనబడుతుందేగాని దాని వాడకం పోనేపోయింది. కొంతకాలంతర్వాత అసలా ఆకారంగూడా మనకు కనబడుతుందని తోచదు. ఒకానొకప్పుడు వుండేదని మాటల్లో చెప్పుకోవాల్సిందేనేమో!

అప్పట్లో పాన్దానేది ఆడవాళ్ళకు వక్కాకుపెట్టెగానూ, డబ్బు దాచుకునేపెట్టెగాను అమిరింది. ఆ పాన్దానుపెట్టె ఆడవాళ్ళపాలిటి కావిడిపెట్టె అనాలో పెన్నిధే అనాలో మరి? అలా తయారయింది. దాన్ని భారతీయులపాలిటి భానుమతీదేవి పాన్దాను అనేవారు. విక్రమాదిత్యుని యిల్లాలు భానుమతీదేవి. ఆవిడ యింద్రజాల విద్యలో పండితురాలట. ఈ పాన్దాన్ల సైజూ, ఖరీ నానాటికి పెరిగిపోయినందువల్ల 'భానుమతీదేవి పాన్దాను' అని దానికి పేరువచ్చివుండాలి. ఈ పాన్దాన్ల ఆకారాలు రోజురోజుకీ పెరిగిపోవడం మొదలెట్టాయి. ఒకరు పదిశేర్లబరువుగల పాన్దాను చేయిస్తే మరొకరు యిరవైశేర్లబరువుగల పాన్దాను చేయించడం మొదలుపెట్టారు. ఎక్కడికైనా అతిథ్యానికి వెళ్ళేటప్పుడు ఆడవాళ్ళు కావిడిపెట్టెవంటి యీ పాన్దాను వెంట తీసుకువెళ్ళడం అచారమైంది. ఆ రోజుల్లో ఎవరికెంత పెద్ద పాన్దానువుంటే వారంత గొప్పవారికింద లెక్కన్నమాట. పెద్ద పాన్దానున్నవారు పెద్ద స్థితిమంతుల కింద జమ. ఒకరు బయల్దేరాడూ అంటే డోలీలోకూడా ఆ పెద్ద పాన్దానులుండాల్సిందే. ఆ పాన్దాను, డోలీలోవున్న చోటంతా ఆక్రమించుకునేది. దొరసానమ్మగారు

మాత్రం గత్యంతరంలేక ఎలాగో అలా అతికష్టంమీద ఆ దోలీలో చోటుచేసుకుని, ఒదిగి ముడుచుకుని కూర్చోవాల్సివచ్చేది. ఆవిధంగా పాన్దాన్లు ఓరోజుకంటే ఓరోజు పెద్దపెద్దవిగా పెరిగిపోతూవచ్చాయి. ఆతరువాత హఠాత్తుగా జనం చిన్నసైజు పాన్దాన్లవాడకం ప్రారంభించారు. అంతంతపెద్దవి వాడటం మోటుతరహా అని భావించారు.

మళ్లీ వాడుకలోకివచ్చిన యీ చిన్న పాన్దాన్లను మొదట్లో అరాందాన్ అనేవాళ్లు. అవి చిన్నచిన్న గుమ్మటాల్లాగానూ, గోపురాల్లాగానూ వుండేవి. అదే ప్రస్తుత కాలంలో హూస్నదాన్ అనేపేరుతో చలామణీ అవుతూంది. పాన్దాన్లో మాదిరిగానే ఆ హూస్నదాన్‌లోగూడా అరలు, భరిణెలు వుంటాయి. పైకిమాత్రం ఓ శిఖరం లాగా, గోపురంలాగా అందంగా వుంటుంది. ఆ గోపురంవున్నభాగమే ఆ పాన్దానకు మూత తీసేందుకు పట్టుకునే పిడిలాగా వాడుకోవచ్చు. హూస్నదాన్ అందరికీ నచ్చింది. లక్నోలోనూ మిగతాపట్టణాల్లోగూడా యీ హూస్నదాన్ గిరాకీ హెచ్చింది. లక్నోలో అది వచ్చినకొత్తలో దాబుసరికీ ఆడంబరాలకీపోయే మగవాళ్ళంతా హూస్నదాన్ వాడటం మొదలుపెట్టారు.

మరికొంతకాల మయ్యేసరికి సర్వసామాన్యంగా అందరికీ అవే వాడకమైనాయి. అంతమాత్రంచేత పాత పాన్దాన్లు మరుగున పడిపోలేదు. కాని యీ కొత్తగావచ్చిన హూస్నదాన్ల వాడకంమాత్రం హెచ్చిపోయింది. ప్రతియింట్లో పూర్వకాలపు పాన్దాన్లు అంత చిన్నా పెద్దాకానివి వున్నప్పటికీగూడా వాటినలా అట్టేపెట్టుకుని యీ హూస్నదాన్లకోసమే జనం ఎగబడటం జరిగింది. ఇప్పుడు మురాదాబాద్‌లో కూడా లక్నోలోమాదిరి హూస్నదాన్లు తయారుచేస్తున్నారు. అయితే అవి లక్నోలో వాటంత అందంగా వుండవు. పెద్దాకలవలె వెడల్పుగా వుంటాయి. లక్నోలో చేసే హూస్నదాన్ల ఆకారం ఎంతో చూడ ముచ్చటగావుంటుంది. అంత కుదురుగా చెయ్యడం, అంతటిపనితనం మిగతాచోట్ల తయారయ్యేవాటిలో కనబడనే కనబడవు.

పాన్దానుతరువాత చెప్పుకోతగింది ఖాస్‌దాన్. అదీ వో తరహా పాన్దానే. అది ముఖ్యంగా తమలపాకు బీడాలువేసి పెట్టుకునేందుకు వాడతారు. సభలు, సమావేశాలు జరిగేటప్పుడు మిత్రుల కివ్వడానికి, ఖాస్‌దాన్లో బీడాలువేసి పట్టుకొస్తారు. ఢిల్లీలో ఖాస్‌దాను వాడరు. ఈ ఖాస్‌దానుకుబదులు బీడాలు వో పళ్ళెంలోవేసి పెట్టు

కొంటారు. ఆ పళ్ళెంలో ఒకపక్క తమలపాకులు సున్నంరాచి, కాచువేసి నగానికి మడిచిపెట్టి వుంచుతారు. ఇప్పటికీ అక్కడ యిదేపద్ధతి. బహూశా పూర్వంగూడా. వచ్చిన అతిథులకోసం యీ వక్కాకుపళ్లాన్నే వాడేవారు కాబోలు.

లక్నోలో బీడాలు రెండురకాలుగా కడతారు. ఒకరకం పింఘూడా దుంపల్లే ముక్కోణాకారంగా గట్టిగాచుట్టి మడుస్తారు. ఇప్పుడొస్తున్న బీడాలు సీసా మూతలకు కాగితంచుట్టి బిరడాలాగా పెడతారు చూడండి! అలా చుట్టబడినబీడాలు. అవి రెండోరకం బీడాలు. ఆ ఆకుమడుపులు వూడిపోకుండా నిలవడానికని పుల్లగానీ, లవంగంగానీ గుచ్చిపెడతారు. వక్కాకు పళ్ళెంలోనే గుత్తులుగా వెండిపుల్లలున్న గొలుసులచేర్లు పెట్టివుంచేవారు. అత్తరు వేసుకునేందుకు చిన్నచిన్న వెండిసీసాల వంటివి వుంటాయి. దాన్ని అత్తరుదాను అంటారు. ఈ అత్తరుదానుకు చుట్టూ సన్నని వెండిగొలుసులు, ఆ గొలుసులచివర వెండిపుల్లలూ వుంటాయి. అత్తరు దాను మూతతెరిచి ఆ పుల్లలు అందులోముంచి అత్తరుతీసి రాసుకుంటారన్నమాట. అటువంటి పుల్లలగుత్తులకే బీడాలుగుచ్చి పళ్ళెంలోపెట్టి వుంచేవారు. కొందరు యిదెందుకొచ్చిన డాబుసరి లెమ్మనుకొన్నారు. బీడాలకు సూదులుగుచ్చుతే సరిపోతుం దనుకున్నారు. ఇప్పుడింకో కొత్తపద్ధతి కనిపెట్టారు. అదేమిటంటే బీడా వూడి పోకుండా మరో తమలపాకు దానిమీదచుట్టి గలీబు తొడిగినట్టు మడిచేస్తారు. అప్పుడిక అది వూడిపోనే పోదు.

ప్రస్తుతకాలంలో యీ బీడాలు పెట్టేందుకు పళ్ళాలు పనికిరాక ఆ పళ్లానికి పిడి గల మూత ఒకటి ఏర్పరిచారు. ఆ మూత ఆ పళ్ళానికిపెడితే గట్టిగా పట్టివుంటుంది. మూతపెట్టినందువల్ల ఆ ఖాస్‌దాను చిన్నసైజు హూస్నదాన్‌మోస్తరే తయారైంది.

## 49

తమలపాకుబీడాలు పెట్టుకునే ఖాస్‌దాన్లలో ఎన్నోరకాలు బయలుదేరాయి. వాటి అందం ఆకర్షణ ఇంతా అంతాకాదు. అయితే వేసవికాలంలో కళాయిపూసిన రాగి ఖాస్‌దాన్లు విపరీతంగా వేడెక్కిపోతాయి. అటువంటప్పుడు శుభ్రంగా చుట్టిన ఆ

బీడాల్ని ఖాస్‌దాన్‌లో పెట్టినట్టయితే, అవి కాస్త ఎండి యేరింపులై పోయి, రుచీపచీ లేకుండా, ఎందుకుకాకుండా పోతాయి. పైగా ఆ బీడాలు వేసుకున్నట్టయితే నోరంతా గూడ బెరడుకట్టినట్లయిపోతుంది. అందుకోసమవి వాళ్లు ఎండాకాలాల్లో బీడాలు పెట్టుకోడానికి ప్రత్యేకంగా మట్టిదాకలు వాడతారు. బీడాలు అందులోపెట్టి ఉంచు కుంటే, ఏమాత్రం ఎండకుండా, చెక్కుచెదరకుండా వుంటాయి. తాజాగా ఉండ టమేకాకుండా ఎంతో బావుంటాయిగూడ. ఆ దాకల్లో పెట్టిఉంచడంవల్ల వాటికి ఏదో ఓ కొత్తరుచి అబ్బినట్టవుతుంది.

లక్నోలో కాగితపుదొన్నెలు చేస్తారు. ఆ దొన్నెలు అందానికి అందం, ఎంతో నున్నితంగా, నాజూగ్గా వుంటాయి. అంతబాగా తయారుచేయడం లక్నోవారికే చేత నవును. అంత పనితనమున్నవి మన కింకెక్కడా కనిపించవు. ఆ కాగితపుదొన్నెల్ని నీళ్ళలోతడిపి, వాటిల్లో తమలపాకుబీడాలు పోసిపెట్టుకుని, కావలసినప్పుడు వేసు కుంటూంటారు.

అయితే మాటిమాటికి నీళ్ళతో తడుపుతూవుండటం యిబ్బందే. తడపక పోయామో ఆ బీడాలు ఎండిపోతాయి. అందుకోసం గొప్పయింటివాళ్ళంతా మరో పద్ధతి మొదలుపెట్టారు. ఆ దాకలోపెట్టిన బీడాలమీద తడిగుడ్డ వేసేవారు. తడి తగులుతున్నంతసేపు అవేంకావు కాబట్టి అలా చేసేవారు. తడిపివెయ్యడానికి తెల్లటి బట్టవాడితే, అది త్వరగా మాసిపోతుందని, అదీగాక బీడాలుపెట్టిఉంచితే ఎర్రటి మరకలవుతాయని, తెల్లగుడ్డకాకుండా, ఎర్రటి మఖ్‌మల్‌బట్ట వాడేవారు. అదైతే త్వరగా మాసిపోదు. ఒకవేళ మరకలయినా కనబడదుకాబట్టి ఎర్ర మఖ్‌మల్ వాడే వాళ్లు. ఆ బట్టకుచుట్టు అందంగా ఉండటానికి కొందరు వెండి నక్కి గోటుగూడ వేసుకునేవారు. ఈపద్ధతిగా బీడాలు పెట్టుకునే దాకలను చక్కగా సింగారించేవాళ్ళు.

రానురాను దాకలకేకాకుండా రాగి ఖాస్‌దాన్లకు, హూస్నదాన్లకుగూడ పైన ఈ మాదిరి బట్టకప్పడం రివాజైంది. ఈ బట్టల్లో వారివారి స్తోమతకు, అంతస్తుకు తగి నట్టు మంచిమంచిరకాలు వాడేవారు. ఈ విధానంవల్ల వస్తువూ పాడయ్యేదికాదు, అందంగాను వుండేది.

ఈమాదిరి లేసువేసిన మఖ్‌మల్‌గుడ్డను నీళ్లకూజామీదకూడ కప్పివుంచేవారు. అలా కప్పడంవల్ల ఆ కూజాలోనీళ్లు చల్లగా వడగండ్లవలె వుంటాయి. అంత చల్లటినీళ్లు కనబడితే చాలు, దాహం కానివాడికైనా తాగాలనే బుద్ధిపుడుతుంది.

తాంబూలం వేసుకునేవాళ్లు తరుచు ఉమ్మేసుకుంటూంటారు. అలా ఉమ్మేసుకో డానికి మాటిమాటికి లేవడమంటే ఇబ్బందిగా వుంటుంది. విశాలమైన గదులువున్న వాటికి ఉమ్మేసుకోవాలి అంటే లేచి ఎంతోదూరానికి పోవాల్సివస్తుంది. లేవడానికి బద్ధకించే, చక్కగా గచ్చుచేసున్న నేలమీద ఎక్కడికక్కడే ఉమ్మేసుకుంటూ కూర్చుంటే ఆ ఉమ్మి మరకలతో యిల్లంతా పాడై పోతుందిగదా। అందుకని తాంబూలంవేసుకునే ప్రతివారు ఒకపాత్రనుకూడా పెట్టుకుంటారు. అవసరమొచ్చి నప్పుడు ఉమ్మేసుకోడానికని. దాన్ని ఉమ్మివేసేపాత్ర అంటారు. అది లోకానికేం కొత్తకాదు. అందులో లక్నోవారి ప్రత్యేకత ఏం లేదు.

మొట్టమొదట్లో ఈ ఉమ్మివేసుకునే పాత్రలనేవి ఢిల్లీలోనే బయలుదేరి, తర్వాతనే లక్నో వచ్చివుండాలి. ఆ ఉమ్మిపాత్రల ఆకారమెలావుంటుందంటే, ఆపాత్రకు అడుగున గుండ్రనిమట్టు వుంటుంది. ఆ పైన బొంగరాల్లాగా గుండ్రంగా పొడుగ్గా వుండి, దానికి తామరపువ్వంటి గిన్నె ఉంటుంది. ఈ ఉమ్మివేసుకునేపాత్రలు రాగివి, ఇత్తడివి, నత్తువి వుంటాయి. అవి అన్నిచోట్ల తయారుచేస్తూనే వున్నారు.) ('బీదరు'లో ఆ పాత్రలు ఇంద్రచాపంలా కంటికి నదరైన రంగులెన్నోవేసి, ఎంతో అందంగా తయారుచేస్తారు.

లక్నోలో రాగితో చేస్తారు. వాటిమీద ఎంతో చక్కని నగిషీపనులు చేస్తారు. మురాదాబాదులో తయారయ్యే పాత్రలమీదకూడ అందంగా నగిషీలు చేస్తారు. లక్నోలో అయితే రాగివేకాకుండా, మట్టితోకూడ అందమైనపాత్రలు తయారు చేస్తారు.

అయితే వాటిచేతలో కొంచెం లోపముంది. వాటికి మూతి వెడల్పుగా దళసరిగా వుంటుంది. అడుగున మట్టు సన్నగావుంటుంది. అందువల్ల మట్టుపై బరువాపలేక పడిపోతూంటుంది. అప్పుడిక నేలంతా పాడై పోతుంది. ఈ బెదదలేకుండా వుండటానికని, జైపూర్, హైద్రాబాద్, మురాదాబాదుల్లో ఉమ్మి వేసుకునేందుకు మరో రకంపాత్రలు తయారుచేయడం మొదలెట్టారు. బహుశః ఆ రకంగూడ ఢిల్లీవారు కనిపెట్టిందే అయ్యుండవచ్చు. అది పల్లకీ బోయీల ఊతకర్ర ఆకారంలోనో, గారడీవాడు వాయించే ఢక్కావలెనో వుంటుంది. ఈ రకంపాత్రలు లక్నోవార్ని బాగా ఆకర్షించాయి. అందరూ అవే వాడకం మొదలెట్టారు. అయితే పాతకాలం

వాటిపాత్రలను వాళ్లు పూర్తిగా వదల్లేదనుకోండి. ఇప్పటికి అక్కడ ఆ కాలంనాటి పాత్రలవంటివి పెద్దపెద్దసైజుల్లో చేస్తూనేవున్నారు. కానీ, ఎక్కువమంది ఈ కొత్త రకం ఉమ్మిపాత్రలనే వాడుకుంటున్నారు. అమాటకొస్తే ఈ పాత్రలు తయారు చేయడంలోనూ, వాటిలోవచ్చిన మార్పుల్లోను లక్నో జోక్యం ఏమాత్రం లేదుగానీ, భారతదేశం మొత్తంమీదచూస్తే లక్నోలోనే ఈ ఉమ్మివేసుకునేపాత్రల వాడక మెక్కువని చెప్పకతప్పదు.

ఇటీవల మరోరకంపాత్రలు బయలుదేరాయి. అవి యింగ్లీషువారి సృష్టి. అవి గాజుతోను, పింగాణీతోను చేసినపాత్రలు. వాటిమూతి చాలా వెడల్పుగావుంటుంది. చుట్ట కాల్చుకునేవాళ్ళు ఉమ్మేసుకునేందుకు ఉపయోగంగానీ, తాంబూలం నమిలే వాళ్లు ఉమ్మేసుకునేందుకు అవి పనికిరావు.

ఖాస్‌దాన్‌తర్వాత శ్రీమంతులవెంట వుండేసామానుల్లో చెప్పతగ్గది చిన్న గుండు చెంబు. ఆ చెంబు నిరంతరం వారి సేవకులచేతిలో వుండితీరాల్సిందే. సాధారణంగా అది రాగిచెంబై వుంటుంది. ఆ చెంబుల్లో కొన్ని అతి సాదాగానూ వుంటాయి. కొన్ని నగిషీపనులు చేసినవి వుంటయ్. స్తోమతవినిబట్టి శ్రీమంతులు వెండిచెంబులే వాడుకుంటారు. వెండిచెంబులు వాడటమే వారికి ఘనత.

గుండుచెంబన్నది హిందువులకు ప్రాచీనంగావున్న వస్తుసామగ్రుల్లో ఒకటి. కొమ్ములేని చెంబునే గుండు చెంబనేవారు. పొట్ట పెద్దదిగా, మూతి చిన్నదిగా వుంటుంది. అప్పట్లో ప్రయాణించేసే ప్రతిఒక్కరు, అవసరమొస్తే నీళ్ళు తోడుకో డానికి అనువుగా వుంటుందని, గుండుచెంబు, తాడుకూడ పెట్టుకునేవారు. పల్లెల్లో వుండే హిందువులు, పేదసాదలయిన మునల్మానులు ఇంకా యీ గుండుచెంబుల వాడకం సాగిస్తూనేవున్నారు. ఆనాటి మునల్మానులు ఈ గుండుచెంబులకే తాగ డానికివీలుగా వుంటుందని కొమ్ము పెట్టించుకునేవారు.

ఢిల్లీలోవుండే శ్రీమంతులు ఈ గుండుచెంబుల్ని ఉపయోగించేవారో లేదో నాకు తెలీదుగానీ, శ్రీమంతులవెంటవుండే సేవకులదగ్గరమాత్రం యీ గుండుచెంబు తప్పక వుండేది. దాహమేస్తే తాగడానికి, పుక్కిలించి ఉమ్మేయడానికి, ఇంకా యితరత్రా అవసరాలకి వాడుకునేందుకుగాను, ఎప్పుడూ నీళ్లుపోసి వుంచుకునేవాళ్లు. తీరైన గుండుచెంబులు, వాటి అందం చూడాలీ అంటే లక్నోలోనే చూడాలి. లక్నో

వాళ్ళు గుండుచెంబులు చెయ్యడంలో చెయితిరిగినవాళ్లు. రాగిపాత్రల్ని గురించి ప్రస్తావన వచ్చినప్పుడు ఆ విషయం చెబుతాము.

వారు వేసవికాలంలో రంగురంగులగుడ్డలతో కుట్టిన జూలు పంఖాలు, విసనకర్రలు వాడేవారు. పంఖా లాగేందుకని, విసనకర్రలు విసిరేందుకని, గొడుగు పట్టుకోడానికని శ్రీమంతులు ప్రత్యేకంగా మనుషుల్ని పెట్టుకునేవారు. యజమాని వెంట వుండే పనివాడిదగ్గర విసనకర్ర, గొడుగు వుండితీరాల్సిందే. యజమానికి చెమటపట్టకుండా విసరడం, ఎండతగలకుండా వుండటానికి గొడుగుపట్టడం ఆ పనివాడి విధులు.

ఆకాలంలో ఇంట్లో నిత్యకృత్యంలో వాడుకునేసామానులలో గుండిగ జారీ చెంబు ముఖ్యమైనది. భారతదేశంలోవుండే శ్రీమంతులందరియింట ఆనాటినుంచి వాడుకలోవున్న పాతకాలపు సామానులవి. ఢిల్లీలో ఏనాటినుంచో అవి వాడుకలో వున్నాయి. అక్కడినుంచే లక్నోకు పాకింది. అయితే లక్నోలోవాళ్లు గుండిగ బదులు కళాయి వాడేవారు. ఎంతైనా కళాయి, గుండిగతో సరితూగుతుందా? గుండిగకు పొట్ట పెద్దది. మూతి చిన్నది. అంచుమాత్రం పళ్ళెంలాగా ఎత్తుగా, వెడల్పుగా వుంటుంది. ఆ గుండిగమూతికి గోనెగుడ్డలాటిది వాసినగట్టేవారు. (ఇప్పటికాలంలో వాష్ బేసిన్ల మోస్తరు) అప్పటివారు దాంట్లోకి చేతులు కడుక్కునేవారు. ఆ చెయ్యి కడిగిననీళ్ళన్నీ గుడ్డల్లోంచి గుండిగలోకి దిగిపోయేవి. తర్వాత ఆ గుడ్డను ఎప్పుడు వడితే అప్పుడు శుభ్రం చేసుకునేవారు. ఆ గుడ్డమీద చెయ్యి కడుగుతున్నప్పుడు ఆ నీళ్ళచిందులన్నీ మీదపడకుండా వుండేందుకని దానిమీద కాసిని గడ్డిపరకలువేసి వుంచేవాళ్ళు. ఈ ఏర్పాటు నాజూకుమనుషులకూ, పరిశుభ్రత కాంక్షించేవారికీ ఎంతో ప్రయోజనకారిగా వుండేది. ఆ ఏర్పాటువల్ల చెయ్యికడిగిన మురికినీరు కంటికి మరుగవుతుంది.

ఇటీవల పూర్వకాలపు జారీచెంబులు వాడకం మానేశారు. వట్టిచెంబులే వాడటం మొదలెట్టారు.

అసలు జారీచెంబునే పూర్వం చేతిలో చెంబుగా వాడుకునేవారు. ఈ జారీ చెంబుల్లో లక్నోవారు తమతమ అభిరుచులకుతగ్గట్టు ఇష్టమొచ్చినన్ని మార్పులు తెచ్చితెచ్చి చిట్టచివరికి వట్టి గుండుచెంబుకింద తయారుచేశారు. పూర్వంలో వాడే

జారీచెంబు లెలావుండేవంటే, అవి ఏకాండంగావుండే రాగిచెంబులన్నమాట. వాటికి పొట్టకూ, మూతికీ తేడా వుండేదికాదు. అంటే అడుగునుంచీ పైదాకా ఒకేమోస్తరు వెడల్పుగా వుండేవి. అడుగున మట్టు ఎంతుంటే. చెంబు పైభాగం అంటే మూతి. మట్టుకంటె కాస్తంత తక్కువగా వుండేది. మూతి అంచు వెనక్కి మడిచివుండేది. ఆ చెంబుకోవైపు వంకతిరిగిన కొమ్ముకటి పెట్టేవారు. అది నాటి జారీచెంబు ఆకారం.

ఆ పురాతన జారీచెంబుల్ని గుర్తుచేసే కమండలాలవంటి చెంబులు। కావలిస్తే ఇప్పటికి హైదరాబాదులో బాగా దొరుకుతాయి.

ఈజిప్టు, సిరియా దేశాల్లోవారు మంచినీళ్ళు పోసిపెట్టుకునే మట్టికూజాలు. ఇంగ్లీషువారు మొహం కడుక్కోవడానికి వాడుకునేందుకు బల్లమీద నీళ్ళుపోసి పెట్టుకునే పింగాణీ జగ్ మాదిరివే ఈనాటి జారీచెంబులూను. వాటిని మునల్మానులు అరబ్ ఈరాన్‌లనుంచి వెంటబెట్టుకు వచ్చివుండాలి.

కాలక్రమేణా భారతీయసంస్కృతి ప్రభావం పడటంవల్లనేమో మునల్మానులు వాడే జారీచెంబులు మార్పుచెంది, గుండ్రనిపొట్ట, సన్ననిమెడ, మెడకు, పొట్టకు ఏవిధమైన సంబంధంలేనట్టుగా తయారయ్యాయి. అయితే వాటి ఆకారంలో వచ్చిన మార్పేగానీ. ఎత్తు వెడల్పులో హెచ్చుతగ్గు లంతగాలేవు. ఆ జారీచెంబు పొట్ట గుండ్రంగా బంతిలా కాకుండా, అండాకారంగా వుంటుంది. ఉర్దూకవులు, రచయితలు తమ కవితల్లో, కథల్లో వర్ణించిన జారీచెంబు అదే. లక్నోలో చెంబులు అండాకారంగా చెయ్యకుండా, గుండ్రని బంతిలా చేసేవారు. ఆ చెంబుయొక్క ఎత్తునుబట్టి దాని చుట్టుకొలత, మూతి ఎంతలోవుండాలో చూసి ఏర్పరచేవారు. ఆ చెంబు మూతిదగ్గర ఎంతో ఏటవాలుగా వుంటుంది. చెంబుకుపెట్టే కొమ్ము అడుగున వెడల్పుగ వుండి, రానురాను సన్నగా ఇరుగ్గా వంపుతిరిగి చాల అందంగా వుంటుంది.

ప్రస్తుతకాలంలో లక్నోలో చలామణీ అవుతున్న జారీచెంబు అదే. అంత అందమైంది, కుదురైందీ భారతదేశంలో ఏ ప్రాంతలోనూ తయారుకాలేదు. జారీ చెంబులంటే మోజుపడేవాళ్ళంతా ఎక్కడెక్కడినుంచో ఆర్డరుచేసి లక్నోనుంచే చెంబులు తెప్పించుకుంటారు.

లక్నోలో తయారుచేసే జారీచెంబులు చిన్నవిమొదలు పెద్దవివరకు ఎంతో కుదురుగాను, పొంకంగాను వుంటాయి. అందుకే అవంటే అందరూ ఆశపడతారు.

ఈ పద్ధతిన ప్రతిఒక్క రాగిసామానులోను మార్పు వచ్చింది. వాటినిగురించి చెప్పుకోవడానికి ఇప్పుడిక్కడ అవకాశం లేమకనుక తర్వాత ముచ్చటించుకుందాం.

బేసన్దానీ అని కొమ్ములేని చెంబొకటి వుంది. ఆ చెంబులో శెనగపిండిపోసి పెట్టుకుంటారు. భోజనంచేశాక, చేతికైనజిడ్డు పోగొట్టుకోడానికి, సాధారణంగా ఆ బేసన్దానీలోంచి శెనగపిండితీసుకుని ఆ శెనగపిండితో చెయ్యి నల్చుకుని, తర్వాత నీళ్లపోసి కడుక్కుంటారు. అలా శెనగపిండితో చేతులు కడుక్కునేవారు చాలా కొద్దిమందే వుంటారు. ఎందుకంటే, శెనగపిండనేది తినేపదార్థం. అటువంటిదాన్ని అనవసరంగా చేతులు కడుక్కోడానికి వినియోగించడం శుద్ధదండుగని చాలామంది శెనగపిండిని చేతులు కడగడానికి వాడనేవాడరు. వాడినా, పెళ్లిళ్లలో నలుగులు పెట్టడానికి వాడతారుగానీ, మరొకందుకు వాడరు.

# 50

సంఘంలోని ఆచారవ్యవహారాదులు, అవసరమైన వస్తుసామగ్రులు, శిష్టాచారాల్ని గురించి ముచ్చటించాను. ఇక యిప్పుడు స్థితిమంతులు తమ తీవికితగినట్లు రాక పోకలకోసం వాడే వాహనాల్నిగురించి ప్రస్తావిస్తాను. భారతదేశానికిగూడ మిగతా చోట్లవలెనే పాశ్చాత్య నాగరికతాప్రభావం బాగా సోకింది. ఆసియా సంస్కృతి అంతిమదశలో అడుగుపెట్టడమే కాదు, అసలు అంతరించిపోయిందనో, పోవడానికి సిద్ధంగావుందనో చెప్పాలి. అందుకనే ఇప్పటికి అరవై డెబ్బైఏళ్ళక్రితం, నాటి దృశ్యాల్ని పాఠకులకళ్ళయెదుట చిత్రించాలని తలంపుగలిగింది. అవి ఈనాడు మరుగున పడిపోయిన దృశ్యాలన్నమాట.

ఇప్పటిలాగా ఆకాలంలో అందమైన మోటారుకార్లుగాని, విశాలమైన సార్టు బండ్లుగాని, లేండో అనబడే గుర్రబ్బండ్లుగాని వుండేవికావు. ఇప్పటిలాగా ఆరోగ్య

సూత్రాలనీ, వాటిని పాటించాలనేధ్యాసగాని ఎవరికి లేకనే, అప్పట్లో ఈ రోజుల్లో లాగా, విశాలమైన రాజమార్గాలేం లేవు. ఉండేవల్లా ఇరుకుబాటలే. ఏనుగులు, గుర్రాలు, ఒంటెలు, మేనాలు, పల్లకీలు, డోలీలు, రథాలు, బండ్లు, ఆపైన గుంపులు గుంపులుగా జనం, ఆ సందులోనుంచి మధ్యమధ్య తొలగండి, తప్పుకోండనే కేకలతోను అనుక్షణం రాకపోకలతోను ఆ సందులు కిలకిల్లాడుతూండేవి. అక్కడి బజార్లలోను అదే సందడి. విహారప్రదేశాల్లోనూ అదే సమ్మర్దం. ఎక్కడికక్కడే అంత కోలాహలంగా వుండేది.

ఒకప్రక్క పైనికావసరాలనిమిత్తమై పోతున్న ఒంటెలు, వస్తూపోతూండే వార్తాహరులు, సామాన్లు, బరువులు మోసుకుపోతున్న బళ్లు, ఇవిగాక గొప్పవారు, శ్రీమంతులు, వారివారిదర్జాను ఫాయానుబట్టి ఎక్కిపోయే వాహనాలతో బాటలు నిండివుండేవి.

గొప్ప రాజకుమారులో, నవాబులో లేక అంతటి స్తోమతగల శ్రీమంతులో కనుకైతే హవాదార్లని, బూచోలనే పల్లకీలెక్కి వెళ్ళేవారు. ఆ హవాదారనే పల్లకీ ఆకారం టాపులేని గుర్రబ్బండీలా వుంటుంది. దానికి పైన తోలుగుడ్డ (టార్పాలిన్) కప్పుగా వుంటుంది. ఆ గుడ్డకు ఇటు అటు ఇనుప చువ్వలు దూర్చివుంటాయి. కప్పు వేసుకోవాలనుకున్నప్పుడు ఆ యినుపచువ్వల్ని అందులోకి దూర్చితే చాలు. అక్కర్లేదనుకున్నప్పుడు ఊడదీసేయవచ్చు. చలిగా, మంచుగా వున్నప్పుడు కప్పు వేసుకుంటారు. అప్పటికి ఇటు అటు తెరిచేఉంటుంది. ఆ హవాదారుకుగూడ రెండు వేపుల పల్లకీ బొంగులుంటాయి. నలుగురు బోయీలు దాన్ని బుజాలమీద పెట్టుకుని మోసుకుపోతారు. ఆ హవాదార్లో కూర్చున్న పెద్దమనిషి ఠీవిగా ఉల్లాసంగాచూస్తూ, అటు యిటు పరికిస్తూ దారిలో తెలిసినవారెవరైనా కనబడితే సలాములుచేస్తూ వాహ్యాళికి వెళ్ళొస్తాడు. ఈ హవాదారనే పల్లకీ నిర్మాణాన్నిబట్టిచూస్తే, అది ఇంగ్లీషు వారి సృష్టేమోననిపిస్తుంది. వాళ్లు భారతదేశానికి వచ్చాక, వారి అభిరుచినిబట్టి క్రొత్తగా నిర్మించుకున్న వాహనమైయుండాలి. తర్వాత దాని అందం ఆకర్షణ చక్కదనంచూసి, భారతదేశంలోని భాగ్యవంతులందరికి మోజుకలిగి వుంటుంది. ఇప్పుడు దాని వాడకమే తగ్గిపోయింది. పూర్వకాలపు శ్రీమంతుల యిళ్ళలో ఈనాటికి అక్కడక్కడ ఈ హవాదార్లనే పల్లకీలు వున్నప్పటికి, వాటిని రాకపోకలకి వాడు

కోటం మానేశారు. పోతే, ఇవి హిందువుల్లో గొప్పవారింట పెళ్ళిళ్ళలో ఎప్పుడైనా అరుదుగా కనబడుతూంటాయి.)

(బూచా అనే వాహనానికి హవాదారుకంటే ఇంకా ఘనత ఎక్కువుంది. అది చూడటానికి ఇప్పటికాలంలోని (బర్ఘం) బండీమోస్తరుగా వుంటుంది. అయితే ఆ బండీకి చక్రాలుంటాయి. వాటికిబదులు బూచాకి కోళ్ళుంటాయి. వెనకాముందు పల్లకీలాగానే రెండు బొంగులుంటాయి. ఆ వాహనం మిగతా వాహనాలన్నిటికంటె చాలా బరువైందికనుక, దాన్ని దాదాపు ఎనిమిదిమందిగానీ, పదహారుమందిగానీ, బోయీలు మోస్తారు. ఈ వాహనం ఎన్నడైనా శ్రీమంతులు వాడారో, లేదో తెలీదు గానీ, కలకత్తాలో వాజిద్ అలీషామాత్రం ఈ బూచాలో వెళుతూండగా చూశాను. ఇంతేగాని మరి ఇంకెక్కడా ఎవరియింట ఈ వాహనం నేను చూడలేదు. పాదుషాగారు తమ ఉద్యానానికి, భవనానికి, వెళ్ళేటప్పుడు ఆ బూచాలో వెళుతూండే వారు. ఆ బూచావెంట పెద్ద పూరేగింపులా పరిచారక బృందమేకాకుండా, రాజోద్యోగులు, ఇంకా ఆస్థానపుపెద్దలు కొందరు కాలినడకను వెళుతూండేవారు.

ఈ 'బూచా' అనే వాహనంమాత్రం ఇంగ్లీషువారి నిర్మాణమేనని నిక్కచ్చిగా చెప్పవచ్చు. దాని ఆకారంలో ఇంగ్లీషువారి అభిరుచే కనబడుతుంది. అయితే వాళ్ల దాన్ని బోయీలు మోసేందుకు తగినట్టు తయారుచేశారు.)

సుఖపాల్ అని మరో వాహనముండేది. అది ఆడవాళ్లకోసం ప్రత్యేకించబడిన వాహనం. అందులో గొప్పయింటివారే ఎక్కుతారు. అది చాల ఘనమైనవాహనం, సిసలయిన హిందూవాహనం. హిందువులఅభిరుచికితగ్గట్టు దానినిర్మాణం జరిగింది. దానికి జేగురువర్ణంలో బురుజులుంటాయి. అది విశాలమైన మంచం చక్కీలాగా వుంటుంది. దానిమీద బురుజాలకు వెండి బంగారాల కలశాలు వేలాడుతూవుంటాయి. దానికి చుట్టూ తెరలుగట్టివుంటాయి. పల్లకీకి మోస్తరుగానే వెనకా ముందూ, ఒక్కొక్కటిగాని, రెండు రెండుగాని బొంగులుంటాయి. దాన్ని ఎంతోమంది బోయీలు మోస్తారు. ఈ వాహనాన్ని ప్రత్యేకంగా గొప్పయింటియువతులు, అంతఃపురస్త్రీలుమాత్రమే వాడతారు.

రథమని మరో వాహనముంది. దానికి చక్రాలుంటాయి. అది ఒకరకమయిన బండి. దాన్ని లాగడానికి ఎడ్లను కడతారు. ఈ బండ్లు జిల్లా అధికారులకు, పెద్ద

జమీందార్లకు, ఇంకా దేశీయ సంస్థానాల్లోను వున్నాయి. అయితే రోజురోజుకు వాటివాడకం తగ్గిపోతూంది. వృధాగా పడివుంటున్నాయి. కొంతకాలంపోతే అసలు ఊరూపేరూ కూడ లేకుండపోతాయేమో! ఆ రోజుల్లో లక్నోలో ముఖ్యంగా రాణి వాసపు స్త్రీలకోసమని లెక్కలేనన్ని ఈ రథాలనే బళ్లుండేవి. కీ. శే. షైన షూజా ఉద్దౌలా దేవేరి బహూబేగం సాహెబా, అసఫ్ ఉద్దౌలా పాలనాకాలంలో, ఫైజా బాద్‌లో రాజ్యపాలన చేస్తున్నప్పుడు ఆవిడ రాజ్యంలోనే ఎనిమిది తొమ్మిది రథాల దాకా వుండేవి. పూర్వకాలంలో ఢిల్లీ పాదుషాలు రాజ్యంనుంచి దూరప్రదేశాలకు ప్రయాణమై వెళుతున్నప్పుడు, వారి స్త్రీజనమంతా రథాలలోఎక్కి వెంట వెళ్లేవారట.

'బహల్' అని ఒక వాహనముంది. అది మామూలు ఎడ్లబండి అన్నమాట. రెండు చక్రాలమీద ఒక చెక్కలాటిది అమరుస్తారు. ఆ చెక్క నలుచదరంగా వుంటుంది. దానికి నాలుగువైపుల నాలుగుగుంజలు నిలబెట్టి, దానిమీద కప్పువేస్తారు. దానికి పరదాలాగా పెద్ద రజాయి కడతారు. ఆ బండిలో ఆడ, మగ ఎక్కి ప్రయాణం చేస్తారు. ఆకాలంలో మధ్యతరగతి పల్లెప్రజలు, బస్తీజనంగూడ ప్రయాణాలు చెయ్యడానికి ఆ బండే వాడుకునేవారు. పల్లెటూళ్ళలో యిప్పటికి యీ ఎడ్లబళ్ళు చాలా ఉన్నాయి. అయితే వాటికి నానాటికి వాడకం తగ్గిపోతూంది. త్వరలోనే ఎడ్ల బళ్లనేవి చూద్దామన్నా కనపడనిరోజు రావచ్చు.

మిగిలిన వాహనాలన్నీ జనం ఎరిగున్నవే. కాబట్టి వాటి ఆకారాదులగురించి వివరించి చెప్పవలసిన అవసరంలేదు.

ఈ వాహనాలన్నీ పురవీధుల్లోను, సందుల్లో గొందుల్లో, వస్తూపోతూ కనబడుతూనే వుంటాయి. చాలామంది పల్లకీల్లో వెడుతూంటారు. చదువుకున్నవారు వైద్యులు, శ్రీమంతులు, స్థితిమంతులయినవారు, భగవంతుడు వారికిచ్చిన స్తోమతని బట్టి ముగ్గురు నలుగురు బోయీలను ఇంట పనికిపెట్టుకుంటారు. వాళ్ళు పని వున్నప్పుడు పనిచేస్తారు. యజమానులు బయటికెక్కడికైనా వెళ్లేటప్పుడు సవారీ మోస్తారు. కొంచెం శౌర్యమున్నవారుగానీ, సైనికులుగాని, అయితేమాత్రం తమ దర్జా చూపించాలని గుర్రంమీదఎక్కి వెళ్ళేవాళ్ళు. ఆ గుర్రానికి ఏమేమో వెండినగలు బిగేసేవారు. ఆ గుర్రంమీద రంగురంగులచిత్రాలన్నీ చిత్రించేవారు. ఆ గుర్రాన్ని ఎంతగానో సింగారించేవాళ్ళు. అదేమాదిరిగా కులీనులు, గొప్ప ఫాయాగలవారైతే

ఏనుగెక్కి వెడుతూండేవారు. రాకపోకలకు ఏనుగును వాడుకునేవారు. ఎత్తుగా వుండే పెద్ద ఏనుగయినాకూడా ఆ సందుల్లో గొందుల్లోనుంచి ఇరకాటానపడకుండా తిన్నగా వెళ్ళిపోయేది. ఆ ఏనుగుశరీరంమీద చిత్రాలు వేయించేవారు. దానిమీద కప్పు లేని అంబారీ వేసుకునేవారు కొందరు. కొందరు శిఖరాలున్నమందిరంలా అంబారీ వేయించేవారు.)

ఆడవాళ్ళెక్కే వాహనాలు సుఖపాల్, పల్లకీ చాల అందంగా హుందాగా వుండేవి. పల్లకీకి ఎర్రటిగుడ్డతో జూలుపోసివుంటుంది. దానికితోడు గోటు వేసివుంటుంది. ఇదికాక పల్లకీకి కుచ్చులు వేలాడేస్తారు. బోయీలు ఎర్రని ఉన్నిచొక్కాలు తొడుక్కుంటారు. తలలకు ఎర్రటి అంచులున్నపాగాలు పెట్టుకుంటారు. ఆ పాగా అంచున రెండు వెండిచేపలు వేలాడదీస్తారు. చేప కనబడటం భారతదేశంలో శుభశకునంగా భావిస్తారు. పెద్దోక్కలసందర్భంలోను, లేదా ఏదైన మంచిపనిమీద వెళ్ళేటప్పుడు చేప శకునంకోసం ఎదురుచూసి, ఆడవాళ్లు 'అదుగో చేప' అని చేపను చూపి మరీ బయలుదేరడం రివాజైంది. ముఖ్యంగా ఆడవాళ్ళకు ఈ చేపశకునంలో గట్టి నమ్మకముంది. వెండిచేపలు చేయించి పల్లకీ బోయీల తలపాగాలకు పెడతారు. ఎందుకంటే వాళ్లు అందరికంటె ముందుంటారుకాబట్టి ఎప్పుడూ ఆ చేపలు కనబడుతూంటాయని. దీనికి జ్యోతిశ్శాస్త్రంతో సంబంధం ఉందేమో। జ్యోతిశ్శాస్త్రజ్ఞులు అలా సిద్ధాంతీకరించారు కాబోలు.

ఆడవారి పల్లకీవెంట ఒక ఆడబోయీ వుంటుంది. ఆవిడ పల్లకీ అంచుపట్టుకుని. పల్లకీవెంట పరుగుపరుగున నడుస్తూవుంటుంది. ఈ ఆడబోయీల కట్టుబాటులో ప్రత్యేకత వుంది. వాళ్లు కట్టే పరికిణీకిమధ్య వెడల్పుగా ఎర్రనిగుడ్డ అతుకేసి వుంటుంది. ఎంతవెడల్పంటే పరికిణీలో సగంవరకు ఆ ఎర్రగుడ్డే వుంటుంది. వాళ్ళు ధరించేదుస్తులు పై బరిబిట్టి వాళ్ళెవరో ఇట్టే పసిగట్టవచ్చు.

ఆ కాలపు వాహనాల్లో పల్లకీ ఒక్కటిమాత్రం నేటికీ వాడుకలో వుంది. గొప్పవారిలో ఎన్నడయినా బుద్ధిపుట్టినప్పుడు గుర్రంమీదగానీ, ఏనుగుమీదగానీ వెళ్ళడం ఉంది.

(ఇకపోతే బయట కెక్కడికైనా వెళ్ళేటప్పుడు గొప్పవారివేషభాష లెలా వుంటాయో పరిశీలిద్దాం. వారు ధరించేదుస్తుల్నిగురించి ఇదివరలో కొంతవరకు

చెప్పడమైంది. వాహనాల్లో బూచా హవానాలుతప్ప మిగిలినవన్నీ ఢిల్లీనుంచి లక్నోకు వచ్చినవేగానీ, లక్నోకి చెందినవేం కావు. అసలు ఢిల్లీరాజ్యశోభలోని చివరి వెలుగు లక్నో చేరుకుని, గొప్పగా వెలిగి కొండెక్కిపోయింది. అయితే వస్త్రధారణ విషయంలో ఢిల్లీకి, లక్నోకి అసలు ఏమాత్రం పొంతనలేదు. ఇంట్లో వున్నప్పటికి ఈకాలంలో చొక్కా విప్పుకుని కూర్చోడానికి ఎవ్వరూ యిష్టపడరు. కానీ ఆ రోజుల్లో ఇక్కడ యింట్లోవున్నప్పుడు పురుషులు కట్టుకునేది నిజానికి వట్టి లంగోటీ అన్నమాట. అప్పుడిక్కడ షియా తెగవారి పరిపాలనుండేది. ప్రతివిషయముమీద అచ్చుగుద్దినట్లు షియాలప్రభావం పడింది.

ఇమాముల ధర్మశాస్త్రంప్రకారం తొడలు కనబడుతూ బట్టకట్టడం తప్పుకాదు. కానీ, హన్ఫీల సంప్రదాయాన్నిబట్టి బొడ్డునుంచీ మోకాటివాకా నిండుగా బట్ట కట్టాల్సిందే. అందుకనే ఢిల్లీవారు లుంగీలు ధరిస్తారు. అదైతే మోకాటికిందవరకూ వుంటుంది. ఇక్కడి నాగరికతా విధానంలోమాత్రం వస్త్రధారణకంత ప్రాముఖ్యం లేదు. వీరు లుంగీ అని కట్టేదెలా వుంటుందంటే, అటు లుంగీకాకుండా, లంగోటీ కాకుండా మధ్యరకంగా వుంటుంది. అది పల్చగాకూడ వుంటుంది. బొడ్డుదగ్గర నుంచీ తొడలవరకు వుంటుందిలెండి. మిగతాశరీరమంతా నగ్నంగానే వుంటుంది. ప్రజల్లో నాగరికత, మర్యాదలు పెరిగినా ఇంట్లో వున్నప్పుడు వారి వొంటిమీద ఆ లంగోటీతప్ప మరో దారంపోగుకూడ కనబడదు. వారికిది అతి మామూలయిన విషయం. పైగా ఇంటికెవరయినావచ్చినా అర్ధనగ్నంగాఉన్న తాము వచ్చినవారిని కలుసుకోడానికి, మాట్లాడటానికి బిడియపడరు. వారికి బెరుకులేదు. ఇంట్లో వున్నప్పుడిలాగయితే బయటికెక్కడికైనా వెళ్ళేటప్పుడు చూడాలి వారి హుందాతనం. తలమీద చౌగోషియా టోపీపెట్టుకుని, అప్పుడే చాకలితెచ్చిన తెల్లని మల్లెపువ్వులా వున్న అంగరఖా వేసుకుని విలువైన పట్టు పైజామా తొడుక్కుని, మెడమీద ముక్కోణంగా మడిచిన రుమాలువేసుకుని, చేతిలో ఒక రుమాలు, బెత్తం పుచ్చుకుని, కాళ్ళకు లక్నోలో తయారయిన కొనలుతేలిన పల్చని మఖ్‌మల్ చెప్పులు ధరించి బయలుదేరుతారు. బయటకు వెళ్ళేటప్పుడు పెద్దమనుషులు వేసుకునే దుస్తులివి.)

(వీధిలోకి వచ్చేటప్పుడు ధరించే బట్టలవిషయంలోమాత్రం వారుచూపే శ్రద్ధ ఇంతా అంతాకాదు. ఆ బట్టల్లో ఎక్కడా మురికనేది వుండరాదు. పరిశుభ్రంగా

వుండాలిసిందే. నెలతరబడి ఉతక్కపోయినాసరే. అది మాయకుండా అప్పుడే వచ్చిన వాకలింటిమడతలా వుంటుంది. ఎందుకుంటదు? రోజులో మహ కడితే రెండు గడియలసేపు కట్టుకోడం.

అలా దుస్తులుధరించి, కూర్చుంటే నలుగుతుందో, లేస్తే నలుగుతూందో అన్నట్టు అతి జాగ్రత్తతో, ఆఖరికి తన నీడపడినా మాసిపోతుందేమోనన్నంత యింగా తప్పుకు తప్పుకుపోతూ, బజారుదాకా షికారుపోయి చీకటిపడగానే యిల్లు చేరడం. వస్తూనే టోపీతీసి చట్రానికి తగిలించి దానిమీద ఓబట్ట కప్పుతారు. తర్వాత ఒంటిన వేసుకున్న అంగరఖా, పైజామా, మెడమీదవేసుకున్న రుమాలుతీసి భద్రంగా మడతపెట్టి, చేతిరుమాల్లోపెట్టి కట్టి చిలక్కొయ్యకు తగిలించేస్తారు. యథాప్రకారం మళ్లీ లంగోటీ కట్టేస్తారు. ఆ చెప్పుల దాచి, పాతచెప్పులు తొడుక్కొని కూర్చుంటారు. అంతపదిలంగా వాడుకునేవారు కాబట్టి, విలువైన మెత్తని ఉన్నిబట్టలు వారిదగ్గర కొన్నేపి తరాలదాకా, అంటే కనీసం నాలుగయిదు తరాలవరకైనా రవ్వంత మాపులేకుండా, చిరగకుండా, పురుగులు కొట్టెయ్యకుండా, భద్రంగా వుండేవి. ఎప్పుడూ కొత్తగానే వుండేవి. పెళ్ళిళ్ళకు, ఉత్సవాలకు, సమావేశాలకు గొప్పగొప్ప వేడుకలకు ఆ రాచదుస్తుల్నిధరించి వెళ్ళేవాళ్లు. వాటి కథాకమామిషూ విన్నవారు ఆశ్చర్యపోయేవారు)

గొప్పగొప్ప శ్రీమంతులు ముఖ్యంగా రాజకుటుంబాలకుచెందిన వ్యక్తులు, విద్వాంసులు, వైద్యులు, అవసరమైన సామానులు వెంటపీసుకుని, వాహనాలెక్కి వెళ్ళడముండిగానీ, ఈనాడు పెద్దమనుషులంతాకూడ కాలినడకను పోతున్నా అంత తప్పుగా పట్టించుకోరు. ఎక్కువ తక్కువ అని తేడాలేకుండా, ఒక్కరకంగా కాలి నడకనే బయటికి షికారుకి వెళుతున్నారు. కాలినడకను పోయేవారయినా వచ్చి గొప్పగొప్ప శ్రీమంతులపక్కను, పేరు ప్రతిష్ఠలు గడించిన పెద్దల సరసను సరిసమానులుగా కూర్చున్నా తప్పుపట్టదు ఇప్పటిలోకం.

# 51

లక్నోవారి గుణగ్రహణ పారీణత, నిత్యావసరాలనిమిత్తం వారు తయారుచేసిన వస్తుసముదాయం, వాటిలో ప్రవేశపెట్టిన మార్పులు చేర్పులు, అభివృద్ధిని గురించి, ఇంకా వారు ఆదరించి పోషించిన కళలగురించి ఇప్పుడు క్లుప్తంగా చెబుతాను. ఈక్రమంలో చాలావిషయాల్ని గురించి ప్రస్తావించాల్సి వుంది. మొదట మట్టిపాత్రల నిర్మాణంతో ఆరంభిద్దాం.

మట్టిపాత్రల నిర్మాణమన్నది ప్రపంచంలో మొదటిసృష్టి. ఆరంభదశలో పాత్ర సామగ్రులన్నీ మట్టితో తయారుచేసుకునేవారు. ప్రతిదేశంలోను, ప్రతిరాజ్యంలో తవ్వకాలు సాగించి, ప్రాచీనశిల లెన్నిటినో పెళ్లగించి వెలికి తీశారు. వాటినిబట్టి, ప్రగతినికోరే మానవుడు ప్రారంభదశలో మట్టితో పాత్రలు ఆవంలోపెట్టి కాల్చి తయారుచేసుకునేవాడని తెలుస్తూంది. లోహయుగానికి ముందునుంచే మానవుడు మట్టిపాత్రలు తయారుచేసుకోవడం, వాటిని ఆవంలోపెట్టి కాల్చడం నేర్చాడు. ఈజిప్టులోని ఫెరోలకాలంలో మట్టిపాత్రలుండేవి. బాబిలోనియాలోను వండుకునేందుకు, వాడుకునేందుకనే కాకుండా మట్టితో ఇటుకలుగూడ తయారుచేయసాగారు. ఫెరోలకాలంలో అయితే గొప్పవాళ్ళు, మమ్మీలనబడే శవాలను పెట్టడానికి మట్టితోనే పెట్టెల్లాగా చేసేవారు. ఇంతేకాదు, పూర్వపుప్రపంచంలో ఈ మట్టితోనే రకరకాల పాత్రసామగ్రులు, కుండలు, కాగితంలా పల్చనయిన ఆటవస్తువులెన్నో కూడ తయారుచేసుకునేవారు.

భారతదేశంలో అతి ప్రాచీనకాలంనుంచీ ఈ మట్టిపాత్రలు చేయడమనే కళ అమల్లోవుంది. ఈ కళాకౌశలంలో మిగతాప్రదేశాలకు భారతదేశమేం తీసిపోదని, అనాదిలో తయారయిన ఆ మట్టిపాత్రలే రుజువుచేస్తున్నాయి.

హిందువులు ముఖ్యంగా విగ్రహారాధకులు కావడంవల్ల వారు రకరకాలుగా మట్టితో విగ్రహాలు మలచడం ఆరంభించారు. ఆ కళ వారిలో రోజురోజుకు వృద్ధయింది. తర్వాత 'కుమ్మరి' అనేజాతి వెలిసింది. ఆ కుమ్మరిజాతివారికి వంశపారంపర్యంగా మట్టితో పాత్రలు చెయ్యడమే వృత్తయింది. పాత్రలేకాదు, పిల్లలాడుకునే రక

రకాల గిలక్కాయలు, బొమ్మలుకూడ తయారుచెయ్యడం మొదలెట్టారు. (మట్టి కలిపి పదనుచేసి, బొమ్మలుచేసి ఎండబెట్టి, ఎండినతర్వాత వాటిని ఆవంలోపెట్టి కాలుస్తారన్నమాట.)

ఢిల్లీలో మహమ్మదీయ పరిపాలన కొనసాగుతున్నకాలంలో, కుమ్మరులలో మరోతెగవారు బయలుదేరారు. వారు కళాకౌశలంలో ఘటికులయినవారు. వారు ముసల్మాను కుమ్మరులన్నమాట. వాళ్ళు, పాత్రలు చేసేవారు. బొమ్మలు చేసేవారు. అయితే ముసల్మానులకు విగ్రహారాధన నిషేధం కాబట్టి బొమ్మసామానుకే రకరకాలుగా తయారుచేసి అమ్ముతుండేవాళ్ళు. ఆ కుమ్మర్లకు అదే జీవనోపాధిగా వుండేది. ఆ కుమ్మర్లు చేసేబొమ్మల్లో ప్రత్యేకకళ వుండేది. సంస్కృతికి సభ్యతకి నాటి సాంఘికాచారాలకి ప్రతీకగా వుండేవి వారుచేసే బొమ్మలు. వారాకళలో మిగతా కుమ్మరులకంటే ఎంతో ముందంజవేశారు.

శ్రీమంతులయిన ముసల్మానులు ఈ కుమ్మరిపనివారినిగూడ తమతోపాటు ఢిల్లీ నుంచి లక్నో వెంటబెట్టుకొచ్చారు. లక్నోలోని స్థితిమంతులందరు గుణగ్రహణ పారీణులు, కళాపోషకులు కావడంవల్ల ఈ కుమ్మరుపరిశ్రమ ఇంకా ఇంకా మూడు పువ్వులు ఆరు కాయలన్నట్టు అభివృద్ధిచెందింది. అందువల్ల చిత్రకారుడు రోజురోజు కొత్తచిత్రాలు సృష్టించినట్లే, కవి కవితలల్లినట్లే, ఈ కుమ్మరులు తమ విద్యలో కూడ అంతటి పనితనం, నేర్పరితనం ప్రదర్శించడం మొదలెట్టారు.

అందుకుతగ్గట్టు లక్నోలోని మట్టి, బొమ్మలుచెయ్యడానికి ఎంతో అనువైందిగా అమరడంతో అదృష్టం మరీ కలిసివచ్చినట్టయింది. కళాకౌశలమున్నవారికి తమ కళను తీర్చిదిద్దుకోడానికి మంచి అవకాశం కలిగింది. అందువల్ల వారుచేసేబొమ్మలు, పాత్రసామగ్రులవంటివి, అంత సొగసైనవి మరెక్కడా తయారయ్యేవికావు. వారుచేసేపాత్రలు ఎంతో పల్చగా, నాజూగ్గా, పొంకంగా, చాలా అందంగావుండేవి. అటువంటిపాత్రలు అక్కడతప్ప మరెక్కడా దొరికేవికావు. 'అమ్రోహా'లో గూడ మట్టిపాత్రలు బాగా చేస్తారు. అక్కడి మట్టిగూడ లక్నోలో మట్టిలాగానే పాత్రలు చెయ్యడానికి ఎంతో అనువైంది కనుక ఈనాడు అమ్రోహాలో ఈ పరిశ్రమ, ఈ కళ ఎంతగానో వర్ధిల్లుతూంది. అక్కడ తయారుచేసేపాత్రల్లోను, పూలకుండీల్లోను లక్నోలో తయారయ్యేవాటిలోను వాటి పనితనంలోను తేడావుందని చెబుతూ

టాటు. లక్నోలో పనివారు చేసేవాటిలో అక్కడివారి అభిరుచికితగ్గట్టు ఆడంబరం. దాలు ఎక్కువగా వుంటుందనిపిస్తుంది.

లక్నోలో చేసే మామూలువస్తువుల్లో కుండలు, చెంబులు చాలా అందంగా వుంటాయి. అంతపసందుగా హిందూదేశంలో మరెక్కడా చెయ్యరు. కుండలు. తీర్చినట్టు గుండ్రంగా వుంటాయి. బఘనియా అనే చెంబులు పూర్వకాలపు రాగి చెంబులమోస్తరుగా వుంటాయి. మట్టితోచేసే మిగతా పాత్రసామగ్రుల రకాలు కూడ ఇక్కడ తయారయ్యేవాటంత గొప్పగా మరెక్కడా వుండవు. అంత సొంక మైనవి ఎక్కడా దొరకవనే చెప్పాలి. క్రమంగా మట్టి దాకల్లోనేపెట్టుకుని తినడాలు పూర్తిగా వెనకబడిపోవడంతో, కుమ్మరులు పాత్రలుచెయ్యడం తగ్గించి, నీళ్లు తాగ డానికి పనికొచ్చే అందమైనపాత్రలు, కూజాలు ఇంకా ఝుంఝురియా అనే కూజాలు, హుక్కా గొట్టాలు, కుండలు, బానలు వగైరా తయారుచెయ్యడం మొదలెట్టారు.

ఆబ్‌ఖోరా అనేది వారు నీళ్లు తాగడానికి వాడుకునేపాత్ర. నీళ్లు తాగడానికి గాజుతో, పింగాణీతో ఎంతో అందంగా ఆకర్షణీయంగా తయారయినగ్లాసులు, ఇంకా మురాదాబాద్‌లో తయారయ్యే గ్లాసులు దొరికేవి. వాటికి ఎంతో ప్రసిద్ధి వున్నప్పటికీ, భారతదేశంలో ముఖ్యంగా వేసవికాలంలో అందరు చల్లదనాన్ని ఆశి స్తారు. చల్లటినీళ్ళు తాగాలనుకుంటారు. చల్లటినీళ్లు కావాలంటే మట్టిపాత్రలనే వాడాలి. మట్టిపాత్రలో పోసిననీరయితే ఎంతో చల్లగా వడగళ్ళవలె వుంటాయి. దాహం తీరుస్తాయి. మనిషికి నీళ్ళు తాగినందుకు తృప్తికలుగుతుంది. గొంతు ఎండ కుండా వుంటుంది. మిగతా ఏపాత్రలోపోసినా నీళ్ళకు అంతటి చల్లదనం వుండదు. అదీగాక మట్టిపాత్రలో పోసిననీటికి చల్లదనంతోబాటు చక్కని సువాసనగూడ వుంటుందేమో। ఆనీళ్లుతాగితే ఎంతో ఆత్మతృప్తిగా వుంటుంది. మట్టిలో ఒక సువాసన వుండటాన్నిగుర్తించి మట్టినుంచే ఒక రకమైన అత్తరుగూడ తయారు చెయ్యడం కనిపెట్టారు. చల్లదనం, సువాసన వుండబట్టే, లోకంలో అన్నిరకాల పాత్రసామగ్రులున్నా, మట్టిపాత్రలు చెలామణీ కాగలుగుతున్నాయి. ఆపాత్రల్ని రకరకాలనమూనాల్లో అందంగాను, నాజూగ్గాను, పల్చగాను, కాగితమంత సున్ని తంగానూ వుండేవిధంగా చెయ్యసాగారు.

వాళ్లు తయారుచేసే మట్టి 'ఆబ్‌ఖోరా' (నీళ్ళచెంబు)ల ముందు, సున్నితంగా నాజూగ్గావుండే గాజుగ్లాసులుగూడ బలాదూరవి చెప్పాల్సిందే. అంత చక్కని పని

తనంతో వుండేవి. వాటిమీద రకరకాలరంగులతో లతలు చిత్రించేవారు. నీళ్లు బాగా చల్లబడటానికి దానకనుగున కొత్త ఇసుకపోసి అట్టేపెట్టేవారు. వాటంత బాగాను పళ్ళాలు చేసేవాళ్ళు. వారుచేసే ఆ నీళ్ళచెంబుల అందం, ఆకర్షణ ఇంతా అంతా కాదు. లోహాలు కరిగించి పోతపోసి చేసే పాత్రకంటేగూడ కేవలం మట్టితోచేసే సామానులలో మనిషి అంత పనితనం చూపెడుతున్నాడంటే ఎంతో ఆనందంగా వుంటుంది.

'అబ్‌ఖోరా' సంగతి విన్నారు. దానితర్వాత. నీళ్ళు చల్లబడటానికోసం వాడే పాత్రల్లో కూజా ఒకటి. ఈ కూజా అన్నది పాతకాలపుదే. ఏనాటినుంచో ఈజిప్టు, ఈరాన్‌దేశాల్లో వాడుకలో వున్నదే. అయితే లక్నోలో తయారయ్యే మట్టికూజాల అందం, కాగితంలా పలచదనం, వాటి వైఖరుల్లో కొత్తదనం, అక్కడి కుమ్మరుల కళాకౌశలంవల్ల సమకూడినవే. వాళ్లు తమ పనితనంతో వాటిరూపాల్ని తీర్చిదిద్ద గలిగారు. అందంలో ఆకారాల్లో వాటినిమించిన కూజాలెక్కడా తయారుకాలేదు. లక్నోలో చేసే కూజాలకు మూతిదగ్గర కొంచెం వొంపు వుంటుంది. ఆమాదిరి వొంపువుండే కూజాలు ఒక్క లక్నోలోతప్ప ఇంకెక్కడా కనబడవు. ఇవికాక ఝుంఝుణియాలనే కూజాలున్నాయి. అవీ అందంగా నాజూగ్గా వుంటాయి. వాటికి కూజాలమోస్తరే పొట్ట వుంటుందిగానీ, పైన పొడుగుపాటి మెడ బదులుగా, బెజ్జం మాత్రం వుంటుంది. పనితనంలో, అందంలో అవీ మామూలు కూజాల కేమాత్రం తీసిపోవు.

హుక్కాలకు చల్లదనం చాలా అవసరం. పొగ వేడిగా రాకూడదు. చల్లగానే వుండాలి. మట్టి హుక్కా గొట్టాలుకూడ, కాగితమంత పలచగా, అందంగా, ఆకర్షణీయంగా తయారుచేసేవారు. లక్నోలో చేసేటంత చక్కని హుక్కాగొట్టాలు మరెక్కడా దొరికేవికావు మళ్లీ వాటిలోను కొత్తకొత్తరకాలు బయలుదేరాయి. చల్లనిపొగ తెప్పించేవిగాను, అందంగాను, అందంతోబాటు, సున్నితమైన సువాసన వెదజల్లేవిగాను వుండేవి. అవి రాజుల పరిపాలనలు కొనసాగుతూండేరోజుల్లో, పెద్దపెద్ద శ్రీమంతులంతా వాడేవాళ్లు. వాళ్లు ఈ మట్టిహుక్కాలుతప్ప మరొకటి వాడే వాళ్ళేకాదు. ఇందులో కలిగినంతతృప్తి మరే రకం హుక్కాగొట్టాల్లోను వాళ్ళకు కల్గేదికాదు.

అజీం ఉల్లాహ్ ఖాననే అతను ఈ హుక్కా గొట్టాన్ని ఇంకా అందంగా తయారుచేశాడు. అజీం ఉల్లాహ్‌ఖాను చేసిన హుక్కా గొట్టాలు ప్రత్యేకతగలిగి చిరస్థాయిగా నిల్చిపోయాయి. ఈనాటికి మట్టితోచేసే హుక్కా గొట్టాల్లో ఖానుచేసిన హుక్కాలే పనితనానికి మన్నికకు బహుళాదరణ పొందాయి.

లండన్‌లోని రాజకవి లార్డ్ టెన్నిసన్‌కు మట్టితోచేసిన తెల్లని పైపులంటే ఎంతటి యిష్టమంటే, అంత పెద్దకవియైన తనయినా ఒక గుంపెడు తెల్లని పైపులు పెట్టుకునేవాడట. బుద్ధిపుట్టినప్పుడు ఒక పైపుతీసుకుని అందులో పొగాకు వేసి, పొగ తాగేవాడు. మరోక్షణానికల్లా ఆ పైపు విరిచి అవతలపారేసి గంప లోంచి మరో కొత్తపైపు తీసేవాడట. మళ్లీ రెండుగుక్కలుపీల్చి దాన్ని విరగ్గొట్టి అవతల పారేసేవాడు. ఈ తీరుగా రోజంతా ఒక్కొక్క పైపే తియ్యడం, కాసేపు పొగపీల్చడం విరిచి అవతలపారెయ్యడం చేస్తూవుండేవాడని విన్నాను. ఒకసారి వాడినపైపు మళ్లీ వాడేవాడు కాడన్నమాట. ఆ లార్డు టెన్నిసన్‌కనుక లక్నోకు చెందిన అజీం ఉల్లాహ్ ఖానుచేసిన హుక్కాగొట్టాలుచూస్తే ఆ మట్టిపైపుల్ని మరిచే పోయివుండేవాడేమో. ఎందుకంటే ఆ హుక్కా గొట్టాల్లోంచివచ్చే చల్లనిపొగ, ఆ గొట్టాలఅందం, ఆకర్షణ ఆ మట్టిపైపుల్ని మరిపించేవనడంలో సందేహంలేదు.

వంటకుకుండలు, బాకలు అంతటా తయారవుతూనే వున్నాయనుకోండి. అయితే లక్నోలో తయారయ్యేవి రాగిపాత్రలకు సరియైన నకళ్లేమో అన్నంత పల్చగా తయారవుతున్నాయి. అంత చక్కనివి మరెక్కడా దొరకవు. వాటిలో ముఖ్యంగా చెప్పుకోదగ్గవి ఎర్రని ముంతలు. పాయసం చేసినప్పుడు పంచిపెట్టడానికి ఆ ముంతలను వాడుకుంటారు. ఆ ముంతలనుగూడ ఆబ్‌ఖోరాలు, కూజాలమాదిరి గానే ఎంతో పల్చగా అందంగా చేస్తారు. వాటిల్లో కొందరు నాజూకుమనుషులు తమలపాకు బీడాలు పెట్టుకుంటారు. రాగి ఖాస్‌దాన్లోపెడితే వేసవికాలంలో వేడికి బీడాలు వాడిపోతాయని, వాటిబదులు ఈ మట్టిపాత్ర వాడుతారు. మట్టిపాత్రలో అయితే చల్లదనముంటుంది కాబట్టి, అవి వాడవుసరిగదా, వాటికో మంచి సువాసన పడుతుందిగూడా. దానివల్ల వాటికో ప్రత్యేకమైన రుచి వస్తుంది.

అయితే ఈ పాత్రసామగ్రి కుండలు, ముంతలు, పిడతలు చెయ్యడంకంటె కూడ కుమ్మరులు ఆటవస్తువులు, మట్టిబొమ్మలు చెయ్యడంలోనే వాళ్ళ నేర్పరితన

మంతా చూపెట్టారు. విగ్రహాలు చెయ్యడం, విగ్రహారాధన అనేవి అనాదిగా వున్నవే. ఈజిప్టు, బాబిలోనియా, ఈరాన్, గ్రీస్, రోమ్‌దేశాల్లో ఆయా యుగధర్మాలననుస రించి తమ కళానైపుణ్యాన్ని ప్రదర్శించారు. వాటి నమూనాలు నేటికి యూరప్‌లోని గొప్పగొప్ప వస్తుప్రదర్శనశాలల్లో కనబడుతూనేవుంటాయి. ముఖ్యంగా శిల్పాలు చెక్కడంలోను, రూపులుతీర్చి దిద్దడంలోను, ఆ రూపాలకి తగినట్టు అందంగా అవ యవాల అమరికలోను, శిల్పనైపుణ్యమంతా గ్రీకులదే. వారుచేసినశిల్పాల్లో సౌందర్యం తొణికిసలాడుతూ వుంటుంది. అవి గొప్ప కళాఖండాలు. సర్వతో ముఖాభివృద్ధిగాంచిన ఈ కాలంలోగూడ, ఆనాటి వారి పనితనాన్నిచూసి మురిసిపోని వారంటూ వుండరు. నాటిశిల్పులు చెక్కినబొమ్మలే నేటి చిత్రకారులకు, శిల్పులంద రికి ఎంతో ఆదర్శప్రాయంగా నిలిచాయి. అయితే మట్టితో బొమ్మలుచేసే మన శిల్పులు చదువురానివారు, వట్టి మూర్ఖులే అయినా, కళాకౌశలంలోమాత్రం గ్రీకుల కేమాత్రం తీసిపోరుసుమా. వాళ్ళు మనిషినిచూసి, అచ్చంగా అలానే బొమ్మ చెయ్యాలీ అంటే, అంతటి వొడ్డూ పొడుగూ, అంత పోలికలతోనూ, ఏం రవంత తేడాకూడ రానీయకుండాచేసి చూపగలిగిట్టలు. మళ్లీ చిన్నచిన్నబొమ్మలు చెయ్యా లన్నా, ఆయా జాతులకు, వర్గాలకుచెందినవారి రూపాలు అచ్చుల్లోపోసి తీసినట్టు మలచగలరు. ప్రపంచాల్లో రసపట్టులనిపించుకునే మధుర కల్పనలన్నీ కళ్ళకు కట్టి నట్టు వారిచిత్రాల్లో గోచరిస్తాయి. దీపావళికి హిందువులు బొమ్మలుకొని పంచిపెడ తారు. అందుకని ప్రతియేట ఆ పండుగ వస్తుందనగానే ఇక్కడి కుమ్మరులు కొత్త కొత్త బొమ్మలన్నీ తయారుచేస్తారు. వారికల్పనలు ప్రదర్శించుకునేందుకు ఇదో మంచితరుణంగా వారికి దక్కింది.

ఈ కుమ్మరులు రకరకాల జట్లుగా, సెట్లుసెట్లుగా బొమ్మలు తయారుచేస్తారు. అవి నిజంగా చూడ ముచ్చటగా వుంటాయి. వాటిలో ఇంగ్లీషువారి బ్యాండుసెట్టు, భోగంమేళాలు, విదూషకబృందాలు, ఇంకా పూర్వకాలపు నవాబులగోష్ఠులు, రాజా వారి దర్బారు, వృత్తిపనులవారు, మొదలైనవి పేర్కొనదగిన బొమ్మలు.

ఒకసారి ఇక్కడ జరిగిన బొమ్మలప్రదర్శనంలో ఒక కుమ్మరి తను తయారు చేసిన 'భారతదేశంలోని పల్లె' అనే బొమ్మలసెట్టు పెట్టాడు. ఆ పల్లె బొమ్మల సెట్టులో ఆ వూరి జనాభా, అక్కడక్కడ దుకాణాలూ, వారి యిళ్ళూ వాకిళ్ళు, రక

దకాలకృత్తులు చేసుకునే జనం, రాకపోకలు, ఎడ్లబళ్లు, చేరువలో పంటచేలు, చేను దున్నుతున్న రైతులు, చేలకు నీరుపారేందుకు కాలువలు, మొదలయినవన్నీ ఏర్పరచాడు. అంతేకాదు, ఆ కాలువగుండా పారేనీటిలో లేచే చిన్నచిన్న కెరటాలు కూడ కనబడేటట్టు మరీ చేశాడు. మరో చిత్రం చేశాడు. బక్కచిక్కిపోయిన దుక్కిటెద్దు బొమ్మ, దానిశరీరంలో పక్క ఎముకలన్నీ స్పష్టంగా కనబడుతున్నట్టు చేశాడు. ఇదేమాదిరి మరో బొమ్మలసెట్టుకూడ పెట్టాడు. అది రాజ్యపాలన కొనసాగుతూండే రోజుల్లోని లక్నో పట్టణవైఖరి. అందులో ఆనాటి జనాభా, అప్పటి సందులు గొందులు, గట్లు మెట్లు, అన్నీ కళ్ళకు కట్టినట్టు చిత్రించాడు. ఆనాటి చేతిపనులన్నీ ఏదో అప్పటి ఉత్సాహాన్నిబట్టి రెండు మూడురోజులు అట్టే కనబడి మాయమయ్యేవి. అటువంటి కళాఖండాల్ని పదిలం చేసుకోకపోవడం శోచనీయం. లండనులో 'మేడమ్ టసాడస్ ఎగ్జిబిషన్' అని మైనపుబొమ్మల వస్తు ప్రదర్శనశాల ఒకటి వుంది. అందులో ఈ యుగంలోని మహాపురుషుల నిలువెత్తుబొమ్మలు మైనంతో శిల్పులు అద్భుతంగా తయారుచేసిపెట్టారు. ఆ బొమ్మల్లో జీవకళ ఉట్టిపడుతూ వుంటుంది. చూడటానికి వెళ్ళినవారిలో ఆ బొమ్మల్ని చూసి నిజమైన మనుష్యులేమో నన్నంతగా, భ్రమపడనివారంటూ వుండరు. అవి అంత సహజత్వంతో వుంటాయి. అదేపద్ధతిగా ఇక్కడ మట్టిబొమ్మలన్నిటిని సేకరించి భద్రపరిచేందుకు తావంటూ ఏర్పరిస్తే బావుండును. అందులో ఇక్కడి కుమ్మరులు, శిల్పులు చేసిన కళాఖండాలన్నిటిని భద్రపరచవచ్చుగదా. అప్పుడయితే ఈ కళ భవిష్యత్తులో ఇంకా అభివృద్ధి చెందడానికి అవకాశం ఏర్పడుతుంది. తర్వాతి తరంవారికి వెనుకటి కళాఖండాల్ని చూడగలభాగ్యం దక్కుతుంది. కావాలంటే చూడదలచినవారికి ప్రవేశరుసుము పెట్టవచ్చు. ఈవిధంగా చేసినట్లయితే, భారతదేశంవచ్చిన విదేశీయులు ఏ ఒక్కరూ దీన్ని చూడకుండా వెళ్ళరని, సకలజనులు ఈ అపురూపశిల్పాలు చిత్రాలుచూసి ఆనందించడానికి వీలుంటుందని నా అభిప్రాయం.

అయితే మన దౌర్భాగ్యమేమంటే, మనలో సహజంగానే చాలామందికి ఇటువంటి ఆసక్తులు, అభిరుచులు తక్కువ. అందుకని ప్రతిదానికి మనం ప్రభుత్వంవారి సహాయం కోరక తప్పదు. వారేమైనా చేస్తారేమోనని ఎదురుచూడటంతప్ప మనంగా పూనుకుని చెయ్యగలిగింది లేదు.

ఎందరో శ్రీమంతులున్నారు, గొప్పవాళ్ళున్నారు. వారంతా అనవసరమైన విలాసాలకు, వేడుకలకు వ్యయం చేసేబదులు, ఇలాంటివాటిలో ఆసక్తిచూపితే, వారి డబ్బుకు సద్వినియోగమే కాకుండా వారికి మంచిపేరు ప్రఖ్యాతులు వస్తాయి. దేశానికెంతో సేవచేసినట్టవుతుందిగదా! అయినా చెప్పడం వృథాయేనేమో!

చిత్ర వస్తుప్రదర్శనశాలల్లో కొన్ని బొమ్మలేవో సేకరించి పెట్టారుగానీ, అవి చాలా పరిమితమే. ఇతరప్రాంతాల్లో ప్రజలు కనీ వినీ ఎరుగనట్టివి, వింతవింత వస్తువులెన్నిటినో లక్నోవారు సృష్టించారు. వాటితోబాటు కాసినిబొమ్మలు పెడితే సరిపోతుందా! కాదు. ఆ కళలో వారెంతటిఘనులో చాటి చెప్పడానికి ప్రత్యేకంగా మట్టి బొమ్మలకోసం మట్టి విగ్రహాలకోసం ఒక ప్రదర్శనశాల తప్పక ఏర్పాటు చేసితీరాలి. అదే లక్నోవారి శిల్పకళానైపుణ్యానికి విజయస్తంభం కాగలదు.

# తెలుగులో వెలువడిన పుస్తకములు

## భారతదేశము - ప్రజలు

| | | వెల | |
|---|---|---|---|
| భారతదేశ ఖనిజములు | .... | 5 | 75 |
| పెంపుడు జంతువులు | .... | 4 | 50 |
| సామాన్య వృక్షములు | .... | 4 | 25 |
| నికోబార్ దీవులు | .... | 5 | 50 |
| జనాభా | .... | 8 | 75 |
| ఉద్యాన పుష్పములు | .... | 6 | 00 |
| భారతదేశ ఆర్థిక భూగోళము | .... | 5 | 25 |
| భారతదేశ భౌతిక భూగోళము | .... | 4 | 50 |
| అడవులు - అటవీశాస్త్రము | .... | 6 | 00 |
| పూలచెట్లు | .... | 5 | 50 |
| ఋతుపవనములు | .... | 3 | 25 |

## జాతీయ జీవిత గ్రంథమాల

| | | | |
|---|---|---|---|
| సముద్రగుప్తుడు | .... | 1 | 25 |
| శంకరాచార్యులు | .... | 2 | 00 |
| అహల్యాబాయి | .... | 2 | 00 |
| చంద్రగుప్త మౌర్యుడు | .... | 1 | 50 |
| సుబ్రమణ్య భారతి | .... | 2 | 25 |
| గురునానక్ | .... | 2 | 25 |
| త్యాగరాజు | .... | 1 | 75 |
| రాణీ లక్ష్మీబాయి | .... | 2 | 00 |
| కబీరు | .... | 1 | 75 |
| నానా ఫడ్నవీస్ | .... | 2 | 00 |
| రామానుజాచార్యులు | .... | 2 | 25 |
| హర్షుడు | .... | 2 | 00 |

P— 26

## ఇతర పుస్తకములు

| | | | |
|---|---|---|---|
| భారతదేశము : నేడు - రేపు | .... | 0 | 75 |
| కల్కి : లేక నాగరకత భవిష్యత్తు | .... | 0 | 75 |
| జ్వాలాముఖి | .... | 8 | 75 |
| ఏక ప్రపంచము - భారతదేశము | .... | 0 | 75 |
| జ్యోతీ లక్ష్మి | .... | 1 | 50 |
| పోతన | .... | 2 | 75 |
| విజ్ఞానం విశేషాలు | .... | 1 | 50 |
| నవభారత విద్యాపునర్నిర్మాణము | .... | 1 | 25 |
| ప్రాక్పశ్చిమ పవిత్రాంగనలు | .... | 5 | 00 |
| మహా విప్లవవీరుడు | .... | 4 | 25 |
| శాస్త్రవిజ్ఞానము మానవజీవితము | .... | 2 | 75 |

## ఆదాన్ - ప్రదాన్

| | | | |
|---|---|---|---|
| పంజాబీ కథలు | .... | 3 | 50 |
| బన్‌గర్‌వాడి | .... | 2 | 75 |
| స్మృతిరేఖలు | .... | 6 | 50 |
| కథా భారతి : తమిళ కథలు | .... | 4 | 00 |
| జీవిత సంగ్రహము - వీరేశలింగము | .... | 4 | 25 |
| తెల్లని రక్తం | .... | 4 | 75 |
| మరణానంతరం | .... | 4 | 00 |

# తయారీలోనున్న పుస్తకములు

## భారతదేశము - ప్రజలు

పక్షులు

సామాన్య భారతీయపక్షులు

భారతదేశము - ఒక పర్యావలోకనము

కూరగాయలు

మొక్కల తెగుళ్లు

ఔషధ భూజములు

పంట తెగుళ్లు - కీటకాలు

## జాతీయ జీవిత గ్రంథమాల

గురుగోవింద సింగ్

స్వామి రామతీర్థ

హరినారాయణ ఆప్టే

ఈశ్వరచంద్ర విద్యాసాగర్

సూరదాసు

## ఇతర గ్రంథములు

మీరు - మీ దేహస్థితి

అంతరిక్షయాత్ర